# మానవల్లికవి - రచనలు

సంపాదకులు
విద్యారత్న శ్రీ నిడుదవోలు వేంకటరావు
డాక్టర్ పోణంగి శ్రీరామ అప్పారావు




ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి
కళాభవన్ — సైఫాబాదు
హైదరాబాదు—4

# తొలి పలుకు

ఆధునిక యుగమున తెలుగు వాఙ్మయములో మౌలిక పరిశోధన గావించిన విద్వన్మణులు కొద్దిమంది మాత్రమే. ఈ కొద్ది మందిలో సర్వవిధాల మొట్టమొదట పేర్కొనవలసినవారు స్వర్గీయ మానవల్లి రామకృష్ణకవిగారు. ఆంధ్రభాషలో సాహిత్య విమర్శకు భిక్షపెట్టిన వారు వీరేనని చెప్పిన అతిశయోక్తికాజాలదు. స్వర్గీయ వీరేశలింగం పంతులుగారివంటివారు తమకు రామకృష్ణకవిగారి తోడ్పాటు లభించి నదని తెలిపి, ఆయనను ప్రశంసించినారు. రామకృష్ణకవిగారు సంస్కృతాంధ్రములలో ఉద్దండ పండితులు; విస్మృత గ్రంథాలను సంస్కృతాంధ్రములలో ప్రకటించిన విద్వద్వర్యులు. 1866 సంవత్సర ములో జన్మించిన రామకృష్ణకవిగారు 1957 వ సంవత్సరములో పరమపదించినారు. అనగా 91 సంవత్సరాలు జీవించిరన్నమాట. జీవితంలో కవిగారు అనేక కష్టాలు యెదుర్కొనినప్పటికిని పరిశోధనా వ్యాసంగమును నిరంతరముగా కొనసాగించి ఆంధ్రభాషను సంపన్నము గావించినారు. వారు యెదుర్కొనిన కష్టాలు వారి దీక్షకు ఆటంకము కలిగించలేదు. తుదకు గ్రాసవాసోదైన్యముకూడ వారిని వెనుకంజ వేయించలేదు. వాఙ్మయ పరిశోధనకై చేసిన తపస్సు కవిగారి జీవితము.

కవిగారు పరమపదించి ఇప్పటికి 16 సంవత్సరాలు గడిచిపోవు చున్నవి. ఈ స్వల్ప కాలములోనే కవిగారిని విస్మరించు ప్రమాదము గోచరించుచున్నది. అందుచేత మానవల్లి కవిగారి రచనలను కొన్నింటిని గ్రంథరూపములో ప్రకటించిన బాగుండునని ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడమీ నిర్ణయించినది, ఆ నిర్ణయానుసారము ఈ గ్రంథము ఆంధ్ర పాఠకులకు అందజేయబడుచున్నది. ఇందులో

కవిగారి జీవితముగూర్చి, వారు చేసిన పరిశోధనా వ్యాసంగమును గూర్చి విద్యారత్న శ్రీ నిడుదవోలు వెంకటరావుగారు అధికార పూర్వకమైన విపుల పీఠికను వ్రాసినారు. తామెరిగిన కవిగారినిగూర్చి డాక్టర్ పి. యస్. ఆర్. అప్పారావుగారు పరిచయము గావించినారు. ఈ యిద్దరు పండితులు సంపాదకులుగా యీ గ్రంథము ప్రకటితమైనది. సాహిత్య అకాడమీ పక్షాన యీ ఉభయులకు అనేక ధన్యవాదాలు.

కవిగారిని గూర్చి సమకాలికులైన పండితులు, పత్రికలు వెల్లడి చేసిన కొన్ని అభిప్రాయాలు యీ గ్రంథములో ప్రశంసల శీర్షిక క్రింద ప్రకటించనైనది. ఈ అభిప్రాయాలు కవిగారి సారస్వతమూర్తిని మనకు ప్రత్యక్షము చేయుచున్నవి. ఈ గ్రంథమును ప్రచురించుటలో మాకు తోడ్పడిన పండితులందరికి అకాడమీ పక్షాన కృతజ్ఞతలు.

హైదరాబాదు.
1–8–1972

దేవులపల్లి రామానుజరావు.
కార్యదర్శి.

# విషయ సూచిక

## శ్రీ మానవల్లి రామకృష్ణకవి


1. జననము-వంశము 1
2. విద్యాభ్యాసము-ధారణాశక్తి 2
3. శాసనములు-చరిత్ర 3
4. ఎమ్. ఏ. (శాస్త్రోపాధ్యాయ) పట్టము 4
5. తాళపత్ర గ్రంథగవేషణ 5
6. ఉద్యోగజీవితము 6
7. విస్మృతకవులు 7
8. ప్రథమ ముద్రణలు-పరిశ్రమ 12
9. నాటకశాఖ 15
10. ఉదాహరణశాఖ 16
11. ప్రబంధశాఖ 17
12. శాస్త్రీయగ్రంథశాఖ 20
13. వేదాంతవాఙ్మయశాఖ, క్షేత్రమాహాత్మ్యశాఖ 21
14. అనువాదశాఖ, పురాణశాఖ 22
15. సంకలనగ్రంథశాఖ 24
16. వీరేశలింగముగారు-కవిగారు 25
17. ఆంధ్రభాషలో రాజకవులు 26
18. తెనాలి కవులు 27
19. పుష్పాంజలి 28
20. దండకశాఖ 29
21. శతకశాఖ 30
22. కవుల చరిత్రలు 30
23. ఆంధ్రభాషనుగూర్చిన యుపన్యాసము 38
24. ఉద్యోగజీవితము 33
25. మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తకభాండార స్థాపన 35
26. కేరళదేశము-సంస్కృతగ్రంథశోధన 37
27. తంజాపూరి గ్రంథాలయము 38

28. ఉద్యోగము-క్లిష్టపరిస్థితి 39
29. రాజమహేంద్రవర నివాసము 41
30. మెకంజీ సంపుటముల ఆంగ్లభాషాంతరీకరణ 42
31. తిరుపతి దేవస్థానము; చరమదశ 43
32. కవి బిరుదము 45
33. కావ్యరచన, మృగావతి 47
34. వసంతవిలాసము 51
35. వత్సరాజ చరితము 53
36. భాస నాటకములు 58
37. కళింగసేన 67
38. భరతకోశము 72
39. అపూర్వ విస్మృత సంస్కృతనాటకములు 73
40. కావ్యములు 74
41. వ్యాసరచన-సంస్కృతము 75
42. వ్యాసములు, సమీక్షలు-ఆంగ్లము 76
43. తెలుగువ్యాసములు 77
44. పరిశోధన-పాండిత్యము 79
45. నేనెరిగిన మానవల్లికవిగారు 82
46. ప్రశంసలు 88

## మానవల్లికవి రచనలు

### I. ప్రథమభాగము : పీఠికలు

1. కుమారసంభవము - ప్రథమభాగము ... 1
,, ప్రథమభాగము-అనుబంధము 12
2. కుమారసంభవము - ద్వితీయభాగము ... 26
,, ద్వితీయభాగము-ప్రాచీన శబ్దానుశాసనక్రమము 40
,, రితీయభాగము-౽ 44
ముఖ్యపాఠభేదములు 62
వివరణము 65
3. క్రీడాభిరామము 66
4. నీతిశాస్త్రముక్తావళి 77

5. ప్రబంధమణిభూషణము ... 85
6. త్రిపురాంతకోదాహరణము ... 95
7. సకలనీతిసమ్మతము ... 102
8. ఆంధ్రనాటకములు-రంగస్థలములు ... 113
9. శ్రీరంగమహత్త్వము ... 117
10. కావ్యాదర్శము ... 126
11. ఆంధ్ర సూర్యశతకము ... 134


## II. ద్వితీయభాగము : పుష్పాంజలి


1. ప్రౌఢకవులు-పెద్దన్న . 143
2. రామకృష్ణార్జునరూపనారాయణీయము . 149
3. కవుల చరిత్రాంశములు . 152
4. తుక్కా-పంచకము . 157
5. సురేశ్వరాచార్యు లెవ్వరు? . 162
6. కొన్ని యాంధ్రగ్రంథములు . 169
7. ఎలకూచి వేంకటకృష్ణరాయకవి . 180
8. శ్రీకృష్ణలీలాశుకకవి . 185
9. ఉపవేదములు-గ్రంథసూచిక . 196
10. ప్రకీర్ణవిషయములు - 1 . 222
11. ప్రకీర్ణవిషయములు - 2 . 230
12. కాళకళభకవి . 239
13. ఉదయనోదయము . 250
14. లీలావతికథ . 258
15. కవికంఠపాశము . 273


## III. తృతీయభాగము : వ్యాసములు


1. ఆంధ్రరాజకవులు 291
2. తెనాలికవులు 306
3. సంస్కృతభాషలోని కొన్ని విస్మృతనాటకములు 316
4. వసుచరిత్రకు ద్రవిడభాషలో ననువాదము 344
5. ఐరావతచరిత్రము 350
6. నరసభూపాలీయములు 353
7. కొన్ని కాకతీయ శాసనములు 370

8. గ్రంథచౌర్యము 382
9. సంగీతరత్నాకర వ్యాఖ్యలు 411
10. మధురవాణి 428
11. ఆంధ్రభాషనుగూర్చిన యుపన్యాసము 452

## IV. చతుర్థభాగము కవితలు

1. మృగావతి (కావ్యము, ప్రథమాశ్వాసము) . 493
2. కళింగసేన (ప్రకరణము, ప్రథమాంకము) . 519
3. కర్ణభారము (భాసనాటకానువాదము) . 538
4. వసంతవిలాసము (అముద్రితకావ్యము, కృత్యాది) 549
5. చంపకమాలిక . 553



కి. శే. శ్రీ మానవల్లి రామకృష్ణకవి, ఎమ్. ఏ.

# శ్రీ మానవల్లి రామకృష్ణకవి

## జననము – వంశము

రామకృష్ణకవిగారు క్రీ. శ. 1866 లో మదరాసు నుంగంబాకంలో జన్మించినారు. వారు వైదిక బ్రాహ్మణులు. తండ్రి తాతలు గొప్ప విద్వాంసులు-తాత వెంకటకుప్పాశాస్త్రి, ఈయన సోమపీథియైనాడు-ఈయన కుమారుడు, కవిగారితండ్రి, రామశాస్త్రి; ఇతడు అష్టాదశభాషలలో-అనగా పదునెనిమిది భాషలలో ప్రవీణుడు. అనేకవిద్యలలో సమర్థుడు. ఈ విషయములు వారి భరతకోశమునుండి తెలియుచున్నవి-

"ఆసీద్వేంకటకుప్పాఖ్యః ప్రవచస్సోమపీథినామ్
తత్పుత్రో రామశాస్త్రీతి విశ్రుతశ్శంసితవ్రతః
అష్టాదశసుభాషాసు విద్యాస్వపికృతశ్రమః
వ్యాఖ్యాతా నాట్యశాస్త్రస్య రసికోజనరంజనః
తత్పుత్రో రామకృష్ణాఖ్య..."

పై పంక్తులను బట్టి-కవిగారి తండ్రి భరతనాట్యశాస్త్ర వ్యాఖ్యాతయని తెలియుచున్నది.

దీనిని బట్టి కవిగారికి—భరతనాట్యశాస్త్ర వ్యాఖ్యా సంప్రదాయము తండ్రి నాటి నుండి వచ్చినదని తెలియుచున్నది.

వారి 'మృగావతి' యను పద్యకావ్యమునుండి క్రింది విషయములు తెలియుచున్నవి-

గీ॥ "చెన్నపురి చూళ[1] నివసించుచున్నవాఁడ
వైదిక బ్రాహ్మణుఁడ మానవల్లికులుఁడ
రామదైవజ్ఞపుత్రుఁడ రాజనుతుఁడు
త్యాగరాజ పండితుని ప్రియానుజుండ."

కవిగారి తండ్రి దైవజ్ఞుడు అనగ జ్యోతిశ్శాస్త్రవేత్త. కవిగారికి త్యాగరాజ పండితుడు-అను అన్నయుండెడివాడు.

---

1. 'చూళ' అనునది మద్రాసులో నేడు- "వేపేరి" అను పేరితోనున్నభాగము.

కవిగారికి అన్నగారియం దమితభక్తి-తల్లిదండ్రులకన్న, ధర్మపత్ని కన్న నెక్కుడు ప్రేమతో కవిగారిని అతడు చూచెడువాడు-బహుశః అన్నగారు చిన్నతనము నుండియు కవిగారి ప్రతిభావిశేషమును గుర్తించి, ఆతనిని మిక్కిలి ఆప్యాయతతో పెంచి యుండవచ్చును. అందులకే తన తొలికృతియగు 'మృగావతి'ని ఆయన కంకితమిచ్చి, యిట్లు వ్రాసియున్నారు-

క. ''విమలాచారపవిత్రున
కమృతమయస్వాంతునకు సదాగమవిద్యా
ప్రమచున కుర్వీపాలో
త్తమనుతునకు త్యాగరాజదైవజ్ఞునకున్.''

గీ. ''తల్లిదండ్రుల కన్నను ధర్మపత్ని
కన్న నెక్కుడు ప్రేమతో నన్నుననుఁ
జూచుకతమునఁ గీర్తిశేషునకు దీని
నంకిత మొనర్తుఁగన్నీళు లట్టెజాఱ.''

పై పద్యములను బట్టి త్యాగరాజు పండితుడు ఆగమవేత్తయనియు, జ్యౌతిషికు డనియు, రాజపూజితుడనియు తెలియుచున్నది[1].

ఇన్నిచెప్పినను కవిగారు తమ గోత్రముగాని, అధవా, తమ తల్లి పేరు కూడ చెప్పకపోవుట యాశ్చర్యకరముగా నున్నది.

## విద్యాభ్యాసము-ధారణాశక్తి

కవిగారి విద్యాభ్యాసమంతయు, పచ్చయప్ప పాఠశాలలోను, పచ్చయప్ప కళాశాలలోను జరిగినది- ప్రథమ శాస్త్రపరీక్షలోవారు చరిత్ర ప్రధానముగా చదివినను పట్ట పరీక్షలో సంస్కృతము ప్రధానముగా గైకొన్నారు.

---

1. మానవల్లిత్యాగరాజయ్యగారి రచనలలో ఒక్కటి మాత్రమే మనకు లభ్యమైనది-తెలుగున ''కాశీ యాత్రా చరిత్ర'' అను వచనగంథము రచించినారు. ముద్రణ 1886. చూ నా ఆంధ్ర వచన వాఙ్మయము. పుట 133-ఇది ఏనుగుల వీరాస్వామయ్యగారి ''కాశీ యాత్రా చరిత్ర'' కన్న భిన్నమని తెలియవలెను. కాశీక్షేత్రమున-శ్రుతిస్మృతులననుసరించి కర్మకాండ మెట్లు జరుపవలెనో, ఎట్లు క్షేత్ర దైవముల సేవింపవలెనో తెలుపు గ్రంథమిది.

సంస్కృతము వారికి వంశానుగతమైన భాష. కాబట్టి వారు సంస్కృతము ప్రధానముగ పట్టము పొందిరి-ఇక తెలుగును వారు బాల్యమునుండియు నభ్యసించిరి-అన్నగారైన త్యాగయ్యగారికి ఆంధ్రభాషలో పాండిత్యము కలదు[1]- తెలుగు భాషలో సహజమగు కవితాశక్తి వారికి చిన్ననాటనే యలవడినది-కాని తక్కిన వారివలె, వారు 'బాలకవులు' కాలేదు. కవితారచనకు పాండిత్యమత్యవసరమని గ్రహించి, కవితాధారతో నుభయభాషా పాండిత్యము సంపాదించుకొన్నారు. వారంతటితో నాగలేదు; తెలుగు కవిత్వ రచనకు పూర్వ కవి సంప్రదాయమే ఆదర్శమని ప్రాచీనాంధ్రకావ్యములు కూలంకషముగా పఠించినారు.

మదరాసు వాస్తవ్యులందఱికి తమిళభాష వ్యవహారరీత్యా అలవడక తప్పదు. కవిగారు తమిళవ్యవహారభాషనే కాక, అందలి ప్రాచీన కావ్యములు చదివి దానియందు మంచి ప్రవేశము గడించినారు.

తెనుగు కన్నడ భాషలకు పరస్పరముగా నధిక సంబంధమున్నదని గుర్తించి, కన్నడ భాషలో రత్నత్రయ కృతగ్రంథములు-పంపభారతము, రన్నని గదా యుద్ధము, పొన్నని శాంతి పురాణము-తలస్పర్శిగా చదివినారు.

ఇరువదేండ్లు వచ్చుసరికి కవిగారు సంస్కృతము, తెలుగు, ఆంగ్లము, తమిళము, కన్నడము-ఈ భాషలలో ప్రావీణ్యము గడించిరి.

## ధారణాశక్తి

కవిగారి ధారణాశక్తి అసాధారణమైనది, అద్భుతమైనదీ అని చెప్పవచ్చును. ఏ భాషలో కానిండువారు చదివిన ప్రతి గ్రంథమునుండి వారు ఉదాహరింపగల సమర్థులు-ఇట్టి ధారణాశక్తి యున్నగాని ప్రాచీనగ్రంథ పరిష్కరణ దుస్సాధ్యము.

## శాసనములు-చరిత్ర

కవిగారికి బాల్యమునుండియు భాషాపరిశ్రమ చేయుటతోపాటు-పరిశోధనయందు చాల ఆసక్తియుండెడిది-ఆ కాలమున చరిత్ర, శాసనములు-అన్నియు ఆంగ్లభాషలోనే యుండెడివి: కాబట్టి ఆంగ్లభాషరాని పండితుల కవి అందరానివిగా నుండెను-తెలుగుకవుల కావ్యావతారికలలో చారిత్రక విషయములున్నవని కవిగారు గ్రహించి, అప్పటికి ప్రత్యేక

---

1. త్యాగయ్యగారు కాశీయాత్రాచరిత్ర అను వచనకావ్యము రచించినట్లివరకే తెలిపియున్నాను.

చరిత్రలు లేనందున చరిత్రకు మూలభూతములైన శాసనములు చదువుటయందు సిద్ధహస్తులైనారు-వారు పట్టభద్రులై, బహుభాషాపాండిత్యమునకు తోడు-ప్రాచీన శాసన పఠనమున ప్రవీణులగుటచే బంగారమునకు పరిమళమబ్బినట్లుండెను.

## ఎమ్. ఏ. (శాస్త్రోపాధ్యాయ) పట్టము

కవిగారు పట్టభద్రులైన చాల కాలము తరువాత వారు ఎమ్.ఏ. (శాస్త్రోపాధ్యాయ) పట్టము బడసిరి-ఆ కాలమున దేశభాషలలో ఎమ్.ఏ. పట్టపరీక్ష తరగతులు మదరాసు విశ్వవిద్యాలయమున రాజధాని కళాశాలలో గూడ లేదు.[1] దేశభాషలగు తమిళ, తెలుగు, కన్నడ, మళయాళ భాషలలో ఎమ్. ఏ, పట్టమును బడయవలెనన్న-అతడు వ్యక్తిగతముగా నా పరీక్షకు వెళ్లవలయును గాని కళాశాలాద్వారమున-బి. ఏ. అయిన తరువాత దానిని వెనువెంటనే పొందుటకు నవకాశములేదు. అందువలన తెలుగులోగాని, సంస్కృతములోగాని ఎమ్. ఏ. పరీక్ష కాకాలమున ప్రత్యేక నిర్దిష్ట ప్రణాళిక లేదు. సంస్కృత భాష పట్టపరీక్షలో ప్రధానముగా దీసికొనిన విద్యార్థి ఎమ్. ఏ. పట్టము బడయవలెనన్న-అతడు తిరిగి పట్టపరీక్షలో బి. ఏ. తెలుగు ప్రధానముగా పరీక్షకు వెళ్లవలెను. ఆ పరీక్షలో తెలుగులో ప్రత్యేకముగా వ్యాసరచనలో-రెండు ప్రౌఢ ప్రబంధములలో-ప్రత్యేకముగా సంస్కృత భాషా విద్యార్థులు పఠనీయగ్రంథములతోపాటు ప్రశ్న పత్రము వ్రాసి జయమును బొందవలెను. అట్లే తెలుగు ప్రధానముగా గల విద్యార్థులు సంస్కృత భాషలో పట్టపరీక్షకు (బి. ఏ) తిరిగి వెళ్లి-ప్రత్యేకముగా-సంస్కృత భాషలో వ్యాస రచన-రెండు కావ్యములు గల ప్రశ్న పత్రము వ్రాసి జయమును పొందవలెను-అప్పుడు వారికి ఎమ్. ఏ. పట్టము నిచ్చెడివారు-అందుచే వారు కళాశాల తరగతులకు తెలుగు, సంస్కృతము-రెండును బోధించు సామర్థ్యము గలవారై యుండిరి.

ఈ రీతిగానైన ఎమ్. ఏ. పట్టము సంపాదింపవచ్చును లేదా-సంస్కృత భాషా ప్రసక్తి లేక-దేశ భాషలలో నే రెండింటితోనైన-బి. ఏ. పరీక్షకు రెండుమారులు వెళ్లిన-

1. మదరాసు రాజధానీ కళాశాలలో సంస్కృతమున- "ఆనర్సు" తరగతులు క్రీ. శ. 1913 లో ప్రారంభమైనవి-సంస్కృతభాషలో ఆ విశ్వవిద్యాలయమున ఆనర్సు పట్టము బొందిన వారిలో ఇద్దఱు తెలుగువారు గలరు. ఒకరు- శ్రీ యస్. టి. జి. వరదాచార్యులుగారు-రెండవవారు-ఆచార్య కురుగంటి సీతారామయ్యగారు-మొదటివారు శ్రీజీవులు; రెండవవారు కీర్తిశేషులు-తెలుగు భాషలో ఎమ్. ఏ తరగతులు స్వాతంత్ర్యానంతరము క్రీ. శ. 1949 లో ప్రారంభమైనవి.

ఎమ్. ఏ. పట్టము బొందెడివారు-అనగా, తెలుగు తమిళము, తెలుగు కన్నడము, తమిళము మళయాళము-ఇట్లు భాషలలో ఎమ్. ఏ. పట్టము బడిసెడి అవకాశము ఉండెడిది.

కాబట్టియే యిట్టివారిని-Two Languages M.A. (ద్విభాషా శాస్త్రోపాధ్యాయులు) అనెడివారు.

కవిగారు పైవిధముగా-సంస్కృతము, తెలుగును దీసికొని ఎమ్. ఏ. పట్టము బడసిరి.

ఈ విషయమింత వివరముగా వ్రాయుటకు హేతువున్నది. ఆనాడు ఎమ్. ఏ. పరీక్షలో తెలుగుకు-ఆంధ్రవాఙ్మయచరిత్ర పరీక్షాప్రణాళికలో లేదు-అందువలన ఆకాలమున-ఎమ్. ఏ. పట్టభద్రులకు సంస్కృతము-తెలుగు-రెండుభాషల సాహిత్యముల యందును మంచి ప్రవేశము ఉండెడిది. ప్రాచీన కావ్య సాహిత్య ప్రవచనమునకు వ్యాప్తికి వారత్యంతము తోడ్పడి, దానిని సజీవముగా నిలిపిరి-కవిగారట్టి వారిలో ప్రథములు.

## తాళపత్ర గ్రంథగవేషణ

ఇంతటి విద్యావ్యాసంగముతోపాటు కవిగారికి బాల్యమునుండియు తాళపత్ర గ్రంథములన్న అపరిమితాసక్తియుండెడిది-అదియును, వంశానుగతమేమో? తండ్రి-తాతలు పేరు మోసిన పండితులు గదా. ఆ కాలమున తాళపత్ర ప్రతులు పండితులు, కవులవద్దనే యుండెడివి. కనుక కవిగారికి వీనియందభినివేశము పైతృకమనియే చెప్పవచ్చును[1]-కాని అవి సంస్కృత గ్రంథములు!

కవిగారు ప్రాచీనాంధ్ర సాహిత్యమున నిష్ణాతులగుట చేత, తమ కాలమున ముద్రితములై వ్యాప్తిలోనున్న భారతాది పురాణేతిహాసములను, మనుచరిత్రాది ప్రబంధములను తఱచిచూచినారు. కాని యవి యన్నియు కవిచరిత్రల మూలమున అందఱికీ పరిచితమైనవే-ఇక వాని తాళపత్ర ప్రతులను గూర్చి పరిశోధించిన లాభమేమున్నది? ఇంతవఱకు తెలుగు సాహిత్య ప్రపంచమున నెవ్వరికి తెలియని కొన్ని క్రొత్త కావ్యములను

1. నా జనకులు-ప్రథమముగా క్రీ. శ. 1994 లో తెలుగు దేశమున తాళపత్ర గ్రంథ సంపాదన చేసినవారు. వారు 1500 తాళపత్ర గ్రంథములు సంపాదించిరి. కాబట్టి నాకు వానితో పరిచయము-ముద్రిత గ్రంథములకన్న ముందుగానే యేర్పడి వాని పరిష్కరణమున సిద్ధహస్తుడనైతిని-ఈ విషయము తరువాత తెలిపెదను.

గవేషణచేసి, బయటపెట్టిన-అప్పుడు తన యభినివేశమునకు సారస్వత పిపాసకు, తగిన ప్రతి ఫలమబ్బును-ఈ పవిత్ర భావముతోవారు తెలుగు తాళపత్ర గ్రంథాన్వేషణకై తమ జీవితము నర్పింపదలచి పని ప్రారంభించినారు. అప్పటికి కవిగారి నివాస స్థానమైన చెన్నపురిలో తెలుగు తాళపత్రప్రతులు లేకపోలేదు-కాని అవి అర్షశాఖవారి(Archaeological Department)అధీనములోనుండెడివి. అవి కవిగారి కందుబాటులోనుండెడివికావు. తెలుగు దేశముననివి దొరకగలవని ఆశయుండెడిది-చెన్నపురిలోనున్న కవిగారికి తంజావూరి పుస్తకశాలలో అమూల్యమగు తెలుగు తాళపత్ర ప్రతులు గలవన్న సంగతి తెలియక పోలేదు. అచ్చట నిదివఱకు తెలుగువారెవ్వరును కనివిని యెఱుగని యపూర్వ గ్రంథ సంచయము గలదని మొదట తెలిపినవారు కవిగారే-వారే వానిని తొలుత సంపాదించిరి[1]-దానితో అచ్చట లభ్యము కాని యితర కృతులను సంపాదించిరి. కాని అవి లోకమునకు వెల్లడించుట యెట్లు? ఆ తాళపత్ర ప్రతులకు కాగితపు ప్రతులు వ్రాయించవలెను-అవి పరిష్కరించి ముద్రించవలెను-ఇది యంతయు ధనైకసాధ్యము అప్పటికి కవిగారు సర్వ విధముల పరిశ్రమకు యోగ్యత గలవారై యుండియు వారి యభిరుచులకు తగిన యుద్యోగము లభింపకుండెను-కాని కొలది కాలమునకే- అదృష్టవశమున వారి కట్టి ఉద్యోగము లభించినది.

## ఉద్యోగ జీవితము

ఆ కాలమున నిజాంరాజ్యపాలనలో హైదరాబాదు రాష్ట్రమున-గద్వాల, ఆత్మకూరు, వనపర్తి, అమరచింత, బిక్కబోలు, పాల్వంచ-మొదలగు సంస్థానములుండెడివి. వానిలో వనపర్తి సంస్థానమున-ఆ సంస్థానాధీశ్వరులగు శ్రీ రాజా సవై రామేశ్వరరావు బహద్దరుగారికి కవిగారు. క్రీ. శ. 1904 లో అంతరంగిక కార్యదర్శి (Private Secretary) గా నియమితులైరి. దానితో వారికి తామత్యంత మభిలషించుచున్న-అపూర్వ కావ్యప్రకటనమునకు అవకాశము కలిగినది.

ఉద్యోగముతో నియతముగా రాబడికూడ యేర్పడినది. కవిగారు వనపర్తిలో నున్నను, అప్పుడప్పుడు మద్రాసునకువచ్చి, తమ కార్యములను నిర్వహించుకొను సౌకరము లేర్పడినవి. వనపర్తిలోనే తత్సంస్థానాధీశ్వరులు-బ్రహ్మ విద్యావిలాస ముద్రాక్షరశాలయను నొక ముద్రాక్షరశాల స్థాపించినారు-వారును భాషా పోషకులు, రసజ్ఞులు కావున కవిగారికి ప్రాచీన కావ్యముల నొసగినారు. ఇట్టి యవకాశములనన్నింటిని పురస్కరించుకొని

---

1. వారు తంజావూరి పుస్తకశాలనుండి గ్రంథము లెంత కష్టపడి సంపాదించినది యీ తరువాత-''విస్మృతకవులు'' అన్న శీర్షికలో చూడవచ్చును.

కవిగారు ఆంధ్ర సాహిత్యజగత్తులో తమకు శాశ్వత కీర్తిని గడించిన- "విస్మృత కవులు" అను పేర-అపూర్వాప్యముద్రిత ప్రాచీనాంధ్రకావ్యములను తొలిసారిగా ప్రకాశింపజేసినారు.

ఆ చరిత్ర నికముందు చదువుదము.

## విస్మృత కవులు

అద్యతనయుగమున నాంధ్రవాఙ్మయ చరిత్రమునకు నూతన వికాసము, చైతన్యము గలిగించినవారు రామకృష్ణ కవిగారే. ఆనాడా వాఙ్మయతపస్వి-విస్మృత కవులు-అను పేర సాహిత్యపు ప్రపంచమునకుముందు కని, విని యెఱుగని కావ్యములను ప్రకటింపకుండిన యెడల నేటి మన సారస్వత చరిత్ర యిట్టి పరిణతస్థితికి వచ్చినది-ఆయన జన్మించియుండక పోయిన యెడల ఆంధ్ర సాహిత్యచరిత్ర అంధకార బంధురమైయుండెడిదనుటలో అతిశయోక్తిలేదు.

మన సాహిత్య సంపదయంతయు తాళపత్ర గ్రంథములలోనే నిక్షిప్తమైయున్నదని, ప్రప్రథమముగా తాళపత్ర గ్రంథ పరిశోధన జరిపినగాని మన కవులు, కావ్యములు-వీని సంగతి విశదము కాదని, వానియందెన్నో అమూల్య ప్రబంధములు అణగియున్నవని, లోకమునకు చాటినవారు కవిగారే. వారట్లు కేవలము చాటుటయేగాదు-తెలుగు భాషకుగాని, తెలుగు గ్రంథములకుగాని ఆదరణలేని యాకాలములో వారు పెక్కు కష్టములకులోనై-ఆ అపూర్వగ్రంథములను ముద్రించి, విద్వత్ప్రపంచమునకు వెల్లడించినారు.

వారి కా పూర్వ కవులయందుండెడి భావమెంత యుదాత్త గంభీరమైనదో, భైరవ కవి శ్రీ రంగమాహాత్మ్యము పీఠికలో వారు వ్రాసిన యీ క్రింది వాక్యములను బట్టి గ్రహింపవచ్చును-

> "వాగ్బ్రహ్మకోశము నిర్మర్యాదము; ప్రతిక్షణనవనవోన్మేషిణి;
> కాలము విస్మృతి నిదానము; సామాన్యలోకము జీవయాత్రైక
> పరాయణము. అయ్యోయిక మృతిఁజెందుచున్న పురాణ
> కవిబ్రహ్మలగతి యెట్లు ? అని యనుతాపమాత్రంబున సముద్ర జల
> మునకేతము గట్టినట్లే కావ్యోద్ధరణ క్రియకుంబూనితిఁగాని వైదుష్య
> దర్పంబునఁగాదు-" (పుట vii)

పై యుదాహృత భాగమును బట్టి ప్రాచీన కృతులట్లే యజ్ఞాతముననుండుటవలన, కవిగారి మనస్సెంతక్షోభించినదో మనము గ్రహింపవచ్చును.

ఆ కాలమున తాళపత్ర సేకరణమన్న బహు దుర్ఘటమైన కార్యము[1]. కవిగారు గ్రంథసేకరణ ప్రారంభించునాటికి మదరాసునందలి ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగార మింకను రూపొందలేదు. అప్పటి వారికి తంజావూరి యందలి సరస్వతీమహలు గ్రంథాలయమే ఏకైక శరణ్యము- "తాళపత్రి గ్రంథములన్న తంజావూరు పోవలసినదే" అని యానాటి వాడుక. ఆ నాడు తంజావూరి గ్రంథాలయము నేడున్నట్లుగాలేదు- ఆ గ్రంథాలయము తంజావూరి నేలిన మహారాష్ట్రరాజులు సేకరించినది. ఈనాడును నది తంజావూరిలో వారి కోటలో నున్నది. అది రాజాస్థానముగావున నితరులకు దానిలో ప్రవేశమే దుర్ఘటము. అయినే-వాఙ్మయ పరిశ్రమ చేయదలచినవారు, ప్రాచీన కావ్యములు ముద్రితము చేయదలచినవారు, వారికి వ్రాసిన-అక్కడివారిచేత పేరులు మాత్రము వ్రాయించి స్వల్ప వివరములతో పంపెడివారు. ఇక మనకు గ్రంథమే కావలసినచో, తంజావూరు వెళ్ళి గ్రంథము వ్రాసికొని రావలసినదే-వేఱు మార్గము లేదు[2].

క్రి. శ. 1900-1901 ప్రాంతములలో 'సరస్వతి' పత్రికలో ప్రకటించుటకు పూర్వ కవి కృతులకై తంజావూరునకు కీ. శే. క్రొత్తపల్లి సూర్యారావుగారిని తత్పత్రికాధిపతులైన కొచ్చెర్లకోట రామచంద్రవేంకట కృష్ణారావుగారు (పోలవరము జమీం

---

1. కవిగారి కిరువదేండ్లు ముందుగానే అనగా క్రీ. శ. 1880 ప్రాంతమున మా తండ్రిగారైన నిడుదవోలు సుందరము పంతులుగారు-మొదట తెలుగు దేశమున తాళపత్ర గ్రంథ సేకరణ ప్రారంభించినారు-ఆనంద ముద్రాక్షరశాలవారు భాస్కర రామాయణము మున్నగు గ్రంథములను సర్వాంగసుందరముగా ముద్రించినపుడు తాళపత్ర ప్రతులు పంపినవారు మా జనకులే. ఆ కాలమున 'మంజువాణి' పత్రికలో కొటికెలపూడి వెంకటకృష్ణ కవి రచిత దిలీపచరిత్రము ప్రకటింపజేసినది ఆయనయే-క్రీ. శ. 1917 లో కవిగారు, ప్రభాకరశాస్త్రిగారు తాళపత్ర సేకరణకై వచ్చినపుడు-కవిగారే మా తండ్రిగారిని-తాళపత్ర గ్రంథ విషయమున తమ కన్న పూర్వులని ప్రశంసించిరి. నేడు మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారమున మా యింటనుండెడి-500 తాళపత్ర గ్రంథములున్నవి- తెనుగుదేశమున నే ప్రత్యేక వ్యక్తి వద్ది నుండి యన్ని గ్రంథములు మదరాసు ప్రభుత్వమువారు సేకరింపలేదు.

2. మొదట వీరేశలింగము పంతులుగారు నాచన సోముని ఉత్తర హరివంశము, కేతన దశకుమారచరిత్రము-తంజావూరి నుండి వ్రాయించి ముద్రించిరి-(క్రీ. శ. 1901) వీరేశలింగముగారి వద్ద ఆనాడు. 79 కావ్యముల పేర్లు మాత్రమేగల పట్టిక యుండెడిది. (చూ. వంగూరు సుబ్బారావుగారి శతకకవుల చరిత్ర)

దారు) పంపినారు. ఆ కాలమున తంజాపూరి గ్రంథాలయమున వ్రాసికొనుటకు నెంత కష్టముగా నుండెడివో సూర్యారావుగారే ఒకమారిట్లు తెలిపినారు.1

"గ్రంథములు వ్రాసికొనుటకు కోటకువెళ్లెడు వారందఱు కరవథాష వచ్చి తీగవలసినచే-కోటకు వెళ్లి గ్రంథము తెమ్మన్న తరువాత అప్పటినుండే తమిళోద్యోగి యాజ్ఞపై సేవకుడు లోపలనుండి గ్రంథము పట్టుకొని వచ్చియిచ్చెడువాడు. అది ఒక్కొక్కప్పుడు మేము కోరెడి గ్రంథమైయుండక, మఱి యొకటి యయ్యెడిది-దానితో మాకు పట్టరాని సంతాపము గలిగేది-ఆ గ్రంథము మా కిచ్చియా సేవకుడు వెళ్లిపోయెడివాడు-తిరిగి వ్రాసికొనిన తరువాతనే తీసికొనెడివాడు-ఆ గ్రంథ మచ్చట పైకి తీసికొని వెళ్ల కుండా, ఉంచినారా లేదా యని మాత్రమే వాడు చూచెడివాడు

"ఇట్లుండగా మే మొకసారి శ్రీనాథుని హరవిలాసము తాళపత్రప్రతి తెమ్మన్నాము-కానివాడు-మంచెన కేయూరబాహుచరిత్ర తెచ్చినాడు-అట్టి కావ్యమున్నదనియే తప్ప దానిని గూర్చి మాకేమీ తెలియదు. అది దొరకినప్పుడెంతో మనస్సులో ఆనందము పొందినను దానినణచుకొని ఈ పుస్తకము మేము కోరినదై నట్లుగాలేదు-ఆయినా చూచెదము-నీవుపోయి హరవిలాసమును పట్టుకొనిరమ్మని అన్ని చెప్పినాము. వాడు పట్టుకొని వచ్చినాడు వాడు రెండు పుస్తకములు మేము వెళ్లినప్పుడు చూచినాడు. తరువాత మేము కేయూరబహుచరిత్రమును గొడుగులో పెట్టి (ఆ కాలమున నెక్కడకు వెళ్లిన గొడుగు పట్టుకొని వెళ్లెడి వారము) యింటికి పట్టుకొని వచ్చి, రాత్రి యింటివద్ద వ్రాసుకొని, తిరిగి గొడుగులో పట్టుకొని వెళ్లి కోటలో వ్రాతస్థలము దగ్గఱ యుంచెడువారము-ఎప్పుడో సేవకుడు వచ్చి రెండు ఉన్నవాలేవా అని చూచెడివాడు; అంతే-ఈ విధముగా నేను. కేయూరబహుచరిత్రము కూడా హరవిలాసముతోపాటు వ్రాసి తెచ్చి ప్రకటింపజేసినాను."

కవిగారు-చెన్నపురి వాస్తవ్యులే కాబట్టి వారికి తంజావూరి పుస్తక భాండాగారములోనున్న అమూల్యగ్రంథముల సంగతి కరతలామలకము-వారు తమిళభాషలో కూడ ప్రవీణులని తెలిపితిని. కాబట్టి తంజావూరి గ్రంథాలయములో ప్రవేశము సంపాదించి, యందలి యపూర్వ గ్రంథములను గుర్తించిరి-కాని యవి యక్కడనే వ్రాసికొనుటకు, నేను చెప్పిన పరిస్థితులవలన వీలుండెడిదికాదు.

---

1. శ్రీ సూర్యారావుగారు, ముందు చెప్పిన సుందరము పంతులువారివద్ద తాళపత్ర మాతృకలకు ప్రతులు వ్రాయుటయందు శిక్షణపొందినవారు-వారిని గురువుగా భావించెడివారు.

కవిగారును అప్పటివారిని నుంచి చేసికొని గ్రంథములు పట్టుకొని వచ్చెడి వారు-కాని వారు నిర్ణీతమైన దినము నాటికి కోటలో నిచ్చివేయవలెను-ఈ సందర్భమున కవిగారి సతీమణి వారికి వ్రాత యందు తోడ్పడుచుండినట్లు తెలియుచున్నది-కవిగారు తంజావూరి లోనే గాక, గద్వాల వనపర్తి మొదలగు సంస్థానములలో గూడ-కోటనుండి యింటికి తాళపత్ర గ్రంథములు తెచ్చినప్పుడును ఇట్టి యవస్థపు బాల్పడినవారే-గద్వాల నుండి తెచ్చిన మత్స్యపురాణ వ్రాతప్రతిలో-"more than half of the work is written by my better half" అని వారే వ్రాసియున్నారు.1

బట్టి కవిగారు ప్రాచీన గ్రంథముల కొఱకు రాత్రి యనక పగలనక, సర్వ కాల సర్వావస్థల యందు, శ్రమించెడి వారని మనకు బోధ్యమానము కాక మానదు.

తంజావూరు గ్రంథాలయము సంగతి ఎందుకింతగా వ్రాయవలసి వచ్చినదనగా, కవిగారు తెలుపక పోయినను- వారు 'విస్మృత కవులు" అను పేరితో ప్రకటించిన గ్రంథములన్నియు చాల వఱకు నక్కడివే-వాని వివరములు తెలిపి, ఆ వెనుక వారి శ్రమను తెలిపెదను.

## విస్మృత కవులు

క్రీ. శ. 1912 లో తాము ప్రకటించిన భైరవకవి శ్రీ రంగమహత్త్వము చివర పై కవుల గ్రంథముల నిట్లు ప్రకటించినారు.

### "విస్మృత కవులు"

ఈ పేరనతిమనోహరములగు ప్రాచీన కావ్యములు శక్తి కొలఁదిదిద్ది కవి చరిత్రాది విషయములఁజేర్చి ముద్రించుచున్నారము. ఇప్పుడు వెలరు సిద్ధముగానుండు కృతులేవనగా

| | | |
|---|---|---|
| 1. | క్రీడాభిరామము- శ్రీ నాథకవి విరచితము (వెలకు లభించదు) | |
| 2. | కుమారసంభవము-పూర్వభాగము-నన్నెచోడదేవకవి కృతము | 1-0-0 |
| 3. | నీతిశాస్త్రముక్తావళి-భద్రభూపాల విరచితము | 0-5-0 |
| 4. | పరతత్త్వరసాయనము-ఫణిభట్ట ప్రణీతము | 0-12-0 |
| 5. | ప్రబంధమణిభూషణము-సంగ్రథితము | 0-12-0 |

1. ఈ వ్రాతప్రతి పిఠాపురములో, శ్రీ ఓలేటి వేంకటరామశాస్త్రిగారి యింటి వద్ద నున్నది. వారే 'కవిత' పత్రికలో హరిభట్టు మత్స్యపురాణము ముద్రించినారు. నాటికి నేటికి ఆ గ్రంథపునర్ముద్రణమే లేదు.

6. త్రిపురాంతకోదాహరణము-తిప్పరాజు ప్రణీతము 0—3—0
7. అనర్ఘరాఘవము-తిమ్మభూపాల రచితము 1—0—0
8. శ్రీ రంగమహత్త్వము-భైరవకవి ప్రణీతము 1—0—0

పై గ్రంథములు కాక, అచ్చులోనున్న గ్రంథములని యీ క్రిందివి యీ బడినవి.

| | |
|---|---|
| 9. ఉదయనోదయము | (అచ్చులోనున్నది) |
| 10. ఐరావత చరిత్రము | ,, |
| 11. డింౘిమప్రహసనము | ,, |
| 12. రఘునాథరామాయణము | ,, |
| 13. సాంబోపాఖ్యానము | ,, |
| 14. ముద్రామాత్యము (క్షేమేంద్ర విరచితము) | ,, |

ఆనాడు "అచ్చులోనున్నవి" అని వ్రాయబడియున్నను కవిగారు వానిని ముద్రింప లేదు.

9, 11, రెండును నేటి వఱకచ్చు కాలేదు.

12. రఘునాథ రామాయణము
13. సాంబోపాఖ్యానము
] ఈ రెండును కాకినాడ ఆంధ్ర సాహిత్య పరిషత్తు వారు ప్రకటించిరి.

14. ముద్రామాత్యము– ఈ ప్రకటనను బట్టి క్షేమేంద్ర విరచితమైన ముద్రామాత్యము అనురాజనీతి గ్రంథము వారి యొద్ద సంపూర్ణముగానున్నట్లే తెలియుచున్నది. కాని ఆ గ్రంథము బయట పడలేదు. ఒక్క సకలనీతిసమ్మతమున నే, ఈ గ్రంథమునుండి పద్యములుదాహరింపబడినవిగాని, మఱి యే యితర సంకలన గ్రంథకర్తలు నుదాహరింప లేదు. లాక్షణికులంతకంటె నుదాహరింపలేదు.

దీనిని బట్టి 1912 నాటికి "విస్మృత కవుల"లో 8 కావ్యములు వెలువడినట్లు మనకు స్పష్టమైనది. ఇక 1923 లో వారు ప్రకటించిన సకలనీతిసమ్మతమున ముఖ చిత్రముపై నిట్లున్నది.

The Forgotten poets Series No. 10

విస్మృత కవులు సం. ౧౦

విస్మృత కవులలో 8 వ సంఖ్య శ్రీరంగమహాత్త్వమని సకలనీతిసమ్మతము సంఖ్య 10 పది యని తెలిసికొంటిమి. ఇక 9 వ సంఖ్య కనుగొనవలయును. అది నన్నెచోడకవి కుమారసంభవము ద్వితీయ భాగము-1914 లో ప్రకటితము.

అప్పుడు విస్మృత కవుల గ్రంథ ప్రకటన కాలక్రమమిట్లుండును.

1908 కుమారసంభవము-ప్రథమభాగము.

1909 క్రీడాభిరామము.

1910 నీతిసారముక్తావళి.

1910 ప్రబంధమణిభూషణము.

1911 పరతత్త్వరసాయనము.

1911 అనర్ఘరాఘవము.

1912 త్రిపురాంతకోదాహరణము.

1912 శ్రీరంగమహాత్త్వము.

1914 కుమారసంభవము-ద్వితీయభాగము.

1923 సకలనీతిసమ్మతము.

సకలనీతిసమ్మతము తరువాత ఈ శీర్షిక క్రింద కవిగారు ప్రాచీనకావ్యములను ముద్రించలేదు. పై గ్రంథములన్నియు ప్రథమముగా తాళపత్రములనుండి అచ్చునకెక్కినవి. తరువాత ముద్రణములకన్నింటికి పై కవిగారి ముద్రితప్రతులే మూలములు. వాని వివరములు తరువాత దెలిపెదను.

## ప్రథమముద్రణలు-పరిశ్రమ

తాళపత్రములనుండి మొదటి సారిగా అచ్చువేసినప్పుడెంత కష్టపడవలయునో, ఆ సంగతి, కేవలమచ్చు పుస్తకములతోనే పరిచయముగల యీ నాటి వారికి నవగాహనము కాదు. వాని యందు పద్యములన్నియు నొకేవరుసలో లేక పంక్తిలోనుండవు. కొన్నింటికి పేరులు కూడ నుండవు. దీనితోపాటు వ్రాయసకాడు ప్రాజ్ఞుడు కాకపోయినచో లేఖక దోషములునుండును. మొదట తాళపత్రములయందలి వ్రాతచదువుటయు మన మలవాటుపడియుండవలెను. తాళపత్రములపై వ్రాతకు, నేటి ముద్రితగ్రంథములకు నెంత వ్యత్యాసముండునో తెలుపుటకు నన్నెచోడని కుమారసంభవమునుండి యొకటి రెండు ఉదాహరణలు చూపుచున్నాను.

## మొదటి పద్యము-యథామాతృకము

"శ్రీవాణింద్రామరెంద్రాచిఃతమకుట మణిశ్రెణి నామాంఘ్రిపద్మా
జీవోద్యత్యెనండాశ్రిత జనలసితాశెష వస్తుప్ర...డ్డ...దేవా
దీశుండునిత్యొదితుండజుండు మహాదెవు ద్యుండ్డువిశ్వైకా
వాసుండెప్పుడును మాకభీమతముల్ ప్రీతాత్ముండై యిచ్చుగాంతని.

## ముద్రితము

స్రగ్ధర. శ్రీవాణీంద్రామరేంద్రార్చిత మకుటమణి శ్రేణిధామాంఘ్రిపద్మా
జీవోద్యత్కేసరుండాశ్రిత జనలషితాశేష వస్తుప్రదుండా
దేవాధీశుండు నిత్యోదితుడజుఁడు మహాదేవుఁడాద్యుండు విశ్వై
కావాసుండెప్పుడును మాకభిమతములు ప్రీతాత్ముఁడై యిచ్చుగాఁతన్.

కొన్ని పట్టుల తరువాత క్రింది పద్యమునగాని వచనమునగానియున్న పంక్తులు మీది పద్యములో లేఖకుడు వ్రాయును-

1 ఆ. 122 పద్యము........."హరిందనగభఃమునంజరా చరమ
మవిశ్వంబ్బు దాల్చిచనువాని సితెతీర————ల విశేషించ్చుచు
ధమార్ కమఃఫలభొగా స్పదంమణివొవెధచ్చిన శరనిధి
పెంప్పెరికైనంజనునె పొగడదను"

## ఇందలి పద్యమిది-ముద్రితము

క. హరిఁదన గర్భమునఁజరా
చరమయ విశ్వంబుదాల్చి చనువాని సితే
తరమణివోలెధరించిన
శరనిధి పెంపేరికైన జనునే పొగడన్.

"లవిసేషించ్చుచు ధమాఃకమఃఫలభొగాస్పదం" అన్నది తరువాత వచ్చెడు వచనములోనిది.

"అని యనేకవిధ రత్ననికరాకరంబైన రత్నాకరాశేషవిశేషంబుల విశేషించుచు ధర్మాధర్మఫలభోగాస్పదంబైన ధర్మరాజు పురంబున కరిగెనంత" 1–123.

123 వచనములోని పంక్తి నెక్కడనుండి యెక్కడ 122వ పద్యములో వ్రాయనకాడు వ్రాసియున్నాడో పాఠకులు గ్రహింపగలరు. మచ్చుకు చూపితినిగాని కుమార సంభవమున ఆదినుండి అంతమువరకును వ్రాతయిట్లే యుండును.[1]

ఇట్లొక ప్రాచీన గ్రంథమును గుర్తించి, తాళపత్రములనుండి ప్రతియెత్తి వ్రాసి, లేఖకదోషములను సంస్కరించి, సమీచీనముగా చక్కని యచ్చులో సాహిత్య ప్రపంచమునకు కవిగారందింపగా క్రీ. శ. 1912 నాటికి వారి పరిశ్రమయందు ప్రజల కెంత యాదరణ ముండెడిదో పూర్వోక్త పీఠికయందలి యీ క్రింది పంక్తులు తెలుపుచున్నవి. ఆదరణమాట యటుండ నిచ్చి కవిగారియందీర్ష్యకూడ పొడమినది.

"వ్యయప్రయాసంబుల మాటఁబోనిచ్చి శతచ్ఛిద్రవ్యాకులంబగు తాళదళ పరిశోధనం బభ్యాసవశంబున జుగుప్సారహితంబుగ నలవఱచుకొని కార్యము లెట్లో నిర్వహించుచుండుటయుఁగొందఱీర్ష్యా గ్రహగ్రస్తులుచూచి యోర్వక పరిపరివిధములనగుఁబాటుపఱచుచున్నారు. అక్కటా ! ఈయల్ప కార్యారంభమునకే జ్ఞాతిత్వము లేకయె యీర్ష్యావిద్వేషమునఁగన్నుపొడుచువారుండగా భగవంతుని యనంతగుణంబులంజూచి యోర్వక తామసులై యతనితోఁబోరగడంగు రాక్షసుల యవిద్యాప్రభావమును సహస్రముఖముల వర్ణించిన వ్యాసాదుల విజ్ఞానము తప్పక కొనియాడఁదగినదే.

"విద్యాసంస్కారము చాలని నా యట్టివాఁడు సేయుపరిశోధనమున దోషసంభ్రమములు గలుగుట నిశ్చయము. వాని నన్వేషించిచూపిన మాత్ర వివేకి యాగ్రహస్థానముగానేరఁడు. విద్వత్కల్పులు చేయుకౌటిల్యము మాత్రము నిరసనీయమే. భగవచ్చోదనా మహిమంబు ననె నాయలోప్యద్యోగము నెఱవేఱుంగాక యని పరమవిశ్వాసమున దీనినింతటితో విరమించుచున్నాను" (పీఠిక vii)

పై నుదాహరించిన వాక్యములను బట్టి- యొక వైపున కించిత్సంస్కారముగల వారసూయాగ్రస్తులై యుండి బాధలుపెట్టుచుండగా, మఱి యొక వైపు సంస్కారముగల విద్వాంసులు కుటిలవృత్తిననుసరించి, మనస్సు నాందోళనము చెందించగా, కవిగారు, భగవంతునిపై భారమువైచి, ఏటికెదురీదినట్లుగా నీ ప్రాచీనాంధ్రకావ్యముద్రణ సాగించినారని మనము నిర్వివాదముగా నిశ్చయింపవచ్చును. ఇట్టి ఘట్టము మన యద్యతన వాఙ్మయచరిత్రమున సువర్ణాక్షరములతో లిఖింపదగినది.

---

1. ఇప్పటికి 41 యేండ్ల క్రిందట తంజావూరి తాళపత్ర మాతృకనుండి యథామాతృకముగా వ్రాయబడిన ప్రతి నా వద్దగలదు. దానిని వారు తిరిగి మూల ప్రతితో సరిచూచి లోపముఖు గుర్తించినారు. తంజావూరి గ్రంథాలయములో దీని సంఖ్య 189.

ఇందుమూలముగా తేలినదేమనగా, ఇంత కష్టపడి గ్రంథములను వెలుగులోనికి తీసికొనినగా, పై కారణములచే అచ్చువేసిన ప్రతులే మాత్రమును చెల్లెడివికావు. క్రీ. శ. 1914 వ సంవత్సరమునను స్థితి పరిస్థితులుండెనని వారి యీ క్రింది విజ్ఞప్తి దెలుపుచున్నది—

"క్రీ. శ. 1914 వ సంవత్సరమునకు అనగా నేను 1908 లో నీ గ్రంథ ప్రథమ భాగము ముద్రించిన నాటినుండి "యాఱు" ప్రతులు మాత్రమే చెల్లినవి.

"కార్యాంతరమున నేను శ్రీ కట్టమంచి రామలింగారెడ్డిగారి వద్దకు బోవఁగా వారు 'కుమారసంభవము ద్వితీయభాగము నింకను ముద్రింపలేదేమి'యని యడిగిరి 'కారణ మడుగుదురా' అని జవాబు చెప్పితిని. వారు వెంటనే 'ప్రాతఃకాలమున బ్రాహ్మణునికి నిచ్చెడు దక్షిణ'యని నూఱురూపాయలు నా కిచ్చి ద్వితీయ భాగము ముద్రింపఁ గోరిరి."

కట్టమంచివారి వాక్యమును కవిగారధోరేఖాంకితము గావించినారు.

## గ్రంథ పునర్ముద్రణలు-విస్మృతకవుల విలువ

కవిగారు నిస్స్వార్థముగ ప్రకటించిన కావ్యముల విశిష్టతను సాహిత్యలోకము గ్రహించుటకు మఱి పదహారేండ్లు పట్టినది. క్రీ. శ. 1930 నాటినుండి కవిగారు ప్రకటించిన విస్మృతకవుల గ్రంథములు పునః ముద్రణము కాజొచ్చినవి. పునర్ముద్రణమేకాదు అవి సుపరిష్కృతములై వాఙ్మయచరిత్రయందు వానికి గల స్థానము నిరూపించెడి విపుల పీఠికలతో వెలసినవి. ఆ గ్రంథముల పరిష్కర్తలిరువురును, వాఙ్మయపరిశోధనమున కవిగారి కనుయాయులై, వారినే యాదర్శముగాగొని సాహిత్య పరిశ్రమమున నిష్ణాతులగుటచేత, ఈ పునర్ముద్రణములవలన సాహిత్యవిమర్శన పథక ముత్తమ స్థాయినందుటయేగాక, కవిగారి యఖండప్రతిభా విశేషములు సాహిత్యప్రపంచమునకు వెల్లడియైనవి.

## నాటకశాఖ-ఆంధ్రుల సాంఘికచరిత్ర-క్రీడాభిరామము

కవిగారు ప్రకటించిన క్రీడాభిరామమునకు నొకచే ప్రతి తంజావూరు గ్రంథాలయములోనున్నది. అది కాకతీయ చక్రవర్తి ద్వితీయ ప్రతాపరుద్రుని నాటి ఆంధ్రులసాంఘిక చరిత్రకుపయుక్తమగు గ్రంథము. అంతేకాదు. తెలుగులో నాటకశాఖయందు దీని కొక విశిష్టస్థానమున్నది[1]. ఈ ప్రశస్త కృతిని క్రీ. శ. 1930 లో శ్రీ ప్రభాకర శాస్త్రులు

1. ఆంధ్రనాటకవికాసము-పుటలు 109-114- డాక్టరు పోణంగి శ్రీరామ అప్పారావుగారు.

గారు విశేషవిషయ విలసితమును సుదీర్ఘమునగు పీఠికతో తిరిగి వెలయించిరి. దాని ప్రకటన కర్తలు[1] సామాన్యుల కందుబాటులో నుండనట్లు దీనికి పదిరూప్యములు వెల యుంచిరి. శ్రీ శాస్త్రులవారి పీఠికామూలముననే సాహిత్య పరిశోధకులేగాక చారిత్రక పరిశోధకులు దీని విలువను గుర్తెరిగిరి. కాకతీయచరిత్రలో నిది యుదాహరింపని వ్యాసము గాని గ్రంథముగాని యుండదనుటలో నతిశయోక్తిలేదు. ఈ గ్రంథ పీఠికలో కవిగారి గ్రంథములనుగూర్చి శ్రీ శాస్త్రులు వారెట్లు ప్రశంసించిరో చూడుడు-

"సాహిత్య ప్రపంచమున మా బోంట్లు తిన్నగా కన్నులు తెఱువక పూర్వమే రామ కృష్ణకవిగారు ప్రాచీన ప్రబంధములను ప్రకటించిరి. వానిలో కుమారసంభవము, క్రీడాభి రామము, సకలనీతిసమ్మతము రత్నత్రయము; నీతిసార ముక్తావళి, త్రిపురాంతకోదాహ రణము, శ్రీ రంగమహత్త్వము ప్రశస్తకృతులు."

## ఉదాహరణశాఖ-త్రిపురాంతకోదాహరణము

ఈ త్రిపురాంతకోదాహరణమునకు నొకటే తాళపత్ర మాతృక (166 సంఖ్య) తంజావూరిలో గలదు. కవిగారు దానిని బట్టి ప్రథమముగా దీనిని ప్రకటించిరి.[2] వారేదీనికి రెండవ ముద్రణమును గావించిరి.[3]

తెలుగు భాషలో ప్రశస్తమగు నీ యుదాహరణమును నేను క్రీ. శ. 1935 లో విపుల పీఠికా వ్యాఖ్యానముతో ప్రకటించుటయేగాక, తెలుగుభాషలో, నే యితర భాషలందు గాని, సంస్కృతమునగాని లేని, ఉదాహరణశాఖ యున్నదని ప్రప్రథమముగా సాహి త్యలోకమునకు వెల్లడించితిని. అంతేకాక, ఆ వెనుక, ఉదాహరణశాఖకు సమగ్రమైన పరిశోధన చేయుటకు, కవిగారి త్రిపురాంత కోదాహరణమే ప్రాతిపదిక యైనది. క్రీ. శ 1949 లో త్రిపురాంతకోదాహరణమునకు, అప్పటిమదరాసు ప్రభుత్వమువారి జాతీయ

---

1. కీ. శే. గంటి సూర్యనారాయణశాస్త్రిగారు, శృంగార గ్రంథమాలాధిపతులు- శ్రీ ప్రభాకరశాస్త్రిగారి పీఠికతో నీ క్రీడాభిరామమును వారి పుత్రుడు క్రీ. శ. 1960 లో తిరిగి ప్రకటించిరి.

వావిళ్లవారంతకుముందు క్రీ. శ. 1954 లో శ్రీ బండారు తమ్మయ్యగారి పీఠికతో స్వల్పమైన ధరతో ప్రకటించిరి.

2. వనపర్తి, బ్రహ్మవిద్యావిలాస ముద్రాక్షరశాల 1912.

3. తిరుమల వేంకటేశ్వరపత్రిక ఏప్రియలు 1933. ఈ పత్రికయందు 10 సంచికలు మాత్రమే ప్రకటితమైనవి. సంపాదకులు కవిగారే.

బహుమతి లభించినది. క్రీ. శ. 1950 లో నేను ఉదాహరణవాఙ్మయచరిత్రను ప్రకటించితిని.[1]

తెలుగున రెండు శతాబ్దులుగా విస్మృతమైన యీ శాఖను త్రిపురాంతకోదాహరణముతో నే నుద్ధరించిన తరువాతనే యీ నాటి కవులు తిరిగి ఈ కావ్యప్రక్రియ చేపట్టిరి. ఆంధ్రవాఙ్మయచరిత్రములో నీ ప్రక్రియ సుప్రతిష్ఠితమైనది. ప్రాచీన కావ్యపరిష్కరణమున సిద్ధహస్తులని కీర్తి తెచ్చినదీ త్రిపురాంతకోదాహరణమే.[2] దీని కంతకు హేతుభూతులు శ్రీ కవిగారే. ఈ త్రిపురాంతకోదాహరణము ప్రత్యేకముగా విపులవ్యాఖ్యతో వెలుపడవలసియున్నది.

## ప్రబంధశాఖ

ఆంధ్రసాహిత్యప్రపంచమున కవిగారి కీర్తిసౌధమునకు మూలస్తంభాయమానమైనది వారు ప్రకటించిన నన్నెచోడకవి కుమారసంభవము. నన్నెచోడకవి కుమారసంభవము, తెలుగున ప్రబంధములలో ప్రథమమైనదేగాక మకుటాయమానమైనది. ఈ మహాప్రబంధము 1908 లో ప్రకటితమైన దాదిగా, వాఙ్మయ ప్రపంచమునంతటి నుఱ్ఱూతలూగించినదనుటలో నణుమాత్రము సందేహము లేదు. కవిగారే ప్రథమ ద్వితీయభాగములకు పీఠికలు వ్రాసియున్నారు. అందువారాకాలముననే అరువది రెండేండ్ల క్రిందట యీ నాటికి మనకు పరిచితమైన విషయములన్నింటిని వివరించియున్నారు. చిత్రమేమనగా నేడు నన్నెచోడని కావ్యమును గూర్చిన విమర్శనములలో, కాలనిర్ణయ చర్చయే ప్రధానమై కవిగారానాడుట్టంకించిన విషయములనే తర్జనభర్జన చేసిరిగాని క్రొత్త విషయమును తెలుపనేలేదు.[3]

## వ్రాతప్రతులు

కుమారసంభవమునకు తంజావూరి గ్రంథాలయములోనేకైక ప్రతిమాత్రమేయున్నదని యీ వఱకే తెలిపితిని. 1914 లో కవిగారు రెండవభాగ ప్రచురణమున కొన్ని పాఠభేదములు సూచించిరి. ఆ ప్రతి ద్రవిడదేశమునందు దొరకినదనివారు చెప్పిరి. ఆ నాటినుండి

---

1. ఇది క్రీ. శ. 1968 లో విశేషములతో రెండవసారి ముద్రితమైనది.

2. "ప్రాచీన గ్రంథపరిష్కరణలో మానవల్లి, వేటూరి వార్లకు దీటురాగలిగారు" – తెలుగు వెలుగులు– ఆంధ్రసచిత్రవారపత్రిక, 1961.

3. నన్నెచోడుని గుఱించి యొక వాఙ్మయమే వెలుపడినది. నన్నెచోడుని కుమారసంభవమును నూతనముగా శైవమతదృష్టితో నేను పరిశీలించి సాహిత్యలోకమునకాతని కాలనిర్ణయముచేయుట కొక పరిష్కార మార్గము వివరించితిని (భారతి–ఏప్రియలు 1969–నన్నెచోడుని శైవమత సమన్వయము).

దీని మూల ప్రతి తంజావూరి గ్రంథాలయములో తప్పక యుండి యుండునని తేలినది. క్రీ. శ. 1917లో సూర్యరాయాంధ్ర నిఘంటు కార్యస్థానము పిఠాపురము వచ్చిన తరువాత నిఘంటువు కొఱకు కుమారసంభవ వ్రాతప్రతితో సంప్రతింపబడిన ప్రామాణికప్రతి కావలసివచ్చెను. అప్పుడు కీ. శే. క్రొత్తపల్లి సూర్యరావుగారిని తంజావూరు పంపి, వారిచే, నొక వ్రాతప్రతి వ్రాయించి పిఠాపురము మహరాజావారే తెప్పించిరి. కీర్తిశేషులు నడకుదుటి వీరరాజుగారు, మొదట నన్నెచోడుని గూర్చి పరిశ్రమ చేయుటకు నీ వ్రాతప్రతియే మూలము. కుమారసంభవముపై ప్రథమముగా ప్రశస్తవిమర్శ వెలయించిన లక్ష్మీపతి శాస్త్రిగారి రచన కిదియే మూలము.[1]

సూర్యరాయాంధ్ర నిఘంటువున నన్నెచోడకవి కుమారసంభవమునుండి యీయబడిన యుదాహరణములన్నియు, నీ వ్రాతప్రతి ననుసరించినవే. శ్రీ సూర్యారావుగారు తాళపత్ర గ్రంథములనుండి పుత్రికలు వ్రాయుటలో సిద్ధహస్తులగుట చేతను, బహుజాగరూకతతో ప్రత్యక్షరము పరీక్షించి దీనిని వ్రాసినారు. ఈ ప్రతి యిప్పుడు లభ్యముకాదు. నేను నిఘంటు కార్యస్థానమున నున్నప్పుడీ ప్రతినే యుపయోగించితిని.[2] దీనిని బట్టియే వీరరాజుగారొక లఘుటిప్పణి వ్రాసిరి. అందు పాఠభేదములు సూచితములు.[3]

కుమారసంభవమును గూర్చి దేశమున నింత పరిశ్రమ జరుగుచున్నను గ్రంథ పునర్ముద్రణమునకు నెవ్వరు పూనుకొనలేదు: శ్రీ లక్ష్మీపతిశాస్త్రిగారు మదరాసు విశ్వవిద్యాలయము నాంధ్రభాషాశాఖలో సహాయోపన్యాసకులై ముందు నేను వివరించిన విమర్శకు తరువాత, గ్రంథమును విశ్వవిద్యాలయము పక్షమున పునర్ముద్రణ చేయుటకు ప్రారంభించిరి.

## మదరాసు విశ్వావిద్యాలయ ప్రచురణము

శ్రీ లక్ష్మీపతిశాస్త్రిగారు తంజావూరి ప్రతితో సంస్కరించి, గ్రంథ ప్రకటనకు పరిష్కృత ప్రతిని సిద్ధము చేసిరి-కాని ముద్రణ ప్రారంభమునకుముందే ఆ విశ్వవిద్యాలయమునుండి వారు విరమింపవలసి వచ్చినది. విశ్వవిద్యాలయమువారు గ్రంథ ప్రకటన కంతకు ముందే యాజ్ఞనిచ్చియున్న కారణమున దానిని ప్రచురింపవలసిన బాధ్యత అప్పటి

1. కుమారసంభవ విమర్శనము – కీ. శే. శ్రీ పాదలక్ష్మీపతిశాస్త్రి రచితము – మదరాసు విశ్వవిద్యాలయ ప్రకటితము. 1937

2. నేను, 1939–42 మూడేండ్లు పిఠాపురమున శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటు కార్యస్థానమున పండితుడనుగా నున్నాను.

3. శ్రీ వీరరాజుగారు సంస్కరించిన పై ప్రతి (కవిగారి ముద్రణ ప్రతియే) నా వద్ద నున్నది.

శాఖాధ్యక్షులైన శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారిపై బడెను. క్రీ. శ. 1944 లో లక్ష్మీపతిశాస్త్రి గారి స్థానమున నేను నియుక్తుడనైనాను-అప్పటికి ముద్రణ ప్రారంభమైనది. అంతకు ముందే, నా పేర పాఠభేదముల చర్చకై రమ్మని వ్రాసిన రామకృష్ణయ్యగారేలాకో నేను వచ్చిన తరువాత, నా ప్రసక్తి లేకుండగనే[1] పీఠికాదులతో క్రీ. శ. 1948 లో విశ్వవిద్యాలయ పక్షమున ప్రకటించిరి. విశ్వవిద్యాలయమువారు స్వల్పముగ ప్రతులు ప్రకటించుటచేతను, శ్రీ రామకృష్ణయ్యగారి పీఠికలో నన్నెచోడని కవితా సంప్రదాయమంతయు కన్నడమునుండి గ్రహింపబడినదని ప్రతిపాదితమగుట చేతను, గ్రంథము చక్కగా తిరిగి ముద్రితమైనను వ్యాప్తిలోనికి రాలేదు.

## వావిళ్ల ముద్రణములు

1. విశ్వవిద్యాలయమువారు ప్రకటించిన మరుసటి సంవత్సరమే 1948 లో వావిళ్ల వారొక ముద్రణము వెలయించిరి. దానిలో పాఠభేదములు లేవు. ఒకచిన్న పీఠిక ఇంగ్లీషులోను, తెలుగులోను గలవు. కాని కుమారసంభవము దొరకకపోవుటచే ప్రతులు చెల్లినవి. క్రీ. శ. 1950లో కుమారసంభవమున ద్వితీయాశ్వాసము (దక్షాధ్వరధ్వంసము) విశ్వవిద్యాలయ ప్రథమ శాస్త్రపరీక్షకు తెలుగులో పఠనీయ గ్రంథముగా నేర్పఱుపబడినది. వావిళ్లవారే కుమారసంభవము ప్రథమ ద్వితీయాశ్వాసములు ప్రత్యేకముగా ప్రకటించిరి.[2]

2. వావిళ్ల వారే క్రీ. శ. 1952లో నా విపుల పీఠికతో, పాఠభేదములతో కుమారసంభవమును ప్రకటించిరి. ఆ పీఠికలో నన్నెచోడని మత విషయములేగాక, సాహిత్య సంప్రదాయములనుగూర్చి, ఛందస్సును గూర్చి నూతన విషయములనేకములు దెలిపితిని. నేటికి నదియే వ్యాప్తిలో నున్నది.

## కుమారసంభవ-సుసంస్కృత సవ్యాఖ్యాసహిత ముద్రణావశ్యకత

ఈ నాడు నన్నెచోడని గూర్చి కుమారసంభవమును గూర్చి ఎన్నో నూతన విషయములు వెలుగులోనికి వచ్చినవి. దానికి సాధికారమైన సవ్యాఖ్యాసహిత సుసంస్కృత ముద్రణ అత్యంతావశ్యకమైయున్నది. దానిని కవిత-సాహిత్యము-సంస్కృతి అను త్రివిధ

---

1. ఈ విషయములన్నియు, "కంజజతత్త్వభంజనము" అను నా వ్యాసమున వివరించితిని (చూ. భారతి)—— [illegible]

2. వావిళ్ల వారి గ్రంథభాగము నిట్లు ప్రకటించుటయేగాక ద్వితీయాశ్వాసమునకు టీకాతాత్పర్యాదులను "త్రిలిఙ్గ" పత్రికయందు 1951 లో పూర్తిగా ప్రకటించినారు. నన్నెచోడుని కృతిలో నొక యాశ్వాసమునకైన టీకాతాత్పర్యములతో ప్రకటితమైనదిది యొక్కటే. ఇది ప్రత్యేక పుస్తకరూపముగా ప్రచురితము కాలేదు.

దృక్పథములతో కూలంకషముగా పరిశీలింపవలెను. అంతేకాక నన్నెచోడకవి శివకవి త్రయములో నొకడగుటచేత మతసంప్రదాయ దృష్టితోగూడ దీనిని గూర్చి వ్యాసంగము చేయుట అత్యవసరము. వీని నన్నింటిని నాకళింపుచేసికొని నే నొక సుసంస్కృత ప్రతిని ముద్రణమునకు సిద్ధముచేసి యుంచితిని. అది ప్రకటితము కావలెను.

ఇట్టి పరిష్కృత ముద్రణమువలన నాంధ్ర సాహిత్య ప్రపంచమున కొక వెలుగును, దానిని ప్రప్రథమముగా ప్రకాశింపజేసిన కవిగారి పరిశ్రమకు, ప్రతిభకు నొక నీ రాజనమును కాగలదు.

## శాస్త్రీయగ్రంథశాఖ- రాజనీతిశాస్త్రము- బద్దెన నీతిసారముక్తావళి

"బద్దెనీతి" యని ప్రాచీనకాలమునుండి ప్రచారమునను్న "నీతిసారముక్తావళి" అను గ్రంథమును ప్రథమముగా ప్రకటించినది శ్రీ కవిగారే. కవిగారు పీఠికలో బద్దెన క్రీ. శ. 1050 ప్రాంతమువాడని వ్రాసిరికాని, ఈ తరువాత శాసనమూలమున నాతడు క్రి. శ. 1260 ప్రాంతము వాడని నిశ్చితమైనది.

ఈ బద్దెనీతినుండి పద్యములు ప్రథమ సంకలన గ్రంథమగు సకలనీతిసమ్మతమున నుదాహరింపబడినవి. కృష్ణదేవరాయల యన్న వీరనరసింహరాయలవారు బద్దెనీతులను పఠించెడి వారని రాయవాచకమునుండి తెలియుచున్నది.[1] దీని తాళపత్ర ప్రతి తంజావూరిలో 210 సంఖ్యగానున్నది.

కవిగారు ప్రకటించిన తరువాత నీ గ్రంథమునకు మఱి మూడు ముద్రణములు వెలసినవి.

1. శ్రీరామవిలాస గ్రంథమాలలో 17 వ గ్రంథముగా కావ్యనిధి చెలికాని లచ్చారావు గారిచే క్రీ. శ. 1918 లో ముద్రితమైనది.
2. ఆంధ్ర సాహిత్య పరిషత్తువారు పరిషత్పత్రిక 50 సం. 2, 3, సంచికలు (1960) లో ప్రకటించిరి. దీనికి పరిష్కర్తలు శ్రీ చిలుకూరి పాపయ్యశాస్త్రిగారు. వీరు దీనిని జాగరూకతతో ప్రకటించిరి. కాని పరిషత్తు ప్రత్యేక ప్రచురణగా పీఠికాదులతో వెలువడలేదు. కావున ప్రకటితమైనట్లుగా కూడ కొంతమందికి తెలియదు.
3. సాహితీవల్లభ ముళ్లపూడి తిమ్మరాజుగారు, నరేంద్ర సాహిత్య మండలి పక్షమున ప్రకటించిరి (1963).

---

1. దక్షిణదేశీయాంధ్ర వాఙ్మయము. పుట 313.

బద్దెనీతి రాజనీతిశాస్త్రమునకే గాక లోకనీతికిని సంబంధించినది. మూల శ్లోకములతో గూడ వ్యాఖ్యానముతో పీఠికతో ప్రకటింపను కావలసిన ప్రశస్త ప్రాచీనకృతి యిది.[1]

## వేదాంతవాఙ్మయశాఖ- పరతత్త్వరసాయనము

ఆంధ్రవేదాంత వాఙ్మయమునకు సంబంధించిన ఫణిభట్టు రచిత పరతత్త్వరసాయనమును కవిగారు క్రీ. శ. 1912 న ముందే ప్రచురించినట్లుగా ముందు తెలిపియుంటిని. వారచ్చు వేసిన వానికి వెలలు వేసిరి-దీనికి వెల తెలుపరి కాబట్టి యిది యచ్చు పడినదనే మనము భావింపవలెను. కాని యీ గ్రంథము ప్రస్తుతము లభ్యము కాలేదు. 1944 లో మదరాసు విశ్వవిద్యాలయము వారు గ్రంథమును ప్రకటించిరి. కాని వారు కవిగారి ముద్రణప్రతి సంగతి యెత్తుకొనలేదు. ఫణిభట్టు ప్రాచీనకవులలో నొకడని కవిగారి యభిప్రాయము.

## క్షేత్రమాహాత్మ్యశాఖ-భైరవుని శ్రీరంగమాహాత్మ్యము

తెలుగున శ్రీరంగక్షేత్రమాహాత్మ్యమును గూర్చి మొదట తెలిపి ప్రాచీనమైన భైరవకవి కృతిని మొదట ప్రచురించిన కీర్తి కవిగారిదే. వారీ గ్రంథము నెట్లు గుర్తించినదీ తెలిసికొనినచో, తాళపత్ర పరిశోధనాచార్యత్వమునకు వారెట్లష్టాలో తెలియవచ్చును. ఈ క్రిందివి వారి వాక్యములు:

‘‘ఈ కృతికి నాకు రెండు ప్రతులు వనపర్తి సంస్థానాధీశ్వరుల తాళపత్ర లిఖిత గ్రంథములలోనే లభించినవి. అందులో నొకటి 186 సంవత్సరములకుఁ బూర్వమునను దానికిఁ బుత్రికయగు వేఱొకటి 96 సంవత్సరములకుఁ బూర్వమునను దత్సంస్థానాధీశుల ప్రేరణంబుననే లిఖింపబడినవి. నేను దత్సంస్థానాధీశ్వరాశ్రయము వొందని కాలమున గ్రంథాన్వేషణము నిమిత్తము గద్వాల వనపర్తి సంస్థానములఁ గొంతకాలము సంచరించి వారి యనుగ్రహంబునకుఁ బాత్రుండనై గద్వాలలో భోజరాజీయాదికృతులు సంపాదించి వనపర్తిలోఁ బుస్తకములు శోధించుటకు ననుజ్ఞవడసి వారి యెదుటఁ గూర్చుండి తాళదళ సంపుటములు విప్పదొడకొను సమయమున నకస్మాత్తుగా నప్పకవి యుదాహరించిన ‘‘గంధవుఁగొండ నెత్తము’’ యను భైరవుని పద్యము మనస్సునకు స్ఫురించెను. అంత నయ్యో! మనకేల యీ కావ్య మీ గ్రంథములలో లభింపరాదని మొట్ట మొదటి పుస్తకము విచ్చి కొన్నియాకులు ద్రోచిచూడఁగాఁ బ్రప్రథమమునఁ బై పద్యమే దృష్టిగోచర మయ్యెను. నాకుఁ గలిగిన యమందానందమిట్టిదని చెప్పఁజాల. కుమారసంభవాది సత్కృతు

1. దీనిలోని కొన్ని విశేషములను, నా తెలుగుకవుల చరిత్ర-తిక్కన ఎఱ్ఱనల యుగమున నిచ్చితిని. అది అముద్రితము.

లకున్నిది తీసిపోయినను నేనుత్సుకుడనై వెదకిన కృతిలోఁ బైపద్యమే మొదట గోచరిం చుట వైచిత్రీ విశేషమని తెలియఁబఱచితిని". పీఠిక (viii)

అయిదాశ్వాసములలో 1293 గద్యపద్యములతో నున్న యీ ప్రశస్త ప్రబంధము ముద్రితమై ఏభయి యెనిమిదేండ్లైనను నేటి వఱకు తిరిగి ముద్రితముగాలేదు. విపుల పీఠికాదులతో పునర్ముద్రణము కాదగినది. ఇంతవఱకు దీనిని గూర్చి యొక్క విమర్శ వ్యాసమైన ప్రకటితముకాలేదు.

## అనువాదశాఖ-అనర్ఘరాఘవము

కొఱ్జుల తిమ్మభూపాలుని మురారి యనర్ఘరాఘవ నాటకానువాద ప్రబంధమును కవిగారు క్రీ. శ. 1912 కి ముందే ప్రకటించినట్లుగా తెలిపితిని. దానికిని వెలయుండుటచే నది ముద్రితమైనదనియే మనము నిశ్చయింపవచ్చును. కాని యది లభ్యమగుటలేదు. ఈ యనర్ఘరాఘవ మీ తరువాత తిరిగి ముద్రితమైనదేయైనను దీనిని గూర్చి సాహిత్య ప్రపంచమునకు అంతగా తెలియదనియే చెప్పవచ్చును.

## భోజరాజీయము

అనంతామాత్యుని భోజరాజీయము సంస్కృతమునగల భోజరాజీయమున కనువాదము.[1] ప్రప్రథమముగా నిది యనువాదమని గుర్తించినది కవిగారే. వారు దీనిని గుర్తించుటయేగాక తాళపత్ర ప్రతిని సంపాదించి వీరేశలింగముగారి కీయగా వారు దానిని తమ చింతామణీ ముద్రాక్షరశాలలో ముద్రించిరి[2]- కాబట్టి భోజరాజీయము మొదట ముద్రితమగుటకు కవిగారే మూలము. వీరేశలింగముగారు కవిగారిని శ్లాఘించిరి.

## పురాణశాఖ-మత్స్యపురాణము

హరిభట్టు విరచితమగు మత్స్యపురాణమును తొలుత సంపాదించి, ప్రకటింపజేసిన యశస్సు కవిగారిదే యని యీ వఱకు తెలిపితిని. అరువదేండ్ల క్రిందట ప్రకటితమైన యీ కృతికింత వఱకు పునర్ముద్రణమే లేదు.

## వరాహపురాణము

నందిమల్లయ ఘంటసింగయకవుల వరాహపురాణము ప్రథమముగా సంపాదించి

1. చూడుడు. అప్పకవీయము పుట 191-"సునీతిశాస్త్ర సద్విద్యా" అని భోజరాజీయంబునను..

2. 1904 లో వీరేశలింగముగారు ముద్రించిన వెనుక వేం-వావిళ్లవారు రెండు ముద్రణములీ గ్రంథమునకు వెలయించిరి.

ప్రకటింపజేసిన కీర్తి కవిగారిదే. వారు గద్వాలనుండి తాళపత్ర ప్రతిని దెచ్చి వీరేశలింగముగారి కీయగా వారు చింతామణీ ముద్రాక్షరశాలలో ముద్రించిరి.[1]

## ఉత్తరనారసింహపురాణము

కవిగారిదివఱకు తెలిసిన పురాణములనేగాని మనకు తెలియని వానిని గుర్తించుటకు దోడ్పడిన వారిలో ప్రథములు. వారే గ్రంథము గుర్తించినను, దానిని గురించి తెలిసినపుడు, ఆ కవి రచియించిన యితర గ్రంథములు విశేషములు గూడ తెల్పుచుందురు. హరిభట్టు ఉత్తర నారసింహపురాణమును రచియించినట్లు కవిచరిత్రకారు లెవ్వరును నెఱుగరు-ఇది కవిగారి వలననే తెలిసినది. హరిభట్టు మత్స్యపురాణము వ్రాత ప్రతియందు వారింగ్లీషు భాషలో నిట్లు వ్రాసిరి:

The author has also wrote another work called ఉత్తరనరసింహపురాణము as పూర్వనరసింహ పురాణము was already handled by greater poet like ఎఱ్ఱయ్య and వేములవాడ భీమకవి. But this work is not available and only one stanza quoted by జగన్నాథకవి in his రత్నాకరము survives to lament over the loss of it.

సీ. మందారకుసుమంబుఁజందురుండును గూడి
మౌళి భాగంబునఁగీలు కొనఁగ
ఫణికుండలంబును మణికుండలంబును
గండభాగంబునఁగప్పు కొనఁగ
వరచక్రశూలాబ్జ వరదహస్తములందుఁ
గంకణ భుజగకంకణములమరఁ
గనకకౌశేయంబు గజరాజచర్మంబు
మునుకొని కటిభాగమున నటింపఁ

గీ. దిమిరమును జంద్రికయు జోక నమరినట్లు
పుండరీకోత్పలద్యుతుల్ వొదలినట్లు
నీలవజ్రంబులొకచోట నిలిచినట్లు
హరిహరాకృతి త్రిభువనాహ్లాదమయ్యె.

3. 1904లో ముద్రితమైన యీ ప్రశస్త కృతికి పునర్ముద్రణ మింత వఱకు లేదు. ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమీవారు ముద్రించుట కేర్పాట్లు చేసిరి కాని యది యింకను ప్రకటితము కాలేదు.

--Quoted in రత్నాకరము-Canto I[1]

1910 లో కవిగారు వ్రాసిన యీ వాక్యములు 1923 లో నీ గ్రంథ మాంధ్ర సాహిత్య పరిషత్తువారికి లభించినపుడు ప్రకటించుటకు కారణమైనది. వేములవాడ భీమకవి నరసింహ పురాణమును రచించెనని తొలుత తెలిపినది కవిగారే.[2]

## లఘుకృతులు-ఐరావతచరిత్ర

విస్మృత కవుల శీర్షిక క్రింద నీ పైకృతియు నచ్చులోనున్నట్లు వ్రాసిరిగాని కవిగారు ముద్రింపలేదు. కాని క్రి. శ. 1920 లో దానిని నొక పాఠ్యగ్రంథమున ముద్రించిరి[3]. ఇది యేకాశ్వాసకృతి.

## సంకలన గ్రంథశాఖ

ఈ శాఖాగ్రంథములనే గాక, తెలుగు సాహిత్యమున సంకలనశాఖ యను నొక సాహిత్య ప్రక్రియ యున్నట్లు తొలుత దెలిపినది కవిగారే. వారు-

1910 లో ప్రబంధమణిభూషణము

1923 లో సకలనీతిసమ్మతము

ప్రకటించిరి-నేడా గ్రంథములు తిరిగి విపుల పీఠికా పరిష్కరణములతో-ప్రకటితములైనవి.

కవిగారు జీవించియున్నప్పుడే-వారు ప్రచురించిన త్రిపురాంతకోదాహరణము, కుమారసంభవము, పరిష్కరించి వెలువరించు భాగ్యము నాకు గలిగినది-నేడు వారు యశఃకాయులైనను, పైరెండు గ్రంథములును-నా పీఠికా పరిష్కరణలతో వెలువడుట నాయదృష్టమని భావింతును.[4]

---

1. ఆ కాలమున నాంగ్లేయభాషలో పట్టభద్రులైన వారందఱును తెలుగునుగూర్చి వ్రాసినను నింగ్లీషులోనే వ్రాయుట పరిపాటి-ఆంధ్రభాషా చిత్త్వపారంగతులగు గిడుగు రామమూర్తి పంతులుగారు, తమ శబ్దరత్నాకర ప్రతిలో సవరణలు వివరణలు నాంగ్లేయ భాషలో కూడ వ్రాసిరి.

2. కుమారసంభవ ప్రథమభాగ పీఠిక 1908.

3. కవిగారు 1919-21 సంవత్సరములలో ప్రభుత్వమువారి మాధ్యమిక పాఠశాలా విరమణ పత్రపరీక్ష (Secondary School Leaving Certificate Examination) తెలుగు పాఠ్యగ్రంథమునకు సంపాదకులుగానుండిరి. అప్పుడు 1919 లో వారి కర్ణభారము (భాసనాటక కాంధ్రీకరణము), 1920 లో ఐరావత చరిత్ర ప్రకటించిరి.

4. దీని కంతకును హేతుభూతులైన డాక్టరు పోణంగి శ్రీ రామ అప్పారావు (పి. యస్. ఆర్. అప్పారావు)గారికి నా కృతజ్ఞత నిందుమూలముగా దెలుపుచున్నాను.

ప్రాచీనగ్రంథపరిష్కరణమున మానవల్లి రామకృష్ణకవి, వేటూరి ప్రభాకరశాస్త్రి గార్లకు వారసుడనగుట నా సాహిత్యజీవితమునందొక స్మరణీయఘట్టము.

ఆంధ్రవాఙ్మయచరిత్రమును అధునాతనయుగమున రూపొందించినవారిలో కవిగారు ప్రథములు-ప్రాచీనగ్రంథ ప్రకటనచేతనే గాక సారస్వత వ్యాసరచనముచేతను సాహిత్యవికాసమునకు సాహిత్యవిమర్శనకు వారెట్లు దోహదముచేసిరో, ఆ విషయము ప్రత్యేకముగా దెలుపబడును.

## వీరేశలింగముగారు-కవిగారు

వీరేశలింగముగారు ప్రాచీన గ్రంథములు ప్రకటించు సందర్భమున, కవిగారు భోజరాజీయము, వరాహపురాణము అను కృతుల తాళపత్ర గ్రంథముల నొసంగి వారికి తోడ్పడినదియు నీ వఱకే తెలిపితిని. ఇది క్రీ. శ. 1904 సంవత్సరము నాటి మాట. ఆ తరువాత మఱియు పదుమూడేండ్లకు క్రీ. శ. 1917 లో వీరేశలింగముగారు తమ ఆంధ్రకవులచరిత్ర ప్రథమభాగమును పెంపుచేసి ప్రకటించిరి. అందు క్రీ. శ. 1050 నుండి అనగా నన్నయ్య నుండి క్రీ.శ. 1500 ప్రాంతమున నున్న నందిమల్లయ ఘంటసింగయల వఱకు గల కవులను గూర్చిగలదు.

క్రీ. శ. 1917 జూలై నెలలో కవిగారును, శ్రీ ప్రభాకరశాస్త్రిగారును మదరాసు ప్రభుత్వమువారిచే నియమితులై, తాళపత్ర గ్రంథ సేకరణకై మా యింటికి వచ్చినారు. అప్పుడు మా తండ్రిగారు విశాఖపట్టణమున స్థానికసంఘమువారి వాస్తుశాస్త్రజ్ఞుని కచేరిలో గణకుడుగా[1] నుద్యోగము నందుండుటచే మేము విశాఖపట్టణములో నుండెడివారము. ఆయన అప్పటికి బక్కపలచగా నుండెడివారు.[2] కొనతేరిన ముక్కుతో, కుదురైన పలువరుసతో ఆకర్షణీయముగా ఉండేవారు. ఉద్యోగరీత్యా, పంచె, జుబ్బా, పైనకోటు ధరించి, పైన ఒక చిన్న రుమాలు వేసికొనేవారు. ఆ కాలమున ఆయనకు కడుపునొప్పి బాధయుండెడిది. అందువలన ఎప్పుడూ రొంటిని 'సోడా' పొట్లముండెడిది. అప్పుడప్పుడది విప్పి కొంచెము కొంచెము నోటిలోవేసికొనెడివారు.

కవిగారప్పుడే ప్రకటితమై, తమకు పంపిన వీరేశలింగంగారి కవులచరిత్ర ప్రథమ భాగాన్ని మా తండ్రిగారికిచ్చి, పీఠిక చదువమన్నారు. ఆ పీఠికలో కవిగారిని గూర్చి వీరేశలింగముగారిట్లు వ్రాసినారు - "పూర్వము నాకు భోజరాజీయాదికృతులను తెచ్చి యిచ్చిన మానవల్లి రామకృష్ణకవిగారు నా యీ కవిచరిత్ర ముద్రణకు నెంతయో సహాయము చేయుదురని యాశించితినిగాని నా యాశలన్నియు నిరాశలైనవి." కవిగారు-

---

1. District Board Engineer's office Accountant.

2. వారి కరువదేండ్లయిన తరువాత శరీరము కొంచెము స్థూలమైనది. వయస్సుతో శరీరచ్ఛాయ తగ్గినది.

"చూచితిరా సుందరం పంతులుగారూ! నాకు వారు తమకవుల చరిత్ర ప్రథమభాగము తిరిగి నూతన విశేషములతో ప్రకటించుచున్నామని వ్రాసినప్పుడు, నేను మలబారు ప్రాంతములో సంస్కృత తాళపత్ర సంశోధనకై ప్రభుత్వము వారిచే నియమితుడనై రెండేండ్లుగా నచ్చట నుండిపోవలసి వచ్చినది. అందుచేత నేను వారికి సహాయము చేయలేకపోయినాను - ఆ విషయమును వారి కెంతో వినయముతో విన్నవించినా, వారిట్లు వ్రాసినారు" అని యెంతో బాధపడుచు మాతండ్రిగారితో అన్నారు. వీరేశలింగముగారు, "కవిగారు కార్యాంతర వ్యగ్రులై నాకు సహాయము చేయలేకపోయినారు. వారి తోడ్పాటున్నచో నా గ్రంథ మింకను ప్రామాణికముగా నుండెడిది" అని వ్రాసియుండవలసినది. అందుకు వారు బాధపడలేదు. ఆ కాలమున నింకను, ప్రభుత్వములో తెలుగునుగూర్చి వీరేశలింగముగారి అధికారమే చెల్లుచుండెడిది. తాను ప్రభుత్వోద్యోగి యగుటచేత వీరేశలింగముగారి వ్రాతవలన తనకేమియైనా హాని కలుగునేమోయని యీ విషయమంతగా వారు పట్టించుకొనలేదు. వీరేశలింగము పంతులుగారి గ్రంథము "సహస్ర దోష జుష్ట"మని, మడికి సింగన వాణసబ్రాహ్మణ వంశీయునిగా చెప్పిన గన్నమంత్రిని వీరేశలింగముగారు నాగయగన్నడను చతుర్థకులజునిగా పొరబడిరని చూపుచు-ఆగ్రంథము మా తండ్రిగారి కిచ్చివేసిరి.

## ఆంధ్రభాషలో రాజకవులు

కవిగారు తొలినుండియు, వీరేశలింగముపంతులుగారి కవుల చరిత్రలోలేని కవుల గుఱించియే పరిశ్రమచేసి, వాఙ్మయచరిత్రమున కనవద్యమును, సద్భుతమును నైన సేవచేసిరి. తెలుగు కవులనుగూర్చి కావ్యములనుగూర్చి వారుచేసిన పరిశోధన యంతయు మౌలికమే. వారు క్రీ. శ. 1910 లో "రాజకవులు" అన్న వ్యాసము వ్రాసియున్నారు.[1] అందు వారు నన్నెచోడునినుండి, కదిరీపతి నాయకుని వఱకు గల రాజకవులనుగూర్చి తెలిపినారు. ఆ వ్యాసములో వారు సాయపు వేంకటపతి (ముకుందమాల కర్త), కట్టా వరదరాజు మొదలగువారినిగూర్చి వ్రాసిరి. వారా నాడు కనిపెట్టిన గ్రంథములు, మఱి నలుబదేబడేండ్లు గడచినతరువాత వెలుగుచూచినవన్నచో, వారి మౌలికమైన శ్రమ యెట్టిదో మన మూహింపవచ్చును - పై వానిలో సాయపు వేంకటపతి గ్రంథము ముద్రణ భాగ్యము నందలేదు. కట్టా వరదరాజు ద్విపద రామాయణము క్రీ. శ. 1950 లో నా సంపాదకత్వము క్రింద నాల్గు సంపుటములుగా ప్రకటితమైనది.[2] కట్టా వరదరాజ

---

1. అది ఆంధ్రపత్రిక ప్రథమసంవత్సరాది సంచికయందు (1909) ప్రకటితమైనది. ఇప్పుడు ఈ వ్యాససంపుటములో పునర్ముద్రణమందినది.

2. మదరాసు ప్రభుత్వమువారిచే తంజావూరి సరస్వతీ మహలు గ్రంథాలయము వారి పక్షమున ప్రకటితమైనది.

ప్రాచీనగ్రంథపరిష్కరణమున మానవల్లి రామకృష్ణకవి, వేటూరి ప్రభాకరశాస్త్రి గార్లకు వారసుడనగుట నా సాహిత్యజీవితమునందొక స్మరణీయఘట్టము.

ఆంధ్రవాఙ్మయచరిత్రమును అధునాతనయుగమున రూపొందించినవారిలో కవి గారు ప్రథములు-ప్రాచీనగ్రంథ ప్రకటనచేతనే గాక సారస్వత వ్యాసరచనముచేతను సాహిత్యవికాసమునకు సాహిత్యవిమర్శనకు వారెట్లు దోహదముచేసిరో, ఆ విషయము ప్రత్యేకముగా దెలుపబడును.

## వీరేశలింగముగారు-కవిగారు

వీరేశలింగముగారు ప్రాచీన గ్రంథములు ప్రకటించు సందర్భమున, కవిగారు భోజరాజీయము, వరాహపురాణము అను కృతుల తాళపత్ర గ్రంథముల నొసంగి వారికి తోడ్పడినదియు నీ వఱకే తెలిపితిని. ఇది క్రీ. శ. 1904 సంవత్సరము నాటి మాట. ఆ తరువాత మఱియు పదుమూడేండ్లకు క్రీ. శ. 1917 లో వీరేశలింగముగారు తమ ఆంధ్రకవులచరిత్ర ప్రథమభాగమును పెంపుచేసి ప్రకటించిరి. అందు క్రీ. శ. 1050 నుండి అనగా నన్నయ్య నుండి క్రి.శ. 1500 ప్రాంతమువఱకున్న నందిమల్లయ ఘంటసింగ యలవఱకు గల కవులను గూర్చిగలదు.

క్రీ. శ. 1917 జూలై నెలలో కవిగారును, శ్రీ ప్రభాకరశాస్త్రిగారును మదరాసు ప్రభుత్వమువారిచే నియమితులై, తాళపత్ర గ్రంథ సేకరణకై మా యింటికి వచ్చినారు. అప్పుడు మా తండ్రిగారు విశాఖపట్టణమున స్థానికసంఘమువారి వాస్తుశాస్త్రజ్ఞుని కచేరిలో గణకుడుగా[1] నుద్యోగము నందుండుటచే మేము విశాఖపట్టణములో నుండెడివారము. ఆయన అప్పటికి బక్కపలచగా నుండెడివారు.[2] కొనతేరిన ముక్కుతో, కుదురైన పలువరుసతో ఆకర్షణీయముగా ఉండేవారు. ఉద్యోగరీత్యా, పంచె, జుబ్బా, పైనకోటు ధరించి, పైన ఒక చిన్న రుమాలు వేసికొనేవారు. ఆ కాలమున ఆయనకు కడుపునొప్పి బాధయుండెడిది. అందువలన ఎప్పుడూ రొంటిని 'సోడా' పొట్లముండెడిది. అప్పుడప్పుడది విప్పి కొంచెము కొంచెము నోటిలోవేసికొనెడివారు.

కవిగారప్పుడే ప్రకటితమై, తమకు పంపిన వీరేశలింగంగారి కవులచరిత్ర ప్రథమ భాగాన్ని మా తండ్రిగారికిచ్చి, పీఠిక చదువమన్నారు. ఆ పీఠికలో కవిగారిని గూర్చి వీరేశలింగముగారిట్లు వ్రాసినారు – "పూర్వము నాకు భోజరాజీయాదికృతులను తెచ్చి యిచ్చిన మానవల్లి రామకృష్ణకవిగారు నా యీ కవిచరిత్ర ముద్రణకు నెంతయో సహాయము చేయుదురని యాశించితినిగాని నా యాశలన్నియు నిరాశలైనవి." కవిగారు-

---

1. District Board Engineer's office Accountant.

2. వారి కరువదేండ్లయిన తరువాత శరీరము కొంచెము స్థూలమైనది. వయస్సుతో శరీరచ్ఛాయ తగ్గినది.

"చూచితిరా సుందరం పంతులుగారూ! నాకు వారు తమకవుల చరిత్ర ప్రథమభాగము తిరిగి నూతన విశేషములతో ప్రకటించుచున్నామని వ్రాసినప్పుడు, నేను మలబారు ప్రాంతములో సంస్కృత తాళపత్ర సంశోధనకై ప్రభుత్వము వారిచే నియమితుడనై రెండేండ్లుగా నచ్చట నుండిపోవలసి వచ్చినది. అందుచేత నేను వారికి సహాయము చేయలేకపోయినాను - ఆ విషయమును వారి కెంతో వినయముతో విన్నవించినా, వారిట్లు వ్రాసినారు" అని యెంతో బాధపడుచు మాతండ్రిగారితో అన్నారు. వీరేశలింగముగారు, "కవిగారు కార్యాంతర వ్యగ్రులై నాకు సహాయము చేయలేకపోయినారు. వారి తోడ్పాటున్నచో నా గ్రంథ మింకను ప్రామాణికముగా నుండెడిది" అని వ్రాసియుండవలసినది. అందుకు వారు బాధపడలేదు. ఆ కాలమున నింకను, ప్రభుత్వములో తెలుగునుగూర్చి వీరేశలింగముగారి అధికారమే చెల్లుచుండెడిది. తాను ప్రభుత్వోద్యోగి యగుటచేత వీరేశలింగముగారి వ్రాతవలన తనకేమియైనా హాని కలుగునేమోయని యీ విషయమంతగా వారు పట్టించుకొనలేదు. వీరేశలింగము పంతులుగారి గ్రంథము "సహస్ర దోష జుష్ట"మని, మడికి సింగన వాణసబ్రాహ్మణ వంశీయునిగా చెప్పిన గన్నమంత్రిని వీరేశలింగముగారు నాగయగన్నడను చతుర్థకులజునిగా పొరబడిరని చూపుచు-ఆగ్రంథము మా తండ్రిగారి కిచ్చివేసిరి.

## ఆంధ్రభాషలో రాజకవులు

కవిగారు తొలినుండియు, వీరేశలింగముపంతులుగారి కవుల చరిత్రలోలేని కవుల గుఱించియే పరిశ్రమచేసి, వాఙ్మయచరిత్రమున కనవద్యమును, నద్భుతమును నైన సేవచేసిరి. తెలుగు కవులనుగూర్చి కావ్యములనుగూర్చి వారుచేసిన పరిశోధన యంతయు మౌలికమే. వారు క్రీ. శ. 1910 లో "రాజకవులు" అన్న వ్యాసము వ్రాసియున్నారు.[1] అందు వారు నన్నెచోడునినుండి, కదిరీపతి నాయకుని వఱకుగల రాజకవులనుగూర్చి తెలిపినారు. ఆ వ్యాసములో వారు సాయప వేంకటపతి (ముకుందమాల కర్త), కట్టా వరదరాజు మొదలగువారినిగూర్చి వ్రాసిరి. వారా నాడు కనిపెట్టిన గ్రంథములు, మఱి నలుబదేబదేండ్లు గడచినతరువాత వెలుగుచూచినవన్నచో, వారి మౌలికమైన శ్రమ యెట్టిదో మన మూహింపవచ్చును - పై వానిలో సాయప వేంకటపతి గ్రంథము ముద్రణ భాగ్యము నందలేదు. కట్టా వరదరాజు ద్విపద రామాయణము క్రీ. శ. 1950 లో నా సంపాదకత్వము క్రింద నాల్గు సంపుటములుగా ప్రకటితమైనది.[2] కట్టా వరదరాజు

1. అది ఆంధ్రపత్రిక ప్రథమసంవత్సరాది సంచికయందు (1909) ప్రకటితమైనది. ఇప్పుడు ఈ వ్యాససంపుటములో పునర్ముద్రణమందినది.

2. మదరాసు ప్రభుత్వమువారిచే తంజావూరి సరస్వతీ మహలు గ్రంథాలయము వారి పక్షమున ప్రకటితమైనది.

కవినిగూర్చి లోకమునకు తొలుత [తెలియజేసినవారు] కవిగారే. [illegible] శ్రీరంగ మాహాత్మ్యము కవిగారి మూలముననే - 1921లో ప్రకటితమైనది.

వారీవ్యాసమున కేవలము కవులు, కాలములు, కావ్యములను గూర్చియేగాక-కొన్ని నూత్నాంశములను వెల్లడిచేసినారు - ఆముక్తమాల్యద కృష్ణరాయలు రచించలేదని, వైష్ణవము పుచ్చుకొన్న యొక వైష్ణవు డెవ్వడో రచించెనని మొదట ప్రతిపాదించినవారు కవిగారే. తంజావూరి రఘునాథునిగూర్చి వ్రాయుచు - "రసవత్కవి యగు రఘునాథ నాయకుకు రామభద్రాంబ, మధురవాణి, మోహిని మొదలగు నేబదియార్గురు వెలయాండ్ర నడుమ జిక్కి మలీమసు"డయ్యెనని తన యభిప్రాయము దెలిపిరి.

ఈనాడెందఱో రాజకవులు మనకు కన్పట్టుచున్నారు. కాని, "ఆంధ్రభాషలో రాజకవులు" అన్న పేరుతో నింతవఱకు నే విశ్వవిద్యాలయములలోను పరిశోధన ప్రారంభమే కాలేదు.

## తెనాలి కవులు

క్రీ. శ. 1915 సంవత్సరాది సంచికలో కవిగారు "తెనాలి కవులు" అన్నవ్యాసము వ్రాసిరి. తెనాలి రామకృష్ణుని గూర్చియే గాక, తెనాలి వంశకవులగు తెనాలి అన్నియ్య, తెనాలి రామభద్రకవిని గూర్చి వారి గ్రంథములనుగూర్చి ప్రథమముగా దెలిపిన సాధికార వ్యాసమిది. ఇందు రామకృష్ణుని గ్రంథరచనా పౌర్వాపర్యము చక్కగా విశదీకరింప బడినది. రామకృష్ణుడు హరిలీలావిలాసము, కందర్పకేతువిలాసము - అను రెండు ప్రబంధములను రచించెనని మొదట తెలిపినవారు కవిగారే. రామకృష్ణుని గ్రంథములు- పాండురంగ మాహాత్మ్యము, ఘటికాచల మాహాత్మ్యమును నీనాడు సుపరిష్కృతములై ముద్రితములైనవి కాని యొకదానియందును పై వాని ప్రస్తావనలేదు.

## పుష్పాంజలి - వసుచరిత్ర

క్రీ. శ. 1916 లో సంవత్సరాది సంచికనుండి కవిగారు - పై శీర్షికతో వ్యాసములు వ్రాయనారంభించిరి. ఈ మొదటి పుష్పాంజలి వ్యాసములో - సంస్కృతములో వసుచరిత్ర యున్నదనియు, నది రామరాజ భూషణుని తెలుగు వసుచరిత్ర కనువాదమనియు, తెలుగులో సంస్కృతమునుండి యనువాదములే యుండగా, తెలుగుకావ్యము - సంస్కృతములోని కనువదింపబడుట విశేషమనియు, మొదటిసారిగా ప్రకటించిరి. సంస్కృత భాషలోనికే గాక, వసుచరిత్రకు తమిళభాషలో అనువాదమున్నదని మొదట తెలిపినవారు కూడ కవిగారే.1 మఱి నలుబదేండ్ల తర్వాత "వసుచరిత్ర-ద్రావిడానువాదము" అను వ్యాస

---

1. ఈ విషయము వారంతకు రెండేండ్లు ముందుగానే - క్రీ.శ. 1914లో కుమార సంభవ ద్వితీయభాగముద్రణ పీఠిక 8వ పుటలో నిట్లు దెలిపినారు - తిమ్మన తిక్కనభారతము కన్నడించుకొనెను. వసుచరిత్ర ద్రవిడసంస్కృతములలోని కనువదింపబడెనుగదా.

మును 'వేంకటేశ్వరప్రాచ్య పరిశోధన పత్రిక'యందు ప్రకటించిరి. మఱి ఏఁబదేండ్లయిన తరువాత వారు తెలిపిన గ్రంథములు - వసుచరిత్ర సంస్కృత ద్రావిడానువాదములు రెండును ముద్రితములైనవి.[1]

## పుష్పాంజలి - ఉదయనోదయము

భారతిలో-పుష్పాంజలి శీర్షికలో నిదివఱకు కవిచరిత్ర కెక్కని ప్రబంధములను గూర్చి తెలిపిరి. వానిలో ఉదయనోదయ మొకటి. ఇది నారన సూరన విరచితము. క్రీ. శ. 1500కు పూర్వమిది - ఈ ప్రశస్తకృతి యింతవఱకును ముద్రితము గాలేదు. దీనినిగూర్చి ప్రబంధమణిభూషణ పీఠికలో విశేషించి తెలిపియున్నాను- క్రీ.శ. 1935లో తంజావూరి తెలుగు పుస్తకముల గ్రంథసూచిక ప్రకటితమగువఱకు నిది ఆ పుస్తక శాలలో నున్నదెవ్వరికిని తెలియదు. ఈ ప్రబంధ వైశిష్ట్యము మొదట తెలిపినది కవిగారే.

## పుష్పాంజలి - చారులీలావిలాసము

పుష్పాంజలి శీర్షిక వ్యాసములలో కవిగారు తెలిపిన మఱియొక అపూర్వకృతి చారులీలావిలాసము - మారుపెద్ది చెంగల్వరాయ కవి రచితము. ఇది కళాపూర్ణోదయము వంటి యద్భుత కథాసంవిధానము గల గ్రంథము. నాయిక పురుషుడుగా మారిపోవుట తిరిగి స్త్రీ యగుట మొదలగు నద్భుత సన్నివేశము లిందు గలవు. ఇది యసంపూర్ణముగ నున్నను ముద్రింపదగినది.2

## పత్రికలు - ప్రబంధ ప్రకటన

కవిగారు సొంతముగానే కాక పత్రికలమూలమున ప్రాచీన ప్రబంధములను ప్రకటించిరి.

---

1. సంస్కృత వసుచరిత్ర కాళహస్తి కవికృతము. డాక్టరు బి. రామరాజుగారిచే ప్రకటితము.

వసుచరిత్ర తమిళానువాదము మదరాసు ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారమువారు ప్రకటించిరి.

ఈ సంస్కృత ద్రవిడానువాదములు ప్రకటితములు కాకపూర్వమే నేను నా వసుచరిత్ర చతుర్థముద్రణ పీఠికలో పైవాని వివరములిచ్చినాడను. అది వావిళ్ల వారిచేత ప్రకటితము. వసుచరిత్రలో కొంత భాగ మాంగ్లేయభాషలో పద్యములతో ననుపదింపబడినదని మొదటిపర్యాయము తెలిపినాను.

2. దక్షిణదేశీయాంధ్రవాఙ్మయము-పుటలు-510-12.

కవినిగూర్చి లోకమునకు తొలుత నెఱుకపఱచినవారు కవిగారే. వరదరాజు శ్రీరంగ మాహాత్మ్యము కవిగారి మూలముననే - 1921లో ప్రకటితమైనది.

వారీవ్యాసమున కేవలము కవులు, కాలములు, కావ్యములను గూర్చియేకాక - కొన్ని నూత్నాంశములను వెల్లడిచేసినారు - ఆముక్తమాల్యద కృష్ణరాయలు రచించలేదని, వైష్ణవము పుచ్చుకొన్న యొక వైష్ణవు డెవ్వడో రచించెనని మొదట ప్రతిపాదించినవారు కవిగారే. తంజావూరి రఘునాథునిగూర్చి వ్రాయుచు - "రసవత్కవి యగు రఘునాథ నాయకుడు రామభద్రాంబ, మధురవాణి, మోహిని మొదలగు నేబదియాఱుగురు వెలయాండ్ర నడుమ జిక్కి మలీమసు"డయ్యెనని తన యభిప్రాయము దెలిపిరి.

ఈనా డెందఱో రాజకవులు మనకు కన్పట్టుచున్నారు. కాని, "ఆంధ్రభాషలో రాజకవులు" అన్న పేరుతో నింతవఱకు నే విశ్వవిద్యాలయములలోను పరిశోధన ప్రారంభమే కాలేదు.

## తెనాలి కవులు

క్రీ. శ. 1915 సంవత్సరాది సంచికలో కవిగారు "తెనాలి కవులు" అన్నవ్యాసము వ్రాసిరి. తెనాలి రామకృష్ణుని గూర్చియే గాక, తెనాలి వంశకవులగు తెనాలి అన్నయ్య, తెనాలి రామభద్రకవిని గూర్చి వారి గ్రంథములనుగూర్చి ప్రథమముగా దెలిపిన సాధికార వ్యాసమిది. ఇందు రామకృష్ణుని గ్రంథరచనా పౌర్వాపర్యము చక్కగా విశదీకరింపబడినది. రామకృష్ణుడు హరిలీలావిలాసము, కందర్పకేతువిలాసము - అను రెండు ప్రబంధములను రచించెనని మొదట తెలిపినవారు కవిగారే. రామకృష్ణుని గ్రంథములు- పాండురంగ మాహాత్మ్యము, ఘటికాచల మాహాత్మ్యమును నీనాడు సంస్కరిష్కృతములై ముద్రితములైనవి కాని యొకదానియందును పై వాని ప్రస్తావనలేదు.

## పుష్పాంజలి - వసుచరిత్ర

క్రీ. శ. 1916 లో సంవత్సరాది సంచికనుండి కవిగారు - పై శీర్షికతో వ్యాసములు వ్రాయనారంభించిరి. ఈ మొదటి పుష్పాంజలి వ్యాసములో - సంస్కృతములో వసుచరిత్ర యున్నదనియు, నది రామరాజ భూషణుని తెలుగు వసుచరిత్ర కనువాదమనియు, తెలుగులో సంస్కృతమునుండి యనువాదములే యుండగా, తెలుగుకావ్యము - సంస్కృతములోని కనువదింపబడుట విశేషమనియు, మొదటిసారిగా ప్రకటించిరి. సంస్కృత భాషలోనికే గాక, వసుచరిత్రకు తమిళభాషలో అనువాదమున్నదని మొదట తెలిపినవారు కూడ కవిగారే.[1] మఱి నలుబదేండ్లతర్వాత "వసుచరిత్ర-ద్రావిడానువాదము" అను వ్యాస

1. ఈ విషయము వారంతకు రెండేండ్లు ముందుగానే - క్రీ.శ. 1914లో కుమార సంభవ ద్వితీయభాగముద్రణ పీఠిక 8వ పుటలో నిట్లు దెలిపినారు - తిమ్మన తిక్కనభారతము కన్నడించుకొనెను. వసుచరిత్ర ద్రవిడసంస్కృతములలోని కనువదింపబడెనుగదా.

మును 'వేంకటేశ్వరప్రాచ్య పరిశోధన పత్రిక'యందు ప్రకటించిరి. మఱి ఏబదేండ్లయిన తరువాత వారు తెలిపిన గ్రంథములు - వసుచరిత్ర సంస్కృత ద్రావిడానువాదములు రెండును ముద్రితములైనవి.[1]

## పుష్పాంజలి - ఉదయనోదయము

భారతిలో-పుష్పాంజలి శీర్షికలో నిదివఱకు కవిచరిత్ర కెక్కని ప్రబంధములను గూర్చి తెలిపిరి. వానిలో ఉదయనోదయ మొకటి. ఇది నారన సూరన విరచితము. క్రీ. శ. 1500కు పూర్వముది - ఈ ప్రశస్తకృతి యింతవఱకును ముద్రితము గాలేదు. దీనినిగూర్చి ప్రబంధమణిభూషణ పీఠికలో విశేషించి తెలిపియున్నాను- క్రీ.శ. 1935లో తంజావూరి తెలుగు పుస్తకముల గ్రంథసూచిక ప్రకటితమగువఱకు నిది ఆ పుస్తక శాలలో నున్నట్లెవ్వరికిని తెలియదు. ఈ ప్రబంధ వైశిష్ట్యము మొదట తెలిపినది కవిగారే.

## పుష్పాంజలి - చారులీలావిలాసము

పుష్పాంజలి శీర్షిక వ్యాసములలో కవిగారు తెలిపిన మఱియొక అపూర్వకృతి చారులీలావిలాసము - మారుపెద్ది చెంగల్వరాయ కవి రచితము. ఇది కళాపూర్ణోదయము వంటి యద్భుత కథాసంవిధానము గల గ్రంథము. నాయిక పురుషుడుగా మారిపోవుట తిరిగి స్త్రీ యగుట మొదలగు నద్భుత సన్నివేశము లిందు గలవు. ఇది యసంపూర్ణముగ నున్నను ముద్రింపదగినది.2

## పత్రికలు - ప్రబంధ ప్రకటన

కవిగారు సొంతముగానే కాక పత్రికలమూలమున ప్రాచీన ప్రబంధములను ప్రకటించిరి.

---

1. సంస్కృత వసుచరిత్ర కాళహస్తి కవికృతము. డాక్టరు బి. రామరాజుగారిచే ప్రకటితము.

వసుచరిత్ర తమిళానువాదము మదరాసు ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారమువారు ప్రకటించిరి.

ఈ సంస్కృత ద్రవిడానువాదములు ప్రకటితములు కాకపూర్వమే నేను నా వసుచరిత్ర చతుర్థముద్రణ పీఠికలో పైవాని వివరములిచ్చినాడను. అది వావిళ్ల వారిచేత ప్రకటితము. వసుచరిత్రలో కొంత భాగ మాంగ్లేయభాషలో పద్యములతో ననువదింపబడినదని మొదటిపర్యాయము తెలిపినాను.

2. దక్షిణదేశీయాంధ్రవాఙ్మయము-పుటలు-510-12.

## వాల్మీకి చరిత్ర

తంజావూరి రఘునాథనాయకుని కృతియగు వాల్మీకి చరిత్రమును తొలుత బయట పెట్టినది కవిగారే. వారీకావ్యమును తంజావూరి గ్రంథాలయమునుండి ప్రతి వ్రాసి - క్రీ. శ. 1911లో కొచ్చెర్లకోట రామచంద్ర వేంకట కృష్ణారావు (పోలవరం జమీందారు) గారి "సరస్వతి" పత్రికలో ప్రకటించిరి. ఆ తరువాత నది పునర్ముద్రణ భాగ్యము నందినది.[1]

## రఘునాథ రామాయణము

తంజావూరి రఘునాథుని రామాయణము నాంధ్రలోక మెఱుగదు. కవిగారు తంజావూరి పుస్తకభాండాగారములో దీనినిగుర్తించి ప్రతి వ్రాసి ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రికలో ప్రకటింపజేసినారు. దీని మూల తాళపత్ర ప్రతి ప్రస్తుతము తంజావూరి గ్రంథ సూచికలో లేదు.

## కవి గజాంకుశము

భైరవకవి కృతమగు, కవిగజాంకుశమను ఛందోలక్షణ గ్రంథమును - మొదట ప్రకాశమాన మొనర్చినది కవిగారే. దీని ప్రతి తంజావూరిలో గలదు. కవిగారు పై పత్రికలోనే దీనిని ప్రచురింపజేసిరి.

## శుకసప్తతి

పై పత్రికలోనే-శుకసప్తతి ప్రబంధమునకు చారిత్రకముగా విలువగల యవతారికా భాగమును సంపాదించి ప్రకటింపజేసిరి.

## దండకశాఖ-విద్యావతీ దండకము

కవిగా రుదాహరణశాఖలో త్రిపురాంతకోదాహరణమును గూర్చియే గాక దండక శాఖలోని విద్యావతీదండకమునుగూర్చి మొదట తెలిపినారు. క్రీ. శ. 1912 లో వారి శ్రీరంగమహత్త్వ పీఠికలో నిట్లు వ్రాసియున్నారు - "మఱియుఁ బాండ్య భూపాలుండగు మద్దళగిరి భూపాలునకు విద్యావతీదండకమును రచించిన ప్రఖ్యాతుఁడు గణపవరపు వేంకటకవి భైరవునిఁ బేర్కొనెను" (పుట i). దీనిని మఱి 38 యేండ్లతరువాత పరిష్కరించి ప్రకటించు భాగ్యము నాకు గలిగినది.[2] ఈ దండక ప్రకటనమూలమున నంతకు ముందు క్రీ. శ. 1750 ప్రాంతమువా డనుకొనబడుచున్న గణపరపు వేంకటకవికాలము క్రీ. శ. 1674 ప్రాంతమని నిశ్చితమైనది.

---

1. ఈ వాల్మీకి చరిత్రమును నేను, తిరిగి పరిష్కరించి, విశేష విషయ విలసితమగు పీఠికతో-1940లో, విజయనగరమున ఆంధ్ర విజ్ఞాన సమితి గ్రంథమాలలో ప్రకటింపజేసితిని-ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమీవారు దీనిని తిరిగి ప్రకటించినారు.

2. Bulletin of the Madras Government Oriental Manuscripts Library - Vol. 1. No. 1. 1950.

## శతకశాఖ-తరిగొండ నృసింహాశతకము

ప్రసిద్ధకవయిత్రి తరిగొండ వెంగమాంబ కృతులను కవిగారు కొన్నిసంపాదించిరి. వానిలో తరిగొండ నృసింహాశతక మొకటి - ఇది చంపకోత్పలమాలికలలో నున్నది. తరిగొండ నృసింహదయాపయోనిధీ" అను మకుటముగలది. దీనిని వారు శ్రీవేంకటేశ్వర పరిశోధనా సంస్థ పత్రికలో ప్రకటించిరి.1

## వచనశాఖ-బృహజ్జాతకము

తెనుగుభాషలో మొదటి వచన గ్రంథమగు విష్ణువర్ధన మంత్రి బృహజ్జాతకమును గూర్చి మొదట తెలిపినవారు కవిగారే-ఈ గ్రంథ మింకను నముద్రితము.2

## కవుల చరిత్రలు

ఇట్లు గ్రంథములను గూర్చియేగాక మన మంతకుముందెఱుగని కవుల చరిత్రలను తొలుత దెలిపినవాడు కవిగారే.

## ఎలకూచి వేంకటకృష్ణరాయడు

ఆంధ్రశబ్దచింతామణికి తెలుగుటీక వ్రాసిన ఎలకూచి బాలసరస్వతి సమస్తాంధ్ర పండితలోకమునకు పరిచితుడు. కాని "బాలసరస్వతి" యనునది బిరుదము - అతని అసలుపేరు-వేంకటకృష్ణరాయడు.

## అమృతకవి త్రిపురారికవి

ఈతడే ఐరావత చరిత్ర కృతి రచయిత.3

## మల్లారెడ్డి

ఈతడు శివధర్మోత్తరఖండమను ప్రబంధమును రచించిన బిక్కనవోలు సంస్థానాధీశ్వరుడు. ఈతడే షట్చక్రవర్తి చరిత్రమును రచించిన రాజకవి.

పై ముగ్గురను గూర్చిన విశేషము లింతవఱకు నే కవిచరిత్రలలోనూ లేవు. కొంతమంది కవుల చరిత్రలు వీరేశలింగముగారి కవిచరిత్రలందున్నవి - కాని వానిని గూర్చి విశేషవిషయములందు చేర్పదగినవి తెలిపినది కవిగారే.

---

1. తరిగొండ వెంగమాంబను గూర్చిన గ్రంథములు - ఆంధ్ర కవయిత్రులు మొదలగువానియం దెచ్చటను పై శతకప్రశంస కానరాదు.

2. తెలుగు కవుల చరిత్ర - పుట 179-180.

3. ఈతనిగూర్చి కవిగారు శ్రీ వేంకటేశ్వర ప్రాచ్యపరిశోధనాసంస్థ పత్రికలో వ్రాసిరి.

## వాల్మీకి చరిత్ర

తంజావూరి రఘునాథనాయకుని కృతియగు వాల్మీకి చరిత్రమును తొలుత బయట పెట్టినది కవిగారే. వారీకావ్యమును తంజావూరి గ్రంథాలయమునుండి ప్రతి వ్రాసి — క్రీ. శ. 1911లో కొచ్చెర్లకోట రామచంద్ర వేంకట కృష్ణారావు (పోలవరం జమీందారు) గారి "సరస్వతి" పత్రికలో ప్రకటించిరి. ఆ తరువాత నది పునర్ముద్రణ భాగ్యము నందినది.[1]

## రఘునాథ రామాయణము

తంజావూరి రఘునాథుని రామాయణము నాంధ్రలోక మెఱుగదు. కవిగారు తంజావూరి పుస్తకభాండాగారములో దీనినిగుర్తించి ప్రతి వ్రాసి ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రికలో ప్రకటింపజేసినారు. దీని మూల తాళపత్ర ప్రతి ప్రస్తుతము తంజావూరి గ్రంథ సూచికలో లేదు.

## కవి గజాంకుశము

భైరవకవి కృతమగు, కవిగజాంకుశమను ఛందోలక్షణ గ్రంథమును — మొదట ప్రకాశమాన మొనర్చినది కవిగారే. దీని ప్రతి తంజావూరిలో గలదు. కవిగారు పై పత్రికలోనే దీనిని ప్రచురింపజేసిరి.

## శుకసప్తతి

పై పత్రికలోనే-శుకసప్తతి ప్రబంధమునకు చారిత్రకముగా విలువగల యవతారికా భాగమును సంపాదించి ప్రకటింపజేసిరి.

## దండకశాఖ-విద్యావతీ దండకము

కవిగా రుదాహరణశాఖలో త్రిపురాంతకోదాహరణమును గూర్చియే గాక దండక శాఖలోని విద్యావతీదండకమునుగూర్చి మొదట తెలిపినారు. క్రీ. శ. 1912 లో వారి శ్రీరంగమహాత్త్వ పీఠికలో నిట్లు వ్రాసియున్నారు - "మఱియుఁ బాండ్య భూపాలుండగు మద్దళగిరి భూపాలునకు విద్యావతీదండకమును రచించిన ప్రఖ్యాతుఁడు గణపవరపు వేంకటకవి భైరవునిఁ బేర్కొనెను" (పుట i). దీనిని మఱి 38 యేండ్లతరువాత పరిష్కరించి ప్రకటించు భాగ్యము నాకు గలిగినది.[2] ఈ దండక ప్రకటనమూలమున నంతకు ముందు క్రి. శ. 1750 ప్రాంతమువా డనుకొనబడుచున్న గణపరపు వేంకటకవికాలము క్రీ. శ. 1674 ప్రాంతమని నిశ్చితమైనది.

---

1. ఈ వాల్మీకి చరిత్రమును నేను, తిరిగి పరిష్కరించి, విశేష విషయ విలసితమగు పీఠికతో-1940లో, విజయనగరమున ఆంధ్ర విజ్ఞాన సమితి గ్రంథమాలలో ప్రకటింపజేసితిని-ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమీవారు దీనిని తిరిగి ప్రకటించినారు.

2. Bulletin of the Madras Government Oriental Manuscripts Library.- Vol. 1. No. 1. 1950.

## శతకశాఖ-తరిగొండ నృసింహశతకము

ప్రసిద్ధకవయిత్రి తరిగొండ వెంగమాంబ కృతులను కవిగారు కొన్నిసంపాదించిరి. వానిలో తరిగొండ నృసింహశతక మొకటి - ఇది చంపకోత్పలమాలికలలో నున్నది. తరిగొండ నృసింహదయాపయోనిధీ'' అను మకుటముగలది. దీనిని వారు శ్రీవేంకటేశ్వర పరిశోధనా సంస్థ పత్రికలో ప్రకటించిరి.[1]

## వచనశాఖ-బృహజ్జాతకము

తెనుగుభాషలో మొదటి వచన గ్రంథమగు విష్ణువర్ధన మంత్రి బృహజ్జాతకమును గూర్చి మొదట తెలిపినవారు కవిగారే-ఈ గ్రంథ మింకను నముద్రితము.[2]

## కవుల చరిత్రలు

ఇట్లు గ్రంథములను గూర్చియేగాక మన మంతకుముందెఱుగని కవుల చరిత్రలను తొలుత దెలిపినవారు కవిగారే.

## ఎలకూచి వేంకటకృష్ణరాయడు

ఆంధ్రశబ్దచింతామణికి తెలుగుటీక వ్రాసిన ఎలకూచి బాలసరస్వతి సమస్తాంధ్ర పండితలోకమునకు పరిచితుడు. కాని ''బాలసరస్వతి'' యనునది బిరుదము - అతని అసలుపేరు-వేంకటకృష్ణరాయడు.

## అమృతకవి త్రిపురారికవి

ఈతడే ఐరావత చరిత్ర కృతి రచయిత.[3]

## మల్లారెడ్డి

ఈతడు శివధర్మోత్తరఖండమను ప్రబంధమును రచించిన బిక్కనవోలు సంస్థానాధీశ్వరుడు. ఈతడే షట్చక్రవర్తి చరిత్రమును రచించిన రాజకవి.

పై ముగ్గురను గూర్చిన విశేషము లింతవఱకు నే కవిచరిత్రలలోనూ లేవు. కొంతమంది కవుల చరిత్రలు వీరేశలింగముగారి కవిచరిత్రలందున్నవి - కాని వానిని గూర్చి విశేషవిషయములందు చేర్పదగినవి తెలిపినది కవిగారే.

---

1. తరిగొండ వెంగమాంబను గూర్చిన గ్రంథములు - ఆంధ్ర కవయిత్రులు మొదలగువానియం దెచ్చటను పై శతకప్రశంస కానరాదు.

2. తెలుగు కవుల చరిత్ర - పుట 179-180.

3. ఈతనిగూర్చి కవిగారు శ్రీ వేంకటేశ్వర ప్రాచ్యపరిశోధనాసంస్థ పత్రికలో వ్రాసిరి.

## భైరవకవి

క్రీ. శ. 1470 ప్రాంతమువాడగు భైరవకవినిగూర్చి యెన్నో విషయములను కవిగారు రాతని శ్రీరంగమహత్త్వ పీఠికయందు దెలిపినారు. ఒక గ్రంథమునకు పీఠిక వ్రాయునపుడు దానికి సంబంధించిన గ్రంథములనుగూర్చి వారు వ్రాయుదురు-ఈ శ్రీరంగ మహత్త్వ పీఠికలో-కవిగారు ప్రథమముగా కట్టా వరదరాజుని శ్రీరంగమాహాత్మ్యమును గూర్చి తెలిపిరి.

## కట్టా వరదరాజు-శ్రీరంగమాహాత్మ్యము

క్రీ. శ. 1912లో కవిగారు తెలుపువఱకును పైగ్రంథమునుగూర్చి తెలుగులోకమునకు తెలియదు. కవిగారు గ్రంథమునుగూర్చి తెలుపుటయే - గాక, గ్రంథమునుండి 10 పద్యము లుదాహరించి, భైరవుని కావ్యముతో దీనికిగల తారతమ్యమును దెలిపిరి. దీనివలననే-వరదరాజ కృతిని కీర్తిశేషులు చెలికాని లచ్చారావు "ఆముద్రి తాంధ్ర గ్రంథ సర్వస్వము" అను గ్రంథావళిలో తాము ప్రకటించిన గ్రంథములలో 6వదిగ ప్రచురించి యున్నారు.[1] ఈ గ్రంథమునుగూర్చి నేటి సాహిత్యచరిత్రలో లేదు.

## పట్టమెట్ట సోమనాథ సోమయాజి-సూతసంహిత

వీరేశలింగ కవి చరిత్రమున నీకవి క్రీ. శ. 1700 తర్వాత మూడవభాగమున నున్నవాడు - కాని యీతని కాలము సరిగా నిర్ణయించినది కవిగారే-వారీతని కృత్యంతర బ్రహ్మోత్తరఖండమున నుండి యీ క్రిందిపద్య ముదాహరించి కాలనిర్ణయము చేసిరి. ఈ కావ్యము బిక్కనవోలి ఎల్లారెడ్డికి కృతి. ఎల్లారెడ్డి యన్నయగు కామిరెడ్డిని వర్ణించుచు సోమనాథ సోమయాజి యిట్లు వ్రాసినాడు—

గీ. కలిమి బిక్కనవోలి శ్రీ కామిరెడ్డి
భూమివిభు నాశ్రయించిన బుధులు నిజము
శాలివాహన శకవర్ష సంఖ్యఁబదియు
నైదునూర్లయి వర్తమానాబ్దములుగ.

ఇది చాలా చమత్కారమైన పద్యము. కామిరెడ్డి పోషించిన కవిపండితులు 1500మంది యట-ఆ సంఖ్య కృతిరచనాకాలమునాటి శాలివాహన శకసంఖ్య 1500 - శాలివాహన శకసంవత్సరమునకు 78 కలిపిన క్రైస్తవశకము వచ్చును-1500+78=క్రీ.శ. 1578. కావున సోమనాథ సోమయాజి 16వ శతాబ్దమువాడు - పైని చెప్పిన మల్లారెడ్డికూడ కామిరెడ్డి సోదరుడగుటచే నాతడును క్రీ. శ. 1578 ప్రాంతమువాడు.

---

1. శ్రీరామవిలాస ముద్రాక్షరశాల, చిత్రాడ-1921.

## కస్తూరిభట్టురాజు

ఈతడు గౌరీకల్యాణము అను ప్రబంధమును, కొట్టియదొన శంకరేశ్వరశతకము[1] అను నొక శతకమును రచియించినట్లు తెలియుచున్నది. కవిగారు కుమారసంభవ ప్రథమ భాగమునకు టిప్పణిలో నీకవి గౌరీకల్యాణమునుండి యొకపద్యముదాహరించియున్నారు. త్రిపురాంతకోదాహరణమునకు వారువ్రాసిన టిప్పణిలో - కొట్టియదొన శంకరేశ్వర శతకమునుండి యొకపద్య ముదాహరించినారు. వారా నాడీకవి కృతులనుండి పద్యము లుదాహరింపకపోయినచో నీనాడు-కస్తూరిభట్టురాజను కవి యున్నట్లు మనకు తెలియనే తెలియదు. విశేషమేమనగా నింతవఱకు నీకవి మనకవుల చరిత్రకెక్కనేలేదు. ఈకవి క్రీ.శ. 1470 ప్రాంతమువాడు.

## చింతలపల్లి కవులు

క్రీ. శ. 16, 17వ శతాబ్దులలో చింతలపల్లి వంశమున పెక్కు కవులుద్భవిల్లిరి. వారిలో - చంద్రాంగదచరిత్రను రచించిన సంజీవరాయకవి, రాఘవాభ్యుదయమును[2] రచించిన ఛాయాపతి కవి, మధురవాణీవిలాసమును రచించిన వీరరాఘవకవి ముఖ్యులు. వీరికి మూలపురుషుడు, ఎల్లకవి. ఈతడు పల్లకిపదస్థుడై బహుప్రసిద్ధిగాంచినవాడు- ఈ చింతలపల్లి కవులనుగూర్చి తొలుత తెలిపినవారు కవిగారే.

## ఆంధ్రభాషనుగూర్చిన యుపన్యాసము

కవిగారిప్పటివారివలె, ఆంధ్రవాఙ్మయచరిత్రగాని, సాహిత్యచరిత్రగాని వ్రాయక పోవచ్చును. కాని యిప్పటి వాఙ్మయచారిత్రకుల కందఱకంటె ముందుగా దానికి ప్రాతి పదికగా నొకప్రణాళిక నేర్పఱచినవారు కవిగారే - వారు 1927లో-మదరాసు విశ్వవిద్యాలయమువారి యాదేశమున తెలుగు సాహిత్య పరిణామమునుగూర్చి వ్యాప్తియుపన్యాసము నొకదానిని యిచ్చియున్నారు.[3] ఇది "ఆంధ్రభాషనుగూర్చిన యుపన్యాసము" అను పేర ముద్రితమైనది. (1895 లో పురశవాకమున ఇచ్చిన ఉపన్యాసమును ఇదియే.)

పై విషయములు సావధానముగా పరిశీలించిన కవిగారు నవీనాంధ్రవాఙ్మయచారిత్రక నిర్మాతలలో ముఖ్యులని నిర్ణయింపవచ్చును.[4]

---

1. ఈతరువాత నీశతకమునుండి నేను మఱియొకపద్యమును లక్షణగ్రంథముల నుండి సంగ్రహించితిని. లక్షణగ్రంథములు-సాహిత్యచరిత్ర-ఆంధ్రపత్రిక సంవత్సరాది సంచిక-1953.

2. చింతలపూడి ఛాయాపతికవి రాఘవాభ్యుదయము-క్రీ.శ. 1966లో ప్రకటితము.

3. Madras University Telugu Extension Lecture.

4. Makers of History of Telugu Literature.

## భైరవకవి

క్రీ. శ. 1470 ప్రాంతమువాడగు భైరవకవినిగూర్చి యెన్నో విషయములను కవిగారాతని శ్రీరంగమహత్త్వ పీఠికయందు దెలిపినారు. ఒక గ్రంథమునకు పీఠిక వ్రాయునపుడు దానికి సంబంధించిన గ్రంథములనుగూర్చి వారు వ్రాయుదురు-ఈ శ్రీరంగ మహత్త్వ పీఠికలో-కవిగారు ప్రథమముగా కట్టా వరదరాజు వి శ్రీరంగమాహాత్మ్యమును గూర్చి తెలిపిరి.

## కట్టా వరదరాజు-శ్రీరంగమాహాత్మ్యము

క్రీ. శ. 1912లో కవిగారు తెలుపువఱకును పైగ్రంథమునుగూర్చి తెలుగులోకమునకు తెలియదు. కవిగారు గ్రంథమునుగూర్చి తెలుపుటయే - గాక, గ్రంథమునుండి 10 పద్యము లుదాహరించి, భైరవుని కావ్యముతో దీనికిగల తారతమ్యమును దెలిపిరి. దీనివలననే-వరదరాజు కృతిని కీర్తిశేషులు చెలికాని లచ్చారావు "అముద్రి తాంధ్ర గ్రంథ సర్వస్వము"అను గ్రంథావళిలో తాము ప్రకటించిన గ్రంథములలో 6వదిగ ప్రచురించి యున్నారు.[1] ఈ గ్రంథమునుగూర్చి నేటి సాహిత్యచరిత్రలో లేదు.

## పట్టమెట్ట సోమనాథ సోమయాజి-సూతసంహిత

వీరేశలింగ కవి చరిత్రమున నీకవి క్రీ. శ. 1700 తర్వాత మూడవభాగమున నున్నవాడు - కాని యీతని కాలము సరిగా నిర్ణయించినది కవిగారే-వారీతని కృత్యంతర బ్రహ్మోత్తరఖండమున నుండి యీ క్రిందిపద్య ముదాహరించి కాలనిర్ణయము చేసిరి. ఈ కావ్యము బిక్కనవోలి ఎల్లారెడ్డికి కృతి. ఎల్లారెడ్డి యన్నయగు కామిరెడ్డిని వర్ణించుచు సోమనాథ సోమయాజి యిట్లు వ్రాసినాడు—

గీ. కలిమి బిక్కనవోలి శ్రీ కామిరెడ్డి
భూమివిభు నాశ్రయించిన బుధులు నిజము
శాలివాహన శకవర్ష సంఖ్యఁబదియు
నైదునూర్లయి వర్తమానాబ్దములుగ.

ఇది చాలా చమత్కారమైన పద్యము. కామిరెడ్డి పోషించిన కవిపండితులు 1500మంది యట-ఆ సంఖ్య కృతిరచనాకాలమునాటి శాలివాహన శకసంఖ్య 1500 - శాలివాహన శకసంవత్సరమునకు 78 కలిపిన క్రైస్తవశకము వచ్చును-1500 + 78 = క్రీ.శ. 1578. కావున సోమనాథ సోమయాజి 16వ శతాబ్దమువాడు - పైని చెప్పిన మల్లారెడ్డికూడ కామిరెడ్డి సోదరుడగుటచే నాతడును క్రీ. శ. 1578 ప్రాంతమువాడు.

---

1. శ్రీరామవిలాస ముద్రాక్షరశాల, చిత్రాడ-1921.

## కస్తూరిభట్టురాజు

ఈతడు గౌరీకల్యాణము అను ప్రబంధమును, కొట్టియదొాన శంకరేశ్వరశతకము[1] అను నొక శతకమును రచియించినట్లు తెలియుచున్నది. కవిగారు కుమారసంభవ ప్రథమ భాగమునకు టిప్పణిలో నీకవి గౌరీకల్యాణమునుండి యొకపద్యముదాహరించియున్నారు. త్రిపురాంతకోదాహరణమునకు వారువ్రాసిన టిప్పణిలో - కొట్టియదొాన శంకరేశ్వర శతకమునుండి యొకపద్య ముదాహరించినారు. వారా నాడీకవి కృతులనుండి పద్యము లుదాహరింపకపోయినచో నీనాడు-కస్తూరిభట్టురాజను కవి యున్నట్లు మనకు తెలియనే తెలియదు. విశేషమేమనగా నింతవఱకు నీకవి మనకవుల చరిత్రకెక్కనేలేదు. ఈకవి క్రీ.శ. 1470 ప్రాంతమువాడు.

## చింతలపల్లి కవులు

క్రీ. శ. 16, 17వ శతాబ్దులలో చింతలపల్లి వంశమున పెక్కు కవులుద్భవిల్లిరి. వారిలో - చంద్రాంగదచరిత్రను రచించిన సంజీవరాయకవి, రాఘవాభ్యుదయమును[2] రచించిన ఛాయాపతి కవి, మధురవాణీవిలాసమును రచించిన వీరరాఘవకవి ముఖ్యులు. వీరికి మూలపురుషుడు, ఎల్లకవి. ఈతడు పల్లకిపదస్థుడై బహుప్రసిద్ధిగాంచినవాడు- ఈ చింతలపల్లి కవులనుగూర్చి తొలుత తెలిపినవారు కవిగారే.

## ఆంధ్రభాషనుగూర్చిన యుపన్యాసము

కవిగారిప్పటివారివలె, ఆంధ్రవాఙ్మయచరిత్రగాని, సాహిత్యచరిత్రగాని వ్రాయక పోవచ్చును. కాని యిప్పటి వాఙ్మయచారిత్రకుల కందఱకంటె ముందుగా దానికి ప్రాతి పదికగా నొకప్రణాళిక నేర్పఱచినవారు కవిగారే - వారు 1927లో-మదరాసు విశ్వవిద్యాలయమువారి యాదేశమున తెలుగు సాహిత్య పరిణామమునుగూర్చి వ్యాప్తియుపన్యాసము నొకదానిని యిచ్చియున్నారు.[3] ఇది "ఆంధ్రభాషనుగూర్చిన యుపన్యాసము" అను పేర ముద్రితమైనది. (1895 లో పురశవాకమున ఇచ్చిన ఉపన్యాసమును ఇదియే.)

పై విషయములు సావధానముగా పరిశీలించిన కవిగారు నవీనాంధ్రవాఙ్మయచారిత్రక నిర్మాతలలో ముఖ్యులని నిర్ణయింపవచ్చును.[4]

---

1. ఈతరువాత నీశతకమునుండి నేను మఱియొక పద్యమును లక్షణగ్రంథముల నుండి సంగ్రహించితిని. లక్షణగ్రంథములు-సాహిత్యచరిత్ర-ఆంధ్రపత్రిక సంవత్సరాది సంచిక-1953.

2. చింతలపూడి ఛాయాపతికవి రాఘవాభ్యుదయము-క్రీ.శ. 1966లో ప్రకటితము.

3. Madras University Telugu Extension Lecture.

4. Makers of History of Telugu Literature.

# ఉద్యోగ జీవితము

కవిగారి వనపర్తి సంస్థానోద్యోగము వారిని ప్రథమముగా మహాపరిశోధకులుగా దిద్ది తీర్చినది. ఇక ఆయాప్రాంతములలో నున్న తాళపత్ర ప్రతులనేగాక, ఆనాటి కజ్ఞాతములైన కాకతీయశాసనములనుకూడ వారు సేకరించిరి. చాలా కాలమునకు తరువాత వారు 'భారతి' లో ప్రకటించిన, "కొన్ని కాకతీయ శాసనములు" అన్నవి వారు వనపర్తి సంస్థానమున నున్నప్పుడు సేకరించినవే.[1] నేను ముందుదాహరించిన The Lithic Reeords of Hyderabad అను గ్రంథము, వనపర్తిలో నున్నప్పుడు రచించినదే.

చరిత్ర, శాసనముల విషయమెట్లున్నను-వనపర్తి జీవితమున కవిగారు లోకోత్తరములగు విస్మృతకవుల గ్రంథములను ప్రకటించుటవలన కవిగారికి కీర్తి రాలేదుసరేగదా వారికి ఎంతో మానసికవ్యథ కల్పించినది. వారెంత వ్యాకులతపడినారో శ్రీరంగమహత్త్వము పీఠికలోగల యీ క్రింది వాక్యాలవల్ల తెలియుచున్నది—

"వ్యయప్రయాసములమాట యటులుండనిచ్చి శతచ్ఛిద్ర వ్యాకులంబగు తాళదళ పరిశోధనం బభ్యాసవశంబున జుగుప్సారహితంబుగ నలవఱచుకొని కార్యము నెట్లో నిర్వహించుచుండుటయు గొంద ఱీర్ష్యాగ్రస్తులు చూచి యోర్వక పరిపరివిధముల నగుబాటు పఱచుచున్నారు." (పుట-vii)

వనపర్తి సంస్థానములోనున్న యితరోద్యోగులు కవిగారు సంస్థానమునుండి మంచి విలువగల తాళపత్రగ్రంథాలను తీసికొనిపోయి చెన్నపట్టణములో అచ్చువేసి ద్రవ్యము సంపాదించుచున్నారని యపవాదమును ప్రచారముచేసిరి. కవిగారును, పరిస్థితిని గమనించి, వనపర్తి సంస్థానమును విడిచి మద్రాసు చేరుకొన్నారు.

తెలుగుసాహిత్య ప్రపంచమంతా "ఈర్ష్యాద్వేషజుష్టమైన"దని వారు గ్రహించినారు. విపుల వాఙ్మయరహితమైన తెలుగుకంటె విస్తృతమై మహాసముద్రమువంటి సంస్కృత వాఙ్మయముపై తమదృష్టి మరల్చినారు. పచ్చయప్ప కళాశాలలో రెండు మూడేండ్లు సంస్కృత భాషాధ్యాపకుడుగా పనిచేసి, ఆ వాఙ్మయ చరిత్ర, పరిశోధన అవగాహన చేసికొన్నారు.

---

1. కవిగారు రాజమహేంద్రపురములో నున్నప్పుడు చాలా కాకతీయశాసనములను ఆంధ్రదేశీయేతిహాస పరిశోధక మండలి (The Andhra Historical Research Society) కార్యదర్శి కీ. శే. రాళ్లబండి సుబ్బారావుగారు, కవిగారినుండి గ్రహించినారు. అవి మండలివారి కార్యాలయమున నిప్పటికి గలవు.

తెలుగుభాషలోవలెనే, సంస్కృత గ్రంథాలుకూడ చాలావఱకు అముద్రితముగా ఉన్నవని తెలుసుకొన్నాను. కాని ఆ భాషలో తాళపత్ర గ్రంథాలు, తెలుగుదేశములో విశేషముగా దొరకవు-తంజావూరిలో సంస్కృతగ్రంథము లున్నసంగతి వారెరుగుదురు. అక్కడి సంస్కృతగ్రంథములు వారికి కరతలామలకమే. ఇక సంస్కృతములోనే ఇదివఱ కెవ్వరికి తెలియని అద్భుతగ్రంథములు పైకితీసి, ప్రకాశింపజేసినట్లయితే- అది భారతవర్షమంతా తెలియగలదు అనే భావము వారిని పూర్తిగా ఆవేశించినది.

కవిగారానాటికే తెలుగు తాళపత్రాలను చదువుటయందు సిద్ధహస్తులగుటయే గాక- సంస్కృత తాళపత్ర గ్రంథాలను చదువుటయందును నిపుణులైనారు. దక్షిణభారతమున సంస్కృతగ్రంథాలు, ఒక్క తెలుగువారు మాత్రము తెలుగులిపితో వ్రాసుకొందురుగాని తక్కినవారందఱు నట్లు వ్రాసికొనలేరు. సంస్కృతి వర్ణములన్నియు నాభాషలలోచేరలేదు.

| | | | |
|---|---|---|---|
| అందుచేత తమిళులు సంస్కృతగ్రంథములు వ్రాయుటకు— | | | "గ్రంథలిపి"[1] |
| కేరళదేశీయులు | ... | ... | "మళయాళలిపి" |
| మహారాష్ట్రులు | ... | ... | "బాలబంధులిపి" |

ఏర్పాటు చేసికొన్నారు.

కవిగారు గ్రంథ లిపియందేగాక మళయాళ లిపియందును ప్రవీణులై ముఖ్యముగా మళయాళదేశమున అపూర్వ సంస్కృతగ్రంథము లున్నవని తెలుసుకొని అచ్చటికివెళ్లి తాళపత్ర గ్రంథ పరిశోధనచేయుటకు చాలా ఉబలాటపడినారు. దీనికి కారణము లేక పోలేదు. కేవలము తమిళులైన శ్రీ గణపతిశాస్త్రిగారు మళయాళదేశమున స్థిరపడి తాళపత్ర గ్రంథాలను పరిశోధించి భారతవర్షమునే కాక, ప్రపంచమున కంతయు సంభ్రమాశ్చర్యములు కలుగజేసిన—

"భాసనాటకచక్రము"ను

కనుగొని పదమూడు నాటకములను ప్రకటించినారు. తిరువాన్కూరు మహారాజావారు స్థాపించిన ప్రాచ్య లిఖిత పుస్తకభాండాగారము తరఫున నవి ముద్రితములైనవి. కవిగారును వారితో నవి ప్రకటితములు కాకముందు నుత్తరప్రత్యుత్తరములు జరిపి, కొన్ని వ్రాత ప్రతులు తెప్పించినారు. మళయాళదేశమున పరిశోధన చేయవలెనన్న కుతూహలము దినదినప్రవర్ధమానమైనది. అయితే వారేమిచేయగలరు? "తిరువాన్కూరు సంస్థానమున-రాజులది సర్వాధికారము. వారికి ప్రవేశముగలుగుట యెట్లు? అదిగాక తాను తెలుగువాడు. తమిళ సంస్కృతభాషలలో ప్రవీణుడైనను, కేరళదేశీయులు తనను రానీయరు" అని యిట్లుగా ఆందోళనపడుచుండెడివారు.

---

1. గ్రంథలిపి (తమిళ సంస్కృతలిపి) తమిళులలోనే కొలదిమందికి మాత్రమే వచ్చును. తెలుగువారిలో రష్యాలో తెలుగు - తమిళ భాషల కాచార్యాణిగా నుండిన శ్రీమతి యమ్. ఆదిలక్ష్మి తమిళభాషయే గాక - ఈ గ్రంథ లిపి అతివేగమున వ్రాయుట యందును సిద్ధహస్త. ఈమె కీర్తిశేషురాలు.

"తమిళుడైన గణపతిశాస్త్రి-భాసనాటకములవంటి యపూర్వసంస్కృత గ్రంథాలను కనిపెట్టి ఖండాంతర కీర్తిగడించినప్పుడు[1] తెలుగువారెందుకూరకొనవలెను? మనము కూడ ఆ కేరళదేశముననే, క్రొత్తవి కనిపెట్టి లోకమునకు వెల్లడించి, తెలుగువారికి కీర్తితేవలయును" అని ధృఢసంకల్పముతో నుండిరి. ఇంతలో వారి అదృష్టముపండినది-వారెట్లు మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారమున నియమితులైనది - మళయాళదేశమున నెట్లు పర్యటించి, శ్రమించి, అపూర్వ గ్రంథసంపాదనచేసినది యికముందు తెలిసికొందము.

కవిగారికి మొదటనుండియు చెన్నపట్టణమే నివాసమగుటచేత, వారు స్వతంత్రముగా తమ సాహిత్యకృషిని కొనసాగించుకొనగలిగిరి - ఏలననగా నా కాలములో చెన్నపట్టణమే-ఆంధ్రసాహిత్య గ్రంథప్రచురణకు, సాహిత్యవిమర్శకు, వాఙ్మయ పరిశోధనకు ప్రధానరంగము-ఆ కాలమునాడదియే యాంధ్రసాహిత్యక్షేత్రము.[2] వారు ప్రాచీన గ్రంథగవేషణచేయుచు, విస్మృతకవుల గ్రంథప్రకటనముచేసిన వెనుక వారి 46వ యేట 1915లో వారికి ప్రభుత్వోద్యోగము లభించినది-ఆ సన్నివేశమిది.

## మదరాసు ప్రాచ్యలిఖితపుస్తకభాండార స్థాపన

మదరాసులో-భాషోద్ధారకులైన బ్రౌనుదొరగారిమూలమున-మన తెలుగువాఙ్మయమునకు సంబంధించిన తాళపత్ర ప్రతులు - సంస్కరింపబడిన వ్రాతప్రతులు - అన్నియు, ప్రభుత్వమువారి 'క్యానిమెరా' గ్రంథాలయమున సేకరింపబడి సురక్షితములై యుండెడివి. ప్రభుత్వమువారప్పు డార్షశాఖవారిచేగూడ తెలుగు తాళపత్ర గ్రంథముల కొకరిద్దరిని పంపి, ఆ తాళపత్ర గ్రంథములనుగూర్చి - ఆ శాఖానివేదికలందు తెలుపుచుండెడివారు.[3] కాని వానితోబాటు అమూల్యములైన - బ్రౌనుదొరగారి గ్రంథసేకరణమును గూర్చి వివరములు గ్రంథసూచికలు లేకపోవుటచే, కీ. శే. పనప్పాకము ఆనందాచార్యులవారి

---

1. భాసనాటకములు ప్రచురితమైన వెనుక-కొన్ని వాదప్రతివాదములు బయలుదేరినను, పాశ్చాత్య పండితులు - ఇంగ్లండు, ఫ్రాన్సు, రష్యా, జర్మనీ దేశపు సంస్కృత విద్వాంసులందఱు నేకముగా నొక సన్మానపత్రమును సమర్పించి గణపతిశాస్త్రి గారిని గౌరవించిరి. వారి కీర్తికి భాసనాటకములు మూలస్తంభాయమానములు.
2. క్రీ. శ. 1953లో ఆంధ్రరాష్ట్ర మేర్పడు నాటివరకు చెన్నపురియే తెలుగువారి సాహితీక్షేత్రము ; కేంద్రము. ఈనాడు విశాలాంధ్ర మేర్పడినను తెలుగుదేశమున సాహితీకేంద్రము అని చెప్పదగిన పట్టణము లేదు. నేటి తెలుగువారికి రాజధానియైన హైదరాబాదు ఆంధ్రసాహిత్యక్షేత్రముగా శీఘ్రముగా రూపొందగలదని యాశించుచున్నాను.
3. Department of Archaeology — Reports of Archaeological Department.

మూలమున క్రీ. శ. 1909లో ప్రత్యేకముగా, తెనుగు సంస్కృత గ్రంథములకు నితర తమిళ కన్నడాది భాషలకు నొక ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారము స్థాపింప నిశ్చయించిరి. కాని యదియొక కార్యస్థానముగా రాష్ట్ర విద్యాశాఖాధికారి అధికారముక్రింద రూపొందుట కింకొక ఏడాదిపట్టినది. క్రీ. శ. 1910లో నిది ప్రత్యేక భాండాగార కార్యాలయముగా క్యానిమెరా గ్రంథాలయములోనే యుండెడిది. అచ్చటనే నేటికి-పురావస్తు చిత్రశాల గలదు.[1]

అట్లు స్థాపితమైన పాచ్యలిఖిత పుస్తక భాండాగారమునకు గ్రంథసేకరణము ఇంతకుముందువలె గాక-ప్రత్యేకముగా భాండాగారోద్యోగులుగానే, కొంతమందిని నియమించి, దేశంలో నలుమూలలకు వారినిపంపి, సంస్కృతాంధ్ర గ్రంథసేకరణ జరుపవలయునని ప్రభుత్వమువారు నిశ్చయించి-ఆ యుద్యోగములకు నప్పటికే తాళపత్ర గ్రంథపరిశ్రమ నెఱిగినవారిని మాత్రమే నియమించుటకు తీర్మానించిరి.

మనకవిగారప్పటికే అనగా క్రీ. శ. 1915 నాటికే కుమారసంభవాది ప్రాచీనాంధ్ర కృతులు ప్రకటించుటచేతను, వారు తెలుగు భాషాగ్రంథములేగాక - సంస్కృత, తమిళ, కన్నడభాషా తాళపత్ర లిపులయందు సిద్ధహస్తులగుటచేతను వారిని తాళపత్ర గ్రంథగవేషకులై క్రి. శ. 1915 లో ప్రాచ్యలిఖితపుస్తకభాగారమున-అంగ్ల పట్టభద్రులగుటచేతను భాండాగారాధ్యక్షునికి సహాయోద్యోగిగా నియమించిరి.[2] అంతకు కొంచెము ముందుగానే-చెన్నపురియందే నివసించుచు కవిగారికి తాళపత్ర గ్రంథగవేషణ, ప్రకటనయందు సహాయులై యుండిన వేటూరి ప్రభాకరశాస్త్రిలవారిని పండితులనుగా నియమించిరి. ప్రభాకరశాస్త్రిగా రాపండితి పదవియందు క్రీ. శ. 1940 వఱకు నుండిరి.

## తాళపత్ర గ్రంథగవేషణ

తాము సొంతముగా డబ్బు ఖర్చుపెట్టుకొని, తాళపత్ర గ్రంథసేకరణ చేసిన

---

1. Museum.
2. భాండాగారాధ్యక్షుడుగా నప్పుడొక ప్రత్యేకోద్యోగి లేడు-ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారాధికారిని ఇంగ్లీషులో క్యూరేటరు (Curator) అందురు. మదరాసు రాజధాని కళాశాలలో సంస్కృతశాఖాధ్యక్షుడైన ఆచార్యుడే భాండాగారాధికారిగా నుండెడివాడు-కవిగారా యధికారికి సహాయోద్యోగి; ఆయన హోదా— "Special Assistant to the Curator, Government Oriental Manuscript Library."

మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారము క్రీ. శ. 1934 వఱకు ఎగ్మూరులో క్యానిమెరా గ్రంథాలయములోనే యుండెడిది. అయేడు మదరాసు విశ్వవిద్యాలయ భవనములు తెఱువబడినతరువాత - ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారమా భవనములకు తరలింపబడినది. నేటికిని యచ్చటనే యున్నది. క్రీ. శ. 1944 వఱకు నిరువదేండ్లు నా కా పుస్తకభాండాగారముతో నిత్యసంబంధము కలదు.

కవిగారికీ యుద్యోగము మహాదృష్టముగా లభించినది-దీనితో వారు తెలుగుదేశమే గాక రాష్ట్రాంతరములలో పర్యటించి యపూర్వ గ్రంథసేకరణచేయుటకు నమితమగునవకాశము గలిగినది. తెలుగుదేశమున తెలుగు సంస్కృత గ్రంథగవేషణకు - కవిగారును, శ్రీ ప్రభాకరశాస్త్రిగారును నిద్దఱును పర్యటించెడివారు.

కేవలము సంస్కృతగ్రంథములయన్వేషణకై, రాష్ట్రాంతరముల కొక్క కవిగారినే కాక ఉద్దండపండితులైన శ్రీ యస్. కె. రామనాథశాస్త్రిగారినికూడా నియమించిరి. ఈ సంస్కృత భాషాగవేషణమే, కవిగారికి యావద్భారతవర్ష కీర్తిని దెచ్చినది.

## కేరళదేశము-సంస్కృతగ్రంథశోధన

కేరళదేశము (పూర్వపు మలబారు)న భారతవర్షమునం దెచ్చట లభ్యముగాని సంస్కృతగ్రంథములు నిక్షిప్తములై యున్నవని కవిగారికి చాలాకాలమునుండి తెలియును-వారప్పటికే తిరువనంతపురము ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారము పక్షమున కీర్తిశేషులు గణపతిశాస్త్రిగారు ప్రకటించిన భాసనాటక చక్రమును చదివినారని యీవఱకే తెలిపితిని. సంస్కృత గ్రంథశోధనకై కేరళరాష్ట్రమునకు ప్రత్యేకముగా వారు నియమితులగుటచే-వారత్యుత్సాహముతో నారాష్ట్రమున రెండేండ్లు పర్యటించి, పరిశోధించి, లోకోత్తరములైన గ్రంథములను ప్రకాశింపజేసిరి.

ఆకాలమున కేరళదేశమున సంస్కృత తాళపత్రగ్రంథగవేషణ ఎంతో దుర్ఘటముగా నుండెడిది - సనాతనాచార సంప్రదాయములకు పుట్టినిండ్లైన నంబూద్రి బ్రాహ్మణుల గృహములయందవి భద్రపఱుపబడియుండెడివి - తాళపత్ర గ్రంథములుగల కొందఱు వానిని చూపుటకుమాత్రమే యొప్పుకొనెడివారు; కొందఱు చదువుటకు వచ్చినవారిని నీవు చదువగలవాయని ప్రశ్నించి, ఒక తాటాకునిచ్చి, చదువుమని పరీక్షచేసి, వారు సంతుష్టులైన తరువాతనే-వానిని చూపెడువారు. కొందఱు చదువుకొనుటకొఱకేగాని యందలి భాగములను వ్రాసికొనుట కంగీకరించువారు కారు-బ్రాహ్మణులకు దక్క యితరులకు వారి యిండ్లలో ప్రవేశములేదు. వచ్చినవారి కాంగ్లేయ భాషాసంపర్కముండరాదు-కవిగా రిన్ని కష్టములను తాళపత్ర గ్రంథములకొఱ కధిగమించినారు.[1] ఆదేశమున కవిగారు తానాంగ్ల భాషాసంపర్కము లేని శ్రోత్రియ బ్రాహ్మణుడనని, వారు గ్రంథములను చూచినచో చదువగలనని యు చెప్పిరట. వారును, గ్రంథలిపిలో నున్న సంస్కృతగ్రంథము నిచ్చిరట-అచ్చటివారి యుద్దేశము గ్రంథలిపి తాముతప్ప యితరులు చదువలేరని. కవిగారు

1. కవిగారు క్రీ. శ. 1917లో మాయింటికివచ్చినప్పుడు వారిముఖతః నేను వీనిని విని యిచ్చట గ్రంథస్థము చేసినాను-కవిగారెట్టిపరిస్థితులలో కేరళదేశమున తాళపత్ర గ్రంథ సంపాదనచేసిరో-వానిని కీర్తిశేషులు ప్రభాకరశాస్త్రిపాదులును నాకు తెలిపియున్నారు.

చేతికందించగానే గడగడ చదివివేసిరట-అది భాసనాటకములలో చేరని యొక నాటకము.[1] తరువాత కవిగారచ్చటచూపిన సంస్కృత పాండిత్యప్రతిభ కాశ్చర్యపడి, వారిని స్వేచ్ఛగా గ్రంథములను పరిశోధింపనిచ్చుటయేగాక-గ్రంథములను తీసికొని వెళ్లుటకు నచ్చటివారంగీకరించినారు.

కవిగారు 'దక్షిణభారతి' గ్రంథమాలలో నావెనుక ప్రకటించిన చతుర్భాణి, తాపస వత్సరాజము, కుందమాల, కౌముదీమహోత్సవము మొదలైన నాటకములేగాక - భారత వర్షమున నుత్తర మధ్యప్రదేశముల నెచ్చటనూ లభ్యముగాని-

''అభినవగుప్తపాదుని''

భరతనాట్యశాస్త్రవ్యాఖ్యానమగు 'అభినవభారతిని' సంపాదించిరి.

## తంజావూరి గ్రంథాలయము

కవిగారు తంజావూరి గ్రంథాలయముతో నంతకుముం దెంతకాలమునుండియో పరిచయమున్నవారైనను - క్రీ. శ. 1916 లో ప్రభుత్వమువారిచే ప్రభాకరశాస్త్రిగారితో గూడ నియమితులై యచ్చట పరిశోధనగావించిరి. అప్పటికి తంజావూరిలో క్రీ.శ.1884లో ప్రకటితమైన ఒర్నెలుదొరగారి సంస్కృత గ్రంథసూచిక మాత్రమే యుండెడిది. కవిగారందులేని యనేక సంస్కృత గ్రంథములు కనుగొనిరి - తెలుగుభాషలోగూడ, శేషము తిరుమలాచార్యుని అంబరీషచరిత్ర, పోలూరి గోవిందకవి రాగతాళచింతామణి - పర్వత నారదసంవాదము (ఇదియు సంగీతమునకు సంబంధించినదే), జగ్గన ప్రబంధ రత్నాకరము మున్నగువానిని గుర్తించి, ప్రత్యేకముగా వానిని వేఱుపఱచు నేర్పాటుచేసిరి. అచ్చట శహాజీమహారాజు క్రోడీకరించిన 19 సంగీత శాస్త్రగ్రంథములను గుర్తించినది కవిగారే.

## ఉత్తరసర్కారులు

క్రీ. శ. 1917 లో కవిగారు, ప్రభాకరశాస్త్రిగారును తూర్పు తీరజిల్లాలైన గుంటూరు, కృష్ణా, గోదావరి, విశాఖపట్టణములలో పర్యటించిరి. విశాఖపట్టణమే వారు కేంద్రముగా నిర్ణయించుకొనిరి-వారా సంవత్సరమున మాయింటికివచ్చినసంగతి యిదివఱకే తెలియజేసితిని. వారు పదునైదుదినములు మాయింట గ్రంథములను పరిశోధించిరి. కవిగారి కెచ్చటను లభింపని ''కోహలీయము'' అను భరతనాట్యశాస్త్ర టీక - మాయింటనే లభించినది. సంస్కృతగ్రంథము వారియొద్దనే యుండిపోయినట్లున్నది. కోహలీయము తెలుగుటీక నేడును ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారమున గలదు. ఇది ముద్రింపదగినది.

---

1. ''డమరుకము'' అను నీ యజ్ఞాత భాసనాటకమునుగూర్చి కవిగారు 1924 వ సంవత్సరమున, మద్రాసునందు జరిగిన తృతీయ అఖిలభారత ప్రాచ్య విద్వన్మహాసభయందు వ్యాసము చదివిరి.

ప్రభాకరశాస్త్రిగారు నెలదినములకుపైగా నుండి 300 గ్రంథములను మా యింటినుండి సేకరించినారు.[1]

## రాయలసీమ

కవిగారొక్కరే ప్రత్యేకముగా కడప, కర్నూలు మండలములలో నియమితులై, పర్యటించి, నారప సూరన 'వనమాలి విలాసము', రామరాజు రంగప్పరాజు 'సాంబో పాఖ్యానము', పొన్నతోట బొబ్బకవి 'వామన పురాణము'[2], తరిగొండ వెంగమాంబ 'రమా పరిణయము' మున్నగు నపూర్వకృతులు పుస్తకభాండాగారమునకు సంపాదించిరి.

## ఉద్యోగము-క్లిష్టపరిస్థితి

కవిగారు మదరాసులో క్రీ. శ. 1926 వఱకు పుస్తకభాండాగారములోనే పనిచేసిరి. ఆసంవత్సరమున వారి యుద్యోగమున నొక విషమసంఘటన గలిగినది - కవిగారు ప్రభుత్వోద్యోగులై యున్నను, అంతకుమున్ను వారుచేయుచున్న ప్రాచీన గ్రంథప్రకటనను కొనసాగించుట కనుమతిని బడసియుండిరి. దానిని పురస్కరించుకొని కవిగారు, తాము కేరళదేశమున పర్యటించినప్పుడు సంపాదించిన కొన్ని అపూర్వ సంస్కృత నాటకములను అచ్చువేసిరి. ఆసంగతి యింతకుముందే తెలిసితిని-ఇవి ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారము కొరకు సంపాదించినవే అయినను - కవిగారు తాము స్వయముగా వానికి ప్రతులను వ్రాసి, తమదగ్గఱ పెట్టుకొని, వానిని ప్రకటించుచుండిరి.

ఆకాలమున నిట్లు పర్యటించి తెచ్చిన పుస్తకభాండాగారపు తాళపత్ర గ్రంథములకు కొన్ని నియమములుండెడివి. అవి అధికారరీత్యా గ్రంథసూచికల కెక్కవలయును- తరువాత భాండాగారాధ్యక్షుడు నాతనికి ప్రతివ్రాయుట కనుజ్ఞ యీయవలెను. భాండాగారాధ్యక్షు డనుజ్ఞ యీయనిచో నది యెంత విలువగలదియైనను కొన్నియేండ్లట్లే పడియుండవలసినదే- కాని గ్రంథసూచికలమూలమున లోకమునకు వాని యునికిని దెలుపుదురు. ఆ గ్రంథ సూచికలో ఆ గ్రంథ మెవ్వరివద్దనుండి యెప్పుడు సంపాదింపబడినదో, ఆ వివరము లుండును. ఇక ఆ తాళపత్ర గ్రంథముద్రణమునకు, నాకాలమున, రాజధానికంతకు విద్యా శాఖాధికారియైన యాతని ఆమోదము పడయవలెను. అదిలేనిదే ప్రభుత్వమువారిచే సేకరింపబడిన నముద్రితగ్రంథ మేదియు ముద్రితము కాకూడదు.

---

1. చూడుడు - Trinniel Catalogue of Telugu Manuscripts. Telugu Vol. III. 1917-1919. R. No.
ఈ సంపుటమున - గ్రంథానుక్రమణికలో మా నాయనగారైన సుందరము పంతులుగారి పేరుక్రింద 80 సంఖ్యలున్నవి.

2. దక్షిణదేశీయాంధ్రవాఙ్మయము. పుట 490.

కవిగారు 'దక్షిణభారతి' గ్రంథమాలికలో ప్రకటించిన కందమాల, కౌముదీ మహోత్సవముల కట్టి విద్యాశాఖాధికారి ముద్రణామోదము లేదు - అవి ప్రభుత్వము ద్రవ్యముతో వారికొఱకు సేకరింపబడినవేయైనను, వానివలన నవి ప్రకటించిన కవిగారి కీర్తి దేశవ్యాప్తమయ్యెను. దీనినిచూచి, యచ్చటివారు భాండాగారాధ్యక్షునిద్వారా విద్యాశాఖాధికారి కార్యస్థానమునకు ఆ గ్రంథముల తాళపత్ర ప్రతులు-సేకరణ వివరములు కవిగారిచే ముద్రితమైన ప్రతులు పంపిరి.

ఆ కాలమున - ఎ. సి. బోరను అనునతడు విద్యాశాఖాధికారి. అతడీ తాళపత్ర గ్రంథములను, ముద్రితగ్రంథములను పరిశీలించి తక్షణమే కవిగారిని, వారు భాండాగారమునకు పదునొక్కండేండ్లుగా చేసినసేవను గమనింపక, యుద్యోగమునుండి తొలగింపవలసినదని యుత్తరువు జారీచేసినాడు.

## కీ. శే. వేటుమళ్ల అచ్యుతరావుగారి సహాయము

ఈ సమయముననే - సుప్రసిద్ధ వాఙ్మయవిమర్శకులు, విద్వాంసులు నగు కీ. శే. వేటుమళ్ల అచ్యుతరవుగారు విద్యాశాఖాధికారికి వ్యక్తిగత సహాయోద్యోగిగా నుండెడివారు.[1] కవిగారినిగూర్చిన యుత్తరువు పంపుచు బోరనుదొర, అచ్యుతరావుగారిని రమ్మని కబురుపంపినాడు - అచ్యుతరావుగారు, కవిగారి యుత్తరువుతోగూడ వెళ్లినారు. వెళ్లగానే అతడు-''చూచితివా? ఈ రామకృష్ణకవి ప్రభుత్వోద్యోగ నిబంధనలకు కట్టుబడక ఎట్లుగా ప్రవర్తించినాడో? ఈ రెండింటి ముద్రణకు నా యామోదములేదు - అయినను నీతడు నిబంధనలకు వ్యతిరిక్తముగా ముద్రించినాడు. కాబట్టి నేను తొలగింపవలసినదిగా నుత్తరువిచ్చినాను'' అని అన్నాడు. అచ్యుతరావుగా రామాటలకు, ఉద్యోగవినయముతో- ''అయ్యా! ఈకాలమున రామకృష్ణకవివంటి బహుముఖ ప్రతిభాశాలియైన విద్వాంసుడు లేడు - ఆయనేలేనిచో మన మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగార మిట్టి లోకోత్తరములైన సంస్కృతాంధ్ర గ్రంథములతో పేరున కెక్కెడిగాదు - ఇంతకును ఆయన మనకు ముద్రించుట కనుజ్ఞనిమ్మని చాలాకాలముక్రిందటనే వ్రాసినాడు-అది రాకపోవుటవలన- ఉత్తరదేశమునుండి సంస్కృత విద్వాంసులు ప్రతులను కోరుటచే, దానినిముద్రించినాడు.[2] జరిగినదింతే'' అని చెప్పినారు.

విద్యాశాఖాధికారి కొంతసేపూరకుండి - ''అట్లయిన నేమిచేయవచ్చును'' అని ప్రశ్నించినారట-ప్రస్తుతవిషయము ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారమునకు సంబంధించినది-

---

1. Personal Assistant to the Director of Public Instruction.
2. ఆకాలమున అధికారులు పాశ్చాత్యులైనను, వారు తమక్రిందివారు చెప్పెడి విషయములను నవగాహన చేసికొని, సొంతముగావిని, తమపదవిని నిర్వహించెడివారు. అన్యాయమునకు సహించెడివారు కాదు.

రామకృష్ణకవి మదరాసు విశ్వవిద్యాలయమున ఎమ్. ఏ. పట్టభద్రుడు-అతనిని కళాశాలలో నుపన్యాసకుడుగా మార్పుచేయవచ్చును" అని అచ్యుతరావుగారు జవాబుచెప్పిరి. "కళాశాలలో ఖాళీలేకపోతే అతడు వెళ్లిపోవలసినదే" అని దొరగారన్నారు. వెంటనే అచ్యుతరావుగారు, "కళాశాలలలోనేగాక - ప్రభుత్వమువారి బోధనాభ్యసన పాఠశాలలయందు, ఎమ్. ఏ. లను మనము నియమించుచునే యున్నాము" అని సూచించిరి - "అట్లయిన నేమ్చటనైన, ఆ పాఠశాలలో ఖాళీలుగలవా?" అని దొరగారు తిరిగి ప్రశ్నించినారు.[1] అచ్యుతరావుగారు - "రాజమహేంద్రవరమున ప్రభుత్వ మాధ్యమిక ప్రతీక పాఠశాలలో ఖాళీయున్నది" అని చెప్పిరి. "అట్లయిన దీనిని జారీచేయకుము[2] - రాజమహేంద్రవర పాఠశాలలో సహాయోపాధ్యాయునిగా నియమించినట్లు నాయామోదముకొఱకు జ్ఞాపిక పంపుము"[3] అని దొరగారు అనగానే - అచ్యుతరావుగారు జ్ఞాపిక పంపినారు. రామకృష్ణకవిగారిని రాజమహేంద్రవరము వెళ్లునట్లుగా దొరవారు త్తరువు పంపినారు.

## రాజమహేంద్రవర నివాసము

రాజమహేంద్రవరములో కవిగారు ప్రవేశించిన కొద్దికాలమునకు వారి యదృష్టము వలన-అచ్యుతరావుగారే-ఆ పాఠశాల ప్రధానోపాధ్యాయులుగా నియమితులైనారు. ఆనాటి వారి రాజమహేంద్రవర నివాసమును, అచ్యుతరావుగారి కుమారులైన చేకుమళ్ల కామేశ్వరరావుగారిట్లు కన్నులకు కట్టినట్లు వర్ణించినారు.[4]

"మా నాయనగారు ఆయనకు పై అధికారి. కాబట్టి కవిగారు మాయింటికి అప్పుడప్పుడు వచ్చేవారు. ఆయన కప్పటికి అరవైయేండ్లు దాటేయి...ఆనాటినుండి కవిగారిని నేను నేరుగా ఎరుగుదును. ఆయన యిన్నీసుపేటలో మెయిన్‌రోడ్డుమీద బజారు ప్రారంభములో ఒక చిన్న పాతపెంకుటింటిలో ఉండేవారు.

"అప్పటికప్పుడే పాపం భార్య స్వర్గస్తురాలైంది! బిడ్డలతో ఉండేవారు. తల్లిలేని సంసారం, దారంతెగిన పూసలవంటిది కదా! వారిని సంతరించేటప్పటికి ఆయన తల ప్రాణం తోకకు వచ్చేది. తండ్రికి అంత ఆయాసం కల్పిస్తున్నామా అని అనుకొంటారా చిన్నపిల్లలు? ఆయన ఏకపత్నీవ్రతస్థుడు - కొంతకాలంపాటు హోటేలునుండి ఇంటికి భోజనం తెప్పించుకొనేవారు. పిమ్మట స్వహస్త పాకం......

"ఆయనఉండే పాతయింటిలో పైకప్పునుంచి ఒకమాటు బూజురాలి ఆయనకంటిలో పడి కొన్నివారాలపాటు బాధపెట్టింది. వెలుగును చూడడం కష్టంగాఉండగా మాగాగిల్బు-చలువ కళ్లజోడును ఇచ్చేము.

---

1. Government Secondary Model Training School.
2. Approval.
3. Office Note.
4. నా వాఙ్మయమిత్రులు - మానపల్లి రామకృష్ణకవి. పుటలు 57-62.

"ఆయన వత్సరాజ చరితము అను వచనగ్రంథాన్ని వ్రాసి స్థానిక ప్రకాశకునికి ఇరవైఅయిదు రూపాయిలకు అమ్మివేసేరు. గవర్నమెంటు నౌఖరీకావడంచేత పుస్తకం మీద తనపేరును వేసుకోలేదు. ఆయన ఎరుకలేకుండా, ఆయన కొడుకులలో ఒకడు, ఆపుస్తకముతాలూకు ముప్పదిప్రతులను అమ్మివేసి డబ్బు ఖర్చుపెట్టేడని ఆయన మానాయనగారితో చెప్పగా మానాయన ఆకుర్రవాణ్ణి పిలిచి చీవాట్లుపెట్టేరు.

"కవిగారికి ఆర్థిక చిక్కులు విపరీతం. కవులస్థితి అంతేఅని మిణకరిస్తే లాభంలేదు.

"ఆయన బి. ఏ., ఎమ్. ఏ. పరీక్షలకు భాషాప్రశ్నపత్రాలను ఇచ్చేవారు. అటు తర్వాత కడపటికి హైయ్యరు ఎలిమెంటరీ గ్రేడు పరీక్షకికూడ ప్రశ్నపత్రాలను యిచ్చి తృణమో పణమో పొందేవారు. ఇంతేకాదు ఎస్. ఎస్. ఎల్. సి. వంటి పరీక్షలకు మార్కులను నమోదుచేసే (టాబ్యులేటరు) పనికి మదరాసుకిపోయి రూ. 70 లేక 80 తెచ్చుకొనేవారు.

మహాపరిశోధకుడు చేయవలసిన పనా యిది!"

కవిగారు సాంసారికముగా, ఆర్థికముగ ఎట్టి క్లిష్టపరిస్థితులలో ఉండేవారో పైవాక్యాలు తెలుపుతవి. ఇట్లాంటి సమయాల్లోనైనను ఆయన తన సాహిత్యవ్యాసంగాన్ని సాగిస్తూనే యుండేవారు.

రాజమహేంద్రవరము కవిగారు వెళ్లేనాటికి నాల్గేండ్లు ముందుగా, అచ్చట-'ఆంధ్ర దేశీయేతిహాస పరిశోధక మండలి' అన్న చారిత్రక పరిశోధక సంస్థ స్థాపితమైనది.[1] చారిత్రకాధారములు, శాసనములు సంగ్రహించుట, ప్రత్యేకసంచికలు ప్రకటించుటయేగాక ఒక త్రైమాసపత్రికను నాంగ్లభాషలో ప్రారంభించిరి.[2] ఆకాలమున దానికి కార్యదర్శులుగా నున్న కీ. శే. రాళ్లబండి సుబ్బారావుగారు-కవిగారి వాఙ్మయపరిశోధనకు దోహద మొనర్చిరి.

సుబ్బారావుగారు కవిగారివద్దనుండి వారు సంపాదించిన కాకతీయ శాసనములు కొన్ని మండలికి కొని యార్థికసహాయము చేసినారు. కవిగారు వారిపత్రికకు, ఆంగ్లేయ భాషలలో Literary Gleanings అనుపేర-సంస్కృత వాఙ్మయ గ్రంథములనుగూర్చి యద్భుతవ్యాసములు వ్రాసియున్నారు. అందు 'లీలాశుకుని బాలగోపాలస్తుతి' సంస్కృత వాఙ్మయమునకే క్రొత్తది.

## మదరాసు విశ్వవిద్యాలయమున-మెకంజీ సంపుటముల ఆంగ్లభాషాంతరీకరణ

కవిగారు, రాజమహేంద్రవరమున క్రీ. శ. 1932 వఱకు నాతేండ్లుండిరి. ఆసంవత్సరముతో ప్రభుత్వోద్యోగము పూర్తియైనది-వారు పనిచేసిన యుద్యోగము లన్నియు

1. The Andhra Historical Research Society, Rajahmundry.
2. Journal of the A. H. R. S.-Quarterly.

తాత్కాలికములగుటచేతను, ఖాయములు కాకపోవుటచేతను వారికి వయస్సుమీఱినతరువాత నియుక్తులగుటచేతను, ప్రభుత్వమువారివలన సుపకారవేతనము పొందుటకు నర్హతలేదని ప్రభుత్వమువారు నిర్ణయించిరి – అందుచే వారు, తిరిగి మద్రాసు చేరుకొని యుద్యోగ ప్రయత్నము చెయవలసి వచ్చెను.

అప్పటిలో మదరాసు విశ్వవిద్యాలయములో చారిత్రక శాఖవారి పరిశోధన నిమిత్తము, తెలుగుభాషలోనున్న మెకంజీ సంపుటములను నాంగ్లభాషలోనికి భాషాంతరీకరించుటకు నొక నసమర్థుడైన వ్యక్తి కావలసివచ్చెను – కవిగా రాపనికొఱకు నియుక్తులైరి. వారు పనిలో రమారమి 50 సంపుటములను నాంగ్లభాషాంతరీకరణముచేసిరి.[1]

## తిరుపతి దేవస్థానము

కవిగారు మద్రాసులో నొకసంవత్సరము మాత్రమే యుండిరి. క్రీ. శ. 1933 లో తిరుపతి అప్పటి మహంతుగారి ఆదరణమునకు వారు దేవస్థానమున విద్యాశాఖాధికారిగా నియమింపబడిరి.[2] ఆస్థానమునందు నియుక్తులుకాగానే వారు – "శ్రీవేంకటేశ్వర" అను ప్రాచ్య పరిశోధన పత్రికను నెలకొల్పిరి. అందు, పెక్కు నూతన పరిశోధక వ్యాసములను ప్రకటించిరి. అది పదినెలలు మాత్రమే సాగినది–కవిగారి యుద్యోగములో రెండు మూడేండ్లు మాత్రమే యున్నారు. ఆవెనుక వారు నాల్గేండ్లు ఉద్యోగములేక తిరుపతియందే యుండిరి. ఇంతలో వారి కనుకూలముగా తిరుపతి దేవస్థానమువారు–

"శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య పరిశోధనసంస్థ"ను 1940 లో స్థాపించిరి. ఆ సంస్థ యందు కవిగారిని సంస్కృతశాఖయందు శాఖాధ్యక్షునిగా నియమించిరి. శ్రీ ప్రభాకర శాస్త్రిగారిని తెలుగుశాఖాధ్యక్షునిగా నియమించిరి. కవిగారు వేంకటేశ్వర ప్రాచ్య విద్యా సంస్థయందు – పదునాల్గేండ్లు క్రీ. శ. 1954 వఱకు పనిచేసిరి. అచ్చట వారుచేసిన వ్యాసంగము ఆయాశీర్షికలలో తెలుపబడును.

## చరమదశ

కవిగారు తిరుపతియందుద్యోగమునందున్నను వారి యార్థికపరిస్థితులట్లేయుండెడివి. శ్రీ తిరుపతి దేవస్థానమువారు, వారివద్దనున్న యమూల్య తాళపత్రసంచయమును అయిదువేలరూపాయలకు కొనిరి. కాని కవిగారికా ద్రవ్యము దక్కలేదు.

---

1. కవిగారి వెనుక, వారు సంస్కృతములోసాగించిన పరిశ్రమలోతక్క, తక్కిన వానియన్నింటియందును, నేను పాల్గొనుభాగ్యము లభించినది. మెకంజీ సంపుటములను కవిగారు విడిచినవెనుక నేను మిగిలిన 120 సంపుటములను నాంగ్లేయభాషలో భాషాంతరీకరించినాను. కవిగారివి, నావి వ్రాతప్రతులు మదరాసు విశ్వవిద్యాలయములో నున్నవి.

2. T. T. Devastanam's Educational Officer.

కవిగారి కిరువురుకొడుకులు. పెద్దవాడు రాధాకాంతయ్య, రెండవవాడు రమాకాంతయ్య. కవిగారు రాధాకాంతయ్యను పట్టభద్రునిగా జేసినారు—రెండవవానికి తగినవిద్య చెప్పించినారు. కాని యిద్దరును తండ్రి కక్కరకురానివారైనారు. అందును, పెద్దవాడైన రాధాకాంతయ్య తనకు వార్ధక్యమున తోడుపడునని, ఆతని పేరుపెట్టి యొక వ్యాసమును కూడ వేంకటేశ్వర పత్రికయందు ప్రకటించినారు. కాని యాతడు తండ్రిఘనతను గుర్తించలేడు; తమ్మునిలోగూడ ఎదురుతిరిగినాడు. దేవస్థానమువారు తాళపత్ర సంచయమున కిచ్చిన ద్రవ్యమంతయు వారిరువురు దోచుకొనిపోయినారు. కవిగారు నిర్ధనులైనారు. వారికి భోజనము తిరుపతిలో నొక హోటలుయజమాని యుచితముగా పెట్టెడివాడన్నచో, ఆ మహానుభావుని స్థితి యెట్లుగా పరిణమించినదో పాఠకలోక మూహింపవచ్చును.[1]

## ద్రవ్యసహాయము—డాక్టరు పి. యస్. ఆర్. అప్పారావుగారు

శ్రీ రామకృష్ణకవిగారికి చివరిదశలో వాస్తవముగా ద్రవ్యసహాయముచేసినవారిలో నగ్రగణ్యులు, భరతనాట్యశాస్త్రానువాద, ఆంధ్రనాటకవికాస గ్రంథకర్తలునైన డాక్టరు పోణంగి శ్రీరామ అప్పారావుగారు. వారికి కవిగారియందు నిరవధికము, నిరుపమానము, నిష్కళంకమునైన భక్తిప్రపత్తులు గలవు. వారెంతో శ్రమచేసి కేంద్రప్రభుత్వమువారి వలన – గౌరవవేతనము నేర్పాటుచేయించిరి. కాని దానికిని కొంతమంది అడ్డుపడిరి; అది స్వల్పమేయయ్యెను. ఇతరత్ర వారికి శ్రీ అప్పారావుగారు గుప్తముగా తమ కప్పుడున్నపరిమితిలో నెంతేని ద్రవ్యసహాయము చేసిరి. తమ నాట్యశాస్త్రమును, వారి ఛాయాచిత్రముచే నలంకృతము చేసిరి. నేడు కవిగారి గ్రంథవ్యాస పునర్ముద్రణ ప్రణాళికయంతయు వారు చేపట్టి, కవిగారి జ్యోతిర్మయ శరీరమును ప్రకాశమాన మొనర్చుచున్నారు. ఇది యాంధ్ర విద్వల్లోక మత్యంతము నభినందింపదగినది.

కవిగారు ది. 20-9-1957న దివంగతులైనారు. వారివయస్సు 91సంవత్సరములు. వారొకమారు ప్రఖ్యాత పత్రికారచయితలు, భాషావేత్తలు అయిన శ్రీ తిరుమల రామచంద్ర గారితో ఇట్లన్నారట. రామచంద్రగారు వారినిగురించి వ్యాసమువ్రాయవలెనని పుట్టు పూర్వోత్తరాలు తెలుపుడని అడుగగా, కవిగారు ఒక్కవెడ నవ్వునవ్వి – "నే నప్పుడే చచ్చిపోతాననుకున్నావా? ఇంకా కనీసం యిరువైసంవత్సరాలన్నా బ్రతుకుతాను. సెంచరీ కొట్టాలనే నాఆశ. నేను పోయినతరువాత వ్రాసేదేమో వ్రాయవచ్చునులెండి" అన్నారట.

కవిగారి "నిరీహకు, నిరాడంబరతకు" రామచంద్రగారు హతాశులైనారట.[2]

---

1. "నేనెఱిగిన మానవల్లికవి" – పోణంగి శ్రీరామ అప్పారావు – ఆంధ్రప్రభ (దినపత్రిక) – అక్టోబరు 13, 20 – 1957.
2. చూడుడు – వారివ్యాసము—మహిత సాహిత్యజీవి మానవల్లి రామకృష్ణకవి. భారతి సం. 34, సం. 10. (అక్టోబరు 1957) పుటలు 22-32. కవిగారి మహోన్నత సంస్కృత భాషా పాండిత్య ప్రతిభను ప్రదర్శించు ప్రశస్త రచన.

కవిగారి మాటలు కొంతవరకు సార్థకములైనవి. వారు పరమపదించిన వెనుకనే-రామచంద్రగారు వ్యాసము వారినిగూర్చి వ్రాసిరి.

కవిగారు శతాయుష్కులు కాలేదు. అయితేనేమి వారి మూర్తిమత్త్వ మాంధ్ర సాహిత్యప్రపంచమున-శతాబ్దుల పర్యంతము జ్యోతిర్మయరూపముతో ప్రకాశించుచునే యుండును.

## కవిబిరుదము

కవిగారు బిరుదముచేగాక జన్మతః కవులు. కాని వారికీబిరుద మెప్పు డెవరిచ్చిరో తెలుసుకొనుట దుస్సాధ్యముగనే యున్నది. కవిగారు[1] క్రీ. శ. 1900 పూర్వమే 'మృగావతి' మొదలగు కావ్యములను రచియించి ప్రసిద్ధిగన్నవారు. (1897 లో వైజయంతి పత్రికలో 'మృగావతి' పునర్ముద్రితమైనది. అందులో కవిబిరుదము పేర్కొన బడినది.) ఇక ఆప్తవాక్యమే ప్రమాణము.

ఆకాలమున మదరాసులో నాంధ్రసాహిత్యపోషకులుగా నుండినవారు పనప్పాకము ఆనందాచార్యులుగారు. వారి పాండిత్య విభూతిని, వైదుష్యమును మెచ్చుకొని, నవద్వీప పండితులువారికి - ''విద్యావినోది'' అను బిరుదు నొసగిరి. ఆనందాచార్యులుగా రున్నత న్యాయస్థానమున ప్రముఖ న్యాయవాది. నెలకు వేలకుమించిన యార్జనగలవారు. వారి గృహమే యానాటి కవిపండితులకు రాజాస్థానము. వారును సామాన్యులుగారు. అభినవ పండితరాయ మాడభూషి వేంకటాచార్యులు, కొక్కొండ వేంకటరత్నము పంతులు మొదలగువారు..''వైజయంతి'' అను మాసపత్రికనుబెట్టి యందు ప్రాచీనగ్రంథములను, నవీనరచనలను ప్రకటించెడివారు. వారు కృతి భర్తలేగాక కృతికర్తలు - మంజువాణీ విజయము మున్నగు ప్రశస్త వచనగ్రంథములు రచించినవారు.

మన కవిగారు ప్రథమమునుండి వైజయంతీ పత్రికతో సంబంధమున్నవారు. వారే మొదటిసారిగా ఎఱ్ఱన నృసింహపురాణము పరిష్కరించి, చివర కొంతభాగము పోగా దానిని పూరించి యాపత్రికలో ప్రకటింపఁజేసినవారు.

---

1. విశాఖపట్టణమున-సుప్రసిద్ధ పండితులు, కవితా సమితి అధ్యక్షులునగు మారేపల్లి రామచంద్రశాస్త్రిగారికి 'కవిగార' ని వ్యవహారమున్నది. ఆ పట్టణములో మారేపల్లి రామచంద్రశాస్త్రిగారన్న నెవ్వరికిఁ దెలియదు. వారు క్రీ. శ. 1893 లో విశాఖపట్టణము వచ్చినపు డచ్చటివారు-రవివర్మ మేనకా విశ్వామిత్ర చిత్రమును చూపి వర్ణింపుమనిరట. వెంటనే శాస్త్రిగారు ఒక ఉత్పలమాలిక 24 చరణములు గలదిచెప్పిరి. శ్రీ పి. టి. శ్రీనివాసయ్యంగారు అను అద్భుతమేధానిధులు వారిని 'కవిగారు' అను బిరుదముతో సమ్మానించిరి. నాటినుండి వారు కవిగారనియే వ్యవహృతులు.

ఆనందాచార్యులవారి యింట నెప్పుడును విద్వద్గోష్ఠులు జరుగుచుండెడివి. శ్రీ ప్రభాకరశాస్త్రులవారును చెన్నపురి మొదట వెళ్లినప్పుడు, వారినిదర్శించి, యాగోష్ఠులలో పాల్గొనెడివారు.

ఒకనాడా గోష్ఠిలో— ''ప్రాచీన పండితులు, ప్రాచీన కావ్యసంప్రదాయము నెఱిగిన కవులుతప్ప, పాశ్చాత్య భాషాపట్టభద్రులు తెలుగున కవిత్వము చెప్పలేరని–అక్కడి వారు పలికిరట - వెంటనే ఆనందాచార్యులుగారు ''మీమాట యెంతమాత్రమూ సరిగాదు. ఇక్కడనే కూర్చొనియున్న మానవల్లి రామకృష్ణయ్యగారు-ప్రాచీనకవులతో తులతూగునట్లు కవితారచన చేయగలవారు. ''అని వారికి ప్రత్యుత్తరమిచ్చి, కవిగారిని కవిత జెప్పుమనిరట. వారు తత్ క్షణమే, అసమాన ధారాశుద్ధితో, అనుపమాన పదబంధముతో పాటలీపుత్రకమను తమరచనలోని కొన్నిపద్యములను, ఆశువుగాచదివిరట - ఆనందాచార్యులుగారును, సభ్యులును నత్యంతాశ్చర్యములో మునిగిరట. గోష్ఠిలోనివారందఱూ నేకగ్రీవముగా ''వీరే నిజముగా కవులు''అని ప్రశంసించినారట. అప్పుడందఱిసమక్షమున– ఆనందాచార్యులుగారు, ''రామకృష్ణయ్యగారూ : నేటినుండి మీరు, మానవల్లి రామకృష్ణకవి–అని బిరుదుపేరు సభాముఖమున నందజేయుచున్నాను. మీరీపేరుతోనే పేరెన్నికగనుడు'' అని వారిని సత్కరించిరట.[1] నాటినుండి రామకృష్ణయ్యగారు జీవితాంతము వఱకు కవిగానే యున్నారు–వారి సంతకము గూడ నదియే.

## మానపల్లి రామకృష్ణకవి (M. R. Kavi) అనియే కవిగారి కవితారచన

కవిగారి కవితారచన యనన్యసామాన్యమైనది. అది నవీనయుగమున ప్రాచీన మహాకవి తిరిగి యవతరించెనా యని తోపింపజేయును. కవితారచనయందు వారికి గల యిట్టి యద్భుతశక్తినిపురస్కరించుకొనియే మొదట కవిగారు క్రీ.శ. 1908 లో కుమార సంభవము ప్రకటించినపుడు అది వాస్తవముగా ప్రాచీన కవియగు నన్నెచోడని రచన కాదనియు, కవిగారే రచియించి, నన్నెచోడ కవిపేరు పెట్టినారన్న యపవాదము దేశమున వ్యాపించినది. ఈ విషయము వారే ఆపీఠికలో తెలిపినారు. ఒకవేళ విధివశమున నేదేనొక ప్రాచీనకావ్యమున కొన్నిభాగములు లుప్తములైనను అదేధోరణిలో తూచా తప్పక దానినిపూరించదగిన సామర్థ్యము గలవారు కవిగారొక్కరే. అంతమాత్రముచేత వారట్లు చేసిరనికాదు. అది వారి అసాధారణ ప్రతిభనే వ్యక్తము చేయును. ఇక వారి కవితారచనలనుగూర్చి తెలిసికొందము.

---

1. ఈ యుదంతము గ్రంథస్థము చేయలేదుగాని, కవిగారికా బిరుద మొసంగిన సభలో ప్రత్యక్షముగానుండిన శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు నాకు చాలాకాలము క్రిందటనే తెలిపిరి.

## కావ్యరచన

కవిగారు తమ పేరు సార్థకమగునట్లు కమనీయము, రసబంధురము, ప్రౌఢమునగు కవితారచన చేయగల సామర్థ్యముగల మహాకవులు-ప్రాచీనకవుల రచనలను జీర్ణించు కొన్నవారగుటచేత - వారి పద్యకృతులు సానలుదీటి, నవీనకాలములో రచితములైనను నవి ప్రాచీనకృతులవలెనే భాసిల్లుచుండును. వానియందలి పదబంధము, వర్ణనానైపుణ్యము, భావోన్మీలనము, నానాశాస్త్ర కళా సంప్రదాయపరిజ్ఞానము చూచినచో, వారి పేరు లేకుండ వారి కావ్యములు ప్రకటితములయినట్లయితే, అవి తప్పక అష్టాదశ ప్రాచీనకవి రచితములని మనము తప్పక భావింతుము.

కవిగారిట్టి ప్రాచీన కవనపథకమున నిష్ణాతులగుటచేతనే, కుమారసంభవమును వారు ప్రకటించినపుడు, దానిని కవిగారే రచించి, నన్నెచోడుని పేరు పెట్టినారని యాకాలమున విద్వాంసులు, కవులు ప్రవాదము లేవదీసినారు. కవిగారు తమకట్టిసామర్థ్యములేదని వినయముతో విన్నవించినారు.[1]

అప్పటికి కవిగారు, కవినామముతో ప్రఖ్యాతులైనారు. వారి తొలికృతి—

## మృగావతి

ఇది నాల్గాశ్వాసముల ప్రశస్తప్రబంధము. సోమదేవసూరి కథాసరిత్సాగరమున నుదయనుని కథలోని యొకఘట్ట మితివృత్తముగాఁ గైకొని, కవిగారు దీనిని రచించినారు. ఇందు—

| | | |
|---|---|---|
| ప్రథమాశ్వాసమున | 108 | పద్యములు |
| ద్వితీయా ,, | 308 | ,, |
| తృతీయా ,, | 157 | ,, |
| చతుర్థా ,, | 158 | ,, |

గలవు.[2] కవిగారు, కౌమారవయః ప్రారంభములో దీనిని రచించుటచే నిది శృంగార రసప్రధానముగానున్నది. ఈ కావ్యమును పరిశీలించినకవిగారిపై మనుచరిత్ర ప్రభావము హెచ్చుగా పడినట్లు కన్పట్టును.

---

1. చూ. కుమారసంభవము ప్రథమభాగ ముద్రణ (పీఠిక-1908).

2. ఇది క్రీ శ. 1890 లో తొలుత ప్రకటితమై, ఆ వెనుక-1897లో వైజయంతీ పత్రికలో పునర్ముద్రణమైనది.

పెద్దన—

సీ. మృగనాభినికరంపు బుగబుగల్ గలచోటఁ
జదలేట తుంపురుల్ చెదరుచోట
వకుళవాటీగంధవహుఁడు పైకొనుచోటఁ
గర్పూర తరుధూళి గప్పుచోటఁ
బసమీఁజుసెలయేఁజు లిసుకవెట్టినచోటఁ
జిగురుమావులసంజ నిగుడుచోట
నవమాలికలతేనె నట్టొట్లు పడుచోట
మాణిక్యదీపముల్ మలయుచోటఁ
తే. బ్రమదమునఁ దేఁటు లెలుగెత్తి పాడుచోట
శారిక లనంగశాస్త్రముల్ చదువుచోటఁ
గీరకలకంఠములు గ్రొవ్వి కేరుచోటఁ
బావురము లారజంబుగాఁ బలుకుచోట. (3-111)

పెద్దన తెలుగు, సంస్కృతపదముల యల్లికతో విభక్తము గావించిన విధానమునకు మెఱుఁగుపెట్టినట్లుగా, కవిగారు ప్రతిపాదసమాసైక రచనతో నీ క్రిందరచనగావించినారు.

సీ. అప్సరః ప్రేమాస్పదానీతకల్ప పా
దపపుష్పఝల్లరుల్ దనరుచోట
సామంతసీమంతినీ మంగళారణ్య
మల్లికాహారముల్ మలఁగుచోట
నన్యరాజన్య కన్యాహస్త నిర్మిత
రంగవల్యాదులు గ్రాలుచోట
విప్రవనితంబినీ విన్యస్తకేతకీ
స్తంభచతుష్కంబు దగులుచోట
గీ. జిగిని జిగురాకు పందిరుల్ నిగుడుచోట
మాలతీదామజాలముల్ ప్రేలుచోట
జగతి నిర్మించిరన్నువల్ సరసనరస
దీపకళికావిలాసముల్ దోపుచుండ. (2-53)

పెద్దన పాదలేపనౌషధవిహీనుడైన ప్రవరుఁడు తాన స్వస్థలానికి చేరలేక—

సీ. గీ. అతిథి సంతర్పణంబు లేమయ్యెనొక్కొ-
అగ్నులేమైనవొక్కొ- నిత్యంబులైన
కృత్యములఁబాసి దైవంబ కినుకనిట్లు
పారవైచితె మిన్నులు పడ్డచోట. (2-7)

అని వగచిన సందర్భమును పురస్కరించుకొని, కవిగారు కథానాయికయైన మృగావతిచే నిట్లుపలికించినారు. కథలో మృగావతి యుద్యానవనమునవిహరించుచుండఁగా, నామెశరీరము కొంచె మెఱుపురంగు కలిగియుండుటచేత నా సమయమున నాకాశమునబోవుచున్న యొక విహంగము ఆమె యొక మాంసపుముద్దయనిభావించి, ఆమెను భద్రముగా నెత్తికొనిపోయి ఒక కొండ చరియయందుంచెను.

కొండచరియమీద చేరగానే, ఆమెకు స్మృతిరాగా, ఆమె యిట్లువిలపించును—

ఉ. ఎచ్చటనున్నదాన నిది యెక్కడి పర్వతబృంద మెట్లు పో
వచ్చును వత్సభూమికిట ప్రాలెడు భాస్కరుఁ డస్తవారిలో
ముచ్చులు బెట్టిదంపు మృగముల్ ఫణిరాజులు దాచరింప రే
యిచ్చట నిల్వనేర్తునె ప్రియేశ్వరవాసతికమ్మఁజూతునే. (3-17)

ఇందలి సరస్వతీస్తుతి తక్కిన కవులరచనకంటె మనోహరమై, నూతనభావము లతో నొప్పుచున్నది.

గీ. గంధ రసరూప సంస్పర్శకంబులైన
నాల్గు గుణములు శబ్దగుణంబునందు
నడఁగునని యనంతంబ శబ్దార్థినగుచు
నమృతమూర్తిని భారతి నాశ్రయింతు. (1-2)

పై పద్యము చిన్నదైనను, అర్థవిచారణచేసిన మిక్కిలి పెద్దది. పంచభూతము లలో ఆకాశము శబ్దగుణప్రధానము. తక్కినవానికి గుణములివి—

పృథివి — గంధము
జలము — రసము
తేజము — రూపము
వాయువు — స్పర్శము
ఆకాశము — శబ్దము

కవిగారు శబ్దగుణమునందే తక్కిన నాలుగుభూతముల గుణము లంతర్భూతము లైనవని కావ్యపరముగా వాని నన్వయించినారు. కావ్యము శబ్దమయము - శబ్దమయ మూర్తి భారతి-ఆ సమన్వయ మిట్లు వివరింపవచ్చును :

| పంచభూతములు | కావ్యము |
|---|---|
| 1. పృథివి - గంధము - పదార్థము — | కావ్యవస్తువు పదార్థము (పద + అర్థము) - కావ్యవస్తువు కవిభావనచే వాసించును. |
| 2. జలము - రసము — | రసము - శృంగారాది రసములు. |
| 3. తేజము - రూపము — | కావ్యస్వరూపము - కాంతియను నలంకార కావ్యగుణము. |
| 4. వాయువు - స్పర్శ — | వాయువు శరీరమునకుఁ దగులును. కానిశబ్దమునకు గల సౌరభము మనస్సునకు తగులును. సౌరభ్యము వాయువునకు ప్రధానగుణము- శబ్దమునకు సౌరభ్యము గలదని మహాకవు లందఱును వర్ణించిరి. |
| 5. ఆకాశము శబ్దగుణము — | కావ్యము - శబ్దమయము కావున తక్కిన నాలుగుగుణము లిందు నిమిడి సమన్వయము చెందినవి. |

తిక్కన—

"తలపుం దళంబులనే సౌరభమిచ్చు
గంధవహుచందమునన్"

పెద్దన—

"వక్షోజ ద్వయ గంధసార
మస్సృణ ద్వైరాజ్య భారంబు
నధ్యక్షించున్ గవిసార్వభౌమ భవ
దీయ ప్రౌఢ సాహిత్యముల్"

మాదయగారి మల్లన—

గీ. సరస సంస్కృత పుష్ప గుచ్ఛ ప్రభూత
మగు తెనుంగను నెత్తావి కఖిలదిశల
తరుణ పవమానమగు కవిత్రయ విశేష
చతుర వాచానిరూఢి కంజలియొనర్తు.

ఇచట శబ్దము-పూవు; అర్థము-తావి; పూవు గుణము తావి.

ఇంకను నీకావ్యమున పెక్కు మనోహరములగు శాస్త్రీయసంప్రదాయములు గలవు. వానినన్నింటిని విస్తరించుటకు నవకాశములేదు. పద్య రచనారీతి హృద్యమైయున్నది. మచ్చునకు—

శా. మల్లెల్ గోసి మరందబృందముల భర్మస్థాలికాపాలిలో
బల్లీ కన్యలునింపఁగా మునికి నేపాళీమణుల్ గోస్తనీ
వల్లీ నిర్మిత కాయమానముల భవ్యంబైన పూజావిధుల్
సెల్లింపన్ రహి నుద్యమింతురు యువశ్రీగోరు చందంబునన్. (1-60)

ఇంత ప్రతిభాసంపన్న ప్రసన్న గంభీరరచనచేసియు, కవిగారు కావ్యాంతమున కవుల నెట్లు వేడికొనిరో చూచిన-వారి వినయసంపత్తి విశదముకాఁగలదు—

"ముని కవితాపయోధి దిగి ముత్యములేర్చిన సత్కవీశులన్
గనుట వయోమనీషలను గాలములూనక మున్గియేనునుం
గనుఁడిదె తెచ్చితిన్ శిలయొ గవ్వయొ కృత్రిమరత్నమో యెఱుం
గను కవులార యెట్లు ననుఁగాచెదరో కరుణార్ద్రచిత్తులై." (4-150)

పై పద్యమునుబట్టి యీనాటికవులలో కొందఱకున్న యహంభావము కవిగారి కేకోశమునందును లేదని చెప్పవచ్చును.

## వసంతవిలాసము

కవిగారి కౌమార వయఃప్రారంభమున మృగావతి రచితమైనదని యీవఱకే తెలిపితిని. ఆవెనుక కవిగారు, పాటలీపుత్రక కావ్యము, భాసనాటకాంధ్రీకరణములు (కర్ణభారము, అవిమారకము), కళింగసేన అనెడి స్వతంత్ర ప్రకరణము, వత్సరాజచరిత్ర నవల రచించిరి. పండబారిన ప్రౌఢవయస్సులో వారు "వసంతవిలాసము" అను నత్యద్భుత కథాసన్నివేశముగలదై, కళాపూర్ణోదయమునకు పూర్ణముగా సాటివచ్చు వసంతవిలాసము[1] అనెడి రసవత్కృతిని రచించినారు.

---

1. క్రీ. శ. 1340 ప్రాంతమున - కవిగారి కాఱుశతాబ్దములకు పూర్వము నాచన సోమన, "వసంతవిలాసము" అను కృతి రచించినాడు. అది యలభ్యము. లక్షణ గ్రంథములనుండి మూడుపద్యములు మాత్రము లభించుచున్నవి. జాజర పాటను గూర్చిన మొదటియాకర మిందేగలదు.

వీణాగానము వెన్నెలతేట
రాణను మించిన రమణులపేట
ప్రాణమైన పిన బ్రాహ్మణుపీట
జాణలు మెతురు జాజరపాట.

ఈకావ్యమింకను అముద్రితముగానేయున్నది. ఇది విద్వత్పోషకులు, విద్వాంసులు నైన ఏలూరిపాటి రామభద్రచయనులుగారు కృతినందుట కంగీకరించిరి. కవిగారు వ్రాత ప్రతిని వారికిచ్చినారు. కాని యేకారణముచేతనో, వారి కంకితముగాలేదు. చయనులుగారు జాలముచేసినారు. కవిగారికి తమరచన తమ జీవితకాలములో ముద్రితమగునా అన్న సందేహముకలిగినది. అది సత్యమైనది. చయనులుగారు,[1] కవిగారు యిరువురుగతించిరి. తుదకు కవిగారి వ్రాతపత్రియేమైనది అన్న పరిస్థితికివచ్చినది. కాని బహుకష్టముపై నిది లభించినది.[2] (ఈసంపుటమున ఇందలి కృత్యాది ముద్రితమైనది).

ఈకావ్యమున తొమ్మిదాశ్వాసములున్నవి (కాని యందు 6వ యాశ్వాసము లభ్యము కాలేదు). ఇదియంతయు నిర్వచనమగు పద్యకావ్యము.

| | | | |
|---|---|---|---|
| 1. | ఆశ్వాసము | ... | 249 |
| 2. | ,, | ... | 255 |
| 3. | ,, | ... | 256 |
| 4. | | | 280 |
| 5. | | | 267 |
| | | | |
| 7. | | | 368 |
| 8. | | | 233 |
| | | | 454 |
| | | | 2362 |

ఆశ్వాసాంత గద్య యిట్లున్నది—

"ఇది శ్రీకలాంకకవి విరచితంబగు వసంతవిలాసంబునందుఁ బ్రథమాశ్వాసము."

'కలాంకకవి' అనునది కవిగారు పెట్టుకొన్న సాహిత్యనామము (pen-name.)

---

1. చయనులుగారు, తణుకునుండి – "సారస్వత సర్వస్వము" అను ప్రసిద్ధ సాహిత్య పత్రికనడపిరి. అందు 13 సంచికలే వెలువడినను, అన్నియు నమూల్యములై పరిశోధకుల కుపాదేయములుగ నున్నవి.

2. ఈగ్రంథ మలభ్యమగునేమో అన్న సందర్భములో, కవిగారి గ్రంథ ప్రణాళికా సంపాదకులగు డాక్టరు పోణంగి శ్రీరామ అప్పారావుగారు (పి. యస్. ఆర్. అప్పారావుగారు) మిక్కిలి శ్రమచేసి, ద్రవ్యమువెచ్చించి, దానిని సంపాదించినారు. ఇది యెంతయుఁ బ్రశంసనీయము.

## వత్సరాజ చరితము - నవల

వత్సరాజ చరిత్రనుగూర్చి యీవఱకే కొంత తెలిపినాను. కవిగారు రాజమహేంద్రవరము ప్రభుత్వ మాధ్యమిక పాఠశాలలో నున్నప్పుడు, ఆయనకు ధనసహాయము చేయ దలచి, ప్రధానోపాధ్యాయులైన పేకుమళ్ల అచ్యుతరావుగారు వారిచేత పాఠశాలలలో, పైతరగతుల కుపయోగపడు వచనగ్రంథము వ్రాయించిరి. అట్టి వచనరచనమే వత్సరాజ చరితము. ఈ రచన క్రీ. శ. 1927 లోనే జరిగినది. అచ్యుతరావుగారు ముద్రితమైన తక్షణమే దానిని ప్రభుత్వమువారి పఠనీయ గ్రంథసంఘమువారిచే - పాఠశాలలలో పఠనీయగ్రంథముగా నంగీకరింపజేసిరి. ఈ గ్రంథమునుగూర్చి పాఠకలోకమునకు తెలియకుండుటచే నా వివరముల నిచ్చుచున్నాను.

(అట్టమీదఉన్న వివరములు).

**Vatsaraja Charitamu**

**Approved by the Text-Book Committee for school use (Vide Fort. st. George Gezette 19th April, 1927).**

**by**

**M. Ramakrishnakavi, M.A.**[1]

(ముఖపత్రము)

రాజకథావళి - సంపుటము 1.

శ్రీ

**వత్సరాజచరితము**

మానవల్లి రామకృష్ణకవి విరచితము

ఇది

వి. కె. వెంకటసుబ్బశాస్త్రిలవారిచే

రాజమహేంద్రవరము

శ్రీ చింతామణి ముద్రాక్షరశాలతో ముద్రింపించి

ప్రకటింపఁబడియె

1928.

---

1. ఆకాలములో ప్రభుత్వమువారి యాజ్ఞననుసరించి, పాఠశాలలలో పఠనీయగ్రంథముల పేళ్లు, గ్రంథకర్తల పేళ్లు ఆంగ్లభాషలో ముద్రింపవలెను.

కవిగారీగ్రంథరచనకు కారణము నిరూపించుచు చిన్నపీఠిక వ్రాసినారు.

"ఆంధ్రవాఙ్మయమున కిది నవలయుగమందురు. నవలాయుగమైన గావచ్చును. నవలలువ్రాయటకున్నఁ బాండిత్యము సమగ్రము కానేరదు. గ్రామ్యభాషలో వ్రాయనేరని వారు సంస్కారికారు. అట్టివారు వృద్ధులైనను మరలఁ బాఠశాలలోఁ జదువుటయేమేలు. మహాప్రవాహమువలె గదలుచున్న కాలమహిమ కడ్డుపడి యెవ్వరెదురీఁదగలఁడు? ప్రాచీనమహాకావ్యములు సహస్రచిత్రపరిశోభితములగు శిలాప్రాసాదములవలె శిథిలములై దారితప్పిన తెరువరికి మాత్రమే క్షణకాలము విస్మయాపాదకములగుచున్నవి. ఇప్పుడో యీ నెలధ్వంసువలె క్షణదృష్టనష్టములగు కృతిజాలములఁ బూర్వగ్రంథములలోనుండి—

తఏవ పదవిన్యాసాస్తా ఏవార్థవిభూతయః
తథాపి నవ్యంభవతి కావ్యంగ్రంథన కౌశలాత్.

అవియే శబ్దవిన్యాసములు, అవియే యర్థసంపదలు; ఆయినను గ్రథనకౌశలముచేఁ గావ్యము నూతనమగుచున్నది - అన్నట్లు క్రొత్తగా నెన్నిటినైన బుట్టింపవచ్చును. ఈకార్యము జరిపిచూతమని శూద్రకరచితమగు వత్సరాజచరిత నాటకమును మూడంకములవఱకు నాధారముచేసుకొని తరువాత యథేచ్ఛముగారచించి యందందు శూద్రకుని పద్యభావములను గ్రహించి యీనవలను రచించితిని. ఇది కేవలము సలక్షణభాషఁగోరు పాఠశాలల విద్యార్థిబృందములకై యౌచిత్యము నతిక్రమింపక రచియింపఁబడియె. అందుచే రుచిరరసవృద్ధుల కిందు న్యూనతదోషకమానదు. ఎట్లున్నను సహృదయులు దీనిని గర్హింపక బాలభాషాశిక్షకు వినియోగింతురని నమ్ముచున్నాను."

మా. రామకృష్ణకవి.

పై పీఠికనుబట్టి తమకాలమునాటి సాహిత్యపరిస్థితులను గమనించి కవిగారు నవ్యసాహిత్యప్రక్రియలలో ప్రచురమైన నవలనురచించిరని తెలియుచున్నది. నవ్యసాహిత్యప్రక్రియలలో ప్రచురమైన నాటకప్రక్రియనువారు భాసనాటకాంధ్రీకరణముల మూలమున, స్వతంత్ర నాటకరచనచేతను (కళింగసేన) వారంతకుమున్నే సాధించినారు. నవల ప్రక్రియకు నుదాహరణముగా దీనిని రచించినారు.

కవిగారు వ్రాసినట్లాకాలము - క్రీ. శ. 1920-30 ప్రాంతము ఆంధ్రసాహిత్యమున నవలలు విశేషముగా వెలువడుచుండిన కాలము. చిలకమర్తివారి 'చింతామణి' బహుమతి నవలలు రామచంద్రవిజయము, హేమలత, అహల్యాబాయి, కర్పూరమంజరి; విజ్ఞానచంద్రికామండలివారి నవలలు భోగరాజు నారాయణమూర్తిగారి విమలాదేవి, కేతవరపు వేంకటశాస్త్రిగారి రాయచూరుయుద్ధము దేశమునందు విశేషప్రచారము లోనికి వచ్చినవి. సులభసుందరమైన రచన, చదుపరుల కుత్కంఠ గలిగించెడి సన్నివేశాలు కలిగియుండుట చేత నివి ప్రజాసామాన్యము నతివేలముగా నాకర్షించినవి. వీనికితోడు 1921 సంవత్సరమున స్థాపితమైన ఆంధ్రప్రచారిణీ గ్రంథనిలయమువారు శ్రీ వేంకటపార్వతీశ్వర కవుల

నవలలను, ప్రవాహమువలె ముంచెత్తినారు. ప్రతి రెండునెలలకు క్యాలికో బైండుతో ముచ్చటైన అచ్చుతో నివి ఒకేఆకారమున వెలువడుచుండెడివి. 1928 నాటికి వారు 40 నవలలకు పైగా ప్రచురించినారు. ఇవియన్నియు ప్రాయికముగా వంగభాషనుండి భాషాంతరీకరణములే. శైలి గంభీరమై, సంస్కారముగలవారికిమాత్రమే అందుబాటులో నుండెడివి. రచన మనోహరమగుటచే నివి విశేషముగా వ్యాప్తిలోనికివచ్చినవి. వీనిలో 'మాతృమందిరము' మకుటాయమానమైనది. ఇది స్వతంత్రనవల.[1]

ఇట్టి ఉదాత్తరచనలతోపాటు వేగుజుక్క గ్రంథమాలవారి వాడేవీడు, క్రొవ్వురాళ్లు, కౌలూరాయి మొదలగు అపరాధపరిశోధక నవలలు ప్రకటితములై ప్రజలలో నవల పఠనోత్సాహము రేకెత్తించినవి. ఇతర గ్రంథమాలలవారు (రామవిలాస గ్రంథమాల, పంచమజార్జి గ్రంథమాల) కూడ నవలలనే ప్రచురించెడివారు.

కవిగారు వ్రాసినట్లే నవల లాకాలమున-''ఈసుళ్ల''వలె, వెలువడుచుండెడివి. అవి వారుచెప్పినట్లు ''క్షణదృష్టనష్టములే''-అప్పుడేపుట్టి నశించునవి. నవలలో ఏవోకొన్నింటికి మాత్రమే వాఙ్మయమున స్థానములభించినది.[2]

వత్సరాజచరితము - నవలవాఙ్మయములో నిలువదగిన నవ్య ప్రశస్తరచన. పదిప్రకరణములలో వత్సరాజగు నుదయనుని చరిత్రము నవలగా రచితమైనది. తక్కిన నవలలవలెగాక-యిందు ప్రతిప్రకరణమునకు ముందు ప్రకరణోచితమైన రత్నములవంటి సూక్తులుగలవు. ఇది వారు నవలరచనలలో ప్రవేశపెట్టిన మొదటిమార్పు—

1. ఆడుబిడ్డలతండ్రి చింతార్తుఁ డెపుడు.

—భానుడు.

2. విధివినోదము వారింపఁగ మనుజకోటి వశమే యెపుడున్.

—చనసోముడు.

---

1. నా ఆంధ్రవచన వాఙ్మయము-నవ్యయుగము-నవల (అముద్రితము). ఇందు నవల రచనలలో ప్రథమ, ద్వితీయ నవలల విషయముగలదు. మాతృమందిర మీనడుమనే పునర్ముద్రణమునందినది.

2. స్వాతంత్ర్యము రాకముందు తెలుగుభాషలో కొవ్వలి రాజేశ్వరరావుగారు వ్రాసినన్ని నవలలేరచయితయు వ్రాయలేదు. 1950కి వారిరచనలు 450. ఇవి మంచి రచనగలవే అయినను ధూమశకటవాఙ్మయమున (Railway Literature) చేరిపోయినవి. వీరి నవలారచన పరిశ్రమ గుర్తించి నేను వీరికి ప్రభుత్వ గౌరవ భృతి నిప్పించినాను.

స్వాతంత్ర్యానంతరము నేడు ''నవలయుగము'' ఉజ్జృంభించుచున్నది. కవిగారు చెప్పినట్లుగా నిది ''నవలాయుగమే.'' నేటి నవలరచయితలలో స్త్రీలు ప్రాముఖ్యము వహించుచున్నారుగదా.

3. "ప్రాయః పథ్యపరాఙ్ముఖా విషయిణో భూపా భవంత్యాత్మనా
నిర్దోషాన్ సచివాన్ భజత్యతిమహాన్ లోకాపవాద జ్వరః."
(రాజులు సుఖలోలురై నీతిపథ్యమున దప్పింపగా లోకాపనిందయను
జ్వరము మంత్రులను బీడించును.)

—అనంగహర్షుడు.

4. తన యంపిన కృత్య మరల తనపైవచ్చున్.

—వరదరాజు.

5. "అధోముఖస్యాపి కృతస్యవహ్నే
ర్నాధశ్శిఖాయాంతి కదాచిదేవ-"
(అగ్నిహోత్రుని తలక్రిందుచేసినను, దానిజ్వాలలు క్రిందికివాలక
యుచ్చయోన్ముఖముగానే ప్రసరించును.)

—అశ్వఘోషుఁడు.

6. "ఉదారసత్త్వం వృణుతే స్వయంహి శ్రీరివాంగనా"
(ఉదారసత్త్వుల లక్ష్మివలె నంగనయు స్వయముగా వరించును.)

— సోమదేవుడు.

7. చారచక్షులు గలిగిన జనవిభుండు
నిద్రవోవుచునైనను నెమ్మిఁజూచు.

—కామందకము.

8. "అలం రాజ్యశ్రియా తస్యాః శిష్యతాపి యదీయతే"
(దాని శిష్యత్వమైన లభించునేని రాజ్యశ్రీతోఁ బనియేమిః)

—చిత్రభానుఁడు.

9. మానోపిరమ్యోదయః.
(స్త్రీల యీర్ష్యాకోపములుసైతము రమ్యమగు నభ్యుదయమునిచ్చును.)

—చంద్రకుడు.

10. "అశోచ్యాహి పితుః కన్యా సద్భర్తృ ప్రతిపాదితా"
(మంచిమగనిఁబొందిన కన్య తండ్రి కానందముగూర్చుచు శ్లాఘ్యు
రాలగును.)

—కాళిదాసు.

ఇట్టిపద్ధతి యీనా డే నవలయందును గానరాదు. ఇట్టివానివలన నవలాపఠనము కేవలము వినోదముకొఱకేగాక, విజ్ఞానముకొఱకనికూడ తెలియగలదు.

రెండవది-కేవలము గ్రంథమంతయు వచనధోరణిలోనున్న విసువుకల్గింపవచ్చును. అప్పు డచ్చటచ్చట హాయినిగూర్చు పద్యరచనచేయుట. కవిగారు ఉభయభాషాకవికోవిదులు గాన సంస్కృతశ్లోకములుకూడ గలవు.

ఉదాహరణము—

శ్లో. జలదకువలయ త్విషావిశాలా
స్థల దళిగీత మనోజ్ఞకర్ణతాళా
లలిత శక్రగజ విలాస ఖేలా
సలలితనృత్త పథప్రచారలీలా.

క. రారమ్మ రమ్యమదజల
ధారలు తేఁటులకు ధర్మదారలుకాగన్
నారాజ్యలక్ష్మిఁ గొలిచిన
నైరావత దివ్యకీర్తి యలవడునీకున్.

మూడవది-సంభాషణలలో నాటకీయత.

ఉదా—

అంగా—విద్యకు బుద్ధిమాత్రమేగాక బోధకత్వమును దీక్షముగానుండవలెను.

పరి—ఇప్పుడుపదేశించు నాచార్యుడు నారదతుంబురులవంటివాడని వింటిని.

అంగా—నిజమే. అతనివీణ వత్సరాజుధరించిన ఘోషవతివలె జగన్మోహనముగాదు.

పరి—సృష్టిలో సమానత యెక్కడ? అది సమానమగునేని గుణభేదమ్ములేల యేర్పడును?

అంగా—నిశ్చయమే. భగవంతుఁ డనేక సుగుణములనిచ్చి వానికిఁ బొందికగాఁ దక్కినవాని నీయకున్న సామరస్య మెట్లేర్పడును?

పరి—అన్నిగుణములొక్కచోఁ జేర్చినయెడల బ్రహ్మకు దుర్విదగ్ధుడను నపకీర్తి యేల నిలిచియుండును?

నాల్గవది - ఇందలి శైలి ప్రసన్నగంభీరమై మనోహరమైయుండును-గజవర్ణన.

రాజు-నీవు భోజనప్రియుఁడవుగావా?

వసు-నేను వేటకాడనుగాను. చూడు మిదె దంతములు ముల్లంగివేళ్ల వలెను, కన్నులు గుండుమిరియపుగాయలవలెను, గుంభస్థలము లచ్చు బెల్లపుముద్దలవలెను, తొండములు సొరకాయలవలెను, చెవులప్పడములవలెను నందమై యీ యడవియంతయు వంటశాలవలె దోచుచున్నది. దీనిజూచినంత నాకాఁకలి ప్రజ్వరిల్లుచున్నది.

అడవిని వంటశాలగా వర్ణించిన దొక్క కవిగారే.

భాసలక్షణమై బాలబాలికలకు పఠనయోగ్యమైన యీనవల-వాసవదత్తా ఉదయనుల వివాహముతో ముగియుచున్నది. బహుగుణవిశిష్టతగల యీనవలను వెంటనే పునర్ముద్రణము గావించి, ప్రచారములోనికిదెచ్చి, పఠనీయగ్రంథముగా చేయుట యత్యంతావశ్యకము.[1]

## నాటకరచన

కవిగారు శ్రవ్యకావ్యరచనలోనేగాక దృశ్యకావ్యరచనమున సిద్ధహస్తులు. దృశ్యకావ్యములైన నాటకములలో రెండుతెఱగుల నాటకములను వారు రచించియున్నారు.

(1) భాషాంతరీకరణములు.

(2) స్వతంత్రనాటకములు.

## భాసనాటకములు

జగత్ప్రసిద్ధుడగు కాళిదాసమహాకవిచే పేర్కొనబడిన భాసుని నాటకములు అర్ధశతాబ్దముక్రిందట వెలుగులోనికివచ్చినవి. అవి కేరళదేశమున లభించుటచేత, తిరువనంతపురము ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారము పక్షమున శ్రీ టి. గణపతిశాస్త్రిలుగారు ప్రకటించి, యావత్ప్రపంచమున - భాసనాటక ప్రకటనకర్తలని ప్రఖ్యాతినార్జించిరి. అవి ముద్రితమైనతరువాతనే తెలుగున వానియనువాదము ప్రారంభమైనది. ఇది క్రీ.శ. 1913 ప్రాంతము.

కవిగారు భాసనాటకము లాంధ్రీకరించినవారితో తొలివారు. కవిగారితరువాతవారందఱు నా నాటకములు ముద్రితములైన తరువాతనే తెలిగించిరి. కాని కవిగారు, గణపతిశాస్త్రిలుగారు వానిని ప్రకటించుటకు పూర్వమే, వానినిగుర్తించి వాని నాంధ్రీకరించిరి. అప్పటివారికి భాసనాటకముల తాళపత్రప్రతులే యాధారము. ఈవిషయము వారు "కర్ణభారము"నకు వ్రాసిన యుపోద్ఘాతమువలన మనకు తెలియుచున్నది.

"కేరళదేశ లక్ష్మియింట నిరుద్ధ శోభాకరములై యుండిన భాసకృతిరత్నములు వెలువడి పండిత కంఠపరిష్కారములగుచుండుట పెక్కండ్రకు విదితమేగదా. ఇంచుమించు మూఁడుసంవత్సరములకుఁ బూర్వము స్వప్నవాసవదత్త, ప్రతిజ్ఞా యౌగంధరాయణముల మాత్రము తాళపత్రప్రతులు సంపాదించి వాని రససంపదకు మెచ్చి తెనిగించి యుంటిని. ఇట్టిపలఁ గార్యాంతరముగాఁ గేరళదేశమునకేతెంచి తక్కుఁగల పదునొకొండు రూపకములఁ జదివి యభూతపూర్వమగు నానందముంజెంది, వానినెల్ల నల్పకాలములోఁ దెనిఁగించితిని. నేనెన్నఁ డాంధ్రీకరణమునకు దొరకొనఁగోరకున్నను భాసరూపకముల పక్షపాతమునెంది నమ్మహాకవికి భక్తిరూపకముగా నర్చనా కుసుమములఁ బడచివైచినట్లుగా భావించి యికార్యమునకు సమకట్టితిఁగాని గీర్వాణభాషలో నాకుఁగల యల్పపాండిత్యముచే నిట్టిపనినిర్వహింతునాయని యూహింపనైతిని: నేటికాలమున బెక్కండ్రు

1. ఇది డెమ్మీసైజున - 110 పుటలలో నున్నది. పఠనీయగ్రంథముగాన గ్రంథబాహుళ్యము లేదు.

కవులు కాళిదాసాదుల కృతులఁ దెనిఁగింపఁబోవుటయు నెఱిఁగియు "నేరక యవకీర్తి జగతి నిలుపుటకాదే" యను సత్యోక్తి ప్రభావము గుర్తించియు నిట్లు సాహసించుట కేవల మాత్మవినోదార్థమకాని వైదుష్య స్పర్ధఁజేసికాదు.

"ఈ రూపకముల ననువదించి మూలముతోఁ జదివిచూడగా సుప్రసిద్ధులగు గాయన గాయనీజనముల కంఠధ్వనికిని ననువాదినీయంత్రములలో నుప్పతిల్లు రాగవిశేషములకును గల యంతరమే నా మనంబునకు స్ఫురించెను. అయినను జోకాంగనాకంఠ మాధుర్యమును విననోఁపని భావకుండు రవివర్మ చిత్రపటమునుగొని తేరలేక తేజోలేఖనమున సిద్ధమగు తత్ప్రతికృతుల సౌందర్య మనుభవించు రసికునింబోలెనే ప్రతివాదినీ యంత్రముల వినుట సంభవించుఁగదా. అట్లె సంస్కృత భాషాభ్యాసములేని కొందఱి కివియు నించుక రుచికరములగునని తలంచుచున్నను, నాయనువాదమున మూలాతిక్రమణము కొండొకచోట్లఁ గలుగుచుండును. అజ్ఞానవశమునఁ బెక్కుదోషములు నబద్ధములును బొందియుండును. ఇరువదిసంవత్సరములుగాఁ బద్యరచనఁ బరిత్యజించిన నాకిదియు దుర్ఘటమే యైయుండును. కావున నిందుఁ బదబంధము పరుషమైయుండినఁ బండితులు క్షమింతురుగాక. కీర్తిసేనయను కవయిత్రి—

క. చిరకాల మెడసి క్రమ్మఱ
నరుదెంచిన యాలువోలె నస్మత్కవితా
సరణి యనుకూలిగామియుఁ
దరతర మొదఁబాటు సేఁత తథ్యము మాకున్"

అన్నట్టులగునేమో?

"దీనిలోని కథాభాగ మత్యల్పమే. కర్ణుఁడు యుద్ధభారమును వహించి పొలికలనికిఁ జొచ్చు నవసరమున నింద్రుఁడు విప్రవేషముతో కర్ణునిదఱిసి యతనివలనఁ గవచకుండలముల యాచించికొనిపోవుటయెయిందుఁబ్రధానాంశము. మనకులభించిన భాసరూపకములనెల్ల నిదియె చాలచిన్నది. ఇందును రససంపత్తిగలదు. భావిదశాసూచకమగు కర్ణుని చింతాకృతియు, నతని యుదాత్తభావమును, లోకధర్మవివృతియునే యిందు రసవంతములైనవి. మూలమున మాలినీవృత్తములు పెక్కులు, కర్ణుని హృదయపరితాపమునకుఁ దాళములొత్తినట్లున్నవి. తచ్ఛిల్పకౌశలముఁ దెనుఁగునఁదెచ్చుట నా కగ్గలంబయ్యె. పదునేనవపద్యమున నభినయ శాస్త్రసంబంధ వాచకములు పెక్కులుండుటంజేసి మూలములోనున్న సమాసము నట్లె తెనుఁగున నిలిపి రచింపవలసివచ్చె. దీనిలోని గుణదోషములకు సహృదయుల కారుణ్యమే యేడుగడయని నీ యత్నప్రసంగ మింతటితో విరమింపఁజేయుచున్నాను."

తిరువనంతపురము,
8, ఫిబ్రవరి 1913.

మా. రామకృష్ణకవి.

పై యుపోద్ఘాతమువలన-కవిగారు భాసనాటకములు పదమూఁడింటిని తెలిగించిరని తెలియుచున్నది. వానిలో ఏడు ముద్రితములైనవి. వాని వివరములు తరువాతచూడగలరు. ముద్రితమైనవానిలో మనకు లభ్యములైనవి-రెండే—

1. కర్ణభారము.
2. అవిమారకము.

కర్ణభారమునందలి యితివృత్తము కవిగారే తెలిపిరిగాన - తిరిగి దానినిగూర్చి వివరింప నగత్యములేదు. ఇక నిందు కవిగారి కవిత సానలదీరిన జాతిరత్నమైవెలయుచున్నది. ఇంద్రుడు బ్రాహ్మణవేషముతో కర్ణుని కవచకుండలములను హరించుటకు వచ్చినపుడు కర్ణుడు-మొదట గోవులను, ఆవెనుక గుఱ్ఱములను, ఆవెనుక నేనుగులను నిచ్చెదను కైకొనుము అని వేడును. ఆపద్యముల రచనావైశద్యము, ప్రౌఢిమ తిలకింపుడు.

గోవుః

చ. అమృతసమాన సద్గుణ పయః స్రుతధారలనించు, నోర్పుమై
నమరు, నిశాంతలక్ష్మియని యందఱు మెత్తురు, హోమనద్ధశృం
గముల వెలుంగు,నిట్టివనఁగాఁ దొలికానుపు మేలి గోసహ
స్రము కడుపారఁగాఁగుడిచి సాఁగెడు దూడలతోడ నిచ్చెదన్.

గుఱ్ఱములు—

ఉ. రాజుల మెచ్చుగొల్పి గ్రహరాజ తురంగమ ఖాతిఁబోల్చి వీ
రాజుల నేర్పుమై మెలఁగి యాశుగవేగముమించి మాన్యకాం
భోజకులంబునం బొడమి పొల్పయి లక్షణయుక్తి రాజల
క్ష్మీజయ సాధనంబగు విశిష్ట తురంగమ కోటినిచ్చెదన్.

ఏనుగులు—

ఉ. చారుకటస్రవన్మదవిసర్పిసుగంధము, షట్పదైక సే
వారుచిరంబు, తుంగగిరివారసమానము వారివాహ గం
భీరరవం బుదాత్తరణభీకర మచ్ఛరదంబునైన స
ద్వారణ రాజబృందము లవారిగ నిత్తు మనఃప్రియంబుగన్.

కాని యింద్రునకు కావలసినవి కర్ణుని సహజకవచకుండలములు. అతడు పైకమిచ్చినను నొల్లనెను. తుదకు కర్ణుడు—

"అవయవరక్షగాఁ బొడమినప్పుడతోడనపుట్టె రాక్షస
ప్రవరులకున్ సుపర్వులకు భవ్యమహాస్త్రములెల్లఁ దాల్చియున్
ద్వివియ నభేద్యమై ధరణిదేవకులోత్తమ పొల్చునట్టి యి
క్కవచముఁ గుండలద్వయముఁ గామితమేనియు మీకు నిచ్చెదన్."

అని తనశరీరముచించి వానిని తక్షణమే యింద్రునకిచ్చెను.

## ఆంధ్రీకరణ విధానము

కవిగారి కర్ణభారాంధ్రీకరణ విధానమునకు కొన్ని యుదాహరణములను చూపు చున్నాను.

"అన్యోన్య శస్త్రవినిపాత నివృత్త గాత్ర
యోధాశ్వ వారణరథేషు మహాహవేషు." 8 శ్లో.

ఉ. చండరణంబులన్ మొనసి సాదినిషాది రథిప్రవీరులొం
డొండకడంగి శస్త్రహతి నొండొరు మేనులఁ జీల్చుచుండగా
మండి లయాంతకాగ్రహసమంబుగ మార్తుర విక్రమించు నే
భండనవేళ సంకుచిత భావుఁడనై జడపాటుసెందితిన్.

"విద్యుల్లతా కపిలతుంగజటాకలాప
ముద్యత్ప్రభా వలయినం పరశుం దధానమ్." 9 శ్లో.

చ. వెలయుతటిల్లతా కపిల విభ్రమతుంగ జటాకలాపమున్
వెలువడు నాత్మకాంతి పరివేషముగా వెలుగొందు గండ్రగొ
డ్డలియునుదాల్చి క్షత్రమకుటంబులు మాపిన భార్గవాన్వయో
జ్జ్వలుకడకేఁగి యమ్మునికిఁ జాగిలిమ్రొక్కి వినీతినిల్చినన్.

"సుర ద్విపాస్ఫాలన కర్కశాంగుళిః
మయాకృతార్థః ఖలు పాకశాసనః." 23 శ్లో:

"దే, వాశికిఁ జక్రవర్తి యమరారి కృతాంతుఁడు దేవతాగజా
స్ఫాలన కర్కశాంగుళియుఁ జాచి కరంబులఁబొందె నర్థమున్."

ఈకర్ణభారము 1919, 1920 సంవత్సరములలో ప్రవేశపరీక్ష (Matriculation) కు ఎస్. ఎస్. ఎల్. సి. (మాధ్యమిక పాఠశాలా విరమణపత్ర పరీక్షకు) పఠనీయ గ్రంథముగా నుండెడిది.

1919లో నే నా పరీక్షకువెళ్లినపుడు దీనిని పాఠ్యముగా చదివినాను. ఆ పరీక్ష సంకలన గ్రంథములలో తెలుగున, నవ్యకవిత ప్రవేశపెట్టుట కదియేమొదలు. అనగా ప్రాచీనకవుల పాఠ్యభాగములతోపాటు అప్పటికిజీవించియున్న కవులరచనలునిర్ణయించుట ప్రారంభమైనది. వానిలో కవిగారి కర్ణభారము మొదటిది. ఈకీర్తి కవిగారిదే.

## అవిమారకము

కవిగా రాంధ్రీకరించిన భాసనాటకములలో ముద్రితమై మనకులభించిన కృతులలో రెండవది-అవిమారకము. దీనిని వారు క్రీ. శ. 1916లో ముద్రించుటచేత నిది కర్ణభారము తరువాతనే రచితమైనది. దీనికొక ఉపోద్ఘాతముగలదు. కాని అది కర్ణభారమునకు వారువ్రాసినదే తిరిగి ప్రకటింపబడినది. కవిగారీనాటకమున చివర తాము తెనిగించిన కాలము నిట్లు తెలిపియున్నారు.

"పరిధావినామ సంవ
త్సర భాద్రపదంబులో నక్షయపక్షమునన్
స్థిరవారమునఁ ద్రయోదశి
విరచించెన్ రామకృష్ణ విబుధుఁడు దీనిన్.

పరీధావి క్రీ. శ. 1913తో సరిపోవునుగాన నిదియు కర్ణభారము రచితమైన వెనువెంటనే రచితమైనదని తెలియుచున్నది.

## ఇతర భాసనాటకాంధ్రీకరణములు

కవిగారు పైరెండింటినేగాక-యీ క్రిందివానిని రచించి ముద్రించిరని అవిమారకమునట్టపైనున్న వివరములనుబట్టి తెలియుచున్నది. నాటకములేగాక - వారు ప్రకటించిన విస్మృతకవుల గ్రంథముల పట్టిక యందున్నది. దీనినిబట్టి కవిగారు 1916వ సంవత్సరము నాటికి పై రెండుశీర్షికలలో ప్రకటించిన గ్రంథములివి.

## విస్మృత కవులు

| | | రూ.అ.పై. |
|---|---|---|
| క్రీడాభిరామము - 300 పద్యములు | ... | 1-8-0 |
| కుమారసంభవము 2 భాగములు | ... | 2-0-0 |
| ప్రబంధమణిభూషణము | ... | 0-12-0 |
| నీతిశాస్త్రముక్తావళి | ... | 0-8-0 |
| త్రిపురాంతకోదాహరణము | ... | 0-8-0 |
| శ్రీరంగమహాత్మ్యము | ... | 1-0-0 |
| పరతత్త్వ రసాయనము | ... | 0-12-0 |

## భాసమహాకవినాటకములకాంధ్రీకరణములు

| | | |
|---|---|---|
| కర్ణభారము | ... | 0— 4—0 |
| దూతఘటోత్కచము | ... | 0— 6—0 |
| మధ్యమవ్యాయోగము | ... | 0— 4—0 |
| బాలచరితము | ... | 0—10—0 |
| అవిమారకము (శృంగార రసప్రధానము) | ... | 0—10—0 |
| స్వప్నవాసవదత్తము | ... | 0—12—0 |
| ప్రతిజ్ఞాయౌగంధరాయణము | ... | 0—10—0 |

చిరునామా :

మా. రామకృష్ణకవి, ఎమ్. ఏ.

నెం. 180, చైనాబజారువీథి,

మద్రాసు.

పై పట్టికనుబట్టి కవిగారు-భాసనాటకములలో కర్ణభారము, అవిమారకము గాక—

'దూతఘటోత్కచము'

'మధ్యమవ్యాయోగము'

'బాలచరితము'

'స్వప్నవాసవదత్తము'

'ప్రతిజ్ఞాయౌగంధరాయణము'—

అను నైదింటిని ముద్రించి ప్రకటించినట్లు వానివెలలు తెలుపుచున్నవి. కాని యివి ఇప్పు డెందును కానరాలేదు. దేశమున ప్రాచీనగ్రంథాలయములలో నుండునేమో పరిశీలింపవలసి యున్నది. వారు భాసనాటకములన్నియుఁ దెలిగించితిమని వ్రాయుటచేత నీ క్రిందివి లిఖితరూపముగానే యుండి అంతరించియుండవచ్చును.

'పంచరాత్రము'

'దూతవాక్యము'

'ఊరుభంగము'

'అభిషేకనాటకము'

'చారుదత్తము'

'ప్రతిమానాటకము'

అవిమారకము శృంగార రసప్రధానము. సౌవీర రాజకుమారుడగు అవిమారకుడు కుంతిభోజుని కుమార్తెయగు కురంగిని వివాహమాడు కథ యితివృత్తము. ఇది ఉదయన వాసవదత్తా కథకుసంబంధించినదే. వాసవదత్త మదగజముచే పట్టుపడబోవునప్పు

డుదయనుడు రక్షించిన సన్నివేశముతో నిద్రప్రారంభము. ఇది ఆఱంకముల నాటకము. కర్ణభారమువలె నిందలి శైలియు కమనీయమైయున్నది.

లోకములో వాడుకలోనున్న

"యత్నేకృతే యది న సిధ్యతి కోఽత్ర దోషః."

(ఫలమును పొందకపోయినను ప్రయత్నించుటలో దోషమేమున్నది?)

అనుసూక్తి అవిమారకము తృతీయాంకమున - 12వ శ్లోకములో నున్నది.

"యత్నేకృతేయది నసిధ్యతికోఽత్రదోషః
కోవానసిధ్యతి మమేతికరోతి కావ్యమ్
యత్నైశ్శుభైః పురుషతా భవతీహన్యాణాం
దైవం విధానమనుగచ్ఛతి కార్యసిద్ధిః."

దీనిని కవిగారెంతో సరళముగా తెలిగించినారు—

"తొడరుట మేలు కార్యములు దోషము లేవొనఁగూడకుండినన్
బడయఁగజాల దీనినని బాలిశుఁడైనను బూన్కిసేయునే
కడఁకల మేలుగాఁ బురుషకారము సెల్లఁగ మానవుండు నే
సెడు నట కార్యసిద్ధియునుఁ జేకుఱు దైవము చక్కఁజూచినన్."

ఈపద్యరచన నిక్కముగా తిక్కన పద్యరచనను జ్ఞప్తికిదెచ్చును.

ఇందు రాజకార్యభారవర్ణన మెంత స్వాభావికముగానున్నదో చూడుడు—

"ధర్మ ప్రాగేవ చింత్యః సచివమతి గతిః ప్రేక్షితవ్యా స్వబుద్ధ్యా
ప్రచ్ఛాద్యౌ రాగదోషౌ మృదుపరుషగుణౌ కాలయోగేన కార్యౌ
జ్ఞేయం లోకానువృత్తం పరచరనయనైర్మండలం ప్రేక్షితవ్యం
రక్షోయత్నాదిహాత్మారణశిరసిపునః సోఽపినావేక్షితవ్యం."   1-12శ్లో.

ఇందలి విషయములు వివరింపఁదగినవగుటచే, కవిగారు మూలమున స్రగ్ధరావృత్తములో నున్న దానిని సీసపద్యముతో విస్తరించిరి. ఈపద్ధతి కవిగారు శ్రీనాథునినుండి గ్రహించినారు.1

---

1. శ్రీనాథుడు స్రగ్ధరావృత్తములతో రచితమైన మయూరుని సూర్యశతకములోని శ్లోకములన్నియు సీసపద్యములలోనే యనువదించియున్నాడు.

సీ. తొలుదొల్త ధర్మంబుఁ దలపోసి మంత్రుల
బుద్ధిపోకల నాత్మబుద్ధినరసి
యనురాగదోషంబులడఁచి కాలముచూచి
మెత్తన పరుసంబు లొత్తఁజేసి
పరచరనయనంబు బలిమిలోకానువ
ర్తనములు విపులరంధ్రములుఁ దెలిసి
యాత్మమండలమెప్పు డప్రమత్తతఁగాచి
బహుయత్నమునఁ బాదుగాచి

గీ. మఱియు భీమసంగ్రామంబు మలసెనేని
తృణముగాఁ దన్ను నని మొన దిగ్గఁద్రోచు
వాఁడె పో భూమివిభుఁడనువాఁడు వాని
బ్రదుకుకష్టంబు ప్రజలెన్ను భాగ్యశాలి. (1-12)

ఇది పై శ్లోకమునకు చక్కని తెలుగువ్యాఖ్యానము.

అవిమారకమున సంధ్యాకాలవర్ణన చాల మనోహరముగానున్నది.

గీ. ప్రాగ్దిశాభాగ మంధకారమునఁ బూసి
చరమదిక్కున మైఁబూల్చె సంజకెంపు
రెండుసగములఁదగి యంతరిక్షమొప్పె
రూఢి నర్ధనారీశ్వరరూపశోభ. (2-13)

అవిమారక మామూలాగ్ర మవశ్యపఠనీయము.

భాసనాటకములో స్వప్నవాసవదత్త మిక్కిలి ప్రచారముగాంచినది. దానిని కవిగారు రసోత్తరముగా రచియించియుందురు. కాని ముద్రితమయ్యు మన దురదృష్టముచే నది లభ్యముకాలేదు. స్వప్నవాసవదత్తను నింతవఱకు నాంధ్రీకరించిన కవులు—

1. కవిగారు.
2. చిలకమర్తి లక్ష్మీనరసింహము (సంపూర్ణ గ్రంథావళి).
3. కోపల్లె శివకామేశ్వరరావు.
4. దివాకర్ల వేంకటావధాని (దివాకర్ల తిరుపతిశాస్త్రిగారి పుత్రుడు).

ఇది 1944లో ఆంధ్రవిశ్వవిద్యాలయములో ప్రథమశాస్త్రపరీక్ష (ఇంటర్మీడియేటుకు) పఠనీయగ్రంథము.

ఈసందర్భమున భాసనాటకములను కవిగారి యాంధ్రీకరణములే ప్రథమములు గావున తరువాతివారిని పేర్కొనవలసియున్నది. ఇది ఆంధ్రనాటకచరిత్రకు తోడ్పడును.

1. కవిగారు.

2. చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు (భాసనాటకములన్నియు తెలిగించిరి.) -ముద్రితములైనవి.

3. వేటూరి ప్రభాకరశాస్త్రిగారు.

కవిగారి వెనువెంటనే భాసనాటకము లాంధ్రీకరించినవారు కీ. శే. వేటూరి ప్రభాకరశాస్త్రిగారు.

వారు తెనిగించినవి—

'మధ్యమ వ్యాయోగము'

'కర్ణభారము'

'ప్రతిమానాటకము'

ప్రతిమానాటకము-వేటూరివారి యనువాదములలో నిది బహుళప్రచారము వడసినది. మదరాసు విశ్వవిద్యాలయమున 1952లో పఠనీయమైనది.

ఇది 'భారతి'లో ప్రకటితమై యావెనుక పుస్తకరూపముగా ప్రకటితమైనది.

అభిషేకనాటకము - ప్రసిద్ధవిద్వాంసులగు శ్రీ బులుసు వేంకటరమణయ్యగారిది. ఇది ప్రశస్తమగు ననువాదము. ప్రభాకరశాస్త్రిగారు ప్రశంసించినది. ఇదియు మదరాసు విశ్వవిద్యాలయమున-1954లో పఠనీయము.

శ్రీ దీపాల పిచ్చయ్యశాస్త్రిగారును నీ క్రింది భాసనాటకము లాంధ్రీకరించిరి—

'మధ్యమ వ్యాయోగము'

'దూత ఘటోత్కచము'

'అవిమారకము'

ఇవియును పై యాంధ్రీకరణములకు నేమాత్రము తీసిపోక ప్రత్యేక విశిష్టత కలిగి యున్నవి.

## యజ్ఞఫలము

ఈ తరువాత సంస్కృత భాషాపరిశోధనల మూలమున నీ భాసనాటకము బయలు పడినది. దీనిని కీ. శే. కవిసార్వభౌమ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిులుగారును, బులుసు వేంకటేశ్వర్లుగారును తెలిగించిరి.

ఏ రెండువేలేండ్ల క్రిందట భాసమహాకవి తననాటకములను రచించెనోగాని, ఆంధ్ర దేశమున విశ్వవిద్యాలయములలో ప్రథమ శాస్త్రపరీక్ష (ఇంటర్మీడియేటుపరీక్ష) కు నవి తూచినట్లు పాఠ్యగ్రంథములుగా సరిపోయినవి. పఠనీయములైనవి. ఇది విచిత్రమైన విషయము. ప్రథమశాస్త్రపరీక్షకు భాసనాటకములు, పట్టపరీక్షకు కాళిదాసనాటకములు మనము నియతముగా పాఠ్యగ్రంథములుగా నిర్ణయించిన - మన ప్రాచీన భారతీయసంస్కృతి, విజ్ఞానము, సాహిత్యము, విద్యార్థుల హృదయములందు హత్తుకొని, సంస్కారము నాపాదింపగలదు. ఇది వాస్తవమైన విషయము.

షేక్స్పియరు-కాళిదాసులు సమానప్రతిభులుగదా. ఆంగ్లమున పట్టపరీక్షకు నియతముగా షేక్స్పియరు నాటకములు పఠనీయగ్రంథములుగా నున్నట్లు, తెలుగున - కాళిదాసు నాటకానువాదములు-పట్టపరీక్షలో నియతముగా పఠనీయములు కావలెను. అట్లే ప్రథమ శాస్త్రపరీక్షకు భాసనాటకానువాదములు పఠనీయములు గావలెను. అట్లయిన-వానినిగూర్చి కూలంకషమైన వ్యాసంగము జరిగి విమర్శనలు వెడలి, మూలానువాదముల విశేషములను వ్యక్తపఱచి, ఇటు విమర్శనసాహిత్యము-అటు వాఙ్మయచరిత్ర రెండును నభివృద్ధియగును.

భాసనాటకములనుగూర్చి విపులముగా ఆంగ్లభాషలో Bhasa : A study by Pusalkar అనునది గలదు. తెలుగున - భాసునిగూర్చి అతని రచనలనుగూర్చి సవిమర్శక గ్రంథములేదు. శ్రీ కిళాంబి రాఘవాచార్యులుగారు రచించిన "భాసుడు" అనునది చాలాప్రశస్తమై ప్రామాణికమైనది. ఇది వేఱుగా గ్రంథముగా ప్రకటితముగాలేదు. ఆంధ్రసాహిత్య పరిషత్పత్రికలో నలుబదేండ్లక్రిందట వరుసగా ప్రకటితమైనది.

## కళింగసేన

కవిగారి స్వతంత్ర నాటకరచన 'కళింగసేన' యనునది మాత్రమే లభించినది. అదియైన మూడంకములు పరిమితిగల భాగమే లభ్యమైనది. కవిగారు ప్రస్తావనలో-సూత్రధారునిచే "ఈదినము రామకృష్ణకవిప్రణీతమైన కళింగసేనయను ప్రకరణంబు ప్రయోగించి చూపుదము" అని యనిపించినారు. ఇందువలన నిది ప్రకరణము-పదియంకముల నాటకము. కాని మూడంకములు మాత్రమే లభించుటచేతను, తరువాత దీనిప్రసక్తి మనకు వారిరచనలలో కన్పట్టకపోవుటచేతను - వారు "ప్రకరణము" వ్రాయప్రారంభించి, మూడంకముల పర్యంతము వ్రాసి - ముద్రించిరనియు తరువాత కార్యాంతరనిమగ్నులై దీనిని పూర్తిగా విడిచిపెట్టిరనియు నిశ్చయింపవచ్చును.

## రచనాకాలము

కర్ణభారము ఉపోద్ఘాతము (1913)లో, తామప్పటి కిరువదిసంవత్సరములక్రిందటనే పద్యరచన పరిత్యజించినామని, తరువాత 1913 లో ప్రారంభించినామని తెలిపినారు. అనగా వారు క్రీ. క. 1893 నుండి పద్యరచన చేయలేదని వ్యక్తమగుచున్నది. అంతకు ముందు వారు కేవలము పద్యరచనలనే చేసినారు. ఇక నాటకములలో గద్యపద్య రచనలు

రెండును నావశ్యకములేగాన - గద్యపద్యాత్మకమగు నీనాటకము - భాసనాట కాంధ్రీకరణముల వెనుక - క్రీ. శ. 1914-15 ప్రాంతముల రచితమై యుండవచ్చును. ఇది నిశ్చితమే. ప్రస్తావనలో కవిగారు—

"ఆ. వె. దేశమెల్ల సమర దివ్యప్రబంధంబు
లార్య చిత్తవృత్తు లాశ్రయించె."

అని వ్రాయుటచే-నీ నాటక రచనాకాలమున ప్రథమ ప్రపంచమహాసంగ్రామము జరుగుచున్నదని తెలియుచున్నది. దానిప్రారంభము క్రీ.శ. 1914 సం. కావున నీరచనమప్పటిది.

ఇది అల్లాయుద్దీను చక్రవర్తి ఢిల్లీని వశవఱచుకొని, రాజ్యముచేయుచు రాజపుత్రస్థానముపై దండెత్తి వెడలి, వారలను జయించినపుడు-పురుషులు యుద్ధమునమరణింపగా, ప్రాణముకన్న మానమే బలవత్తరమని గ్రహించి వారిపత్ను లగ్నిప్రవేశము చేసిరి. అట్టివారిలో వీరసింహుడు సుశీలయను రసపుత్రవీరదంపతులకు జన్మించినది - కళింగసేన తల్లి చిచ్చుఱుకబోవుచు కుమార్తెను పురోహితునింట దాచి, పెద్దచేసి, పెండ్లిచేయుమని యాదేశించినది. కళింగసేనతో, తన దాదికూతురగు పాటలినికూడ అప్పజెప్పినది కళింగసేన యౌవనవతియై, పాటలితో నుద్యానవనముననుండగా, నక్కడకు వేటవశమున విశ్రమించుటకు వచ్చిన జయసింహుడను రాజకుమారునిచూచెను. కళింగసేనకు, జయసింహునియందు మోహము కలుగును. జయసింహుడు వారి యతిథిగా వారిగృహమునకు బోవును. ఇంతటితో ప్రథమాంకము ముగిసినది.

ద్వితీయాంకమున - చక్రవర్తియగు అల్లావుద్దీను జన్మదినోత్సవము జరుగుసమయమున - నిరువురు రసపుత్రులు జయసింహ, కళింగసేనల సమావేశమునుగూర్చిచర్చించి, వారి వివాహమునకై యాలోచింతురు.

తృతీయాంకమున సోమప్రభ, మదనరేఖ యనువారు-మన్మథ నాటకమాడుదురు. అందు మన్మథవేషమును మదనరేఖయు, రతివేషము సోమప్రభయు ధరింతురు. అచ్చటకి జయసింహుడువచ్చి, వారినటనాకౌశలము సంభాషణను వినుచు, మన్మథబాణవివశుడగును. మదనరేఖ నాట్యకౌశలము నత్యంతము నభినందించును. అది యిట్లు వర్ణితము.

ఆ. మదనరేఖగాదు మగవారికన్నుల
మదనఖంజరేఖ హృదయమునకు
బాణరేఖ సతుల ప్రాణాపహారరేఖ
విటవిలోక చపలనటనరేఖ.

దీనితో తృతీయాంకము ముగియుచున్నది. తక్కిన యంకములకువలెనే కవిగారిట్లు గద్యవ్రాసిరి—

"ఇది శ్రీరామకృష్ణకవి ప్రణీతంబైన కళింగసేన యను ప్రకరణంబునం దృతీయాంకము."

ఈ మూడంకములలోను గద్యపద్యశైలి ప్రౌఢమై, హృద్యమైయున్నది. ఇది దృశ్యకావ్యమైనను రచనాధోరణి శ్రవ్యకావ్యము ననుసరించి యున్నది.

ఇది నాటకము గావున – నాందిలో కవిగారు "జగమే నాటకము" అన్నసూక్తిని చక్కగా విపరి..ినారు.

"జగతీరంగమునందు మాయయను యోషం జాల లావణ్యా మా
రఁగ సృష్టించి పిపీలికాది విధిపర్యంతంబు మోహాబ్ధి ముం
పఁగఁదేల్పంగ సమర్థమై వెలయు నే బ్రహ్మైకతేజంబు తత్
ప్రగుణానందము నాశ్రయింతుఁ గలి పాపధ్వంసనోత్సాహినై."

నాటక సంప్రదాయము ననుసరించి నఋతువర్ణన యిందు శరదృతువులోనున్నది. కవిగారు నూతనభావములు వెలార్చుటకై, ఋతురాజమగు వసంతఋతువును విడిచి దీనిని గ్రహించిరి. శరత్కాలమున, రాజులు యుద్ధమునకు వెడలెదరు. మన్మథుడు – మానవ మానసములపై దండయాత్ర గావించును. దీనినిపురస్కరించుకొని కవిగారిట్లు వర్ణన చేసినారు.

క. మదనాగ్నియుఁ గదనాగ్నియు
నెదిగిన దావాగ్నివోలె నెరియించుఁజుమీ
మదవతులను మదపతులను
విదిత శరత్కాలమహిమ వెలఁదియెఋఁగుమా."

కలకంఠనృత్యము

క. కోమలవికచకలాప
శ్యామశ్యామలమనోజ్ఞచంద్రకరత్న
స్తోమమణిచాపలముతో
సీమంతశిఖావతంసశృంగారముతో.

క. తల వంచి వంచి యెత్తుచు
కెలవునకై మఱపుసెంది కేకారుతులన్

మెలఁగుచు నొయ్యారినడకలఁ
గలకంఠము నృత్యమాడె గంభీరగతిన్.

పెక్కుచోట్ల కవిగారికృతిలో నాచనసోముని హరివంశము నిట్లనుసరించినారు (నాచన సోముఁడు-ఉత్తర హరివంశము)—

''గనయంబున్ గొనయంబు నెన్నడుముతోఁ గర్ణావతంసంబుతోఁ
జనుదోయిం గనుదోయి సాయకముతో సంధానహస్తంబుతోఁ
జెనకంజేయుచు నేయుచుండె నతి లక్ష్మీభూత దైతేయ త
ర్జన గర్జారవజర్జరాంగరుధిరాసారంబు తోరంబుగాన్. (1-157)

''ధనురాకర్షణ మంత్రసిద్ధత గుణధ్వానంబు రోదోంతర
స్తనితోల్లాసముగాఁగ వీరకళఁ బ్రత్యాలీఢపాదంబుతో
జనితాంగారపరంపరాకరశరాసారంబు తోరంబుగా
జెనకంజేయు నజేయవిక్రమకళాశింజానమై పర్విడన్.''

ప్రథమాంకము.

## పద్యముల యెత్తుగడలు

నా. సో : నవ్వులమాటలో నిజము నాకములోన - (1-73).
కళిం. : నవ్వులమాటలో చెలులొనర్చిన.
నా. సో : మవ్వపుఁదీగెలం దెగడు మానినులుండఁగ.
కళిం. . మవ్వపుఁ బేర్మినెవ్వలపు మాటల.
నా. సో ; పువ్వులు వేడుకైనఁ గడివోయిన.
కళిం. : పువ్వులు క్రొత్తవై చవులుపుట్టిన.

మూడంకములలోనే యిన్నివిశేషములున్నప్పుడు కవిగారి ప్రకరణమంతయు లభించిన నది యెంత లోకోత్తరముగా నుండెడిదో.

## సంస్కృత భాషారచనలు-భరతనాట్యశాస్త్రము

కవిగారికి యావద్భారత వర్షమున కీర్తిదెచ్చినది భరత నాట్యశాస్త్రమునకు, ఆయన సంపాదించిన-అభినవగుప్తపాదుని అభినవభారతీవ్యాఖ్య. ఈఅపూర్వవ్యాఖ్యతో ఆయన భరతనాట్యశాస్త్రమును పరిష్కరించినారు. దానిని ప్రకటించుటకు బరోడా ప్రాచ్య

పరిశోధనాలయమువారు పూనుకొన్నారు. అయితే, దీనిసంపాదకత్వ మెవరికీయవలెనను విషయమున భేదాభిప్రాయములు పొడసూపినవి. ఆకాలమున మహారాష్ట్రదేశములో కొంతవఱకైన – ఈ మహాగ్రంథము పరిష్కరించుటకు తగినవారు – పి. వి. కాణే.[1] కాని ఆయనకు – తాళపత్రగ్రంథములతో పరిచయము తక్కువ. అయినను మహారాష్ట్రుడు కాబట్టి, యీయవచ్చునని కొందఱనుకొనిరి. రెండవవారు బంగాళాదేశమున ఢక్కా విశ్వవిద్యాలయముననున్న యస్. కె. డే.[2] (సుశీలకుమారసుధి). ఈయన అప్పటికి సంస్కృతాలంకారశాస్త్ర చరిత్ర – (History of Sanskrit Poetics) రెండుసంపుటములు వ్రాసి కీర్తికెక్కినవాడు–అగ్రంథమున – భరతనాట్యశాస్త్రమునుగూర్చి వ్రాయుచు–అభినవగుప్త వ్యాఖ్యతో సుపరిష్కృతముగా ప్రకటింపవలసిన ఆవశ్యకమును తెలిపినాడు. అతడు పాశ్చాత్యదేశమున డాక్టరుపట్టము పొందినవాడు. భరతనాట్యశాస్త్ర పరిష్కరణమునకు తానర్హుడనని సూచించినాడు. ఈయన వంగదేశీయుడు. అయిన–మహారాష్ట్రులు కాణేగారికేయనిశ్చయించిరి. ఆసంవత్సరమున బరోడాలో కె. పి. జయస్వాలు (కాశీప్రసాదజయస్వాలు) గారి అధ్యక్షతక్రింద ప్రాచ్యవిద్వన్మహాసభజరిగినది. ఆసభలో జయస్వాలుగారు అధ్యక్షస్థానమునుండి దీనిని పరిష్కరించుటకు – మానవల్లి రామకృష్ణ కవిగారు తప్ప వేఱెవ్వరు సమర్థులుకారని తెలిపిరి. సంపాదకత్వమును బరోడా ప్రాచ్య పరిశోధనాలయమువారు కవిగారికిచ్చిరి.

కవిగారు పరిష్కరణ ప్రారంభించిరి. ప్రథమసంపుటములోనే – విపులమైన పీఠికాంగులుండవలసినది. కాని కవిగారు–తాను, పీఠిక మొదటవ్రాయననియు, చివరిసంపుటములో వ్రాసెదననియు, నట్లయినచో, తనకు గ్రంథమంతయును పరిష్కరించునపుడు చేయవలసిన మార్పులు, కూర్పులు తప్పక తెలియనగుననియు, అందువలన గ్రంథ గౌరవము హెచ్చుగుననియు తెలిపిరి. కవిగారు బ్రతికియుండగా, మొత్తము నాలుగుసంపుటములలో మూడుసంపుటములు మాత్రమే వచ్చినవి. వారికాలములో నది పూర్తియగునని కవిగారు భావించినారు. కాని అట్లు జరుగలేదు. అయినను నేటికి కవిగారిముద్రణమే నాట్యశాస్త్రగ్రంథములలో ప్రధానముగానున్నది.[3] ఏమైనను, కవిగారు వ్రాయవలసిన లోకోత్తరపీఠిక అందు లోపించినది – వారివలె నాగ్రంథమునకు పీఠికవ్రాయుట కితరు లెవ్వరికి నధికారములేదని కొందఱు ప్రాచ్యపాశ్చాత్యపండితుల యభిప్రాయము.

---

1. ఈయన నేటికిని జీవించియున్నాడు – The History of Hindu Dharma Sastra ను పెక్కుసంపుటములుగా రచించిన విద్వాంసుడు–మహామహోపాధ్యాయ బిరుదాంకితుడు – జాతీయాచార్యుడు (National Professor).

2. ఈయన నేటికిని జీవించియున్నాడు. జయదేవుని గీత గోవిందమునకు, మేఘ సందేశమునకు సుపరిష్కృతముద్రణలు వెలయించినాడు.

3. ప్రథమభాగమును బరోడాసంస్థవారే తిరిగి పునస్సంస్కరణము చేయించి, ప్రకటించినారు.

## భరతకోశము

ఇది సంగీత, నాట్యశాస్త్రములందు గల పారిభాషిక పదములనన్నింటిని ప్రమాణము లతోగూడ చూపి, రచించిన మహోద్గ్రంథము - కవిగారు దీనిని తమ 69వ యేట రచియించినారు—

"ఏకోనస ప్తతితమే వయస్యారచ్యలీలయా
శ్రీవేంకటేశ దివ్య శ్రీపాదయో రర్పితోముదా."

అని యందుగలదు. ఈ గ్రంథావతారికవలన కవిగారి సంస్కృత కవితాపాటము తెలియవచ్చును—

ఇందలి మంగళశ్లోకము కడుమనోరమము.

ప్రవేశాక్షేపనిష్క్రామ ప్రసాదాంతరితమ్ జగత్
కృతం నాట్యాయితం యేన తం నమామి మహానటమ్.

ఈ గ్రంథరచన సంస్కృతము అయినను కవిగారు తాము సంస్కృతగ్రంథములేగాక, ఆంధ్ర, ద్రవిడ, కర్నాట, కేరళ వాఙ్మయములనుగూడ నవలోకించి, అందలి విషయము లిందు చేర్చుట విశేషము. ఇది ఆంధ్రేతర విద్వాంసులెవ్వరును చేయలేనిపని.

ఖండాఖండాత్మకాన్ లబ్ధాం స్తేషాం గ్రంథాన్ విలోక్యచ
అజ్ఞాత కర్తృకానన్యాన్ వాదిమత్త గజాంకుశం
వీణారహస్యనామానం కుండలీమణిదర్పణం
నృత్తరత్నాకరం నాట్యదర్పణమ్ నాట్యలోచనమ్
ఆంధ్ర ద్రవిడ కర్నాట కేరళానాంచ వాఙ్మయం
దృష్ట్వా గాంధర్వవేదార్థం కావ్యాలంకారలక్ష్మణి
అనుతంత్రే చ భోజాది నిర్మితా నతివిస్తృతాన్
అంతర్విగాహితుం సమ్యక్ దుఃశకానేక జన్మని
సంగృహ్య సమ్యగేతేభ్యః సుశబ్దాన్ పారిభాషికాన్
నిరుక్తాం స్తత్రతత్రైవ స్వాతంత్ర్యమపహాయచ
నామ్నా భరతకోశోఽయం విద్యావ్యసనినాం ముదే
రామకృష్ణేన కవినా సార్ధవర్షద్వయావధౌ."

దీనిని రచించుటకు $2\frac{1}{2}$ సంవత్సరములు పట్టినట్లు తెలియుచున్నది. ఇది తెలుగువారికి

మిక్కిలి యుపయుక్తము.[1] ఇది తెలుగులోనికి ప్రకటితమైనచో తెలుగువారికి నెంతయు నుపయోగము.

## అపూర్వ విస్మృత సంస్కృతనాటకములు

కవిగారు, "దక్షిణభారతి గ్రంథమాల" అను పేరుతో నీ క్రింది అపూర్వ విస్మృత సంస్కృత నాటకములను ప్రకటనగావించిరి.

## చతుర్భాణి

శూద్రకాదిమహాకవులచే రచితములైన నాలుగు భాణములు.

## కుందమాల[2]

మహాకవి ధీరనాగవిరచితమగు మంచి నాటకము. ఇది తెలుగువారి నాకర్షించినది.

## తాపస వత్సరాజము

మాయురాజ విరచితము.

## వత్సరాజచరిత నాటకము

శూద్రక విరచితము. దీనినిబట్టియే కవిగారు తెలుగున "వత్సరాజ చరిత్రము" అను నవల రచించిరి.

## కౌముదీ మహోత్సవము

కవిగారికి – జయస్వాలుగారితో సంబంధము గలిపినదీ నాటకమే. జయస్వాలుగారీ నాటకప్రకటనమునకు ముగ్ధులై వారి సంస్కృత భాషావైదుష్యమునుగూర్చి ఖండాంతరములలో కూడ ప్రసిద్ధమైన – వంగదేశాంగ్లపత్రిక – Modern Review లో వ్యాసము

---

1. నేను పాల్కురికి "ద్విపదచ్ఛందస్సు"ను గూర్చి వ్రాసినపుడు ద్విపదనుగూర్చిన ప్రాచీన సంస్కృత గ్రంథప్రమాణముల నిందుండియే గ్రహించినాము.

2. దీనికీ క్రింది యాంధ్రానువాదములు గలవు.

    1. తల్లాప్రెగడ సూర్యనారాయణరావు (ప్రథములు),
    2. పడ్డాది సుబ్బారాయుడు,
    3. వేదం వేంకటకృష్ణశర్మ.

ఇందు సన్నివేశము లద్భుతములైనవి గలవు. తెలుగున కుందమాల చలనచిత్రము తీయుటకు ప్రయత్నములు జరిగినవి. కాని సీతకు తగిన పాత్రధారిణి దొరకకపోవుటచే ఆగిపోయినది.

వ్రాసియున్నారు. అందలిభాగములు ఈ సంపుటమున ముద్రితములు. ఈనాటకమును డాక్టరు దివాకర్ల వేంకటావధానిగారనువదించిరి.

## కావ్యములు

నాటకములనే గాక - అపూర్వ కావ్యములనుగూడ కవిగారు ప్రకటించినారు.

## అవంతిసుందరీ కథ

వచనము; దండిమహాకవిది. నేడు మనకు లభ్యమగుచున్న దశకుమారచరిత్ర యీ గ్రంథమునకు పూర్వపీఠిక.1

## దత్తకసూత్రవృత్తి-యను విటకావ్యము

ఇది కేరళదేశ రతిశాస్త్రజ్ఞుఁడగు దత్తకుఁడు పాటలీపుత్ర వేశ్యలకొఱకు కామశాస్త్రమున వైశికప్రకరణమును సూత్రరూపముగా నిర్మించిన కావ్యము. దీనిని వాత్స్యాయనుఁడు తన "కామసూత్రముల"లో పేర్కొన్నందున నితఁ డాతనికన్నను పూర్వుఁడు. కవిగారు దానికొఱకు ఎంతో ప్రయత్నించి సంపాదించి ప్రకటించినారు. దత్తకమతము ననుసరించు విటులకు దత్తకవిటులు అనిపేరు.

సీ. పా. "ధనమెక్కనీగియ తగులుగారతిఁబెట్టి
దము సేయునట్టి దత్తకులనొల్ల-" (8-145)

సీ. పా. వలసిన ధనము సమ్మతిగా నొసఁగుచుఁ
దరుణులఁ గరఁగించు దత్తవిటులు-

కృష్ణవిలాసము (అముద్రితము)

"భద్రుఁడు, దత్తకుఁడు, పాంచాలుఁడు, కూచిమారుఁడు" అని విటులు నాలుగువర్గముల వారు - వీరు వారివారి మతములకు సంబంధించిన గ్రంథములను రచించినారు. వీరిలో నొక్క దత్తకుని గ్రంథముమాత్రమే కవిగారిమూలమున ప్రకటితమైనది. వీరు నలువురు వేశ్యలను నాలుగురీతుల లోఁబఱచుకొందురు-

---

1. తెలుగుదేశమున నింతవఱకే వాఙ్మయచరిత్రకారులు చెప్పని కేతన దశకుమార చరిత్రవిషయము కవిగారొక్కరే తెలిపినారు. కేతనకాలమునాటికి (క్రీ. శ. 1250) అవంతిసుందరీకథ, పూర్వపీఠిక - వేఱైనవి. అందునకే, ఆతడు దశకుమార చరిత్రమనుపేర దీనిని రచించినాడు. సాహిత్యలోకము, దండి దశకుమారచరిత్ర-ప్రస్తుతగ్రంథము సమగ్రమని భావించినది. కాని కవిగారు అవంతిసుందరీకథను వెలికిదీసి, దండి దశకుమారచరిత్ర - అనగా దశకుమార చరిత్ర-అవంతిసుందరీ కథ రెండును కలిపినదని నిర్ణయించిరి. అవంతిసుందరీకథ తెలుగులోనికిరా లేదు.

భద్రుఁడు — శృంగారచేష్టలు

దత్తకుఁడు — ధనము

పాంచాలుఁడు — మృదువాక్కౌశలము

కూచిమారుఁడు — మందులు, మాయలు.

కూచిమారుని గ్రంథము శ్రీనాథమహాకవి కాలములో లభ్యమగుచున్నట్లు తెలియు చున్నది.

"స్మర వాత్స్యాయన కూచిమారకృత శాస్త్రగ్రంథసందర్భముల్
పరిశీలించినవాఁడ దంపతులకుత్పాదింతు సారస్యమున్
మురిపెంబొప్పఁగ మంద మంపగమనంబుల్ నేర్పుదున్ మేదినీ
శ్వరశుద్ధాంత నితంబినీ జనులకున్ సంపూర్ణచంద్రాననా."

శృంగారనైషధము (2-126)

కవిగారు ప్రకటించిన యొక్కొక్క గ్రంథమునుగూర్చి వ్రాయుటకు మనమెంతగా పరిశ్రమచేయవలెనో చూపుటకు పై విషయము వ్రాసినాను. వారు క్రీ. శ. 1918 లో నీ దత్తకకావ్య సంగతి లోకమున కెఱుకపఱచి, క్రీ. శ. 1928లో దీనిని ప్రకటించినారు. ఆ గ్రంథపీఠికయందెన్ని విశేషములున్నవో తెలియరాదు.

## వ్యాసరచన

కవిగారు కవితారచనయందేగాక, వ్యాసరచనయందు సిద్ధహస్తులు. అద్యతనాంధ్ర వాఙ్మయమున వ్యాసరచనలో వారికొక స్థానముగలదు.[1] వారు తెలుగుభాషలోనే గాక ఆంగ్లభాషలోను పెక్కువ్యాసములు వ్రాసియున్నారు. కవిగా రాంగ్లభాషలో వ్రాయుటకు కారణమున్నది. వారు సంస్కృత భాషాపరిశోధనలో అఖిలభారత కీర్తిబడసినవారని - సంస్కృత గ్రంథములు పరిష్కరించి ప్రకటించినారని యీవఱకే తెలుపబడినది. సంస్కృతభాషా గ్రంథములనుగూర్చి వ్రాయునపుడు భారతవర్షమువారికేగాక, పాశ్చాత్యు లకుగూడ తెలియపలెను. కావున కవిగా రాంగ్లభాషలో వ్యాసములు, పీఠికలు వ్రాసి యున్నారు. వానివివరములు—

## వ్యాసములు-సంస్కృతము

సంస్కృతభాషలో గద్యరచనకష్టము-కాబట్టియే "గద్యం కవీనాం నికషం వదన్తి" అని నానుడి యేర్పడినది. కవిగారు సంస్కృత కవితారచనయందు సమర్థులే. కానిగద్య

1. చూడుడు. నా "ఆంధ్రవచన వాఙ్మయము" వ్యాసరచన - ఉత్పత్తి వికాస ప్రకర ణము (ఇది అముద్రితము).

రచనకూడ చాము చేయగలమని తెలుపుటకు సంస్కృతభాషలో నొకవ్యాసమును వ్రాసి యున్నారు. అది—

'అంకావళిః నాగానందే చతుర్థోఽంకః'

ఇది శ్రీవేంకటేశ్వర పరిశోధనాసంస్థ పత్రికలో ప్రకటితము.

## ఆంగ్లభాష

ఆంగ్లభాషలో వారివ్యాసములన్నియు తెలుగుభాషలోని వ్యాసములవలె, మౌలికమైన పరిశోధనాత్మక వ్యాసములు. వానిలో కొన్ని—

1. శివతత్త్వ రత్నాకరమునకు వారువ్రాసిన - పీఠిక.
2. సుందరపాండ్యుని ఆర్యాద్విషష్ఠిక - అను దానికి వ్రాసిన పీఠిక.

1. ఉత్పళపరిమళము (బృహత్సంహితవ్యాఖ్య).
2. శ్రీరంగరాయల పరమచాత్తాద శాసనము (క్రీ. శ. 1646).
3. వేంకటాద్రి - దొడ్డయాచార్య శాసనము (క్రీ. శ. 1602).
4. దత్తిలకోహళీయము.
5. సంగీతసారము.
6. మలయవతి - ఆఖ్యాయిక.

## సమీక్షలు-ఆంగ్లము

7. Bhasa - A Study.
8. Krishnacharita by Vikramanka Rajadhiraja.
9. Yagna phalam by Bhasa.
10. Descriptive Catalogue of Manuscripts in B. O. R. Library, Poona.
11. Paramabhagavata Charitra of Samudra Gupta.
12. Samkshipta Sivapujavidhi.
13. Kannada Nadina Kathagalu.

ఈ వ్యాసములన్నియు శ్రీవేంకటేశ్వర ప్రాచ్య పరిశోధనాసంస్థ పత్రికయందు ప్రకటితములైనవి.

కవిగారి యాంగ్లభాషావ్యాసరచనము క్రీ.శ. 1924 నుండి ప్రారంభమైనట్లు తెలియుచున్నది. మూడవ అఖిలభారత ప్రాచ్య విద్వన్మహాసభ మదరాసులో (1924లో) జరిగి

నప్పుడు వారువ్రాసిన 'Damarukam - a new play of Bhasa" అనునది వారి తొలి ఆంగ్లవ్యాసము.

ఆంగ్లభాషలో, సంస్కృతాంధ్రభాషలలోవలె వారు నిష్ణాతులు. అందుచే వారిశైలి యుదాత్తమై - పరవళ్ల ద్రొక్కుచుండును.

## తెలుగువ్యాసములు

కవిగారి వ్యాసములలో తెలుగువ్యాసములే అన్నింటికన్న హెచ్చు. వారి తొలి వ్యాసములలో నొకటి - ''ఆంధ్రనాటకకవులు'' అనునది ఆంధ్రపత్రిక ప్రథమ సంవత్సరాది సంచిక (1910) లో ప్రకటితమైనది. 1895 ప్రాంతాల ప్రారంభమైన వారి వ్యాసరచన- నాలుగు దశాబ్దాలవరకు నడచినది. ఆ వ్యాసములు లభ్యమైనంతవరకు నీసంపుటిలో ప్రకటితములైనవి.

1921లో ఆంధ్రపత్రిక సారస్వతానుబంధము వెలువడినవెనుక కవిగారు వ్యాసములు దానికి వ్రాయుచుండెడివారు. వానిలో—

''మహాకవి కాళిదాసు''

''దండి అవంతిసుందరీకథ''

''మహాకవి దండి''

అనునవి ముఖ్యమైనవి. ఈవ్యాసము 28-10-1922తేదిని ప్రకటితమైనది.1 ఇవియన్నియు సంస్కృతవాఙ్మయచరిత్రకు నూతనములే.

వ్యాసములలో వారి రచనారీతి ప్రసన్నగంభీరప్రౌఢము, భావోద్దీపకమునై యుండును. లీలాశుకునిగూర్చి వారు వ్రాసినవ్యాసమును చదివి తన్మయులైనవారున్నారు.2 ఇవి నేడు గ్రంథరూపముగా ప్రకటితమైనవిగాన వచనవాఙ్మయ పరిశోధకులు దీనిని పరిశోధించి, గుణనిర్ణయము చేయుదురుగాక.

## ఆంధ్రవాఙ్మయచరిత్ర-మౌలిక పరిశోధన

ఇప్పటి కరువదేండ్లక్రిందట ''విస్మృత కవులు'' అనుపేర ప్రథమముగా ఆంధ్ర వాఙ్మయచరిత్రలో పరిశోధన ప్రారంభించి, నన్నెచోడమహాకవి కుమారసంభవమును

---

1. ఈవ్యాసమును నేను క్రీ. శ. 1934లో కీ. శే. గంటి సూర్యనారాయణశాస్త్రిగారు ప్రకటించిన 'కల్యాణి' పత్రికలో - మయూరుడు - సూర్యశతకము - అను వ్యాసమున పేర్కొన్నాను.
2. ఈవ్యాసమును చదివి యిద్దరు ముగ్గురు సంస్కారముగలవారు కవిగారినిగూర్చి తెలుసుకొనుటకు నాకు ఉత్తరములు వ్రాసినారు.

ప్రకటించి, ఆంధ్రసాహిత్య ప్రపంచమున నపూర్వసంచలనము కలిగించిన - మానవల్లి రామకృష్ణకవిగారు నేడు విస్మృతులగుటలో వింతలేదు.[1] మౌలిక పరిశోధన యనగా అముద్రితములైన తాళపత్ర గ్రంథపరిశోధన. వాఙ్మయచరిత్రకు ప్రాచీనకవుల కృతులే ప్రాతిపదికలు, ప్రధానాధారములు. తెలుగుభాషలో పూర్వ కవికృతులన్నియు తాళపత్ర గ్రంథములలో నిక్షిప్తములై యున్నవి. అందువలన తెలుగువాఙ్మయచరిత్ర అముద్రితములైన తాళపత్రగ్రంథములపైనే పూర్తిగా ఆధారపడి యున్నదనుట నిర్వివాదాంశము. అయితే యీనాటి మన వాఙ్మయచరిత్రలు అముద్రితవాఙ్మయ మామూలాగ్రముగా పరిశోధించి రచింపబడలేదు సరేకదా ప్రాచీనకవుల ముద్రితగ్రంథములనుమాత్రమే యాధారముగా చేసికొని, తాళపత్ర గ్రంథములలోనున్న కవులకృతులను సుతరాము విస్మరించుటచే - అసమగ్రము లగుచున్నవి. అంతేకాదు - తెలుగుసాహిత్యమనగా, ఈనాటి వాఙ్మయచరిత్రలలో నున్న వాఙ్మయముతప్ప, అంతకన్న హెచ్చు వాఙ్మయము లేనేలేదని, అది ఇంగ్లీషుభాషలోనున్న వాఙ్మయముతో నేమాత్రము సాటిరాదని - యొక సంకుచితాభిప్రాయమును సాహిత్యలోకమున వ్యాప్తిచేసినది. యావద్భారతవర్షమున - దేశభాషలలో నగ్రగణ్యమై, లోకోత్తరమైన సంస్కృతభాషతో సమానప్రతిపత్తిగడించి అతివిస్తృతమై, అపారమై, బహుముఖ సాహిత్యప్రక్రియలతో భారతజాతీయభాషగా రూపొందదగిన తెలుగుభాషావిశిష్టత, వ్యక్తిత్వము వెలుగులోనికి వచ్చుటలేదు.

దీనికి హేతువు మన వాఙ్మయచరిత్ర అముద్రిత గ్రంథములపై ఆధారపడని- కవుల చరిత్రలపై నిర్మింపబడుటయే. కవులచరిత్రలు సమగ్రముగా, సాధికారముగా రచితములైనగాని - వాఙ్మయచరిత్ర రచించుట నేలవిడిచి సాముచేయుటయే యగును. అట్టి కవులచరిత్రకు పూర్వకవుల కావ్యములే ప్రధానాధారములు. కేవలము వాఙ్మయ చరిత్రకేగాక, సారస్వతవికాసమునకు, సాహిత్యపరిణామమునకు, విమర్శనాపథకమునకు కూలంకషముగా పూర్వ కావ్యసాహిత్యమంతయు పరిశీలనకావలెనని - దూరదృష్టితో నిప్పటి కిరువదేండ్ల క్రిందటనే కావ్యప్రకటన ప్రారంభించి, అముద్రితమై, అజ్ఞాతముగా పడియున్న తాళపత్ర గ్రంథములలో నెంత విలువగల గ్రంథములున్నవో లోకమున కెత్తిచూపినను - కవిగారి మౌలికపరిశోధనాపద్ధతిని మనము గ్రహింపలేదు. అముద్రిత కావ్యములను విస్మరించి - గతానుగతికముగా, చర్వితచర్వణముగా, కవిజీవితములు విషయవిమర్శనల క్రోడీకరణములతో నలుబదేండ్లనుండి నేటివఱకు నేమార్పులేకుండ యథాస్థితముగా నిలిచిన వాఙ్మయచరిత్ర వ్యాప్తమగుచున్న నేడు - మౌలికపరిశ్రమకు ప్రథమతీర్థమైన కవిగారు విస్మృతులగుటలో నాశ్చర్యపడనక్కఱలేదు. కవిగారు ప్రకటించిన విస్మృత కవుల గ్రంథములవలె - వారి వ్యాసములన్నియు మౌలికములే. అనగా, అంతకుముందు తెలియనివే. వారి వ్యాసములలో, నూతనవిషయముతక్క- తక్కినవి యుండనేయుండవు; మచ్చునకైన గానరావు. వారి వ్యాసములలో ప్రతి

1. మానవల్లి - మౌలికపరిశ్రమ - అని యతిలోనున్నను మనము మతిలోమఱచితిమి.

వాఙ్మయమును బరిశీలించిన – ఈనాటి మనపు ప్రొత్తగా వెలసిన వసుతోసుచున్న వాఙ్మయ చారిత్రకవిషయముల లింతకుముందు మఱెప్పుడి నలుబదేండ్లకు ముందటనే కవిగారు మన కందించినారు. ఇప్పుడవి ప్రకటితమగుచున్నవి. ఈవ్యాసములకన్నింటికి వ్యాఖ్యవ్రాసిన – అవి యీవ్యాససంపుటమంత యగును.

## పరిశోధన–పాండిత్యము

వాఙ్మయపరిశోధన – ప్రాచీన కావ్యగవేషణ, పాండిత్యములతో కూడుకొని యున్నవని సంస్కృతాంధ్రముల సమధిక ప్రవేశమున్నవారు మాత్రము చేసిననే, అది ప్రామాణికముగా రాణించి మన తెలుగువాఙ్మయ విశిష్టతను, సాధికారముగా విస్తరింపజేయగలదని–తమ పరిశ్రమమూలమున వ్యక్తపఱచినవారు కవిగారే. కవిగారి వెనుక, ప్రభాకరశాస్త్రిగారును నట్టివారగుటచే – వారి వాఙ్మయపరిశోధన ఈనాటికిని ప్రామాణికమై నిలిచి, ఆదర్శప్రాయమగుచున్నది.

ప్రాచీనకావ్యపఠనమునం దభిరుచి పూర్తిగా తగ్గిపోయి – కేవలము బాహిరమైన పాశ్చాత్య విమర్శనా పథకము మూలమున – ప్రాచీన కావ్యతత్త్వము విస్మృతమైన యీకాలమున – కవిగారి, మౌలికపరిశ్రమను గుర్తించినవారు వ్రేళ్లపై లెక్కపెట్టదగిన వారు మాత్రమే గలరు.

ప్రాచీనసాహిత్యము పునరుజ్జీవింపజేయబడిననాడు, మనము కవిగారి పరిశ్రమ నింతకన్న అధికముగా నవగాహన చేసికొనగలము. ఇందు ప్రకటితమైన వారి జీవిత చరిత్ర చదివిన యీ విషయము విశదమగును.

ఇట్టి పరిస్థితులలో – మానవల్లి కవిగారి గ్రంథపునర్ముద్రణ సందర్భమున – వారి సంకలనగ్రంథములు సకలనీతిసమ్మతము, ప్రబంధమణిభూషణము – వీనికి విపుల పీఠికలను వ్రాయుటకు నాకవకాశము గల్పించుటయేగాక, కవిగారి వ్యాససంపుటి ప్రకటించుసందర్భమున, వారి జీవితచరిత్రను వ్రాయుటకు నాకవకాశమునిచ్చిన – శ్రీ పి. యస్. ఆర్. అప్పారావు (పోణంగి శ్రీరామ అప్పారావు) గారికి – నాకృతజ్ఞతి నిందుమూలముగా దెలుపుకొనుచున్నాను.

వారు నాకిట్టియవకాశమే ఈయకుండినచో నాలుగుదశాబ్దులుగా – కవిగారి గోరి విషయముగల నాయనుభవ విషయములు నాలోనే జీర్ణించిపోయియుండెవి. అందువలన – ఈ పీఠికల, జీవితచరిత్ర రచనమూలమున కవిగారి ఋణమును తీర్చుకొనగలిగినందులకు ఎంతో సంతోషము జెందుచు, ధన్యుడనైనానని భావించుచున్నాను. శ్రీ అప్పారావుగారికి అత్యంతము కృతజ్ఞతచూపుట తప్ప వేఱేమిచేయగలను ? భగవంతుడు వారికితోధికముగ నాయురారోగ్యైశ్వర్యములు, వృత్తిలో నభ్యుదయము చేకూర్చుగావుత!

ఈ వ్యాసనంపుటిని ప్రకటించిన - ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమీవారిని, ముఖ్యముగా శ్రీ దేవులపల్లి రామానుజరావుగారిని అభినందించుచున్నాను.

ఇట్లే సర్వత్ర మౌలికపరిశోధనగలిగిన ప్రభాకరశాస్త్రిగారి రచనలు పునర్ముద్రణము కావలెను; ముఖ్యముగా వారి ప్రబంధరత్నావళియు, నేను ముందుసూచించినట్లుగా—

"అలభ్యవాఙ్మయము"

లేదా

"అజ్ఞాతవాఙ్మయము"

అను గ్రంథమును వెలువడవలెను.[1]

ఈరీతిగానే-నేను వేఱొకప్రస్తావనలో సూచించినట్లుగా—

"అముద్రిత వాఙ్మయకోశము"

వెలువడవలెను.[2]

ఈరెండుగ్రంథములు వెలువడిన నేటి మన యాంధ్రవాఙ్మయము నావరించిన సంకుచితస్థితి సంపూర్ణముగా తొలగిపోయి తెలుగువాఙ్మయము - వైశాల్యము, విశిష్టత వ్యక్తమగుటయేగాక, ఆంధ్రభాషా సారస్వతములు-అటు ప్రాచ్య భారతీయ సంస్కృత సాహిత్యముతోడను, ఇటు పాశ్చాత్య - ఆంగ్లభాషా సాహిత్యములతోడను సమాన ప్రతిపత్తిగలదని నిర్వివాదముగా నిరూపింపవచ్చును. ఒక్క విషయముతో నీవిషయము ముగింతును.

భారతీయ దేశభాషలలో నేభాషయందును, తెలుగుభాషలోగల సాహిత్యప్రక్రియలు లేవు. సంస్కృతభాషయందు లేని సాహిత్యప్రక్రియ లిందు గలవు. లక్షలాది పద్యములు గల కావ్యవాఙ్మయముతో లక్షలాది పదములుగల—

"సంగీత పద వాఙ్మయము"

భారతీయభాషలలోనేగాక, పాశ్చాత్య వాఙ్మయమందుగాని, ప్రపంచమున నేవాఙ్మ

1. ప్రబంధమణిభూషణము - పీఠిక -పుట. 93 సాహిత్యఅకాడమీచే ప్రకటితము.

2. త్రివేణి - క్రీ.శే. పాఘులపాటి బుచ్చిసాయని స్మారకసంచిక. ఇందు "అముద్రిత గ్రంథాలు - అజ్ఞాతకవులు" అన్న నావ్యాసమున - ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారములలో నముద్రితగ్రంథములనుగూర్చి యెట్లు కోశము రచింపబడవలెనో ఆవిధానమును చూపినాను.

యమునందుగాని లేవని బాహాటముగా చాటవచ్చును.1 కాని మనకట్టి యభినివేశము పూజ్యము. ప్రాచీనసాహిత్యమున కంతకంతకు మనము దూరమగుచున్నప్పు డిట్టి కార్యములు కొనసాగుటయు దుర్లభమే.

అయినను ఆ సాహిత్య పరిశ్రమమునకే జీవితము నంకితముచేసినవారి మౌలిక కృషి బయటపడినచో నిట్టి సాహిత్యప్రణాళికలకు కొంతవఱకైన దోహదము కాగలదను నాకాంక్షతో, నభినివేశముతో నింతవఱకు విస్తరించుట యావశ్యకమైనది. ఇందులకు ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి పూనుకొనునుగాక.

ఈనాడు భారతదేశమున, పాశ్చాత్యఖండములలోను, మన భాషావిశిష్టతయే ప్రకటితమైనదిగాని లోకోత్తరమై, శాఖోపశాఖలుగా విస్తృతమై, భారతీయ సంస్కృతిని, దాక్షిణాత్య సంస్కృతిని సమ్మేళనముచేసి - జాతీయతనున్ముద్రించిన తెలుగుసాహితీ విశిష్టత ప్రపంచమునకు వెల్లడికాలేదు. ఈనాడు ప్రపంచమున—

"తెలుగు"

ప్రతిఫలింపజేయుటకు - సమగ్రము సప్రమాణము సాధికారమునైన - తెలుగు సాహిత్య చరిత్ర మౌలికపరిశ్రమమూలముగా రచితమై ప్రకటితము కావలసియున్నది.

స్థానికమునుదాటి, ప్రాంతీయమునుపరిహరించి, జాతీయ సమైక్యతతో, అంతర్జాతీయముగా నధిగమించుచున్న మనమీనాడు - ప్రపంచభాషలలో మనస్థానము నిరూపించుకొనదలచిన - పై చరిత్రరచనయే ప్రపంచమహాసభ జరుపుట కుత్సాహముతోనున్న తెలుగువారి తొలికర్తవ్యము.

ఆంధ్రసాహిత్యాభ్యుదయము నభిలషించు వారందఱును - పై విషయములను గమనించి, సత్వర కార్యాచరణమునకు గడంగుదురుగాక.

2—2—1137/5,
లక్ష్మీకాంతనిలయము,
సరస్వతీనగరము,
హైదరాబాదు-44.

ఇట్లు,
నిడుదవోలు వెంకటరావు.

1. ఈనా డాంగ్లభాషామూలమున మనకు ప్రపంచమున ప్రతివాఙ్మయచరిత్ర పరిచితమే గదా. వానిని పరిశీలింపవచ్చును. ఒక్క తంజావూరి సరస్వతీ మహాలు గ్రంథాలయములో నిప్పటికి 50 వేల అముద్రితపదములున్నవి.

# నే నెరిగిన మానవల్లి కవిగారు

నేను మద్రాసు ప్రెసిడెన్సీకాలేజీలో పనిచేసే రోజులలో (మార్చి, 1953 ప్రాంతాల), ఒకనాడు మద్రాసు విశ్వవిద్యాలయ గ్రంథాలయమునకు వెళ్ళి, అక్కడనుంచి శ్రీ నిడుదవోలు వేంకటరావుగారిని చూడటానికి వెళ్ళితిని. వారు గదిలోలేరు. కాని, వారి గదిముందు వరండాలో నేలమీద, ఒకవృద్ధుడు, కాలుమీదకాలువేసుకొని, జరాభారంచేత వంగిపోయి, కూర్చుండుటచూచినాను. ఆ మూర్తి నన్ను ఆకర్షించినప్పటికి, ఎవరో తెలియకపోవటం చేత నేను పలుకరించలేదు. శ్రీ వేంకటరావుగారి గదిలోనికివెళ్ళి కుర్చీమీద ఆసీనుడ నయ్యాను. ఇంతలో శ్రీ వేంకటరావుగారు వచ్చి, ఆ వృద్ధమూర్తిని చూచి, చాలా నొచ్చుకొని, సబహుమానంగా చేతులుపట్టుకొని లేవదీసి, గదిలోపలకు తీసుకొనివచ్చినారు. నేను ఆశ్చర్యంతో లేచి నిలుచున్నాను. "వీరిని ఎరుగుదురా మీరు? వీరే శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారు" అని వేంకటరావుగారు పరిచయముచేసినారు. నా ఆశ్చర్యమున కంతములేకపోయినది. సవినయముగా వారికి పాదాభివందనము చేసినాను. "వరండాలో కూర్చున్నారేం? గదిలో కూర్చుండలేకపోయినారా?" అని శ్రీ వేంకటరావుగారు అడిగి నారు." "అబ్బే. మీరులేనప్పుడు నేను మీగదిలో ప్రవేశించటం ఏంబాగుంటుంది?" అని వారు సెలవిచ్చినారు. ఆ సమాధానము విని నేను నా అహంభావమును, అజ్ఞతను గుర్తించి, సిగ్గుపడినాను. భక్తితో, మనస్సులో, వారికి పునరభివందనము చేసినాను. ఈ విధముగా నాకు శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారితో ప్రథమ పరిచయమైనది.

శ్రీ కవిగారి ప్రతిభనుగూర్చి తెలుసుకొనుటకు ఒక్క శ్రీ కె. పి. జయస్వాల్‌గారి ప్రశంసను చదివితేచాలు. అయినప్పటికీ, శ్రీ కవిగారి జీవితాన్నిగూర్చి, వారి కృషిని గూర్చి శ్రీ నిడుదవోలు వేంకటరావుగారు కూలంకషంగా వివరించినారు. అందుచేత నేనింక ఆ ప్రశంసచేయక, తెలుగు-సంస్కృత సాహిత్యాలకు సంబంధించిన ఏ ప్రముఖ గ్రంథాన్నిగూర్చికాని, ఏ జటిలసమస్యనుగూర్చికాని చర్చించదలచుకొన్నచో నేటికిని ఏదోవిధముగా శ్రీ కవిగారి ప్రసక్తిలేకుండ రచన సాగదన్నచో అతిశయోక్తి కాదని మాత్రము విన్నవించి, విరమించుచున్నాను. సాహిత్యపరిశోధనలో జాతీయ-అంతర్జాతీయ ఖ్యాతిగడించిన ప్రథమాంధ్రుడు శ్రీ కవిగారే అని చెప్పుట సత్యదూరము కాజాలదు.

ఈ పరిశోధనవ్యాసంగంలోపడి కవిగారు తమకున్న ఆస్తినంతయు వ్యయము చేసినారు. ఆరోగ్యమూ చెడినది. ఉద్యోగంనుంచి విరమించి తిరుపతిలో స్థిరపడేనాటికి వారికి మిగిలినఆస్తి కొన్ని అమూల్యములైన తాళపత్రగ్రంథములు, మరికొన్ని వ్రాత ప్రతులు మాత్రమే. సాహిత్యప్రపంచంతో సంబంధంలేని ఒకరిద్దరి దయవల్ల ఒకపూట

---

1. 1957 అక్టోబరు 13, 20 తేదీలలో ఆంధ్రప్రభలో ప్రకటితమైన వ్యాసానికిది సంక్షిప్తరూపము.

తిండి, తలదాచుకొనటానికి వసతిలభించినవి. 1955 లో తిరుపతిలో సంస్కృత విశ్వకళా పరిషత్సభలు జరిగినవి. దానికి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము ఆధ్వర్యమువహించింది. తిరుపతి తిరుమల దేవస్థానంవారు విరివిగా ఖర్చుపెట్టి అతిథులకు మూడురోజులపాటు షడ్రసోపేతమైన విందుచేసినారు. కాని కవిగారివిషయము పట్టించుకొన్నవారే లేరు; ఆ మూడురోజులపాటు కవిగారికి మామూలు ఒంటిపూట పచ్చడిమెతుకులే!

ఇట్టి దయనీయమైన స్థితిలోఉన్న కవిగారికి సహాయం లభించాలంటే ఇంచుమించు ఒక ఉద్యమమే ప్రారంభించవలసివచ్చింది. శ్రీ నార్ల వేంకటేశ్వరరావు, డా॥ పుట్టపర్తి శ్రీనివాసాచార్యులు, డా॥ జి. వి. సీతాపతి, శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రి, శ్రీ కాటూరి వేంకటేశ్వరరావు, ఆచార్య రాయప్రోలు సుబ్బారావు ప్రభృతులు పూనుకొనగా ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం, కేంద్రప్రభుత్వం కలిసి నెలకు రు. 150/– గౌరవభృతిని మంజూరుచేసినవి. కాని దైవము దీనికికూడ అనుకూలించలేదు. కొన్ని నెలలపాటైనా ఈ గౌరవభృతిని అనుభవించకుండానే కవిగారు 20—9—57 తేదీన స్వర్గస్థులైనారు.

కవిగారు నాట్యశాస్త్రమునకు విపులమైన పీఠిక వ్రాయుదునని చెప్పినప్పటికినీ ఆపని పూర్తిచేయలేకపోయినారు. ఆ పీఠికను వారు ఆశువుగా చెప్పినచో నేను వ్రాసి పెట్టుదునని చెప్పి, వారిని 1955 సం॥ చివరలో మద్రాసు తీసుకొనివెళ్ళినాను. ఒక నెలరోజులపాటు వారు అక్కడఉన్నారు. శ్రీ తిరుమల రామచంద్రగారు వారికి భోజనం ఏర్పాటు తమయింటిలోనే చేసినారు; తెలుగు ఆనర్సు విద్యార్థి శ్రీ మన్నవ ఉపేంద్రరావు తనగదిలో వసతి ఏర్పాటుచేసినారు. కాని వృద్ధాప్యమువలన ఆరోగ్యము సరిగాలేకపోవుట వలన కవిగారు పనిచేయలేకపోయినారు. నేను జూలై 1956లో హైదరాబాదు వచ్చివేసిన తరువాత కవిగారిని మరల దర్శింపలేకపోయినాను. చనిపోవునప్పటికి వారివద్ద అమూల్యములైన తాళపత్ర గ్రంథములు, వ్రాతప్రతులు ఉండేవి. వాటిని ఎవరిదగ్గరనో దాచినట్లు చెప్పెడివారు ; అవి ఏమైనవో తెలియదు.

నేనెరిగిన కవిగారు వృద్ధాప్యంలో పేదరికము ననుభవించిన కవిగారు మాత్రమే. ఆమహానుభావుడు తెలుగుసాహిత్యమునకు చేసినసేవ అపారము, అగాధము, అమూల్యము. వారిఋణము తీర్చుకొనుటకు సాధ్యముకానిది. అయినప్పటికి ఈ సంస్మృతి గ్రంథరూపంలో శ్రీ కవిగారికి శ్రద్ధాంజలిఘటించుటకు అవకాశము కల్పించినవారు ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమివారు .. ముఖ్యంగా డా॥ బెజవాడ గోపాలరెడ్డిగారు, శ్రీ దేవులపల్లి రామానుజ రావుగారు. ఈపని చేపట్టుటకు దోహదమొసంగినవారు శ్రీ నిడుదవోలు వేంకటరావుగారు; అంతేకాదు, దీనికి విపులమైన పీఠికవ్రాసి, శ్రీ కవిగారి యశస్సును దీపింపజేసినారు. కీ. శే. నేదునూరి గంగాధరంగారు వ్రాసుకొని, జాగ్రత్తపెట్టిన పెక్కువ్యాసాలను దయతో నాకు అందజేసినవారు శ్రీ ముక్కపాటి తిమ్మరాజుగారు – వీరందరికి నా నమోవాకములు. ఇందులోచేర్చినవ్యాసాలు ఇదఃపూర్వం ఆయా పత్రికలలో, గ్రంథాలలో ప్రకటితాలైనవే. ఆ గ్రంథకర్తలకు, ఆ పత్రికా సంపాదకులకు కృతజ్ఞుణ్ణి.

ఈ గ్రంథంలో కవిగారి తెలుగు వ్యాసాలను కొన్నింటినిమాత్రమే ప్రకటించ గలిగినాము. ఈవిధంగానే కవిగారి ఆంగ్లవ్యాసాలనుకూడా గ్రంథరూపంలో ప్రకటించ వలెనని ఆశ. అంతేకాదు, వారి అముద్రితకావ్యం 'వసంతవిలాసము' ను కూడ ప్రకటించవలసి ఉన్నది. భగవదనుగ్రహమూ, సహృదయుల ఆదరమూ లభించగలవని ఆశిస్తున్నాను.

26–8–1972. —వోణంగి శ్రీరామ అప్పారావు,

"...అందఱికంటె నెక్కువగా నాకు చిరకాలమిత్రులును, ఆంధ్రభాషా వాఙ్మయమునందు విశేష కృషిచేసినవారును, దేశాటనముచేసి యపూర్వ పుస్తక సంపాదనము చేసినవారును, నైన శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారు...క్రొత్తగా నేను భోజరాజీయమును వరాహపురాణమును ముద్రింపఁబూనినప్పుడు వాని ప్రత్యంతరములను గద్వాల సంస్థానమున సంపాదించి తెచ్చి నాకిచ్చి 1904 వ సంవత్సరమునకుఁ బూర్వమునందే నా కృతజ్ఞతకుఁ బాత్రులైన పరమమిత్రులు శ్రీ మానవల్లి రామకృష్ణయ్యగారు" (పీఠిక-పుటలు 5-7 - ఆంధ్రకవుల చరిత్ర 11-10-1917).

—*కందుకూరి వీరేశలింగంపంతులు.*

*　　　*　　　*

"...ఆఙ్గ్లభాషయం దుత్తీర్ణులయ్యు, గీర్వాణాంధ్రభాషలయందు మహా పండితులై, బహుగ్రంథ సంపాదకత్వమునఁ జిరకీర్తిఁగడించిన బ్రహ్మశ్రీ మానవల్లి రామకృష్ణకవి, ఎమ్. ఏ. గారు నాట్యశాస్త్రమున కాదిమఋషియనదగు భరతముని నాట్యశాస్త్రమును ముద్రింపించుచూ నా యీ చిన్నగ్రంథము నాదరించి ప్రస్తావన వ్రాసినందుకు నేనెంతయుఁ గృతజ్ఞుఁడను." (పీఠిక - పుట 2. ఆంధ్రనాటకములు - 1926).

—*జేకుమళ్ళ అచ్యుతరావు.*

*　　　*　　　*

"సాహిత్య ప్రపంచమున మాబోంట్లు తిన్నగా కన్నులుతెఱువకపూర్వమే రామకృష్ణకవిగారు ప్రాచీన ప్రబంధములను ప్రకటించిరి." (క్రీడాభిరామ పీఠిక, 1930).

-*వేటూరి ప్రభాకరశాస్త్రి.*

౧౯౨౮ సం. జూన్ నెల మాడరన్‌రివ్యూ మాసపత్రికలో శ్రీ కే. పి. జయస్వాలుగారు, శ్రీ యదుగిరి యతిరాజస్వామి సంపాదితమై, శ్రీ ఎ. రంగ స్వామి సరస్వతి (రాజకీయశాసన పరిశోధనశాఖ, చెన్నపురి) గారిచే ప్రకటిత

మైన భోజరాజకృత శృంగారప్రకాశైకదేశమును విమర్శించి యది భోజరాజ కర్తృకమే యగునని నిరూపించుచు నొకవ్యాసము ప్రకటించినారు అందు వారు నామమాత్రావశిష్టమై యుండిన యీశృంగారప్రకాశమాతృకను సంపాదించి సంస్కృతసారస్వతమున కమూల్యసంపదను సమకూర్చిన శ్రీ రామకృష్ణకవి గారినిగూర్చి కొంతముచ్చటించినారు. వేదసంహితలు మొదలుకొని యముద్రిత మగు సంస్కృత వాఙ్మయము నీనాడు పరిశోధించి, సంస్కరించి, ముద్రించి వ్యాప్తికిం దెచ్చుచున్న మైసూరు, తిరువాంకూరు బరోడాంసస్థానములతోపా టీమహత్కార్యమునకు కొందఱు ప్రత్యేకవ్యక్తులగు ప్రముఖులుగూడ పూనుకొని రని చెప్పుచు,—

అట్టివారిలో తనకాంతులను నలుదిక్కులకు జిమ్ముచున్న ఉన్నతమగు దీపగృహము (Light house) వలె విరాజిలుచున్న యాత డొక్కడుగలడు. ఆతడు రాజమహేంద్రనగరనివాసియగు శ్రీ మానవల్లి రామకృష్ణకవి, ఎమ్. ఏ. గారే. ఆయనకు ప్రభువులసాహాయ్యము లేదు; హృదయమే సహాయము. దారిద్ర్య మాయనరాజ్యము. ఒక మాధ్యమిక పాఠశాలలో నాయన యొక యుపాధ్యాయుడు.

మౌనముతో, వినయముతో నాయన మలబారునందును, తత్సమీపప్రదేశ ములయందును గల భారతీయగృహములకు సారస్వత తీర్థయాత్రలు సల్పిరి. అచ్చట దక్షిణభారతమునందలి సమకాలీన పరిశోధకుల కొడలు పులకలెత్తించు నదియు, నిఖిలభారత సంస్కృత విద్వాంసుల కానందమును, అభిమానమును గలిగించునదియు నగు నమూల్య సారస్వతనిధానమును కనుగొనిరి. విస్మృత ములై యుండిన కుందమాల, నాలుగుభాణములు, ఇప్పటికి బయటకురాని అద్భుత కళాచరిత్రమును సమకూర్చుచున్న అభినవగుప్తపాదుల భరత నాట్య శాస్త్ర సుప్రసిద్ధ వ్యాఖ్యానము, దండి భారవుల చరిత్రములను బయలుపఱచు చున్న అవంతిసుందరీ కథ, అవంతిసుందరీ కథాసారము అను గ్రంథములను సేకరించి, పరిష్కరించి, ప్రకటించినారు. ఇంతేకాక విశాఖదత్తుని దేవి చంద్రగుప్త మను చారిత్రక నాటకమును, తాపసవత్సరాజము, విక్రాంత శూద్ర కమునను నీ మొదలైన చారిత్రకనాటకములను బెక్కింటిని కనుగొన్నప్రతిష్ఠను సైతము బడసిరి. మఱియు కవిగారు సుప్రసిద్ధ భారతీయ సంగీత శాస్త్ర గ్రంథమయిన మిథిలాపురాధిపతి 'నాన్యదేవుని భరతభాష్యము'ను, సంస్కృత

ప్రాకృత పద్యవాఙ్మయముపై నుత్కృష్ట కళావిమర్శనమును ధారానగరాధీశ భోజరాజ కృతమును నగు శృంగార ప్రకాశమును సేకరించిరి.

శ్రీ రామకృష్ణకవియే స్వయమొక నూత్నోపలబ్ధ వస్తువు. ఆయన సంస్కృత సాహిత్యజ్ఞాన మతిమానుషము. అనగా అపారము, సవిమర్శకము. ఆభాషయందాయనకు గల యభిమాన మద్వితీయము.

నష్టప్రాయమైన భారతీయులసారస్వతకులధనమును మరల సేకరించుటతో వీరి వ్యక్తిగతపరిశ్రమ మంతరించలేదు. అయ్యది తత్ప్రిచురణము నందును, ఉత్సాహము గలిగియున్నది. "దక్షిణభారతి" అను పేరున నొక గ్రంథమాలను వీరు ప్రారంభించినారు. కాని చాలినంత ధనసహాయము లభింపమిచే నందు గ్రంథములు తఱచు వెలువడుటలేదు.

—అనినుడివి పదపడి శృంగారప్రకాశమునుగూర్చి యింత విమర్శించి మరల నిట్లు చెప్పినారు—

శ్రీరామకృష్ణకవిగారు తాము శృంగార ప్రకాశమునందలి నాటకభాగమును పరిష్కరించినట్లు నాకు లేఖనువ్రాసియున్నారు. నష్టములై పోయిన నాటకముల నుండి యుద్ధృతములైన భాగములందుండుటచే దానిని గాంచ నెంతయు కుతూహలముతో వేచియున్నాము. అందు భాసకవికృతమగు "స్వప్న వాసవదత్త" నుండి కొంతభాగమున్నట్లు తెలియవచ్చినది.

అన్యరాష్ట్రీయులగు శ్రీ జయస్వాలుగారు గుర్తించిన యీ కవిగారి భాషాభిమానమును, పాండిత్యమును, పరిశోధనశక్తియును, పరిశ్రమమును ఆంధ్రసహృదయులు గుర్తింపజాలకుండుట కడువిచారకరము. ఇంతటనైనను సర్వథా సమర్థులగు శ్రీ కవిగారి కుచితరీతిని సాహాయ్యమొనరించి తమకును, కవిగారికిని కీర్తిని పెంపొందింపజేయజూచుట పరమావశ్యకము.

—*భారతి, జూలై, 1928*

Amongst these individuals there is one at this moment who stands out like a light house. This is Mr. Ramakrishna Kavi, M.A., of Rajahmundry. His resources are not income of a State but of heart. He is a lord of poverty, a teacher in a Secondary School. Silently and modestly he has led library pilgrimages to the Hindu homes of Malabar and the neighbourhood and recovered treasures which have electrified a generation of workers in the South and which have filled the Sanskritists with pleasure and pride all over India. He has brought to light and published "Kundamala"; 4 lost Bhanas; Abhignava Gupta's monumental commentary on Bharata's Dramaturgy giving a History of the art hither to unknown and undreamt of; the Avanthi Sundari Katha Sara which discloses the history of Bharavi and Dandin. Even he has to his credit the discovery of the historical drama Devi Chandragupta of Vishakadatta and he has drawn to the attention to a whole class of historical dramas like Tapasavatsaraja, Vikrantha Sundraka etc., Mr. Kavi has found out the greatest Hindu work on music, the Bharatha Bhashya by Nanya Deva, the famous King of Mithila, and the greatest and the first anthology or rather an art of criticism on Sanskrit and Prakrit poetry—the Sringara Prakasa by King Bhoja of Dhara about which I shall say something more presently.

Mr. Ramakrishna Kavi is himself a discovery. His knowledge of Sanskrit Sahithya is of the rare traditional type (i.e.) unlimited and at the same time it is critical. His patriotism for that literature has probably no equal.

Individual exersion has not stopped with merely discovering the literary heirlooms of the race. It has been prompt in the work of publication. Mr. Ramakrishna Kavi has started his modest series called the Dakshina Bharathi. Evidently the series is lacking funds which is borneout by the struggling appearance of books.

*—K. P. Jayaswal,*
Modern Review–June, 1928.

Sylvain Levi, my beloved teacher, first introduced me to Manavalli Ramakrishna Kavi, perhaps in 1926, while I was a student in Paris. Kavi was then preparing his edition of the 'Natya Sastra', and wished for information about—'Nataka-lakshanaratnakosa' of Sagaranandin, which Sylavain Levi had entrusted to me. I soon turned to kavi for help with my difficulties in the text, and he was a most kindly and willing counsellor. For many years he continued to give me encouragement and help, until the war interrupted our correspondence. It was my first experience, often since renewed, of the generosity of Indian scholars.

I am very glad to know that the work of so good a man has been recognised as valuable and worth preserving. I owe a great deal to Shri Kavi, and I feel honoured in being associated with this collection of his essays.

*Myles Dillon,*
16-6-71
(Senior Professor, Dublin Institute
for Advanced studies,
Dublin.)

"సర్వస్మిన్ జగతీతలే స్థిరయాశాః, నాట్యాగమాంభోనిధౌ
ఆపాతాళనిమగ్నమందరనగః, శ్రీమానవల్ల్యన్వయే ।
క్షీరాబ్ధా వమృతాంశు రూర్జితవచాః శ్రీరామకృష్ణప్రధీః
నాట్యం వేద మదీధరత్ కరుణయా లోకప్రియంభావుకః ॥".

—శ్రీ కప్పగంతుల లక్ష్మణశా

# 1. కుమారసంభవము

## ప్రథమ భాగము

ఈమహాకావ్యమును రచించిన కవి నన్నెచోడ దేవుఁడు. ఇతనికిఁ గవితా ప్రౌఢిమను బట్టి కవిరాజశిఖామణియనియు పిత్రార్జితమునుబట్టి టెంకణాదిత్యుఁడనియు బిరుదములు గలవు. ఇతఁడు సూర్యవంశపు క్షత్రియుఁడు. ఇతఁడు కావేరీతీరమున నొరయూరను పట్టణము రాజధానిగా గోదావరీ సింహాచల మధ్యదేశమునేలెను. వీనితండ్రి చోడబల్లి. తల్లిశ్రీసతి. ఇతఁడు క్రీ-శ. ౯౪౦లోఁ పాశ్చాత్యచాళుక్యులతో యుద్ధముచేసి రణరంగమున నిహతుఁడయ్యెను. పూర్వము రాజ్యపరిభ్రష్టుఁడై యజ్ఞాతవాసముసేసి మరల లబ్ధరాజ్యుఁడై కొంత కాలము రాజ్యమేలెను. ఇతని గురువును గృతికర్తయునగు మల్లికార్జునయోగి ద్రవిడమండలమున శైవసమయాచార్యత్రయముతో మేలిమిగన్న మాణిక్య వాచకునితో వాదించి నట్లు తెలియుచున్నది. ఈకవిశిఖామణినిగురించి ముఖ్యముగా రెండవభాగము పీఠికలో విస్తారము వ్రాయఁదలంచియున్నాను. ఇతఁడు కళావిలాస మను మఱియొక్క కావ్యమును గూడ రచించెను. అది నాకు లభింపకున్నను దానిలోని పద్యములు కవిసంజీవని, రత్నాకరము, అథర్వణ చ్ఛందము, గణపవరపు వేంకటకవి లక్షణశిరోమణిలో నుదాహరింపఁబడినవి. ఆపద్యములలోఁ గొన్నింటి నిందుదాహరించినయెడల సుముఖులెవ్వరైనఁ దద్గ్రంథమును వెదకి దాని ననర్థమగు మరణమువలనఁ దప్పింతురను నాస గలుగుచున్నది

సీ॥ పృథుల విశ్వంభరారథమున కెదురుగాఁ
బూన్పించె నెవ్వాఁడు పువ్వుఁదేరు
కాంచనాచల కార్ముకమునకు సాటిగాఁ
జేపట్టె నెవ్వాఁడు చెఱకువిల్లు
నవిరళపాశుపతాస్త్రమ్మునకు వాఁడి
మిగిలించె నెవ్వాఁడు చిగురుఁదూపు

నతులితామర దానవాదిబలంబుల
గెలిపించె నెవ్వఁడయ్యుత్పలంబు
నట్టిజగజెట్టిమన్మథుం డఖిలలోక
ములకు వెఱగొంగ జీవుల మూలకంద
యతనియిలుఁజొచ్చి వెడలనియతఁడు గలదె
యతనియమ్ములఁబడకున్నయదియుఁ గలదె.

క॥ తలపోయఁగ రుచులాఱును
గలుగును వాతంబుఁ గ్రిమియుఁగఫముంజెడు నా
కలిపుట్టు దగయుఁ జెడుఁద
మ్ములము పదార్థంబు రాగమూలము ధరణిన్.

చ॥ తొడవులు వెట్టు సంభ్రమముతోఁ దిలకించు మడుంగుగట్టు పైఁ
బడఁదడవోవ దింపెఱిఁగి పట్టుదు నేర్పులు గట్టిపెట్టుఁబ
ల్కెడునెడఁ దొట్రుపాటొదవుఁ గింకకుఁ జేగిలుమన్ సమర్పఁగాఁ
జిడుముడిఁ బొందుఁగొంత పతిచేరిన గూరిమిగల్గెనేనియున్.

చ॥ లలనలు కొందఱాత్మపతులం దగఁగూడినచెయ్వులన్నియుం
దలఁచి సఖీజనంబులకుఁ దప్పకచెప్పెదు వారు పుణ్యజీ
వులు చెలి యామినీశుని కవుంగిలిడాయుటె కాక తాల్మికీ
ల్దొలఁగిన తీరుగీరు నటదోవవు నాకు రతిప్రయోగముల్.

క్షేమేంద్రుఁడను నొకానొక కశ్మీరమహాకవి కలావిలాసమని సంస్కృత మున నొకగ్రంథము వ్రాసియున్నాఁడు. తెనుఁగుబద్యముల నన్నియుఁ గూర్చి పోల్చిచూడఁగా నద్దాని కిది తెనుఁగుగాదనియు నిందుఁ గథా భాగముకూడఁ గలదనియు సంస్కృతమున దానిలోఁ గథాంశములులేకుండుటయుఁ జూడఁగా రెంటికిని నామమాత్రసాదృశ్యము గలదని తేలినది.

ఈ కుమారసంభవము కాళిదాసుకావ్యమునకుఁదెనుఁగుగాదు. ఇందుఁ బేర్కొనఁబడిన సంస్కృతకవులలో నుద్భటుఁడనువాఁడు భావగర్భమును గల కుమారసంభవమను కృతివిరచించినట్లు కవి చెప్పుచున్నాఁడు. కాశ్మీర కవులలో జయాపీడ సంస్థానవిద్యాపతియగు నుద్భటుఁడొక్కఁడు శ్రీ.శ.

రంబ లో కావ్యాలంకారసారసంగ్రహమును రచించి దానిలోఁదన కుమారసంభవ కావ్యములోనుండి శ్లోకము లుదాహరించుకొనెను. కావున నాయుద్భటుని కుమారసంభవమే నన్నెచోడుఁడు చూచెనని యేర్పడుచున్నది. ఆగ్రంథ మిప్పుడు లభించుటలేదు. దానిలోని శ్లోకముల నుద్భటుఁడు తనయలంకారగ్రంథమునందును, ప్రతీహారేందు రాజను వ్యాఖ్యాతయు, కావ్యప్రకాశమునకు సంకేతమను వ్యాఖ్యానమునందు మాణిక్యచంద్రుఁ డను కవియు, వల్లభదేవుఁడును, ఉదాహరించియున్నారు. అయ్యుదాహృత పద్యములన్నియుఁ బోల్చిచూడఁగాఁ దెనుఁగు కుమారసంభవ ముద్భటుని కావ్యమునకుఁ దెనుఁగు గాదని యేర్పడుచున్నది. మఱియు నాశ్లోకములను బట్టి చూడఁగా నుద్భటుఁడు శబ్దచిత్రములయందును నప్రస్తుత శ్లేషలయందును బ్రీతి గలవాఁడని తోచుచున్నది. కొన్నిశ్లోకముల నుదాహరించినఁ జదువువారు రెండుకావ్యములలో భేదమును గుర్తెరుంగుదు రని చూపుచున్నాను. "విరళాస్తాదృశా లోకే శీలసౌందర్యసంపదః నిశాః కియత్యోవర్షేపి యాస్వింద్రుః పూర్ణమండలః", "సాగౌరీ శిఖరంగత్వా దదర్శోమాం తపఃకృశాం, రాహుపీత ప్రభస్యేందో ర్జయంతీం దూరతస్తనుం", "యాశైశిరీ శ్రీస్తపసా మాసే నైకేన విశ్రుతా, తపసా తాం సుదీర్ఘేణ దూరాద్విదధతీమధః", "దంతప్రభాసుమనసం పాణిపల్లవశోభినీం తన్వీం వనగతాం లీన జటాషట్చరణావళిం", "స్వయంచ పల్లవాతామ్ర భాస్వత్కరవిరాజినీ। ప్రభాతసంధ్యే వాస్వాప ఫలలుబ్ధేహితప్రదా, ఇందుకాంత ముఖీ స్నిగ్ధమహానీలశిరోరుహా। ముక్తా శ్రీస్త్రిజగద్రత్నం పద్మరాగాంఘ్రిపల్లవా। అపారిజాతవార్తాపి నందనశ్రీర్భువిస్థితా। అబిందు సుందరీ నిత్యం గలల్లావణ్యబిందుకా" ఇత్యాదులు చూడఁగా, యాతాస్తేరస సారసంగ్రహవిధిం నిష్పీడ్య నిష్పీడ్య యే। వాక్తత్వేక్షులతాం పురాకతిపయే తత్త్వస్పృశశ్చక్రిరే। జాయంతేద్య యథాయథంతు కవయస్తే తత్రసంతన్వతే। యేఽనుప్రాసకఠోర చిత్రయమక శ్లేషాదిశల్కోచ్చయం" అనుమంకుకునిశ్లోకము స్మరణకు వచ్చుచున్నది. ఈ కథ నితఁడించుకమార్చియున్నాఁడు. సంస్కృత కుమారసంభవ కథలలో లేని గణపతి జననమును బార్వతీ దాక్షాయణులు కైలాసవనభూముల స్వేచ్ఛగా విహరించు గజయూథములఁజూచి యపూర్వరతిచిత్తులై గజరూపములు దాల్చి క్రీడింపఁగా గణేశ్వరుఁడుద్భవించెననియు, రెండవది, శరవణమను సరస్సున సప్తర్షుల భార్యలు జలక్రీడసేయుచుండ నగ్నిహోత్రుఁడు మోహించి వారల సమీపింప వారిలో నరుంధతి తొలఁగినందక్కినయార్గురును నగ్నిఁబురుషునిగా

గ్రహింపక శీతాపనోదనార్థము నిరంబరలై సమీపింప నగ్నివారిం గౌఁగలించి తానుధరించియుండెన శంభువీర్య ధారణను దొలగించుకొనెను. వారలు సద్యోగర్భంబుపడనిజడిసి గర్భపిండముల వెలార్చి కమలపత్రంబున నిడి యింట్లకు మడిగి పతిశాపత ప్తలయ్యుఁ బరమేశ్వర వీర్యధారణ ప్రభావంబున జ్యోతిర్లోకము నెందినట్లును మార్పులు కలిగించియున్నాఁడు. ఈమార్పులీకవి చేసిన వనియేయూహించెదను. ఎట్లైన నివి మనోరమములే. దీనిలో ౧౨ ఆశ్వాసములలో ౨౧౦౦ పద్యములు గలవు. ముద్రితగ్రంథములలో లేని యపూర్వపదము లీకావ్యములోఁ గుప్పలుగానున్నందున వానినవరించి లేఖక దోషముల గుర్తెఱింగి సంస్కరించుటకు నవకాశము నాకుఁజాలమింజేసియు, నామిత్రులుపలువురీకృతిలోఁ గొంతభాగమైన బ్రకటింప నన్నుఁబురిగొల్పుట వలనను, ఇటీవల నాకు లభించిన కొన్ని పూర్వకావ్యములు చక్కఁగా శోధించి ప్రాచీన పదసంగ్రహముచేసికొని దీనిముద్రించిన స్ఖాలిత్యములు మెండుగా నుండవనియు, పరదేశమునందు గ్రంథసామగ్రి చాలక యానుకూల్యములేక యస్వతంత్రజీవనమున నక్కృతావకాశత్వమునను దీనిబూర్వభాగముగా నేడాశ్వాసములు ౧౦౦౦ పద్యములు మాత్రమేయిందుఁ బ్రచురించుచున్నాఁడను. ఈకృతి నన్నయభట్టుకంటె నూఱేండ్లుపూర్వుఁడైనను ౧౦౦౦ సంవత్సరములుగా నెవ్వరును గుర్తెఱుంగక యుండఁదటస్థింపదనియు దీనిని నేనోమఱియెవ్వరో రచించి గ్రంథప్రాశస్త్యమునకై ప్రాచీనుల పేరవ్యవహరింపఁ బడెననియు గ్రంథమును బ్రచురింపక మునుపేయొక వార్తపుట్టినది. ఇట్టివార్తను ఖండింప కున్న మహాపాపము. నాయట్టివాని కిట్టికావ్యమును వ్రాయ సామర్థ్యము లేదనుట తెల్ల మనుట గాక నాచన సోమునికిఁ దరువాత నిట్టికవిత గూర్చు వాఁడే యాంధ్రదేశమునఁ బుట్టినవాఁడుకాఁడు. అధునాతన కవులలో నిట్టి వాఁడు గల్గిన వాఁడు నిర్లజ్జుఁడై తననామగోపనము సేయ హే గానరాదు. ఈకవి ప్రఖ్యాతుఁడు కాకపోవుటకుఁ గారణము:—

బహుశో సామాన్య మతిత్వేన తేషాంపరిగ్రహేలోకే, కామంగతాప్రసిద్ధిం సామాన్య కవయః అతఏవ" అని యూహింపవలయు. అయినను గుమార సంభవములోని పద్యము లథర్వణచ్ఛందము పెద్దన లక్షణసారసంగ్రహము, కవిసంజీవని, రత్నాకరము, లక్షణశిరోమణి, వీనిలో నుదాహరింపబడినవి. అథర్వణుఁడు:—

క॥ మగణమ్ముఁ గదియ రగణము
వగపక కృతిమొదటనిలుపు వానికిమరణం
బగునిక్క మంద్రుముదియఁడె
యగునని యుదితొల్లి చేంకణాదిత్యుఁ డనెన్"

యనియును బూర్ణబిందుప్రాసముక్రింప పద్యముసు నుదాహరించెను. కవిసంజీవనిలో నెక్కటి పథలక్రింప, స్మరతత్త్వసారము, కాశీశతకము, ముద్రారాక్షసము, భారతానుశాసనికము- వీనిలోని పద్యము లుదాహరించి, "నన్నెచోడని కుమార సంభవములోని"—"ఆయతమతినుత సప్తోపాయముల నెఱుంగవలయుఁ బ్రతి సామము భేదాయతి దానముదండము। మాయోపేక్షేంద్రజాల మంత్రము లోలిన్" అనిమఱియు "పూనిరహస్యంబాడెడు వానికి నిది వానిరీక్ష్యవక్తవ్యం రాత్రౌ నైవచ నైవచ యను మానితహితభాషణంబు మతినిలువం దగున్" అనియిచ్చియున్నాఁడు. వీనిలోఁ బై పద్యము ౧౦వ యాశ్వాసమునన్నది. క్రిందిపద్యము దీనిలోలేదు. ఎచ్చటిదో యెఱుంగుటకును నలవిలేదు. పెద్దన లక్షణసారసంగ్రహములో ౬వ ఆశ్వాసమునుండియు రత్నాకరకర్త ౧౨వ యాశ్వాసమునుండియుఁ బద్యము లుదాహరించియున్నారు. ఇంతఱు చూచిన కృతినేటికెట్లు క్రొత్తదగును? అదియట్లుండ, నమరేశ్వరుని విక్రమసేనము, విన్నకోటపెద్దన ప్రద్యుమ్నచరిత, తిక్కనసోమయాజి విజయసేనము, కవి భల్లటుని విక్రమార్కచరిత, పెమ్మన యనిరుద్ధచరిత్రమును ఎవ్వరెఱుంగుదురు. కవిలోకబ్రహ్మయను బిరుదుతో శతాధిక కావ్యకర్తయగు పెద్దపాటి సోమనాథకవి నెవ్వరెఱుంగుదురు? అతనియరుణాచలపురాణములోనుండి యొక్కపద్యము కవిసంజీవనిలోనుండితీసి కూచిమంచితిమ్మకవియుదాహరించెను. అతనికృతులలో శివజ్ఞానదీపిక, అరుణాచలపురాణము, కేదారఖండము ప్రౌఢములైనవి. మఱియునున్నెచోళునిఁ బూర్వకవులెఱుంగుదురాయను నంశమునుసూచించుటకై పోలికపద్యము లుదాహరించితిని. వానిలోముఖ్యముగాఁ జక్కనకవియుం, బింగళిసూరన, పూర్వకవిసూరన, తెనాలిరామలింగఁడు వీరుమొదలుగా భావచౌర్యమును జేసియున్నారు. పింగళిసూరన వీనిపద్యమును, రామలింగఁడు ౧-౨౩ పద్యమును జదివియే తమపద్యములు గూర్చిరి. జక్కన విషయమును జూడుఁడు.

సీ॥ "దుగ్ధాంబునిధినిట్టఁదోఁచెనోయని శేషుఁ
బాన్పుగా హరినీటఁబవ్వడింపఁ
నాదవి సుధారస ముప్పొంగె నోయని
దేవతల్ తనివోవఁ ద్రావఁదలఁపఁ
దొలఁకారుమిన్నెఱు వెలివిరిసెనో యని
లీల సురాంగన లోలలాడఁ
బాదరసం బుర్విఁ బరఁగెనోయని సిద్ధ
నికరంబు కలశముల్ నించికొనఁగఁ

బాండురాంగుండు విశ్వరూపంబుదాల్చి
యెలసెనోయనిసద్భక్తు లెలమిఁగొలువ
నఖిలజీవుల కానంద మతిశయిల్ల
నచ్చ వెన్నెలవిమలమైయలరికాసె." —కుమా = ఆ.౮

సీ॥ గంగాప్రవాహంబు కాఁబోలునని వశి
ష్ఠాదు లనుష్ఠాన మాచరింప
నమృతంబు వెల్లువయని నిలింపాదులు
మునుకొని దోసిళ్ళ ముంచిక్రోల
దుగ్ధాంబునిధి యని తోయజాక్షుఁడు శేష
పర్యంక మిడుకొని పవ్వడింపఁ
బరమేశువిశ్వరూపం బని బ్రహ్మాదు
లమర దండ ప్రణామములు సేయఁ

దలఁపభూనభోంతరముల కొలఁదితెలిసి
బెరసియెన్మిది దిక్కులఁబొరలిపొరలి
దట్టముగనంతకంతకుఁ దనరితనరి
యిట్టిలంబుగవెన్నెల నిట్టవొడిచె."

—జక్కన విక్రమార్క చరిత్రము.

వేయేఁ యితని కావ్యమును దిక్కన, కేతన, మంచన, నాచన సోముఁడు, అమరేశ్వరుఁడు, విన్నకోట పెద్దన, సూరనలు, రామలింగఁడు, కొందఱు లాక్షణికులును చదివినట్లు తెలియుచున్నది. "త ఏవవిదవిన్యాసా

స్తాపివార్థవిఘాతయః। తథాపినవ్యం భవతి కావ్యం గ్రథనకౌశలాత్" అను వాక్యము కేతన సోమనాథాదులయందుఁగూడ వ్యక్తముగుచున్నది.

నన్నెచోడుని కుమారసంభవము నానావిధాలంకారములకును, నపూర్వ వ్యాకరణలక్షణములకును,, కొన్ని శబ్దచిత్రములకును, భావ, వ్యంగ్య, ధ్వనులకును లక్ష్యము లిచ్చుటయందుఁ బ్రథమగణ్యముగా నున్నది. ఈ కవికిఁ బూర్వము సంస్కృతమున నెందఱో మహాకవులున్నను గ్రంథచౌర్య మగ పడదు. "ముదమునసత్కవికావ్యము। నదరకవిలుకాని పట్టినమ్మెను బరహృద్భే। దమై తలయూపింపనియది కావ్యమె వాని పట్టినదియుం గరమే" యనునది మాత్రమే "కింకవే స్తస్యకావ్యేన కింకాండేన ధనుష్మతః పరస్యహృదయేలగ్నం నఘూర్ణయతి యచ్ఛిరః"యను శ్లోకార్థమునుండి గ్రహింపఁబడినది. దీనిలోఁ గొన్ని యత్యాశ్చర్యజనకములగు భావములుగలవు. అట్టిపద్యము లీ ముద్రిత భాగములోనే కొన్నిగలవు. వానికిఁజూడఁగా 'తత్తత్సమగ్ర బహుశాస్త్ర విమర్శసిద్ధవైదగ్ధ్య దిగ్ధమతయో బహవః కవంతాం, యత్కించిద స్తి తు మహాకవి వాగ్రహస్యంస్వప్నేఽపి తస్యకిలతేన దిశం స్పృశంతి' యనియు, ఆ'సంసారం (సృష్టి) కవిపుంగవైః ప్రతిదివసగృహీతసారోఽపి। అద్యాప్యభిన్న ముద్ర ఇవ జయతి వాక్పరిస్పందః' అని మంకుకవాక్పతికవులు సూచించిన వాక్యములు నిక్కములని తోచుచున్నది. మఱియు నీకవి,'ఓలినకడచననఱువది। నాలుగు విద్యలను నేర్పు నైసర్గికమై। వాలినసుకవులకుంగా కేలతరమెకృతులు చెప్ప నెవ్వరికైనన్' అని చెప్పుకొన్నట్లు సర్వజ్ఞుఁడని చెప్పుటకుఁ దగిన సూచనలు కావ్యములో నగపడుచున్నవి. ఆంధ్రకవులలో నిట్టివారు తిక్కన, నాచనసోముఁడు, ఎఱ్ఱాప్రెగ్గడయు మాత్రమే.

ఇతని కాలములో దీర్ఘము మీఁది యర్ధబిందువు పూర్ణబిందువుగానే వాడు చున్నట్లును కృష్ణదేవరాయల కాలముననే యది యర్ధబిందు వయ్యెననియు నీకృతివలనఁ దేలుచున్నది. దీర్ఘములమీఁద నెఱసున్నలు సోముఁడుకూడఁ బ్రయోగించి యున్నాఁడు. చూడుఁడు;ఉ.''ఎంచిన ప్రేమసేవదకమిమ్మని రుక్మిణి మున్ను వేఁడుడుం। పూంచినపూఁవు దక్కఁ బలుపోకలఁ బోవుచునుండు దేవుఁడున్। డాంచినసొమ్ముచేరె నకటా మదిఁగోరని సత్యభామకున్। నోంచిన వారిసొమ్ము లవి నోమనివారికి వచ్చునే యిలన్'', ''ఘంటాకర్ణుఁడు నేను నా

యనుజుఁడే కాలాంతకుండేము—ముక్కంటిన్...జంటన్ ... వేంటంబోయితి మేని' అని. ఇందు, ఏచుశబ్దమున నరసున్న యీ యర్థమున లేదు; వేఁట యనుటకు వెంటయని రూపాంతరము స్థలాంతరమున నెచటలేదు. భీమకవి నృసింహపురాణమున, ''వాండిమినల్ల సిద్ధిజనవల్లభుఁడోర్చిన రాజుభీరుఁడై। యాంప్రసుగానసుంత వృషభాంకము పెట్టి కొనంగఁ జూచితో। నేండిదెయేమి నీవనుచు నెచ్చెలులెల్ల హసింప నంతలో। మూండవకంటితోడి దొరమూర్తి వహించిన ముక్కిరంగనల్'' అని చెప్పియున్నది కావుననే శ్రీనాథునివఱకును నర్ధబిందుప్రాసములు సడలనీయక ప్రయోగించిరి. నన్నయాదులు నిర్బంధపు నర్ధబిందువును గలపిరని యప్పకవ్యాదులు చూపిన ప్రయోగములన్నియు వారి యల్పజ్ఞానము సూచించుచున్నది. అప్పకవియు, కూచిమంచి తిమ్మకవియు సుదాహరించిన పద్యములన్నియు లక్షణసారసంగ్రహ, కవిసంజీవని, కవి చింతామణి, లక్షణశిరోమణులు—వీనిలోనే యున్నవి. చీకటి, వీపు, శబ్దములలో నరసున్న లేదు. ఉన్నట్లు ప్రామాణిక కవులలోఁ బ్రయోగములు లేవు. కవిత్రయ, నాచనసోమన, నన్నెచోళ, కవిభల్లట, పిన్నకోట పెద్దన, శ్రీనాథ. కేతనలు, ప్రాససంకరము చేసినవారు కారు. చీకటిశబ్దమునకు భారత దశ కుమార చరిత్రలలోని ప్రయోగములు చూపితిని. వీపుశబ్దమునకు నాదిపర్వము లోని ప్రయోగముగాక 'వీపుననబ్ధి నొక్క పృథివీధరమున్ దగఁదాల్చెనంచు లక్ష్మీపతి' అని నృసింహ - ఆ-౪-౧౮౦ లోను, 'వీపునమోపెఁ గచ్ఛపము వెంపెభుజంగమరాజు మస్తకస్థాపితఁజేసె నీవు వసుధారమణిం బెనకోమటీంద్ర బాహాపరిరంభగుంభ సముదంచితఁ జేయుటయింత యొప్పునే మోవరులేమెఱుం గుదురు ముగ్ధలతోడి విహారధర్మముల్' అనియు నెఱ్ఱాప్రెగ్గడ ప్రయోగించి యున్నాఁడు. తీగ, శబ్దములో నరసున్న లేదు. 'డాగు' అనుటకు నెగయు ననునర్థమున నరసున్న లేదు. మూఁపుశబ్దమునకు రెండురూపములు ద్రవిడ కర్ణాట భాషలలోఁగూడఁ గలవు. బాగుశబ్దము ప్రాచీన నవీనరూపములు రెండు. ప్రాచీనరూపములో నరసున్న గలదు. 'యాంగువా[illegible] యిర్కళు మప్పూయిరెపంగుసుం। బాంగు బమణ్ణీట్టిర్ పణ్బుబవగుత్తు' అని మణిమేఖల-ఆ-౬. ౧౫౫. ఇందు 'బాఁగు' అనఁ బ్రకాశము. కావునఁ బైపదముల నుంచుకొని యప్పకవి, ముద్దరాజు రామన, కస్తూరి రంగకవి, గణపవరపు వేంకటకవి, తిమ్మకవి—వీర లుదాహరించిన సంకరప్రాసములు శోధించినయెడల వీరి పాండిత్యమే సంకరమని తోచును. ఆఁగు-ఇత్యాది గకారములమున్న అర్థ

బిందువు గలదా లేదా యను సంశయమును, 'గ' కారము, 'వ' కారమైనచో లేదు. గాకున్న నున్నట్లూహింపవలయు. మూగుశబ్దము మూపు అనురూపమును జెందు చున్నది. చూడుఁడు కుమారసంభవములో ౪౭౪వ పద్యములో శబ్దాలంకారము. మఱియు శాసనములలో 'నాండు' అనియే యున్నది. కావునఁ బూర్వకాలమున దీర్ఘముమీఁద నెఱసున్నయే వాడినట్లు తోచుచున్నది. నాడు శబ్దమున 'ఆనాడు, నేడు, ఎన్నడు' అను నర్థమున మాత్రమే యర్ధానుస్వారము గలదు. 'నాడు' దిన మనునప్పుడు లేదు. 'రెండవనాడు' అనునప్పుడు లేదు. ద్రవిడభాషలో అంద్రి, ఇంద్రి, ఏంద్రు, అనినాఁడు, నేఁడు, ఎన్నఁడు అనియు, రెండు నాళ్ అని రెండునాడులు అనియు వేఱువేఱు పదములు గలవు. కావున నుద్యోగ పర్వములోఁ దిక్కన సంకరముచేసినవాఁడు కాఁడు. 'క్రౌంచపద, సరసిజ, గర్భబంధ కవితల లక్షణములలోఁ దప్పులుసెప్పిన యప్పకవ్యాదుల లక్షణ సూత్రములు ప్రామాణికములుగా గ్రహించుట దోషము. ఇప్పుడు ప్రాచీన నవీన కావ్యములు చేతిలోనున్నవి. సుముఖులు చూడఁదగును. నన్నెచోడుడు, ఏనియను శబ్దమును నేనియని నకారాదిగాఁగూడఁ బ్రయోగించెను. కాబట్టియే నన్నయభట్టు–న్నేని...ఉద్ధరణీరవింపులు, అవి–ఆ–ఽ. అను నకారాదిగాఁ బ్రయోగించె. ఇది తెలియక లాక్షణికులు దుస్సంధియు, యతికి వైకల్పిక భావమును నన్నయభట్టున కారోపించిరి. చోడుని శబ్దప్రయోగములు పరమ ప్రామాణికములై కవిత్రయ పెద్దన సోమన కేతన మంచనాదుల ప్రయోగము లకు సరిపోవుచున్నది.

## ఉత్తరకథా ప్రశంస

అష్టమాశ్వాసమునఁ బార్వతీ వర్ణనమును, శివుని ప్రస్థానమును, పౌరస్త్రీ దర్శనమును, బ్రహ్మాదుల వర్ణనమును, సాయంకాల వర్ణనమును, తమోవిజృంభణమును, చంద్రోదయ వర్ణనంబును, విటాభిసారికా వర్ణనంబు, లంజికాప్రసాధనంబును, పాంచాలాది విటవర్ణనంబును, సూర్యోదయంబును, వివాహయత్నంబును; నవమాశ్వాసమున శివపార్వతీ ప్రసాధనంబును, వివాహంబును, ఉద్యానవనవిహారంబును, జలక్రీడయును, కైలాస నిర్గమంబును, రతిక్రీడా విహారంబును; దశమాశ్వాసమున నగ్ని దేవతల ప్రేరణంబున వచ్చి శంభు వీర్యతప్తుఁడగుటయు, గంగ కొనంగుటయు, గంగాదేవి వల దనుటయు, శర

వణసరోవరంబు దఱియుటయు, సప్తర్షి పత్నీదర్శనంబును, నరుంధతి పరిధానము ధరించుటయు, తక్కిన యాఱ్వురు నిరంబరలై యగ్నిచే నాలింగితలగుటయు, సద్యోగర్భము దాల్చుటయు, గర్భవిచ్ఛేదము సేసి కమలపత్రంబులం దిడి గృహమునకుం జని శప్తలై జ్యోతిర్లోకంబు సెందుట, కమలపత్రంబునఁ గుమారుం డుదయించుటయు, నారదాగమనంబును, ఇంద్రసందేశమును, ఐరావత కుమారయుద్ధంబును, ఇంద్రధావనంబును, శివదర్శనంబును, పార్వతి వాత్సల్యంబును, కుమారుని సేనాపతిత్వంబును; ఏకాదశాశ్వాసమున తారకునకు దూతం బుచ్చుటయుఁ బ్రాతిదూత్యంబును, యుద్ధ సన్నాహంబును, వీరపత్నీ ప్రవాస దుఃఖంబును, దివసద్వయ యుద్ధంబును; ద్వాదశాశ్వాసమ్మున తృతీయ దివసయుద్ధమ్మున తారక మరణంబును, దివ్యాంగనా శేషాక్షతా వర్ణనంబును, గ్రంథకర్తృ కవితోద్దేశమును వర్ణింపఁ బడినవి.

దీనిలో నాశ్వాసాద్యంత పద్యములలోఁ గృతిపతియగు మల్లికార్జునకును శివునకు నభేదము సేయఁబడినది. ఈ మర్యాద కర్ణాటభాషలో పంప భారతము లోను గదాయుద్ధము నందును గూడఁగలదు. గ్రంథాంతమునను "సరసాహారము రాగ హేతువను టజ్ఞానంబు పారావతో। త్కరముల్ చిక్కనిరాలుమ్రింగియు సదాకామార్తులై యుండుఁగే। సరి సాంద్రామిషభుక్తియైనను సకృత్సంభోగ మందున్ మనో। హరసుజ్ఞానమ కాక రాగరస మం దాహారనిర్వృత్తియే.

సీ॥ బుద్ధీంద్రియంబుల పొలఁతులనాఁ జాలు
 కర్మేంద్రియంబుల గర్వమడచి
విషయాలి నడపాడువీధికలనఁ జాలు
 బుద్ధీంద్రియంబుల పొంకమడఁచి
యంతఃకరణతతి నాటపట్టనఁ జాలు
 విషయ సమూహంబు వీకుదఱిచి
యాజవంజవమున కనుచారియై పర్వు
 నంతఃకరణతతి నలవుమడిచి

సురుచిరస్థూలముల్ బాహ్యకరణసమితి
సూక్ష్మమంతః కరణతఁ జొచ్చికూడు
నాత్మనాత్మైకదృష్టి సర్వాత్ముఁ బరమ
పరునిశివు గాంచుట పరమపదవి సుమ్ము" అనిచెప్పి,

సీ॥ "జ్ఞాన దీపంబు హృత్సదనంబులోఁ దాన
దీపింపగానెంతదిప్పరువాడు
వలచేత వసుమతీవలయంబు నవరత్న
వలయంబుగా నిపవలచువాడు
భారతిఁదమమోముఁబసిఁపి మాచువులోన
నిలువేల్పుగానిల్పఁ దలఁచువాడు
నణిమాదిగుణమణిహారమ్ము లురమున
హారమ్ముగానిడఁ గోరువారు

వెలయమత్కృతిఁ జదువఁడుపిసఁడుప్రాయఁ
డీశ్వరాంబికాగుహు లిత్తురీప్సితములు
వారిమేమెయిఁ గొనియాడువారుకోర్కు
లొనర జంగమ మల్లికార్జునుఁడునొసఁగు" అనియు వ్రాసియున్నాఁడు.

దీనికంటెను మనోహరమైనకావ్యము పెద్దనప్రద్యుమ్న చరిత్రము, చిమ్మపూఁడి యమరేశ్వరుని విక్రమసేనము నాచనసోముని కవిత కీడురాదు. పెమ్మన యనిరుద్ధచరిత్రము భావ గాంభీర్యము పదపుష్టియుఁగలదై యతి రమ్యముగానున్నది. ఈ మూఁటిలో భాగములు మాత్రమే లభించినందున నాంధ్రభాషాభిమాను లెవ్వరేని నాకుఁదత్కావ్యములు పంపిన వాని ముద్రించి మాసిపోవుచున్న తత్కవుల కీర్తిచంద్రిక లుల్లసిల్లునట్లు చేసెదను.

ఈ గ్రంథమును సంపాదించి ప్రచురించుటకై నా చేసిన దేహధన వ్యయములును మిక్కిలియయ్యె. గార్యాంతర ప్రసక్తుండ నగు నాకు నవకాశము లేమింజేసి గ్రంథశోధనము చక్కఁగాఁజేయక కొన్నిప్రమాదములు విడిచితిని. ప్రాచీనపదములలోఁ గూడ నెక్కువ జ్ఞానములేమిచేఁ కొన్నియెడలు సందిగ్ధములుగా నుండును. పాండిత్యము చాలక యిట్టిపనికిఁ బూనినందునకు నన్ను నిందింపక నాసదుద్దేశమును మాత్రమే గ్రహించి నాయందు మిత్రభావము ప్రకటింతురని యీకృతిఁజదువు వారినెల్లరను మిక్కిలి విధేయతతోఁ బ్రార్థించుచున్నాఁడను.

వనపర్తి—
డిసంబరు ౨౮ తేదీ-౧౯౦౮ } మా-రామకృష్ణకవి.

# ప్రథమభాగము—అనుబంధము

ఇందులో సంఖ్య గ్రంథమునందలి పద్య సంఖ్యను దెలుపును.

9. ఇందుఁబ్రాసమున దీర్ఘముమీఁది యరసున్న నెఱసున్నగా వాడఁబడినది. ఈ విషయమై పీఠికలోఁ జూడుఁడు. విష్ణువు మహేశ్వరుని వామాంగమునందు జనించెనని చోడఁడన్నను మఱియొక కవి దక్షిణాంగమని చెప్పుచున్నాఁడు. 'బంట్లున్న పాలెంబ బలువిల్లుగాఁజేసి నవమణివలయంబు నారిఁజేసి । నుదుటినెన్నడిమి కన్నును ముల్కిగాఁ జేసి దక్షిణాంగంబ యస్త్రమ్ముజేసి' అని పేరయ మల్లికార్జున శతకము. బొడ్డపాటి కొండయ తన కాళహస్తి శతకములో వామాంగమనియే చెప్పెను. 'ఊర్పులశ్వంబులై యొప్పారుచుండంగ దొరయుపల్లైరమ సూతుండుగాఁగ । సవ్యాంగమతిఘోర సాయకంబడ్డిగాఁగ సౌరిదిఁగుంతలము మైజోడుగాఁగ' 6. అనయము = మిక్కిలి 9. స్థాణువు = మొఱడు. అపర్ణా = ఆకులులేనిది. విశాఖ = కొమ్మలులేని 11. ఎలయు = ప్రసన్నమగు. 12. సద్యము = అప్పుడ. 'సద్యంబ బ్రహ్మహత్యావద్యము' భార-స్వ. 17. వాల్మీకుని — 'వాల్మీకిశ్చాపి వాల్మీకోవలటావరటాతథా' ద్విరూపకోశము. 22. మహాకవిబాణుని కరములు తునుమంబడి శివప్రసాదముచేఁ గ్రమ్మఱలభించినట్లు కవిస్తోత్రముల వలనఁ దెలియుచున్నదిగాని యెంతవఱకు నిజమో తెలియదు. బాణాసురుని విషయముగా నప్రస్తుతశ్లేషమున గ్రహించినచో సరసముగానుండును. 'గద్యంబు చెప్పి శంకరునిచేఁ గరములు ప్రతిభతోఁబడిసిన బాణుఁదలఁచి । హరునివినుతులచే బాసలాడఁజేసినట్టి భట్టుని నన్నయ భట్టుఁ బొగడి' అమరేశ్వరుని విక్రమసేనము.

21. ఉచ్ఛ్రటుడు కుమారసంభవము, కావ్యాలంకార సారసంగ్రహము, హరలీలయుఁజెప్పినవాఁడు. కాశ్మీరజయాపీడుని సంస్థానమున నుండినవాడు. 35. ప్రాణములు = దశప్రాణములు. 36. మేలిల్లు = శ్రేష్ఠమగుచున్న (ధాతుపదము) 38. గ్రుడ్డివాఁడు లావుకపక్షినిఁ ద్రొక్కినట్లు = ఘుణాక్షర న్యాయముగ. పోల్చిచూడుఁడు 'జీయెనె బల్లవర్ నెఱయె సత్కృతివేళదెవేళ్ ఘుణాక్షర । ప్రాయదెశబ్దమొందెరడు మత్తెవిచారిసినోడె కాకతాళీయదె వాక్యమొందె

రడు కూడె నిషక్తిపా వంథలావృక। న్యాయదె భావ మొందెరడుతేసెనె వేల్పుబదిర్పు దొప్పమే' చంద్రప్రభ పురాణం-౩-౧-౪౮. 40. పొల్చి చూపుఁడు. 'పదలాలిత్యము వర్ణసిద్ధియును స్పష్టైక్యమున్ మంగళా। స్పద భావంబును రాజ యోగ్యతయు దోషస్ఫూర్తి రాహిత్యమున్। సదలంకార విశేషముం గలిగి విస్ఫారాణ సౌభాగ్యసం। పదమొప్పం జేయఁబోలి కాల పటదా పదంబు హృద్య స్థితిన్' అని కావ్యాలోక ము

72. మైకొన్న = ఇష్టపడినయెడల. 74. జీవితేశ్వరుఁడు = యముఁడు. ఆపోవక = తనివిలేక. 82. ఉలివి = మ్రోఁత. ఆలించి విని = ఆదరించి విని.
'కమ్మమధురోక్తు లాలించి యెన్నఁడు వినుల విన సంభవించునొకో' ఉద-ఆ-౧-౧౨౧). 89. పెల్చన్ = తెల్లనగునట్లు. 90. సోలంబునన్ = మత్తుతో. 92. పులుపులు = పత్తులు. 94. ముసుమిడి = వరుసగా. 95. సావి = యని. 98. కడిపోవ = చెడ్డవాసన పోవునట్లు. కాతరిల్లి = ఉత్సహించి. 'బగె సంభోగసుఖక్కె కాతరిసి కణ్గళ్ కీరి సర్వాంగమం తెగ దాలింగిసె' పంపరామా-౯-౨౪౬. 102 కన్నెఱింగి = జాడదెలిసి. 105 ఒకమెయి = కామరూపశక్తి లేని యొక దేహముతో. 126 గో = కిరణములు. 160 కన గోల = కళ. కోల = బాణము. గరి = ఈక. (విష్ణువు బాణమై యగ్ని బాణాగ్రముగాఁ త్రిపురవిజయమునఁ బరిణమించినందునకు, 'వింటి క్రిందటికొమ్ము వెకలించి పెఱికిన భూకాంతకును నాభి పొలుపు మిగిలె। నమ్ము పుచ్చుకొనిన నమితతరంగముల్ పాలసంద్రంబునఁ బ్రజ్వరిల్లె। బండుకండులు రెండు పంక్తి గిలించినఁ గలువలుఁ దామరల్ సెలిమిసేసె। వాజులఁ గొనివచ్చి వరరథంబునఁ బూన్పఁ జిచ్చుకు నాకలిచిచ్చు పుట్టె। నారి సంధింపఁ గశ్యపనారి వడఁకెఁ। గోల సంధింప లచ్చికి గోలవుట్టె। విల్లు దెగఁబాపెఁ బురములు ద్రెళ్ళనేసి। తరిదివిలుకాఁడ వౌదువ శరభలింగ' అని పాలపర్తి సోమేశ్వరుఁడు 'నుదుటి నెన్నడిమికన్నును ముల్కిగాఁ జేసి దక్షిణాంగంబ యస్త్రముగఁ జేసి.' 'గరితోడఁ గూడ నాకనవు నూటికి లాగు నెమ్మేనఁ బద నిచ్చునమ్ము దొడిగి' పేరయమల్లికార్జున శతకములోని భిన్నపద్య పాపములు.

163 అన్నిన = మదించిన. 164 పరవిడి = వాచాటుఁడు. తొఱకి = దిగి. తుత్తుఱుగొని = గొంతు కట్టుకొని. 188 ఎత్తు = దండెత్తు. 189 విగు

ర్పించి = భయము చూపి. 'వారిధిమేరెసప్పి కపివంతు పిగుర్పిసిదఙ దశాననం' పంపరామా-౯-౧౭౬. 194 తంము = అపశ్శకము. 198 చీకటి—-అర సున్న లేకుంపుటకు 'నీకరంబులు ద్రోపక చీకటియును' భార-అనుశా-ఆ-౪. 'నా కూతుఁబోఁటిగు వినుము నృపా కటవిట...నాతం। దేకతము—-।చీకటి నొకనాఁడు దెచ్చి చెచ్చెర నిచ్చెన్' దశ-ఆ-౬-౯౯. 207 తేవాఁగు = ఉడుము.

210 కవి = ఆక్రమణము. 212 పంచల = పుట్టె 'పందలెయోళి దోర ణద సీయదరం పొసధూమ ధూపకూపందలె' అర్థ నేమిపురాణము, 'సత్తిగెగగ్గ రంకరుళ బక్కళె మంటద కణ్గళెసరం। సుత్తిద వాసదుళ్కి వియసూంటగె పంద లెయొందు' గుణవర్మని శూద్రకము. యెత్తిరి = వేఱుపఱచిరి. 219 కావ డించి = క్రొవ్వుఱునట్టు. 221 కడిసన్న = వాసపోయిన. 229 కానుపు = కానుగు.

234. చరులు = చప్పటలు. గెత్తుచు = ఊఁగుచు. 235. అపూర్వ పదములకుఁ బ్రయోగంబులు మృగ్యంబులు. 247 శివహిమవంతులకు శ్లేష. 251 కీడు = తక్కువ. 253 వట్టొడి = ప్రవాహము. 259 వుఱరు = లక్ష్యము సేయరు. 'ఉఱడు సురేంద్రునైన.' భార. ఆది. రేయెండ = బాలాతపము. 'కటి పచ్చపట్టు దిగ్దంతి కుంభస్థలి చూపట్టు రేయెండ జోడు జోడు' ఉ-హరి-ఆ-౪. 268 తార = వెండి. 281 అంకమాలిక = నామాంకితస్తుతులు. "ఇనియనమేలె మెల్లనమలంగి మనంగొళె ఘంగియిందె సం। జనితవికార మొప్పె నిజసౌష్టవమొందిరె బీగి పీవర। స్తనయుగమధ్యదొళ్ కరమొడంబడె జీవెయనుణ్బు భంగిమే। లెనిసె వధూటి పాడిమెఱవళ్ నయవిం ప్రియనంక మాలెయం" కవికాముని శృంగార రత్నాకరం. ఆ. ౧ ౪౨. పత్రచ్ఛేదము = కలావిశేషము. 283 మలఁపగ = పుష్పింప. 297 రాజశేఖరుని పూర్ణచాటువు = "కర్ణాటీ దశనాంకితః స్మితమహారాష్ట్రీ కటాక్షాహతః ప్రౌఢాంధ్రీ స్తనపీడితః ప్రణయినీ భ్రూభంగవిత్రాసితః లాటీ బాహువివేష్టితశ్చ మలయస్త్రీతర్జనీతర్జితః సోయం సంప్రతి రాజశేఖరకవిర్వారాణసీం వాంఛతి". 305. తొప్ప = ఎఱ్ఱనైన. "తొప్పవాతెఱ" పీఠి. ౨౦౩. 315. తిరులు = వెఱ్ఱి. 319. సురంగము = ఒప్పిదము. 320 ముంచితెచ్చి = అంతయుఁదెచ్చి. "ఇందుకరావళి ముంచి తెచ్చి" కేయూ-ఆ-౪. ౩౪. 345. పరుపు = దాస్యపు. 351 పసిగొని =

ఆఁకలిగొని. పిఁగిలింపకుండ = జేపలు పిప్పుకుండ. ఎరలి = ఆలింగనోష్ఠ భావమును బొందు. 359 ఆపయము = మిక్కిలి. 361 అబ్బిగించు = ఓర్చు. 371 వలువఱు = నిరంకుశుఁ డగు. అబ్జుఁడు = చంద్రుఁడు. మొగపెట్టు = ఎదిరించు 372 ఓఁగులవాఁడు = యుద్ధమునఁ బాఱువానికి శిక్షయిచ్చి తక్కిన వారి నెదుటఁగొంపోయి భంగము చూపుట. 373 అర్ప్రె = జిల్లెడు. 374. వెలిలోఁపు = అంతర్బహిస్సులు = న్యాయాన్యాయములు. 375 ఈపవిడుచు = కాపాడక విడుచు. 379 బండఁగి = దీపము. త్రోచి = అవ్వలిఁ దఱిమి. 381 ఒరయుగడ = Competition. 382 దీర్ఘనిద్ర = చావు. 383 ఆర = అంగారకుఁడు. మంద = శని. 384 అనిమిష = చేఁపలు. భీమ ఆరుతము. కనక = ఉమ్మెత్త. శివ = నక్క. 386 శుక్లశోణితముల రెంటికిని వీర్య మనఁజను. 392. విరలి = విరాళి. 394 అప్సరస = అకారాంతము గూడఁ గలదు. 396 ఎచ్చి = పొగడి. 398 తిరులు = వెఱ్ఱి. 399 వేల = దాస్యము. కలుచు = ప్రేమించు. 400 అగ్గలము = మించినవారు. 401 తన్ను = నన్ను. ఇట్టిప్రయోగములు ప్రాచీనకవులలోఁ గలవు. "ఒలసి మాముందఱ నొక పైఁడి మృగము। వొలయుటయును జూచి భూనాథుఁజూచి దాని నేగతినైనఁ దనకుఁ దెమ్మనినఁ బూని రాముఁడువోయె...నార్తరవంబు శూలమై నాచెవిఁ జొచ్చి నాటుటయు" రంగ-ఆరణ్య. "చెప్పకున్న నీవు జీవంబు విడుతువు చెప్పినపుడు తనకు జీవహాని। చెప్పి మున్న నీకు జీవంబు విడిచెద। నీవు చన్నపిదప నిలువ లేను", "అక్కన్యఁదెచ్చి। పెండ్లిసేయుము తన్ను నభీష్టమిదియ। యనిన నగుఁగాక యనుచు ధరాధిపుండు" కవిభల్లటుని భేతాళపంచవింశతి.

411 వార్చుచు = ఎదురు సూచుచు. 414. కుసురుకొను = అస్ఫుట వాక్కు లాడుచు. 415 కండవడము = తెఱ. "కండవడం తెరసీరెనీర్జలం" కబ్బిగరకైపిడి. "తళిర్గళకండవడంగళ। తళిర్గళపాసుగళె తళిర్గళోవరిగళెకెం దళిర్గళె ళసిపెళవిజిల్గళె। విలాసనుంమె ఱెద రల్లికెల రబలెయరొళ్" ఆది పురాణం. ఆ-౧౧. ౭౯. కరువటిల్లు = వడఁకు. 416 ఉదరిపడి = ఉలికిపడి. తెంక = సందేహము. నోటికండ = భయము. 418 పూనికాఁడు = ఉద్యోగి. పోఁటరిమూఁట = పొడుచుటలో నేర్పరి. ఎల్లిదుండు = హేళితుండు, 426 బూటగొంగ = విటుఁడు. 432 అలఁతి = మితి = శక్తి. 436 కొసరు = మఱి మఱిఁ బ్రార్థించు.

443 ఆరము = ఆరామము. జెలరేఁగి యేయుమనోజున్కు చెఱకువిల్ రెండుగా విఱిచివైతు। పలువరై పలుకుచిల్కల నాలుకలముల్లువిఱిచి యారములలో వెదలనడుతు। పదపున మ్రోయుతుమ్మెదలఁ జంపకలతాంత ములలో మునుఁగంగఁ దఱిమివైతుఁ దగులమై వీతెంచు దక్షిణాశాగంధవహు మహాహీంద్రునివాతఁ ద్రోతు। నేవె కులికెడు నాయట్టిబోటి కలుగ। వెలఁది నీమదిలోవల వెఱవకుండు। మమ్మ ధైర్యంబు వదలకు మమ్మ యెందుఁ। గత్తలము గల్గమేనికిఁ గలదె బాధ' విక్రమసేనము, ఆ-౨. 445 తీగశబ్దమున నరసున్నలేదు. 'తీగ యుయ్యెలలెక్కి...దాగు...పు। న్నాగ...భోగ' భార-ఆది. (ఇందుడాగు = ఎగురు) ఓయలపాటలు = పుష్పాపచయగీతములు. 453 గౌనవరి = (

455 పోల్చి చూడుఁడు:- "అలితతి నీలముల్ ముచురుటాకులు పచ్చలు లేఁజిగుళ్ళు కెం। పులు దళరాజి వజ్రమయముల్ కళికావళు లాఁడిము త్తియం బులుగఁ బొసంగు చంగజునిబొక్కస మెల్లను నాత్మలోననిం। పులుపొచలించె రాజునకుఁ బూచిబెడంగగు పొన్నలున్నతిన్." సూరనయుపయనోదయము-ఆ-౧-౧౩౪. 457 వలఁకు = తెల్లబాఱు. 465 సర్వతః ప్రాససీసము. 469 నంచు = సగము కొఱికి చప్పరించెడు. 471 అలికి = చల్లి. 482 తరమైన = అనుకూల మగు. ఈఁగరులోడు = కొట్టుకొను. 493 గడికి = మఱుఁగునకు. 502 కాపువచ్చు = ఏలుటకు వచ్చునట్లు. "భీషణరుచుల్ జాజ్వల్యమానంబుగా। జ్యోతిర్లోకము గాఁపువచ్చెనాకొనాశోభిల్లు" కుమా. ఆ-౧౦. "వారిధిశయనుఁ జేయారఁబూజింపని ఖలుఁగట్టి పెడకేలుగట్టి తెందు। హరిమందిరమున కధీశుఁడై నడవని హీనాత్ముఁ గాల్పట్టి యీడ్చి తెందు। పలవపు భయంబు వా రెంత వారలైన। నట్టివారలు మన కగ్గ మైనవారు। వారు నిరయంబునకుఁ గాఁపువచ్చు వార। లనుచు బుద్ధిగఁ జెప్పె మార్తాండసుతుఁడు" మలయమారుతమునింగన్న కవులక్షము. 508 పక్కుగొన = పూరేకులు మొనలు ముడుచుకొనునట్లు. "పక్కు వాసినపూవు పదువతోఁ జెరలాడి యిలకుఁ బూఁబానుపు లలవరించు" ప్రద్యుచ . ఆ-౧. 509 తలకన్ = నీరుచెదరిపడు. 513 నానావిధదృష్టులకు లక్షణము చూడుఁడు భారతీయము. అష్టమాధ్యాయము, దృష్టివిశేషములకును 'పర్వి' మొదలగు క్రియా పదములకును గ్రహాలంకారము. 515 పోల్చి చూడుఁడు. 'బొమలెక్కించిన విల్లుపంచు నునుఁజూపుల్ చంచలాచంచలక్రమ

రేఖ న్నిగిడింప శాతనిశితఘోషంబుల్ మెఱుప్పించు నెయ్యమునన్ బల్కఁగ నల్కమీఱి చటులజ్యాఘోషము జేయు నయ్యామ ప్రాపొంది రతీశ్వరుండు హరు బిట్టోడింప నుట్టాడుచున్, పాంచు. ఆ-౧. 517 పేర్చిందులు = చెమట బిందువులు. 520 ఒత్తలించు = సమీపింపఁజూచు, 'గజయాన మెలఁగిన గతి యైనఁ బైఁబడ గద్దించి తర్కించి కలఁకనొందు। మానిని యల్గిన మాడ్కిఁ దోఁచిన దేర్ప నూకించి భావించి యొత్తలించుఁ। జపలాక్షినెమ్మోవి చవిగొన్న యట్లైనఁ జెమరించి చర్చించి చిన్నఁబోవు। మదవతికౌఁగిలి గదిసినయట్లైనఁ బులకించి తేఱి సంచలతనొందుఁ। దన్ను మెఱసినకోర్కులు తగులుగొలుపు। నోలిఁ దనలోన నలినరపాలసుతుఁడు। మానమూటాడ గంభీరమహిమ సడల। లజ్జ గడివోవ ధైర్యంబు లావుదిగఁగ" ప్రద్యుమ్నచరిత్ర-ఆ-౪. "విరుల నూఁకించు చన్గవవిరులయందు। పఱలు రేకులకాంతికి వన్నెవెట్టి। రమణరమణీ జనానురాగములతోడ నిగిడి యెఱసంజ పడమట నివ్వటిల్లె" పెమ్మన-అనిరుద్ధ చరిత్రము-ఆ-౨-సీసమునెత్తుగీతి. 524 కాయ్వు = స్థాయిభావరసాతిరేకము 526 ఇంద్రుఁడుచు మన్మథుఁడును నల్లనివారు. "రామచంద్రుఁడు నల్పు సామజం బదినల్పు రతివల్లభుఁడు నల్పు రాత్రినల్పు" చాటువు. 540 ఎడ = అవకాశము. 542 ఒరయ = పరీక్షింప. 544 కాడుపఱచి = అడవిపాలు చేసి. 549 వసవడు = ఎండిపోవు. పెరిగిన = తెగిన. 550 అడలడి = వ్యసనము. 552 విడుమర = వియోగము. 553. వినుకలిబేటంబు = శ్రవణానురాగము. 556 తప్పఁజూచుడో = దయమాలి చూచుటయో. 561 మేలిల్లు = శ్లేష్మగుచున్న (క్రియాపదము). 562 సంబెరము = పరులభావవికృతులకు మనస్సునఁ గారుణ్యముకలిగి తుల్యానుభావము నెందుట. 565వావిరి = పనవి. బిందము = భేదశబ్దతద్భవము. 568 ఊర్మడించు = నిట్టూర్పు విడుచు. 569 నలవలేదు = నలవఁజాలనియంత సౌకుమార్యము గలది. 571 అగ్గడి = సిగ్గులేని. 572 చిక్కనిడెందము = గట్టిమనసు. అరుగడ = పోవుట. 576 పోలదు = ఒప్పదు. 580 పొరిమాల = రూపు నశించునట్లు. 583 ఎచ్చిటి = తెప్పిటి. 584 దృష్టి మరణములను నవస్థలు పక్కఁదక్కినదశావస్థలింటలోఁ గ్రమముగా వర్ణింపఁబడినవి. 583 ఉచ్చరించు = ఎత్తివేసెడు. పరవాహులు = ధారాగృహములో యంత్రముఖమునఁ జాఱుచున్న ధారలు. 589 భావజహరుల పరస్పర విరోధమునకుఁ దగిన సాత్త్వికవికారములు వర్ణింపఁబడియె. 591 అబ్బగింపక = ఓర్వలేక. 594 కొమరు = శిరోభూషణము. 597 ఋతుర్వాగతము = చిత్రశాస్త్రమున

రేఖలు వ్రాయు పంచమార్గములలో నొకటి-తక్కినవి:— అర్ధఋజువు, సాచి, ద్వర్ధాక్షి, పార్శ్వాగతము. ‹ చిత్రపటరూపములు మనలఁ జూచుదృష్టిభేదములఁ జూపురేఖలే యాయైదును. పోల్చిచూడుఁడు "కిళి ఋజ్వాగతదింద మర్ధఋజు విందం కోకిలం సాచియిం। కలహంసికలభం రథాంగమిథునం ద్వర్ధాక్షియిం బర్హిమం। దలి పార్శ్వాగతదిం దదేంపడెదవో. పంచాంతకవ్య క్తికి। జ్ఞొశె కంద ర్పనబాణపంచకదవోల్ చిత్తక్కైతిశోభమం" అని మల్లినాథపురాణములోని చిత్రపటవర్ణనము. ‹ పత్రక, బిందుక, నిమ్నోన్నత, మాన, నీలక, భ్రామా వర్తక, ఉద్వర్తన, చిత్రప్రవర్తనము లను నెనిమిదియు క్రమముగా నకల, స్వస్తిక, సర్వతోభద్ర, కళిక, కంటిక, త్రిభంగ, శిశునిరీక్షణ, వర్ధమానములను నెనిమిది విధములగు చిత్రరూపములకు లేఖనమార్గములు. వన్నువ = వర్ణము. కంబెఱ = గవిసిన, కప్పుపావడ. 600 మెయి = రీతి. చలిమిరి = శైత్యము. గిర్మాడు = అపహరించు. 601. అగుడు = అగుట. కలపికొని = చేర్చి కొని. "బాలచంద్రికం గలపికొని తక్కటెవెలుల్ పంచించి" దశ. ఆ ౩. 605 కవ్విపల్కు = మఱుఁగుసేయు. బయల్పడ = స్పష్టముగునట్లు. 606 వలరసము = అనురాగము. కుక్కిఢమ = తొలుకునట్లునింపుట. 611 లగ్గ బెగ్గిలి = "లగ్గ బెగ్గిలించు నగ్గలముగ". శ్వార-విరా-ఆ-౨. 613 అరుణ = కెంపు; సూర్యుఁడు. చేతరింప = పునరుజ్జీవనము గలుగ నమృతమున కిట్టి గుణము గలదుకదా. పలను = యుక్తిమార్గము. 616 తోవకాములు = కలువ కాఁడలు. 618 గంటులు = వేళ్ళు. మురుపు = గిల్లుము, కొలవేళులు = పట్టివేళ్ళు. "తత్తుణియ రావిలానకుసుమాస్త్రననీక్షిసె రామతాపమిం। తరుణమృణాళమం తెగెదు పూగొళదిం పొఱగిక్కిదంపటిం। కొరగిమృణాళనాళికెగెచందన దణ్కెగె తఱ్ఱుళిగ్గెత। ఇరగద నూసునీర్గె కొలవేర్ తొవలం గుటియాగె మాడుపర్" మల్లి. ఆ-౩. ౨౮. పడివెట్టు = నీరు పడియునట్లు పెట్టుము. 624 వాసించి = వాసనలు కూర్చి. "నీహారజలముల నిండారుకుండలు శిశిరగంధముల వాసించు వార్లు" దశ-ఆ౩-౧౨౪. వాటి = పోఁగొట్టి. ఎంమి = ఒత్తి. 627 పాటించి = మృదుత్వమున కనుకూలముగాఁగూర్చి: "పూవుసెజ్జలను లేఁబొఱలపిచోపులు వెరవుపాటించి గావించువారు" దశ-ఆ-౩. 623 చలిరు = శైత్యము. 634 వఱువెట్టు = మిక్కిలియెండి దాహము గలుగుట. కొలగొను = చంపు. వగల్లు = చింతలు, కోరికలు. 633 రేతల = రాత్రిప్రారంభమున. "కాలము తలఁజేరు" కేయూ. ఆ-౩. నక్షు = విసుగు. 641 కసి = తీట. విడిగొల్చు =

విప్పి. తని = చల్లని, అఱమి = గొంతురాపడి. ఎలనుగ్గు = సన్నపొడి. 662 ఇడుగడ = ఆపద. 670 దేహమును దవనపుఁబొరకుఁ బోల్చుటకు, "పరిణత ఫణిలతాపత్రంబు గదిసినచివురునాఁ జెక్కునఁ జేయిచేర్చి। దవనంబుపొరకలఁ గవిసినమంచునాఁ బలుచనిచెమట మైఁ గలసి మెఱయఁ। గలువరేకులు మౌక్తి కముల నీనెడిని నాఁ గన్నుల బాష్పాంబుకణము లురుల...యేకతం బున్నదాని రాజేంద్రతనయఁ గనిరి లతికాగృహంబులో వనజముఖులు" అమరేశ్వరువిక్రమ సేనము. నెలకన్ను = చంద్రదర్శనము. 672 ఆలవు = స్త్రీవి. 674 వేల = దాస్యము. సంబవులు = కప్పములు. గోలికొలిపి = వెట్టిఁజేసి. 676 వెందు = తమవశమునకుఁ దెచ్చుటకై భ్రమరములు మధ్యనుంచిపాడెడుపురుగు. 682 ఘోషావతి = పార్వతివీణకుఁ బేరు. 684 కూర్చుగుమ్మలు = ప్రియమైన చెలిమి కత్తెలు. 687 అలఁతికి = మితికి. పొదివెంచు = పురివిచ్చు. మరపించి = స్నేహముచే మరిగియుండునట్లుచేసి. అనఁగి = కలసి. అఱఁగ = పోవునట్లు. విడిచెదేని = విడిచినను విడుతువుగాక. 692 వేరువెల్లంకి = వేళ్ళుగడ్డలు. "వేరువెల్లఁకి గాయగూర పండనికోర కుదరాగ్నిగాడ్పుచే నుజ్జగించి" పాండు. ఆ-౨-౭౯. "అడవిలో వెల్వలనై వేరువెల్లంకి త్రవ్వి తాఁదినెడు భూదార వరుని" అనర్ఘ—ఆ. ౧. 694 పోల్చిచూడుఁడు:— ఉత్తరహరివంశము—ఆ-౨-౧౨౨వ పద్యము. 701కాఁద్రపూవులు = వనపుష్పవిశేషము.ఇది వర్షర్తువునఁ బుష్పించును."ముగిలిదిరేఱె కాదలలరేఱె" జగన్నాథవిజయము. 702అన్ని = మదించి. గౌఁడుగీతములు = కల్లు దింపెడివారి పాటలు. 704 గోలము = కుదురులు. గౌరుకొమ్ము = ఏనుఁగుకొమ్ముతోఁ జేసినవి. 704 మల్లికార్జునుఁడు-కృతిపతి శివున కభేదముగాఁజెప్పఁబడినది. 707 వెంచ = సరస్సు. "వికచ సరసీరుహం కోకకులవ్యాఖాని పూగ్గోళం తానిరెయుం బకనికరలులితకలుషోదక విడిళదొ ళంచె వెంచెయొళ్ వసియిక్కుమే" గుణవర్మ శూద్రకము. 709 వలి = గుంద్రపు 741. తొప్ప = ఎట్టనగు. (తొప్పవాతెఱయునుదొట్రుపాటు. నిర్వ—ఆ—౮.) 803 ఎయిద = సమీపింపఁజేయ. 803 అగ్నిసహియగు రస మష్టలోహ ములను వేధించును.

రసముశుద్ధిచేసి హేమవజ్రాదిసత్త్వ ద్రుతులలో రసజారణము సేసి ధూమవేధిశబ్దవేధియగు రసముగాఁజేసి సారణనియతితప్పక యేలోహములలో వేధించినను హేమమగును. ఈ యంశములకుఁ జూడుఁడు రసరత్నాకరము

వాదఖండము, రసార్ణవము, సంధానభైరవకల్పము, ఖండరాపాలికతంత్రము, రససారము, స్థిరరసమంజరి, కల్యాణకారకము మొదలగు రసశాస్త్రములు. 804 సారి = చక్రము. 806 అరగొను = సందేహించు. అలికిరి = చల్లిరి. 812 ఉప్పరి = ఉప్పుగా వండలివడి. 819 దెచ్చుడు = తెచ్చుట, నానోడి = చెప్పుటభయంపడి. కన్ను = జాడ. 821 కాన్కి = చూపు. కావుడు = అగుట. 825 పోలుపొంపు = సపురియుండునట్లు. 838 తొడువ = తొడిగింప. త్రేణి = మినమినలాడుట. ఈడవిడుచు = ఊరకవిడుచు. 844 ఈ పద్యార్థము కాళిదాసు కుమారసంభవములోనుండి గ్రహింపఁబడినది. 846 తగిలించి = ప్రేమింపజేసి. సొబగుఁడు = శుభగుఁడు. "సొబగులుసీమగలేపురు" భార-ఆర. 850 కుదురు = ఆలవాలము. నఱమ = వికటపు. 855 అష్టమూర్తులు శివునకుఁగలవు గదా. 856 తక్కనేలిన = తానేపాలించిన. అపవార్యుఁడు = వస్తురూపములేని వాఁడు, అవాచ్యుఁడు. 859 నో = నొచ్చునట్లు. 862 బీరగాఁడు = తేజోవంతుని. సెప్పుడు = చెప్పుట. 865 ఊఁపరలు = పరోక్షమున నిందించుటలు. 867 పాడి = ఒడ్డి. పోల్చిచూడుఁడు దశకుమారచరిత. ఆ-ఒ-౯ఒ. 868 పసిమి = సౌభాగ్యము. 869. అన్నింతియ-"అన్నిష్టసఖియూఁదియున్నదాని" భార-ఆది. పులి = పుల్లని. నగ్నము = దిగంబరత్వము. చెట్లపురులు = ఆశ్చర్యములపుట్ట. 870 కుడిముట్టు = భోజనపాత్ర. గుడిముడి = స్మశానము. వలువు = వస్త్రము. బడరుఁడు = దరిద్రుఁడు. 871 చెప్పు = చెప్పెడుమాట. 872 ఎడలించియు = పోఁగొట్టియు. 874 కొఱఁగఁడు = నీచుఁడు. ఓచెల్ల = బాపురె. కనుడు = కనుట. 890 కొఱడు = స్థాణువు. "బలుగొఱడు పోలెనెండకుఁ। జలికిని వానకును నోర్చి" పంచతంత్రి. 894 కావుడు = అగుట. 897. నోసిన = నొచ్చిన. నెఱవిడుపు = గ్రహణమోక్షము. 901. వినిమీలిత దృష్టికిని లోలదృష్టికిని భారతీయము చూడుఁడు. 903 కల్లడి = పొంగు 946. పోల్చిచూడుఁడు:— "ఆపురి సున్నతస్ఫటికహర్మ్య విభాపటలంబునింగిను। ద్దీపితమైనఁజూచి యిది దివ్యతరంగిణి యెత్తిపచ్చెఁదా। సీపయిత్రోవసంచు బయలీఁదుచుఁ గోయఁదలంతు రగ్రసం। స్థాపితహేమకుంభములు తామరలంచు వియచ్చరాంగనల్" పిసవీరునిశాకుంతలము-ఆ-౧.

943. "గండరించు" అసునది, "కండరించు" అని యుండవలయు. రాతిలో నాకారమేర్పఱచుట యని యర్థము. చూడుడు "శ్రీరాజాపర్తదిం కండర

సిద సతివోల్ కౌస్తుభం మేఘమూకాకారంవోల్" గుణవర్మశూద్రకము. ఆ-౧-౧.

961. గట్టివాలు = గంధపుష్పములు సేయు లేక యమ్మువాఁడు. గట్టివాలితి-స్త్రీలింగము. "ఎలిమిఁ మెచ్చిన గట్టివాలితియనఁ" యనియే యెఱ్ఱప్రెగ్గడ ప్రయోగించియుండును. కన్నడమున :—గట్టివాల్తి యనిసైరంధ్రికిఁ బేరు. "చందనగంధక్కం పదనేందీ పరపరిమళక్కె మెఱుగువ భృంగిబృంద మనుఱి సోవుత్తుం మందైసిమగుడ్చి గట్టివాల్తి యుఱెసగుం"॥ గిరిజాకల్యాణం ఆ-౨-౯౧. "పరిమళలోభదిం...... గట్టివాల్తియన్" మల్లినాథపురాణం ఆ-౧-౯౦. ఈ శబ్దవిషయమై సీతారామాచార్యులవారి యుత్పత్తియుఁ బ్రయోగమును సరియైనవికావు. ప్రాచీనకవి ప్రయోగసారస్యము తెలియకయే పెక్కులు గ్రంథములు ముద్రితములయినవి, ఇదిశోచనీయము.

79. ఆపోవక— "రూపుగ మెయిఁ గడిచినచో నాపోవక చాయఁ జూడనగుఁగంసనృపా" మంచిభట్టు అశ్వశాస్త్రము.

164 హరి తన నేత్రములతో శివపాదార్చనము సేసి శివుని మెప్పించి యతనిచే సుదర్శనంబు వడసెనని కొమ్మన శివలీలావిలాసము ౧౩-వ లీలలో నున్నది. జలంధరుఁడను రాక్షసుడు హరిని దవ్వనకుం జిమ్మి బ్రహ్మాదుల జయించి దేవతలకు వెఱగొంగయై శివుం దఱిసి యుద్ధమునకుఁ బిలుచుటయు సముద్రవేలావనంబున విహరించుచున్న శివుఁడు సముద్రవునీటిని వలయాకారంబుగాఁ గాలిపెనుప్రేలిపుటంబున లిఖించిన నందుండి సుదర్శనంబు కలిగినట్లు పై కృతిలో ౨వ ఆశ్వాసమున నున్నది.

202. అబ్బగింపక = ఓర్వజాలక. 252. కంపు = మంచివాసన. "సీ. ఆనక యమృతంబుఁ దానిట్టిదవియని జనుల కేర్పఱుపఁగాఁ జాలువారు। చూడక మన్మథు సుందరాకారంబు గరిమఁ జూపఁగఁ జాలుకడకవారు।వినకయ పరతత్త్వవిపులనినాదంబు వినిపింపఁ జాలెడువెరవువారు। నంటక మెఱపులయందంబు ప్రేఁగును గణుతింపఁ జాలుప్రఖ్యాతివారు। కంపుగొనకయ కల్పవృక్షములపుష్పసౌరభం బిట్టి దని చెప్పజాలువారు। నెంచుఁజూచిన ధాత్రిలో హృదయదృష్టిఁగవులుగాననిమర్మంబు గలదె జగతి." అని కేతనాదంబరి. 289. మేఘడంబరము = ఆతపత్రము. "సుత్తిద పెంచవాస వెళపెండిర లోలకటాక్షమాలెయం......మేఘడంబరద తణ్ణెళలోళ్" మల్లినాథపురాణము, ఆ-౫-౯౪.

259. నామరు = పాచిక. 313. ఉప్పయనము. "లలితసరోజసౌర భములంగలయం జనిచూచి యెందు మెచ్చొలయమి నా పురాంగనల యొప్పెడు వక్త్రసరోజ గంధముల్। పలుమఱుఁగ్రోల సౌధములపై కలివర్గము లేఁగు దాన నం। కలిత గజేంద్ర గండఫలకంబుల కుప్పయనంబు సేయుచున్." భట్టురాజు గౌరీకల్యాణము. 432—433. శివుఁడు శరభావతార మెత్తి మిక్కిలి తామస వృత్తితోఁ బ్రవర్తించుచున్న నరసింహునిఁజీరె నమకథయు బలి నోడించి తన విశ్వరూపంబు నుపసంహరింపక వీఁగుచున్న త్రివిక్రమదేవునినోర్చి యద్దేపుకం కాళంబు శివుఁడు ధరించినకథయు నిశ్శంకకొమ్మన శివలీలావిలాసమున క్రమ ముగా ౩౨-౩౪ వ లీలలలో వర్ణింపబడినవి.

473. అబ్జసూత్రగుణమనుటకు- "గానయముతమ్మినూల్ చెఱకుఁగోల ధనుర్లత" విక్రమసేనము. ఆ-౧

496. ఓజపిడి మదము పట్టిన యాడయేనుఁగు."కచభారం కొరల్గబలెయ కచకుచభర మసియనడుగె కచకుచజఘనో । పచయభరం తొడెగగ్గె విచతు రిందం మెట్టి తోర్వ్యోజెయపిడియం" రన్నని యజితపురాణం-ఆ-౨-౪౨. 502 కాపువచ్చు ననుటకు మఱియుం బ్రయోగములు. "దీనిలోపలఁగొన్ని దినము లూనిన నుష్ణకరుఁడైన నటు శీతకరుఁడు గాఁడె। దీని లోఁతెఱిఁగిన దా నంబురాశిలోఁగాదని జలశాయి కాపురాఁడె। దీని తియ్యనినీరు దివిజులు త్రావినఁ దమయమృతంబుఁ జేఁదనుచు ననరె" అని కేతనకాదంబరిలో నచ్ఛోద సరో వర్ణనము. మఱియు, "పల్లవపుష్ప సంపదలఁ బంచి వసంతుఁడు కాపురాకకై। యెల్లవనంబు సంకటము లేఁదఁగఁదా రొడికంబుమీఱ నట్లల్లన క్రోలిక్రోలి మలయా నిలుఁడందుఁ బురాణపత్రముల్। డుల్లఁగఁ జేసె నత్క్రియఁ బటుత్వము కాముఁడు విచ్చలింపఁగఁ." సోమయాజి విజయసేనము. 597 తిట్టంబు = చిత్రము వ్రాయమొదట నేర్పఱించుసీమ. "బరయ లెంప బట్టిగె పలగె యంతరిసి తిట్ట మిట్టు." ఆదిపురాణం-ఆ-౪-౬౩. 597. వన్నువ = వర్ణము వన్నువు-అని, "కెమ్మోవివన్నువూన్చి" అని మరల కవి ప్రయోగించెను. "కామితఫలము జక్కవలకు నొసఁగెడి సాంద్రపల్లవ పారిజాత మనఁగ। రంజిల్లఁ గెందామర లకు వన్నువవెట్ట నలువ గూర్చిన కెంపుఁగులిశమనఁగ" వన్నువునకు, "ధరణీజ గుల్మలతావితానము పల్లవములకుఁ గట్టెట్టువన్ను వొసఁగి" అని ప్రాచీన కవి ప్రయోగములు గలవు. 670. రేయెండ = బాలాతపమే యనుటకు, "రేయి

వెన్నెల నాఁటి రేయెండ యుదయింప బెదరు చకోరంపుఁబిల్లలనఁగ'' వినవీరుని శాకుంతలము. ''తాటుకకొండపైఁ గాయు రేయెండకుఁ జెలువైన పచ్చనివలువ ఘాని.'' కవిలోకబ్రహ్మ. 704. పటికంపుఁగుచుళ్ళు వెట్టి యేనుఁగుకొమ్ము రోకండ్లతో వెదురుబియ్యము దంచుటకు ''కుదురుగఁ జంగ సాఁచి చనుగుబ్బలు మాటుగఁబారుటాకువ। య్యెద పైదలంగ నెన్నుదు రొకింత చెమర్పఁగ మేచెబాలి (?) నే। ర్పు దొరలఁబాడి చందనపురోలున నేనుఁగుఁగొమ్ము రోఁకటఁ బ్రిది లెడు కొప్పుతో వెదురుబియ్యము గుప్పునిజ్ఞప్రియాంగనఁ'' అని రఘునాథరాయల వాల్మీకి చరిత్రము-ఆ-౨-౧౧౬.

760. పోల్చి చూడుము. ఆముక్తమాల్యద. ఆ-౪-౯౨. 790. ఈ పద్యమునకుఁబూర్వ మొక్కపద్యము నాప్రతులలో విడిచిపోయినట్లు తోఁచుచున్నది. ప్రబంధమణిభూషణములోఁ గుమారసంభవములోనుండి యేడాశ్వాసములలో ౪౦, ౨౬౭, ౨౮౩, ౪౪౭, ౭౭౪, ౭౯౧, ౭౯౨, ౭౯౬, ౯౩౩, ౯౬౩. ఈ పద్యము లుదాహరింపబడినవి; దీనిలోనివని యీ క్రిందివద్యము కూడ నీయఁబడినది. అది నా ప్రతులలో విడిచిపోయెనేమో. ''భూచరులంబరంబుననె పోవుట మేలన నంబరేచరుల్। భూచరవృత్తి మేలనఁగ భూచరఖేచరు లాజలప్రవేశి। శీచరణంబు మేలన జలేచరు లంబరమధ్యయానథా। త్రిచరణంబు మేలనగఁ దీవ్రని దాఘము పర్వె నుర్వరఁ'' ఇది 792 గా నుండవలయు. దీనిఁ గేతనకాదంబరి లోని క్రిందిపద్యముతోఁ బోల్చి చూడుఁడు.

సీ॥ కడువేఁడిపెల్లెండ పుడమి పేల్చినఁబొద్దు
లాకాశగతియ మేలని తలంప
వాత్యాభిహతి లగ్గ వాడి వియచ్చరు
లవనిపైఁ జనుట మేలని తలంప
వడవడగా నీరు లుడికిన జలచరుల్
వనచరవృత్తి మేలని తలంప
వనములఁ గార్చిచ్చు దనరిన వనచరు
లంబుసంచరణ మేలని తలంప
వాఁడియెండ గాసె పడిగొనె సురగాడ్పు
లెసఁగె వడయుగాలి నెగసి వీచె
దావదహన మడరె జీవుల కధిక సం
తాపకారి యగు నిదాఘవేళ. —కేతనకాదంబరి.

792. పోల్చిచూడు(డు "ఎత్తుగీతి. తలఁపఁదపవ మనము దరికొనుఁ జూచిన జెవ్వలెల్లఁ గమరి యొప్పు తఱుగు। నరులఁ బేరికొన్న నాలుక వొక్కు నిదాఘకాల తపన తాప మడరె." విజ 812. ఉప్పరిపెనము — "కలయంగ ధారుణీతల మగ్నితప్తమై యుప్పరిపెనమట్టు లుబ్బియుండుఁ। గుండపర్వతంబులు కొలిమిలోఁ గ్రాఁగినయినుపముద్దల క్రియ నెసఁగి యుండ" విజయసేనము 961. గట్టివాలు — మఱియొక ప్రయోగము :— "సీ. ఘనసారకస్తూరికా గంధముల నన్యగంధబంధంబులు గలపి కలపి। కుసుమితవల్లికాలసితవీధులఁ జొచ్చి గని సరోగృహములఁ మునిఁగి మునిఁగి। సమధికాహార్యాంగ సంగీతము లతోన కన్నెతీగల కాట కలపి కలపి। కుముదకుట్మలపుటకోరకంబులు దూటి యలిదంపతుల నిద్రఁదెలిపి తెలిపి। యనుదినమ్ము నప్పురాంతికమ్మున గట్టి। వాలువోలె విప్రవరుడు వోలె। నట్టు వోలెఁ దాను నచ్చినచెలివోలె। మలయు చుండు మందమారుతంబు."

పీఠికలో-౮-వ యాశ్వాసములోని చంద్రికావర్ణనము జక్కన గైకొన్నట్లు ఆ రెండు గ్రంథములలోని పద్యములు చూపితిని. తద్వర్ణనమునే కృష్ణవిలాసమున వేంకటకవి "సీ. ఆకాశనది యని యనిమిషాంగనలెల్ల వేడుకతో జలక్రీడ సలుపఁ బాలమున్నీరని పంకజనాభుండు ఫణిశయ్యఁ గావించి పవ్వళింపఁ। బాదరసంబని మోదించి సిద్ధులు మించి ఘటంబుల నించుకొనఁగ। నమృతంబుసోనని యఖిలా మరశ్రేణి చెలఁగి పానంబులు సేయుచుండ। వెల్లివిరియుచు నుబ్బుచు విశద కాంతిఁ బొదలుచును దివ్య మగుచును భూరిమహిమ। నఖిలజీవుల కానంద మతిశ యిల్ల। నచ్చవెన్నెల విమలమై పెచ్చు పెరిగె." చోళుని ౫ పాదములలో జక్కన యొక నాలుగును వేంకటకవి మఱియొక నాలుగును గ్రహించుట చోద్యము. పాదములును మార్పులేకున్నవి. పైకృష్ణవిలాసముననే, "నిజరూపరేఖల నెలఁతల వలపించుచాతురి గలభద్రజాతివిటులు। వలసినధనము లబ్బారిగా నొసఁగుచుఁ దరుణులఁ గరఁగించు దత్తవిటులు। మణిమంత్రములచేత నణుమధ్యలఁ గరంచు మగటిమిగల కూచిమారవిటులు। వలరాజుకళ లుండు నెలవులు భేదించి సతులఁ దేలించు పాంచాలవిటులు। వరుస నంచఱు తమజాతివారి వారిజాతవదనలఁగూడి సంజాత మదన। కదనకేళీవిహారసంపదలఁ బొదలి। మొదలుదురు వీట నధిక సమ్మదము లొదవ" అనుపద్యము, కుమారసంభవములోని ౮-వ ఆశ్వాసమున నుండు క్రింది పద్యములోనుండి గ్రహింపబడినది :— కమియని లేని శృంగా

రాదిచేష్టలఁ బచరించుచుండు నాభద్రునొల్ల! మృదురేఖ ననురక్తిఁ బొదలించి రసమెల్ల గావించికొనునొ పాంచాలు నొల్ల। ధనమెక్క నీగియ తగులుగా రతి బెట్టిదము సేయునట్టి దత్తకుని నొల్ల! మనసీక మందుల మాయల మరగించి కారించు నాకూచిమారునొల్ల! గలిచి తాల్మి గల్గఁగలిపించి బేటంబు నలువు నెదురుఁ దన్నుఁ గలిచెనేని! దానుఁ గలిచెనేని తగ నిచ్చు నయవిదుం డని మనోజ్ఞునొక్కవనిత గలిచె." కుమా. ఆ-౮.

ఈ కృష్ణవిలాసకర్త యగు వేంకటకవి, కవిస్తుతిలోఁ గవిత్రయమును వేములవాడ భీముని కేతన కవిరాక్షసుని శ్రీనాథసోమభాస్కర పుత్తేటి రామన పెద్దన తిమ్మన తెన్నాలి రామలింగుల స్తుతించి యుండినందున నిటీవలివాఁడని చెప్పనక్కఱలేదు. నన్నెచోడుని ౨౦౦ సంవత్సరముల కిటీవలివాఁడని చెప్ప సాహసింతురేమో. పైఁ జూపఁబడిన పోలికలన్నియుఁ దత్తత్కవులకు వేఱ వేఱ హృదయములలోఁదోఁచె ననియు నన్నెచోడుని కావ్యము వారు చూచిన వారు కారని మనస్సిద్ధాంతవేత్తలు చెప్పినచో నంగీకరింపవలయు.

# 2. కుమారసంభవము

## ద్వితీయ భాగము

ఇమ్మహాకావ్యమునకుఁ గర్త నన్నెచోడదేవుఁడు. అతఁడు కవిరాజ శిఖామణి యనియుఁ డెంకణాదిత్యుఁ డనియు బిరుదములు గలవాఁడు. నన్నియభట్టాదిశబ్దములలో ద్వితీయాక్షర మికార మగుటను గొన్నిశాసనములలో నన్నిచోడుఁ డని యుండుటచేతను నన్ని యని సత్యార్థకవాచక ముండుట చేతను నన్నిచోడుఁ డని చెప్ప నొప్పును. చోడశబ్దము కంబఁడు, తిక్కఁడు మొదలగుశబ్దములవలెఁ జోడఁ డనియుఁ, జోడు అనియు నిరుదెఱఁగుల వర్తించును. అయినను నా ప్రతులలో నన్నెచోడుఁ డని యున్నందున శబ్దరూప నిష్పత్తు లెట్లున్నను దానివర్ణక్రమము మార్చి వ్యవహరింప ధైర్యము చాలక యట్లె ప్రయోగించుచున్నాఁడను. ఇక్ష్వాకుకుల సూర్యవంశజక్షత్రియుడు; చోడ బల్లికిని శ్రీసతికిని బుత్రుఁడు. వివిధయజ్ఞములకుఁగర్త; జాతిపొన్నలు పూచు నట్టిదియు జాతికోడి గట్టిగాఁగూయునట్టిదియు నగునొరయూరికి నధిపతి. కావేరీ తీరమున నుండు నొరయూరిపురమునకుఁ గోఴి (కోడి)యనునామము కలుగుట ద్రవిడభాషాకృతులలో సుప్రసిద్ధము. ఆంధ్రచోడులు కారితకావేరీతీరకరికాల చోడవంశజు లగుటయు నొరయూరిపురవరాధీశ్వరు లగుటయుఁ జోడశాసన విఖ్యాతాంశములు. అయినను నన్నెచోడునివర్ణనము నించుకచక్కఁగానాలో చించినచో నతఁడొరయూరికే పరిపాలకుఁడనియుఁ గేవలము కులక్రమాగత బిరుదమును బేర్కొన్నవాఁడు గాఁడనియుఁదోచకమానదు. మననన్నెచోడుఁ డెక్కాలమున నుండెనో నిర్ణయింపఁ దగినయాధారములు సంపూర్ణముగా లభింపవయ్యె. లోకములోని మహాకవుల గతు లన్నియు నిట్లె సందిగ్ధమత భేదములపాలయ్యె. లోక మితని కవితాప్రభావ మిట్టిదని యెఱుంగఁగాఁబోలుఁ గాలము తనపట్టీయక మనల వంచించుచున్నది.

పురాతనశాసనములు పరిశోధింపఁగాఁ బెక్కండ్రు నన్నెచోడు లగపడు చున్నారు. వారిలోఁ గొందఱు చోడబల్లి యనురాజులకుఁ బుత్రులు. ఎందునఁ దల్లిపేరులు లేనందున మనసిద్ధాంతమునకు నప్రతిహతసందేహము లెక్కువ

యగుచున్నవి. ఒకనన్నెచోడుఁడు పాశ్చాత్యరాజులచే రణరంగమున క్రీ-శ-కాలం లో నిహతుఁడయ్యెను. దర్శిసీమలోని మన్నెపల్లిగ్రామములోఁ జోడపల్లి శాసనములలోఁ బొత్తపినన్నెచోడునకు వెంకభూపతియు నతనికిఁ గామరాజు నతనికి బల్లిభూపుఁడును జనించినట్లున్నది. దీనిలో నన్నెచోళునకుఁ దండ్రిపేరును బల్లిభూపునకుఁ గుమారనామములును మన కనుకూలముగా లిఖింపఁబడవయ్యె. క్రీ. శ. ౧౧౨౦ లో నుండిన భద్రభూపాలునకు నన్నెచోడనరేంద్రుఁడను బిరుదము గలిగియున్నట్టు నీతిశాస్త్రముక్తావళిలోఁ జెప్పఁబడినది. వీఁడెవ్వఁడో ప్రాచీనుఁడు; పెద్దచెఱకూరిలోని మల్లిదేవునిశాసనములోఁ జోడపల్లికుమారుఁడు నన్నిచోడుఁడు, అతనిపుత్రుఁడు సూరరాజు, వానిపుత్రుఁడు రాజరాజు, వాని మనుమఁడు మల్లిదేవుఁడు, వానిపుత్రుఁడు నన్నిచోడుడనియు నున్నది. ఇది గణపతిదేవునికాలములో లిఖింపఁబడినశాసనము. వీరలు గాక పెక్కండ్రు నన్నెచోడులు గలరు. ఇఁక బల్లయచోడులును బలువురుగలరు. క్రీ. శ. 1135 లో దాక్షారామశాసనములోఁ గన్న రాజేంద్రచోళునితమ్ముఁడు చోడబల్లి యొక్కఁడును, గొణిదెనశాసనములలో నిరువురును, గడల్పల్లెశాసనములో నొక్కఁడును గాక ప్రాచీనశాసనములలోఁ గృష్ణాతీరముననుండు బీచుపల్లి సమీపమున నుండుశాసనమునఁ జోడబల్లిదేవుఁడును, మఱియొక ప్రాచీన శాసనమున బల్లయచోడుఁడును బేర్కొనఁబడియున్నారు. వీరెల్లరును క్రీ. శ. 850 మొదలు 1210 లోఁగా నుండినవారు. వీరిలో నెవఁడు కుమారసంభవ కావ్యకర్తయో నిర్ధారణము సేయుట సులభసాధ్యము కాదు. దీనిలోనిపద్యము మొట్టమొదట **ను**దాహరించిన యథర్వణుని కాలనిర్ణయము సహితము సందిగ్ధమే.

కృతిపతి యెవ్వఁడో చూతము. అతఁడు జంగమమల్లికార్జునమహాముని యఁట. అతఁడు సాక్షాచ్ఛివావతారము. శ్రీచక్రపీఠమునఁ బాదము లిడినవాఁడు, కమలభవకుల తిలకుఁడు, అస్పృష్టరాగుఁడు, వినిర్జితాంగభవుండు, అణిమాది గుణగణాలంకారుఁడు, అమితాభవాగమవిశారదుఁడు, సన్మునీశ్వరాగ్రణి, సంకల్పసంభవబాణేంధనదావపావకుఁడు, పరవాదీంద్రఘనాఘనానిలుఁడు, హృజ్జన్మాస్త్రాగ్నిభిజ్ఞుఁడు, మారారి, అక్షజయుఁడు, అస్ఖలితుఁడు, ఇహాముత్ర భోగాద్యనిష్టుండు, కుంభజతత్త్వజ్ఞుఁడు, జన్మజరాదూరుఁడు, అసంగుఁడు, కృత్యాకృత్యవిరక్తుఁడు. ఇట్టిముని తప్పక బ్రహ్మచర్యానవస్థితుఁడు గాని

యింద్రియసుఖము లనుభవించి దౌర్బల్యదారిద్ర్యయత్యాశ్రమాదులవలన సంగసుఖమును పరిత్యజించి హృజ్జన్మాస్త్రోనభిజ్ఞుఁడు నస్పృష్టరాగుఁడను బిరుదములు వహించినవాఁడు కాఁడు. ప్రాచీనులలోఁ బ్రఖ్యాతు లగుమల్లికార్జునులు మూవురు గలరు. గృహస్థుఁడై పుత్రపౌత్రులనుగాంచి యనేకశిష్యకోటికద్భుతమహత్త్వములు చూపిన భృంగిరిటియవతారమగు పండితారాధ్యుఁ డొకఁడును, జతుర్దిక్కులకధిదేవతలగు శైవాచారగురుపరంపరలో యామ్యదిక్కులశాధిపులలో వానప్రస్థాశ్రమవర్తియగు యోగిమల్లికార్జునుఁ డను నతఁ డొకఁడు. ఇతఁడు చాలఁ బ్రాచీనగృహస్థుఁ డగుటచే మనకాలమునకుఁ దగిలి వచ్చువాఁడు కాఁడు. తపోరాశి శిష్యుఁ డై చోళరాజులచేఁ బూజితుఁడై కాలాముఖ మతస్థాపనమున కాదికారణ మనఁబడిన మల్లికార్జునమహాముని మూఁడవవాఁడు. కాలాముఖ మతాచార్యు లెల్లరు బ్రహ్మచారులు. ఈమతము ప్రారంభమున నెచ్చట నుండెనో కాని క్రీ. శ. 1050 లో నుండి వనవాసిదేశమున బలిగ్రామ మనుపురమున నెలకొన్నది. అందే బౌద్ధజైన మతములును బ్రఖ్యాతము లయ్యెఁ. పుదుకోట సంస్థానమున నుండుకొడుంబాలూరు (ఆంగ్లేయభాషా వర్ణక్రమహైన్యముచేత మోసపోయి స్థలాంతరమునఁ గదంబలూరని పేర్కొంటిని) గ్రామమున నుండుమూవర్కోవిలు శాసనములలో విక్రమకేసరి యను చోళరాజు తపోరాశి శిష్యుఁ డగు మల్లికార్జున మహాముని నత్యధికముగా సంభావించినట్లున్నది. విక్రమకేసరి పూర్వులు చాళుక్యపల్లవపాండ్యుల జయించినవారు. మల్లికార్జునుఁడు మధురాపురాగతుఁడు. అతనిపేర రాజు మఠమును గట్టించెను. కుంభఘోణపురమున మల్లికార్జునమఠమనుశైవశాక్తేయమఠమొకటి గలదు. కొడుంబాలూ రొరయూరు పురమునకుఁ గొంతసమీప భూమిలోనున్నది. ఈవిక్రమకేసరి వీరపాండ్యుని జయించియున్నందున, క్రీ. శ. పదియవ శతాబ్దపు బూర్వార్ధములో నుండెనని శాసనపరిశోధకుల సాంవత్సరిక ప్రకటనములో రాయబహద్దరు వెంకయ్యగారు లిఖించియున్నారు. కృష్ణాతీరమున బీచుపల్లి గ్రామశాసనములోఁ జోడబల్లిదేవుఁడు విజయయాత్రలోఁ గృష్ణాతటమున నుత్తరాయణ పుణ్యకాలమున విశ్వనాథదేవునకు క్రీ. శ. 902 లో భూదాన మిచ్చినట్లున్నది. చోడబల్లి పాకనాడిరువదియొక్క వేయిటి కధీశుఁడని కుమారసంభవమునఁ గలదు. బీచుపల్లికిఁ దూర్పున 50 మైళ్లదూరమునఁ దుంగాతటమున నలంపుర మను మహాక్షేత్రము కలదు. అందులో ననేక శాసనములలో సూర్యరాశి, తపోరాశి, తేజోరాశి, కాశిరాశి మొదలగులాకులకాలాముఖాచార్యులకుఁ బాశ్చాత్య చాళుక్యరాజులు బహు

విధ సమ్మానము లొనర్చినట్లున్నది. వారివిగ్రహములు సహితము మూలస్థాన ములో వారివారి పేరులతోఁ గలవు. ఈప్రదేశము శ్రీశైలమునకుఁ బశ్చిమద్వార మనఁబడును. మధుర సమీపములో మహాసిద్ధుడై ఖ్యాతివహించిన మంథాన భైర వుఁడను శివాగమాచార్యుఁడు కొంతకాలము శ్రీశైలములోను నలంపురములోను వసించి తత్ప్రదేశములలోని సిద్ధౌషధులఁ దనయానందకందములో వివరముగాఁ బేర్కొనియున్నాఁడు. అలంపురమున బ్రహ్మేశ్వరుఁడును యోగీశ్వరియు (జోగు ళాంబయు) ముఖ్యదేవతలు యోగీశ్వరి యష్టాదశ శాక్తేయ పీఠాధిదేవతలలో నొకతె. మంథాన భైరవ తంత్రమున శివాద్వైతశాక్తేయరసవాద రహస్యములు వివరముగాఁ గలవు. అలంపురమును విస్తారముగా సంభావించిన రాజులు చాళు క్యులు. రెండవకీర్తివర్మ రాజ్యభ్రష్టుఁడైనప్పుడు రాష్ట్రకూటులు మాన్యఖేట పురమున రాజ్యము చేయుచుండినను జాళుక్యరాజులు సామంతులై యుండిరి కాని యనామకులైరి కారు. అలంపుర శాసనములలో మూఁడిటిలో బలవర్మ యనురాజు ప్రఖ్యాతుఁడుగాఁ బేర్కొనఁబడెను. ధారావర్షుని రాజ్యకాలములో నున్నట్లు చెప్పఁబడియె. శ్రీశంకరపాదు లుపనిషద్వ్యాఖ్యలలో మూఁడుచోట్ల నొకబలవర్మను బేర్కొనెను. శంకర పాదులు శ్రీశైలప్రాంతములఁ గొంతకాల మున్నట్లు శంకరవిజయాదిగ్రంథములలో నున్నందున మహాశాక్తేయ పీఠమగు నలంపురమును దద్దేవీపూజాపరతంత్రుఁ డగుఁ బలవర్మను వారెఱిఁగి యుందు రేమో యనుసందేహము కలుగుచున్నది. ఈబలవర్మ చాళుక్యరాజు. బనవాసి దేశమునకుఁ బ్రభువు. చోళరాజులకు ద్వేషి. బళ్ళారిమండల శాసనమున నితని మునిమనుమఁడు తనపూర్వవంశమును వర్ణించుకొనుచు "శ్రీమచ్చాళుక్యవంశే సమజని నిహతా శేషశత్రుక్షితీశో న్యాయోపేత.......హ్యాషోడ్యద్దండికాయాం సమకృత బలవర్మోధిపః పట్టబంధం సంగ్రామైకరతః పరాక్రమధనః కాంచీప ముగ్రాహవే జిత్వా వీరగజేంద్ర దన్తయుగళం సంస్థాప్య నామాంకితం ఖ్యాతా లంపుర నామధేయనగర బ్రహ్మేశ్వర స్యాగ్రతః సోయం తస్య సుతో హ్యధాయి దశవర్మాఖ్యః ప్రచండోదయః ..,..." అని చెప్పె.

ఈ శాసనకాలము క్రీ. శ. 924. దీనినిబట్టి చూడఁగాఁ జాళుక్య చోళ రాజులకు యుద్ధములుసహజమని తెలియుచున్నది. రాష్ట్రకూటులక్రిందఁబెక్కండ్రు చాళుక్యులు గొప్ప సేనాపతులై యుండుట బహుశాసనములవలనఁదేలినయంశము. నాయభిప్రాయమున శాక్తేయరసవాద శైవాచార్యులెల్లరు మధుర, యానమలై,

అగస్త్యాశ్రమము, శ్రీశైలము, నాగార్జునకొండ మొదలగు ప్రదేశములలో నుండి తమసిద్ధాంతముల నెలకొల్పుచు దేశాటనము సేయుచు రసరసాయన శాస్త్రముల మహోన్నతికిఁదెచ్చిరి. ఈశాస్త్రములు శోధింపఁగానగస్త్యుఁడు,భోగర్,కొంకణర్, నట్టముని, మొదలగు ద్రవిడులు రసరసాయన శాస్త్రములఁ జూపినమార్గములు చరక, సుశ్రుత, వాగ్భట, శార్ఙ్గధరాది ప్రోక్తరసోపయోగ పద్ధతులకంటెఁ జాల భిన్నములైయున్నవి. శాంకరమతవ్యాపనమునకుఁ బూర్వము ద్రవిడదేశమున బౌద్ధజైనసంఘములఁ బ్రతిపక్షము వహించి పోరాడుచుండినది శైవమతము. దీనిలోఁ బెక్కు తెఱఁగు లుప్పతిల్లి కాపాలికమతముకంటె భిన్నమై రసవాద శక్తుల నమ్మి శివైక్యము పరమార్థ మనెడు శైవభేదముకలదు. దీని నగస్త్యుఁడు పన్నీరాయిరములో, భోగరు ఏ[illegible] యిరములో కొంకణరు మువ్వాయిరములోను రససిద్ధులగుటకు మార్గోపదేశము సేయుచు శివైక్యము పరమముగాఁ బ్రసాదించిరి. ఇట్టి సిద్ధులకాలములోఁ గేవలమర్థవాదులగు బౌద్ధజైనుల నోడింప శంకరు లద్వైతార్థమును వెల్లడించి మార్గాంతరమున వారికిఁ బరాభవము కల్పించి దేశము నందెల్ల షణ్మతస్థాపనము చేసిరి. అచక్రాంకమగు వైష్ణవము సురాపాన వర్జిత మగు శాక్తేయమును గూడ వారంగీకరించిరి. అంతఁ దత్కాలములోని శైవ మతములన్నియు నద్వైతము నాశ్రయించి ప్రబలుచునే యుండినవి. తరువాత మూఁడునూఱు సంవత్సరములకుఁ బిదప రామానుజమతము లోకవ్యాపక మయ్యెను. కేవలశైవము ద్రవిడదేశోద్భూత మనియు వైష్ణవమత ముత్తరము నుండి దక్షిణమును జయించుచు వచ్చిన యార్యులవలనఁ బుట్టెననియు నాయభిప్రాయము. ఇట్లద్వైతము జీవాతువై సాంఖ్యయోగవైశేషిక బ్రహ్మసూత్రముల కనుగుణమైన శైవమతాంతర్భేదములు నెలకొన్నకాలములో మల్లికార్జునుఁడు ప్రఖ్యాతుఁడయ్యెనని కుమారసంభవ కావ్యపఠనము వలనఁ దేలుచున్నది. వీర శైవము బసవేశ్వర పండితారాధ్యుల వలన నియమితమై లోకవ్యాపకమై నూతన స్వరూపమును బొంది సంఘములోఁ గొంతభాగము నాకర్షించుకొనెను. కాని యనాదిగ శైవమతము కాలము ననుసరించి భేదములు చెందుచుండెను. మొదల శైవము పాశుపతము, శైవసిద్ధాంతము, యోగశైవము, రసశైవము, ఆగమ శైవము, కాపాలికము, కాలాముఖము, లాకులము, నకులీశము, వీరశైవము మొదలుగ బహుభేదములఁ జెందెను. వీనిలో లాకులముననే నకులీశ మని విద్యారణ్యులు చెప్పిరి. పాశుపతము, కాపాలికము, రౌద్రము లని శైవాగమము లోనే చెప్పఁబడియె. "పత్యు రసామంజస్యాత్" అను సూత్రముక్రింద

శ్రీ రామానుజాచార్యులు "తన్మతానుసారిణ (పశుపతిమతస్య) శ్చతుర్విధాః కాపాలాః కాలాముఖాః పాశుపతాః శైవాశ్చ ఇతి, సర్వే చేతే వేదవిరుద్ధాం తత్త్వప్రక్రియాం. . .కల్పయంతి. . .తథా కాలాముఖా అపి కపాలపాత్రభోజన శవభస్మస్నాన తత్ప్రాశన లగుడధారణ సురాకుంభస్థాపన తదాధారదేవపూజాదిక మైహికాముష్మిక సకలఫలసాధనమభిదధతి" అని కాలాముఖులఁ గాపాలికులతో భేదముగాఁ జెప్పెను. కాని కాలాముఖులు వేదబాహ్యులు గారు. కాపాలకాలాముఖమతములు మొదట శ్రీశైలములోఁ బ్రబలె ననుటకు మాలతీమాధవమునఁ గపాలకుండలయుఁ దత్ప్రాంతములోనిదని భవభూతి వచించెను. కాలాముఖులకు మహావ్రతు లను నామము నాసికబల్లిగ్రామాలంపుర శాసనములలోఁ గలవు. మహావ్రతమని యాజ్ఞికులలోఁ బౌండరీకమునకు నామాంతరమైనను గాలాముఖ బ్రహ్మచర్య కాపాలిక వ్రతమునకు సంకేతనామము. కుమారసంభవమున నీశునివిషయమై "హరికంకాలము చేతిముద్ర దివిజేంద్రాస్థుల్ సుభూషావళుల్। గరళం బభ్యవహార మంతకతనుక్షారంబు మైపూఁత పం।కరుహాసీను శిరఃకపాల మురుభిక్షాపాత్రగా విశ్వసం। హరువర్తించు మహావ్రతోపహతి సేయంబూన నీప్రాప్తియే." ఇది రతిమన్మథునితోఁ బ్రసంగించిన వాక్యము. మారమద ప్రహారుఁడగు శివావతార మల్లికార్జుననకును జెల్లుట యాశ్చర్యము కాదు. సురాకుంభస్థాపనాదులకుఁ గుమారసంభవమున, "అందకొందఱు మధుపాన గోష్ఠికింజొచ్చి మండలార్చన దీర్చి ... సుగంధాసవంబులు...చషకంబుల నించి హర్షించి. మ. శివు గౌరీసహితంబు సన్మనములం జింతించి మైతెంచి భై।రవు యోగీంద్రులఁ గొల్చి యోగినుల వీరవ్రాతమున్ దన్పియా। నవనాథాదు లనాది సిద్ధులకు నానందించి విందిఁచ్చియా। నవపాత్రల్ సతులర్థి నెత్తుకొని యాస్వాదించి మోదించుచున్" మొదలుగ వర్ణింపఁబడియె. కాలాముఖులు యోగమార్గము నవలంబించి యష్టాంగములును గ్రమముగా ననుష్ఠింతురు.బల్లిగ్రామశాసనములోన "వరకాలాముఖచక్రవర్తిముని దివ్యజ్ఞాని"... "వామశక్తిదేవరతపః ప్రభావము మం నోడి యా మహానుభావరయమనియమ స్వాధ్యాయధ్యానధారణ మౌనానుష్ఠాన జపసమాధి శీలసంపన్నరుం యష్టాంగయోగనిష్ఠాప్రతిష్ఠితనైష్ఠికచ్ఛాత్ర సంఛన్నరుం . . కవిగమకివాదివాగ్మిప్రముఖవివిధ విద్వజ్జనానందకారణ జంగమ కల్పభూజరుం వేదాంతసిద్ధాంతాగమషట్తర్కసకలవ్యాకరణ నిర్మలశాస్త్రాద్యనేక శాస్త్రార్థ నిర్ణయనిర్ణిక్తరుం.. శ్లో॥ యః పర్వతావళివిలాసితపుణ్యకీర్తికాంతాసఖోఽపి బుధవృందసుతాన్వితోఽపి నీతిప్రియోఽపి యతి రిత్యభిధీయమానః శ్రీగౌతమో

ముని రభూ ద్భుపనే విచిత్రం'' అని యొకానొక కాలాముఖాచార్యుని వర్ణనము గలదు. ఈ లక్షణములు కృతిపతియగు మల్లికార్జునకును గలవు. శివునితపస్సు వర్ణించునప్పుడు "పద్మాసనస్థుఁడై భావించి శోషణదాహనప్లావనతర్పణములు దేహోదయాత్మప్రతిష్ఠలు విధియించి యాగమరీతి బ్రహ్మాంగవర్ణ విన్యాసములు దీర్చి విమలాత్మదీపంబు ప్రణవసంపుటముగాఁ బ్రజ్వలించి వడి బాహ్యవర్తనల్ విడిచి ప్రత్యాహారగతి మనస్సంతర్ముఖమ్ముగ సేసి తన్నుఁ దానె కాంచి తన యందుఁ జేతోలయంబు సేసి నిశ్చలాత్మయోగ మయసుఖామృతాబ్ధిమగ్నుఁడై వరదుండు నిరతిశయసమాధినిష్ఠ నుండె" అని యోగమార్గధ్యానము వర్ణింపఁ బడియె. ఇందు నుదయ మనఁ బ్రాణము, బ్రహ్మాంగవర్ణములు శైవాగమమున సుప్రసిద్ధము. మూలబీజాక్షరములలో శివాంగము, బ్రహ్మాంగము, విద్యాంగము లని మూఁడుభాగములు. "బ్రహ్మాంగంచ తతః క్రమః ప్రథమా త్పంచబీజాని బ్రహ్మణీత్యుదితానివై'' అని తల్లక్షణము. పార్వతియు ''ఘోరతపంబు సేయఁ దొడంగి... నిరాహారాది మహాతపోవ్రతంబుల...ప్రాణాయామ ప్రత్యాహారధ్యాన ధారణజపసమాధులనుషడంగ యోగంబుల మనోవాక్కాయకర్మంబుల'' . . . నిష్ఠఁ బూనియుండె.అవిద్యయనుమాయ జయించి తాను శివుఁడే యై సాయుజ్యము నుపాసకుఁడు చెందు ననుట యీ మతానుశాసనము. కుమారసంభవమున "తాన సమస్తములోఁ దనలోనన సకలంబు గలుగ లోనును వెలియుం దాన యయి తనకు వే ఱనఁగా నేమియు లేక తాన కలిగి వెలుంగున్" "తలఁపనని తలఁచి యించుక దలచుడుఁ దలపంగ లేక తానును లే కప్పలుఖులును లేక యెప్పుడు కలిమియ పొడవైనవాఁడు గడిరి వెలుంగున్'' ''దనుజేంద్రు మాయ లన్నియుఁ ద్రినయనసుతుశక్తిఁ గని యదృశ్యంబయ్యెన్ వినుతాత్మజ్ఞానంబునఁ దనరుమహామాయ చెడువిధంబునఁబోలెన్.'' ''దొరకొనునింద్రజాలమునఁదోచిన రూపము లింద్రజాలమం చరయఁగ లేక చూపరదు నన్నియునిక్కము పోలె నైనయ ట్లిరవుగఁ బారమార్థికుల కెప్పుడు ద్రవ్యములెల్ల మిథ్యలై నిరతము చూడ లోకులకు నిక్కములై చనుభ్రాంతి పెంపునన్.'' క॥ సుజ్ఞానయోగతత్త్వ విధిజ్ఞుల్ భవబంధనములఁ ద్రెంచుచు భువిలో నజ్ఞానపదముఁ బొందక ప్రాజ్ఞుల్ శివుఁ గొల్తు రచలభావన దవులన్॥'' అని యిత్యాది భావములచే శివాద్వైత సిద్ధాంతము సూచింపఁబడియె. శ్రీకంఠ శివాచార్యులు తమ భాష్యమున జీవాత్మ పరమాత్మలకు, బ్రత్యేకతఁ జెప్పి విశిష్టాద్వైతములోని దాసభావము సూచించిరి. పండితారాధ్యులు నెలకొల్పిన వీరశైవమున జీవాత్మ పరమాత్మ భావనలోను

మాయాకల్పనలోను భేదములుగలవు. వీరి శైవదీక్షాప్రశంస యెందును మన కావ్యమునఁ గానరాదు. కావునఁ గృతిపతి మల్లికార్జునుఁడు కాలాముఖమతస్థాపకుఁడే యని నా యభిప్రాయము. పండితారాధ్యచరిత్రమున నతని సమస్తశిష్యకోటులలో నన్నెచోళుఁడు రాఁడయ్యె. పాల్కురికి సోముఁడు పండితమల్లయ యనియే సవిశేషణముగాఁ జెప్పుచుండును. నన్నెచోడుఁ డెక్కడను మల్లికార్జునకుఁ బండితశబ్దమును జేర్చినవాఁడు కాఁడు. పాల్కురికి సోముఁడు పండితారాధ్యునిగూర్చి పుత్రపౌత్రసంతతికలవాఁ డని వర్ణించెను. బిక్కనవోలి కామినేని యెల్లారెడ్డి కంకిత మీయఁబడిన బ్రహ్మోత్తరఖండమునఁ గృతికర్తృగురువు లింగనారాధ్యుఁడు పండితారాధ్యుని పుత్రపౌత్రసంతతిలోనివాఁడైనట్లు చెప్పఁబడియె. ఇట్టికారణములు పెక్కు లూహింపఁగా గృతిపతియగు మల్లికార్జునుఁడు భృంగియవతారమగు పండితారాధ్యుఁడు కాఁడనియు, శ్రీశైలప్రాంతమునఁ దపస్సుచేయుచు నలంపురమున మఠము గట్టుకొని శైవమతమును నెలకొల్పుచుండినవాఁ డనియు తోచకమానదు.

చోళరాజులకును వనవాసిదేశపు జాళుక్యులకు యుద్ధము లగుచుండె నని శాసనము చూపఁబడియెఁగదా. ౯౭౦ క్రీ. శ. ప్రాంతములకె రాష్ట్రకూట రాజ్యలక్ష్మి ప్రాచీనచాళుక్యసంతతివశ మయ్యెను. అప్పుడు చోళరాజులు మాటిమాటి కలంపురీప్రాంతముల దండెత్తివచ్చుచుండఁగా గాలాముఖమతాచార్యులు బలిగ్రామ మగు దక్షిణకేదారక్షేత్రమున రాజసమ్మానమును బడసి మఠము నిర్మించుకొనిరి. మఠాచార్యుల పరంపరయు రాజసమ్మానమును స్వనామాంకిత కావ్యములవలనను శిలాశాసనప్రశస్తి పద్యములవలనను లోకవ్యాపక మయ్యె. కుమారసంభవములో నాల్గవయాశ్వాసాంతమున నంకితాంకపద్యమగు "హరహాసాకాశగంగాత్యమలజల మరాళాబ్జనీహారధాత్రీ। ధరకర్పూరేందుకాకోదరవర పతిదిగ్దంతిపక్షీరనీరా। కరముక్తాహారకుందోత్కరరజతశరత్కౌముదీద్యోతకీర్తీ। శ్వరునాత్మారాము వాణీవరు వరగురు సర్వజ్ఞు నజ్ఞానదూరున్" అను పద్యము కాలాముఖమతమునకుఁ బ్రక్కనుండు జైనమతములో "హరహాసాకాశగంగాజలజలరుహనీహారనీహారధాత్రీ। ధరనీహారాంశుతా రావనిధర శరదంభోధరక్షీరనీరా। కరతారాభారతీదిగ్గదనిరదనపీయూషడిండీరముక్తా। కరకుందేంద్రేభహంసోజ్వలవిశదయశోవల్లభం శాంతినాథం" అని కొంచెముమార్పుతో నగపడుచున్నది. ఈ శాసనము త్రైలోక్యమల్లునికాలములోనిది. జైనకవులు శబ్దార్థ

చౌర్యమునకు వెనుదీయ రనుటకు సహస్రప్రయోగములు గలవు. జినసేనుని యాదిపురాణమున, "ఆపాతరమ్యావిషయా" "దైవాద్వీపాంతరాత్" మొదలుగ భారవి శ్రీహర్ష బాణకాళిదాసమహాకవులనుండి పెక్కుభావములు గైకొనఁబడియె. వర్ధమానపురాణమున మహాకవి యసగుఁడు మాఘునిభావములు దొంగిలుకొనె; కాళిదాసుకంటె నూఱుమడుఁగులు తాను మహాకవియని చెప్పుకొన్న పొన్నఁడు శాంతిపురాణమునఁ దదిందుమతీ స్వయంవరఘట్ట మంతయుఁ గన్నడించుకొనియె. మఱియుఁ బూర్వకాలమున నిప్పటివలెఁ గాక రాజాస్థానములలో బహుభాషావేదులగు పండితు లుండిరి. భాషాంతరములలోని నూతనభావములఁ దమతమ భాషలలోకి నెక్కించుకొనుట వింతకాదు. కృష్ణరాయనిసభలోఁ దిమ్మణ్ణ తిక్కన భారతమునే కన్నడించెను. దేవరాయసభలో డిండిభట్టు సంస్కృతాంధ్రద్రవిడ కవియై యుండెను. రుద్రదేవునిసభకు మహాకవి కంబఁడు వచ్చియుండినట్లు తెలియుచున్నదిగదా.

బల్లిగ్రామకాలాముఖమతగురుపరంపర చూడఁబర్వతావళి గౌతమముని శిష్యవంశ మనియు నిందు శ్రీశైలవాసి గురులగు కాలాముఖులకుఁ బర్వతావళు లనునామము కాకతీయ శాసనములలోఁ ద్రిభువనమల్లరుద్రదేవ శాసనములఁగలసి వచ్చుటయు నూహింపఁగాఁ గాలాముఖగురువులు మొదట శ్రీగిరి, యలంపురము ప్రాంతముల నుండి చోళరాజధాటుల కుల్కిన చాళుక్యరాజుల నాశ్రయించుటచే దక్షిణకేదార మగుఁ బల్లిగ్రామమున నెలకొనినట్లు నాకుఁ దోచుచున్నది. ఈ శైవ గురువు లెల్లరు మధురాప్రాంతములవా రనుటకు శాక్తేయరసవాద ప్రథమాచార్యులెల్లరు తద్దేశస్థులనుట తోడ్పడుచున్నది. కుంభజుఁడు తిరుకుత్తాల క్షేత్ర మగు త్రికూటగిరిలో నింక నున్నాఁ డనుటయు నతని పన్నీరాయిర మను రసవాద శైవాగమగ్రంథము మంథానభైరవాది మహాసిద్ధులకు మూలమగుటయు సుప్రసిద్ధము. మల్లికార్జునుఁడు "కుంభజతత్త్వజ్ఞుఁ" డట. నన్నెచోడుఁడు రసవాదశాస్త్రమునఁజూపినపాండిత్యము రసరత్నసముచ్చయాదికృతులలోనిది కాక కేవలతచ్ఛాస్త్రాంతర్గతమైనది. "రసరసాయన నిర్ఝర ప్రవాహానూనగంగా ప్రవాహశీకరము లడర" ఇందుఁజంద్రోదక రసోదక విషోదకాదిరసాయనములని యర్థము (చూడుఁడు రసార్ణవమున రసాయనఖండము). "ఇనుము రసంబులో నుడుగ కెప్పుడు నూనినఁ గాని కాదె కాంచనము" అష్టాదశసంస్కారపూత మగు రసమున ద్రవరూప మగు వజ్రశిలలో సంస్కృతమైనది కావున

నినుము శబ్దాదివేధలచే బంగారమగునని రసరత్నాకరమున వాదఖండమునఁ జెప్పబడియె. "పరమౌషధిప్రభాభాసురం బగుఁ గాని దస్తృణద్యోతి విద్యుతము గాదు" "పాచుఁ దమ మోషధీప్రభాభాతి" ఇందుఁ దృణజ్యోతి మొదలగు లత లూహ్యములు. (చూ-కైలాస కారకమున దివ్యౌషధీ లక్షణములు). "పరుసవేదులఁ బొంది హరికాంతశిఖిఁ గ్రాఁగి కనకంబు లగునయస్కాంతశిలలు." వేధలు స్పర్శవేధ, ధూమవేధ, శబ్దవేధ, కుంతవేధ అని నాల్గువిధములు. స్పర్శమాత్రమున వేధించునది కావున స్పర్శవేధి. తామ్రశిలపై రసౌషధమును వత్తిలో గూర్చి వెలిఁగించినఁ దామ్రము బంగారమగుట ధూమవేధి. నోట రసౌషధము నుంచుకొని తప్తాయసతామ్రముల నినుపగొట్టములో నూదిఁనవేధించునది శబ్దవేధి. ఈ శాస్త్రమర్మముల నన్నెచోఁడు డక్కడక్కడ సూచించియున్నాఁడు. పైఁ జెప్పినయంశముల నన్నియుఁ గ్రోడీకరించి చూడఁగా నన్నెచోడుఁ డొరయూరి నేలుచున్నవాఁడనియుఁబాకనాటి నేలుచుండి కృష్ణాతటమున - క్రీ. శ. 902 లో శాసనములోఁ బేర్కొనఁబడిన చోడబల్లి కుమారుఁడనియు విక్రమకేసరి సంభావించిన మల్లికార్జునునకు శిష్యుఁడనియు వనవాసిదేశపుఁ జాళుక్య సామంతులతో యుద్ధముచేసి మృతిచెంది యుండవచ్చుననియు, మల్లికార్జునుఁడు కాలాముఖ మతస్థాపకుఁడు కావున నతని శిష్యపరంపరలో సోమేశ్వరుఁడు దక్షిణ కేదారమునకు మతము దరలించెననియు,ఁ దరువాత నేకోరామి బసవపండితారాధ్య సోమనాథాదులవలన వీరశైవ మంకురించెననియు నామనస్సున కుదోభన మగుచున్నది. కుమారసంభవ కలావిలాసముల మొదట నథర్వణుఁడుదాహరించెను. పెద్దన, రామన, గణపవరపు వేంకటకవియు నీగ్రంథములలోనిపద్యము లుదాహరించిరి. మడికిసింగన, జగన్నాథకవి, ప్రబంధమణిభూషణకారుఁడు తమ పద్యసంచయములలో నన్నెచోడుని పద్యములు గైకొనిరి. జక్కన, కృష్ణకవి, తెన్నాలిరామలింగఁడు స్పష్టముగా భావచౌర్య మొనర్చిరి. నన్నెచోళుని యత్యపూర్వభావములు మల్లినాథపురాణ జగన్నాథవిజయాది కర్ణాటక కావ్యములలో మార్పు లేక యున్నవి.వీనికృతులు కర్ణాటదేశమున వ్యాపించె ననుటకు సందియము లేదు. దక్షిణకేదారమున "హరిహరికమలాసనవీతరాగ బౌద్ధాలయం"బులు గలవు. పరస్పర మతగురుస్పర్థచేఁ దత్తద్భండారముల నన్యభాషాకృతు లుండుటయు నాశ్చర్యము కాదు. కుమారసంభవ ప్రతులలో నొకటి నాకు నైజామురాజ్యమునఁ బ్రాచీనశాసనశోధనార్థము పోవుచుండఁగాఁ గర్ణాటదేశముననే లభించెను . తక్కినవి రెండును శుద్ధద్రవిడదేశముననే యగపడియే.

ఇఁక నన్నెచోడుఁడు నన్నియభట్టాదులకంటెఁ బ్రాచీనతముఁడని కుమారసంభవములోని వ్యాకరణఛందోవిశేషాపూర్వపదప్రయోగములు సహస్రముఖముల ఘోషించుచున్నవి. ఇతఁడు దీర్ఘముమీఁదియరసున్న నెఱసున్నగా వాడుకొనెను. ''మూఁడుజగంబులను దీవ్రముగఁ బర్వినబ్రహ్మాండము కాంచినకాంచనభాండము" ఇత్యాదులు పెక్కులు గలవు. ప్రాసములఁ గాక నడుమను సైతము దీర్ఘముమీఁదియరసున్న నెఱసున్నగా నుండుఁ గాని నేఁటికాలపుభాషావైశద్యము ననుసరించి యర్ధానుస్వారముగా ముద్రించితిని. ఇర్ల్లె, తర్గ్గు, మర్గ్గు, మొదలగు రూపములు ప్రాకృతములుగా దీనిలోఁ బ్రాసస్థానములలోనే ప్రయోగింపఁబడియె. నన్నియకాలమునకె "తగ్గు" అనురూపము వికృతి చెందెను. "తగ్గు మ్రగ్గు" భారతప్రయోగములు నన్నియభట్టుభాగములోనే కలవు. చన్నెచోళునికాలమునకుఁ బిదపగూడఁ గన్నడమున "మర్గ్గు" అనియె ప్రయోగింపఁబడుచుండెను. "విజయప్రారంభదోళ్ మర్గ్గిపో దదటక్ష్మాపనికాయపుష్పకచయం వ్యోమైకసంకీర్ణకం"అని బలిగ్రామశాసనము. చోళుని క్రొక్కారు, ఇక్క, క్రుక్కిదము, అక్కజము, త్రొక్కిన, ఒక్కడు, చొక్కు, ఉక్కఱి, స్రుక్కిరి, క్రక్కిరి, నెక్కిరి, అక్కిలి, గ్రిక్కొని, కర్రెక్క, చొక్కి, తెక్కుల మొదలగు శబ్దములు గూడినప్రాసస్థానములు శోధింపఁగాఁ గొర్క్కారు, ఇర్క్క, కుర్క్కిదము, అర్క్కజము, తొర్క్కిన, ఒర్క్కడు, చొర్క్కు, ఉర్క్కరి, సుర్క్కిరి, కర్క్కిరి, నెర్క్కిరి, పెర్క్కిరి, అర్క్కిలి, కిర్క్కొని, కర్రెర్క్క, చొర్క్కి, తెర్క్కుల మొదలగు భాషాంతరరూపములు గలుగుటచే నట్టిపదములె ప్రాసముల వచ్చుటఁ జోళుఁడీప్రాచీనరూపములే యుపయోగించెనని తలఁచుచున్నాను. లేఖకులు నవీనరూపములు వ్రాసికొని ప్రాచీనరూపములు దోషము లని వర్జించియుందురు. "శా॥ ఆకొర్క్కారసురాజుమ్రోల నిజరావానంతగేయాభ్రనా। దైకాతోద్యము" ఇత్యాటి స్థలములఁ బ్రాసములలో రేఫాధిక్యము దోషము కాదని లాక్షణికు లంగీకరించిరి. ఏల? ప్రాచీనశబ్దములు కొర్క్కా రనియె యుండఁగా గాలక్రమమున భాష మాఱి క్రొక్కారయ్యె. అంతఁ బ్రాసవిరోధమునకు గతి యేమని రేఫసంయోగముచే దోషము లేదనిరి. ఇదియె దీనితత్త్వము.

నన్నెచోడుని క్రౌంచపదమున యతి విచిత్రముగా నున్నది.

"చంచుల నాస్వాదించుచు లేఁదూండ్లకరుపుప్రియలకు నలఁదుచు మైరో-
మాంచము లోలిం గంచుకితం బై పొడమఁగ నడరుచుఁ బులినములం గ్రీ-
డించుచు సంభాషించుచుఁ బ్రీతిం బొలుచుచుఁ జెలఁగుచుఁ బొలయు సముద్య
త్క్రౌంచగతుల్ వీక్షించుచు భాస్వజ్జ్వలనుఁడు శరవణసరసికి వచ్చెన్.

ఇందుఁ గందసీసములవలెఁ బ్రతిపాదము రెండుభాగములుగా విభజింపఁబడి కందమువలెఁ బూర్వార్ధమునఁ బ్రాసమును ద్వితీయార్ధమున విశ్రమము మాత్రమే కూర్పఁబడియె. ద్వితీయప్రాసనియతిమాత్రము నన్నియ తిక్కన కవి జనాశ్రయకారాది ప్రాచీనులు పాటించిరికాని యప్పకవి తన్మర్మము తెలియక వదలెను. తన్వి త్రిభంగి మొదలగు వృత్తములకును నీ నియమము కలదు. క్రౌంచపదము మాత్రాఛందమునఁ బడి శీర్షక మగును. ఎటన రెండవ, నాల్గవ, గణముల నాల్గుమాత్రలుగా నుచ్చరించి కడపటి గురువు ద్రోచివైచి పూర్వ గురువు రెండుమాత్రలుగాఁ బలికిన సీస మగును. ఇట్లే తన్వీక్రౌంచపదములలో నుండి ధ్రువజాతిశీర్షకము పుట్టె నని నందిభరతమునఁ జెప్పఁబడియె. రెండవ పాదము "మాంచములోలిగఁ గంచుకితం బయి పొడమఁగ నడరుచుఁ బులినములను" అను సీసపాదమగును. ఇందుఁ బూర్వార్ధమునఁ బ్రాసయతియు, నుత్తరార్ధమున విశ్రమమును గలదు ఇట్టి నియమములుగల సీసములు నన్నియభట్టు భాగములోఁ బెక్కులు గలవు. ద్రవిడభాషలోఁ దిరువాయ్మొళి యను మహా ప్రబంధమున సీసము ననుకరించుపద్యములలోఁ బ్రాసయతియే కలదు. అట్టిదే ప్రాసనియత సీసములు నన్నియ ప్రయోగించెను. నన్నియకాలమునకే క్రౌంచపదము వృత్తము కావునఁ బ్రథమాక్షరవిరతి ముఖ్యమని ప్రాసమున్నను రెండు విరమస్థానములు ప్రయోగించిరి. ఇది నన్నెచోళుని ప్రాచీనత కొక గొప్ప కారణము. చోళునిచక్రబంధమునఁ గృతికృతికర్తృపతినామములు గుప్తములుగా లేవు. ఈ విధముగానే కన్నడమునఁ గవిరాజమార్గ మను ప్రాచీనతమ కావ్యములో నీనియతి కానరాదు. ఈ మర్యాద యిటీవలఁ బుట్టెనని తోచుచున్నది. చోళుఁడు "సప్రాణంబై నవరసభావభరితంబై షట్త్రింశదలంకారాలంకృతంబై" అని కుమారసంభవమునఁ జెప్పుటచే నతని కాలమున నలంకారములు ముప్పదియా ఱనియే యేర్పడియె. భామహాది ప్రాచీను లలంకారములు ముప్పదియా ఱనిరి. దండి, విద్యానాథ, విద్యాధర, మమ్మట, జయదేవ, దర్పణకార, పండితరాయాదులు బహుభేదములుగాఁ బ్రపంచించిరి.

ఇఁక శబ్దవిషయమున దీనిలో వాడిన పెక్కుపదములు భాషలో నశించెను. ఆంధ్ర ద్రవిడ కర్ణాటాదులు సోదరీభాషలగుటచే నొకదానిలో నస్తమించిన వేఱొకట నిలుచుట సంభవించుటచేఁ బెక్కుపదములకు ద్రవిడకర్ణాటకములఁ బ్రాచీన ప్రామాణిక కృతులలోనుండి ప్రయోగములు చూపితిని. కొంచఱు

తద్భాషావాసన లేక నన్నెచోళుఁడు కన్నడములోనుండి శబ్దములు దొంగలించె నని పాండిత్యవైచిత్రి చూపెదరు. దేశ్యపదము లన్నియు మూఁడుభాషలలోను గలవు. నే నపూర్వపదములకుఁ బ్రయోగము లిచ్చితిఁ గాని తిక్కన శంభు దాసాదుల పదములకు నవీనకర్ణాటకమున నుండి చెవులు చిల్లులువోవునన్ని ప్రయోగసహస్రములు చూపెదను. వీరెల్లరు కన్నడమునుండి దొంగలింప వలయునా? భాషలలో నివి సామాన్యదేశ్యపదములు. మఱియు విస్మృతపదముల మాట యట్లుండఁగా భాషలో మహాకవిముఖమున నవతరించిన పదములలో సైతము చోళునియర్థము శబ్దోత్పత్తికి దగ్గఱించి యున్నది కాని తక్కినకవుల యర్థము లక్ష్యకోటిలో నంతరాంతరితమై భిన్నార్థము నాశ్రయించుచున్నది. ఆలుశబ్ద మించు స్త్రీపర్యాయముగాఁ బ్రయోగింపఁ బడియె. ఇల్లాలు, మగనాలు, జవరాలు మొదలగు వానిలో నాలు ప్రత్యయ మయ్యె. ఇప్పుడు భార్యార్థమున వర్తించుచున్నది. కంపుశబ్దము "కమ్మ్" అను మూలమునుండి "కమ్మ" యను గుణవాచకమై "కంపు" అను తద్ధితమై సుగంధార్థముననే వర్తించు చుండెను. నన్నియకాలమున నుభయవిధ గంధార్థమున వర్తించి నేఁడు దుర్గం ధముననే చెల్లుచున్నది. తనుపారు = చల్లనగు. ఈ యర్థము మాఱి తృప్తిగా నను నర్థము కలిగెను. ఓడు = పాఱిపోవు (పూర్వార్థము) = అపజితుఁడగు — లక్షణార్థము."పట్టోడినపెల్లో" ఇత్యాదులఁ బూర్వార్థములోనే వాడఁబడియున్నది. కలిమి = ఉండుట. సంపద యని మాఱెను. ఇట్లే చీనిలో శబ్దశోధనము సేసిన నవి ప్రాచీనరూపములై లక్షణ నాశ్రయింపక మూలార్థమునే యాపహించు చుండును. నన్నియాదికృతులలోని విచిత్రవ్యాకరణప్రయోగములఁ దరువాతి లాక్షణికులును గవులును వదలిపెట్టిరి; లేక నూతనసూత్రములు గూర్చిరి. నేని యనుశబ్దము, అన్న్, పుడమిశ-ఇత్యాది విచిత్రప్రయోగములు భాషాంతరము లోను బ్రాచీనకృతులలో నగపడుటచే నది తత్తచ్ఛబ్దములలోని విశేష మని యూహింపఁదగుఁ గాని సర్వస్థలముల నీ యనుశాసనము చెల్లదని యేర్పడినది. "తెమ్మరల్" మొదలగుచోట్ల తెం = దక్షిణపు, ఎరల్, లేక, ఎలర్ అనఁగా గాలి-అని తెమ్మెరల్ మలయమారుతార్థములోఁ బ్రాచీనులు లాంతముగానేక వచనముగాఁ బ్రయోగించిరి. తద్భాప మెఱుంగక బహువచన భ్రాంతిచేఁ దెమ్మెర యని నవీనరూప మేర్పడియె. పెసర్ (ధాన్యవిశేషము), ఇరుల్ (చీకటి), మరుల్ (వెఱ్ఱి), తిరుల్ (తిరుగుడు), ఎలం (బాల్యము), పసుం (లేఁత), తలిర్, చిగుర్, అలప్ (మితి), పడల్, తడం (త్రాసు) మొదలగు పదములు

హలంతములు కావున సంధిలోఁ దదనుగుణవికారములు చెందుచుండును. ఇట్లు శబ్దశక్తివిశేషములు శోధింపఁగా నితఁడు తప్పక ప్రాచీనుఁ డని యేర్పడును.

నన్నెచోళుఁడు తనతండ్రి పాకనాటిలో రాజ్యము సేయుచుండఁ దానొరయూరేలుచుండినట్లు తెలుపుచున్నాఁడు. తెంకణాదిత్యుఁ డనఁగా దక్షిణదిశాసూర్యుఁడు. ఇతఁడు దక్షిణదిశ జయించి యీ పేరు గైకొనెనో లేక యితని పూర్వులు సహితము వహించిరో తెలియరాదు. పరాంతకుఁ డొరయూరు పట్టుకొనుటకుఁ బూర్వమే కుమారసంభవము రచింపఁబడెనో లేక పరాంతకుని నన్నెచోళుఁ డోడించి రాజ్యమును గైకొనెనో స్పష్టము కాదు. పులకేశిహర్షవర్ధనాదులు పరాజితులు గాలేదా.

ఈ కుమారసంభవము నన్నెచోడుఁడు గాక తదాస్థానకవియెవ్వఁడైనను రచించియుండునని కొంద అందురు. ఎవ్వఁడైనను విరచించినవాఁడు తప్పక మహాకవి. కవి యవతారికలో "అన్యతారకవితతు లనాదరించి। వెలయసత్కవి బుధ గురుబలమువడసి। యొనరదైవజ్ఞు నట్ల శుభోదయమున। దివ్యసుకృతిఁ బ్రతిష్ఠించుఁ దిరముగాఁగ." అను పద్యములో "నన్యతారక" అనఁగా శుభేతర గ్రహములు. వితతులనుటకు వికృతులని యుంటయొప్పు. "అశుభగ్రహవికారముల ననాదరించి" యని యర్థము. అర్థాంతరమున, అన్యుఁడగు తారుఁ డనుకవి యొక్క కృతుల నని యర్థము ద్యోతకము. ఇట్లె తారకపినామము 518వ పద్యములో మరల శ్లేషార్థమున వచ్చుచున్నది. వీఁడెవ్వఁడో యెఱుఁగరాదు.

ఒకవేళ మనకవి ప్రాచీనుఁడు కాఁడయ్యెనేని కొఱంత యేమి? నన్నియాదులకుఁ బూర్వకావ్యములు రాజప్రోక్తములే వెలువడ నున్నవి. కావున నా వాదములమాట యటుండ నిండు. రత్నము లెందు నెప్పుడు పుట్టిననేమి? చవులు గలవేని రాజభోగ్యము లగుఁగదా! సర్వవిధముల నిరుపమాన మగు నీ కావ్యరత్నము కవి యెవ్వఁడైన నెప్పు డుండినను సర్వజనాదరణీయమే. "వక్తుః ప్రామాణ్యతో దేవ వచః ప్రామాణ్య మిష్యతే। స హ్యశుద్ధతరా ద్వక్తుః ప్రభవం త్యుజ్జ్వలాగిరః" అని జినసేనుఁడు చెప్పినట్లు వజ్రములచవులు బొగ్గులలోఁ బుట్టునా? అల్పజ్ఞుఁడగు నాయట్టివాఁ డజ్ఞానముచేత లేఖకదోషముల గుర్తించి ముద్రింపఁజాలకున్నను గేవలము తాళపత్రములలోని పఠనక్రమమును

బో(గొట్టి దీని సర్వజనహస్తగతము చేసినందుకే యించుక సంతోషింతురుగాక. భాషలో( గతిపయాక్షరజ్ఞానము సంపాదించిన ఋణము నిమ్మహాకవి కీర్తిపునః ప్రకటనముచే( బాచికొన( గలిగితి(గదా యదియ చాలు నని పరమానందమున( బొందుచున్నా(డను.

చెన్నపట్టణము. మా-రామకృష్ణకవి.
౩౦ ఆగష్టు ౧౯౧౪.

# ప్రాచీన శబ్దాను శాసనక్రమము

క. వ్యవహారాచారాదుల నవనవతయ కోరునూత్ననాగరకుల నీ-
నవసూత్రప్రాచీనాంధ్రవచో వ్యాకరణ మెంత నవ్వించునొకో.

1. సూత్రము.

భాషలో శబ్దములు ప్రాయశః హలంతములు. ద్విత్వములు తక్క హల్సంయుక్తాక్షరములు లేవు. పరస్థఋకారసదృశరేఫము వ్యతిపాతవిధిచే (Metathesis) బూర్వాక్షర సంయుక్తి చెందు. హలంతముల కభావము పర మైనచో నికారోకారము లూ(తగా నగు. అనునాసికాంతముల కూ(తగా నుకారము వచ్చునప్పుడు తత్తద్వర్గ తృతీయాక్షర మూ(తగా నాగమ మగు.

మలజ్, కాజ్, నలజ్, రాముణ్, వేణ్, అలన్, పమ్, గాలామ్, వలమ్, ఎడమ్, ఏమ్, పరమ్, చేయ్, కుదుర్, నుదుర్, అలర్, ఎలర్, కురుల్, ఇరుల్, తనివ్, నేర్, వర్, తేర్, తోర్, మొదలగునవి హలంతములు.

తల్లి ప్రభృతుల ద్వితములు. వ్యత్విపాత రేఫ సంయోగమునకు; పరమ్ (ప్రాఁతది) ప్రాఁ. వర్చు = వచ్చు—రేఫలోపము. కొఱ్ × త - క్రొత్త. కిఱ్ × కొను = క్రిక్కొను. కుఱ్ × కిదముగ (కుఱుకు - వగ్గలించు) = క్రుక్కిదము = దట్టము. కఱ్కు = క్రక్కు, ఈ రేఫము కొన్నిచోట్ల లోపించును. అఱ్ × కిలి = అర్కిలి. అక్కిలి. నేర్ + చు = నేర్చు, నేచు. తోర్ + చు =

తోర్చు (ప్రాచీనరూపము), తోచు. తోర్ = అగపడు. తోచు = అగపఱుచు. త్రోవ = అగపఱుచునది (రకారవ్యతిపాతము); కుదుర్, అలర్ — ప్రభృతి హలంతముల కూఁతగా నుకారమురాఁగా కుదురు, అలరు, అలవు — అలవి, తనివి — తనివు — మొదలుగానయ్యెఁ.—

మలఙ్, కాఙ్! పరఞ్, వేఙ్, రాముణ్, అలన్, పమ్మ్ మొదలగు ననునాసికముల కూఁతగా నుకారము పరమై పర్గతృతీయాక్షర మూఁతగా రాఁగా, మలఁగు, కాఁగు, పరఁజు, వేఁడు, రాముఁడు, అలఁదు, పంబు, గారాఁబు, గాలాఁబు, వనఁబు, ఛత్రఁబు, చామరఁబు, మొదలగురూపము లేర్పడియె. వనము, ఛత్రము — మొదలగు మువర్ణకాగమము ప్రాచీనభాషలోఁ గానరాదు. వనఁబు లనియె చెప్పనొప్పు. ఇట్లె వలమ్ = కుడి. వలఁబురి = దక్షిణావర్త శంఖము. (పురి యనఁగాఁ జుట్టికొనినది.) వలమురి — దుష్టరూపము.

3. ఇ ఉడలకు లఘుత్వగురుత్వములు గలవు. చజలు నిత్యదంత్యములు. ఊఁతగా నగునికారోకారములు లఘువులు. ప్రాచీనతరభాషలోని ఴ కారమునకు మాఱువచ్చు డకారము లఘువు. పాడు, కడుపు, పొడము, కోడి, ఏడు — మొదలగువాని డకారములు లఘువులు. ప్రాచీన శాసనములలో లఘు గురు డకారములకుఁ బ్రత్యేకాకృతులు గలవు. చేసి, చీమ, యిత్యాదుల చకారము సైతము దంత్యము కావుననె ప్రథమమీఁదను యాంతముల మీఁదను సకారమయ్యెఁ. చేయ్ + చెఁ = చేసెన్. మలయ్ + చెఁ = మలసెన్.

4. పదములకు సంధిలేదు.

అతఁడిచ్చెఁ మొదలగుచోట్ల లఘూకారాగమము రాకుండెఁ గాని వచ్చి లోపము పొంద దయ్యెఁ. ఏమ్, అద్, మఱ్, మొదలగుచోట్లు హలంతములు కావునఁ బరమగు స్వరముతో నూఁదుకొనియె. ఇందికారము లఘువుగాన పరమైన నాగమము రాఁజాలదు. పొలసాడు మొదలగుచోట్లఁ బొలయ్ + చు = పొలసు = పొలసాడి

క్త్వార్థకేకారము భాషలోఁ బ్రయోగబాహుళ్యమున గురు వయ్యెఁ గాని ప్రాచీన తమభాషలో లఘువే యై యుండును.

5. అనునాసి కాంతములఁ బ్రత్యయ శబ్దపర్వతములచే ననునాసికములు లోపెంచినచో సర్ధోచ్చారణము వికల్పముగా నగు; అధునాతనభాషలో నర్ధానుస్వార మగు.

మలజ్ × ఉ = మలఁగు. (ఇందు గకారాగమమై తేలఁబలికిన జ్ కు నర్ధోచ్చారణమయ్యె. ఊఁదిపలికిన మలంగు అని యయ్యె.) కాజ్ = కాఁగు. డాజ్ = డాఁగు.

6. ధాతువులు హలంతములునుఁ బ్రథమాంతములును నగు. తుము న్నంతములు సప్తమి. వర్ (వచ్చు), చేయు, కొట్టు, కదలు, ముసుకు, ముసురు మొదలగు సమస్త ధాతువులు ప్రథమాంతములు. చేయన్ = చేయుటయందు. కొట్టంబడియె = కొట్టుటయందు మునిఁగిపోయెను. (భాషలో నెందును గర్మణి ప్రయోగము లేదు. తినఁబడియె = తినుటలోఁబడియె)

7. మల జాదిధాతువుల జకారమునకు యకారాదేశము వైకల్పికముగా నగు. ఉదా: — మలఁగు — మలయు, వెలుఁగు — వెలియు, నలఁగు — నలయు, డాఁగు — డాయు, అడయు — అడఁగు, మునియు — మునుఁగు (నష్టమయ్యె), కాఁగు — కాయు, చెలఁగు — చెలయు. మొద.

8. అడ జాదుల ప్రథమాచ్చునకు వ్యతిపాత మగు. అడఁగు — డాఁగు, అడయు — డాయు, అరయు — రాయు, అలయు — లాయు, అవియు — వేయు, (నష్టము) — వేఁగు, ఎలయు — లేయు, ఒరలు — రోలు, ఒఱలు — ఱోలు, ఒరయు — రోయు, మొదలగునవి.

9. భూతార్థక విశేషణమగు ఇనప్రత్యయము "ఇత" తద్భవము. పడిన - పతిత, చేసిత + ఎఁ (చేసినట్టునేను) = చేసితిఁ. (చేసితెఁ - ప్రాచీనతరరూపము)

10. ఇఁ — ఎఁ — ఇవి, ఎఁ అఁ ప్రాచీనతరరూపము, ఆ, ఆల్, ఆఁ ప్రభృతి ప్రత్యయములు సర్వనామ వికారములు.

11. విభక్తులు మూఁడె. ప్రథమాద్వితీయాషష్ఠులె. తదితరవిభక్తి ప్రత్యయములు సంస్కృత విభక్త్యర్థవాచకములు షష్ఠిపైనవచ్చును.

రామునిచేత = రామునియొక్క హస్తమువలన. తోడ = తోడునందు, కొఱకు = తక్షువకు. (రామునికొఱకు = రాముని తక్షువకు నని యర్థము.) కై = కు + అయి. వలన + మార్గముగా. కంటెఁ — కంటఁ — ప్రాచీన రూపము. కనుటయందు—అని యర్థము.

12. కొన్నిచోట్లఁగవలకును నరలకు నభేదములు. కురుల్ = చురుల్ = చుట్టలు – (ద్రవిడభాష) పనఁడు – పరఁడు, అనఁడు - అరఁడు - అప్రత్యయ గవాంతములకు వకారమునగు, మూగు – మూవు, నెగులు – నెవులు, మొద.

13. అల్లనప్రభృతుల యంత్యాచ్చేవార్థకమె. కాన (కాఁ × అ = అగు చుండఁగానే)

14. తీగాదులనకార మకారమ కాక యెత్వము కాదు. తీగ, సరిపణ, మురిపము, తిరిపము, గజ్జ, వీణ ఇత్యాదులకు నియాదేశము రాదు.

15. లఘూకార, సంయుక్తరేఫ లఘుడకారములకు సంయోగమున లోపసవర్ణత్వాది వికారము బహుళము. చిలుక – పూర్వరూపము చిళ్ల, చిల్ (భాషాంతరములఁగిళ్), + ఇలేకఉ = చిలి, చిలు; స్వార్థమునఁ గకారము. చిళ్ల ఉకార మూఁదఁగా జిలుక. (ఇట్లె పదాంతములమీఁదిలఘూకారేకారములకుఁ బ్రత్యయములు పరంబగునపుడె యచ్చు లోపంబగు. లఘుడకారము మీఁది యచ్చునకులోప మగు కడుపు, పొడము మొ. కడుపు ప్రాచీనధాతువు - కళ = త్రోచివైచుట. పువర్ణకము కృదంతము. కడ్ + పు - ప్రాచీనరూపము వైకల్పి కముగాఁగడుపునగు)

16. రేఫాదిసంయోగముల లఘూచ్చారణ మగు.

17. ముందఱ ప్రభృతులు హలంతములు – ముందఱ యన సప్తమి,

18. తెలాదులు లకారాంతములు; గుణవాచక మగుచో నికారాగమ మగు. తెలి, వెలి, వలి, పలినాడు మొ. తెలాదులకు ద్విత్వలకారమునగు. తెల్ల, నల్ల, వెల్ల, చల్ల, పల్ల, పల్లనాడు, పల్లవెంట్రుకలు. తెలాదులఁదత్థితమునఁబువర్ణాగమ మగు. తెల్ + పు, నల్ + పు — చల్ + పు. ఉకారాగమము నవీనరూపము. తెల్పు, తెలుపు, వెల్పు, వెలుపు - మొద.

19. మలఙ్ ప్రభృతుల ప్రేరణార్థమునఁ జుకారాగమము పరమగునపు డుచ్చారణార్థక వర్ణతృతీయాక్షరాగమము రాదు. మలఙ్ చు = మలఁచు

20. ధాతువులకు భావార్థకమున "ఉడ్" ఆగమ మగు. ఇందు డకారము లఘువు. చేయ్ × ఉడ్ = చేయుడ్ (ప్రాచీనరూపము). చేయుడు. (ఉకార మూఁదిన రూపము. ఇది సప్తమిలోఁ జేయుటయగుట. ఇదియ నేఁటిభాషలోఁ బ్రథమావిభక్తిరూప మయ్యె.)

21. తాఁకుప్రభృతి ధాతువులకుఁ బూర్వ రూపములు తన్కు, తనుకు. అందాఁక = అది తాఁకువఱకు.

22. రేఫశ్లిష్టహల్వర్ణములకు నధునాతనభాషలో రేఫలోప మగుచో నుప ధాక్షరము హ్రస్వమగునేని సంయుక్తహల్లునకు ద్విత్వమగు. ఉర్కు – ఉక్కు, నెఱ్కు – నెక్కు (సమీపించు) ద్రొక్కు – త్రొక్కు, ఒర్కఁడు – ఒక్కఁడు (ఒర్ = ఒక) ఏర్కి - ఎక్కి (ఏఱ్ = ఎక్కుట.) కిఱ్కాన = క్రిక్కాన (కిఱి = డగ్గఱించు.) కర్కెర్కి = క్రక్కెక్కి, సుర్కిరి = స్రుక్కిరి (సురుగు = శుష్కించు. సురుకు ప్రాచీనరూపము). కర్కిరి – క్రక్కిరి. వెర్కిరి = వెక్కిరి (వెలిలోని లకారము రకారమయ్యె). నిర్కెడు – నిక్కెడు (నిఱుకు - లేచినిలుచుట). నొఱ్కుదు—నొక్కుదు. (నొఱుకు - నుఱుకు - నుఱునూడుట). [నన్నెచోడుఁడు రకారయుక్తముగానే ప్రయోగించి యుండునని గ్రంథశోధన వలనఁ దెలియు చున్నది.]

## లఘు టీక

ఇందు శబ్దరత్నాకరాది నిఘంటుస్థములు కాని ప్రాచీనశబ్దములను నర్థాంత రముగల శబ్దములకును భాషాంతరప్రయోగముల ననుసరించియు సందర్భో చితముగాను నర్థము వ్రాయఁబడును. దీనిలో నుద్ధృతమగుసంఖ్య రెండవభాగము లోని పద్యములసంఖ్యను దెలుపును. 4. కన్నెఱింగి = జాడఁదెలిసి. "ఎండక న్నెఱుఁగనియెలమావిమోకల" ఉద. ఆ. ౨. ౫౮. 6. తప్పఁజూచు = నిర్దయ ముగాఁ జూచెడు. పలువడుడు = అఱచుట. 7. నెఱి = పరిపూర్ణత. 8. సావి = సవి = అనిభ్రమతో. 9. నెవులు = చలించు. వెణ్బురుతీగలు = జ్యోతిర్లతలు. పూర్ణిమారాత్రులలోనే యిటునటు పొలయుచు వెలుఁగుచుండెడులతలు. కంపు = కమ్మనివాసన. తెమ్మెరలు (తెం + ఎరల్) దక్షిణపుగాలి. ఇది యేకవచనము. తెమ్మెర యనురూపమసాధువు. 10. దిణ్జాహారము = అమృతము. 11. మెలు వు = సౌకుమార్యము. 12. వలకోట = ప్రేమయనుదుర్గమున. దొరయు = సమానమొ. "కావగుణక్కార్దొరె" గదా. ఆ ౧౬.

గెడలొ (కెడలో) - సహచరులో. 16. ముందఱు = పురోవృష్టి. బిందము (భేదము) - విఱుగుట. దేసి = అందము. 18. లత్తకా = లత్తుక. 19. ఆరోహిణ్యవరోహిణులఁబై నీసమున సంగవర్ణనము సేయఁబడియె. తావగొనక = నిలోపక. "వారణసేయఁ దావగొనవా" శ్రీనాథునిసప్తశతి. "తల్లడంబునం దావగొనంగ లేక" నిర్వ- ఆ - ౮. 22. సురగజ్జెలు = మ్రోయుచున్నమువ్వలు. ఘర్ఘరములు = గజ్జెలు.

25. ఆయగంబు = చప్పరము

34. పొందులు సంగతులు. 36. జల్లితొంగళ్ళు = కుచ్చులు కట్టిన చిన్నగొడుగులు, 42. వాతపూరణములు గాలితో నిండి తలగడలవలె సౌధాగ్రముల వ్రేలాడఁ గట్టఁబడినధ్వజవిశేషములు. "వాతపూరణంగళిం నొందంతె దెసె దెసెగె పొంగువగొగెగళిం" శూద్రకము. కలుపడగలు = కలివడగలు = వీరధ్వజములు. (కలి = శూరుడు. పడగ = ధ్వజము). 50. పూరణ = అలంకారము. 52. పోల్చిచూడుఁడు. "సరభసలీలఁగేళిసితసౌధము లొక్కట నిర్గమించి చ । ల్లిరి నరనాథుమీఁదఁ బురిలేమలు లాజలు దోయిలించి చె । చ్చెర శరదంబువాహములు చించి బయల్వడు చంచలాలతల్ । పరిమితవృష్టి బిందువులఁ బర్వతరాజముఁ గప్పునాకృతిఁ" ఉదయ. ఆ. ౫.

56. ఒప్పము = ఒప్పు. "విలాసమం మెఱసి దప్పువెనల్తొడ వాకె గొప్పమంపడె వెడగల్ల వావధుగె మంగళకారణ మల్లెభూషణం" పంపరామా— ౫—౧౪౦. 59. దువ్వలువు సన్నవలిపము. 61. తని + వోవు = తృప్తియగు. తని, తనివి, తనివు — రూపభేదములు. 64. కొపు = కాసె.

65. నిర్వాణము = మోక్షము, నగ్నత. "పగలఁ బొగిలెడివాని నిర్వాణి నొక్క తరుణతాపసి" దశ. ఆ. ౫. 66. వెలిమిడి = విభూతి. చెలుపంగ = పూయఁగ. వలగొంత = కుడిభాగమునఁ గొంత. మడఁది = స్త్రీ, "మడదియర మొలెయ నల్లదొడుడియదె" లీలావతి. 81. పాల్ = భాగము. కల్లడి = పొంగు 83. లగ్గ = పూర్ణముగా. "లగ్గ బెగ్గలించు నగ్గలముగ" భార - విరా. 87. పోఁక = సంధ్యాకాలము (వేగుఁబోఁక = ఉదయసంధ్య.) 91. ఒడఁగూడి రాకకు = సమ్మతించివచ్చుటకు. 95. పిఱుఁ దెక్కిన = వెనుకకుఁజిక్కిన. 99. ఘడిపిన = పూసిన. 101. సన్నలువాఱ = (కరచరణాది) సంజ్ఞలు సేయఁగ,

"ఒఱపరిఁ గన్నఁ గూడఁ జనునూరక సన్నులువాఱ నాడు....... జారధారుణిఁ" శై. ఆ-౩. చప్పరించుచు = తడవుచు. "నీ నిల్లిం తొలగెందు చప్పరిసిదం మండోదరీదేవియం" పంపరామా - ౧౪. ౧౩౩. 102 కూర్చువారికి = ప్రేమించువారికి. 105 వెల్పు = తెల్లదనము. "లలిత వళిత్రయం కిడదె బెళ్ళు ముఖాబ్జదొళ్" అజితపురాణములోని గర్భవర్ణనము. 108 మేలిల్లు = శ్రేష్ఠమగు చున్న. 110 గొడగు — గొడుగు రూపాంతరము. "కుడై" యని ద్రవిడమున వాడుదురు కానఁగొడగు లనుటయే ప్రాచీనరూపము. 112 పాళియ = తట్ట. 116 మెయికఱ = దేహములోని నలుపు (కళంకము). 118 దీని పోలికగల రెండుపద్యములు పూర్వభాగము పీఠికానుబంధములలో నుదాహరింపఁబడినవి. 120 పట్టించిరొ = ప్రారంభింపనూళ్ళొలిపిరొ. "మంచన వింటివో వినవొ మన్మథుఁడేకశిలాపురంబులోఁ । జంచల నేత్రలం బతుల శయ్యలపై రతికేళి రాత్రిపోఁ। రించి ప్రభాతకాలము పరిస్ఫుటమైనను దమ్ముఁ దార పఁ। ట్టించుచునున్న వాఁడదె కుటీగత కుక్కుటకంఠకాహళిన్" శ్రీనాథునిక్రీడాభిరామము. 124 మూరి = చిత్తవిభ్రమముతో. సూరెలువాఱు = పార్శ్వముల కొదుగుచుండె. 129. పొయిగారము = కరువు 130 మిగిలి = అతిక్రమించి.

136 దాఁపరము = దాఁచి యుంచుటలు. కట్టుదాల్ప = కట్టుత్రాడు వేనుటకు. రా = రాతిలో. గంటు = గాయము. కలి = గంజి. కత్తిగొంటులు = కటారికత్తెలు. అత్తగంతు = లంజతల్లులగుంపు. "నేలయు నింగియుఁ దాలముల్ గావించి" విరా - ఆ - ౨ "నేలకు మింటికిన్ దొడరి నేర్పున సూత్రము వన్న మంచుఁ గుం। చాలను గొల్వఁద్రాళ్లిసుక చాలునఁబేనఁగఁ జుక్కలెన్నఁ జఁ। ట్రాలను నారలొల్చి నెగడఁ వడగండ్లను గుళ్ల గట్టఁగాఁ। బోలినమీకు నిచ్చటికి సంయమి దెచ్చుట యేమిసోద్యమే. రఘు - రామా. ఆ - ౨. 137 అల్లురు = విటులు. 138 తక్కోపక = త్రోచిపుచ్చుట సహింపఁజాలక. కనువలి = సంకోచము. 139 ఒడ్డించి = ప్రయత్నించి. ఆలములు = కలహములు. 140 పురులు = ధనము, పట్టణములు, వేషములు, ద్రవ్యము. 141 తలపీండ్లు = తలవాఁకిండ్లు. కేనంబు = వ్యాజము = దంభక్రియ 142 కలుపక = ప్రేమింపక. పురులు = ధనము. పొచ్చపోక = హైన్యముపడక. 143 కోర = వ్రక్కకుముడిచిన. మగలంజియలు - లంజలవలె మాయాయౌవనచిహ్నముల ధరించిన మగవారు, కూళియాలు = వేశ్య.( = స్త్రీ). రోలుగొన = జల్పములాడ,

పాంచాలదేశస్థుఁడగు బాభ్రవీయుఁడు సాంప్రయోగికమున ననురాగ మృదూపచార రసానుభవమునె ప్రతిపాదించెను.

దత్తకుఁడు = కేరళదేశపు రతిశాస్త్రజ్ఞుఁడు వైశికాధ్యాయము రచించి యందు వేశ్యానురాగచర్యలు నాయకునియావి కనుగుణముగానుండునుగాక యని యాదేశించెను. కూచిమారుఁడు కూచిమారతంత్రమున మూఁడుపటలములలో మంత్రౌషధాద్యౌపనిషద ప్రకరణమునే మేలుగాఁజెప్పెను. భద్రాదులు నలువురును నాయకులుగా గ్రహించుకొనఁదగు. బేటంబు = అనురాగము. కలుచు = ప్రేమించు.

పోల్చిచూడుఁడు. "నిజరూపరేఖల నెలఁతల వలపించుచాతురి గలభద్ర జాతివిటులు। పలసినధనము లవ్వారిగా నొసఁగుచుఁదరుణులఁ గరఁగించుదత్త విటులు। మణిమంత్రములచేత నణుమధ్యలఁ గరంచుమగటిమి గలకూచిమార విటులు। పలరాజుకళ లుండు నెలవుల భేదించి సతులఁ దేలించుపాంచాల విటులు। వరుస నందఱు తమజాతివారి వారి। జాతవదనలఁ గూడి సంజాత మదన। కదనకేళివిహార సంపదలఁ బొదలి। మెదలుదురు వీటనధికసమ్మదము లొదవ." కష్టవిలాసము ఆ - ౧. 147 సెగ్గించెర్ = రోతవడెను. 148. ఉరి = మంట.

151 ఆండురు = స్త్రీలు "స్త్రీలను బ్రేమింతురా ? మఱుగు లేక నిన్నుఁ బ్రేమించుటయే దోషమని కోపించెదవు. స్త్రీ నాయకుఁడు మ్రొక్కినను గోపమును దేర్చుకొనఁజాలదు., అట్టిది దైన్యముతో మ్రొక్కుటయు కాక నిన్ను బతిమాలి సేవించుచుండఁగాఁ బ్రియపై నిట్లు వక్రత్వము సూపుట నీకుఁదగునా." ఆండురనుటకు "మలయాచలంబుపైఁ జిలువయిల్లాండురఫణరత్నములయందుఁ బ్రతిఫలించి"కాశీ. ఆ-౧. "ఆసమయంబునన్ మగనియాండురు గన్యలు" నిర్వఆ ౫.

153. అంచు = అఱచును. 155 తక్కిన = వదలినయెడల. పురుడువారి = సమప్రేమగలవారి. ఎడయైన = ఎడఁబాటు గలిగినపుడు. మట్టు = మందమగుచున్న. 156. విటవిదూషకాదులు క్రమముగాఁ జతురోక్తి పరిహాసోక్త్యాదులు భాషించుచుండిరి. 157 తనుపు = చల్లఁదనము. తెలిపు = తేట. 158. కంపు = మంచివాసన. "కంపు గొనకయె కల్పవృక్షములపుష్ప। సౌరభం బిట్టి దని చెప్పఁ జాలువారు. కేతన. "పూవులకంపు మూర్కొనక" అర్థ.

159. రిమ్ముల = రెమ్మల = ఉపశాఖలలోఁ. చేవెఱ = లజ్జ. 160 ఒట్టియ = ఒంటె. 162. "ఇంకెడుపంకమధ్యమున నెండఁ దలంకెడుమీనువోలె నేఁ కాంకని భాస్యయుండెఁ దలిరాకులఁ జేసినపాన్పుపై" ఉ-ఆ-౨. 163. "ధనాసక్తిచే వలచుట హరిద్రారాగమువలెఁ ద్వరలో మాసిపోవును. విటుఁడు విరాగి యైనను నిర్వ్యాజరతసంపద గలదేని రసభావము లుద్దీపించు చుండును." 164 కాన్పు = కనుట = పొందుట. "ఇది కలలోనికానుపు" హరి-ఉత్తరభాగము. 165. నిజము = స్థితి. కలదాఁక = సర్వకాలము. కలుపు = ప్రేమ. 166. వలను = చాతుర్యము. "చతురత్వమును రూపమును విద్యయుఁ గల స్త్రీఁ బురుషుండు దన్నుఁ బ్రేమించునట్లు నడచుకొని తానును బ్రేమించెనేని వానికిఁ గామసుఖము సంపూర్ణమగు."క. "తను వలచుకాంతఁ యేపని మనమునఁ దలఁచినను జేయుమగవానికి నఁ ప్పనిత బిగియాచుకౌఁగిలిఁ దినదినమును మదన కామధేనువు గాదే" ఉ-హరి-ఆ-౨. 167 "ధనము జన్మాంతర పుణ్యఫలము ననుసరించి యుండును. ఉత్కృష్టరసానుభవమునకు వెచ్చించుట ద్రవ్యనాశన మునకుఁ గారణము గాదు." 168 ప్రాలు = సౌభాగ్యము. "గృహస్థధర్మముం బఱగడ వైచి గోచికొని పాతెడుపొల్లకు ముక్తి గల్గునేఁ వఁఠికల నేఱినం గొలుచు పాఁతటికిం గలదే తలంపగన్" ఉ-హరి-ఆ-౪. 169. అందు = అందే మఱియు. వాలికల్ = ఏటవాలుప్రదేశములు. చిక్కని = సన్నని. అక్షము = కన్ను. (ఇంద్రియార్థ మైనను లక్షణచేఁ గంటియందు వర్తించునని కొందఱు చెప్పెదరు. కమలాక్ష, అక్షపాదాదిశబ్దములలో నయనార్థమే రూఢమైయున్నది.) "కన్ను లేటవాలగుచోట్లు, కనుబొమలు వంకలు, మఱియు హృదయములు నున్నగ జాఱునట్టిస్థలములు, వలుదకుచములు వాఁడియగు సన్నని రాళ్ళు, మఱియు, గుణము బాలిశము. మనోరతియందె ప్రౌఢలు, కావున నిట్టి స్త్రీజన ముల స్వరూప మిట్టిదని రసతత్త్వజ్ఞుఁడగు పాంచాలపురుషుఁడైన నెఱుంగఁ జాలఁడు." వాలుక లను పాఠాంతరము గలదు. కన్ను లిసుకభూమివలె నెల కొననీయక చలనభావము కలవనుట.

170 వలఁకులు = నేర్పులు. 171. లంజికా = వేశ్యలు. "అమరలంజి కెయర్ జా -ఆ-౫-౩౬. 173. ందులు = చెమరు బిందువులు. విడినీరు = కట్టిననీరు. అలుక = చల్లఁగా. 174. చరణాహతిచే నశోకము పుష్పించును. 175 చేయు = హస్తము. 177 ఓటనము = ఓడిన

దైన్యము. కట్టాయము = నిర్బంధము. "రా యెం బీపెస రిల్ల దంతు ముళిసిం ముయ్యేడుసూ శెంతు కట్టాయం పెంపుళి వోగె" పంపభా-ఆ ౧౨. 178 గంటులు = గాయములు. నెట్ట = నేరుగా. 179 లంబనములు = హారములు. "పాండుక మప్పపాండుకశిలాతలదొళ్ కనకాభభాసిగళ్। దండిగెగళ్ మనం గొళిసె ముత్తినలంబణ మొప్పె" అజిత-ఆ౪-౩౬. ఎత్తువెట్టు = రంజనమిచ్చెడు. 182 అన్ననుకు = మిక్కిలి పలచనగు. 186 వెలరువాతె = తెల్లఁబాతె. 188 రమణ = స్త్రీ. "దేవతారమణాయాం వినియోగ యంచు" ప్రభా—ప్ర. 190 మాటపొందు = అనుకూలించిన యేకవాక్యము. 202. నెలకట్టు = నియతకుట్టిమ ప్రదేశము. విలంబకములు = వేలాడఁగట్టిన గుత్తులు. 203. పరుసవేదులు = ఇనుమునకు దాఁకినంతనే బంగారము గావింపఁదగు స్పర్శవేధి యను రసశిలా విశేషము. 204. హంసోదకము = పగలు సూర్యతప్తమై రాత్రి నంపూర్ణచంద్రికా శైత్యము ననుభవించిన నీరు. 209. వన్నువు = వర్ణము. పోలుపొందు = సంబంధ సామరస్యము. అలఁతికి = మితికి. పూర్వకాలమున ముఖమునకు లోధ్రరజమును జల్లుకొనుటయు, నధరమునకు యావకరసమునుపూసికొనుటయు స్త్రీలకో నాచారము. "ఆత్మనైవ సతదాపురాకృతం యావకం యువతిదంత వాససె। ఉజ్జహార ముదితః పునః పునర్నిష్పిబన్నధరపానలోలుపః" జానకీ హరణం. ౮. ౪౦. 212. ముడి = కిరీటము. "విణ్ణో రంబొన్ ముడిమేల్ అడిత్తామరై సెన్ని వైప్పాం" జీవకచింతామణి. ఆ. ౧. హంసతిలకము = రాకిడిబిళ్ళ. "నసెయం పూగళ నాలోకనమాత్రది పడెద శెందుమెచ్చం తిలకం। నినగిత్తు దెందుభూపతి। వనితాతిలకక్కె హంసతిలకను నిత్తం" మల్లి. ఆ. ౯. ౫౮.

వస్తు = బంగారము. అవయము = రంజకము. పసదనంబులు = అలంకారములు.

219. కండవడము = తెర "కండవడం తెరసీరె" కబ్బిగర కైపిడి-(కాండపటశబ్దతద్భవము) 221 వలయ = సువాసన కలుగఁగా. 223 వస్తు = బంగారపు. 224 ఏకసర త్రిసరములు హారవిశేషములు. తొంగలిపట్టియ = వ్రేలాడుచున్న సకుముపట్టె. "కట్టిద పంచవణ్ణిగెయ పట్టెయతొంగలొ శింద్ర చాపమం। పుట్టిసి తొట్టవజ్రకవచచ్ఛవియొళ్ చపలాకలాపమం। పుట్టిసి" పంప రామా. ౧౩-౫౯. సురంగముగా = అందముగా. 227 వాతపూరణములు =

లు. తండడి = తత్క్షణము. 232. శుభోదయమునఁ బారద రస ముబ్బి ప్రవహించు నని రసాయనశాస్త్రము. పరుసవేది = స్పర్శవేధి.

236. తత...సుషిరాత్మకంబులు = వాద్యములు చతుర్విధములు. **తత**ములు-౨౦-పరివాదిని, చతుర్దశి, ఏకాదశి, త్రయోదశి, మహతి, బృహతి, కళావతి, కచ్ఛపి, వితతము, పినాకిని, పౌర్ణము, రావణహస్తము, ఉదుంబరము, షట్కర్ణము, హస్తభము, సారంగి, ఆలాపిని, రుద్రవీణ, వ్యాళీముఖము, బల. ఇవి కొడుపుతో వాయింపఁబడును.

వితతములు. ౧౮. ఝల్లరి, మురజము, భేరి, పటహము, కరడ, కుడుక్క, హుడుక్క, ఢక్క, డమరుకము, నిస్సాణము, సోల్లుక, బాణము, తుంబురి, దుందుభి, మద్దువు, డిండిమము, ఝర్ఝరము, పణవము. కొట్టి వాయింపఁబడును.

సుషిరములు. ౧౦. పాలిక, కాహలి, వానము, ముకులి, మధుకరి, వంశము, శంఖము, శుకి, శృంగము, సుదుర్లపి. శ్వాసముతోఁ బూరింపఁ బడును.

ఘనములు—౬. కాంస్యము, తాళము, ఘంటిక, బయఘంట, క్షుద్ర ఘంట, కర్మ.

237. అలఁతులు = ముఖవీణ, తాళము మొదలగు నుపాంగములు. 230 కాములు = కాడలు. 243 తప్పఁజూచిన = కోపముతోఁ జూడఁగా. చక్కఁ జూచిన = మంచిచూపుతోఁ జూడఁగా, ఋజువుగాఁజూడఁగా. 246 మేలిల్లు = శ్రేష్ఠమగుచున్న. 247 తట్టార్చి = పొలయించి. వెలరెన్ = వెలువడెను. 248. కంటకశయనవ్రతము—బలవన్మరణము నెందఁగోరి ప్రాయోపవేశము సేయు వ్రతభేదము. "రోమాంచని కుచయుగళే శ్వాసగళితమంశుకం నిదధానాత్వత్పాణి గ్రహణతృష్ణయాకంటకశయనవ్రతలీలామివ దక్షిణం కరకమలమనుభావ యతి" కాదంబరి. పావలు = శారకములు. ఆడెనో = వసంతమాడెనో. 250. క్రోశులు = క్రోవులు. వలగొని = చుట్టుకొని. 251 వల్వులు = సన్నవస్త్రములు. తెరల = కలసిపోఁగా. ముఝ్ఝటలు = చిమ్మనగొట్టములతోడి జలక్రీడలు. "అత్తఱివిటనాగరకులు చిత్తమున వసంతకేళి చిగురొత్తంగా మొత్తములుగట్టి తెచ్చిరి ముత్తెపుజల్లరులతోడ ముఝ్ఝటకొమ్ముల్" "మైమెయిఁబోవఁగ నేర్చెద పీ ముఝ్ఝటకింకఁ దక్కితేనియు"

252. అంగవి = తృప్తి. 260 వెడసీర = తెర. 261 మెలుత = స్త్రీ. (మెలియు = సూక్ష్మమగు. మెలుత = తన్వి. ఉకారమధ్యముగానే ప్రాచీనరూపము గలదు కావుననే మెల్తుకయని యగును) 262 వలను = దిక్కు. 263 పొలఁతి = స్త్రీ. (పొలుచునదికావునఁ బొలఁతి.) "లీలకుఁ గాతరిల్లిన పొలంతులతో నడయాడి" అర్థ. ४. 263. తఱఁకి = వదలి. 271 గెడగాని = జోడుఁగూడి "పొఱర్వక్షియంతె గెడగొండిరిదెగెన్న నగల్దెంతుపోదళ్" లీలా-ఆ-౧४-౨౭. తుంతుర్వని = తుంపురులు, (తుంతురు = చెదరులు ; పని = చల్లనీటి బిందువులు.) "తెరెవొల్లుందాదతుంతుర్వని నిజతనువం" జగన్నాథవిజయము, ఆ-౧-౨౩. "వనకేళీశ్రాంతకాంతాజనదముఖ సరోజంగళోళ్ పాయ్దు తుంతుర్వనియం పేఱుత్తె" లీలా-౧౩-౧౧౩. 275. తన్ని = ఊఁదుకొని. తల కెడవు = తలక్రింది, వారి = నీళ్లలో. 277 చల్లుఁబోరు = నీరుచల్లుకొనునాట. "శతవీరకుమారులతోడ జల్లుఁబోరాడి" భార. ఆది. 279. కడలడి = అలల సమూహము

281. బంధుజీవముల వనపుష్పములుగాఁ గొందఱు కవులు వర్ణించిరి నిక్కము విచార్యము. 284 దాసి = సమీపించి.

285 "బాలే తవ ముఖాంభోజే దృష్ట మిందీరవరద్వయం" కాళి.

286 సావి = అనెడు భ్రమతో. "నిజకనీనికలక్రొన్నిగ్గులు వాననోత్పల పత్రములు సావిఁ బాఱమీటు" సాంబో - ఆ - 3. 287 బేలు = ముగ్ధ "కడుందోన మీబేలుంజెయ్దుకతంబు సెప్పునిను సంప్రీతాత్ముని౯ జేయుదు౯" దశ - ఆ ౬. చదురాలు = నేర్పుకత్తె. 288 వగ = తలంపుతో. తీర్చె = మఱుగుచేసెను. 290 ఒడమి = సొమ్ము. పరివెడలు = దండువెడలు. 294. చలిమిరి = చల్లఁదనము. విడి = ఎఱ్ఱనగు. "విడికెంపుటుంగరా లిడగరాదె" ర - రామా. 296 రేక = రేకు. 301 అన్ని = మదించి. 307 మలరు = పుష్పము. "మెరిమలరిలవముం విరిమలర్ పరప్పి" మణిమేఖల.ఆ - ౩ - ౧౬౬. "చిత్తజ నిఱుచాపల తెయంగెలెవందుదు పుర్వినొళ్పు కణ్బెత్త పయోజ పత్రరుచియం గెలెవందుదు కణ్మలర్" అజి - ౨ - ౩౭. గెడకత్తియ = సఖి. 307 ఎలనాఁగ = యువతి (ఎల = లేఁత, నాఁగ = స్త్రీ, ద్రవిడమున, అనంగై) 312 చివ్వంకలు = కొంచెమువంగుటలు. పొఱలు =

చిగుళ్ళు; 315 కప్పు = నలుపు 317 మూవె = మూగె 318 పదువలు = సమూహము. 325 తులదెంచు = రాల్చు. తొడిరు = తాఁకుట. డుల్లుకారాకులు = రాలుచున్నపండుటాకులు, ఒప్పు = శృంగారము. 326. మండలార్చనదీర్చి = శ్రీ చక్రమును బూజించి, 327. మైతెంచి = సమ్మతించి.

329. వస్తువు = శాక్తేయులును రసవాదులును సురకునుబంగారమునకును వస్తువందురు. కౌళికులు = కులాచారులు = శాక్తేయులు. రసాయనము—దేహము నజరామరముగాఁ జేయఁజాలినదివ్యౌషధము, ఇది సిద్ధౌషధులరసము, లేక, యష్టాదశ సంస్కారపూతమగు పాదరసము. సిద్ధౌషధులు ౩౨. రక్తస్నుహి, సోమలతారుదంతి, కృష్ణచిత్రకము మొదలగునవి. 330 ఎరియరె = కాలిపోవరె, 331 సద్యంబ = అప్పుడ. సిద్ధరసము – సిద్ధౌషధులరసము. ఇది దేహమునఁ బ్రవేశించినంతఁ జొక్కును, మనోదేహభ్రమములును, జర్మస్ఫోటనమును, నఖకేశపతనమును గలిగించి సద్యోజాతత్వమును దయసేయును. (చూడుఁడు సోమలతాకల్పము). కలయ నూల్కొని = దేహమంతయు నుద్రేకింపఁజేసి. 332 పేర్చిందువులు = చెమటబిందువులు. మట్టము = మందము. పురినమ్ములు = పురివిచ్చిన నెమళ్ళు. క్రొవ్వెదల్ = జడలు, కొప్పులు. తడుమ = తడఁబాటు వొందునట్లు. ఎడసి = తొలఁగి. 334 అన్ని = మదించి. అంకమాలికలు = బిరుదులుచెప్పి స్తుతిసేయుగానములు. "ఓపనిగె పుళిందిపాడిదబళొల్దు గుణప్రియ నంకమాలెయం" లీలా ౮ – ౩౦. సాహురి, పలమంజరము, ఆందోళి, భైరవి' నాట, రాగభేదములు. పౌరాళి యను శబ్దము గ్రంథాంతరమున లభింపదయ్యె. బంగాళియనుటకు లేఖక దోషమాయని నాకుసందేహముగలదు. లేక భల్లారియైనను గావచ్చును.

పలమంజరము – పురుషరాగము. శ్రీరాగోథ వసంతశ్చ సారంగః పలమంజరః. సాహురి, ఆందోళి, భల్లారి, స్త్రీరాగములు. "గుర్జరీ పూర్వగౌళీచ, భల్లారీసాహురీతిచ, ఆన్దోళీతి స్త్రియఃప్రోక్తాః చతురుత్తరవింశతి" పలమంజరికి లక్షణము–"పంచమాంశగ్రహన్యాసా పూర్ణాచ పలమంజరీ హృష్యకా మూర్ఛనా జ్ఞేయా రసికానాం సుఖప్రదా॥ వియోగినీక్లాంతవిశీర్ణగాత్రా స్రజంవహంతీ వపుషాచ శుష్కా ఆశాస్యమానా ప్రియయాచ సఖ్యా సధూసరాంగీపలమంజరీయం" అని సంగీతశాస్త్రము. (ఎక్కువగాఁగోరెడువారు సంగీతసుధను జూడఁదగు).

అలతి = ఆలాపము. 336 పంచమహాశబ్దములు = భేరి, కాహళము, పటహాము శంఖము, జయఘంట 342. కేళ్లు : చేతులు. 343. అన్నువ = అన్నువు + అ = నన్నని. సోపులాడు = త్రోపాడుచుండు. 344. కొదలించు = తగ్గించు - తలఁకించు = తొలఁకునట్లుచేయు. సెరవు సేయక = కేనము సేయక = నిర్వ్యాజముగా "అంతునిజభుజగదెయం తూగుత్తు మిర్ధదండశూకపతాకన సెరగిల్లిద మెగ్గలితనక్కె మెచ్చి తలెయంతూగి" గదా. ౭ - ౪౨. తఱకించు = తొలఁగించు. మెయ్యెడి = మార్గమున. కానియదియవోలె = సమ్మతింపని స్త్రీపోలెనే. అలఁతి = మితి, అగ్గలింప = దాఁటిపోవఁగా. ఆఁకగొనక = ఆపుగొనలేక 347 అంజలు = భయము. రూపాంతరము - అంజలి. కాయ్పు = భావరసాతిరేకము. వజ్రలేపములు = వజ్రమును కరంచి రెండు వస్తువులంటించుటకుఁ బూయుట - చెమట బిందువులు పరిపక్వముగాఁ గాఁచిన వజ్రమువలె నుండెననుట. "ఉరదిం పెర్మొలె బెంగెమూడెబెమర్గళ్ బల్వజ్రలేపంబొలా। గిరె, కీర్గొట్టబెడంగ నీయెపులకం, తోళ్గోళ్గెగంటిక్కిదం। తిరె, మెమ్మెయ్యొళడంగు వంతమరె, గాఢాలింగనం గెయ్దున ల్లరదేనిర్దరొ కాసి బెచ్చతెఱదిం శ్రీసత్యభామాచ్యుతర్" జగన్నాథ విజయము. ఇందులో నొక్కతలకు రెండు మొగములో యనునుత్ప్రేక్ష తక్కఁ దక్కిన భావములన్నియుఁ గలవు కాన సంపూర్ణ పద్య ముదాహరించితిని. "నుడిదుదెనన్ని, మాడిదుదెశాసన మిత్తుదె రామరేసు మార్పిడిదుదెవజ్రలేపము." శివమొగ్గె తాలూకా తట్టికరెగ్రామశాసనమున, ౨౪ వ పంక్తి. (మాఱ్ = శత్రువు). మొలలు = చీలలు. 348. కాయుపు, కాయువు—భిన్నరూపములు. 351. మగువవరుసఁ బతికి మగుడఁజూపె. "చోదయత్యవనిపాలనందనే శిక్షితుం యువతికృత్యనైపుణం దేహజన్మశరఖండితత్రపా సా యయౌ రహసి కర్మకర్తృతాం" జాన—౮—౨౯.

354. వహిత్రము = ఓడ, 356. సొగయింపని = చొక్కు సేయని = ఆసక్తిఁ బుట్టింపని. "సొగయింపనిభంగిమహేశుఁడయ్యుమా। యవ్వనవారి పూర్ణసురతాబ్ధివివర్ధితుఁడై మదించిమై। దివ్వఁడు" అనియుఁబాఠముగలదు. ఇందులో యౌవనశబ్దము "యవ్వన" యని చెప్పుట దోషము. ప్రాచీనకవితలో నిట్టి ప్రయోగములు సాధువులై యుండఁగా వైయాకరణులు నాలంకారికులును దోషపరిచ్ఛేదముల విస్తారముగా వ్రాసి నించుక కఠినముగాఁ జేసినట్లు తోచుచున్నది. మహాప్రామాణికుఁ డగుననంతకవి భోజరాజీయమున "నవ్వుచుఁ

జెక్కు-మీటి నలినస్ఫుటలోచన మాటలేలనీ। యవ్వనలక్ష్మికిః భటుఁడ నైతి ననుం గరుణింపు మంచు వాఁడువ్వీళులూరుచుం బలుక నుత్పలగంధియు నోమహాత్మ" ౭. ౧౦౮. అనిప్రయోగించెను. అనంతునకుఁ బ్రాచీనకవిప్రయోగము లక్ష్యములై యుండును. 360. ఎలసి = ఇచ్ఛగించి 369. తనికిన = తాఁకినయెడల.

371. చదలు = ఆకాశము. 373 మహోదయుఁడు = అగ్ని. 376 తెప్పఱి = మూర్ఛతేఱి. కడలశ్ను = తరంగసమూహములు. గ్రాము = గ్రహము. వలి = చేతులు కాళు లీడ్చుకని మూర్ఛనొందించునట్టి. 383. అనిమిష = దేవతలు, చేఁపలు. ఖరదండము = క్రూరదండనము, పరుసనికాము. కుముదము = లోకమునకు సంతోషము, కలువ. 380. విద్రుమ = చెట్లు లేకుండుట, పగడపుతీగలు 385 ఎఱఁగి = దిగి. సమూహి = గుంపు. మేలుకట్టు = వితానము. 391 ఎలమెడు = తేలుచుండు. 393 వన్నుప = వర్ణమే. ఉలివు = ధ్వని. 395 దీనిలోనియతిభేదము పీఠికలోఁ జర్చింపఁబడును. అకరువు = కేసరములు. 397 భండారువు = సొమ్ము 398 కనుబేటంబేటంబు = చూడ్కివలనఁ గలిగిన యనురాగాతిశయము. వివృత = తెఱచిన 401 అక్కిలి = సమీపముగా. ఉచ్చలించి = (దేహము) వడఁకి. కర్క్కక్క = పులకరింపఁగా. అల్క · చల్లఁగా. 403 దలము = లావు. సరలు = రేఖలు. కప్పిరి = నలుపు. వలిసె = సుడిసె, చుట్టుకొనియె. తనరె = విస్తరిల్లెను. 406 డిగ్గఁదావి = (దిక్కు) వదలి. "ఇన్నాతిడిగఁదావి యేనువాఱిన మగతనము నిష్ఫల మగు ననితలంచి." "డిగఁదావిపోవక యగపడ్డవస్తువులు" దశ. ౫. 408. అడలడి = వ్యసనము. 416. సురభులుచేఁపె = కామధేనువులు పాలు పిదికె. 421 ఎడయాడి = ఎడఁబాసి. విసిని = తామర. తావగొని = విశ్రాంతిగొని. వెలదు = వెలువదు. ముదిమి వో-దీని నీరు చంద్రోదకముపలె రసాయనకల్పము కావునఁ బుసర్వ్యాపసమును పయసేయును. అరిమిలి = ప్రేమ. తమ్మితాల్పుడు = విష్ణుఁడు. 426 కఱుకెక్కి = పులకరించి. 431 కాల్గొనక = కాలూఁదనేరక. మొగతిరుగుడు = పెడమొగము పెట్టఁగా. సారి = చక్రము. 435. అబ్బగింపక = ఓర్వక. 446 తరమున = క్రమముగా. పొంపిరిగొన = నిండఁగా. 447 పాలు = భాగ్యము. 449. ఈపద్యమున నాగావిబంధములలో నొకచిత్రము గలపని తోచుచున్నది. 450. దీనిలో గోమూత్రికాబంధచిత్రము సెతముకలదు.

453 ప్రభాసము = కాంతి. 455. రామేశకవియను నతఁడు నన్నెచోడుని కాలమునకుఁ బ్రఖ్యాతుఁడై యుండునని ధ్వనితము ఉఱవే = గొప్పతనమా. ఈపద్యదశకము కవి బాల్యముననో యెప్పుడో తెనిఁగించియుండి తరువాత దీనిలో నెక్కించుకొన్నట్లు తోచుచున్నది. 461. ఆత్మవాదులు = కపట వేదాంతులు, లేక కపట యోగులు. వ్యవసాయవాదులు = వ్యవసాయమున నపూర్వమార్గముల నుపదేశించి ఫలాధిక్యముఁ జూపుదు మనెడు కపటదేశికులు. కన్యావాదులు = కన్యలఁ దెచ్చి వివాహము చేయించి ద్రవ్యముగొనువారు. దివ్యౌషధవాదులు = రసాయనౌషధములచేఁ జిరజీవులుగాఁ జేయుదు మనువారు. ధాతువాదులు = తాళకహింగుళాదిధాతువుల రూపాంతరములఁ గల్పించువారు. 463 ఆధారాధేయ = దేహజీవాత్మరూపసంబంధము వదలి పరమాత్మను బొందుదురు. 466 ఉదరిపడ = భయపడి. 469. గుళ్లు = శిబిరములు (గుంపులు) 471 ఎలర్, ఎరల్ = గాలి. పరభాగలీల = పరస్పర సమానశోభ. 474 వెలుఁగఁ దన్నీరాజనద్యోతు లని మార్చినచో నన్వయము సుకరమగును. 477 పరభాగిల్లుచు = సమానముగా శోభిల్లుచు. 478. హయవర్మ = గుఱ్ఱముల కవచములు. 479 అవయవంబునన్ = సేనాంగములచే, జయఘంట మొదలగునవి. రాజ, అబ్జములు-తారక విరోధి విషయములు. 480 తొడవపోలె = ఆభరణమువలెనే. 482. చామరలు = వింజామరశబ్దములో నీస్త్రీలింగరూప మగపడుచున్నది. కన్నడముననుఁ బ్రతిరూపము కలదు. పడిసేసి = కూలిగా దిన వెచ్చమును నియమించి.

485. హంసములు వర్షోదబిందువుల కోర్వఁజాలక వర్షర్తువున భూమి నుండి మానసంబునకుఁ బోవునప్పుడు క్రౌంచ మడ్డపడి మార్గనిరోధమొనర్చె. 486 పెట్టు = ఆహతి. ఇరుమెయి = రెండుప్రక్కల, అచ్చరువు = ఆశ్చర్యము. ప్రాకృతకర్ణాటకముల నచ్చరియమని తద్భవము. తెనుఁగున నచ్చెరు వచ్చరువని రెండురూపములు గలిగె. 491. అఱకొనక = ధర్మమునాలోచింపక. (అఱ = ధర్మము) దొఱవు = క్షేమము. 498. పూన్చి = సేనాంగములు పూనిచి. 503. నోటికండ = భయము. మార్పలసిరి = శత్రువులై గుమిగూడిరి. (మాఱు = శత్రువు) 501 శబ్దాలంకారము. 508. మన్నాన = భూమియాన. "మణ్ణాసయుఁ బొన్నాసయుఁ । బెణ్ణాసయు లేని వారు పెన్నిధులనుచున్" కాళహ, 516. ఓర్చుడు = ఓర్చుట, వావిరి = అనుగతముగాఁ జూపెడు.

516. రజ్జుచెప్పుడు = ప్రల్లదములాడుట. చూతె = చూచితివా. 518, తార. కవి, రచిత. ఇందుఁ గవియనఁగా శుక్రుఁడని గ్రహించినను శబ్దశ్లేష పను పడదు. నన్నె చోడునికాలమునఁ ప్రఖ్యాతులగు తారకవియుం షణ్ముఖకవియు నుండిరని తోచుచున్నది. 519. ఎడసొచ్చి = నడుమఁజొచ్చి, 423. పురుష రత్న = శ్రేష్ఠులగు పురుషులు, పురుషజాతి రత్నములు. వజ్రాదులు, 536. ఉఱఁడు = సరకుసేయఁడు. కలితనము = శూరత్వము. (సామర్థ్యమనుట దోషము) కలియనఁగా శూరుఁడు. "కలిపందె యెందు బగెయదె। కులజం కుల హీన నెందు బగెయదె తరుణం। సలెవృద్ధ నెందు బగెయదె। నెలసువనిన్నిం నికృష్టరెంబరు మొళరే." గదాయుద్ధం. ౯—౯. (ఇందశ్వత్థామ రాజ్యలక్ష్మిని దూషించుచున్నాఁడు. కలిపందయనుచుఁ దలఁపక కులఁజుడు కులహీనుఁడనుచుఁ గొంకక యువవృద్ధులలో వివేక మెంచక యలరెడు నీకున్ నికృష్ట లనగాఁ గలరే.") కలితనమునకు—"నినగేనం పెళ్వె నాకామన కలితనముం వీరనా దంగె" లీలా ౧౧, ౭౧. 526. పవిపలని = వజ్రాయుధపుశక్తిని. పలుకు = తిట్టును. ఏర్చుడు = కాల్చుట, 528. వేల = దాస్యము. కొండిక = బాలుఁడు. కోలు = కొనుట. 529. "ఇంద్రునిమంత్రి దుర్మంత్రమున నింతచేసె" 530. కుదుము = ముద్ద. (ఇప్పడ పుట్టినవాఁడు) తాను = దేవతలు. అక్కల = అయ్యో ఎత్తికొంటిరి = ప్రయత్నించితిరి, 531. చెనయుడు = చెనయుట.

535. గాలాము = చేఁపలఁబట్టుముల్లు. గద = దండము. కొమ్ము = శృంగము. ఎఱ = ఆహారము. ఎరియ = మంత = కాల్ప. 536. వెలువు = కంచె. 537. పసుఁబావ యను రూపమే సాధుపని తోచుచున్నది. "పసని మొగంబులు = లేఁత మొగము లనుచోటనుఁ బసుని యని ప్రాచీనరూపము గలదు". తలము = శక్తి. 538. గంథము = గర్వము. 543. మాత్రుఁడు = మావటివాఁడు. 556. తలియకు = పంపకు. 557. ఇమ్ము = ఇరక్కట్టు. ఎడపు = ఎడఁబాటు. 561. తెలచు = కోపము తేర్పించు "శూరుఁడు ఖడ్గము శత్రువులపైఁ బ్రయోగింపక పంచయై మగిడిపచ్చెనేని ప్రణయకోపమున నున్న ప్రాణేశ్వరి పైకిఁగాక మఱియెవ్వరిపైఁ దనఖడ్గముపయోగింపఁగలఁడు." 562. అనిచావు = యుద్ధభూమరణము. 563. పై పెట్ట = పైకిపచ్చికొట్టిన ప్రహరణము నకు. 564. ఈ పద్యములోని శ్లేషార్థము నాకు స్ఫురింపదయ్యె.

572. ముష్టి = వెంబడి. 578. "అమృతాబ్ధి . . లేక" పోల్చిచూడుఁడు.

"పాలమన్నీటిలోఁ బవ్వళించినయట్టి నీలవర్ణుఁడు నిద్రమేలుకొనియె" విక్ర. యాదము = నీరు. సప్తమికిఁ బ్రథమ చింత్యము. గోపతి = నంది. ఉఱుమ కించి = ఉఱిమి.

575. ధారలు = సైన్యపు మొనలో ముందఱిభాగములు. "ధారాసైన్యాగ్రిమ స్కంధే తురంగగతి పంచకే" వి. ప్ర. తలతంత్రము = యుద్ధభూమిలో మొదట సవరణఁ జేయఁదగిన నాయకుల సమూహము. సహవాసులు = కుబ్జక్లీ బాద్యంతఃపురరక్షులు. 582 అరదము = రథము. ఇది తత్సమపదమని తోచు చున్నది. 587. ముంగలి = ముందఱగా. పింగలి = వెనుక. వాగు = సైన్యము. 590. పించు = పొడి = పిండి, 594. ప్రోవిడు = కుప్పవెట్టు. 595. పీలి తొంగళులు = నెమలి యీకలకుచ్చులు. 597. నిట్ట = చక్కఁగాబైకి. 600. మండియ = చావడి. వీళ్లు = శిబిరములు. 604. తర్గంగా = తగ్గఁగా. నుర్గా డన్ = నుగ్గుచేయఁగా. మర్గింతు = మ్రగ్గఁజేయుదును. తర్గు, నుర్గు మర్గు— ప్రాచీన రూపములు. 605. మార్పెట్టక = ఎదిరించి కొట్టక. 606. మగ్గి = మ్రగ్గి. ఉఱిపినక్రియ = కోసినట్లు. కఱికండలు = రూపాంతరము. "నుడియెచ్చం కడిఖండమాగె" పంపరా-౯-౧౨౮. 607. బాకు = చేయిాఁటె. నీరు = ధార. గొడుగును ధ్వజమును బట్టుకొనుట జయచిహ్నము. గొడుగు క్రిందివాఁడు సేనాపతియే. 610. కవిదల = ఆక్రమణము. నవడికాఁడు. నవడినిధరించిన వాఁడు. ఎడ్డలు = హృదయములు. ఈట = ఈఁటె. కడితల = పొడిచెడు నాయుధ విశేషము. లేక కేడెము. "కెంబలకెయతొలపింసంధ్యాంబుదమంప డెదు జడిదు కడితలె దూగుత్తంబిడదెసిడిలబలగమిౕదెంబి నెగం తాగిదత్తు భార్గవ సైన్యం." అనం. ఎంప = ఎముకను. ఉర్పుడు = కోసివేయుట. ఏనిక = ఆయుధ భేదము. ముక్కొయ్యలు = మూఁడుతునుకలు. గుంటు = ఒక యాయుధము. మాఱుపీట = విరోధిమొనలో. 612. మునుము = తరము = క్రమము. పందల = కపాలము. "రాహుమండల ప్రాయమెనిప్పదాన వరపందలెగళ్ రవి మండలంబరంౕపాయె" పంపరా. ౧౩. ౬౭. సూర = బలి. పేర్చు = విజృం భణము. "మృదుమాధుర్యరచస్సుధాంబుధిగె పెర్చంమాళ్పచంద్రోదయం మద సంపూజిపమంత్రదేవతె" జగ 614. పుడమిశబ్దము సంస్కృతమో లేక కర కంఠాదిశబ్దములు వోలె సాధువులయ్యెనో కాని యాంధ్రకర్ణాటభాషలలోఁ బుడమీశాది సమాసములు బహుప్రామాణిక ప్రయోగములలోఁ గానవచ్చు

చున్నవి. కన్నడమున "పొడమీశంగదెయ నెతి తిరిపిద నాగళ్" గదా. ౮—౪౦.

616 పొడవు = కేవలరూపమును జూడఁగా. ఆషలు = స్త్రీలు. ఆలు = స్త్రీ. తూఱు = ప్రవేశించు, ఎత్తు = పైకెత్తివచ్చు. పోరు = యుద్ధము సేయు. 518 తెరలు = చెదరు 620. గాలిపడగలు = వీరధ్వజములు, పెంద గడియ = ఆకాశబాణములు. వఱడియలు = కరదీపికలు. వీరమద్దెలలు = బిరు దందెలు. 622 ఇచ్చుడు = ఇచ్చుట. ఆయము = ఆయువు. లెయ్యము = నెయ్యము. 624 ఓలము = దాఁపఱికము = మఱుఁగు. కూర్చు = ప్రేమించును. ఆలమునేసి = బయలుపెట్టి. ఆలనె = స్త్రీనా. 625. కాన్పు = చూచుట. "నేనే దేవకామినినియై యుండఁ బోరఁ జచ్చి వేఱదేవాంగనలఁ బొందుటకెట్లు ప్రియుఁడు సమకట్టెనని సంచలించె.'' 635 పడవాళులు = చిన్న సేనాపతులు. 637 ఈవి = ఇచ్చుట. 638 అంగతలత్రములు = కవచము, గోధ. 641 మహామాత్రులు = మావటీలు. 645. జయచూళి = ఒకవ్యూహభేదము. "మకర వ్యూహం బొండెను వికటాస్యంబై నయట్టి వీరాననచూళికయైనఁ బన్నిచనునది ప్రకటితశౌర్యమున నెదుర భయమొదవునెడ౯" అని ప్రాచీనలక్షణములలోఁ జూళిశబ్ద మగపడుచున్నది.

646. మేఘడంబరములో = ఆతపత్రములో. "తలెవరిదానెసుత్తి పలవుం బరెత ళిలె మేఘడంబరం। లలనెయరిక్కెచామరమ" పంపరా. ౫—౧౦౮. అరద = రథ. తమ = చీకటి. రజశ్శిరస్తమోమనశ్శబ్దము లకారాంతములు గలవు. ప్రాయికముగా నాంధ్రమున మువర్ణకమువచ్చు నకారాంతశబ్దములకెల్ల సంస్కృతమున నకారాంతరూపములు గలవని తోచుచున్నది. "శిరోవాచి శిరశ్శబ్దో రజోవాచి రజస్తథా । శిరశ్చరజ ఇత్యేవ మకారాంతేచ పుంసిచ'' "రజోగుణే విషేపుష్పే రాత్రే స్వాంతే గుణేతమః'' శ్రీహర్షుని అమరఖండము. "తమః పుంసి గుణేరాహౌ ధూళిధ్వాంతార్తవాటిషు । తమాతమీతమశ్చాపి ధ్వాంతాదిషు నమీహితం" మంజూషా. 653 కాఁపువచ్చు = ఏలుటకువచ్చు 659. పొలుపు = చక్కదనము.

661 దాయవారి = శత్రుపక్షముయొక్క. దొరవారి = ప్రభువును (తారకుఁడు-ప్రభువుగాన నట్టిపేరుగలవారిఁ బెక్కండ్రను) ఇట్లె-రాచవారు = రాజు, ("కోయిల రాచవారి" = కోయిలరాజును. ఉ. హరి.)

665 వందల = పుట్టి. 672. రేపు = విజృంభించు. 673. చేతులువీచుట-యుద్ధానుజ్ఞ నొసఁగుచిహ్నము. "అంతుబందుకై వీసువుదుం" పంపరా. ౧౩-౯౫. 687. నోళ్ = నొవ్వఁగా. 688 బరులు = ప్రక్కలు. 690 సలమున = చలమున. మార్బలము = శత్రుబలము. "ఊర్వలదచతుర్బలముం దోర్బలమంమెఱెదు మీఱి కాదువ పదదొళ్। మార్వలమం." పంపరామా ౧౦-౧౯౯. సలరేవం = చెలరేఁగునకుఁ బ్రాచీన రూపము. 692 గఱి = (బాణపుంఖములకుఁ దగిల్చియుండు) ఱెక్క. "వికసితనీల నీరజదళం బొలిరల్గఱి" కాదం - ఉత్త. ౬౧ మొల = చీల. సలలు = వత్తులు. పెడులు = పెట్లు = విచ్చు. 694 తొట్టుకొని = ఒకటినొకటి యొరసికొని = నిండి. 695 నెక్కిరి = దగ్గఱించిరి = క్రిక్కిఱిసిరి. వెక్కిరి = వెక్కిళ్ల విడిచిరి. 700 నఱుము = పొడి. నెత్తురుపొత్తు = రక్తసంబంధము. "కుహనా వరాహంబు కూర్మినెత్తురుఁబొత్తుచుట్టంబు లక్కాన సూకరములు." ఉద. ఆ-౩. 704 గజజాతులు. మూఁడు. "భద్రమందమృగభేదత స్త్రిధా జాతిరత్ర కరిణాం పురోదితా" వీనిమిశ్రము సంకీర్ణజాతి. ఆసనములుమూఁడు "క్రమాత్త్రీణ్యాసనానిస్యుర్ముఖ్యమధ్యాధమానిహి। ఏకఃప్రసారితః పాద స్తదన్యో నత జానుకః। పాశ్చాత్యమాసనం జ్ఞేయ మేకం జానుగతంబుధైః..." అంకుశచారణలు షడ్భేదములుగా నవీనులు గ్రహించిరి. నన్నెచోడాదిప్రాచీనులు నాల్గు విధము లనిరి. "వితానేచ విదుర్గీ్రవానిర్యాణే మస్తకేపిచ। అవగ్రహేచ జానీయాత్ షడ్విధాంకుశచారణా" ప్రణిధులు = మావటీని యాజ్ఞఁ దెలుపు మార్గములు. ఇవి మూఁడు. "వాక్పాదాంకుశచోదనా ప్రణిధిరిత్యుక్తా" ప్రచోదించుచు = తోలుచు. మొగవడంబు = ముఖకవచము. వీసర = వెలిఁతిఁబడి. 713. ఉరివము = కోత. 715. మార్బలము = శత్రుబలము. అత్తలఁ = ఆప్రదేశమున. "అత్తలసురారి బెనసిద నిత్తల్ రుద్రావతార నెళదుద్యప" గదా. ఆ - ౯ - ౨౨. "చావుతలనైన నించుక సత్యవాక్య ముగ్గడింపు" భోజ -౫ ౩౧౫. 719. అడగొని = అట్టలుకట్టి.

726 చోఱ = మత్స్యము. 730 అఱమి = ఒత్తి. 731. వెక్కువు = పెక్కువ = ఆధిక్యము. 737 రాటనము = రసము తీయుయంత్రము. గుంద్ర = త్రిప్పెడుపైగుండు. 738 అలువు = అలుగు. 739 బరులు = పక్కలు. తెట్టి = చీలి. ఎఱఁగి = ఆరోహించి. (ఇది యవరోహణమున సాధారణముగాఁ బ్రయోగింపఁ

బడును.) 740 నెరణి = మాంసము. వేతాలుఁడు = భేతాళుఁడు 744 ముష్టి = తత్క్షణము. 759 అడగొని = అట్టకట్టి. 760 కెద్నెరను = కలసిపోయి. ఖరదండ = జలపుష్పము. ఆయుధవిశేషము. రెండర్థములకును "కృష్ణం మదేభ ఘటాకోటిగళత్తి బర్పఖరదండంగళ్ విఖండంగళా । గెఘనధ్వాంతమనెద్దియెపాటి పుదిదిర్దాకాశవారాశి ఘోరఘన్మోరిప్రకరంబొలేనినిసువేగంకణ్ణగుర్వాదుదో" జగ. 763. అరదకమఠము = రథము లనుకూర్మములుగలది 768. తవిలించిరి = ప్రేమింపఁజేసిరి. 773 కైవీఁగి = చేవ్రాలి. 774. సలలు = వత్తులు. 784 పక్కర = పక్కెరలకుఁ ప్రాచీనరూపము. కందియన = కందెన. 801 కనువడి = తాఁకునట్లు.

802.ముట్టి మూదలించి = తాఁకునట్లు మర్మస్ఫోటనము లాడి పిలిచి."హరి సంధానక్కె వందం దవగడిసిదహంకార మెల్లిత్తొ కృష్ణాం । బరకేశాకృష్టియం మాడిసిదమద మెల్లితొ కౌంతేయరంమ । చ్చరదింకాంతారదోళ్ తిఱ్ఱనె తిరుపిద సౌర్క్కగ శేనాదుదెం దా । కురువంశాధీశనం మూదలిసిద నదటం భీమ నుద్దామ భీమం "వ" అంతుముట్టి మూదలిసియు మెంతుం పొఱమడిసలాఅదె." గదా - ఆ ౭. ౧౯. తాఁకినముష్టిన = తాఁకిన వెంబడి. 807. ముప్పిరివడ = పంక్తిపైఁ బంక్తి పడునట్లు 828. విగుర్వణము = విజృంభణము. 842 కట్టు = కట్ట, 845 కవిదల = ఆక్రమించుట. 856 పొదివిరిసి = కట్టువదలి. కుముదము = వ్యసనము. సురరాజు = ఇంద్రుఁడనుచంద్రునియొక్క. 867. కుఁదెలు-కుంద్రెలు - ప్రాచీనరూపము. (కుంద్రు = కొండ. ఎలు = ఎలుక.) 861 కరువపోలె = కరువు పోలెనే, గణప = ప్రమథగణపతులనెడు.

882. కవి = పూపున. కునిసియాడ = నాట్యమాడ. "గంధర్వరంతల్లి గాయన రింద్రాంగ నెయర్కళల్లి కుణివర్" అజి - ౪ - ౮౩, "లయదిం దెళలదె కుణిదర్ కెలబర్ కళరుతిగళె తాలమాగె కుణిచర్ కెలబర్"అజి - ౫ - ౩౦. "ఆనందం బెర సంకదచ్చరసెయర్ దేవేంద్ర నైరావతా । లాన స్తంభసమంగళప్పభుజసందోహంగళోళ్ వీరకాం । తానీకక్కెణెయాగె కూడెకుణిదర్ మత్తం కెలర్ నోడిసూ । చీనాట్యంగళనాడిదర్"ఆది, ౭ - ౧౨౩. 887.నసియాడిరి = తెంపాడిరి. 892. తావికొని = ఇటునటు పొలయించి. 902. కాఁచినమద్దులు = కొంచెము కాల్చిన నల్లమద్ది ప్రమాకులవలె. 936 ఎత్తికట్టె = నిలుపుకొనెను. 945 ఉద్ద = ఊరక. 946 అపమానము. "అపమానిసి దర్బాలా। తపమెలసిద పుండరీక షండదసొబగుం । చపలాక్షియ కోమలపా। ణిపల్లవ స్పర్శ హర్షదిం

రఘురామం'' పంపరా. ౫ - ౧౩౧. 953 ప్రోవెట్టు = కుప్పవెట్టును. 960 కొమ్ములు = వింటికొనలు, ఏనుఁగు కొమ్ములు. 963 గడనము = సమూహము. 972 అగుర్వుగ = భయంకర మగునంతయధికముగ. ''మొనయొళ్ భైరవనం తగుర్వువడెడం రామానుజం'' పంపరా - ౯ - ౧౨౩. 974. ''భుజా స్తంభా గ్రమున జయశ్రీఁబొందె సాలభంజికవిధమున'' — ''శ్రీరాస్తాం మనుమక్షితీశ్వరభుజా స్తంభే జగన్మండల ప్రారంభస్థిరభారభాజి దధతీ శ్రీసాలభంజీశ్రియం'' నిర్వ - ఆ ౧ - ౧. 977. చనుము = సమూహము, ముక్కున బంటిగ = సహింపరానియట్లుగ. 980 ఈచక్రబంధమునఁ గృతిపతి, కృతికర్తృ కావ్యనామములు గానరావు. 987. పరిపూర్ణముగా మనోనురాగాదుల దంపతులకుఁబరస్పర సారూప్యసాయుజ్యములు కలిగినను దేహము లెంతయైక్యభావము సెందినను వేఱయై యుండుటచే వారి సాంగత్యమున నింకయు విరహావస్థ కొంతయున్నట్లే కావునఁ బరిపూర్ణానంద సాయుజ్యమునకు మనంబకాక దేహములు నైక్యమగుటకే యర్ధనారీశ్వర రూపము కావలసి వచ్చెనని కవి శృంగారస్థాయి విభావమునకుఁ బరమోచ్చగతిని వర్ణించెను.

994. నన్నెచోడునికాలమున బృహత్కథ పఠనీయగ్రంథమైయుండును. 995. ఉద్ధృతకందము-భవబంధనములఁ ద్రెంచుచు భువిలో నజ్ఞానపదముఁ బొందక ప్రాజ్ఞుల్ । శివుఁగొల్తు రచలభావన దవులఁగ సుజ్ఞానయోగ తత్త్వవిధిజ్ఞుల్. 997. ఉద్ధృతకందము—మనమారఁ గొల్చుదరు దాతనిఁ గొల్చియు నాదిబోడ దాఁబొరయునెఘా । జనదారుణోగ్ర శరపాతనియు కపదంబునందుఁ దాఁ బొరయఁడు పో. 998. హఠాదియోగులు మాంసాహారము రోగరాగజనక మనిరి. భగవద్గీతలో - మాంసాహారము రాజసాహారమని త్యాజ్యమని చెప్పఁబడఁగా శివయోగరాజయోగముల దాని నిషేధింపకుండుట యూహ్యము. ఏ యోగము నందును ప్రారంభమున భోజన నియమము కలదు. నియతేంద్రియుఁడై చిత్తసమాధివైకల్యము చెందకుండెడు స్థితిలో నాహారనియమమును బాటింపరు. అట్టి విజ్ఞానదశనే కవి సూచించెనని తోచుచున్నది. 999. ఈ పద్యమున క్షేత్ర క్షేత్రజ్ఞ సాయుజ్యస్వరూపమును గవి వర్ణించుచున్నాఁడు. క్షేత్రమనఁగాఁ బంచవింశతి తత్త్వములు. ''బుద్దీంద్రియాణి సార్థాని మనః కర్మేంద్రియాణిచ । అహంకారశ్చ బుద్ధిశ్చ పృథివ్యాదీనిచైవహి । అవ్యక్తమాత్మా క్షేత్రజ్ఞః క్షేత్రస్యాస్యనిగద్యతే.'' 1004. ఏఁచ = వెలుఁగెక్కువసేయుటకు. నిల్ప = స్థాపింప (ఆవాహింప).

# ముఖ్యపాఠభేదములు

**మొదటి సంపుటము**

| పద్యసంఖ్య. | పాదసంఖ్య. | |
|---|---|---|
| 18 | 3 | గాదెద్ద నజుండు నోపని |
| 22 | 1 | కరములు దునుముడుఁ |
| 23 | 3 | రంధ్రవిషయం బునఁజనఁ జాళుక్యరాజ మొదలుగఁ బలువుర్. |
| 32 | 1 | తద్జ్ఞునం దెగ్గినగు... కనకవర్ణోత్కర మ్మొరకంట నొరసి చూచికా కెల్లవచ్చునె సుద్దజాత. |
| 53 | 1 | డయిమేటి పాకనాడిరువది. |
| 558 | 1 | సంతకన్ను. |

**రెండవ సంపుటము**

| | | |
|---|---|---|
| 6 | 1 | నిండువెన్నెల |
| 6 | 3 | నడచునటు నడచు |
| 9 | 3 | విగ్గోరుదీగలు |
| 43 | 1 | చదుయ్యహ। విలఁబురసతి. |
| 44 | 4 | నెత్తినరాగదీపికలు వోలె. |
| 49. | | రధ్యాకురవ్యాకీర్ణంబు |
| 60 | 4 | సచేతనస్థితిన్ |
| 66 | i | వెలిమిడి నదంబు. |
| 66 | 5 | గళకంబు తొనల జడలను దల నుదుట మెడనిండఁ దాల్చి పొల్చున శంభునోర్తు |
| 99 | 1 | కుహరంబు లెఱదిఁ |
| 111 | 1 | లెడ |
| 120 | 2 | విటవిటియలు నిలిచిరి పురము వీధులందభినవమై. |
| 126 | 2 | ప్రవికిత్స కీ |
| 127 | 3 | నమరలేమ |
| 135 | 6 | కండువు. |
| 159 | 1 | చెఱచినవుచ్చకరిముల....దరుణులఁజే....వడయన్. |
| 176 | 4 | బల్కి |
| 209 | 1 | ప్రభ తనుకాంతులెలయ నీదను లీల. |
| 223 | 3 | మలయాద్రితటమున |

| పద్యసంఖ్య. | పాదసంఖ్య. | |
|---|---|---|
| 286 | 2 | వెల్లచనియె. |
| 329 | 3 | జక్రియాగము |
| 330 | 2 | న్నరయరె. |
| | 1 | సందించుచున్నట్లు |
| 373 | | గూల్చిలినదీపికాశ్య నాకినదిపికాకృతిన్ |
| 383 | 4 | శరణవసరసి |
| 415 | 4 | సంభవంబులందెలన్. |
| 421 | 1 | నెడయాడి వినివి కాలిచ్చలో, ముదిమితో |
| 494 | 4 | గనియంగా రోవమందారకున్ |
| 531 | 2 | కారణ వనవహ్ని కెచ్చటితృణకరంబు. |
| 537 | 6 | పసుఁబావ |
| 538 | 1 | కళాబంధంబు. |
| 538 | 3 | నె య్యనిపైనెత్తిన. |
| 543 | 4 | మహామాత్రుక్రియన్. |
| 567 | 1 | మదనవతీలోల |
| 584 | 2 | పరమేశ్వరునంబుధిఁబోలి |
| 615 | 1 | సేవకునమ్మింపవలయు. |
| | 2 | సంగరాంగణంబునం |
| | 6 | కాయ్పుతో. |
| | 4 | నిర్భేద్యులాద్యుల్ |
| | 3 | విన్నాణములుసూపు. |
| 681 | 2 | హరణవులుశబ్ద. |
| 687 | 2 | నోఁబోట్లు |
| 910 | 3 | యెక్కడనంచు. |
| 923 | 2 | చెరువాడిరి. |
| 977 | 1 | ముక్కునబందిగ |
| 980 | 4 | శాక్తెయో. |
| 1001 | 3 | లోకాఖ్యమకామ్యదుస్పదిత కుంభ. |
| 1004 | 4 | శేఖరుఁడు సకలముని ముఖ్యుఁడు. |

## కుమారసంభవవ్యాఖ్యానోదాహృత గ్రంథ నామసంకేతవివరణము.

భార = కవిత్రయమువారిభారతము.
విజ = తిక్కన విజయసేనము.
హరి = ఎఱ్ఱప్రెగ్గడ హరివంశము.
నృసిం = నృసింహపురాణము.
భేతా = కవిభల్లటుని విక్రమార్కచరిత.
కలా = నన్నెచోడుని కళావిలాసము.
ప్రద్యు = విన్నకోటపెద్దనప్రద్యుమ్నచరిత
కావ్యా = కావ్యాలంకారచూడామణి.
కుమా = ఎఱ్ఱప్రెగ్గడ కుమార నైషధము.
మల్హా = ఎఱ్ఱప్రెగ్గడ మల్హణకథ.
నైష = శ్రీనాథుని నైషధము.
కాశీ = కాశీఖండము.
ఉ. హరి = నాచనసోమునిహరివంశము.
సప్త = శ్రీనాథుని సప్తశతి.
వల్ల = వల్లభాభ్యుదయము.
అని = పెమ్మనయనిరుద్ధచరిత.
విక్ర = జక్కనవిక్రమార్కచరిత.
నీతి = భద్రభూపాలునిరాజనీతి.
హరిలీ = తెనాలిరామలింగని హరిలీలా
విలాసము.
కంద = రామలింగనికందర్పకేతువిలాసము
పద్మి = పేరయ పద్మినీవిజయము.
నిర్వ = తిక్కనయుత్తరరామాయణము.
విక్రమ = అమరేశ్వరునివిక్రమసేనము.
శివ = కవిలోకబ్రహ్మ శివజ్ఞాన దీపిక.
సావి = తులసిబసవనసావిత్రికథ.
దశ = కేతనదశకుమారచరిత.
కాదం = కేతనకాదంబరి.
వీధి = వల్లభరాయనివీధినాటకము.
ప్ర.ప్ర = సూరనప్రభావతీప్రద్యుమ్నము.
ఉద = సూరనయుదయనోదయము.
శాకుం = పినవీరుని శాకుంతలము.
కువ = ఏర్చూరిసింగనకువలయాశ్వచరిత.
ప్రద్యుమ్న = మాధవునిప్రద్యుమ్నవిజయము

కన్నడమున

కవిరా = అమోఘవర్షునికవిరాజమార్గ.
విక్రమా = పంపకవిభారతము.
గదా = రన్నకవిగదాయద్ధము.
జగ = జగన్నాథవిజయము.
అర్ధ = నేమిచంద్రునియర్ధనేమిపురాణము.
మల్లి = అభినవపంపనిమల్లినాథపురాణము.

ద్రవిడభాషలో

జీవ = జీవకచింతామణి.
మణి = మణిమేఖలై.
కలిం = కలింగత్తుబరణి.

సంస్కృత ప్రాకృతముల

గౌడ = వాక్పతిరాజగౌడవధ.
సేతు = ప్రవరసేనుని సేతుబంధము.
నవ = పద్మగుప్తుని నవసాహసాంకచరిత.
కుమా = ఉద్భటునికుమారసంభవము.
కలా = క్షేమేంద్రునికలావిలాసము.
శ్రీకం = మంఖకశ్రీకంఠచరిత్రము.
మంథా మంథానభైరవకల్పము.
ఖండ = ఖండకాపాలికతంత్రము.
రసా = సిద్ధరసార్ణవము.
రసర = నిత్యనాథునిరసరత్నాకరము.
ఔచి = క్షేమేంద్రుని యౌచిత్యవిచారచర్చ
మఱియును.

అధర్వణఛందము, కవివాగ్బంధనము, కవిలోకసంజీవని, లక్షణసార సంగ్రహము. (పెద్దన), లక్షణశిరోమణి (వేంకటకవి), అప్పకవీయము, కవిజనాశ్రయము (గోకర్ణుడు) మొదలగునవి.

## వివరణము:

రామకృష్ణకవిగారు 12 ఆశ్వాసముల 'కుమారసంభవము' ను రెండు భాగములుగా వేర్వేరుకాలములలో ముద్రించిరి. మొదటి సంపుటమందు (1909) ఏడు ఆశ్వాసములును, రెండవ సంపుటమందు (1914) తక్కిన ఐదు ఆశ్వాసములునుకలవు. నేటి ఆచారము ననుసరించి కవిగారు ప్రతి ఆశ్వాసమునకును వేరువేరుగా పద్యసంఖ్యనీయలేదు- మొదటి సంపుటమున నేడు ఆశ్వాసములందలి మొత్తము పద్యసంఖ్య 996; ఇక రెండవ సంపుటమున నైదాశ్వాసములందలి మొత్తముపద్యసంఖ్య 1009. పాఠకుల సౌకర్యమునకై కవిగారి ముద్రణమును ఆంధ్రప్రదేశ్ సాహిత్యఅకాడమివారు ప్రకటించిన ముద్రణముతోపోల్చి ఆశ్వాసముల పద్యసంఖ్యలను వివరించుచున్నాము-సం॥

| ఆశ్వాసము | కవిగారిముద్రణలో సంఖ్య | అకాడమి ముద్రణలో సంఖ్య |
|---|---|---|
| ప్రథమ | 1-135 | 134 |
| ద్వితీయ | 136-243 | 110 |
| తృతీయ | 244-356 | 113 |
| చతుర్థ | 357-479 | 123 |
| పంచమ | 480-657 | 178 |
| షష్ఠ | 658-831 | 172 |
| సప్తమ | 832-996 | 160 |
| అష్టమ | 1-199 | 199 |
| నవమ | 200-366 | 167 |
| దశమ | 367-570 | 206 |
| ఏకాదశ | 571-781 | 214 |
| ద్వాదశ | 782-1009 | 229 |

# 3. క్రీడాభిరామము
## వల్లభరాయఁడు

ఇక్కవి హరహరరాయల భండారమున కధ్యక్షుఁడు. ఆతని గ్రంథము క్రీ. వె. 1420 లోఁగా రచితమైనది. అనఁగా శ్రీనాథుఁడు నైషధము తెనుఁగు చేయునంతకు రచింపఁబడెను. ఇతనితండ్రియగు తిప్పన్న "గంధవతీప్రతీర పురఘస్మరపాదబిసప్రసూన పుష్పంధయచక్రవర్తి శ్రుతిపర్వతదుర్గ మహా ప్రధాన రాడ్గంధగజంబు" అనియున్నందునఁ ద్రిపురాంతకదేవుని పాదభక్తుఁడనియు, వినుకొండపరిపాలకుఁడనియుఁ దెలియుచున్నది.

ఈగ్రంథకర్త నెల్లూరను బెనాకినితూము కాలువను గట్టించినట్లు "నెల్లూరి తూముకాలువ హల్లకములకమ్మఁదావినపలాపించు౯" అనుటచేఁదోఁచుచున్నది. ఇది సంస్కృతమున రావిపాటిత్రిపురాంతకుని ప్రేమాభిరామమను వీథినాటకమునకుఁ దెనుగు. మూలగ్రంథము నాకులభింపలేదు. ఈత్రిపురాంతకుఁడు, త్రిపురాంతకోదాహరణమును, మదనవిజయమను రతిశాస్త్రమును, అంబికాశతకమును,దారావళియును రచించియున్నాఁడు. ఉదాహరణ మనఁగా నొకవృత్తము, నొకకళికయు, నొక యుత్కళికయు నిట్లేవరుసగాఁగల కృతి. ఈగ్రంథమును నేను పూర్ణముగాఁజదివినాఁడను. ఆంధ్రముననిట్టిహృదయంగమమైన భక్తిరస ప్రధానమగుకృతి పెక్కులులేవు. మదనవిజయము వాత్స్యాయన ప్రణీతమగు కామసూత్రములకుఁ దెనుఁగు. అంబికాశతకము మనోహరములగు భావములు గలిగిన పార్వతీస్తుతి. తారావళియు సరసభావములుగల చంద్రస్తుతి. ఇతని కవిత్వము మిక్కిలి మృదువై యతి మధురముగానున్నది. ఇతఁడు త్రిపురాంతక దేవుని వరప్రసాదమునఁజనించి తదనుగ్రహముననే కవిత సంపాదించినవాఁడు. ఇతనిని వల్లభరాయఁడు నన్నయ్య తిక్కన భాస్కరామరేశ్వరుల కీడుగాఁ జెప్పి యున్నాఁడు. నాయభిప్రాయమించుక భేదముగానున్నది. అమరేశ్వరుని కవిత మిక్కిలి యర్థగాంభీర్యము గలిగియున్నను ద్రిపురాంతకుని మాధుర్యము దాని యందులేదు. తిప్పరాజు కవిత్వములో భావములు విరళమై, పదబంధమించుక శిథిలమైయుండును. అమరేశ్వరుని కవిత భావకాఠిన్యము గలిగి గాఢబంధము గలది. ఈతిప్పరాజు క్రీ. వె. 1600 శతాబ్దమున నుండెనని కవులచరిత్రములో వ్రాయబడియున్నది. అప్పకవి యుదాహరించిన "సరిబేసైరిపుడేలచోఁ౯,..."అను

పద్యముననున్న రామయభాస్కరుఁడు 1600 సంవత్సరములనుండిన రామయ భాస్కరుఁడొక్కడేయనుటకు నేమి యాధారము. వల్లభరాయఁడు త్రిపురాంతక దేవుని స్తుతింపఁగాఁ బూర్వుఁడు గాకెట్లగును. కాబట్టి యితడు 1350 సంవత్సర ప్రాంతమున నుండియుండును. అమరేశ్వరుఁ డితనికంటెనుఁ బూర్వుఁడు. ఆంధ్రభాషలో 1300–1400 లోన తిక్కన, కేతన, మారన, సోమన, వేములవాడ భీమన, మంచన, అమరేశుఁడు, భాస్కరుడు, రంగనాథుఁడు, ఎఱ్ఱన, మొదటి వెన్నెలకంటి సూరన, త్రిపురాంతకుఁడు–ఈ మహాకవు లందఱు నీధన్యమైన శతాబ్దములోనివారు. హుళక్కి భాస్కరుడు రామాయణారణ్య యుద్ధ కాండములు గాక దశగతులను గ్రంథమును సాహిణిమారనికంకితముగా రచించెను.

చిమ్మపూఁడి యమరేశ్వరుఁడు విక్రమసేన మను మహాకావ్యమును రచించినవాఁడు. అతఁడెఱ్ఱప్రెగ్గడ కంటెను బూర్వుఁడు. రావిపాటితిప్పరా జెఱ్ఱప్రెగ్గడకు సమకాలికుండు. ఓరుంగల్లు రాజ్యము క్షీణించునప్పుడు వీరు చాలఁ బ్రముఖులై యోరుగల్లు కొండవీడు కొండపల్లి నల్లగొండ మొదలగు దుర్గములు తురుష్కులచే నశింపఁగాఁ దత్కాలపు కవుల కావ్యములతో విస్మృతులైరి. ప్రాచీనకవుల కృతులలో బ్రసిద్ధములుగా రామాయణ భారతాదులు లోక వ్యాపకమైనవి గాని మనోహరములయి కేవలము పండితకవివేద్యము లగునట్టి కృతులు మూల కొదిఁగెను. తరువాతను నైషధము జైమినిభారతము గూడ మనుచరిత్ర వసుచరిత్రాదులకుఁ బిదపఁ బడిపోయినవి. విజయ విలాసము–రాధికాసాంత్వనము– హంసవింశతి–తారాశశాంకము లోకానుగ్రహమునకుఁ బాత్రము లయ్యె "ధరణి నధిపులు నూతన ప్రియులుగా గారె" యనునది విద్యార్థుల విషయములోఁ గూడ నిక్కమగుట యెంతయు శోచనీయము. ఇట్టి యాంధ్ర భాషాభివృద్ధి గల కాలమునఁ డెంకణాదిత్యుఁడనియుఁ నమరేశుఁడనియు, నాచనసోముఁడనియు, బద్దెభూపాలుఁడనియు, వల్లభరాయఁడనియుఁ బ్రాచీన కవుల నామములు సెప్పి తత్కవికృతములని కొన్ని లోకవ్యాపకము చేసిన నిదియంతయుఁ గల్లలని చెప్పుచున్నారు. పై చెప్పఁబడిన వారిలోఁ డెంకణాదిత్యుఁడు నన్నయభట్టునకుం బూర్వుఁడు. కుమారసంభవ మను ౧౨ యాశ్వాసముల మహాకావ్యమును రచించెను. భల్లటుఁడు నన్నయకు సమకాలికుఁడు. బద్దెకవి నన్నయ కంటె ౩౦ సంవత్సరములు తరువాతివాఁడు. మఱియుఁదిక్క

నాదుల కావ్యములు విజయసేనాదులు గూడ మాసిపోయినవి; కేవలము తృణ భారములగు తాళీదళ సంపుటములు దేలి కృతిరత్నములు మునిఁగిన యీ యాంధ్రభాషా సముద్రమును దరువఁ దరువ నీ వీధినాటకము నాకు లభించినది. శ్రీనాథుని వీధి నాటకమను చిన్న పొత్తము బజారులలో నమ్మునది ప్రాచీన గ్రంథము కాదని తోచుచున్నది. అప్పకవి శ్రీనాథుని వీధి నాటకములోని వని యుదాహరించిన రెండు పద్యములను జిత్రకవి పెద్దన వల్లభరాయని వీధి నాటకములోని వనియే యుదాహరించెను. ఆరెండును దీనిలో నున్నవి. జగన్నాథకవి రత్నాకరములో సుమారు ౧౦ పద్యములకంటె నెక్కువగా వల్లభ రాయని వనియే పేర్కొనెను. అప్పకవి యుదాహరించిన "కుసుమం బెట్టిన చీరకొంగు" అనునదియు "కందుకకేళిసల్పెడు" అనునదియు దీనిలో యథా స్థానములలో నున్నవి గావున వానిం బ్రక్షిప్తములని చెప్పుటకు వీలుపడదు కావున శ్రీనాథుని వీధి నాటకమిదియే; ఇంక ననేక సందేహములు కలుగుచున్నవి. శ్రీనాథుఁ డోరుగల్లు వర్ణింపఁబనియేమి? వల్లభరాయఁ డెవ్వఁడు? వల్లభరాయని పేర వ్రాయనేల? శ్రీనాథుని బావ యగు బమ్మెరపోతన యొంటిమిట్టలో నుండి రాజమహేంద్రములో నెట్లు బాంధవ్యము చేసెను; ఇత్యాది సంశయములు కలుగును. విషయమును స్పష్టముగాఁ జెప్పు టకు గ్రంథసామగ్రి చాలనందున గొప్పవారు గైకొని పరిష్కరింతురని నమ్మి నాకుఁ దోఁచినయంశము లొండు రెండు వివరించెదను. శ్రీనాథుఁడు సాళ్వ గుండ నరసింహరాయల కాలములో నుండినట్లును తదాస్థానమునసుం బోయి డిండిమభట్టు నోడఁగొట్టినట్లు తెలియుచున్నది- "కుల్లాయెత్తితిఁ గోకఁజుట్టితి.... తల్లీ, కన్నడ రాజ్యలక్ష్మి దయలేదా నేను శ్రీనాథుఁడ౽" అని చెప్పినది నర సింగరాయలయాస్థానమునందే. డిండిమకవిని శ్రీనాథుఁ డోడించెసుగదా-"పగులఁ గొట్టించి తుద్భటవివాదప్రౌఢి గౌడడిండిమభట్టుకంచుఢక్క" అనునది నిక్కమే. ఈ డిండిముఁడే జైమినిభారతము గృతినందిన సాళ్వగుండరాజు విజయములను వర్ణించుచు సాళువాభ్యుదయమను సంస్కృత కావ్యమును రచించెను. తద్గ్రంథాంతమున "ఇతి మండలీకమల హరహండ మేదినీ మీసరగండరాజపక్షి సాళువకతారి......బిరుదమండనస్య గుండయరాజకుమారస్య కుమారసమ విక్రమస్య విక్రమార్కోద్రగపరాక్రమస్య పరకుంజరాక్రమణసింహస్య..... నరసింహరాజ మహారాజస్య చరితే...అష్టాభాషాపరమేశ్వరస్య అష్టదిగ్విజయ పటహీకృతబిరుద డిండిమాడంబరస్య షడ్దర్శనషణ్ముఖస్య శైవశాస్త్రజీవాతేర్వేద

సాగరసాంయాత్రికస్య డిండిమకవిసార్వభౌమ ఇతికృతాపరబిరుద నామ్నః శ్రీమదరుణగిరీశస్య తపఃపాకస్య డిండిమకవిరాజనాధస్య కృతౌ సాళువాభ్యుదయే త్రయోదశః స్సర్గ స్సమాప్తః" అని యున్నది. ఇట్టి కవిసార్వభౌముని నోడించి శ్రీనాథుఁడు సార్వభౌమబిరుదమునందెను. చంద్రశేఖరుఁడను నియోగిపుంగవుఁడు నరసింగరాయల మంత్రియని సాళువాభ్యుదయమున నున్నది. కావున "చంద్రశేఖరుక్రియాశక్తి రాయలయొద్దఁ బాదుకొల్పితి సార్వభౌమబిరుదు" అనునది స్పష్టముగా నర్థమగుచున్నది. ఈ నరసింహరాయలు ౧౪౫౦ క్రీ.శ. లోనున్నట్లు తెలియుచున్నది. ఈ వీధి నాటకములోని వల్లభరాయని తాతయగు చంద్రయ్య బుక్కరాయలకాలములో నున్నట్లును దండ్రియగు తిప్పయ్య హరిహరరాయల కాలములోనున్నందున వల్లభరాయఁడు శ్రీనాథునికాలమువాఁడనుటకు సందేహము లేదు. ఈ వల్లభరాయఁడు విజయనగరరాజులకు రత్నభండారాధ్యక్షుఁడకాక "మూఁడు గ్రామగ్రాసముతోడఁ గూడంగ మోపూరు పాలించెములికినాట" యని మోపూరునకుఁ బ్రభువుగా నుండెను. ఈ నాటకమునకు రావిపాటి త్రిపురాంతకుని మూలగ్రంథముగాని ప్రస్తావనయు నాందియుగల తెలుఁగుప్రతియుఁగాని నాకు లభింప మింజేసి యీక్రింది యంశము సందిగ్ధముగానున్నది. రత్నాకరమునందు వల్లభరాయని వీధినాటకపుపద్యములలోనివని యీక్రింది పద్యమగపడుచున్నది

సీ॥ చంద్రఖండములతో సరివచ్చు ననవచ్చు
విమలదంష్ట్రాప్రరోహములవానిఁ
బవడంపుఁ గొనలతోఁ బ్రతివచ్చు ననవచ్చు
కుటిల కోమల జటాచ్ఛటలవాని
నింద్రనీలములతో నెనవచ్చు ననవచ్చు
కమనీయతర దేహకాంతివాని
నుడురాజరుచులతో నొఅవచ్చుననవచ్చు
చంచన్మ దాట్టహాసములవాని

సిగ్గుమాలిన మొలవానిఁ జిఱుతవాని
నెల్లకాలంబు ములికినాడేలువాని
నధిపు మోపూరసవతారమైనవాని
భైరవునిఁగొలువవచ్చిరి భక్తవరులు.

ఇందువలనఁ బ్రస్తావమున మోపూరు భైరవుని తిరుణాళ్ళకు వచ్చిన భక్తులు రావిపాటి త్రిపురాంతకుని ప్రేమాభిరామమును మోపూరు ప్రభువగు వల్లభుఁడు నూతనముగాఁ దెనిఁగించె దాని నాడిజూపుడని యడిగినట్లుతోఁచుచున్నది. ఓరుగల్లు పురవర్ణనములో మోపూరు ప్రస్తావన మప్రస్తుతాంశము కావున నాటక మధ్యమున నీపద్యము నాప్రతిలో విడిచిపోయె ననుటకు వీలులేదు. ఇఁకవల్లభ రాయనిపేర శ్రీనాథుఁడు కృతియిచ్చునేమోకాని తనపేరు చొనుపక వ్రాయుటకుఁ గారణమేమియో. గ్రంథములో శృంగార రసాతిరేక మని చెప్పినచో శ్రీనాథుని తక్కిన కావ్యములలోని వర్ణనలేమి తక్కువలే ? శ్రీనాథుని వల్లభాభ్యుదయ ములోఁ గృష్ణాతీరమున నుండు శ్రీకాకుళస్వామి తిరునాళ్ళలో జరుగు నసభ్య ములు దీనికంటెఁ బచ్చిగానున్నవి. భీమఖండములో వేశ్యావర్ణనలు ప్రథమాంతా శ్వాసములలో నెక్కువగా నున్నవి. లేక త్రిపురాంతకుని నాటకము తెనింగించె ననుట శ్రీనాథునకుఁ దక్కువయన్నచో నతఁడు స్వయముగా రచించినది యేది? ఈయంశ మొక్కటియే వల్లభరచితమని చూపుచున్నది. ఇఁక శ్రీనాథుఁడు రచించెనేమో యనుటకుం గారణములు - మొదటిది. ''గీ. గార్గ్యసిద్ధాంతమత ముషః కాలకలన శకున మూనుటయది బృహస్పతి మతంబు వ్యాసమతము మనః ప్రసాదాతిశయము'' అను మూడు పాదములు వీధినాటకములోను భీమ ఖండములోఁ దృతీయాశ్వాసమునను మార్పులేకయేయున్నవి. భిన్నులు గ్రంథ కర్తలయినచో నిట్లుండఁ దటస్థింపదు. భావచౌర్యమును గొంతవరకును సమాన వాక్య చౌర్యమును నాంధ్రకవులలోఁ గలవు గాని పద్యమంతయు గ్రహింతురా? ఈవీధియును శ్రీనాథుని కావ్యములును పదబంధమునందును వాక్యక్రమము నందును అన్వయమునందును పదసంచయమునందును సమానములుగానున్నవి. పైన నుదాహరించిన భైరవునిమీఁదిపద్యము భీమఖండములోఁ బ్రథమాశ్వాసమున ౧౦౬ పద్యములో వాక్యవిన్యాసమునఁ బోలిక గలదు. ''అదె దారువనభూమి యసమనేత్రుఁడు వాఁడె సంయమీంద్రుల పుణ్యసతులు వారె'' అనుపద్యమునకు భీమఖండములోఁ బోలికపద్యము గలదు.

క॥ వరుణుని శుద్ధాంతంబున। నరవిందాక్షులకు మించుటద్దం బగుచుᳶ''

అను భీమఖండములోని ఆ-౨-౨ పాదములు క్రీడాభిరామమున ''వరుణ రాజశుద్ధాంత కాంతావిలాస మాణిక్య దర్పణము''అనుటకు సరిపోవును. ఇట్టిభావచౌర్యముల చేతనే శ్రీనాథుఁడు రచించె ననుటకు వీలుపడదు. రెండవది

శ్రీనాథుఁడు పల్నాటివీరచరిత్రమును బాల్యదశలోఁ గొంతమాత్రము రచించెను. దానిలోని కథాభాగమును మరలఁ గ్రీడాభిరామమున నోరుగంట వీధులలోఁ జిత్రములలో వ్రాసి వీరచరిత పాడినట్లు తత్కథ గొంత సూచింపఁబడి యున్నది. మఱియు వల్లభాభ్యుదయమున నాంధ్రవల్లభుని తిరునాళ్ళలోనివిధవా దుర్వర్తనములు శ్రీనాథుఁడు విశదముగా వర్ణించియున్నాఁడు. ఆవిషయమే క్రీడాభిరామమున "గరుడస్తంభప్రతిష్ఠాకలన మొదలుగాఁ గల్పమంత్రోక్తపుష్పాధ్వరపర్యంతంబు కృష్ణాతటినితటమునం ద్వాదశక్రోశ ధాత్రీపరివేషాభ్యంతర శ్రీపరమపదమునం బర్వకాలంబులందున్ బరనారీసంగమాదుల్ భగవదనుమతింబాపముల్ గాకయుండున్" ఇత్యాదులతో గేలిసేయుచున్నాడు. పైకారణములచే నిది శ్రీనాథరచితమోయని సందేహించుచున్నాను. చిత్రకవి పెద్దన ముద్దరాజురామన శ్రీధరుఁడు గణపురపువేంకటకవి జగన్నాథుఁడు వీరందఱును వల్లభరాయని వీధినాటకములో ననియె యుదాహరించియున్నారు. మఱియును వీధినాటకమున మధుమావతీగృహమున నెవ్వఁడో యొక కవివిటుఁడు దానిభూతభావిజన్మముల గుఱించి యొక పద్యమును వ్రాసెను. అందులో మధుమావతి అంగారవర్ణుని కూతురై యిహజన్మమున మధుమావతియై భావిజన్మమున దాక్షారామమునఁ జిన్నిపోతి యనువేశ్యయై తరువాతిజన్మమునఁ దమిలేటి ప్రాంతమునఁ జెంచులకులమునఁ గడిమికత్తులయమ్మి యని జన్మించు నని యున్నది. శ్రీనాథుఁడు శ్రీకాకుళాధీశ్వరుఁ డగుతెలుఁగురాయని దర్శించి యతని కంకితముగా వల్లభాభ్యుదయము చెప్పెను గదా. అప్పుడు.

శా॥ అక్షయ్యంబుగ సొంపరాయనితెలుంగాధీశ కస్తూరికా
భిక్షాదానము సేయురా సుకవిరాడ్బృందారకశ్రేణికిన్
దాక్షారామచళుక్యభీమపురగంధర్వాప్సరోభామినీ
వక్షోజద్వయకుంభికుంభములపై వాసించు నవ్వాసనల్॥

అని శ్రీనాథుఁడు చెప్పెను. దీనిచే శ్రీనాథునకు దాక్షారామవేశ్యలతో సంబంధము గలదని వేఱుగఁ జెప్పనక్కరలేదు. వీధినాటకములోని చిన్నిపోతియే శ్రీనాథునకుఁ గూర్చుమగువయో యని సందియము కలుగుచున్నది. త్రిపురాంతకునిసంస్కృత ప్రేమాభిరామమున నీయంశ మున్నదో లేదో తెలియదు. మఱియు వీధినాటకములోనిశైలి చూడఁగా భీమఖండములోని పదబంధమునకంటె పటుతరమై యఖండధారాపాతము గలదై యున్నందునఁ దరువాతనే

వ్రాసె నన్నచోఁ గొన్నికారణములవలన నక్కాలము (1450) అంగీకరించుటకు వీలులేకున్నది. అళియరామరాయలముత్తాత యగు సోమభూపాలున కంకిత మీయఁబడిన శ్రీధరచ్ఛందమున వల్లభరాయనివీధినాటకములోని వని "మంచన వింటివో" యనుపద్య ముదాహరింపఁబడి యున్నది. అందుచే వల్లభరాయఁడు శ్రీనాథునిబాల్యదశలో గొప్పకవియై నట్లుతెలియుచున్నది. శైలీవిషయమున సామాన్యమును జూపి శ్రీనాథునకుఁ గర్తృత్వ మారోపింత మన్నచో నక్కాలపుఁ గావ్యము లెల్ల నించుమించుగా సమాన పాటవమును గవితాధాటియును నిరంకుశభావములు గలిగియున్నవి. పినవీరభద్రుఁడు శివలీలావిలాసము వ్రాసిన కొమ్మనయు ఎలుకుర్తిరామరాజును తులసిబసువనయు అంగరనృసింహకవియు రచించినకావ్యములలో బిగువును ధారాపాతమును సమానముగా నున్నవి. బమ్మెరపోతన యేకశిలానగరమున నున్నట్లు భాగవతమునఁ జెప్పినందునకుఁ జెన్నపురిలో దాని మొదట ముద్రించినవా రొంటిమిట్ట యని యూహించి యాయభిప్రాయమునే పీఠికలో వ్రాయఁగా లోకములో నిట్టిప్రవాదమును కలిగినది. ఒంటిమిట్ట కేకశిలానగర మనునున్నతనామధేయము పొసఁగు నని దేశచరిత్ర కారు లంగీకరింపరు. అయ్యలరాజురామభద్రుఁడు తనతాత తిప్పరాజు జగత్ప్రఖ్యాతముగా రచించె నని చెప్పుకొనిన రఘువీరశతకమున-

> "అతులప్రౌఢిమ మీఱురాయకవియయ్యల్రాజు సత్పుత్రుఁ డం
> చితభక్తిన్ త్రిపురాంతకుండు రచించెన్ దెన్గుపద్యంబులన్
> శతకం బొక్కటి దీని నీవు విని యాచంద్రార్కమై నిల్పు ప
> ర్వతకన్యానుత యొంటిమిట్టరఘువీరా జానకీనాయకా"

అని ఒంటిమిట్ట యనియే యున్నది. కావునఁ బోతన యోరుగంటిలో నుండె ననియు గొంతకాలములో మహమ్మదీయులవలనఁ దద్రాజధాని పడిపోయినందున భాగవతము ప్రఖ్యాతిగాక నశించెను. వెలిగందలనారయాదులును గువలయాశ్వ చరిత్ర మనుమనోహరకృతి రచించినసింగనయు కొన్నిస్కంధములు పూరించిరి. అవి రుచ్యములు కావని నందిసింగనయు ఘంటమల్లయ్యయు గలసి ఆర్వీటి తిమ్మరాజున కంకితముగా షష్ఠస్కంధమును శృంగారషష్ఠ మనుపేరితోరచించిరి. రేచర్లసింగభూపాలుఁడు కృష్ణాతీరమునఁ బరిపాలించుచున్నందునఁ బోతనయు శ్రీనాథుఁడును వారిదర్శనమునకై పోయియుందురు. ఈయంశములు

పండితులును జరిత్రకారులును నిష్పక్షపాతముగా నూహించి మఱికొన్నిదృష్టాంతములున్నచోఁ దెలిపి నిజస్థితిని గుర్తెఱుంగఁజేయుదురని నేను సుముఖులం బ్రార్థించెదను.

ఈరూపక మేకశిలానగర మని ప్రసిద్ధిఁజెందినయోరుగంటి పురములో గోవిందమంచనశర్మయుఁ దన్మిత్రుఁ డగు టిట్టిభుఁ డనువైశ్యవిటశిఖామణియుఁ బురబాహ్యాంతర్వాటికల విహరించి నానావిధవినోదములఁ జూచుచు నిరంకుశము లగుభావరత్నముల వెదజల్లుచు వర్ణించినది. దీనిలో నొండురెండుచోట్లు చాల నశ్లీలములుగా నున్నవి. అట్టిప్రదేశముల నేటికాలపునీతిమర్యాద నతిక్రమింపక తొలఁగించి యచ్చోఁ జుక్కల నుంచియున్నాను.

ఇది స్త్రీలును బాలురను జదువఁదగినది కాదు. శబ్దసంపత్తియుఁ బదబంధమును మధ్యకాలముల మహాపురములలోని జనులనీతి వర్తనయుఁ దెలియుటకై చరిత్రకారుల యుపయోగార్థ మీ గ్రంథమును ముద్రించితిని. దీనిలో వర్ణన లన్నియు నతిప్రౌఢములుగా నున్నవి. పల్నాటి వీరుల వర్ణనమును ద్యూతము పూటకూలిల్లును జిత్రసభయు బొట్టేళ్ళ కోళ్ళ యుద్ధములును మిక్కిలి ప్రౌఢముగా వర్ణింపఁబడియున్నవి. ఓరుంగల్లు పూర్వమున్నత దశలో నుండె ననుట నిక్కము. ఓరుగల్లును భల్లాణుల రాజధాని దొరసముద్రమును వినుకొండయు విటుల కనుకూలముగా నుండునని గ్రంథాంతపద్యమున నున్నది. రాజధానులగా నుండి క్షీణించెడు నగరము లన్నియు నీతిబాహ్యప్రవర్తనలకు నాటపట్టగునని తోఁచుచున్నది. ఇప్పుడును గాంచీ శ్రీరంగాది దివ్యక్షేత్రములును రాజమహేంద్రము నెల్లూరు పెనుగొండ మొదలగు నవియుఁ గొంతవఱ కపకీర్తి పాలగుచున్నవి. ఇది లోకములో మహాపురముల కంతయు నిట్టిదశ యంతిమ దశలోఁ గలుగును. ఈ కృతిలోఁ గొన్ని వర్ణనలు చాల మనోమోదములై యున్నవి. గ్రంథాంతము చంద్రస్తుతితోను గ్రంథారంభ ముదయ సూర్యస్తుతితోను బొలిచియున్నవి. దీనిలో బేర్కొనఁబడిన మాచల్దేవి కడపటి ప్రతాపరుద్రుని యుంపుడుకత్తె. దీనిలోని మరికొన్ని యశ్లీలములు తొలగింపవలయునని ప్రయత్నించితిం గాని యనేక మిత్రులు ప్రసిద్ధము లగు కావ్యములలోని రతివర్ణనాధికము లగు ఘట్టములకంటె దీనిలో నీచతరము లగు వర్ణనలు లేవనియు నట్టి యుద్యమము చరిత్రకారులకుఁ గార్యభంగము వొం

దించు ననియు శైలియుఁ బదబంధమును జాలకఠినమైనందున సామాన్యుల కర్థముగామిచే సామాన్య జనులలో నిది వ్యాపకము గాదనియు నా ప్రయత్న మును వారించిరి.

దీనిలోఁ గొన్ని యపప్రయోగములు గలవు. "మధుమావ తోర్గంటి మండలమున" "వెన్నుదుటం గరాంజలు నింతలు సేయని" "వసివాళ్ వాడుచు" "నోముల పంటగా యనుచు నోడలఁ బెట్టుచు" "పెనర్పప్పును" "దానిపాలి పెరుమాళ్ళు" "భూదేవా ప్రశాంతం మహా పాపం" మొదలగు నఖండయతి దుస్సంధులు దీనిలోనున్నను శ్రీనాథుఁడు నిట్టివి కొన్ని ప్రయోగించియున్నాడు. "శీలబ్రహ్మాది వీరనాసీర చరిత"అనుచో శీలమకుమారుఁడగు బ్రహ్మినాయకుఁడు గావున లకారము గురువు కానేరదు. అది రేచర్ల బ్రహ్మినాయకుఁ డనుటకుఁ బల్నాటి వీర చరిత్రమున "శీలమబ్రహ్మినాయకుఁడు" అని యున్నది. తల్లి దండ్రుల పేరితోఁ జేర్చిన నామధేయములలో సంయుక్తాక్షర మాదియైనచోఁ బూర్వాక్షరము గురువు గాదు. నాచన సోముని వసంతవిలాసమునఁ బ్రథమ పద్యము చూడుఁడు.

శ్రీచన్నుంగవ క్రేవఁ గ్రొమ్మెఱుఁగు లక్ష్మీశృంగారపుందోఁటకుం
బ్రాచీనం బగుచున్న వింశతి నఖప్రౌఢిన్ సుఖాంభోధివే
లాచంద్రోదయమైన దేవుఁడు కృపాలంకార చిత్తంబునం
జూచున్ మాచయబ్రహ్మధీమణిఁ గవిస్తోమైక చింతామణిన్.

ఇందు, నాల్గవపాదమున యకారము లఘువే కదా. దీనిలో నర్ధానుస్వార ప్రాస మాది కవులవలె సక్రమముగా బ్రయోగింపబడినది.

దీనిలో "ములికి నాటిది కాఁబోలుఁ జెలి కిరాట" యని "ములికినాడు" శబ్దము లకార మధ్యముగాఁ బ్రయోగింపఁబడినది. వాడుకలో ముఱికినా డనఁబడినను ఇప్పటికిని గృష్ణా గోదావరీ మధ్యమున తూర్పు కనమలకుఁ బడమటి భాగమున నుండు దేశమునకు మొలక సీమయని చెప్పుచున్నారు. కావున ముఱికినాడు అనుట దోషము. జాతి వార్తా చమత్కారములకుఁ బుట్టి నిల్లగు కదిరీపతి శుకసప్తతిలోఁ బ్రథమా శ్వాసమున-

గీ. అభ్రచుంబిమణిగణాదభ్రభవప్రమై
విజయభవన మనెడు వీడు గలదు
ములికినాటి సీమ నలభామినులచూపు
ములికినాటి మరుఁడు మార్చనొంద॥

అని లకారమధ్యముగా వాడియున్నాఁడు. మఱియును "కుసుమం బెట్టిన" అనుట దోష మనియుఁ "గుసుమం బద్దిన చీరకొంగు, వొలయునం" అని యుండవలయునని నాతో రాజమహేంద్రవరములో నొక కవి యాక్షేపించెను. "కుసుమమున నద్దిన" యనుటకుఁ గుసుమం బద్దిన యనినచో విభక్తిలోపము నకు గతి యేది? సుఖముండెచిచ్చుఱికె నిత్యాదులుఁ దక్క నెల్లప్రయోగములు సాధువులో? కుసుమ లనునర్థమునఁ గుసుమ మనుశబ్దము గలదా? ప్రయోగము చూపఁగలరా? శబ్దరత్నాకరమునఁ గుసుమ మని శబ్ద మున్నదని నైషధములో నుండి "కుసుమం బద్దిన "యని ప్రయోగము చూపఁబడినది. ముద్రిత ప్రతు లలోఁగాని తాళ పత్రప్రతులలోఁగాని యాపద్యము "కుసుమం బెట్టిన" యనియే యున్నది. సీతారామాచార్యులవారు శబ్దరత్నాకరమున ననేక దోషములు గూర్చిరి. అది యట్లుండ నప్పకవీయ ప్రతులలోఁ దక్కఁ దక్కిన లాక్షణికులు అనఁగాఁ జిత్రకవి పెద్దన,రామన, గణపవరపువెంకటకవి, కూచిమంచితిమ్మకవి, కిడాంబివేంకటాచార్యుఁడు, లింగము గుంటతిమ్మకవి, కస్తూరి రంగకవి, లక్షణ దీపికా లక్షణసార గ్రంథకర్తలు "కుసుమం బెట్టిన" యనియే యుదాహ రించిరి. చిత్రకవి పెద్దన "పస నెవ్వాఁడు" అనుటకు "అప్పన మెవ్వాఁడు" అని వ్రాసి యప్పన మనుటకు నాశ్చర్య మర్థమని యిది దేశ్యపద మని కూడ వ్రాసి యున్నాఁడు. నాతాళ పత్రప్రతిలో నేను ముద్రించినట్లే యున్నది.

నేను ముద్రించుచున్న టేంకణాదిత్యుని కుమార సంభవమును, అమరే శ్వరుని విక్రమసేనమును, దీనిని సవరించుటలో నా యజ్ఞానము చాలఁ బ్రకట మైనను గాలహరణమై ధనార్జన భంగము గలిగినను గేవలము భాషయందుఁ గల ప్రీతిచే దీని ముద్రించితిని గావున నాదోషములను సరకు గొనక సహృద యులై సవరించుకొని యానందమును గ్రోలుదురుగాక యని విరమించు చున్నాఁడను.

వనపర్తి
20—4—09

మా-రామకృష్ణకవి.

# నాంది

ఉ॥ * అంబరసీమఁ దారలు జటాటవి మల్లెవిరుల్ భుజాంతరా
ళంబు నహార సంతతులిలాస్థలిఁ బువ్వుల వర్షముల్ ప్రసూ
నంబులు సత్కృతాంజలి ననందగి మౌక్తికతుల్యమౌళిగం
గాంబుకణంబులుట్టిపడ నాడెడు శంభుఁడు మిమ్ముఁ బ్రోవుతన్॥

చ॥ గొనయము తమ్మినూల్ చెఱకు కోలధనుర్లత పూవులమ్ములే
టును నొకమాటు దానతనుఁడున్ మును నుగ్రుజయించి జీవరా
శినొడుచు టేమి చెప్పునని చేయునుతుల్ దగు మోహన ప్రవ
ర్తనగల కాముఁ డీవుతముదంబున మీకిలఁ గామసౌఖ్యముల్॥

* మాకు దొరికిన (క్రీడాభిరామ) ప్రతిలో నాంది పద్యములు లేవుగావునఁ జదువు వారల కొఱకు మొదటి పద్యమును అథర్వణుని భారత విరాటపర్వమున మొదటి యాశ్వాసమునుండియు రెండవ పద్యముఁ జిమ్మపూడియమరేశ్వరుని విక్రమసేనమునఁ బ్రథమాశ్వాసమునుండియు గ్రహించి యిందుఁ బొందుపఱిచితిమి. తక్కిన గ్రంథభాగంబున లేఖక దోషములు తక్కమాకరకౌశల మెక్కడను జూపఁ బడలేదని యార్యులు విశ్వసింతురు గాక॥

మా-రామకృష్ణకవి.

# 4. నీతిశాస్త్ర ముక్తావళి

ఈ చిన్న గ్రంథమును రచియించిన కవి బద్దెనయను లోకనామముగల భద్రభూపాలుఁడు. ఇతఁడు సూర్యవంశపు క్షత్రియుఁడు. విష్ణుభక్తుఁడు. ఇతనికి నన్ననగంధవారణుఁ డనియు రాజరాజమనోజ్ఞుఁ డనియు నుదారవైరోచనుఁ డనియు దశదిశాధరణాంకుఁ డనియు నరేంద్రచతురాన నుండనియు రాజాఙ్కచిహ్నములును; గవిబ్రహ్మయను కవిత్వ బిరుదమును గలవు.

ఇక్కవి చోళరాజులలోఁ జేరినవాఁడు. ఈ చోళవంశ్యులు కర్ణాటాంధ్ర ద్రవిళదేశములఁ బాలించి మూఁడు తెగలరాజులయిరి. వీరిలో ద్రవిళదేశమును బరిపాలించిన చోళరాజులు మొదటఁ గావేరితీరమున శ్రీరంగసమీపమున నుండు "కోడి" యను నుపనామముగల యొరయూరుపురము రాజధానిగాను బిదపఁ గాంచీపురము ముఖ్యపట్టణముగాను రాజ్యముచేసిరి. వీరిలోఁ బ్రఖ్యాతులగువారు పరాంతకుడు, రాజకేసరి, కులోత్తుంగచోళుఁడు, రాజేంద్రచోళుఁడు, విక్రమచోళుఁడు మొదలగువారు. వీరు ద్రవిళరాజ్యమును జయింపకపూర్వ మాంధ్రచోళులచ్చటఁ బరిపాలించుచుండిరి. వారలలో నొకఁడగు నన్నచోళుఁడను కవిరాజశిఖామణి యాంధ్రకవిత్వమున మిన్నయై యనేక కావ్యముల రచించెను. ఈ యాంధ్రచోళులు పరాంతకుని ధాటికోర్వక యుత్తరముగా నొదిగిరి. ఇఁకఁ గర్ణాటకచోళులు కందూరు, వర్ధమానపురము, గండికోట, పుంగనూరు మొదలగు ప్రదేశములలోఁ బెక్కు తెగలుగాఁ బరిపాలించిరి. ఈపురములన్నియు నిపుడు నైజామురాజ్యమునందును నాంధ్రదేశమునందె యుండుటవలన వీరిం గర్ణాటచోళులఁగాఁ గొందఱు గ్రహింపఁజాలరు. మొదటఁ గర్ణాటకదేశ మెంతవరకు వ్యాపించెనో యాంధ్రదేశము నెల్లలేవోయిప్పుడెట్లు భేదించెనోయెఱుఁగవలయును. ఇప్పుడాంధ్రదేశములోఁ జాలభాగము పశ్చిమదక్షిణభాగములు పూర్వము కర్ణాటద్రవిళ రాజ్యములలోఁ గలసియే యుండెను. ఆంధ్రులే దక్షిణపశ్చిమములఁ జయించుచు నాంధ్రభాషాభివృద్ధి చేయుచుండినందున దాని నాంధ్రదేశముగా గ్రహించుచున్నాము.

కర్ణాటచోళులలోఁగందూరి యుదయచోళుఁ డుదయాదిత్యాలంకారమును, వర్ధమానపురరాజగు గోకర్ణుఁడు గోకర్ణఛందమను నుత్తమగండ ఛందమును

విరచించిరి. తరువాత నాంధ్రదేశపుఁ జోళులు జయంతి, తనదుపురము, విజయ వాటి మొదలగునవి ముఖ్యపురములుగాఁ బాలించిరి. ఆంధ్రచోళులలో వెలనాటి చోళుఁడు తనదుపురమున రాజ్యముసేయుచు నవధానభారతి యను కవివలనఁ గొన్నికావ్యములు రచింపించినట్లు తోఁచుచున్నది. ఈ చోళవంశములోనివాఁడే నెల్లూరి మనుమసిద్ధియు. ఈమూఁడుతెగలలోఁ గర్ణాటాంధ్రచోళుల నోరుగంటి రుద్రదేవాదులు జయించి వారిరాజ్యమును నామావశిష్టముచేసిరి. ద్రవిళచోళులును బాశ్చాత్యచాళుక్య పాండ్యయాదవాదులచే నోడింపఁబడిరి. బద్దెనృపాలుఁడాంధ్ర చోళులలోఁ జేరి జయంతిలో రాజ్యము సేయుచుండెనని కొన్ని యాధారములవలన దోఁచుచున్నదిగాని యొకానొక శాసనములో "కృష్ణవేణానదీతీర దక్షిణ షట్స హస్ర విషయాధీశ్వర వీరమాహేశ్వర కీర్తిసుధాకర గుణరత్నాకర వేంగిచాళుక్య మూలస్తంభరిపుదళిత కుంభికుంభ బలయాంగనాగృహతోరణ నన్ననగంధవారణ నామాదిప్రశస్తిసహితం శ్రీమహామండలేశ్వర బద్దచోళనరేంద్ర" అనియున్నది. ఈ శాసనము పాశ్చాత్యచాళుక్యుఁడగు భువనైకమల్లుని కాలములోనిది. కావున నీతఁడు క్రీ.శ. ౧౦౭౦లో నుండెనని యూహింపవచ్చును. అయిన నట్టిబిరుదులు గలవాఁడు కేవల సామంతరాజా లేక స్వతంత్రుఁడా యని సందేహింపవలసి యున్నది. ఈశాసనము చెన్నపట్టణపు లైబ్రరీలోని చరిత్రములలోనిది గావున నమ్మఁదగినదికాదు. అవి యింక నసంశోధితములు. బెజవాడలో "బొద్దన నారా యణచోళ"ని శాసనము ౧౧౫౦ క్రీ. శకమున నొకటిగలదు. నారాయణుని తండ్రియగు బొద్దనయే బద్దెనయేమోయని సందేహింపఁదగియున్నది. ఈ కవిని మనకు లభించిన గ్రంథములలో మొదటఁ బేర్కొన్న కవి యోరుగంటి రుద్ర దేవుఁడు. ఇతనికి నూటయిఱువది సంవత్సరములు తరువాతనున్న బంధువు కుమార రుద్రదేవుఁడను పేర నభినవబాణభట్టను విఖ్యాతితో రామాయణమున నయోధ్యాకాండమును దెనిఁగించెను. రుద్రదేవుఁడు క్రీ. శ. ౧౧౩౦మొదలు రాజ్యము చేసినందున బద్దెన తత్పూర్వుఁడనియే యిప్పటికి నూహింపవలసి యున్నది. రుద్రదేవుఁడు ౧౧౮౫ వఱకున్నట్లు పిల్లలమఱ్ఱి శాసనములోఁగలదు. గణపతి రాజ్యారంభము ౧౧౯౯ అయినందునను మహాదేవుఁడుకూడఁ గొంత కాలము రాజ్యముచేసినట్లు బూదుపూరి శాసనమునగలదు గాన రుద్రదేవుఁడు ౧౧౯౬ ప్రాంతములకే చనిపోయియుండును. అయిన నిప్పటికి నాకుఁ జాల గావ్యములు లభింపనందున నిక్కవి దేశకాలాదిక విషయ మనిశ్చిత పదార్థమని ఖిరమించుచున్నాను.

ఈ చిన్నకృతిలోఁ గవిఁ దన్నుఁదానె సంబోధించుకొనుచున్నాఁడు. ఈ మర్యాద కర్ణాటభాషలోఁ గలదు. తెనుఁగున వేమన్న శతకము కవి చౌడప్ప శతకములోను నిట్టివాడుక కలదు. కొన్నియెడల సంబుద్ధివాచకములలో నన్న చోడనరేంద్రా యనియుఁ గొమరురభీమా యనియు నున్నది. ఇతర బిరుదమగు "నన్ననగంధవారణ'' యనుదానిలో నన్నన శబ్దమును నన్నచోడనరేంద్ర యనుటలో నన్నశబ్దముఁ జూడఁగా నితని మొదటిపేరు పెద్దల పేరుగా నన్నఁ డని తోఁచుచున్నది. ఆహవమల్లుఁడను చాళుక్య చక్రవర్తికి నమ్మన గంధ వారణుఁడనియుఁ గన్నచోళునకు మల్లన గంధవారణుఁడనియు బిరుదములు గలుగుట చూడఁగా నివియే జన్మ నామములో లేక తల్లిదండ్రులు గారాముగాఁ బెట్టిననామములో తెలియరాదు. కుమారసంభవమును రచించినవాఁడు నన్నె చోళుఁడు. అతఁడు శివభక్తుఁడు. భద్రభూపతి "లక్ష్మీవల్లభ పాదపద్మారాధకుఁడు" కావున నిద్దఱి నొక్కరే యనుటకు వీలుపడదు. బద్దెన నన్నచోళునివంశ్యుడో యేమో? శాసనముల శోధింపఁగా నైదుగురు నన్నెచోళులు గలరని తేలినది. పరాంతకునకుఁ బూర్వ మొరయూరు రాజ్య మేలినవారిలో నన్నెచోళుఁడు జంగమ మల్లికార్జునుని కాలమునందున్నవాఁడు ప్రథముఁడు. ఇతఁడు రాజ్య భ్రష్టుఁడయ్యెననియు యుద్ధమున మృతుఁడయ్యెననియు జంగమ మల్లికార్జున చరిత్రమున గలదు. ఇతఁడే కుంభకోణమున మల్లికార్జున మఠమును, శ్రీరంగ మున నొక మండపమును గట్టెనని యూహింపవలసి యున్నది. శ్రీరంగక్షేత్ర చరిత్రమున నందచోళుఁడు మండపము కట్టెనని యున్నది. ఒకవేళ నది ప్రమాదపతితమో యని సందేహింపవలసియున్నది. నందచోళుఁ డెవ్వఁ డచ్చట రాజ్యము చేసినట్లు గానరాదు. రెండవవాఁ డీ బద్దెననన్నెచోళుఁడు. మూఁడవ వాఁడు త్రిభువనమల్లుని కుమారుఁడగు నన్నెచోళుఁడు. నాల్గవవాఁడు కమ్మనాటి చోడబల్లికిఁ బ్రపితామహుఁడు. ఐదవవాఁడు పొత్తపి మల్లిదేవున కైదవతాతయగు నన్నెచోళుఁడు. జంగమమల్లికార్జునుఁడును నతని గురువగు తపోరాశియు శ్రీశైల పశ్చిమద్వారమగు నలంపురి నధిష్ఠానము నొంది కాలాముఖ మను శైవసమయ మును వ్యాపింపఁజేయుచు దక్షిణదేశమునఁ జోళరాజుల యాశ్రయమును చెందిరి. పుదుకోటలోని కదంబలూరి శాసనమున నీ మల్లికార్జునకు విక్రమకేసరి యను చోళరాజు దానము లిచ్చినట్లున్నది. పండితారాధ్యుఁ డనుపేరు గల జంగమ మల్లికార్జునుఁడు వెలనాటిచోళుని నాశ్రయించి తుట్టతుదకు రాజనిగృహీతుఁడై

కన్నులు పోగొట్టుకొని శ్రీశైలమున దపోనిష్ఠుఁడై యూర్ధ్వనేత్రము వడసి యవ్యయపదమును బొందెను. ఈ పండితారాధ్యుని శిష్యుఁడే పాల్కురికి సోమనాథుఁడు. రుద్రదేవుని యాస్థానసువాఁడు.వీరిరువురిలో మొదటి మల్లికార్జునుఁడు బ్రహ్మచర్యము పూనినవాఁడు. కాలాముఖ గురువులు బ్రహ్మచారులు.

బద్దెన కృతిలోని పద్యము లనేకలాక్షణికు లుదాహరించిరి. వారలు కవి పేరు చెప్పక యుదాహరించినందునఁ బద్యములు మాత్రమే చూచి యవి యెచ్చటివో యని యుపేక్షించుచుంటిమి. గ్రంథమంతయు నామూలము లభింపఁగా నెవ్వరెవ్వరు దీనిఁ జదివిరో కొంత తెలిసినది. ఆదిలో నీతిసారమను గ్రంథమున నితఁడు పూర్వకవిగా స్తుతింపఁబడెను. పిదప మడికిసింగన్నచే రచింపఁబడిన సకలనీతిసమ్మతమున నితని పద్యములు సుమారు ౬౦ ఉదాహరింపఁబడినవి. తరువాత నళియరామ రాయల ముత్తాత కంకిత మీయఁబడిన శ్రీధరచ్ఛందము నందును గవిసంజీవనియందును రత్నాకరమునందును వేంకటకవి లక్షణ శిరోమణిలోను వీని పద్యము లుదాహృతములైనవి. పై గ్రంథములలో నీతిసారము దుద్రదేవుఁడు సంస్కృతాంధ్రములలో రచించెను. మడికిసింగన యెఱ్ఱాప్రెగ్గడ కాలమువాఁడు. అప్పటికీకృతి చాలఁ బ్రఖ్యాతమైనది. దీనిలో ౧౫ పద్ధతులుగా రాజనీతి చెప్పఁబడినది. ఇతఁడే సుమతిశతకమును రచించెనని ప్రథమ పద్యము జూచినఁ దోచునుగాని యీ పద్యము నాకు లభించిన యైదుప్రతులలో నొక్కదానిలో మాత్రమే యున్నది. రెండు ప్రతులలో నాద్యంతములు లేవు. ఒక్కటి యేకాశ్వాసరూపముగాను జెన్నపురి ఖాండా గారప్రతి యాశ్వాసత్రయరూపముగా నున్నది. సుమతిశతకమునకును దీనికిని బాకభేదము గానవచ్చుచున్నది. జాతీయ వాచకములలో భేద మగపడును. సుమతిశతకము రచియించినవాఁడు భీమకవి యను లోక ప్రవాదమేకాక సుమతిశతకపుఁ దాళపత్రములలోఁ బ్రథమపద్యము భీమనపేరితో నుండ నేను జూచియున్నాఁడను. ఇతఁడు వేములవాఁడ భీమకవియా? లేక చెదలువాడ భీమకవియా? నృసింహపురాణ కర్త మాత్రము దాక్షారామవేశ్యలను వర్ణించినందున వేములవాడ భీమకవి యనియే తోచుచున్నది. కొందఱు వేములవాడ యనునది నైజామురాజ్యములో గోదావరీతీరమున నున్న లేములవాడ యనియు రాజేశ్వరస్వామి భక్తుడనియు "లేములవాడ భీముఁడవ లీలగ" "లేములవాడభీమ భళిరే కవిశేఖర సార్వభౌమ నీ వేమని యానతిచ్చితివి" ఇత్యాది జాటువులవలన నిరూపించుచున్నారు. ఈ రెండు పద్యముల రలా

భేదయతి క్రింద వేంకట కవి సూచించెను. కవిలోకబ్రహ్మ యరుణాచల పురాణములో నన్నయ తిక్కనలఁగొలిచి "వాక్ప్రతోషిత దక్షవాటీమహాస్థానభీము వేములవాడ భీముఁ దలచి" యనుటచే దాక్షావాటివాఁడనియే యూహించెదను. కవిరాక్షసుఁ డను వేఱొకకవి భీమేశ్వరున కంకితముగా లక్ష్మీనారాయణ విలాసమును రచించెనఁట. కావున నప్పకవి కవిరాక్షసుఁడన్నది భీమ కవికే యన్వయించినను గవిరాక్షసునియునికి యతనికిఁ దెలియదు. కావున సుమతిశతక మెవ్వరు రచించిరో గుర్తెరుంగవలయును. నీతులు బద్దెన నీతులవలె నున్నవికాని శైలిమాత్రము భేదముగా నున్నది. ఇదియును బై యంశమువలెనే యనిశ్చితము.

రాజనీతి గ్రంథము లాంధ్రములోఁ బెక్కులు గలవు. శూద్రకరాజ చరిత్ర రచించిన క్షేమేంద్రుఁడను కవి చెప్పిన ముద్రామాత్యమును, రుద్రదేవుని నీతిసారమును, భోజరాజ విభూషణ మను నీతిభూషణము, చారుచర్య, ప్రాచీనకామందకము, ప్రాచీనపంచతంత్రి, శివదేవయ్య రచితమగు పురుషార్థసారము, ఆరాధ్యదేవర ప్రణీతమగు స్మరతత్త్వసారము, మడికిసింగన నీతి వాక్యావళి మొదలగునవి. పై వారిలో క్షేమేంద్రుఁడును భోజరాజును సమకాలికులు. శివదేవయ్య గణపతిదేవుని కాలమువాఁడు. క్షేమేంద్రుని పద్యము తిక్కన కవివాగ్బంధనములో నుదాహరించెను. ఇతఁడే కాశ్మీరదేశ మహాకవి యగు క్షేమేంద్రుఁడా లేక మఱియొకఁడా? అతఁడును భోజరాజును బిల్హణుఁడును సమకాలికులేగదా. భోజరాజాంధ్ర ద్రవిడ కర్ణాటములఁ గవిత్వము చెప్పజాలెననుట మనకు హృదయానందముగా నున్నది. బద్దెననీతి మనోహరమై శైలి విషయమున పై సూచించిన రాజనీతి గ్రంథములలో శ్రేష్ఠమైనది. రెండవది పంచతంత్రి, తరువాత ముద్రామాత్యము, పురుషార్థసార మని చెప్పవచ్చును. కవితా శైలి తెలియుటకొఱకే గ్రంథాంతమున ననుబంధమునఁ బోలిక పద్యము లుదాహరించితిని. సుముఖులు చూచి సానలఁదీఱిన జాతిరత్నములకును దీరని రత్నములకును గల భేదమును వీనిలో గుర్తెఱుంగఁదగును.

దీనిలోని భావములు కొన్ని కామందకములోను జాణక్యుని యర్థశాస్త్రములోను నీతివాక్యామృతమునందును గలవు. తక్కినవి చాల మనోహరములై గాంభీర్యము గలిగియున్నవి. శబ్దములు ముత్తెములు పోహళించిన ట్లాహ్లాదకరమయ్యును "ముదమున సత్కవి కావ్యము నదరక విలు కానిపట్టి నమ్మను బరహృద్భిదమై తలయూఁపింపని యది కావ్యమె వాని పట్టినదియుం గరమే"

యని చోళుండు చెప్పినట్లు హృదయభేదకమై శిరఃకంపమును బొందించు చున్నవి. "లక్ష్మీలలనయ చుట్టంబు మనుజలకు బద్దెనృపా", "ఎత్తినకాలెకాని సిరి కెన్నఁడు నిల్చినకాల నిల్వఁగాఁ జిత్తము లేదు", "ధర్మముల్ వాయుడు మూఁడు లోకములు పాడగు నన్ననగంధవారణా", "కేవలంబ కాపునె పొలి యించు రాజు సిరిబొందునె", "సతి కంటె నబల వసుమతి", "మండలము పతియుఁ గావడికుండలక్రియ నుండవలయు గొమరురభీమా", "ఆశ్రితజన సేవ కల్పకుజసేవయ", "ధరణియ తల్లి తన్ గనిన తల్లియ వేల్పు" ఇత్యాదులు సహృదయ వేద్యములు. ఇవి శ్రుతిరంగముల నిరంతర మాలతి సేయు చుండుట యచ్చెరువు కాదు. ప్రాచీన కావ్యముల నన్నింటబంధము చక్కని తెలుఁగు పదములు గలిగి ద్రవిడ భాషా సంఘములోని సామాన్యగుణములు పొంది యన్వయాదుల యందు సంస్కృతము కంటె భిన్నమైయున్నది. నన్నయ భట్టు దక్క తక్కిన వారెల్లరు అనగాఁ గవిభల్లటుఁడు వెంకణాదిత్యుఁడు బద్దెన క్షేమేంద్రుడు శివదేవయ్య తిక్కన కేతనాదులు తత్తద్దేశానుసారముగా జాతీయవాచకములు ప్రయోగించుచుండిరి. అవి కాలక్రమమునఁ బూర్వకవి కావ్యపఠనా దోషముచేఁ దత్తజ్జాతీయములుఁ దత్తద్దేశీయములు స్మృతి ఫలకముల నచ్చువడి యుండుటచేఁ దరువాతి కవుల కావ్యములలోఁ దమకుఁ దెలియ రాకయే యవి కవిత్వమునఁ బడుచువచ్చెను. ఇట్లే గ్రాంథికభాషయు లోకములోని పలుకుఁబడియు వేఱయ్యెను. ఇట్టి వ్యత్యాస ముదయింపని నాటికాలపు భాషయే పరిశుద్ధమై రసప్రకటన వేళలలో ఋజువుగా హృదయమును నాటును. ఈ యంశము దెలియక క్లిష్టబంధముల సారస్య మెక్కుడనుట యంత యాదరణీయము కాదు.

నాల్గుప్రతులతో నే నేకాశ్వాస రూపముగా గ్రంథ మంతయు ముద్రించిన పిదప నైజాము రాజ్యములో నాత్మకూరు సంస్థానాదీశ్వరులు నాకొకప్రతిని దయసేసి యిచ్చిరి. ఇది సమగ్రమై చాలినంతవఱకు నిర్దోషమై యున్నది. పై నాల్గుప్రతులలో లేనివి దీనిలో 30 పద్యము లెక్కుడుగా నున్నవి. ఈప్రతిని నా కిప్పించిన రాజబంధువులు మ-రా-రా-శ్రీ రామిరెడ్డిగారికిని, మ-రా-రా-శ్రీ కృష్ణారెడ్డిగారికిని దత్సంస్థానాధీశ్వరులగు శ్రీమంతు సవై రాజా శ్రీరామ భూపాలు బహద్దరు వారికిని నేను గృతజ్ఞతా బద్ధుఁడ ననుట యటుండగా తక్కిన భాషాభిమానులు సహిత మించుక వారికి బద్ధులనుట యంతయతి

శయోక్తి కాదు. నేను దీని ముద్రించుటలోఁ గొన్ని స్ఖాలిత్యములును నజ్ఞానము వలనఁ గలుగు దోషములును బడియుండ వచ్చును.

"క. అజ్ఞానమూఢునకు స
ర్వజ్ఞునకుం దక్క దుఃఖవాసన యత్య
ల్పజ్ఞునకుఁ బాయ దని త
త్త్వజ్ఞులు చెప్పుదు రుదారవైరోచనుఁడా".

అన్న కవి వాక్యము నిక్కమేకదా. నాయుద్దేశ మీ విస్మృతకవి కవితామృతవాహిని విబుధులకు నిరంతరోల్లాసకారిణి కావుటయే కావున నాదోషముల నెత్తి పొడువక నన్ను క్షమింతురుగాక యని దీనిఁ జదువువారి నెల్లరను వినయముతో వేఁడుకొనుచున్నాను.

నేఁటి కాలముననను మనోహరముగా నూత్నకావ్యములు రచించు కవులు పుట్టనివారు కారు. ఇంకను వాఙ్మయకోశము వాక్పతి చెప్పినట్లు అభిన్నముద్ర మయియే యున్నది. మహామతులయుల్ల మమృత పయోధివలెఁ దరువ ఁదరువ నమృతము పుట్టించును. కాని తన్మథనక్షములగు రాజులు మాత్రము జనింప రైరి. అయిన నాంధ్రభారతికి నధునాతనకవులు కేవలము భాషాదరముచేతనే నూత్న సంతానము కలిగించినను బుట్టి పెరిగి కులదీపములఁ బోలెనుండు పూర్వసంతతి కేవల మనాదరముచే మృతిచెందఁ జూచుచుండుట శ్రేయోనుబంధి యగునా? ఇట్టియుజ్జీవన భేషజము నరేంద్రులకుఁదక్క లక్ష్మీకటాక్ష బహిష్కృతులగు పండితులకు సొమ్ముకాదు. ఆంధ్రదేశమున ననేక ప్రభుశిరోమణులు పూర్వకావ్యము లుద్ధరించుట శ్రేయస్కర మని తద్భారమును వహించుచున్నను గాలధర్మము ననుసరించి తత్ప్రయత్నములు సర్వంకషములు గాకున్నవి. చిరకాలముగా నీప్రాంతములోని ప్రభువుల విద్యాదరము బహిరంగ మైనను నంతరంగమునందును ప్రవర్ధిల్లుచున్నది. వారు తమ చవులనెల్ల మాటు వఱచి కేవలము తాళపత్రములలో నొదిగియుండు కావ్యరత్నములఁ ధర్మమని యించుక ప్రయత్నించుట నాయట్టి విద్యార్థుల కుత్సాహకరము. ప్రస్తుతము వనవర్తి సంస్థానాధీశ్వరులును సవై రాజ బహిరీ బలవంత మహాభూపాల రాయేత్యాది బిరుదాంకితులునగు రాజారామేశ్వరరావుగారు నాచేయు నల్ప ప్రయత్నములకుఁ దోడుపాటుగా నుత్సన్న కావ్యముల నన్వేషింప నభిరుచి కలిగి లబ్ధ

కావ్యముల రసాయనము సర్వజన లభ్యముగాఁ జేయనుత్సహించి యీ చిన్న కృతిని బ్రచురింప నారంభించిరి.

రాజు లాః విషయమున ధనకీర్తికంటెను గీర్తిధనమునే యెక్కుడుగా సంపాదింపఁ గోరవలయును, తదాశ్రితులగు పండితులు మాత్రము యశఃకిరణముల నుత్పాదించు నిధానము వారలకు వర్ధిల్లఁ గోరుదురు. ఇంకను బ్రచురింపఁ దగినవి యుత్తమ కావ్యములు పెక్కులు గలవు. నామావశిష్టములగు మహాకావ్యము లన్వేషణీయము లెన్నియో గలవు. ఇట్టి వానిని దడవించి లబ్ధకృతుల వ్యాపింపఁజేయ నీ ప్రభుచూడామణిని సర్వేశ్వరుఁడు పురికొల్పి పూర్ణపురుషాయుషజీవితునిఁ గావించి మనుష్య ధర్మాచరణమునం జరితార్థునిఁగాఁ జేయును గాక యని కేవలము భక్తిచోదితుఁడనై సర్వేశ్వరునిఁ బ్రార్థించుచున్నాడను.

వనపర్తి, మా - రామకృష్ణకవి.
ఏప్రెల్, 1910.

# 5. ప్రబంధమణిభూషణము

అనేక ప్రాచీనకృతులలోని పద్యరత్నములుగల యిక్కావ్యభూషణము నూతనకథాపరిణామముచెంది మనోహరముగా నున్నది. దీనిఁగూర్చిన కవిశిల్పి యెవ్వఁడో యేకాలమువాఁడో గుర్తించుటకుఁ దగిన యాధారములు లభింపవయ్యె. క్రీ. శ. ౧౭౦౦ల సంవత్సరముల కిటీవలి కృతుల పద్యము లిందు లేనందున నిక్కావి తత్పూర్వుఁ డనియే యూహింపవచ్చును. దీనిలో మొత్తము ౧౬౬౭ పద్యములుగలవు.౪౧౧కి మాత్రమే తత్తత్కర్తృత్వము కనిపెట్టజాలితిని.తక్కిన పద్యము లేయే కావ్యములలోనివో పండితలోకమే నిర్ణయింపజాలును. ఉజ్జయినీ నాథుఁ డగు సుకీర్తినరేంద్రునకుఁ గుమారుఁడగు రాజశేఖరుఁడు పాండ్యభూపతి పుత్రియగు రత్నసుందరిచే స్వయంవరమున వరింపఁబడెనను నూతన కథా వస్తువు పరిణమించునట్లు నానా ప్రబంధపద్యములిందుఁ బొసఁగింపఁబడినవి. ఈ గ్రథకుని చాతుర్యము శ్లాఘనీయమే. అయినను గథాచమత్కృతియు సంభాషణ సారస్యమును నిందుఁ గానరావు. నిర్గుణమగు పుష్పముండదుగదా. దీనిలో లేని గుణములఁ దడవుటకంటె నున్నగుణములతో సంతసింతము. ఋతుస్త్రీ వర్ణనాదులలో నిందెక్కుడు పద్యములు గలవు. ఈ పండితుఁడు శ్లేషయమకాదు లకుఁ బ్రాముఖ్యమునీయక కొంతవరకుఁ జిత్తరంజకములగు భావములనే యేఱు చుండెను. మహాకవుల భాగ్యవర్ణనములే కలవుగాన నీరసపద్యము లిందుఁబెక్కులు గానరావు. దీనిలోని పద్యములమూలము వెదుకఁగా ౭౦ కావ్యములు తేలినను ముఖ్యముగా నైషధము, శాకుంతలము, కవికర్ణరసాయనము, వాల్మీకిచరిత్రము, శ్రీరంగమహత్త్వము, మొదలగు కొన్నికృతులే కవికిఁ బ్రియతములయ్యె. నాకు మూలము గుర్తింపరాని పద్యములు ప్రాయశఃదక్షిణదేశపుఁ గావ్యములలోనివై యుండును.

వానినెల్లఁ జూడఁగా ననేక కృతులుత్పన్నములయ్యె ననుట సత్యమునకు దూరముగాదు. ఈ పద్యములశైలి భిన్నభిన్నముగా నుండునను యచ్చెరువు కానేరదు. కొన్నిటిలో నుండరాని వ్యాకరణదోషములును ఛందోదోషములును గలవు. కావున దీనిలోని కొన్నిభాగములు కుపంథులగు సత్పృణాభ్యవహారుల కూఁతగా నుండినను నిర్దుష్టముగాఁ గవిత చెప్పఁగోరువారుమాత్రము వానిని

ఖాటింపరాదు. అట్టిదోషములు కవికృతము లైనచో దిద్దరాదని నామతమగుటచే సవరింప కుజ్జగించితిని.

ఇట్టి సంచితకృతులు సంస్కృతమున విస్తారముగాఁగలవు. ఆంధ్రభాషలో నాకు లభించినంతవట్టు పరికింప నట్టికృతికర్తల మడికిసింగనయే ప్రథముడు. అతడు ప్రాచీన పంచతంత్రి, ప్రాచీన కామందకము, ముద్రామాత్యము, నీతి భూషణము, బద్దెననీతి, కుమారసంభవము, భారతము, మంచిభట్టునశ్వశాస్త్రము మొదలగు గ్రంథములలోని రాజనీతి పద్యములన్నియు నేఱి సకలనీతి సమ్మత మను గ్రంథమును గూర్చెను. పిదప క్రీ.శ. ౧౬౨౦ లో జగన్నాథకవి రత్నా కరమను గ్రంథమునఁ బ్రాచీన పద్యముల నెత్తియోజవఱచి యైదాశ్వాసముల కృతి రచించెను. అయిన నీరెండును గథారూపములుగా గ్రథితములుకావయ్యె. ఇటీవల యెవ్వరో యచ్యుత రామరాజను పండితుఁ డిట్టిగ్రంథమునకు దొరకని కృష్ణలీలావిలాసమను పేర నొకకృతి రచించెను. రసికాగ్రేసరులగు శ్రీవెంకట గిరి సంస్థానాధీశ్వరులు శృంగారరత్నావళి యనుపేర నొకగ్రంథము జత గూర్చిరి కాని యయ్యదియుఁ గథారూపముగాఁ బరిణతమైనదికాదు. పైసూచించిన సింగన, జగన్నాథుల కృతులలోని పద్యములనే లాక్షణికులు విస్తారముగా నుదాహరించుచువచ్చిరి. కాని అప్పకవియుఁ గూచిమంచి తిమ్మనయు సాధార ణములగు గ్రంథములుతక్కఁ దక్కినకృతుల శోధించిన పాపమునఁ బోయిన వారు గారు.

ఈగ్రంథమును వనపర్తి సంస్థానాధీశ్వరులగు సవై రాజారామేశ్వరరావు బహిరీబల్వంతు మహాభూపాల బహద్దరు వారుచితముగా నాకొఱకు ముద్రింపించి ఇచ్చినందున కెంతయుఁ గృతజ్ఞుఁడ నగుచున్నాను. దీనిలో లేఖకదోషము లింకను బెక్కులు నిల్చియుండవచ్చును. మాతెక్కలకొలఁది మేమెగయుటకు సిద్ధముగా నున్నందున నత్యున్నతిఁ బోఁజాలని మాశక్తిని విబుధాగ్రేసరులు కేవలము హాస్యభాజనము సేయకుందురు గాత.

దీనిలోని పద్యము లేయేకావ్యముల లోనివో తత్తత్కవు లెవ్వరో యించుక తెలిపెదను. ఇది యల్పకార్యమైనను నాపాలిటికి యన్వేషణకార్యముమేరువెత్తి నంత భారమయ్యెను గాని పద్యముల నన్నిటికి మూలము గుర్తింపజాలెడు భాగ్యము నాకుఁ గలుగలేదు. ఈకార్యమెట్టి శోధకులకైనను గర్వభంగము గలిగించునని తోఁచుచుండఁగా నిఁక నాయట్టి వానికథయేమి!

ఈ క్రిందఁ బ్రశంసించు కవుల విషయము చాలఁ గ్లిష్టమైయుండును. రావుబహద్దరు వీరేశలింగము పంతులవారి యాంధ్రకవుల చరిత్రములో లేని కవుల విషయమును దద్వ్యతిరిక్తాంశములును మాత్రమే యిందుసూచింపబడును.

నన్నెచోళుఁడు కుమారసంభవకర్త. క్రీ.శ. ౯౪౦ కుఁ బూర్వుఁడు. ఇతనిఁ గురువగు మల్లికార్జునుఁడు కాలాముఖిమతస్థాపకుడు. తపోరాశిశిష్యుఁడు. బ్రహ్మచారి. ఇతనిపేర నన్నెచోళునిచేఁ గట్టింపబడిన మఠమింకను గుంభకోణమున నున్నదని యొకరు చెప్పుచున్నారు. విక్రమకేసరి యనుచోళరాజీతనిఁజాల సమ్మానించినట్లు కదంబలూరు శాసనాదుల నున్నవి.

కుమారసంభవములోనివి పద్యములు - ౩౮, ౪౨, ౬౩, ౧౮౨, ౧౮౩, ౧౮౮, ౨౦౯, ౨౩౩, ౩౩౯, ౩౯౭, ౬౩౦, ౬౬౬. ౬౬౫, ౬౬౮, ౬౫౩, ౬౫౪, ౬౫౫. ౫౮౧.

నన్నయభట్టు భారతములోనివి — ౩౨, ౨౦౬, ౨౧౦, ౨౧౧.

విన్నకోట పెద్దన కావ్యాలంకార చూడామణియుఁ బ్రద్యుమ్నచరితయు రచించెను. రెండవకృతి చాలఁ బ్రౌఢమైనది. దానిలోనుండి ౧౧౩ వ పద్యము మాత్రమే గ్రహింపబడినది.

తిక్కన సోమయాజి విజయసేనము కూడ రచించెను. దాని లోనివి ౩౦, ౮౭.

కేతన దశకుమారచరిత్రమున ౭౬౯, ౫౧౫, ౮౬౫. వీనిలో ౮౬౫ వ పద్యము ముద్రితప్రతిలోఁ గానరాదు. కాదంబరిలోనిది ౩౬.

భాస్కరుఁడు దశగతులును రామాయణము రచించెను. రెండును సాహిణీమారయాంకితములు. సాహిణిమారుని తండ్రి గోనబుద్ధారెడ్డి క్రీ.శ. ౧౨౫౬ లో నుండెను. బూదుపూరిశాసనములో "శ్రీ గోనవంశ నిజశేఖర బుద్ధయాఖ్యపుత్రీ పవిత్ర చరితా భరితా గుణౌఘైః" అనియు "శాబ్దేకా వసునంద శంకర మితే శ్రీధాతృసంవత్సరే" అనియునున్నవి.

భాస్కర రామాయణములోనివి ౪౪, ౪౭, ౫౦, ౫౫, ౮౨, ౯౩, ౧౩౭, ౩౭౬, —౯

మంచన కేయూరబాహు చరిత్రలో ౬౧, ౧౧౯, ౧౩౬, ౧౪౯, ౩౯౬, ౩౯౫, ౮౨౩.

మడికి సింగన సకల నీతిసమ్మతమున ౮౬౬.

ఎఱ్ఱాప్రెగ్గడ నృసింహ పురాణమున ౨౧, ౧౭౪, ౧౮౧, ౧౮౪, ౨౪౨, ౩౧౬, ౬౦౯, ౬౧౩, ౬౨౩, ౬౩౬, ౬౪౫, — ౭, ౮౨౨.

రావిపాటి త్రిపురాంతకుఁడు మదనవిజయ ప్రేమాభిరామ త్రిపురాంతకోదాహరణాంబికాశతక తారావళ్యాది కృతికర్త. ఇతఁడు ప్రతాపరుద్రుని కాలమువాడు అంబికాశతకములోనిది ౧౬.

నాచన సోమనాథుని హరివంశమున ౧౩, ౧౬౫, ౧౬౯, ౩౩౩, ౫౬౮, ౭౭౯, ౭౮౦, ౭౮౨, ౮౩౩. ౧౩వ పద్యమతని వసంతవిలాసము లోనిదేమో. ౩౩౩వ పద్య ముత్తరహరివంశమున ముద్రితప్రతిలో లేదు. పంచమాశ్వాసమున మఱికొన్ని పద్యములు ముద్రితప్రతిలోఁ దేలిపోయినవి. బాణాసురుఁడు కుంభాండునితోఁ బ్రసంగించు ఘట్టమున;

చ॥ ఇనసమతేజ వింటివె యతీవభుజక్రమవిక్రమక్రియా
ఘనులగు పోటుబంటులకు గాఢతర ప్రతిపక్షపక్షభం
జనహృదయైక రంజనవిశాల మహాహవమూల మైన య
య్యని మొనఁగాక కల్గునె సమంచితకీర్తియు ధైర్యమూర్తియున్.

ఇత్యాదులు వదలిపోయినవి.

పోతన భాగవతమున ౪, ౮, ౨౭, ౨౮, ౫౦, ౫౧, ౫౨, ౫౩, ౭౪, ౯౬, ౩౩౨, ౩౬౧, ౮౧౭.

శ్రీనాథుని నైషధమున ౫, ౨౬, ౩౭౪, ౩౮౭, ౩౯౨, ౩౯౪, ౫౯౯-౨, ౪౦౪, - ౮, ౪౨౫, ౪౨౬, ౪౮౮, ౪౮౯, ౪౯౧, ౫౦౬, ౫౦౮, ౩౦౯, ౫౬౬, ౫౭౦, - ౩, ౫౯౩, ౬౨౦, ౬౨౧, ౭౭౮, ౭౮౫, ౭౮౬.

ఇతఁడు ప్రథమమునఁ గోమటి వేమన యాస్థానమున ధరణికోటలో నుండి తన్మంత్రియగు మామిడి సింగనకు నైషధమిచ్చెను. ఈ కృతిలోని షష్ఠ్యంతములలో నీ విషయమే తేలును. "క. శ్రీమహిత పెద్దకోమటి వేమక్షితిపాలరాజ్యవిభవకళారక్షామణికి" అనియే తాళపత్ర ప్రతులలో నెల్లనున్నది. పెద్దకోమటి యనవేమారెడ్డికి నన్నకొమారుడు. పెద్దకోమటి కొడుకగు వేమనయే యమరుకవ్యాఖ్య రచించినట్లు తత్పీఠికలో నున్నది గాని నిక్కము విచారింపగా నదియు శ్రీనాథుని పరిశ్రమ యనియే తేలినది. శ్రీనాథుడిట్టి పనిచేయువాఁడా యని సందేహింప వలసినదిలేదు! క్రీడాభిరామమను వీధినాటకమును వల్లభ

రాయని పేర రచించెనుగదా. అమరుకవ్యాఖ్యలోఁ బ్రశస్తి పద్యములు ఫిరంగిపుర శ్రీనాథశాసనములోను, బొన్నుపల్లి శ్రీనాథతామ్రశాసనములోను, సమానముగా గలవు. శ్రీనాథుడు గణపత్యుపాసకుడు. "వికంకటకట" వ ద్యా ర్థ మే ఇతని యాంధ్రకావ్యములలో గూడఁ గలదు. సప్తశతి, ప్రేమాభిరామమును దెనుగించిన సరసుఁ డమరుకరసము గుర్తించుటయు అచ్చెరువు కాదు.

ఇతఁడు ప్రౌఢవయస్సుననే రాజమహేంద్రముచేరెను. ఈ సంస్థానము కాటయవేమారెడ్డికి నరణముఁగా గొమరగిరివలన వచ్చెను. కాటయభార్య యనవేమన కూతురగు దొడ్డాంబ. కాటయవేమన భార్య యన్నపోతనకూఁతురగు మల్లాంబ యని పొత్తరమూడి శాసనము.

వీరభద్రారెడ్డి భార్య యీ మల్లాంబకూతురు. ఇంతవఱకు శాసనశోధకులును గవి చరిత్రకారులు నీమల్లాంబిక వీరభద్రారెడ్డికిఁ బెదతల్లియని పొరపడిరి. దానికి ముఖ్యకారణము "అనవేమక్షితిపాలపౌత్రియగు వేమాంబా మహాదేవికిన్। ఘనుఁ డయ్యల్లడభూమిపాలునకు సంగ్రామస్థలీ గాండివుల్"

అను కాశీఖండములోని పద్యమే భ్రమాస్పదమయ్యెను. ఇందుఁ బౌత్రి యనుటకు దౌహిత్రియని అర్థము చేసికొనవలసి యున్నది. నిశ్శంక కొమ్మన తన శివలీలావిలాసమునఁ బ్రశస్తిపద్యములలో నల్లాడరెడ్డిని వర్ణించుచు—

మ॥ భరిత శ్రీనిధి యమ్మహీరమణుఁ డొప్పం జోళబత్తిక్షితీ
శ్వరసూనుం డగుభీమలింగమనుజేంద్రశ్రేష్ఠు సత్పుత్రి భా
స్వరకారుణ్య దశాజనావన విధాసంధాత్రి వేమాంబికన్
వరియించెం బతిభక్తిగౌరవ దృఢ వ్యాపార నిత్యాంబికన్.

అని యున్నందున నీ భీమలింగమన వేమన యల్లుఁడు. వేమాంబిక యన వేమన దౌహిత్రియు నల్లాడరెడ్డి భార్యయు. అనవేమన పౌత్రియగు మల్లాంబ కాటయవేమన భార్య. వీరికూతురే వీరభద్రారెడ్డిభార్య. కావుననే భార్యమూలకముగా నరణముగా వచ్చిన రాజమహేంద్రరాజ్యమును వీరభద్రుఁడు పాలింపగా నన్నయగు వేమారెడ్డి యగస్త్యభ్రాతయై యుండెను.

పినవీరుని శాకుంతలములో ౨౧, ౮౨, ౯౭, ౯౯, ౧౨౫, ౧౮౭, ౫౩౯, ౫౪౦, ౫౪౨, ౫౭౦, ౫౭౫, ౪౦౯ – ౦, ౪౫౨, ౪౪౭ – ౨, ౪౭౬, ౬౫౪ – ౭, ౬౭౮, ౨౫౧, ౨౫౭, ౨౩౪ – ౮, ౨౪౦, ౨౪౧, ౨౪౮, ౨౬౬, ౮౧౬.

జక్కన విక్రమార్క చరిత్రలోనివి ౧-౭౪, ౧౩౮, ౪౫-౭,౫౧౩, ౮-౭౯,

ప్రౌఢకవి మల్లన రుక్మాంగదచరిత్రములోనివి ౧౮, ౪౩, ౬౨, ౧౦౫.

సుంకసాలనృసింహకవి కవికర్ణరసాయనములో ౬౬, ౩౯౧, ౪-౭౮-౩౩, ౪౪౩, ౬౮౭-౨, ౬౮౯ - ౯౧, ౬౯౬, ౨౦౪, -౨౧౫

ఇతని కవికర్ణరసాయనము మనుచరిత్రముతో నీడురాదని యనేక విద్వత్కవుల యభిప్రాయము. అట్టివారితోనే నే కీభవింపకుండుట నాయభాగ్యమని తలచెదను. నూతనకల్పనలును రసస్ఫూర్తియు హృద్యాలంకారములును అశిధిల బంధమునుగల యిక్కావ్యముతోఁగేవలము దృఢశైలియుఁబరాకాష్ఠయుగల మనుచరిత్ర యెట్లు తులదూఁగును ? ఇక్కవి పన్నిద్దఱాళ్వారులచరిత్ర కూడఁ బద్య కావ్యముగా రచియించెను.

పేర్చూరి సింగయ్య భాగవత షష్ఠస్కంధమును, గువలయాశ్వ చరితయు రచించెను. ఇతని కవిత శ్లేషప్రధానమై కొంత రసవంతముగా నుండును. శైలి మృదువైనను మధురముగా నుండదు. కువలయాశ్వ చరిత్రలోనిది ౩౪౫.

నృసింహభట్టు రాజరాజాభిషేకము రచించెను. దీనిలోఁ బదబంధము పటువైయుండును. ఇతఁడు క్రీ. శ. ౧౫౦౦ కాలములో నుండినవాఁడు. పై కృతికి విభుఁడు కొప్పులవల్ల భూపతి పీఠాపుర ప్రభువగు నామయనాయకునకు ౫ వ తరముక్రిందివాఁడు. నామయ ౧౩౬౦ లో నున్నట్లు దొనపూండి శాసనము గలదు.

రాజరాజాభిషేకములోనివి ౬౬౪,౮౬౫.

తులసిబసవన- సావిత్రీచరిత్రము రచించెను. ఇది భావగాంభీర్యమునకును మనోహరమగు పదబంధమునకునుఁ బ్రఖ్యాతమైనది. ఇతడు క్రీ. శ. ౧౪౬౦ లో నుండెను. ఇతఁడే కవిసర్పగారుడము రచించెనని తోచుచున్నది. అంగరబసవన యను వేరొక కవి యిందుమతీ కల్యాణము రచించెను.

సావిత్రీ చరిత్రములోనిది ౧౬౩.

భైరవుఁడు శ్రీరంగమహత్త్వ,రత్నపరీక్షా,కవిగజాంకుశములు రచించిన కవి. ఇతని కవిత యుద్దండమైయుండును. ఇతని గజాంకుశములోని పద్యము

లను గౌరన తన లక్షణదీపికలో నుదాహరించెను. వీరిరువురును నేక కుటుంబమువారు. నైజాము రాజ్యములో నుండిన రేచర్ల సింగయమాధవునికాలములో గౌరన మంత్రిగా నుండినట్లు లక్షణదీపికలోను, నవనాథచరిత్రములోను నున్నది. ఈ సింగయ మాధవుఁడు క్రీ. శ. ౧౫౪౦ లో నుండినవాడు. భైరవుఁడు క్రీ. శ. ౧౫౦౦ లో నుండి యుండును.

శ్రీరంగమహత్త్వములోనివి ౯౭, ౧౧౬, ౧౩౧, ౧౮౫, ౧౯౪, ౧౯౫, ౨౦౦, ౨౦౫, ౨౧౨, ౨౧౩, ౨౧౭, ౨౧౮, ౨౨౦-౧. ౨౨౫, ౨౨౭, ౨౪౧-౫, ౨౪౯, ౨౫౪, ౨౫౬-౭, ౩౧౫, ౩౧౯, ౩౨౬-౮.

సూరన వనమాలివిలాసము నుదయనోదయమును రచించెను. ఉదయనోదయము బృహత్కథకుఁ దెనుఁగు. దానికిఁ గృతీశ్వరుఁడగు భాస్కరమంత్రి మధ్వమతపరమాచార్యులలో నొకఁడగు వ్యాసమహాయతిరాయల శిష్యుడు. వీరిలో నెవ్వరికాలము నిర్ణయింప నాధారము లభింపవయ్యె. కవిస్తుతిలో నన్నయ, తిక్కన, కేతన, భీమనలు మాత్రమే స్తుతింపబడిరి. సూరన క్రీ. శ. ౧౩౫౦ లకును ౧౫౦౦ కును నడుమ నుండెనేమో? ఇక్కవి కవిత యపారమాధుర్యము గలది. మనోహరమగు శబ్దసంచయమును లలిత భావములును గల యీ బృహత్కథను రచించిన యిమ్మహాకవి వాసవదత్తా వివాహకథను ముగించి పరలోక ప్రాప్తుఁడయ్యెను. ఆ యుత్తమ గ్రంథము సొంతముగా రచించి యుండునేని యీ సూరన తిక్కనాదులతో యశస్తల్పమునం దూఁగుచుండును. వనమాలివిలాసము బాలకవిత్వమైనను జాల రసవంతముగా నున్నది. వనమాలి విలాసములో ౪౧౫, ౫౧౪-౭, ౫౨౦-౩, ౫౨౭-౩౯, ౫౪౨-౫౩.

ఉదయనోదయమున ౨౨౨, ౩౮౪, ౪౧౬, ౪౬౧-౭౨, ౭౭౦-౯ ౭౭౬-౭, ౯౮౩, ౮౩౮-౪౪.

పెద్దన మనుచరిత్రములో ౩, ౨౫, ౬౯, ౪౦౩, ౬౧౯, ౬౪౯.

తిమ్మన పారిజాతాపహరణములో ౬౫౩,

రామభద్రుని సకలకథాసంగ్రహమున ౫౫౬, ౫౫౩.

మాదయగారి మల్లన రాజశేఖరచరిత్రయుఁ గృష్ణార్జునసంవాదమును రచించెను. కృష్ణరాయల మంత్రియగు సాళ్వతిమ్మరుసునకు మేనల్లురగు నాదెళ్ళయప్పన, గోపన్నలకుఁ బై రెండు కృతులును గ్రమముగా నంకిత మీయ బడినవి. ఈ గోపన్నయు గొప్ప విద్వాంసుఁడు. కృష్ణమిశ్రప్రబోధచంద్రోదయమునకు సంస్కృతవ్యాఖ్య రచించెను. మల్లన తండ్రియగు మాతయ వీరనృసింహరాయలయాస్థానమున నుండి వెంజర్లగోపన్నకు మైరావణచరిత్ర మంకిత మిచ్చెను. ఆ ప్రభువు-

సీ॥ మెప్పించినాఁడవు మెఱవడిఁగర్ణాటనరనాయకుని వీరనారసింహు
ప్రోడవన్నింట సర్వయమాడసుకవి. అని చెప్పెను.

బ్రౌన్‌దొరగారును, సీతారామాచార్యులవారును, రా॥ బ॥ వీరేశలింగంపంతుల వారును, మాదయమారయాదినామాంతరములఁ బ్రయోగించిరికాని మాడయ యనుటయే యథార్థము. కృష్ణార్జునసంవాదము ద్విపదకావ్యము, మనోహరముగా నుండును. రాజశేఖరచరిత్రను బొందిన యప్పన కొండవీడు వినుకొండప్రాంతములఁ బాలించుచుండెను. రాయని భాస్కరుఁడను నైంద్రజాలికుఁడితని నాశ్రయించి భరతపూండి గ్రామమును బహుమతిచెందెను. "శాకాబ్దే వసువహ్ని వేదధరణీగణ్యేచ ధాత్రబ్దకే వైశాఖే వినుకొండసీమని సుధీ ర్నాదెళ్ళయప్ప ప్రభుః।వాసిష్ఠాయ చ భర్తృపూండిమఖిలం గ్రామస్య నామాంకితం। ప్రాదాద్రాయని భాస్కరాయ విదుషేష్టైశ్వర్యభోగానిత్యం" అని శాసనము గలదు.

రాజశేఖరచరిత్రములో ౪౧౭.

పెద్దపాటి సోమనాధుఁడు (కవిలోక బ్రహ్మ) అరుణాచల పురాణము, శివజ్ఞాన దీపిక, కేదారఖండము మొదలగుకృతులు రచించెను. బెజవాడ సమీపమునఁ గొండపల్లి యగ్రహారమున క్రీ. శ. ౧౫౧౦ లో నుండినవాఁడు.

అరుణాచలములోనివి ౭౩, ౭౮

ధూర్జటి కాళహస్తి మహత్త్వములో ౧౯౨, ౩౪౮, ౬౧౧, ౬౫౧.

రామరాజభూషణుడు-ఇతని వసుచరిత్ర ద్రవిళసంస్కృతములలో ననువదింపఁబడినది. వసుచరిత్రలో ౬౮, ౭౬, ౯౪.

నూతనకవి-నూరన ధనాభిరామమను కావ్యమును రచించెను. ౧౬౨౦లో రచింపఁబడిన రత్నాకరమున దీనిలోని పద్యము లుదాహృతము లయ్యెఁ గావున నితఁడు తత్పూర్వుఁడు. పై గ్రంథములోనివి ౩౩౫, ౨౩౮, ౩౮౫.

రంగప్పరాజ సాంబోపాఖ్యానములోనిది ౧౭౬.

పింగళిసూరన కళాపూర్ణోదయములో ౪౩౨.

చేమకూర వెంకటపతి విజయవిలాసములో ౪౯, ౧౦౬, ౫౬౦, ౫౯౭, ౬౪౨, ౬౯౪. ౬౯౫, ౭౦౨, ౭౦౩, ౭౪౬-౭.

తంజాపురి రఘునాథుఁడు రామాయణ వాల్మీకచరిత్ర పారిజాతాపహరణ జానకీకల్యాణాచ్యుతాభ్యుదయాదికృతులు రచించెను. ఇతని కవిత చాల సరసమై రసవంతమై యుండును.

రామాయణములోనివి ౧౩౦, ౬౮౪.

వాల్మీక చరితలోనివి ౬, ౨౭౪-౭, ౨౮౦-౯౨, ౨౯౪-౩౦౫, ౩౧౦-౧, ౩౧౩-౪.

పై కృతులుగాక రఘువంశాది కృతులలోని పద్యములు గలవు. అయ్యవి యెవరిచేఁదెనిఁగింపఁబడెనో యెక్కడ లభించునో నే నెఱుఁగను.

బిల్హణుని విక్రమాంకదేవచరిత్రము లోని భావములు గల పద్యములు ౧౭౧, ౧౭౨, ౪౯౨, ౪౯౩, ౪౯౬.

రఘువంశములోనివి ౫౨౬, ౫౫౮.

సప్తశతిలోనిది ౬౭౧.

౨౫౩ వ పద్యము భీమకవి నృసింహపురాణములోని దైనట్లు కవిసంజీవనిలో నుదాహరింపఁబడెను. ౩౧ వ పద్యము శ్రీనాథ రచన గలది. ౧౦౦ వ పద్యము విజయసేనము శైలియే. ౮౦౨వ చాటువు తెన్నాలి రామకృష్ణ కవి చెప్పినట్లును, ౩౯౬, ౮౪౫ చాటువులు పెద్దన పూరించినట్లును గథలుగలవు. ౬౪౭ వ పద్యము భేతాళపంచవింశతిలోని దని యప్పకవి యుదాహరించెను. నాకు లభించిన కవి భల్లటుని విక్రమార్క చరిత్రమున భేతాళపంచవింశతి భాగమున నిది కానరాదు గాని యప్పకవి తద్గ్రంథములోని దని యుదాహరించిన-

ఉ॥ ఆవిధవాశిరోమణి రయంబున నేఁగి రహస్యవేళఁబ
ద్మావతిఁగాంచి రాజసుతుఁడాడిన మాటలభంగిఁజెప్ప ల
జ్జావతి ఘృష్టలిప్తఘనసారకరంబుల గండపాలికల్
వావిరి వ్రేసినన్ జరఠవామవిలోచన వచ్చి దుఃఖియై.

అను పద్యము నా ప్రతిలోఁగలదు. పై పద్యము వేఱొక గ్రంథము లోనిదై యుండునేమో.

ఈ చెప్పినవి గాక తక్కిన పద్యము లేప్రబంధములలోనివో నా కెఱుంగ శక్యముకాదయ్యె. గ్రంథశోధకులయ్యె పద్యము లెచ్చటివో గుర్తించి నాకుఁదెలుపుదురేని గృతజ్ఞుఁడనై వారినామధేయములతో రెండవ కూర్పున నెక్కించుచున్నాఁడను.

ఈ "విస్మృతకవులు" అను నామముతోఁ బ్రచురింపఁబడుచుండు పెక్కు కావ్యములు సవరించుటకునుఁ గొన్నిటికి శుద్ధప్రతులువ్రాసి యిచ్చుటకును జెన్న పురిలో నుండు నామిత్రులును లలితకవితాధురంధరులు నగు బ్రహ్మశ్రీ వేటూరు ప్రభాకరశాస్త్రిల వారు నాకుఁ జాల సహాయము చేసినందునకు వారికిఁ గృతజ్ఞతా సూచకములగు వందనములు సమర్పించుచున్నాఁడను. అయినను వీనిలోని దోషములన్నియు నాయవియే యని పండితులు గ్రహింతురుగాక.

వనపర్తి
౧౮ జూన్ నెల ౧౯౧౧.

మా-రామకృష్ణకవి.

# 6. త్రిపురాంతకోదాహరణము

ఈ యుదాహరణమను చిన్ని కృతి రచించిన కవి రావిపాటి త్రిపురాంతకుండని పెద్దన జగన్నాథ కవుల లక్షణ లక్ష్య గ్రంథములవలనఁ దెలియు చున్నది. ఈ త్రిపురాంతకుండే తిప్పరాజు. ఇతని ప్రేమాభిరామమను వీధిని శ్రీనాథుఁడు వల్లభరాయని పేరఁ దెనిగించియున్నాఁడు.

ఉ. నన్నయ భట్టు తిక్కకవి నాయకులన్న హుళక్కి భాస్కరుం
డన్నను జిమ్మపూఁడి యమరాధిపు డన్నను సత్కవీశులన్
నెన్నుదుటం గరాంజలులు నింతలుఁ జేయని రావిపాటితి
ప్పన్నయు నంతవాఁడు తగునా యిటు దోసపుమాట లాడఁగన్.

అని నటితో సూత్రధారుండు చెప్పినట్లున్నది. ఇతఁడు రెండవ ప్రతాపరుద్రుని కాలము వాఁడు. ఇతఁడు శ్రీశైలమునకుఁ దూర్పు వాకిలి యగు త్రిపురాంతక క్షేత్రమున జనించి తద్దేవునకు భక్తుఁడై శృంగారకావ్యములను భక్తి రస ప్రధాన కృతులను విరచించి ప్రఖ్యాతుఁడయ్యెను. మదనవిజయమను రతి శాస్త్రము, దారావళియను చంద్రస్తుతియు, అంబికాశతకమను పార్వతిస్తుతియు, నీ యుదాహరణమును సంస్కృతమునఁ బ్రేమాభిరామమను వీధియు నిమ్మహా కవి కృతములు. వీనిలో మదనవిజయ మెనిమిదాశ్వాసముల సంజ్ఞాభియోగిక భార్యాధికార పారదారిక వైశికాది ప్రకరణములు గలిగి యభినవకామసూత్రమో యన విలసిల్లు చున్నది. నాకుఁ జూడఁ దటస్థించిన ప్రతిలోఁ బూర్వ పీఠిక లేదు. మఱియుఁ దాళ పత్రములు బాణోచ్ఛిష్టమయి బూజు వట్టి విడదీసినచో సహస్ర శకలాకారము లందుచుండెను. తద్గ్రంథస్వాము లయ్యది పైతృక ధనమని యీ నొల్లకుండిరిగాక రెండవ మాఱు చూపకయునుండుట చోద్య మయ్యెను.

దానిలో నుండి రెండు పద్యముల మాత్రముదాహరించెదను.

క. సతి గుణవతియగు నేనియుఁ
బతి కది రత్నంబ ప్రాణబంధువ యమృతం
బతివయ దుర్గుణి యగునేఁ
బతి కెడపని చిచ్చు కాలుపక యది కాల్చున్.

మ. గుణమున్ సుందరరూపమున్ విభవముం గూటంబు సౌభాగ్య ల
క్షణముం జారుచరిత్రమున్ వినయమున్ జాతుర్యమున్ ధర్మభూ
షణముంగల్గి పతివ్రతా మహిమమించన్ గల్గెనేఁ దత్సతీ
మణిచింతామణి దానిఁదాల్ప గలుగున్ మర్త్యుండె ధన్యుండిలన్.

ఈ కవి రచించిన చంద్రతారావళి 27 వృత్తముల నూతన భావములు గలది.

మ. చరమక్ష్మాధరచారుసింహముఖ దంష్ట్రాకోటియోనాఁగనం
బరశార్దూలనఖంబొనాఁగఁ దిమిరేభప్రస్ఫుర ద్గర్వ సం
హరణక్రూరతరాంకుశం బనఁగ నుద్యల్లీల మీరేఖని
త్యరుచిం బొల్పగుఁ బెంపగున్ విదియచంద్రా రోహిణీ వల్లభా.

మ. అమితధ్వాంత తమాలవల్లిలవన వ్యాపారపారీణ దా
త్రమొ సౌగంధికషండ కుట్మల కుటీరాజీ సముద్ఘాటన
క్రమ నిర్వాణ ధురీణకుంచికయొ నాఁగంబెంపునన్ మీకళా
రమణీయత్వము చూడ నొప్పెనఁగుఁ జంద్రారోహిణీ వల్లభా.

మ. రతినాథుండను మాయజోగి చదలం దైత్రిలోక్యవశ్యాంజనం
బతియత్నంబునఁ గూర్చి మౌక్తికమయం బైయున్న పాత్రంబునన్
మతకంబేర్పడఁ బెట్టిదాఁచెనన మీమధ్యంబునన్ మచ్చ సం
తతముంగన్నుల పండువై వెలయుఁ జంద్రారోహిణీ వల్లభా.

అంబికాశతకమునఁ బార్వతీ నాయికాగుణ వర్ణనాదులు రసజ్ఞుల కింపుగా మృదు భాషతోఁ గూర్పబడినవి. నేఁటి కాలమున శృంగార సముద్ర సార విధురులు గొందఱును భక్తి రసనియమ ప్రణాళికా పారీణులు గొందఱును ఉత్తమ దేవతా వర్ణనముల శృంగారరస భావముల రసాభాసములుగాఁ దలచు చున్నారు. దీనిలో నుత్తమ దేవతలైనను నంబికాశివుల పరస్పర శృంగార రసోన్నతి వర్ణంపఁబడినది గాని ధ్వనికారుల మతమున రసాభాసమనునది మాత్రము దీనిలో నెచ్చటఁ - గానరాదు. దీనిలోని కొన్ని పద్యములు చదువు వారల కింపుగా నుండునని యుదాహరించెదను.

ఉ. భారతివై సరోజభవుపాల వసించి రమావధూటివై
నీరజనాభుఁ జెంది ధరణీధరనందనవై మహేశ్వరుం
గోరివరించితమ్మ నిను గొల్వకయూరక యేలగల్గు సం
సారసుఖంబులీ మనుజసంతతికిం దలపోయ నంబికా.

ఉ. తెప్పల బోరుఁదల్పు లిసిలింతలువాతెఱు చూపుఁగుంచియుం
ద్రిప్పితళుక్కునం దెలచి తిన్ననిమోమునఁ గాయువెన్నెలల్
ముప్పిరిగొన్న వేడుకలు మూఁగినసిగ్గసియాడఁ బ్రీతినీ
వప్పరమేశుఁ జూచి తనువర్ధముఁ గొంటి పౌసంగు నంబికా.

చ. బెడఁగగు రత్నదర్పణముఁ బేరిన వెన్నెలవోసి నిచ్చలుం
దుడువక పాలసంద్రమునఁ దోఁచి సుధాకరుమేనికందువో
గడుగక నేరెటేట సితకంజము ముంపక నైజకాంతియై
తొడరినఁ దల్లి! నీమొగముతో సరివోల్పఁగఁజాలు నంబికా.

ఉ. లాఁచి పరాంగనల్ వరవిలాసమనోహర విభ్రమంబులన్
జూచినఁ జూడఁడుత్తముఁడు చూపఱఁ జూచును మధ్యముండు తాఁ
జూచినఁ జూడకుండినను జూచుఁ గనిష్ఠుఁడు నన్ను వీరిలోఁ
జూచినఁ జూడకుండ గుణిఁ జూచిన చూపునఁ జూడుమంబికా.

ఉ. వాలినకన్నుముంగురులు వాతెఱకెంపు మెఱుంగుఁ జంటిపై
గ్రాలెడు తారహారమును గంకణచారుకరంబు డాఁపలం
దూలుచు నున్నపయ్యెదయుఁ దోచినకన్నులు మోడ్చిమోడ్చినీ
పాలగు నీశుమేని సగఁబాలు మనంబునఁ జేర్తునంబికా.

ఉ. కూడెడి వెంట్రుకల్ నిడుదకూఁకటిఁ బోవఁగ బొడ్డుపైవళుల్
జాడలుదోపఁ గ్రొమ్మొలకచన్నులు మించుదొలంకసిగ్గునం
జూడగనేరముల్ మెఱుఁగు జూపులనీన హిమాద్రియింటనీ
వాడుట శూలికిన్ మనమువాడుట గాదెతలంప నంబికా.

ఇతడు రచించిన సంస్కృత ప్రేమాభిరామము నాకు లభించినది కాదు. వానిని శ్రీనాథుఁడు క్రీడాభిరామమను పేరఁ దెనింగించెను. అదియతి మనోజ్ఞమై సహృదయాహ్లాదకరమై యున్నది.

ఈ యుదాహరణము మహా కావ్యములలోఁ జేరక క్షుద్రప్రబంధముల లోనిది. ఇది ప్రథమాది సప్తవిభక్తులును సంబుద్ధితోఁ గలసి యెనిమిది విభక్తులును బనుపడఁ బద్యములఁ గ్రమముగాఁ గూర్చి యొక్కొక్క దాని పిదపఁ గళికోత్కళికలను గానయోగ్యములగు మార్గజాతి పద్యముల జొప్పించి పరిపూర్ణమగు స్థాయి రసపరిపాకము గలుగునట్లులు రచింపఁబడును. భాషలోఁ గొన్ని యుదాహరణములే గలవు. వానిలో నెల్ల నిదిమేలయినది. దీనిలోని పద్యము లన్నియు సంస్కృతచ్ఛందస్సంజాతములగు వృత్తములు. కళికోత్కళికలలో రగడలును గొన్ని నూతనజాతులును గలవు. దాని క్రింద సూర్యచంద్రగణములేప్రధానములు. పూర్వకాలమున ద్విపదలు, రగడలు,సీస, గీత్యాటవెలఁది, తరువోజ, పద్ధళి, సద్ధళి, లయగ్రాహ్యక్కఱాదులు చాల వాడుకలో నుండెననియు నన్నయాది మహాకవుల ప్రౌఢకావ్యములు జనించిన తోడనే యవి క్షీణించెననియు నేను దలఁచుచున్నాను.

నన్నె చోడుఁడు కుమారసంభవమున

క. ''మునుమార్గ కవిత లోకం
బున వెలయఁగ దేశికవితఁ బుట్టించితెనుం
గు నిలిపి రంధ్రవిషయమునఁ
జన సత్యాశ్రయుని తొట్టి చాళుక్యనృపుల్" అని చెప్పెను.

దీనిలో మూఁడవ నాల్గవ చరణములకే నాకిటీవల లభించిన ప్రతిలో

గును నిలిపి రంధ్ర విషయం
బున జనఁ జాళుక్యరాజు మొదలుగఁ బలువుర్.

అను పాఠాంతరము గానవచ్చుచున్నది.

ఈ భిన్నపాఠముల యుక్తాయుక్తత స్థలాంతరమున జర్చించెదను.

ఈ పద్యమున మార్గ, దేశి, పదములకు నాయభిప్రాయమున, ప్రాచీన, నవీనరీతు లనునర్థములు గలవు. ఈయర్థమున సంస్కృత కర్ణాట భాషలలో నీ పదములకు బహుప్రయోగములు లభించుచున్నవి.

పూర్వము మార్గ కవిత లోకమున వెలసె ననగా ద్రవిడ కర్ణాటములఁ బ్రాచీన రీతులగు రగడ ద్విపదాదులే యాంధ్రభాషలోను వెలసెనని యూహించెదను. ద్రవిడమున మణిమేఖల రగడళ్లతో నిండినది , జీవకచింతామణిలో

వృత్తములఁ ద్రోచినచో నింద్రాది గణములు గల పద్యము లగపడును. కర్ణాటక మున బహుప్రాచీనకృతియగు కవిరాజమార్గమునను అక్కఱలు గీతులు విస్తారముగా లభించును. ద్రవిడ కర్ణాటాంధ్ర భాషలలో మార్గరీతి యింద్ర చంద్రాది గణబద్ధ పద్యమయమైనది. భాషాంతరముల నుండి నంతఁ దెనుంగున నుండవలసెనా విభీషణ కుంభకర్ణ శబ్దములలోని భకారము రావణశబ్దమున యని కొందఱు వాగ్వైచిత్రిని వెల్లడించెదరు. విషయమట్లున్నప్పుడుపమానము లచేఁ గుయుక్తి సాధన మార్థికుల మార్గము కానేరదు. నన్నయకుఁ బూర్వపు శిలాశాసనము లక్కఱ తరువోజాది మార్గపద్యములచే నిండినవి. చూడుఁడు యుద్ధమల్ల పాండరంగాది శాసనములు. పూర్వమిట్టి క్షుద్రకావ్యములకుఁ జాల ప్రసిద్ధి గలిగియుండెను.

సంస్కృతమున నుదాహరణములుండెననుటకు గొన్ని నిదర్శనములు గలవు. కాళిదాసు విక్రమోర్వశీయమున "పత్రేనివేశిత ముదాహరణం ప్రియాయా" అనియు,రఘువంశమున "జయోదాహరణం బాహ్వోర్గాపయామాస కిన్నరాన్'' అని చెప్పియున్నాఁడు. విద్యానాథుఁడు క్షుద్రకావ్యలక్షణము సెప్పుచు "యేనకేనాపితాలేన గద్య పద్య సమన్వితం। జయేత్యుపక్రమం మాలిన్యాదిప్రాస విచిత్రతం। తదుదాహరణం నామ విభక్త్యష్టాంగ సంయుతం" అని వ్రాయు చున్నాఁడు. ఇట్టి నమ్మకముతో భాషాంతరముల వెదుకఁగా సంస్కృతమునఁ బాల్కురికి సోమనాథుని బసవోదాహరణమును గర్ణాటకమున నుదాహరణ గద్యయు లభించెను. ఇదియు వీరశైవకవికృతమే. ఆంధ్రమున నీకృతిగాక యప్పకవి లక్ష్యముగాఁ జూపినదియు శేషార్యోదాహరణ మను నిటీవలికృతి యొకటియుఁ గలవు. ఇంకను బెక్కులుండవచ్చును. ఆంధ్రమునగల మూఁడుదా హరణములు నొక్కరీతిగా నున్నవి. ప్రాయశః త్రిపురాంతకోదాహరణమును దక్కినవనుసరించి యుండును.

సోమనాథుని యుదాహరణమునఁ గళికోత్కళికలు మాత్రాప్రధానములై ప్రాసాంత్యప్రాసములతో నొప్పుచున్నవి. ఉదాహరణము భగవత్స్తోత్ర రూపము లగు గేయప్రబంధముల జాతిలోఁ జేరినట్లు తోచుచున్నది. పూర్వయుగంబున దక్ష ప్రజాపతి సప్తగీతములను పేర్వడసిన స్తుతిజాలము రచింపగా మహ ర్షులు మహేశ్వరుని తాండవానంతరము వానితో స్తోభాక్షరములు చేర్చి పెక్కు ఖండములుగాఁ దాళభేద భంగులతో భగవంతుని స్తుతి చేసి నమస్కరించు

చుండిరని పురాణములవలనఁ దెలియుచున్నది. మద్రకము, ఉల్లోప్యకము, రోవిందకము, ప్రకరీ, ఉత్తరము, ఓవేణకము, అపరాంతకము, అనునీయేడును దాళాంగ ప్రధానములగు సప్తగీతములు ఋక్పాణికాగాథాది సప్త రూపపరిణామములు. ఉదాహరణములో సప్తగీత నిష్ఠములగు తాళాంగవర్ణాంగములే ధ్రువకళికోత్కళికా రూపమున నడచుచున్నట్లూహింపఁదగు. తాళాంగమున చతురశ్ర త్యశ్ర జాతితాళములు వ్యక్తముగా నున్నవి. కళికపర్ణాంగమున నేకకలయు లేక యర్ధకలయు, నుత్కళిక ద్వికలయు లేక యధ్యర్ధకలయు నగుచున్నవి. ఈ పద్యభేదములన్నియు భరతుని నాట్యశాస్త్రమునఁ బేర్కొనబడినవి.భరతుఁడు 'గుర్వాదిరథలఘ్వాదిర్యుగ్మః సర్వలఘుఃస్మృతః చతుర్మాత్రాగణాజ్ఞేయాః పూర్వచ్ఛందో వికల్పనాఃపాతోర్ధకళికాన్ పాతాన్ కుర్యాల్లఘ్వక్షరేషుచ గుర్వక్షరే తాలగీత పాతాస్తు కళికాఃస్మృతాః" అని చెప్పియున్నాఁడు. భారతీయముననే సీసమునకు బూర్వరూపమగు శీర్షకము రగడకు మాతృకయగు రఘటయు లక్షణలక్ష్య ప్రపంచితములై యున్నవి. సోమనాథుడు విభక్త్యంతములఁగూడ నంత్యప్రాస ప్రాసములఁ గూర్చెంగాని యాంధ్రభాషాలక్షితమగు యతి మాత్రము సంస్కృతమునఁబాటించినవాఁడు కాఁడు.

ఆతని యుదాహరణమునుండి కళికోత్కళికలు కౌతుకమాత్రముగా నుదాహరించెదను. ప్రథమావిభక్తికిఁ గ్రింది

## కళిక

అపిచ పురాతన నూతన శివగణ పాదోదక పరిలసదభిషేకః
క్షపితవిపల్లవ జంగమ లింగసమర్చననిచితవివేకః
సతతవికస్వరభాస్వర నిజముఖమండల ఖండిత రజనీనాథః
కృతయుగవర్తన కీర్తన నిరసన నిపుణ పవిత్రచరిత్రసనాథః
ప్రకటిత దర్పకదర్పకరేణు ప్రమథన నిశితకరాంకుశ హేలః
శుకముఖమానసకమలాకర విహరణచణ రాజమరాళః
స్వానుభవాంచిత కుండలి సంగమసంతత దేవధ్యానాభిజ్ఞ
సూన్నృతభాషణభూషణ వాణీ సింహాసన గంభీరరసజ్ఞః

### ఉత్కళిక

శ్రుతి ముఖరస్వరసరససమేతః
స్మృతినికురుంబర సాయనగీతః
ప్రముదిత హృద్వర్తన శితకంఠః
శమదమలాలన గుణితోత్కంఠః

### సప్తమీవిభక్తిలోఁగళిక

అపిచాధార సురంగజ్ఞాతరి
సుపథపథిక చిత్సుఖ సంధాతరి
వర్గచతుష్టయ దాపనశీలిని
దుర్గనిరసన కరుణాశాలిని.

### ఉత్కళిక

సురగిరి మందర
నిరుపమ కందర
ఘనహరిచందన
వనమయ నందన

శేషార్యోదాహరణమున నప్పకవి యుదాహరణమునఁ ద్రిపురాంతకోదాహరణమునఁ గళికోత్కళిక లన్నిభంగుల నీడుగానున్నవి.

దీనిలోని యద్వైతమార్గము సులభముగాఁ దెనుఁగుపదములతో నున్నది. భక్తిప్రధానముగాఁ దెనుఁగునఁ బెక్కు కృతులులేవు. దీని శబ్దార్థమాధుర్యమునకు మెచ్చి చిన్నదైనను నీకృతిరత్నమును బండితులు కంఠాలంకారముగా వహింతురని తాళీదళకాంతారముల నడుమఁజిక్కినదాని యథాశక్తి దుమ్ముదులిచి లోకమున కిచ్చితిని. లేఖకదోషము లింకను జిక్కియుండెనేని పండితులు సంస్కరింత్రుగాక. నేను విద్వద్హృదయరంజనమే ముఖ్యోద్దేశము గాన స్వశక్తిఁ బరిశీలింపక సంస్కరణ క్రియకుఁ జొచ్చినందునకు లోకము క్షమించుగాక.

చెన్నపటణం.
1912

మా - రామకృష్ణకవి.

# 7. సకలనీతి సమ్మతము

రాజ్యాంగములలో సకలవర్గంబుల వారును బరస్పరము ప్రవర్తింపవలసిన నీతిమార్గమును సకల గ్రంథసమ్మతమగు నట్టిదిగా నేర్చి దీని సకలనీతి సమ్మత మనుపేర మడికిసింగన కూర్చె. ఇందుఁ జేర్పనుద్దేశించిననీతివర్గముల గ్రంథారంభముననే (17వ సంఖ్య గద్యమున) కవి వివరించెనందు "అధికాధమ విరోధ భేదంబును" అను నంతకుఁగలమూఁడాశ్వాసముల గ్రంథమె మనకు లభింపఁగా నిందు ముద్రింపఁగడంగితిమి. పైభాగము సహితము లభించునేని వాఙ్మయము నకు నిక్కముగాఁ బెంపుగలుగును. ప్రతిజ్ఞాతవిషయములో రాజనీతిభాగము మూఁడాశ్వాసములనె ముగియుచుండుటవలనను దక్కినభాగములో లోకోక్తి సంగీతనాట్య విషయమును బూజాప్రతిష్ఠాది ప్రశంసలును గలవగుటచే నీగ్రంథ మును మొదట వ్రాసికొనిన వారు దాని నసంబద్ధమని వదలియుందురేమో.

మడికిసింగన గోదావరీప్రాంతమున నుండు పెద్దమడికి నివాసియయ్యును నోరుగల్లున కుత్తరముననుండు రామగిరి పట్టణమున కధీశ్వరుండగు కందన మంత్రికాశ్రితుఁడై బహుగ్రంథముల రచించె. వానిలోఁబద్మపురాణము, భాగవత దశమ స్కంధము (ద్విపదకావ్యము), వాసిష్ఠరామాయణము మనకు లభించు చున్నవి. దశమస్కంధభాగము తంజాపురి పుస్తకభండారమున నాద్యంతములు లేక యొక మాతృక గలదు. తక్కినవి ముద్రితములైనవి. కందనమంత్రి పేర నీతితారావళియని యొకగ్రంథము సింగన రచియించినది నేటికిఁగానరాదు. సింగన సకలనీతిసమ్మతమున దానిలోనుండి పెక్కుపద్యము లుదాహరించు కొనెను. మడికిసింగన యుండినకాలము పద్మపురాణ రచనాకాలముతెలిసినందునఁ జిక్కులు లేక విస్పష్టమగుచున్నది.

"ఆకరయుగానలమృగాంకశకవత్సరములై పరఁగుశార్వరినిబుణ్య
ప్రాకటితమార్గశిరపంచమినిబొల్చు నుడుపాలసుత వాసరమునందున్
శ్రీకరముగామణికి (మడికి) సింగనదెనుంగున రచించెఁ దగఁబద్మపురాణం
బాకమలమిత్రశిశిరాంశువుగఁగంద సచివాగ్రణికి మంగళమహాశ్రీ"

అనఁగా శాలివాహన వర్షములు 1342 లకు సరియైన క్రీ. శ. 1420 సంవత్సరమునఁ బద్మపురాణము రచింపఁబడియె. కవి తన గ్రంథరచనాకాలము

చెప్పకున్నను గంధనమంత్రియు నతని కాశ్రయులగు ముప్పడియుఁదెలుంగు రాయఁడును ప్రభుత్వముచేసిన కాలములు సులభముగా లభించుచున్నందున మడికిసింగన కాలము దుస్సాధ్యము గానేరదు. సకలనీతి సమ్మతమునఁ బద్మ పురాణమునుండి పద్యములు (204 మొ) గ్రహింపఁబడి నందున నిది 1430 క్రీ. శ. ప్రాంతముల రచింపఁబడియుండును. ఈ కాలముననే శ్రీనాథుఁడును, నిశ్శంక కొమ్మనయు (శివలీలావిలాసకర్త), గౌరన, అనంతుఁడు, జక్కన, మల్లన మొదలగు కవులు తమతమ కృతులచేఁ బ్రఖ్యాతి వడయుచుండిరి. సకల నీతిసమ్మతము దేవాంకితమైనను గంధనామాత్యుని భ్రాతయగు కేసనమంత్రి సబహుమానముగా నిందుఁబేర్కొనబడియె. కందన బ్రాహ్మణుఁడు, కాశ్యప గోత్రజుఁడు. కందుకూరి వీరేశలింగంపంతులవారు కందనమంత్రి పూర్వజులలో నొక్కఁడగు గన్నమంత్రిని మార్కండేయపురాణకృతిపతియగు గన్నమంత్రిగా గ్రహించి ప్రమాదపరంపరతో భావనాసోపానములు గట్టెను. కందమంత్రిని,

> "ధరణీదేవకులాబ్ధిచంద్ర విలసద్దానాంబు ధారార్ద్ర వి
> స్తరహస్తాంబుజ మంత్రిరక్షణ కళాచాతుర్య సాహిత్యగీ
> తరసాస్వాదన లోకమానన సదాధర్మజ్ఞ శ్రీముప్పడీ
> శ్వర కారుణ్య కటాక్షవర్ధిత మహాసౌభాగ్యభాగ్యోదయా."

అని పద్మపురాణమున నష్టమాశ్వాసాంతమునఁ గవి సంబోధించెను. మారన మార్కండేయపురాణమున గన్నమంత్రి వంశావతారక్రమము వర్ణించుచు.

> "ఆచతుర్థకులసుధాంబుధినుదయించె నమితకాంతి చంద్రుఁ డవనిభరణ
> దిగ్గజేంద్రమును వితీర్ణమందారంబు మల్లసైన్యవిభుఁడు మహితకీర్తి",

అని గన్నమంత్రిఁ జతుర్థవంశజునిగాఁ బేర్కొనియె. కావున నీరెండు వంశములవారును భిన్నులగుట నిశ్చయము. కందనమంత్రి తాతలు కాకతీయ గణపతియొద్ద సామంతులైయుండి గణపేశ్వరాదిస్థలముల దేవాలయ ప్రతిష్ఠలు సేసి ప్రఖ్యాతిగాంచిరి. మడికిసింగన తిక్కనసోమయాజి కుమారుఁడగు కొమ్మనమంత్రికి దౌహిత్రుని కుమారుఁడు. ఆదౌహిత్రుఁడగు నయ్యలమంత్రియు ననపోతిరెడ్డికి మంత్రియైప్రసిద్ధికెక్కె. కావుననే మడికిసింగనకు రాజనీతి శాస్త్రముల ధౌరంధర్యము గలిగెఁగాబోలు. మడికిసింగన కాలము ననుసరించి చూచినయెడలఁ దిక్కనగాలము 1260 కంటెఁ బ్రాఁతపడదు.

సకలనీతిసమ్మతమున నుద్ధృతములగు పద్యముల కాకరగ్రంథనామములఁ గవియే పేర్కొనియె. అందు ముద్రామాత్యము, నీతిసారము, పంచతంత్రి, పురుషార్థసారము, నీతిభూషణము, కామందకము, నీతితారావళి, కుమారసంభవము, చారుచర్య, బద్దెనసీతి, పద్మపురాణము, శాలిహోత్రము, భారతము మొదలగునవి గలవు. వీనిలో మొదటియేడు గ్రంథములు నష్టములయ్యె. కుమారసంభవము నన్నెచోడకృతము, బద్దెనసీతియు మేము ముద్రింపించియుంటిమి. చారుచర్య శ్రీముక్త్యాల ప్రభువులచేఁ బ్రకటింపఁబడియె. శాలిహోత్రము పీఠికాపద్యములు గానరాక కొంతభాగము పెక్కుచోటుల ముద్రితమయ్యె. తక్కినవి సుప్రసిద్ధములు. ఈ గ్రంథములన్నియు సింగనకంటెఁ (1420 క్రీ. శ.) బూర్వరచితములని స్పష్టము.

శాలిహోత్ర మనునశ్వశాస్త్రమును మనుమంచి భట్టారకుఁ డసుపవి హయలక్షణ విలాసమనుపేరఁ దెనిఁగించెను. ఇయ్యది యెంత ప్రాచీనమో యెఱుఁగుట కానుకూల్యములేక పీఠికాపద్యము లెచ్చటనులభించినవి కావు. అది చాళుక్యకంప భూపతి కంకిత మీయఁబడియె. విద్యానగరపుఁ గంపభూపతి మడికిసింగన కాలము వాఁడు కావున మనుమంచిభట్టును నతని ప్రభువగు కంపరాజును దప్పక ప్రాచీనులే.

ముద్రామాత్యము క్షేమేంద్రుఁడను బిరుదము వహించిన లక్కాభట్టను కవి రచించినట్లు తోచుచున్నది. క్షేమేంద్రకవి క్రీ. శ. 1050 ప్రాంతముల నుండెఁ గావునఁ దద్బిరుదవహనముచే నితఁడు తత్పూర్వుఁ డగుటకు సాధ్యుఁడు కాఁడు. ఇతఁడు శూద్రకరాజచరిత్రమును శతపక్షిసంవాదమును రచించినట్లు లక్షణగ్రంథోదాహృతపద్యములవలనఁదెలియుచున్నది. బాలబోధమనియుఁ గవిసంజీవని యనియు సందిగ్ధనామములుగల యొక్క ఛందోగ్రంథమున ముద్రామాత్య నీతిభూషణ పురుషార్థసారములనుండి పద్యము లుదాహృతములయ్యె. అందు ముద్రామాత్యములోనిదని క్రిందిపద్యము గానఁబడుచున్నది.

మ. మనుజాధీశ్వరుకంటె మంత్రి బలసామర్థ్యంబు నర్థంబు రా
జ్య నియోగంబును నగ్గలం బగుచు నాజ్ఞాలంఘనోద్యుక్తుఁడై
మను దుష్టవ్యవసాయుఁ డేమఱి మదోన్మత్తాత్ముఁడై కూలుఁ గ్ర
క్కున ము న్నాతనిచేఁ దదీశుఁడు సదీకూలాపనీజాకృతిన్.

ముద్రామాత్యము కేవలము నీతిగ్రంథము కాక ముద్రారాక్షసమువలె నొక రాజు ప్రాభవమును సంపాదించు మంత్రిశిఖామణి నీతిధౌరంధర్యమును వర్ణించుకావ్యమో యనుసందియము గలిగించుచున్నది. ఇందు రాజరాజవంశజు లగుచోళభూపతుల జయించిన చాళుక్యరాజులయో లేక చాళుక్యుల జయించిన కాకతీయులయో పరాక్రమము ప్రశంసింపఁబడినట్టుదాహృత పద్యములవలన నూహింపఁదగియున్నది.

ఆ.వె. రాజరాజవంశభూజనపతు లీల్గి, రకట మంత్రి దొలఁగి యలికినాఁడు
ఏది వసుపుసేయ నిటు నిల్వఁబోలదు, రాజు లేనికయ్యమోజపడునె. 927

ఉ. కొన్నిదినంబు లిక్కడ నకుంఠితలీలఁ బథశ్రమార్తియై
యున్నబలంబు గెల్చుకొను టొప్పగు నంతియ కాదు శత్రుభూ
మిన్నిజమార్గ మారయక మిన్నక యేఁగుట యేది బుద్ధి యా
యున్నెడఁ జూచి వెళ్లజను లున్నర (?) చెప్పఁడు గూఢచారతన్. 852

ఇవి కథాభాగములోని పద్యములట్లు గాన్పించును గాని కేవలము నీతి విచారములు గావు.

నీతిసారమును మొదటి కాకతీయరుద్రదేవుఁడు రచించినట్లు ప్రాచీనపద్యో దాహరణములు గలవు. ఉషాపరిణయ మనుసంస్కృతనాటకము రుద్రదేవకృత మని యొకటి గలదు కాని యక్కవి కాకతీయుఁడా యనుట విశదము కాదయ్యె. సంస్కృతభాషలోఁగామందక నీతిసారము,శుక్రనీతిసారము. అనిప్రసిద్ధములుగా రెండునిబంధనములుగలవు. సింగన యుదాహరించిన నీతిసారపద్యములకు మూల మూ రెంటను గానరాదు. బార్హస్పత్యనీతిసారమని మూఁడువేలశ్లోకములతో నొకటి యుండినట్లు వైశంపాయనకృతివ్యాఖ్యాతయు యామళాష్టకతంత్రకారుఁడును బేర్కొనుచున్నందునను వీరమిత్రోదయాదిగ్రంథములలోని బృహస్పతిమత నీతియె మననీతిసారపద్యములఁ గానవచ్చుచున్నందున రుద్రదేవుఁడు బార్హస్పత్య నీతిసారమునె తెనిఁగించెనని సందేహము గలుగుచున్నది.

సకలనీతిసమ్మతమునఁ బంచతంత్రి పేర నుడివినగ్రంథము లభింప దయ్యె. కర్తపేరు నెఱుంగ సాధ్యము గాదు. ఈ కవి లభించుచున్న పంచ తంత్రముల కర్తలకంటెఁ బ్రౌఢుఁడని వెంకటనాథాదుల పద్యములఁ బోల్చి చూచిన నెఱుంగవచ్చును.

నీతిభూషణమును నాంధ్రభోజుఁడను కవి రచించినట్లొక లక్షణ గ్రంథమునఁ గలదు కాని యతఁ డెవ్వఁ డని గుర్తింప వీలుకాదు. బాలబోధ లక్షణమున దీనిలోనుండి పెక్కుపద్యము లుదాహృతము లయ్యె. అందు

మ. సకలస్థాణుశిరఃప్రవర్తి నురుపక్షద్వంద్వశుక్లాభిరం
జకుఁడన్ సర్వదిగంతగామి ననకృత్స్నంసేవ్యమానుండ నై
ష్ఠికుఁడం గావున మత్సమానుఁ డగునే శీతాంశుఁ డం చెప్పుడుం
బక మిందుం బ్రహసించునట్లు సుజనుం బల్కుం దురాత్ముం డిలన్.

చ. వలసినవంకలం గురియు వర్షసమాగమమేఘ మేఁగి త
న్మలినత దాతయం దవగుణంబును సహ్యమె వృష్టి లేక ని
ర్మల మగుచోఁ దలంపఁగ శరద్ఘన మేటికి నట్ల యాగిమై
నెలయనివానివెల్లఁదన మేమి ప్రయోజన మర్థికోటికిన్.

అని మొదలగు పద్యములు గలవు. నీతి భూషణమునకు సంస్కృత మున మూలమేదో యిప్పటికిఁ దెలియరాదు.

పురుషార్థసారము గణపతికి రుద్రదేవికిని మంత్రి యగు శివదేవయ్యచే రచిత మని "శివదేవయ్య పురుషార్థసారములో" నను నుదాహరణమువలన నూహింపఁదగి యున్నది. అతఁడు పురుషార్థసారము గాక "శివదేవధీమణీ" యని మకుటము గలయొక శతకమును గూడ రచించినట్లు తోచుచున్నది. బాల బోధమునను లక్షణశిరోమణిలోను బురుషార్థసార శివదేవశతక పద్యములు పెక్కు లుదాహృతము లయ్యె. శతకములోనుండి —

ఉ. ప్రాణ నపానుఁ గూర్చి యలపాముఁగదల్చి తదూర్ధ్వకీలితో
ద్యాణము నొత్తి మేను దృఢమై నిగుడం బిగియించి దృష్టులం
ఘోణము చేర్చి యాప్రణవఘోషణమున్ విని యందు మానస
క్షీణము సేసినం బవనసిద్ధుఁ డనా శివదేవధీమణీ.

చ. అరయఁగఁ బిన్ననాఁట సిరియాళుఁడనై యెలఁ బ్రాయమందు సుం
దరుఁడును నంబినై పదనుదప్పిన గుండయగారిచందమై
ధరఁ జరియింపఁ గల్గినఁ దథాస్తు వృథా పరిపాకరూపదు
ష్కరజననం బిదేమిటికిఁ గాలుపనే శివదేవధీమణీ.

అను పద్యములును, సకలనీతిసమ్మతమున నుదాహృతము లగు 144,179 సంఖ్య గల పద్యములు పురుషార్థసారమునుండియు బాలబోధమునఁ దత్కర్త యుదాహరించె.

కామందకము సంస్కృతమున నుండి కొండ్రాజు వేంకటాద్రి నరేంద్రున కంకితముగా నెనిమిదాశ్వాసముల 1584 క్రీ. శ. వేంకటరామకృష్ణకవులు తెనిఁగించినది గలదు. మడికిసింగన తత్పూర్వుఁ డగుటచే నందు మనపద్యములు గానరా కుండుట యచ్చెరువుకాదు. కామందకము కౌటిల్యుని యర్థశాస్త్రములోని సారము గలది. దానికి సంస్కృతభాషలో మూఁడు వ్యాఖ్యలు గలిగియునందుఁ గొన్ని స్థలములు క్లిష్టముగా నుండును. అది శాస్త్రగ్రంథమువలెఁ గాక మనోహర కావ్యమువలెఁ బ్రసన్నగంభీరమై యున్నది. సింగన యుదాహరించిన కామందక మెవ్వరియనువాదమో కాని యదిప్రౌఢమై సందిగ్ధస్థలములఁ జక్కఁగా వివరించునదియై యున్నది. తరువాతి కామందకము పెక్కుచోట్ల నీరసమై శాస్త్రవిరుద్ధ మగుటయుఁగాక కవితయు శిథిలబంధయై వృత్తజాతి సమాహరణమున గవికిఁ బ్రజ్ఞాదారిద్ర్యము దోపించును. సకలనీతి సమ్మతములోని 286-వ పద్యమునకు రెండవకామందకమున—

మ. తొలుతం దా జలకంబు దీర్చి చలువల్ తోడ్తో విరుల్ సొమ్ములుం
గలపం బందుచు దేవియుం జలకముల్ గావించి రాఁ జల్వలుం
గలపంబుల్ మణిభూషలున్ విరులు జోకం దానె యిప్పించి నే
ర్పులఁ గూడందగు రాజు పెంపెసఁగ నింపున్ సొంపు గల్పించుచున్.

ఈ వర్ణనము రాజు లాత్మరక్షణార్థము తమదేవులయిండ్లకుఁ బోకవారినే తమ వాసగృహములకుఁ దెప్పించుటయె నీతి యను నుపదేశ సందర్భమున నున్నది. ప్రధానాంశము మఱచి కవి రాజభోగము వర్ణించె. 257-వ పద్యమునకు రెండవ కామందకమున—

సీ. విషముఁ జూచినవేళ విషయుక్తమైన
పదార్థంబు చూచినయట్టివేళఁ
దలఁకఁబాఱుచును గ్రోతులును రాచిలుకలు
గొరవంకలును సారెఁ గూఁత లిడును

గన్ను లెఱ్ఱఁగఁబాఱుఁ గలహంసలకునెల్ల
మఱిమదంబునఁ జెంది మలయుఁ గొంచ
మదకోకిలంబులు మరణంబు సెందును
వెన్నెలపులుఁగులు వేగ బడలు

గీ. నిందు నొక్కటిచేనైన నెందు లెస్స
తాఁ బరీక్షించి ధారుణీధవున కెపుడు
భోజనము సేయఁదగు నిట్లు భోజనంబు
చేయుచుండినఁ బతి హాని చెంద కుండు.

ప్రాఁతకామందకమున 'లలిఁ జకోరములకన్నులు విరాగము లగు ననుచోట "చకోరస్య విరః తే నయనే" యనుటకు రెండవకవి మరాళస్య యని పఠించుకొనియె.

287-వ పద్యమునకు సరిగా రెండవకామందకమున—

సీ. భార్యయింటికిఁ జని భద్రసేనుఁడు తొల్లి
యామెతోఁబుట్టుచేహతుఁడగుటయు
నాలిగృహంబున కరిగి కారూశుండు
తనతనూభవునిచేతనె పొలియుటఁ
బ్రియురాలు విషముతోఁ బేలా లొసంగిన
వేగంబ కాశికావిభుఁడు పడుట
జడలోన దాఁచుకుండెడుకత్తి తెలియక
రమణిచేతన విదూరథుఁడు చెడుట

గీ. యటు కరాళాంజనము పూసి యద్ద మందె
మేఖలయు నీయ జారూప్యమేదినీశు
లవని వైరూప్యసౌవీరు లడఁగు టెఱిఁగి
యధిపుఁ డతివలయిండ్లకు నరుగరాదు.

అని చెప్పుటలో భద్రసేనుఁడు తనబావమఱఁదిచేఁ జంపఁబడె ననియు, కరాళాంజనము పూసినయద్దమును, అందెయు, మొలనూలును బ్రయోగించి క్రమముగా జారూప్య వైరూప్యసౌవీరరాజులఁ దమతమభార్యలు చంపిరని రాజులకు దేవీగృహగమనము కవి నిషేధించుచున్నాడు.ప్రాచీనకామందకమున భద్రసేనుఁడు

తనతోఁబుట్టువుచే జచ్చినట్టును వైరూప్యునకు మాఱు వైరంత్యుఁ డనియు నున్నది. మూలమున—

దేవీగృహం గతో భ్రాతా భద్రసేన మమారయత్
మాతుః శయ్యాంతరాలీనః కారూశం చౌరసః సుతః
లాజాన్ విషేణ సంయోజ్య మధునేతి విలోభ్య తమ్
దేవీ తు కాశిరాజేంద్రం నిజఘాన రహోగతమ్
విషదిగ్ధేన సౌవీరం మేఖలామణినా నృపమ్
నూపురేణచ వైరూప్యం జారూష్యం దర్పణేన చ.

అని వైరూప్యమునకు మాఱు వైరంత్యమనియు కొన్నిప్రతులఁ బాఠముగలదు. కౌటిలీయమున "దేవీగృహే లీనో హి భ్రాతా భద్రసేనం జఘాన। మాతుః శయ్యాంతర్గతశ్చ పుత్రః కారూశమ్। లాజా న్మధునేతి విషేణ పర్యస్య దేవీ కాశిరాజమ్। విషదిగ్ధేన నూపురేణ వైరంత్యం। మేఖలామణినా సౌవీరం, జాలూధ మాదర్శేన వేణ్యాగూఢం శస్త్రం కృత్వాదేవీ విదూరథం జఘాన॥" అని యున్నది. బాణుని హర్షచరితమున స్త్రీలయందు నమ్మిక దోషజనకం బని "స్త్రీ విశ్వాసిన శ్చ మహాదేవీ గృహగూఢభిత్తిభాగ్భ్రాతా భద్రసేనస్యాభవన్మృత్యవే కాళింగస్య వీరసేనః। మాతృశయనీయతూలికాతలనిషణ్ణశ్చ తనయోఽ న్యం తనయ మభిషేక్తుకామస్య దధ్రస్య కరూశాధిపతే రభవన్మృత్యవే। మధుమోదితం మధురకసంలిప్తైర్లాజైః సుప్రభా పుత్రరాజ్యార్థం మహాసేనం కాశిరాజం జఘాన। వ్యాజజనితకందర్పదర్పా చ దర్పణేన క్షురధారాపర్యం తే నాయోధ్యాధిపతిం పరంతపం రత్నవతీ జారూథమ్। యోగపరాగవిషవర్షిణా చ మణినూపురేణ వల్లభా సపత్నీరుషా వైరంత్యం రంతిదేవమ్। వేణీనిగూఢేన శస్త్రేణ బిందుమతీ వృష్ణిం విదూరథమ్। రసదిగ్ధ మధ్యేన చ మేఖలామణినా హంసవతీ సౌవీరం వీరసేనమ్॥" అని పలుకారణంబుల మగలఁ జంపినవీరస్త్రీల ప్రశంస చేయఁ బడియె. ఇంకను శోధింపఁ గళింగరా జగు భద్రసేనుఁడు మహాదేవీగృహమున లోగోడలో దాఁగుకొనియున్న తనయన్న చేతనె చచ్చెనఁట. కాశిరాజగు మహాసేనుని భార్య సుప్రభ తనకొడుకునకు రాజ్య మిప్పింపఁగోరి మగనిఁ జంపించె నఁట. సుప్రభ కంటెఁ గైకేయి ఋజుహృదయగదా? రత్నవతి మదవిభ్రమ మిషంబున నయోధ్యాపతి యగు పరంతపు (నన్య స్త్రీసక్తు) మదనలీలా విలాస ముతో నద్దము విసరి వైచి చంపెనఁట! సవతిసౌభాగ్యము నోర్వఁజాలక

సునందన వైరంత్యనగరాధీశుఁ డగురంతిదేవుని పై విషముక్రక్కునందియ విసరివైచి సవతిపైఁ బగదీర్చుకొనియెనఁట. విదూరథ రాజగు వృష్ణిభార్య బిందుమతి మగని వాక్పారుష్యము సహింపఁజాలక జడలో శస్త్రికదాఁచి యుంచి సురతాంతపరవశుఁడై విస్రంభముతో తనయురంబున వాలియున్నతనిఁ జంపివై చెనఁట! ప్రాఁతకామందకమున "కెరలి శత్రులపయిఁ బ్రయోగింపవలయు" నని శత్రురాజులలో భేదము పుట్టింప దుష్టస్త్రీ విషకన్యా ప్రయోగమును సమర్థించెను.

ఇట్లు సకల నీతిసమ్మతమునఁ గామందకపద్యముల నెల్ల మూలముతోఁ బరీక్షింపఁ దత్కవి వస్తువిచారము చక్కఁగాఁ జేసి వివరణప్రాయముగాఁ దెనిఁగించె నని తేలుచున్నది.

కవితాచరనలో నీతిసార పురుషార్థసారములు చాలఁ బ్రౌఢములైనవి తరువాతఁ బంచతంత్రీ ముద్రామాత్య కామందకములను గ్రమముగాఁ జెప్పవచ్చును. పురుషార్థసారములో భావములు వక్రోక్తిచతురములై హృదయంగమము లగుచున్నవి. తుల్యప్రదేశములఁ బోల్చిచూడ నీ ప్రాచీనపద్యములకుఁ దరువాతికవుల పద్యరచన తీసిపోయి వస్తునిష్కృష్టియు, రసభావసమగ్రతయు, నిమిడికయు ననుటలో న్యూనత్వము చెందుచున్నది.

## అర్థశాస్త్ర ప్రశంస

నాలుగుపవేదములలో నొక్కటియగు నర్థవేదము మానవుని యర్థసంపాదన రక్షణక్రమముల నుపదేశించును. అది యర్థసంపాదనమున సకలరసవాద ధాతువాదక్రియలను, వార్త యను పేరఁ బరఁగు కృషి, పాశుపాల్య, వాణిజ్య ధర్మములును, అర్థరక్షణక్రమమున ధర్మన్యాయపరిపాలనంబును దండనీతియు గలసి యర్థశాస్త్రం బనఁ బ్రఖ్యాతిగాంచె. ఇట్టి శాస్త్రము లోకవ్యవహారవిద్యా సర్వస్వమును గ్రహించుటచే నం దేకదేశముగా రాజనీతి యను పేర రాజ్యరక్షణ క్రమముమాత్రము విశదీకరించునది యర్థశాస్త్ర మని బుధులు వ్యవహరింతురు. ఇందుఁ జాణక్యుని షట్సాహస్రియను కౌటిలీయార్థశాస్త్రము ప్రమాణగ్రంథముగాఁ బరిగణింపఁబడుచున్నది. దీనిలో ధర్మస్థీయ మను వ్యవహారకాండమును మను నారద పరాశర యాజ్ఞవల్క్యాదులు విస్తరించియున్నందున నదియు రాజనీతి నుండి తొలగింపఁబడి కేవలము రాజరక్షణము, దుర్గాదిస్థానవిధానము, మంత్రి పరివార లక్షణము. మంత్రాంగప్రకరణము, శత్రురాజులయెడ నుపాయ పరి

కల్పము, యుద్ధాంగసమాహరణము, యుద్ధక్రమము కలిసి యర్థశాస్త్రంబు సంక్షేప రూపంబు నెందె. నేఁటికాలమున నిందును గొన్ని భాగములు రక్షణ క్రమము, యుద్ధాంగహరణము, యుద్ధక్రమము, మొదలగునవి వదలి ప్రజాసంఘవిధానమును, ప్రజాధికార నిర్ణయమును, వార్తాభివర్ధకసంధివిగ్రహ స్వరూపంబును, విజితరాష్ట్రపరిపాలనక్రమమును, సర్వాధికారిబలనిర్ణయవిధానము నాదిగా విస్తరింపవలసియున్నది.

ఇప్పుడు లభించు నర్థశాస్త్ర గ్రంథములలోఁ గౌటిలీయము శ్రేష్ఠమైనది. దానిపై బౌద్ధభిక్షువు ప్రభామతియు, మాధవమిశ్రయజ్వాయు, శంకరాచార్యులును, భట్టస్వామియు రచించిన వ్యాఖ్యలు కొన్నికొన్ని భాగములకే లభించుచున్నవి. భట్టస్వామివ్యాఖ్యకుఁ గేరళభాషానువాదము చాలభాగమునకుఁ గలదు. వీని నన్నిటిఁ గ్రోడీకరించి వ్యాఖ్యాసారముతోఁ గౌటిలీయమును దెనిఁగించుచున్నారము. అందుఁ దచ్ఛాస్త్రసంబంధముగాఁ జాల లిఖింపఁదలఁచియున్నందున నిం దర్థశాస్త్రవిషయము విస్తరింప నలవి కాదు.

## గ్రంథ పరిశోధనము

మేము కొన్ని సంవత్సరములకుఁ బూర్వము నైజామురాజ్యమున వనపర్తి సంస్థానమున నున్న కాలమున సమీపమున నుండు నమరచింత యను రాజాస్థానమునకుఁ గార్యాంతరమునఁ బోయియున్న కాలమునఁ దత్సంస్థానాధీశ్వరులగు *శ్రీమంతు రాజాముక్కర సీతారామ భూపాల బహద్దరువారు* మాయందు దయచేసి బద్దెన నీతిశాస్త్రముక్తావళియు సకలనీతిసమ్మతమును లిఖింపఁబడి యుండు కాగితపు సంపుటమును ముద్రణార్థ మొసంగిరి. అప్పటికి నీతిశాస్త్ర ముక్తావళి మూలభాగము ముద్రింపఁబడియుండుటచేఁ బీఠికలో శ్రీమంతులవారి సహాయము నభినందించుచుఁ బాఠభేదములమాత్రము సూచించితిమి. సకలనీతి సమ్మతము లేఖకదోషసహస్రపరిపూత మగుటచే నాదర్శాంతరముకొఱకుఁ జిరకాలము ప్రతీక్షించియు లభింపమింజేసి తుద కున్నదాని సవరించి ప్రచురించుటయె మేలని తలంచియు మనోరథసహస్రమాత్రవిజృంభితుల మగు మాకుఁ గార్యసాఫల్యము గానరాక కొంతకాలము చెల్లిన *నాంధ్రపత్రికాధీశ్వరులు బ్రహ్మశ్రీ శ్రీయుత కాశీనాధుని నాగేశ్వరరావు పంతులవారు* దేశ మాతృసేవయు భాషాసేవయునే జన్మజీవితఫలముగాఁ బనిసేయువారు గావున నీ గ్రంథ

ప్రాచుర్యమునకు మమ్ముఁ బ్రేరేపించి తగిన సహాయసంపత్తిని గలిగించినందున దీని నిప్పటికిఁ బ్రకటింపఁగలిగితిమి. ఇంక యథాశక్తి సవరించియు నింకను దోషసహస్రములు గలవు. ప్రాచీన గ్రంథపరిశోధన సంస్కారగ్రంథ మించుక పడసియు ననేక ప్రఘట్టముల లేఖకదోషములఁ దృప్తిగా సవరింపఁజాలక యున్నది యున్నట్టుగా ముద్రించితిమి. ఎట్లో నూతనకవిత చెప్పుట సులభము కాని పరకవిహృదయము గుర్తించి శాస్త్రవిషయమున నతని పలుకుల నూహించి తెచ్చుట దుర్ఘట మనుట విజ్ఞు లెఱింగిన విషయమే కదా! ఆదర్శాంతరము లభించు నేని భాషకుఁ బరమోపకార మగునని యెల్లరును యథాశక్తి గ్రంథాన్వేషణము సేయుదురని ప్రార్థనముతో విరమించుచున్నారము.

చెన్నపురి,
1923

మా - రామకృష్ణకవి

# 8. ఆంధ్ర నాటకములు - రంగస్థలములు

నాటకలక్షణ ప్రతిపాదకమగు నీ చిన్నగ్రంథము పింగళి సూరనాదికవి కావ్యవిమర్శన ప్రఖ్యాతులై యాంధ్రలోకమునఁ జిరపరిచితులును విశేషించిమాకుఁ జిరకాల మిత్రులునగు బ్రహ్మశ్రీ టేకుమళ్ళ అచ్యుతరావు పంతులు ఎం. ఏ., ఎల్.టి., గారు రచించి బహుపత్రికాముఖముల ననుదినము వెలువడు నాటక తత్త్వప్రకటనములలోఁగల వివాదగ్రంథులఁ జాలవఱకు ఖండించి సహృదయ లోకమునకు సమర్పించుట యెల్లరకామోదకరము. ఆంధ్రభాషలో నాటకలక్షణ గ్రంథములు లేకుండుటయు, సంస్కృతములో భరతాది మహామతుల యాశయ ములు సంపూర్ణముగా నేభాషలోఁగాని ముద్రణావస్థకు రాకుండుటయుఁ గొన్ని శతాబ్దులుగా భరతఖండమున నాటక ప్రదర్శనవిద్య శాస్త్రసమ్మతము గాఁగాక యథాదేశకాల సౌందర్యముతో నగతికశరణ్యముగా విలసిల్లుచున్నను దెనుఁగు భాషలో నదియుఁ గానరాక ఖండాంతరవాసుల పరిచయదోషముచేఁ దద్గ్రంథ ప్రణాళికలననుసరించి యనుదినము ప్రభవిల్లుచున్న నాటకసముదాయ మక్కడక్కడ క్లేషభూయిష్ఠమగుచు మనస్విజనములకు హృదయసంవాదమును సమగ్రముగాఁగలిగింపనేరక విషమసమస్యోత్పాతములకు జన్మభూమి యగుచుండుట వలనఁ గవికర్మముననో నటకౌశలముననో లేక సభాసదుల యధికారసంపత్తిలోనో లేక వీని విషమసమావేశముననో జనించిన లోపములెట్టివో యవియెట్లు పరిహరణీయములో పండితులు చర్చించి నిర్మక్షికమగు కావ్యసుధారసమును దృక్శ్రోత్రములఁ గ్రోలజూచుట యాశ్చర్యముకాదు. ఈచిన్నిగ్రంథము ''ఆంధ్ర నాటకములు'' అని పరిమితార్థకనామము ధరించినను లోనఁ బరిశీలింప నాటక తత్త్వమున గ్రంధిస్థానముల భేదించు విమర్శగ్రంథమై "నాటకతత్త్వసారము" అనునామమునకుఁ దగియున్నది. ఇందుస్థూలముగా నాటకతత్త్వము, కథానిర్మాణము, పాత్రముల శీలప్రతిష్ఠాపనము, సుఖాంతదుఃఖాంతవిభాగ విచారము, ప్రదర్శనశక్తియను నైదంశములు చర్చింపఁబడినను బ్రసంగవశముగా నేఁటి కాలపు వివాదాంశములన్నియుఁ బరిష్కరింపఁబడినవి. పై యైదంశములలోఁ గడపటి రెండును ముఖ్యముగాఁ గడగొట్టుది కేవలమేకదేశమై దేశకాలోపాధిచే బాధితమగుటచే నేఁటికాలములోని యాంధ్రనటసంఘముల కౌశలమునే ప్రతిపా

దించి గ్రంథనామమును సార్థకము చేసినను మొదటి మూఁడు విచారములు నాట్యశాస్త్ర మూలతత్త్వమునే ప్రతిబోధించును. నాటకము లోకస్వభావమునకుఁ బ్రతిబింబప్రాయమయ్యును లోకమువలెఁ గాక రంగప్రదర్శనము క్షణకాలములోనే యాధ్యాత్మపరిపాకమును గలిగించి దేహిని బరిశుద్ధుఁగా జేయుటయె నాటకోద్దేశమని వీరు స్థాపించుట ధర్మప్రతిష్ఠాపకులగు మహర్షుల ముఖ్యోపదేశమునకు భిన్నప్రస్థానము గానేరదు. నాటకములు కేవలము భావనాజన్యములే కాని, యనఁగా వివర్తకృత్రిమాది రూపములేకాని, ప్రకృతికి సంపూర్ణముగానభేద ప్రతిబింబములు కావని వీరు సిద్ధాంతీకరించిరి. భరతాదులు శృంగారాదిరసములు సహిత మలోకసిద్ధములగు నానందవిశేషములనియుఁ బ్రమాణజ్ఞులు భాషాప్రయోగమంతయు శబ్దార్థముల రెంటను కేవలము గృత్రిమమనియే ప్రతిపాదించిరి.

నాటక ప్రదర్శనము కేవలము లోకమునకుఁ బ్రతిబింబమని తలఁచువారు గీతరచనయుఁ బద్యరచనయు రసపోషణమునకుఁ బ్రకృతిసిద్ధములా వానినేల పరిహరింపఁ గూడదను విప్రతిపత్తిని గ్రహించి పద్యగీతరచనలు రెండును బరమార్థముగా రసపోషకములేయని గ్రంథకర్త నిర్ధారించెను. అభినవగుప్తాది నాట్యవేద వ్యాఖ్యాత లీమూడంశములనిట్లే పరిష్కరించిరి.

భాషాభేదము పాత్రభేదముననుసరించిన యెడల సర్వ మవ్యవస్థమగునని సూచించి జాత్యాచార పదవీ ప్రవృత్తుల కనుగుణముగా నాంధ్రభాషలోనే వాక్య రచన గూర్పవచ్చునని సిద్ధాంతముచేసి భాషారచనయు నాట్యధర్మములలోఁజేర్చి పంతులవారు నాటక లక్షణాంతర్గతమగు యథార్థతత్త్వమును వ్యక్తపఱచిరి.

ఇఁకఁ గథా నిర్మాణ విచారమున నాంధ్ర భాషలోని భిన్న గమనికలఁ జర్చించి యైతిహాసిక కథా శరీరములఁ బ్రవర్తిల్లు నమానుష స్వభావ వర్ణనములకు లోకాభిప్రాయ ప్రవాహసిద్ధమగు రూపమునే గ్రహింపవలయునని మునిమతమే ప్రతిపాదించిరి. ప్రసంగవశముగా నాటకములు సభాసదుల యాత్మ సంస్కారమున కనుగుణముగా నుండవలయునని శాసించిరి. ఇది చాల జటిల ప్రశ్నము. లోకము భిన్న రుచికమగుటచేఁ గథారుచి కనుగుణముగా నధికార సంపత్తి గల సామాజికులే చూడవత్తురు. నాటక సుఖ సిద్ధికిఁ గేవలము కవి, నట, గాయక, వాదక, జవనికా సామగ్రులేకాక సభ్యుల సంస్కారపటిమయుఁ

దోడ్పడునను విచారమునకుఁ దొడఁగుటలో నేఁటి కాలపు విమర్శకులలో వీరే ప్రథము లగుదురేమో.

శీల ప్రతిష్ఠాపనమను మూఁడవ విచారము చాల సుందరముగా సంఘ టింపఁ బడియె. నీరసములు, నిరుపయోగములు నిమ్నపాతములు నగు వస్తు శరీరములఁ బరిగ్రహింపక యుదాత్తగుణ సౌందర్య వ్యక్తీకరణమే మానవాంతః కరణ మాలిన్యముఁ దొలఁగించి ధర్మాది సాధనోపాయములగుచుఁ గృతార్థతా పరిగ్రాహకమగునని వీరు ప్రతిపాదించిరి. అవాంతర ప్రసంగముగాఁ బాత్ర గుణముల నూరక పేర్కొన్నం జాలదని భరతాదులు ప్రకారాంతరమునఁ జతుర్విధాభినయ సాధనములని పేర్కొన్న భావ భావనారూపమగు పాత్రగుణ వ్యక్తీకరణము శ్రేష్ఠమని సిద్ధాంతము చేసిరి. పురాణగాథల గ్రహించినప్పుడు లోక ప్రవాహసంసిద్ధమగు గుణౌచిత్యమునే పోషింపవలయునని ప్రతిపాదించు టయు మహర్షులయాశయమే.

నాల్గవదియగు సుఖాంతదుఃఖాంత నాటక విభాగ విచారమున వీరియాశ యము పరమార్థమున నాట్యాచార్యులతోఁ గలసినను నాపాతముగ విషాదాంత ప్రదర్శనము మునిసమ్మతము గాదేమో. అట్లయినను భాసాదుల యూరుభంగాది నాటకములు నిక్కముగా విషాదాంతములే. సుకుమార జనమనః క్లేశకరము లయ్యును విషాదాంత నాటకములు మహామతులకు మాత్రము తప్పక తీవ్ర ప్రబోధకారణములని గ్రంథకర్తతో నంగీకరింపలవసి వచ్చును.

నాటక ప్రదర్శనమను నైదవ విచారము కేవల మాంధ్ర నాటకరంగము లకే వర్తమానకాలమునకే చెల్లుచున్నందునఁ దద్విచార మాపాత గౌరవ ప్రతి పత్తులకే తావలమగును.

పై చేసిన విచారము లన్నియు నాటకతత్త్వ విమర్శమున జీవాతువులగు ఘట్టములు. ఈ గ్రంథము కేవలము సూత్రప్రాయమేయనఁ దగును. దీనిలో నొక్కొక్క యంశము విస్తరింపఁబడి యుండిన యెడల గ్రంథబాహుళ్య మైనను సామాన్యజనుల కెక్కువ యుద్బోధకముగానుండును. అస్థిస్థానీయ ములగుమొ విచారములును సోదాహరణముగామునిమతో నాకృతి యొసంగిరేని మగుటయ కాక[1] న పరంపరలో నుపేక్షింపఁ

[1] లభించిన ఒకే ఒక ముద్రిత ప్రతిలో ఈ వాక్యమున గ్రంథపాతము గలదు. (సం॥)

జాలని మెట్టగునని దృఢముగాఁ జెప్పవచ్చును. తత్కాల వాక్యరచనా మర్యాద ననుసరించి సర్వజన సుకరముగా వీరీగ్రంథము రచించిరి. ఇది యెల్లరకు నిష్పక్షపాతముగఁ బ్రహర్షదాయకమగునని తలంచుచున్నాను. ఈ విచార పరంపరను వీరు స్వబుద్ధి తోడనే నాటకతత్త్వమును తరించి ప్రకటించినను నాట్యాచార్య సిద్ధాంతములతోఁ బెక్కు విషయముల నేకీభవించుట వీరిప్రతిభకు మెఱుఁగు తెచ్చుచున్నదని యట్టి ముఖ్యాంశములనిందుఁ బేర్కొంటిని.

ఈ పూర్వ విజ్ఞప్తి నన్ను రచింపుమని పంతుల వారు నన్నుఁ గోరుట వారికి నాయందుఁ గల మైత్రి ప్రతిపత్తికి సాక్షి భూతమగుచున్నదని నాయంత రాత్మ యానందించినను దీనిలోనున్న గుణములనించుక స్పృశించి చూపుట తదానంద జన్యము కాక కేవలము నాట్యశాస్త్ర పరిశీలన క్లిశ్యమాన ప్రతిభాలవ విశ్రాంతి కారణమనియే [1]సత్యోక్తి గ్రహింతురు గాకయని పండితులఁ బ్రార్థించుచున్నాఁడను.

రాజమహేంద్రవరము
24 జూన్ నెల 1926

మా-రామకృష్ణకవి

[1] శ్రీ కవిగారి సంపాదకత్వమున నాట్యశాస్త్ర ప్రథమ భాగము, అభినవభారతీ సహితముగా. 1926 లోనే వెలువడినది. (సం॥)

# 9. శ్రీరంగమహత్త్వము

శ్రీరంగమహత్త్వము గారుడపురాణాంతర్గతమైనది. దీనిని గౌతమ గోత్రుఁడును గౌరనామాత్య పుత్రుఁడు నగు భైరవకవి విరచించెను. ఇతఁడు శ్రీశైల మల్లికార్జునస్వామిదేవి యగు భ్రమరాంబిక కృపచేత సారస్వతసిద్ధిఁ బొందినవాఁడు. తుదిగద్యమున "శ్రీమద్భ్రమరాంబావర ప్రసాదలబ్ధ సారస్వత విలాసగౌరవ గౌరనామాత్యపుత్ర...భైరవ" అని వ్రాసికొనెను. రత్నశాస్త్ర మను చిన్న కృతిలో, "భ్రమరాంబికామహావర। సముదిత నిరవద్య హృద్య సాహిత్యకళా। క్రమ విమలప్రతిభానం। క్రమణుఁడ మతిశాలి యైనగౌరన సుతుఁడన్" అనియు, "భైరవుఁడ నుభయ భాషా। పారీణుఁడ లోభిభవనభవ భూమవ్యా। పారసవికారదుష్కవి। ఘోరపిశాచముల దల్చుకొను భైరవుఁడన్" అని చెప్పెను. కవి రాజగజాంకుశ మను గ్రంథమున రత్నశాస్త్రములో నుండి నే నుదాహరించిన రెండు పద్యములును గలవు. మఱియు, "శ్రీమత్పరమశివానన తామరసవికాసలీలఁ దనరినభ్రమరాం। బామధుమత్త భ్రమరిక। నామానన సరసిరుహమునన్ వసియించున్" అని యాలక్షణ గ్రంథమును బ్రారంభించెను. కావున నీ మూఁడు కృతులకుఁ గర్త యొక్కఁడే యని నేను వేఱ చెప్పనక్కఱ లేదు. శ్రీరంగమహత్త్వమున,

మ. కృత విద్యా ఖురళీ పరిశ్రమ కళాకేళీవిలాసుం జన
స్తుతచారిత్రుని గౌతమాన్వయ పవిత్రుం గౌరనామాత్యస
త్సుతుఁ గల్యాణ కవిత్వలక్షణ సమర్థున్ సూక్తిముక్తాఫలా
తతకాంతిస్ఫుట చంద్రికోల్లసిత విద్వత్కైరవున్ భైరవున్.

అని తన గోత్రాదులఁ జెప్పుకొనెను.. గౌరనామాత్యసత్సుతుఁడనుటచే నియోగిబ్రాహ్మణుం డని కొందఱు చెప్పుదురు. అమాత్యశబ్దము కేవలము నియోగులయందును భట్టశబ్దము వైదికులయందే ప్రయోగింపఁబడుచుండె నను నియతి నేఁటికాలపుఁ గవి చరిత్రకారులకే కాని శ్రీనాథ భట్టాదులయందు వర్తింపదని నేను తలంచెదను. ఈ భైరవుఁ డేకాలమునందుండెనో గుర్తెఱుఁగ వలసియున్నది. ఇతని శ్రీరంగమహత్త్వములో నుండి యప్పకవియు ముద్ద రాజురామనయు వసంతర్తువర్ణన పద్యము లుదాహరించియున్నారు. మఱియుఁ

బాండ్యభూపాలుండగు ముద్దళగిరి భూపాలునకు విద్యావతీదండకము రచించిన ప్రఖ్యాతుఁడు గణపవరపు వేంకటకవి భైరవునిఁ బేర్కొనెను. తత్పాండ్య భూపతిని జయించిన కళువె-వీరభూపాలుఁడు తన వీరభూపాలీయమున భైరవునిఁ బ్రామాణికునిగాఁ జెప్పెను. వీరందఱుఁ గ్రీ. శ. 1660 ప్రాంతముల నుండినవారు. వీరిలోఁ బూర్వతముఁడు ముద్దరాజు రామన్న. ఆతఁడు తన కవిసంజీవనిలోఁ గవిగజాంకుశములోని పద్యములు చేర్చెను. మఱియులింగము గుంట-తిమ్మకవి సులక్షణసారమునఁ గవిగజాంకుశము నుండి పెక్కు పద్యము లుదాహరించెను. ఈ తిమ్మకవి క్రీ.శ. 1600 కుఁ బూర్వమేయున్నవాఁడు. ఇతఁడు తెనాలి రామకృష్ణుని యక్కకొమారుఁ డని యొకరు చెప్పిరి గాని నిక్కము తెలియరాదు. అట్లయినచో భైరవుఁ డంతకుం బూర్వుఁడే యగును. షట్చక్రవర్తి చరిత్రను రచించిన కామినేని మల్లారెడ్డి తన శివధర్మోత్తర ఖండ మను గ్రంథమున-

సీ. కడుగతాగతి యని కందు డిందఁగ మోఁది
    శశికిఁ గళా శాస్త్రసరణి దెలుపు
మందబుద్ధిది యని ముందె చెక్కిలిఁగొట్టి
    కవిగజాంకుశ మింద్రకరికిఁ జూపుఁ
బసులకాపరి యని వెసఁ గోక గైకొని
    హలికి హలాయుధం బెలమిఁ గఱపు

అని శ్లేష వైచిత్రి చూపుచుఁ గవిగజాంకుశమును బేర్కొనెను. ఈమల్లా రడ్డియన్న యగుకామిరడ్డి-

శా. శ్రీరాజత్సులుతానసంస్థిత మహా శ్రీకృన్నిజాంశాదర
స్ఫారాదేదులఖాన రాడఖబరుక్ష్మాపాలసింహాసనో
దారాక్రాంతనితాంత సన్నుత చరిత్ర ప్రాభవోద్దామ కా
మారడ్డిక్షితినాథహృజ్జలజధామా సిద్ధరామేశ్వరా.

అని శివధర్మోత్తర ఖండమున ద్వితీయాశ్వాసాంత పద్యమున సూచింపఁ బడినట్టు లఖబరు కాలమునను ఏదులఖాను కాలమున నున్నచో మల్లారడ్డియుఁ దత్కాలమువాఁడే; "అఖబరుక్ష్మాపాల సింహాసనోదారాక్రాంతనితాంతసన్నుత చరిత్ర" యనుటచే నక్బరుచక్రవర్తికించుక సహాయ మొసఁగియుండవచ్చును. అక్బరు క్రీ. శ. 1556 నుండి 1605 వఱకుఁ బరిపాలించెను. పైఁ బ్రస్తావిం

చిన కామిరడ్డితమ్ముఁడగు నెల్లరడ్డి కంకిత మీఁబడిన బ్రహ్మోత్తరఖండ మను కృతిలోఁ దత్కర్త యగువట్టమెట్ట సోమనాథకవి కామిరడ్డిని వర్ణించుచుఁ దదాస్థాన కవులు తత్కాలపు శాలివాహన శకవర్షములెన్నియో యందఱని చిత్రముగాఁ జెప్పెను. "కలిమి బిక్కనవోలి శ్రీ కామిరడ్డి । భూమివిభు నాశ్రయించిన బుధులు నిజము । శాలివాహన శకవర్ష సంఖ్యఁ బదియు । నైదునూర్లయిన వర్తమానాబ్దములుగ." ఈ బ్రహ్మోత్తర ఖండమునకుఁ బూర్వమే షట్చక్రవర్తిచరిత్ర మల్లారడ్డి రచించెనని తానే చెప్పుకొనెను. పై యంశము లాలోచించి చూడ క్రీ.శ. 1570 వఱకును భైరవునికాలము నిశ్చయ మగుచున్నది. భైరవుని తండ్రి గౌరన; వీరు గౌతమగోత్రులు గదా. గౌరన యనుకవి గౌతమగోత్రుఁడు హరిశ్చంద్రకథాద్విపదయు నవనాథచరిత్రయు నవగ్రహస్తుతియు రచించియున్నాఁడు. ఈకవిని గూర్మపురాణము విరచించిన రాజలింగకవి పూర్వునిగా వర్ణించెను. ఇతని తండ్రి పెదతండ్రులు రాజన్న పోతన్నలు రేచర్ల సింగభూనాయకునియొద్ద మంత్రులుగా నుండిరి. గౌరన యాంధ్రకావ్యములు గాక సంస్కృతమున లక్షణదీపిక యనుఛందశ్శాస్త్రమును రచించెను. దానిలో సంస్కృతాంధ్రములఁ బ్రఖ్యాతము లగుఛందో గ్రంథము లుదాహరింపఁబడినవి. శ్రీధరచ్ఛందమును సాహిత్యరత్నాకరముగూడ నుదాహ రింపఁ బడియున్నవి. ఈ గౌరన భైరవునితండ్రియా యనుసందేహము కలుగు చున్నది. గౌరన సింగభూపాలునిపుత్రుఁ డగుమాధవుని కాలమున నుండెను. లక్షణదీపికలో, "అస్తి ప్రశస్తావనిపాల మౌళిరత్నావళీరంజిత పాదపీఠః రేచర్ల వంశార్ణవపూర్ణచంద్రో మహాబలస్సింగయమాధవేంద్రః" అని చెప్పబడి యున్నది. ఈ మాధవేంద్రుఁడే శ్రీమద్రామాయణ వ్యాఖ్య రచించెనని యీ క్రింది చాటు శ్లోకమునందున్నది.

శా. శాకాబ్దే నిధివార్ధిరామశశిగేఽప్యబ్దే ప్లవంగే శుభే
మాసేఽప్యాశ్వియుజే రఘూద్వహపదే యో రాఘవీయాహ్వయాం
టీకా మర్థపటుప్రబోధఘటనామాణిక్య పుష్పాంజలిం
కృత్వా రాజతి రావుమాధవనృపో రామాయణస్య శ్రియః.

అనఁగా నీమాధవేంద్రుఁడు క్రీ. శ. 1427లో నుండెను. కావున గౌరన సుతుఁడు 1500లో నుండి యుండును.

భైరవకవి కులగోత్రములును గౌరనకులగోత్రములును వాసస్థానములును గాలమును సరిపోవుచున్నవి గావున భైరవుఁడు లక్షణదీపికాది గ్రంథములు రచించిన గౌరనపుత్రుఁ డని తలంచెదను.అట్లయినచో నితఁడు క్రీ.శ. 1450లో నుండవచ్చును. గౌరన తనలక్షణదీపికలోఁ కవిగజాంకుశముననుండి యుదాహరించెను. అవి సంస్కృతశ్లోక భాగములు కావున లక్షణదీపికలో నుదాహరింపఁబడిన కవిగజాంకుశము భైరవప్రణీతము గాక మఱియొక ప్రాచీన కవిరచితమై యుండును. భైరవుఁడు గ్రంథాంతమునఁ గవిరాడ్గజాంకుశ మని నామమిచ్చెను. భైరవుని గజాంకుశమాంధ్రము. ఇతఁడు గొప్పలాక్షణికుఁడు. ఇతఁడు తన కవిరాజగజాంకుశము కేవలము సూత్రగ్రంథముగాఁ గూర్చెనుగాని పూర్వకావ్య లక్ష్యము లిచ్చినవాఁడు కాఁడు. ఇతని శ్రీరంగమహత్త్వమును లాక్షణికులందఱుం జదివియున్న ట్లుదాహృత పద్యములే ఘోషించుచున్నవి. ఈకృతి మనోహరమై శైలిపాటవముగలదై "దుష్కవిఘోరపిశాచముల" నదల్చునట్లున్నది. భైరవుని పదబంధము ప్రౌఢమై యొక్కొకయెడ శ్రీనాథ పెద్దనలఁ దలఁపించుచున్నది. రెండవయాశ్వాసములోని ఋతువర్ణనమును నాల్గవయైదవ యాశ్వాసములఁ బురవర్ణనమును గవిప్రతిభారచితములు కాని మూలమునఁ గానరావు. ఉభయభాషా పాండిత్యము చూపుచున్న యాపట్లు స్వరచితార్థ సంపత్తిమై మెఱయుచున్నవి. దీనిలో పద్యములు 1600 క్రీ.శ. లోనుండిన జగన్నాథకవిచే రత్నాకరమునను ప్రబంధమణిభూషణమునను దత్తత్కథా భాగములకు ననుకూలముగా నున్నవి గ్రహింపఁబడినవి.

దీనిలోనికథ ప్రఖ్యాత మగు శ్రీరంగక్షేత్రమహత్త్వము. ఇది మూలమున నూఱధ్యాయములు గలది. ఈ దివ్యచరిత్రమును బెక్కండ్రు కవులు రచించి తమభక్తిని గల్పాంతస్థాయినిగా లోకమున నెలకొల్పిరి. అనేక దివ్యక్షేత్రములలో శ్రీరంగము చాల ముఖ్యమైనందున నాల్గురుకవులు దీనిఁ దెనిఁగించిరి. శ్రీనాథుని కాశీఖండ భీమఖండములకుఁ బిదప క్షేత్రమహత్త్వముల నింతప్రౌఢముగాఁ దెలిగించిన కవి యన్యుఁ డెవ్వఁడు గానరాడు. వేంకటాచల సింహాచల కాళహస్తి హాలాస్య మంగళగిరి గోకర్ణ శ్రీశైలాదిమాహాత్మ్యము లింతప్రౌఢములయినవి కావు. శ్రీరంగమహత్త్వముఁ దెనిగించిన వారిలోఁ గందాళయప్పళాచార్యుని శిష్యుఁడగు ముకుందయోగి ద్విపదరూపమున రచించెనయ్యది స్త్రీబాలకజనంబునకత్యంతోపయోగి యని తలంచెదను. కొంగునాటితో

రాజమంత్రిగానుండిన వరమల నరసామాత్యునిచేఁ గంధపద్యములలో విరచిత మగు శ్రీరంగమహత్త్వముగూడ నప్రౌఢమైనదే. ఇఁకఁ దక్కినవానిలో భైరవుని కవితతో నించుకవానికి వచ్చునది కట్టావరదరాజకవిప్రణీత మగు కావ్యమే. ఆతఁ డళియరామరాయల పెదతల్లి కుమారుఁడు. అతఁడు దీనిని బదియాశ్వాసములలో మనోహరముగాఁ దెనిఁగించెను. అయ్యాది మృదుపద విన్యాసమై వైదర్భీరీతి నెలకొనుచున్నది. వీ రిరువురును మూలమును కొఱవడ నీయక రసపోషణమునకై యచ్చటచ్చట వర్ణనలఁ జేర్చుచుఁ దమవిద్యావిలాస మును నెలకొల్పిరి గాని యఖండ మహాప్రవాహిని యగుభైరవుని శైలికి సుకుమార పదబంధముగల వరదునికవిత యాకాశగంగకును సమతలప్రవహిని యగుకావేరికిఁ గల యంతరమే చూపుచున్నది. భైరవుఁడు వేదాంతశాస్త్రమునఁ జక్కఁగాఁ బరిశ్రమించినట్లు తద్గ్రంథపఠనము వలనఁ దెలియుచున్నది గాని కృతిపతి యగురాఘవమంత్రి వైష్ణవుఁడో లేక మాధ్వుఁడో కావున నతఁడు విష్ణుభక్తాగ్రేసరులు క్షేత్రరాజ మగు శ్రీరంగమును హృదయ సన్నిధానమున సదా కొలుచుచుండుటకై భైరవునిచేఁ దీనిఁ దెనిఁగింపఁ జేసెను. వరదరాజు వైష్ణవుఁడు; భైరవుఁడు శైవుఁడు; అయినను దీనిలో శివపక్షపాత మగు నంశము లేవియు లేవు.

భైరవుని శ్రీరంగమహత్త్వములోని దని లాక్షణికులచే నుదాహరింపఁ బడిన క్రింది పద్య మందులోఁ గానరాక భోజరాజవిభూషణ మను నీతి గ్రంథమునఁ గలదు.

ఉ. ఆకులవృత్తి రాఘవు శరాగ్రమునందుఁ దృణాగ్రలగ్ననీ
రాకృతి వార్ధి నిల్చుట దశాననుఁ డీల్గుట మిథ్య గాదె వా
ల్మీకులు చెప్పకున్నఁ గృతిలేని నరేశ్వరవర్తనంబు ర
త్నాకరవేష్టితావని వినంబడ దాతఁడు మేరు వెత్తినన్.

శ్రీరంగమహత్త్వము గారుడపురాణమున నూఱధ్యాయములుగా బ్రహ్మాండ పురాణమునఁ దొమ్మిది యధ్యాయములుగా నున్నది. భైరవుఁడును, వరదరాజ కవియు గరుడపురాణాంతర్గత మగుకృతినే తెనిఁగించిరి. భాగవతుల రామకవి ముకుందయోగి మొదలగువారు బ్రహ్మాండ పురాణాంతరకథనే యనువదించిరి. వరదరాజకవనధోరణి తెలియుటకై భైరవ కృతిలో రెండవయాశ్వాసమున

విభీషణకథాభాగము ననుసరించి వరదునికృతిలో నుదాహరించెద; సహృదయులు కవననైపుణ విశేషమును గ్రహింతురుకాక.

శా. దిక్కౌల్ నూచును జూచి రంగరమణా ది క్కెవ్వరే యంచుఁ దా
దృక్కోణంబుల నశ్రుబిందువుల వర్షించున్ గృపన్ లక్ష్మణా
చక్రంజూడ వదేమి సంగరములోఁ జాకుండ రక్షించి యీ
చక్కిం గారణ మేమి యేమటితి నీస్వామిం బ్రసాదింపవే.

శా. రంగా యేటికి లేచి రావు రఘువీరా నావిధం బెద్ది నీ
యంగీకారమ కాక యిత్తెఱఁగు లేలా కల్గునో జానకీ
భంగం బీక్రియ నీతనూజునకు సంప్రాప్తంబుగా నిట్లుపే
క్షం గన్బ్రామఁ దలంతురమ్మ యిఁక లంకారాజ్య మే మౌనొకో.

క. శ్రీరంగధామ నను నీ। మేరం దయచూడవేని మీఁదటి కిఁకనీ
పేరైన విన్న నమ్మరు। ధారుణిఁ గలజనులు నీకుఁ దగ దీతలఁపుల్.

ఉ. నాకిఁక నేది బుద్ధి కరుణామతి నిట్లని యానతీయవే
యాకటిమాట నీవె కనె దాడుకొనం బనిలేదు రంగనా
థా కమలేక్షణా తగునె తండ్రి యనాథశరణ్య లేచిరా
వే కడతేర్పవే యని మహిం బొరలాడుచు నశ్రు లొల్కఁగన్.

గీ. ధూళిధూసరితాంగుఁడై చాల నడరి
బడలివాపోవఁ జూచి కృపావిభూతి
నేల చింతిల దనుజేంద్ర యెచట నున్న
నేమి నీవాఁడ వినుము మదీహితంబు.

సీ. కడకేఁగ వచ్చునే కావేరికావారి
లహరికాలోకనోల్లాసములను
దొలఁగి పోవుదమన్నఁ దలఁపు పుట్టించునే
యీ సైకతద్వీపవాసమహిమ
యెడవాయనిచ్చు నే యీదృశోభయకూల
రమణీయశోభనారామవసతి
యెంత లే దనవచ్చునే సప్తసాలవి
శాలపట్టణ మహైశ్వర్యగరిమ

కాన నిత్యనివాసయోగ్యంబు మాకు
నిచ్చట వసింప వరములే నిచ్చినాఁడ
గోరి కావేరి మున్నగువారికెల్ల
మాకు హితమైన మీకు సమ్మతముగాదె.

శా. రక్షోరాజ్యము లంక మాకు నిలువన్ రాదచ్చటన్ నీవయిన్
బక్షం బెప్పుడు నుంచి నిన్నె కనుచున్ బాటించి నీరాకలన్
బ్రేక్షామాలిక లుంచి నీయభిమతశ్రీ లిత్తు రామాయణం
బీక్షోణిం గలయంతకాలమును నిన్నేలింతు సామ్రాజ్యమున్.

గీ. ఏననియు రాముఁ డనుభేద మింత లేదు
కొలిచితివి మమ్ము నీకింత కలుగనేల
లంకకును బొమ్ము వలయువేళలను వచ్చి
రాకపోకలు నడుపు శ్రీరంగమునకు.

క. మానసపూజావేళల
నే నిచ్చలువచ్చి నీదుహృదయమునందున్
ధ్యానించినట్ల నిలుతు న
నూనదయామహిమ ననుచు నుపదేశింపన్.

ఈ భాగమును జదివినవారెల్లరు వరదునికవితయు భావప్రౌఢిమ గలదనియు భైరవుని కవనముకంటెను మిగులునని తలంతురుగాని యది కొన్నిచోట్లఁ జేఁపలబుట్ట యల్లినట్లు నీరసపదభూయిష్ఠమయి రుచికొలుపదు. భైరవుని యనర్గళకవితాధారయు రసభావగతి విశేషములు శ్లాఘ్యతరములు. గావున నీరెంటిలో భైరవకృతినే ముద్రింపదొరకొంటిని. తాళీదళ సంపుట కాంతారమునఁ దిరిగి ప్రమాదకంటకములఁ దొలఁగించుకొనుచు నపూర్వ పదార్థవివేచనంబు సేయుచుండువారియవస్థ తత్తుల్యులకుఁగాని యన్యుల కెఱుంగరాదు. వాగ్బ్రహ్మకోశము నిర్మర్యాదము; ప్రతిభనవనవోన్మేషిణి; కాలమువిస్మృతి నిదానము; సామాన్యలోకము జీవయాత్రైకపరాయణము; అయ్యోయిఁక మృతి చెందుచున్న పురాణకవి బ్రహ్మలగతియెట్లు? అని యనుతాపమాత్రంబున సముద్రజలమున కేతముగట్టినట్టి కావ్యోద్ధరణ క్రియకుం బూనితిఁగాని వైదుష్యదర్పమునంగాదు. వ్యయప్రయాసముల మాటఁబోనిచ్చి శతచ్ఛిద్రవ్యా

కులం బగుతాళీదళ పరిశోధనంబఖ్యాన వశంబున జుగుప్సారహితంబుగ నల వఱచుకొని కార్యమునెట్లో నిర్వహించుచుండుటయుఁ గొందఱీర్ష్యా గ్రహగ్రస్తులు చూచియోర్వక పరిపరి విధముల ననుఁ బాటువఱచుచున్నారు. అక్కటా, యీ యల్పకార్యారంభమునకే జ్ఞాతిత్వములేకయె యీర్ష్యావిద్వేషమునఁ గన్నుపొడుచు వారుండఁగా భగవంతుని యనంతగుణములజూచి యోర్వక తామసులై యత నితోఁ బోరఁగడంగు రాక్షసుల యవిద్యా ప్రభావమును సహస్రముఖముల వర్ణించిన వ్యాసాదుల విజ్ఞానము తప్పక కొనియాడఁదగినదే. విద్యాసంస్కారము చాలనియట్టి వాఁడు సేయు పరిశోధనమున దోషరంధ్రములు గలుగుట నిశ్చ యము. వానినన్వేషించి చూపినమాత్ర వివేకియాగ్రహ స్థానముగానేరఁడు. విద్వత్కల్పులుచేయు కౌటిల్యము మాత్రము నిరసనీయమే. భగవచ్చోదనామ హిమంబుననె నాయల్పోద్యోగము నెఱవేఱుంగాకయని పరమవిశ్వాసమున దీని నింతతో విరమించుచున్నాఁడను.

భైరవుఁడు గొప్ప లాక్షణికుఁడని ప్రఖ్యాతివహించియు నాంధ్రవ్యాకరణ దోషములు పెక్కులు పరిహరింపఁ జాలఁడయ్యె. "తలమావులుకక" యిత్యాది స్థలముల యడాగమమునకుమాఱుగా ద్రమిళభాషలోవలె వకారాగమంబు వచ్చుట వ్యాకరణసిద్ధముగాదు. "స్వర్గమునకు" మొదలగుచోట్ల నగాగమంబురామి శ్రవణసుభగము గాదు.

"భరద్వాజమునికి నెఱింగించిన యీ వినుతేతిహాసవతనము,"

ఇట్టి ప్రయోగములు దీనిలోఁ బెక్కులు గలవు. ప్రౌఢవ్యాకరణములో నుదాహరింపఁబడిన నన్నియభట్టారకప్రయోగములకును వీనికిని జాలభేదము గలదు. ఆంధ్రమున లాక్షణికులే లక్ష్యైకవేదు లగు కవులకంటె నెక్కుడప ప్రయోగములు కూర్చి వానికి సాధుత్వ ముద్ఘోషింపఁ బ్రయత్నించిరి. ఇట్టిదోష ముల సూచించుట కర్తవ్యమని చూపితిఁగాని నేఁటికాలమునఁ బాణినిపతంజలుల యంతరంగమును గుర్తించి విచిత్ర వ్యాఖ్యాన వైఖరీ ప్రభావంబున మునిత్రయ మును మునిసప్తకంబుగాఁ జేయఁజాలిన గ్రామ్యభాషోద్ధారకుల కివి హాస్యభాజన ములుగాక తక్కవు.

ఈకృతి నాకు రెండుప్రతులు వనపర్తి సంస్థానాధీశ్వరుల తాళపత్ర లిఖితగ్రంథములలోనే లభించినవి. అందులో నొకటి 186 సంవత్సరములకుఁ బూర్వమునను దానికిఁ బుత్రికయగు వేఱొకటి 96 సంవత్సరములకుఁ

బూర్వమునను దత్సంస్థానాధీశ్వరుల ప్రేరణంబుననే లిఖింపఁబడినవి. నేను దత్సంస్థానాధీశ్వరాశ్రయము వొందనికాలమున గ్రంథాన్వేషణము నిమిత్తము గద్వాల వనవర్తిసంస్థానాదులఁ గొంతకాలము సంచరించి వారివారి యనుగ్రహంబునకుఁ బాత్రుండనై గద్వాలలో భోజరాజీయాదికృతులు సంపాదించి వనపర్తిలోఁ బుస్తకముల శోధించుటకు ననుజ్ఞవడసి వానియెదుటఁ గూర్చుండి తాళిదళసంపుటములు విప్ప దొరకొను సమయమున నకస్మాత్తుగా నప్పకవి యుదాహరించిన "గందపుగొండ నెత్తముల" యను భైరవునిపద్యము మనస్సునకు స్ఫురించెను. అంత నయ్యో మనకేల యీకావ్య మీగ్రంథసమితిలో లభింపరాదని మొట్టమొదటిపుస్తకము విచ్చి కొన్నియాకులు ద్రోచి చదువఁగా బ్రథమమునఁ బైపద్యమే దృష్టిగోచరమయ్యెను. నాకుఁగలిగిన యమందానందమిట్టిదని చెప్పఁజాల. కుమారసంభవాది సత్కృతులమున్నిది తీసిపోయినను నేనుత్సుకుఁడనై వెదకినకృతిలోఁ బైపద్యమె మొదట గోచరించుట వైచిత్రీ విశేషమే. ఇది వనపర్తి రాజుగారి సహాయమున మొదట ముద్రింపఁబడి ప్రాచీన గ్రంథముల నూరకయిచ్చినను జదువువారులేని యీకాలమున నీభాగమైనఁ బునఃప్రచురమగుటకు సంతసించుచున్నాఁడ.[1]

1929. మా. రామకృష్ణకవి.

[1] ప్రథమ ముద్రణము 1912 లోనే వెలువడినది (చెన్నపురి—5 జూన్ నెల 1912)

# 10. కావ్యాదర్శము

కావ్యాదర్శమను నలంకారశాస్త్రము ప్రాచీనగ్రంథములలోఁ బ్రసిద్ధివడసినది. దీని రచించినకవి ప్రఖ్యాతుఁడగు దండి. "కవిర్దండీ కవిర్దండీ కవిర్దండీ నసంశయః" అని భోజునిసభలోఁ బ్రశంసగన్నవాఁడని యైతిహ్యముకలదు.

"త్రయోఽగ్నయ స్త్రయోవేదా
స్త్రయోదేవా స్త్రయోగుణాః
త్రయోదండి ప్రబంధాశ్చ
త్రిషులోకేషు విశ్రుతాః"

అని ప్రఖ్యాతికలదు. కావ్యాదర్శము దశకుమారచరితము దండికృతములుగా నెగడుచున్నవి. మూఁడవకృతి యేదియని శంకించి కొందఱు ఛందోవిచితి యనియు, "పిషల్" అనుపాశ్చాత్యమహాశయుఁడు మృచ్ఛకటికమే దండికృతమనియు వ్రాక్రుచ్చిరి. ఇతని దేశకాలములేవి ? భామహాలంకారమునకంటెఁ గావ్యాదర్శము ప్రాచీనతరమా? అను సందియములు కలుగును. ఇటీవలఁ గొన్నిగ్రంథములు కేరళదేశమునఁ దాళపత్రముల లభింపఁగా, వాని పరిశోధనమునఁ బై యంశములు కొంతవరకుఁ బరిష్కృతిచెందె. కావ్యాదర్శమను పేర మఱియొక యలంకారగ్రంథము కలదు. దానిలో క్షేమేంద్రుని మతముద్ధృతమగుటచే నది యర్వాచీనమనుటకు సందేహములేదు. మనగ్రంథము దండికృతమే యనుటకు నభినవగుప్తాదులగు ప్రామాణికులు "యథాహదండీ", "యథాచిరంతనా" యని యుదాహరించిన శ్లోకములిందుఁ గానవచ్చుచుండుటయే నిదర్శనము. భట్టగోపాలుఁడు కావ్యప్రకాశవ్యాఖ్యారంభమున

"శిక్షయన్నద్భుతాంరేఖాం కావ్యాదర్శ లిపిక్రమే,
మధ్యేమధ్యే మహాచార్యో దణ్డీభీషయతే కవీన్"

అని చెప్పెను. కావున నిది దండిప్రోక్తమనుట నిస్సంశయము.

దీనిపైఁ బెక్కులు వ్యాఖ్యలుకలవు. అతిప్రాచీనమైనది వాదిఘంఘాలదేవుని శ్రుతానుపాలిని. అతఁడు క్రీ॥శ॥ ౯౫౦లో నుండెడి గంగరాజు నాస్థానకవి. తరుణవాచస్పతి, యామునేయుఁడు మఱికొందఱును వ్యాఖ్యాతలైరి.

తరుణవాచస్పతి "పంచవర్ణాహ్వయపురే-అష్టవర్ణా వర్ణాహ్వయనృపాః" అన్న శ్లోకవ్యాఖ్యలో కాంచీపురమనియుఁ బల్లవరాజులనియు, బ్రహేళికకర్థము చెప్పెను. వాది ఘంఘాలుఁడు నట్లే వివరించెను. దండి కాంచీపురవాసియనియు, బల్లవరాజాదృతుఁడనియు నూహింపవచ్చును.

శ్రవణ బెళగుళమను జైనమతములోని శిలాశాసనముల శ్రీ వర్ధదేవుం డను జైనాచార్యుని ప్రశస్తిలో (శాసనము సంఖ్య ౫౪-క్రీ॥శ॥ ౧౧౨౮)

యఏవముపశ్లోకితోదండినా-
జహ్నోః కన్యాం జటాగ్రేణ బభార పరమేశ్వరః
శ్రీవర్ధి దేవస్సంధత్తే జిహ్వాగ్రేణ సరస్వతీమ్"

అని లిఖింపఁబడియున్నది. శ్రీవర్ధదేవుఁడే వైద్యవ్యాకరణాదులఁ బ్రసిద్ధిగాంచిన పూజ్యపాదుఁడు. అతఁడు క్రీ॥శ॥ 650 కాలమున నుండెను. దండియు నప్పటి వాఁడని తేలును. భోజదేవుఁడు శృంగారప్రకాశమునఁ దొమ్మిదవప్రకాశమున "దండినోధనంజయస్య వా ద్విసంధానం" అని కథాద్వయసంవిధానమున కుదాహరణముగాఁ జెప్పి "ద్విసంధానే"

"ఉదారమహిమారామః ప్రజానాం హర్షవర్ధనః
ధర్మప్రభవ ఇత్యాసీత్ ఖ్యాతో భరతపూర్వజః"

అని యుదాహరించెను. అదిధనంజయ ద్విసంధానమునఁ గానరాకుండుటచే దండికృతమగు ద్విసంధానమున నుండెనేమో యని సందేహము కలుగుచున్నది. ఈశ్లోకమున ముద్రాలంకారలక్షితముగా హర్షవర్ధనుని పేరుగలదు. దండి యతని యాస్థానమునకుఁ బోయియుండవచ్చును. దండి మూఁడవగ్రంథము ద్విసంధాన మను రాఘవపాండవీయమని యూహింపఁదగు. అతని దశకుమారచరిత్రము పూర్వపీఠికయనియు నుత్తరపీఠికయనియు రెండుభాగములై, యొక్కొక్కటియు నాశ్వాసవిభాగముకలదై వచనరూపముగా నున్నది. ప్రాచీన వ్యాఖ్య లన్నియు నుత్తరపీఠికపైమాత్రమే కలవు. పూర్వపీఠికలు పెక్కు తెఱఁగుల నాశ్వాససంఖ్యామాత్రమేకాక కథాసరణియు భేదించుచు బహుకవికృతములగు భిన్నగ్రంథములవలెఁ గానవచ్చుచున్నవి. కేతనయను నాంధ్రకవి తెనిఁగించిన దశకుమారచరిత్రమును సంస్కృతముతోఁబోల్పఁ బూర్వపీఠికలలో నొక్క

పాఠము మూఁడాశ్వాసములవఱకు మక్కికిమక్కి యనువాదమగుచున్నది. ఉత్తరపీఠికలోఁ గథామాత్రస్వారస్యప్రధానముగాఁ దెనిగింపఁబడియె.

కర్ణాటకానువాదమునఁ బూర్వపీఠికాకథ లబ్ధగ్రంథభాగములకు భిన్నముగానున్నది. ఉత్తరపీఠిక మూలమునకు సరియైనదే. మఱియుఁ బూర్వోత్తర పీఠికలలో శైలి భేదిల్లుచున్నది. ఉత్తరపీఠిక ప్రౌఢతరము. కావునఁ బూర్వభాగము దండికృతముకాదు. ఒకపాఠము కేతన దశకుమారచరిత్రమును జూచి పూర్వపీఠిక యెవ్వరో సంస్కృతమున లిఖించిరని తోఁచును. లాక్షణికులెవ్వరు దానిలోనుండి యుదాహరింపరైరి.

ఇటీవల నవంతిసుందరీకథయనియు, నవంతి సుందరీకథాసారమనియు, రెండుగ్రంథములు కేరళదేశమున లభించినవి. వానిఁ బరిశోధింపఁగా నవంతి సుందరీకథయే దండిప్రోక్తమగు నాఖ్యాయికయనియు, దీనికి సంక్షేపరూపముగాఁ దత్సారము నెవ్వరో రచించిరనియు, దండి కాంచీపురాధీశ్వరులగు పల్లవరాజులయొద్ద నుండెననియుఁ దేలినది.

"అస్త్యానన్దపురం నామప్రదేశే పశ్చిమోత్తరే,
ఆర్యదేశ శిఖారత్నం తత్రాసన్ బహవోద్విజాః
తతోఽభినిస్సృతా కాచిత్కౌశిక బ్రహ్మసంతతిః
బ్రహ్మలోకాదివాయాంతీ పుణ్యతీర్థా సరస్వతీ
నాసిక్యభూమావౌత్సుక్యాన్మూల దేవనివేశితామ్
ప్రాప్యాచలపు(రం నామపు)రీ మధివసత్యసౌ
తస్యాం నారాయణస్వామినామ్నో నారాయణోదరాత్
దామోదర ఇతిశ్రీమా నాదిదేవ ఇవాభవత్
సమేధావీ కవిర్విద్వాన్భారవిః ప్రభ(వం)వోగిరామ్
అనురుధ్యా కరోన్మైత్రీం నరేంద్రే విష్ణువర్ధనీ(నే)
ఇతిస్తుత్వా మహీపాల స్తదాలోకనలోలుపః
అనేకశ్రీముఖాకృష్ట మకరోదముమాత్మసాత్
నృపనిర్బంధనిర్దిష్టే ప్రకృష్టవిభవేగృహే
వహతః పైతృకీం వృత్తిం తస్యాసీత్తనయత్రయమ్
మనోరథాహ్వయస్తేషాం మధ్యమోవంశ వర్ధనః

తత స్తనూజాశ్చత్వారః స్రష్టుర్వేదా ఇవాభవన్
శ్రీవీరదత్త ఇత్యేషా ము త్తమ స్తత్త్వవేదినామ్
యవీయానస్యచ శ్లాఘ్యాగౌరీనామాభవత్ప్రియా
తతః కథంచిత్సాగౌరీ ద్విజాధిపశిఖామణేః
కుమారందణ్డినామానం వ్య క్తశ క్తి మజీజనత్
సబాలఏవమాత్రాచ పిత్రా చాపి వ్యయుజ్యత,
అయుజ్యత గరీయస్యా స్సరస్వత్యా శ్రుతేన చ.
సవిక్రియే పురే తస్మిన్ పరచక్రోపరోధతః
సచచార శుభాచారః సర్వాముర్వీ ముదారధీః
అథాశ్రమే ష్వధీయానః శాస్త్రేషుచ కృతశ్రమః,
పశ్యన్ పుణ్యాన్యరణ్యాని వ్యవస ద్దివసాన్బహూన్
మిత్రాణి మాతృదత్తాద్యాః కేరళోభ్యో ద్విజో త్తమాః"

భారవిని పిలిపించినవాఁడు కాంచీపురాధీశుఁడగు సింహవిష్ణువు. పై శ్లోకములవలన దండి భారవికి ముమ్మనుమఁ డనియు, నతఁడు సింహవిష్ణువు నాస్థానమున నుండెననియు, నందుచే దండి నరసింహవర్మ కాలమున నుండి యుండుట యసంభవము కాదనియు స్ఫురించుచున్నది. అవంతిసుందరీకథ లోని కథాంశము దశకుమారచరిత్రములోని కథాభాగమే. శైలి యతిరమ ణీయమై, ప్రౌఢమై, బాణాదికవుల రచనా గాంభీర్యము ననుకరించి యున్నది. కావున దశకుమార చరిత్రకుఁ గవికృత నామధేయ మవంతిసుందరీకథ యనియుఁ, బ్రసిద్ధ దశకుమారచరిత్ర పూర్వపీఠికయే యిప్పుడు లబ్ధమగు నవంతిసుందరీకథాభాగము కానోపుననియుఁ, దద్గ్రంథ పఠనమువలనఁ దేలినది. దండి తండ్రి వీరదత్తుఁడు. తల్లి గౌరి. మిత్రులు రామశర్మ, మాతృ దత్తుఁడు, భజనానందుఁడు మొదలగువారు. కాంచీపురము చాళుక్యరాజగు విక్రమాదిత్యునిచేఁ బండ్రెండు సంవత్సరములు ముట్టడింపఁబడఁగా, దండి తత్కా లమున గేరళాది నానాదేశములు సంచరించి, కాంచీపుర నిరోధము గడచిన పిదప మగిడి వచ్చెననియు దానిలోనే కలదు. కావున నితఁడు క్రీ.శ. 630-40 ప్రాంతములోఁ గాంచీపురమున నుండెననుట నిక్కము. ఇతని పూర్వులుత్తర దేశమున నానందపురవాసులయ్యుఁ, గ్రమముగా దక్షిణదేశవాసము వీరి కలవడియె. దండి రచించిన మూఁడు గ్రంథములు దశకుమారచరిత్రమను

నవంతిసుందరీకథయు, గావ్యాదర్శము, ద్విసంధానమునుగాఁ బర్యవసానముఁ దేలును. అనామయస్తోత్రమను శివస్తుతి యితఁడు రచించెను. వైయాకరణులితని స్మరించుటచే నితఁడు మహాభాష్యమునకు వ్యాఖ్య వ్రాసియుండునేమోయని సందేహింపవలసి యున్నది.

చిరంత నాలంకారికులలో దండియు నొక్కఁడనుటకు వివాదములేదు. భామహుఁడను గ్రంథకారుఁ డితనికిఁ బ్రాచీనుడో, లేక సమకాలికుఁడో, సుప్రసిద్ధుఁ డొకఁడున్నాడు. అతఁడు కావ్యాలంకారమను నొక గ్రంథము రచించెను. దానిలోని కొన్ని యంశముల కిందు ఖండనము కలదు. అతిప్రాచీన వ్యాఖ్యాత యగు వాదిఘంఘాల దేవుఁడును దండి యాఖ్యాయికా శబ్ద నిర్వచనమున కవతారిక వ్రాయుచు, "భమ్మహమత మాక్షిపతి" యని భామహునిఁ బూర్వునిగా నూహించెను. భామహుఁడు రామశర్మ కృతమగు నచ్యుతోత్తరములోనుండి దోషము లుద్ఘాటించెను. రామశర్మ దండి మిత్రుఁడగు తన్నామధేయుడగునేమో యని శంకింపవలసియున్నది. గౌతమసూత్ర భాష్యకారుఁడగు మస్కరి తాను భామహుని శిష్యుఁడని చెప్పుకొనెను. భామహుని కావ్యాలంకారమునఁ జతుర్థ పరిచ్ఛేదమునఁ దిఙ్నాగ ధర్మకీర్తుల మతములు నిరసింపఁబడుటచే భామహుఁడు ధర్మకీర్తితో సమకాలికుఁడైనఁ గావలయు. ధర్మకీర్తి క్రీ. శ. 620లో నుండి నందున ధర్మకీర్తి భామహ దండి బాణభట్ట నారాయణాదులు సమకాలికులని యూహింపఁదగు.

దండి పూర్వాచార్యుల గ్రంథముల సంగ్రహించెనని చెప్పుచున్నాఁడు. వ్యాఖ్యాతలు వారు కాశ్యప బ్రహ్మనంది బ్రహ్మదత్త ప్రభృతులని వివరించిరి. కాశ్యపుఁడెవ్వఁడో శిల్ప సంగీత నాట్య వైద్య జ్యోతిష ఛందః కావ్యాలంకారాదుల గ్రంథములు రచించెను. వానిలో శిల్పము మాత్రమే కానవచ్చుచున్నది. దానికే యంశుమద్భేదమని నామాంతరము. బ్రహ్మనంది వ్యాసుల బ్రహ్మసూత్రములకు వ్యాఖ్యాత. ఆవ్యాఖ్యాన మిప్పుడు లభింపదయ్యె. బ్రహ్మదత్తుడును మీమాంసావేదాంత గ్రంథకారుఁడు. వీరల కృతు లుత్పన్నములగుటచేఁ గావ్యాలంకారమున వీరి మతము లేవో కనుఁగొన సాధ్యము కాదు.

మనకు లభించు కావ్యాలంకారగ్రంథములలో నగ్నిపురాణ భాగము కావ్యాదర్శము కంటెఁ బ్రాచీనతరము. 'భరతునినాట్య' శాస్త్రమున నలంకార శాస్త్రములోని యంశములు పెక్కులు గలవు.

అలంకార శాస్త్రమున సామాన్యముగా 1 కావ్యస్వరూపము, 2 వృత్తి లక్షణము, 3 గుణదోష ప్రకరణము, 4 శబ్దార్థాలంకార వివేచనము, 5 రస భావ నిరూపణము, 6. నాయకనాయికా గుణావస్థా నిర్ణయము, 7 దృశ్య శ్రవ్యకావ్య భేదము, 8 రూపక పరిభాషాంగ ప్రశంస, 9 కథా శరీరసంవి ధానము, 10 కవిప్రేక్షక నటధర్మ సమయాది ప్రకీర్ణక విమర్శనము, అను నంశములు విశదీకరింపఁబడు. అలంకారశాస్త్రములు సాధారణముగా రెండు తెగల నొప్పారు. మొదటి నాలుగు విషయములు నొక్క తెగగాను, తక్కినవి రెండవ తెగగాను శాస్త్రకారులు గ్రహించిరి. భామహాలంకారము (620 క్రీ.శ.) దండి కావ్యాదర్శము (640 క్రీ.శ.) రుద్రటుని కావ్యాలంకారము (700 క్రీ.శ.) వామనుని కావ్యాలంకార సూత్ర వృత్తి (800 క్రీ.శ.) ఆనందవర్ధనుని ధ్వన్యా లోకము (840 క్రీ.శ.) ఉద్భటుని కావ్యాలంకార సంగ్రహము (840 క్రీ.శ.) వాగ్భటుని కావ్యాలంకారము (900 క్రీ.శ.) రాజశేఖరుని కావ్యమీమాంస (830) మహిమభట్టు వ్యక్తివివేకము (1000) భట్టనాయకుని హృదయదర్పణము (950) కుంతలకుని వక్రోక్తి జీవితము (960) భోజదేవుని సరస్వతీ కంఠా భరణము (1050) మమ్మటుని కావ్యప్రకాశము(1150), రుయ్యకుని సుహృదయ లీలయు, అలంకార సూత్రములు (1180)ను, మంఖుకుని యలంకార సర్వ స్వమును, సాహిత్య మీమాంసయు (1180), హేమచంద్రుని కావ్యానుశాసనము (1150), విద్యానాథుని ప్రతాపరుద్రీయము (1320), విద్యాధరుని యేకావళియు (1350), విశ్వనాథుని సాహిత్య దర్పణమును (1350), మొదలుగాఁ గలవి మొదటి తెగకుఁ జేరినవి. రెండవ తెగయగు రసభావ నిరూపణ ప్రముఖగ్రంథ జాలములో భరతుని నాట్యశాస్త్రము అధ్యాయములు (6,7,18,19,20,21,22, 23,24), రుద్రుని శృంగారతిలకము (700), తోతాచార్యుని కావ్యకౌతుకము (970), అభినవగుప్తుని యభినవభారతియు, లోచనము (1000), భోజదేవుని శృంగారప్రకాశము (1060), శారదాతనయుని భావప్రకాశము (1150), ధనంజయుని దశరూపకము (1000), జగద్ధరుని నాట్యసర్వస్వము, రామచంద్రుని నాట్యదర్పణము (1180), త్రిలోచనుని నాట్యలోచనము, రసార్ణవ సుధాకరము (1350), కుంభకర్ణుని సంగీతమీమాంస, రసపరిచ్ఛేదము (1150), రసవివేకము, రాజరాజీయము, రసమీమాంస, రసకల్పద్రుమము, శృంగారమంజరి మొదలగునవి చేరుచున్నవి.

వీనిలో భామహ దండ్యానందవర్ధన భట్టనాయక కుంతలక మహిమ భట్ట భోజులు మొదటి తెగలోను, భరత నంది రుద్రాభినవగుప్త భోజాదులు రెండవ తెగలోను నూతన ప్రస్థానములు స్థాపించి, తక్కిన వారికి మార్గదర్శులైరి. పై విభాగమునఁ గొందఱి గ్రంథముల రెండు తెగల యంశములును గలసియో, యానుషంగికముగ సూచింపఁబడియో యుండును. కావ్యాదర్శమునఁ గావ్యస్వరూపమునను, నలంకారవివేచనమునను ధండి చాల శ్రమించి సూక్ష్మ భేదముల నెలకొల్పె. అయినను దదలంకార భేద జాతమంతయుఁ దర్క-శాస్త్ర పరిష్కృతముగాక చాల కాలముండఁగా, విద్యానాథాదుల కాలమున కనఁగా శిరోమణి భట్టాదుల మణిదీధితి విజృంభణమునకుఁ బిదప, సకల శాస్త్రములకు వలెనే, దానికిని న్యాయశాస్త్ర నికషోపలంబున నొరయిక తగిలి ప్రాచీనుల నిర్వచనములన్నియుఁ బునఃపరిశోధితములై వెలుఁగుచున్నవి. అయినను మాయభిప్రాయమున నర్వాచీన గ్రంథములు నిరుక్తి పరిష్కార సమర్థములై సూక్ష్మాంశ పరిబోధకములగుట సత్యమైనను, సర్వంకష ప్రౌఢిమమునఁ బ్రాచీన కృతములకు సరిగానేరవు. కావ్యాదర్శాదులు కావ్యప్రకాశ రసగంగాధరాదులకుఁ దీసిపోవచ్చును. కాని ప్రౌఢిమ గాంభీర్యముల మించుచుండును. ఈ యంశము కావ్యప్రకాశకారాదులకుఁ బూర్వుఁడగు వాదిఘంఘాలుని కావ్యాదర్శ వ్యాఖ్యచే విశదమగును.

ఈ గ్రంథము ప్రౌఢ గంభీరాధికమగుటచేతను, దెనుఁగున నలంకార శాస్త్రమున నిర్దుష్ట గ్రంథములు లేకుంట చేతను, దెనిఁగించుట మిక్కిలి కష్టము. కావ్యాలంకార చూడామణిలో దండి లక్షణ శ్లోకములు పెక్కు లాంధ్రీకరింపఁబడియె. వానిఁ బరిశీలించినచో ఎన్నకోట పెద్దన్నకు సంస్కృత భాషా పరిచయము లేదని కాని లేక యలంకార శాస్త్ర గ్రంథమతఁడెఱుఁగఁడని కాని చెప్పవలసి వచ్చును. భట్టుమూర్తి నరసభూపాలీయము నిట్టిదే. తర్కశాస్త్ర వాసన లేని వీరు మహాగ్రంథములఁ దెనిగింప దొరఁకొనుట హాస్య భాజన మగుటయే కాక, భాషకు నగౌరవము ప్రతిపాదించిరి. ధ్వనితత్త్వమును గవిలోకమునకు మొదట ప్రసాదించిన యానందవర్ధను నట్టివాని గురించి జయంతుఁడు న్యాయవార్తికమున.

యమన్యః పండితమన్యః ప్రపేదే కంచన ధ్వనిమ్
విధేర్నిషేధావగతి ర్విధి బుద్ధిర్నిషేధతః

మానాంతర పరిచ్ఛేద్యం వస్తురూపోపదేశినామ్.
శబ్దానామేవ సామర్థ్యం తత్ర తత్ర తథాతథా
అథవా నేదృశీ చర్చా కవిభిః సహశోభతే,
విద్వాంసోఽపి విముహ్యంతి వాక్యార్థగవనేఽధ్వని.

అని పండితమ్మన్యుఁడనియు, నశాస్త్రజ్ఞుఁడనియు దూషించెను. ఈ వాక్ప్రహారము కేవలమానందవర్ధనునకే గాక, ధ్వనివాదమునకుఁ బరమాచార్యుఁడగు భర్తృహరికిఁ గూడఁ దగులుచున్నది.ఇటుండ భట్టుమూర్తి ప్రభృతు లేమగుదురు? ఈ గ్రంథమును యథామూలముగాఁ దెనిఁగించి పరిభాషలకును, వాక్యార్థ విశేషములకును విపులమగు వ్యాఖ్య వ్రాయుటచే నాంధ్రులకు మూల గ్రంథ ప్రౌఢిమము తెలియనగుఁగాని,స్వమనః ప్రవృత్తికిఁ దగినట్టు తెనిఁగించుట యంత లోకోపకారము కానేరదు. బ్రహ్మశ్రీ అవ్వారి సుబ్రహ్మణ్య శాస్త్రిల వారు దీని నతిశ్రమ చేసి యథామూలముగాఁ దెనిఁగించి రనుట నిస్సంశయము. తెనిఁగింప నసాధ్యములగు సభంగ శ్లేషముల వారు శ్రమించి తత్తుల్యముగా నాంధ్రమున వాక్యజాలము కల్పించి లక్షణముల కుదాహరణము లిచ్చిరి. అట్టి చోటులు వీరి పాండిత్య ప్రకర్షమును జాటుచున్నవి భాషలో నలంకార గ్రంథములు లేని న్యూనతవారు కొంతవఱకుఁ దొలఁగించినందులకు నెల్లరు కృతజ్ఞులు గావగు. ఇది శాస్త్రగ్రంథము గావున వ్యాఖ్యాన సాపేక్ష మనుట యచ్చెరువు కాదు. ఇది పాఠ్యగ్రంథ కోటిలో నిర్ణీతమగునేని, కాలక్రమమున సువ్యాఖ్యలు దీనిపై వెడలుననుట దురభిలాషము కాఁజాలదు.

చెన్నపురి,
1929

మా - రామకృష్ణకవి

# 11. ఆంధ్ర సూర్యశతకము

ఈ యాంధ్రసూర్యశతకమునకు మూలము సంస్కృతమున మయూర కవిచే విరచింపఁబడిన సూర్యస్తుతివస్తుకమగు శ్లోకశతకము. అది స్రగ్ధరావృత్త బద్ధముగా నున్నది. తద్రచయితయగు మయూరకవి పండితలోకమున నాఁడును నేఁడును జాలఁ బ్రసిద్ధి జెందినవాఁడు. అతనిదేశకాలములు విప్రపత్తులుపొందక నిష్కృష్టములై యున్నవి. మయూరుఁడు కాశ్మీరకుఁడు. బాణునితో సమానముగా హర్షవర్ధనునిసభ నలంకరించినవాఁడు. ఇతనికాలము వివాదాస్పదము కాదు. దానికి విమర్శకులు చూపిన యుపపత్తులతో సమానబలములగు మఱి రెండింటి నుదాహరించుచున్నాము. మహాకవి దండి యవంతిసుందరిలో—

శ్లో. భిన్న స్తీక్ష్ణముఖేనాపి చిత్రం బాణేన నిర్వ్యథః
వ్యాహారేషు జహౌలీలాం న మయూరః......

ఈ శ్లోకమున నుత్తరభాగము పతితమైనను బాణమయూరుల శాస్త్ర సాహిత్య వివాదవిలాసములు వారలకును రసికులకును గేవల మాహ్లాదకరములను విషయముఁదెలుపఁగలదు. పద్మగుప్తుఁడనుకవి నవసాహసాంక చరితమునఁ గథానాయకుని మృగయావిహారము వర్ణించు ఘట్టమున—

శ్లో. సచిత్రవర్ణవిచ్ఛిత్తి హారిణో రవనీపతేః
శ్రీహర్ష స్యేవ సంఘట్టం చక్రే బాణమయూరయోః.

ఇందు శ్లేషచమత్కృతిఁ బ్రయోగించిన సచిత్రవర్ణవిచ్ఛిత్తిహారిత్వ ముటుండగా బాణమయూరుల విద్యాసంఘర్షము వ్యక్తమగుచున్నది. కావున మయూరుఁడు హర్షవర్ధన నరేంద్రునికాలములో, అనగా క్రీ. శకము 600—630కాలమున నున్నవాఁడు. ఇతఁడు సూర్యశతకముగాక 'మయూరాష్టకము' అనుకృతిని రచించినట్లు తెలియుచున్నది. 'సుభాషితావళి' మొదలగు కవివాక్సముచ్చయముల మయూరునివని శ్లోకములు గానవచ్చుచున్నవిగాని యవి చాటువులో కథాప్రకరణోద్ధృతములో తెలియరావు. విద్వత్సభలలోఁ బూర్వకవికృతపద్య మిచ్చి రసభావ ప్రకర్షము తఱుగకుండ వాక్యాంతరమున రచియింపుఁడనియు లేక ప్రాచీన శ్లోకమున నొక్కపాద మిచ్చి సమస్యగాఁబూరింపుఁడనియు వినోదములు సలుపు

చుందురు. మయూరుని క్రిందిపద్య మమరుక కావ్యములోని "క్షిప్తోహస్తావలగ్నః" అనుశ్లోకమునకుఁ బ్రతిపద్యముకల్పించెను.

శ్లో. వస్త్రైగృహ్ణన్నిరస్తఃసరభసవిధతో హస్తమాలంబమానః
క్షిప్తః కేశాంతలగ్నశ్చరణనిపతితః సంభ్రమోత్క్షిప్యమాణః
ఆలింగన్ దైత్యనారీః పరవశముకులార్ధేక్షణాః సాపరాధః
కామీవోద్దామరాగో దిశతు పశుపతే సాయకాగ్నిః శ్రియం వః.

పద్యమునకు పచనాంతరభంగిగానున్నందున నిధియు నట్టివినోదకాలము లలోఁబ్రకటించిన చాటువేమో యని తోచుచున్నది.

మయూరకవి వాగ్గుంభనము మిక్కిలి ప్రౌఢమైనది. అర్థము గంభీరమై పాండిత్య వైదగ్ధ్యములకుఁ దావలమై శబ్దరచన అశిథిలబంధమై ప్రతిపదరస గ్రాహియైయుండును. ఇది కేవలము సూర్యభక్తులకేకాక సాహిత్యరసాస్వాద నిపుణులకు సైతము పఠనీయమగుట సుప్రసిద్ధము. ఆకృతిలోఁ జిన్నదైనను, నిట్టిగాఢకృతులఁ దెనిగించుట యెంతయు లఘుక్రియ కానేరదు. భాషానువాదమున ప్రయోజన మధికమైనను దదనువాద ప్రణాళిక విద్వజ్జనాచరముకూడ భేదిల్లు చున్నది. ఈ యంశమున నొక్కింతఁ జెప్పఁదఁలచినారము.

అనువాదప్రక్రియ పలుతెఱంగుల విలసిల్లును. యథామూలముగాఁ బాద పూరకములగు నర్థవిశేషముగలిగించుచు ముక్తకమునకు ముక్తకముగా వృత్తమునకు నర్థానుసారము జాతివృత్తమునై న్యూనాతిరిక్తములులేకయర్థమును దెనిగించుటయే మొదటి పక్షము. కొన్నివిశేషణముల వ్యర్థములను భ్రమతో లేక తెనుఁగున నిమిడింఁపగాకయో విడిచివైచుచుఁ బద్యపూరణమునకు నడుమ స్వకపోలకల్పనలఁ గూర్చుచు వృత్తమాత్రకు నతిక్రమించినచోఁబంచపాదియో, షట్పాదియోరచించుచు ననువదించుట రెండవప్రక్రియ. మూడవది కేవలము, ముక్తకములుగానప్పుడు కులకమహాకులకములఁ బాదపూరకములఁ జేసికొనుచు భాషోచితదేశీయపద్ధతిఁ దెనిగించుటయే. ఈ ఫక్కి యథామూలముగాక రసోచితముగా మంచిజాతీయ మర్యాదవహించి వన్నెకెక్కను. భారత రామాయణాదు లీసరణినే తెనిఁగింపఁ బడియె. అమరుకశతకాదిముక్తకకావ్యములుఁ బ్రాయశః నాటకములును భాషా కావ్యములగునప్పుడు మొదటిసరణియే కవిజనావలంబక మగుచున్నది.

పదగుంభనము లలితమధురమై యర్థము ప్రసన్నగంభీరమునయి యను వాదమే మూలగ్రంథమనుబుద్ధి నింపఁజేయుట ప్రథమక్లేశము. రెండవది యర్థాను సారము మూలపద్యచ్ఛందమునకు సాజాత్యముగా లేక సమానపరిమితముగా భాషలో వృత్తజాతుల నేఱుకొనుట. మూఁడవక్లేశము మూలపద్యములోఁగల ధ్వనివిశేషములును శాస్త్రాంతరరహస్యసూచనములును, చరిత్రాంశసంఘటన లును, శ్లేషభంగుల నేకదేశస్తుతి నిందాగమకవిధానములును గమనించి వానినెల్ల ననువాదమునఁ దెచ్చుట. ఈ మూఁడుక్లేశములు ననువాదకరణములో సాధారణ లక్షణములు.

భాషాంతరమునకుఁ దెచ్చునప్పుడుగల క్లేశముల కుదాహరణము తెనుఁగు వసుచరిత్రనుసంస్కృతమున ననువదించునప్పుడు ప్రతిపద్యమున న్యూనాతిరిక్తత సంభవించెను. సభంగశ్లేషముగలచోట కవులకుఁ గలుగుసంకటమునకు మేర లేదు. మూలపద్యములు దీర్ఘవృత్తమును గాఢబంధమునైనచోఁ దెనుఁగునఁ బంచపాదికలు లేక సీసములు గాకున్న గీతమాలికలుగాఁ గూర్పవలసి భాషకుఁ గల సహజసౌందర్యముఁ జెడఁబాపుచుందురు.

సూర్యశతకము రచనాపాటవముతో నందర్భశుద్ధియు నర్థగాంభీర్యమును నుల్లేఖనవైదగ్ధ్యమును గలదనుట నిస్సంశయము. దానిలోఁ బాదపూరకములగు పొల్లుపదములకు నవకాశమేలేదు. మఱియుఁబెక్కుచోటులు నానాశాస్త్రకళాపరి చయము ప్రకటించుచున్నవి. ఇట్టికృతిఁ దెఁనిగించునప్పుడు సంస్కృతమునఁ గనిష్ఠపక్షము వ్యాఖ్యాన కౌశలమును దెనుఁగున ప్రయత్నజనితమగు లలిత మధురవాక్పరిస్పందమును ప్రధానగుణములు. ఈ రెండింట నేదికొఱవడినను భాషాంతరీకరణము పండితశ్లాఘ కెక్కనేరదు.

సూర్యశతకములోని పెక్కుపద్యముల శ్రీనాథాదులు కాశీఖండాదికావ్య ములఁదెనిగించి తమరచనకు వన్నెదెచ్చుకొనిరి. పూర్వకవులు తెనిఁగించు నపుడు రసము, భావము లేక ధర్మాది ప్రతిపాదకార్థవిశేషమును వివరించుచు మూలమునకు వ్యాఖ్యాన ప్రాయముగాఁగూర్పనేర్తురు. దానిలో వైశద్యమునకుగా న్యూనాధికత లుండును.

శ్లో. న్యక్కుర్వన్నోషధీశేముషితరుచిశుచేవౌషధీః ప్రోషితాభా
భాస్వద్గ్రావోద్గతేన ప్రథమమివ కృతాభ్యుద్గతిః పావకేన,

పక్షచ్ఛేదవ్రణాసృక్స్రుత ఇవ దృషదోదర్శయన్ ప్రాతరద్రే
రాతామ్ర శ్రీ ప్రభానో రనభిమతనుదే స్తాద్గభస్త్యుద్గమో వః. 5

అనుశ్లోకమునకు శ్రీ నాథుఁడు—

సీ. ప్రాలేయకిరణబింబంబు వెల్వెలఁ బాఱి యస్తాచలంబుపై న త్తమిల్ల
వరుసతో నోషధీ వల్లీమతల్లులు కాంతివైభవలక్ష్మి కచ్చువదల
రవికాంతపాషాణరత్నములం దుబ్బి యగ్ని ప్రత్యుత్థాన మాచరింపఁ
బ్రబలాంధకారధారాచ్ఛటాపటలంబు పంచబంగాళమై పాఱిపోవ

గీ. నుదయపర్వతకటకగంతోపలములఁ, పక్షమూలచ్ఛిద్రవణభవమైన
నెత్తు రనియెడువిచికిత్స నివ్వటిల్ల, భానుకిరణంబు లొకకొన్ని ప్రాఁకె
నభము.

దీనిలో మొదటిరెండుపాదములకు నేకాన్వయము సుకరముగాఁ దోచదు. ఓషధీశుఁడు విలయము సెందఁగా నోషధీసతి దుఃఖముచే విచ్ఛాయనొందె నను శుచాశబ్దమునఁగల కరుణరసానుభావము సూచింపఁబడక నాల్గవపాదమున నంధకారప్రవిలయ మధికముగాఁ జెప్పబడియె. వ్యాసమూర్తిశాస్త్రిగారు.—

మ. గతకాంతిన్ బతిదీప్తిమాయఁ గడుశోకం బందినట్లోషధీ
సతిదిక్కార మొనర్చి ముద్రవిశిలాసప్తార్చిరభ్యుద్గతా
యుతముల్ నాఁదగిప్రాఙ్నగాశ్మములఁ బక్షోచ్ఛిత్త్యురుశ్శోణిత
స్రుతము ల్నాఁగనఁజేయు తామ్రరవిఘృష్టుల్ పాపము ల్వాపెడున్. 5

ఇందోషధీసతికరుణావస్థవ్యక్తీకరింపఁబడియెఁగానిపావకేనాభ్యుద్గతి యని వ్యస్తపద ప్రయోగము సమాసమునఁ దదర్థము కూర్చుటచే నగ్నిహోత్రుని ప్రత్యుత్థాన భంగియుఁ దత్ప్రయోజనమును మఱుగువడియె. 'మున్'అనుప్రథమ శబ్దార్థ మేకదేశముగా నొదిగిపోయె. ఇట్లే మఱియొకశ్లోకము నుదాహరింతము.

శ్లో. మీలచ్చక్షుర్ద్విజిహ్మశ్రుతిజడరసనం నిఘ్నితఘ్రాణవృత్తి
స్వవ్యాపారాక్షమత్వక్పరిముఖితమనఃశ్వాసమాత్రావశేషమ్,
విస్రస్తాంగం పతిత్వా స్వపదహరతాదశ్రియం వోఽర్కజన్మా
కాలవ్యాళావలీఢం జగదగదఇవోత్థాపయన్ ప్రాక్ప్రతాపః. 3.

దీనిని శ్రీనాథుఁడు ప్రకరణోచితముగాఁ గొంత వర్జించి తెనిఁగించె.

సీ. నేత్రంబు లున్మేషనిస్స్పృహత్వమునొంద శ్రుతిపుటంబులశక్తిచొక్కు-
వడఁగ
ఘ్రాణేంద్రియజ్ఞానకళయేరుసౌరుగా జిహ్వావివేకంబుచిరుతవోవ
నంతరంగమున మోహాంకారము గ్రమ్మఁదనువు చేష్టాదరిద్రతవహింపఁ
బ్రాణముల్ శ్వాసమాత్రమునఁ బర్యవసింపఁ దలచీర యెఱుఁగనిదశ

గీ. బాముగటచిన మూర్ఛిల్లిపడినయట్లు,పడిరి పాశ్చాత్యదేశంబు పంచజనులు
తరణిదీధితిలేమిఁ జైతన్య మెడలి, వితతనిద్రాసమావేశవిహతులగుచు.

ఇందు కాలభుజంగదష్టనియవస్థలోఁ గలయనుభావములు పంచేంద్రియ ముల స్వకర్మత్యాగముఁ దక్కినవిషవైశసచిహ్నములును సూచింపఁబడియె.

వ్యాసమూర్తిశాస్త్రిగారు—

విగతార్థగ్రహపాటవేంద్రియము నావిర్భూతనిఃశ్వాసి మం
చగతింజేష్టలు దక్కి బుద్ధిసెడి వాచాహీనమై దీనమౌ
జగమున్ గాలభుజంగదష్టముఁ జికిత్సన్వేగఁబ్రత్యుత్థితం
బుగఁ జేయంగల వెజ్జులో యను నినస్ఫూర్తుల్ సిరుల్ మీకిడున్. 31

అని తెనిఁగించిరి.

అనుభావసంపదచేఁ గావ్యమును దత్త్వనిశ్చయ సూత్రరూపార్థముచే శాస్త్రమును గౌరవము సెందును. ఇందుఁ బంచేంద్రియార్థగ్రహపాటవమని కేవల శాస్త్రబోధకమగు తత్త్వవాక్యము కావ్యరసపోషకము గానేరదు. తత్తదనుభావ వివరణముచేఁగాని మూర్ఛావస్థ తన్మయీకరణము నొందింపఁజాలదు. ఇఁక వాచాహీనదీనశబ్దములు గతార్థాధికార్థద్యోతకములు. వెజ్జులను బహువచనము మూలపాఠమునఁ గానరాదు. ఈ విధముగాఁ దెనిఁగించుభంగీభేదముల గుర్తిం చుట కుదాహరించితిమిగాని తద్దోషోద్ఘాటనకుఁ గాదు.

ఆకుండివ్యాసమూర్తిశాస్త్రిగా రాంధ్రపండితలోకమునకు సుప్రసిద్ధులు. ఇంతకాలమునకుఁ దిపప వీరిగ్రంథముల విమర్శించుట భావ్యముగాదు. వీరు రచించిన గ్రంథాంతరములు పెక్కులు గలవు. అవి స్వచ్ఛందరసప్రవాహ భరితములగుచు సరళశబ్దార్థగుంభనలుగలవై విలసిల్లుచున్నవి. సూర్యశతకము మూలము గాఢబంధమగుటయు మత్తేభశార్దూలవృత్తములే సుందరముల నిగ్ర

హించుటయు మూలములోని ధ్వనితార్థమును నైత మాంధ్రమునఁ దేఁగోరుటయుఁ గారణముగాఁ దెనుఁగున నించుక ప్రసాదగుణము తఱిగి క్లిష్టశైలివలెఁ గానవచ్చు చున్నది. ఆయినను బర్యాలోచింప మూలశ్లోకములుగూడఁ గొంత క్లేశదాయక ములే. బాణునకు మయూరుఁడు ప్రతిస్పర్థియైనను దత్ప్రసన్నత యితని కవితలోఁ గానరాదు. కొన్నిఘట్టములు వ్యాఖ్యాన సాపేక్షములు. అట్టివి తెనుఁగునఁ గాఠిన్యమువహింపకుండుట యాశ్చర్యము. కవితకుఁ బ్రసిద్ధరూఢ పదప్రయోగమే సుభగము; శాస్త్రవిషయము వేఱు. అర్థ మిముడుక పోయిన యెడల మాఱుమూలపదములు (మార్గవులు)స్ఫురించుచుండును. వాని సాధారణ ముగా సుకవులు మెచ్చరని పెద్దలు వచింతురు.

వ్యాసమూర్తిశాస్త్రిగారు సంస్కృతమున నిష్కృష్టపాండిత్యముగలవారనుట మూలానుసరణమే వేభంగులఁ జాటుచున్నది.తెనుఁగున నించుక క్లిష్టపాకమునకు మూలార్థదోషము, వృత్తవిశేషగ్రహణమును గారణములని పునరుక్తిగా వచించె దము. కొన్నిశ్లోకముల వీరుమిక్కిలి సుందరముగాఁ దెనిఁగించిరి.

వసివాళ్వాడుబిసాభమంచు దయనో వాతాశిలోకంబు పే
రసమర్థం బగునంచు నేపరము లోకాలోకభూభృత్తటిన్
వెస నూర్ధ్వబ్జజుభాండఖండదళనావేగంబునన్ ద్యోస్థలిన్
బొసఁగంగాఁ జొరకెందు నేఁగు రవిరుక్పూరంబు మేల్మికిడున్. 19

వీరు మహాప్రయత్నములేకయే లాఘవముగలుగఁ గ్రిందిశ్లోకమును దెనిఁగించిరి.

బిభ్రాణశ్శక్తిమాశుప్రశమితబలపత్తారకౌర్జిత్యగుర్వీం
కుర్వాణోలీలయాధఃశ్శిఖినమపి లసచ్చంద్రకాంతావభాసమ్
ఆదద్యాదంధకారే రతిమతిశయినీ మాపహన్ వీక్షణానాం
బాలోలక్ష్మీ మపారామపరఇవగుహోఽహర్పతేరాతపో వః. 25

ఇందు బాలాతపము కుమారస్వామివలె నున్నదని సామాన్యధర్మము శ్లేషలోఁగూర్పఁబడియె. శక్తితార కాధఃశిఖి చంద్రకాంతాంధ కాదిపదములు నేర్పుగాఁదెనుఁగునఁదేఁబడియె.

బలపత్తారకమంక్షుసంక్షపణశుంభచ్ఛక్తిసచ్ఛందకాం
తలసద్ద్యోతశిఖిత్వరాక్రమితయుద్ధామాంధకారాతిపు

ష్కలనేత్రోత్సవకారిబాలదివసేశజ్యోతివిద్యోతిల
క్ష్మలుమీకిచ్చుద్వితీయపావకతనూజుండోయనంజయ్యనన్. 25

ఇందు అంధకారేరతిమతిశయినీం 'చంద్రక + అంతావభాసం' అనుస్థలములు సుందరముగా నాంధ్రీకరింపఁబడియె. ఇట్టి వెన్నియేని యుల్లేఖింపవచ్చు. ముక్తక గ్రంథము సీసములుగా వృత్తమాలికలుగాఁగాక నియతవృత్తములతో న్యూనాధికతలు లేక యర్థము నుపాదించుచుఁ దెనిగించిన యుత్కృష్టకృతులలో నిది యొకటి యని కంఠోక్తిగాఁజెప్పఁదగు. మూలముసైత మించుక కఠినపాకమునఁ బడినందున నాంధ్రీకృతియుఁగొంత కాఠిన్యమువహించెను.

బ్రహ్మశ్రీ వాసుదేవశాస్త్రిలవారి మృచ్ఛకటికము కొందఱి నాగానందము దెనుఁగున నర్థముకాకుండ మూలగ్రంథపరామర్శమావశ్య మగుచున్నది. ప్రసన్నమగు మూలగ్రంథ మాంధ్రమున నన్వయక్లేశమునొసఁగుట శోచనీయము.

బ్రహ్మశ్రీ వ్యాసమూర్తిశాస్త్రిలవారిజన్మజీవితవృత్తముల నధికరించి స్థలాంతరములఁ బెక్కండ్రు వివరించియున్నందున నిందుఁ గేవలము సూర్యశతకానువాద ప్రాశస్త్యమే ప్రధానముగా గ్రహించి యేవో కొన్నియంశములు చెప్పితిమి. అవియసంగతములని దోచవచ్చునుగాని నిక్కముగానే తదనువాద ప్రశంసకును వైలక్షణ్యమునకును దోడ్పడునని తలంచినారము.

తిరుపతి.
10-5-43

మానవల్లి రామకృష్ణకవి.

# 1. ప్రౌఢకవులు - పెద్దన్న

ఆంధ్రభారతికి యోగదశ పట్టి యీ యాంగ్లేయ దొరతన మందల్ప కాలములోనే యనేక ప్రౌఢగ్రంథములు బయలు వెడలినవి. అటకలపై యనాథములం బోలె జీర్ణతాళపత్రములయందు యోగనిద్రయందుండిన యనేక మహాకవుల వాఙ్మణులు సుప్రకాశితములై మనస్సులకు వెలుఁగు నిచ్చుచున్నవి. నూతనముగా ననేక గ్రంథకర్తలు వచన రచనచేత మెప్పువడయుచున్నారు. అనేకులు కనిపెట్టుటకు సులభ సాధ్యము కాని యాంధ్రమహాకవుల జీవితకాలము లును గొంత వరకు వారి చరిత్రములును నేదో యొక విధముగా నంగీకరింపఁ దగునట్లుగానే తెలిసి రచియించియున్నారు. ఈ పుస్తకమున నొక్కొక్క గొప్ప గ్రంథముల యొక్క గుణదోషములఁ గూర్చి విశేషముగాఁ జెప్పఁబడును. పైన చెప్పినట్లు పెక్కు విధములైన యుపకరణములు లభించినందున నిట్టి గ్రంథము వ్రాయుటకు నిదియే యవకాశమని తలఁచెదము. ప్రస్తుతము ప్రౌఢకవులలో నొకఁడగు నల్లసాని పెద్దనతోఁ బ్రారంభించుచున్నాము. గ్రాంథిక మర్యాదచేతఁ బూర్వకవుల ముందు వ్రాయవలసి యున్నను బూర్వకవుల కావ్యములు కొన్ని సంపూర్ణముగా లభింపలేదు. కొందఱి కాల నిర్ణయములు చక్కఁగా తెలియ లేదు. ఈ గ్రంథమున గాలనిర్ణయముతో విశేష ప్రయోజనము గలదు. ఈ కారణములచే మధ్యకాల కావ్యములఁ గూర్చి వ్రాయునంతలో మఱికొన్ని పూర్వ గ్రంథములు సంపాదింపగలుగుదుమని యల్ప ధైర్యముతో మధ్య కవుల గుఱించి ప్రారంభించెదము. ఈ పెద్దన్న ప్రసిద్ధుఁడైన కృష్ణదేవరాయల యాస్థాన కవులలో నగ్రగణ్యుఁడు. ఇతఁడు రచించిన కావ్యములు మను చరిత్రము, హరికథామృతసారము. ఈకవి యొక్క చిన్న కాలమెట్లుండెనో, యీతని చిన్ననాఁటి స్నేహితులెవ్వరో మనకు దృశ్యములగు నీలోకములోని సర్వపదార్థములే దృష్టితో గ్రహించెనో యితని నైజగుణమేదియో యితఁడు తల్లిదండ్రుల దెసనెట్లు మెలఁగెనో యేవియుఁ దెలిసికొనుటకు మనుచరిత్ర యందేయాధారములు లేవు. ఇతని కాలమందు విశేషముగాఁ జదువఁబడుచున్న గ్రంథములు నన్నయ, తిక్కన, సూరన, శంభుదాస, శ్రీనాథుల కృతములే. ఈ కవి శ్రీనాథుని కాశీఖండమునం దధికాదరము చూపినట్లున్నది. ఈ మను

చరిత్ర కథ తిక్కన సోమయాజి శిష్యుఁడగు మారనగారి మార్కండేయ పురాణములోఁ జతుర్థ పంచమాశ్వాసముల నుండి తీసికొనఁబడినది. కావున దీని కథ పూర్వకథయే. ఆ కథ నితఁడెట్లు అలంకరించి యేరసమును నెలకొల్పి యెట్లు తన పే రింత పొగడ్తకుఁ దెచ్చెనోచూతము. వరుణానదీ తీరమున నరుణాస్పద మను పట్టణమునఁ బ్రవరాఖ్యుఁడను విప్రకుమారుఁడు గలఁడు. అతని యింట నెల్లప్పుడాతిథ్యము పుచ్చుకొనుటకై విదేశవాసులు వచ్చుచుందురు. అతనికి నానాదేశవృత్తాంతములు వినుట యందత్యాసక్తి గలదు. ఒకనాఁడొక సిద్ధుఁ డతని గృహంబలంకరించి నిర్మలోపచారములఁ గైకొని వివిధప్రసంగములతోఁ బ్రొద్దు పుచ్చుచుండ నా విప్రకుమారుండు.

శా. ఏయే దేశములన్వసించితిరి మీరేయేగిరు ల్చూచినా
రేయే తీర్థములందు గ్రుంకిడితి రేయేద్వీపముల్ మెట్టినా,
రేయేపుణ్యవనాళి ద్రిమ్మరితి రేయేతోయధుల్ డాసినా
రాయాచోటులఁగల్గు వింతలు మహాత్మా నా కెఱింగింపవే॥

యనవుడు నాసిద్ధుండు తాసేవించిన క్షేత్రములను దాను విహరించిన ప్రాగ్దక్షిణ ప్రత్యగుత్తరదిక్పర్వతంబుల మనోహరత్వములును వర్ణించిచెప్పెను. అంతనా భూసురవరుండు విస్మయనిమగ్నమానసుండై

చ. వెఱవక మీకొనర్తునొక విన్నపమిట్టిదియెల్లఁ జూచిరా
నెఱకలు గట్టుకొన్న మఱియేడులు పూడులు పట్టుఁ బ్రాయపుం
జిఱుతతనంబు మీమొగము సెప్పకచెప్పెడు నద్దిఱయ్య మా
కెఱుఁగఁదరంబె మీమహిమ మీరె యెఱుంగుదురేమి చెప్పుదున్.

అనియడుగఁగా నతఁడు పాదలేపనమను సిద్ధౌషధ మహత్త్వముచే సంచరించెదమని ప్రత్యుత్తరము చెప్పి యొక బరణిసుండి కొంత పసరెత్తి యతి పాదములఁ బూయఁగా నంత నద్భుతముగాఁ బ్రవరాఖ్యుఁడు హిమవత్ప్రాంత్యములఁ జూడవలెనను కోర్కిగలవాఁడగుటచే, దత్ప్రాంతములు చేరెను. ఇంత దనుక ప్రథమాశ్వాసములోని కథ. ఈ కథ నెట్లు వర్ణించెనో చూతము. అరుణాస్పదమను పురమును సంగ్రహముగాఁ జక్కగా వర్ణించి యాపట్టణములోని నాల్గు జాతులను నాల్గు పాదముల భజించి.

గీ. అచటి వెలయాండ్రు రంభాదులైన నొరయఁ
గానె కొంగున వారించి గడపఁ గలరు,

నాట్యరేఖా కళాధురంధరనిరూఢి
నచటఁ బుట్టిన చిగురు కొమ్మైనఁ జేవ.

అని వ్రాసె. పురవర్ణన మనేకులు పెంచి వ్రాసియుండినను బెద్దన వానికి విశేషగౌరవ మీయనివాఁడు గావున విస్తరించి వ్రాయలేదు. తిక్కన విశేషించి రచియించి యున్నాఁడు. ఈమనుచరిత్ర వర్ణన విధముగానే రామభూషణుడు ద్వ్యర్థికావ్యములో జాతివర్ణన చేసినాడు. అంతఁ బ్రవరాఖ్యుని వర్ణించుచు "ప్రవ రాఖ్యుఁడలేఖ్యతనూ విలాసుఁడై.

ఆ.వె. వాని చక్కఁదనము వైరాగ్యమునఁ జేసి
కాంక్ష జేయు జారకామినులకు
భోగ బాహ్యమయ్యెఁ బూచిన సంపెఁగ
పొలుపు మధుకరాంగనలకుఁ బోలె॥

ఉ. యౌవనమందు యజ్వయు ధనాఢ్యుఁడునై కమనీయకౌతుక
శ్రీవిధిఁ గూకటుల్గొలిచి చేసిన కూరిమి సోమిదమ్మ సౌ
ఖ్యావహయై భజింప సుఖులై తలిదండ్రులు గూడి దేవియుం
దేవరఁ బోలె నుండి యిలు దీర్పఁగఁ గాపుర మొప్పు వానికిన్.

అనియు ప్రవరాఖ్యుని మగలైనఁ జొక్కునంతటి రూపంబు వొగడి తదుచితమైన నీతిప్రవర్తనమును నతని బాల్యసంసారములోని యన్యోన్య మైత్రియు నొక కొన్ని మాటలతో నాటునట్లు వర్ణించుట చక్కఁగా నున్నది. అని, మఱియుఁ గొన్ని యతని చరిత్రలు వ్రాసి.

గీ. వండనలయదు వేవురు వచ్చెనేని
నన్నపూర్ణకు నుద్దియౌ నతని గృహిణి
యతిథులేతేర నడికి రేయైనఁ బెట్టు
వలయు భోజ్యంబు లింట నవ్వారిగాఁగ॥

అని యతని గృహిణియొక్క పతిభక్తిని, నతిథి పూజను గొనియాడె. ఇందామె నన్నపూర్ణకు సమానముగాఁ జెప్పెను. ముందే శ్రీనాథుని కాశీఖం డమునందుఁ బెద్దన యధికాదరముంచి యున్నాఁడని జెప్పితిమి. ఇతఁడీ భాగము వ్రాయునప్పుడు-

సీ. జిలుఁగు సంధ్యారాగ చీనాంబరముఁ గట్టి
కుసుమ గర్భముగఁ గేల్గొప్పుదుజిమి
కస్తూరితోఁ గూర్చి గంధసారమలంది
ముత్యాల తాటకంబులు ధరించి
సీమంత పథములఁ జేర్చుచుక్క సవరించి
కురులపైఁ జిన్నిపూఁ గుస్తరించి
శ్రీపాదముల హోమనూపురంబులు దాల్చి
కటి మీఁద వజ్రాల కమరు నిల్పి
యన్నపూర్ణ విశాలాక్షి యనెడు పేళ్ల
కాశికామధ్య శృంగాటకముల యందు
విశ్వపతిదేవి మధ్యాహ్న వేళఁబెట్టు
నమృతపాయస దివ్యాన్నమను దినంబు॥

అను భాగము స్మరణలో నుంచుకొని యుండును. ఇట్లుండ నొక నాటి మధ్యాహ్నమున నొక సిద్ధుఁ డభ్యాగతుఁడై యతని యింటి కేతెంచె.

సీ. ముడిచిన యొంటికెంజెడ మూయువ్వన్నె
మృగముతోలు కిరీటముగ ధరించి
కకపాలకేదార కటకముద్రితపాణి
గుఱుచలాతాముతోఁ గూర్చిపట్టి
ఐణేయమైన యొడ్డాణంబులవణిచే
నక్కళించిన పొట్ట మక్కళించి
యారకూటచ్ఛాయ నవఘళింపఁగఁ జాలు
బడుగు దేహంబున భస్మమలఁది
మిట్ట యురమున నిడుయోగ పట్టె మెఱయఁ
జెవుల రుద్రాక్ష పోఁగులు చవుకళింపఁ
గావికుబుసంబు జలకుండికయును బూని
చేరెఁ దద్గేహ మౌషధ సిద్ధుఁడొకఁడు॥-

ఈ పద్యములోని మొదటి పాదమును మూడవ పాదమును నాసిద్ధుని యొక్క యాకృతి నించుమించుగాఁ జూపుచున్నవి. ఇట్లు చదువు వారి భావనా

దర్పణమునందు వర్ణిత వస్తువు నచ్చొత్తించు సామర్థ్య మందఱి కవుల యొద్ద లేదు. కళాపూర్ణోదయములో సూరన సిద్ధు నిట్లు వర్ణించుచున్నాఁడు.

చ. లలితపు భూతి పూతయును లాతపుఁ గోలయుఁ గక్షపాలయున్
మలగొను చిన్ని కెంజడలు మందుల పొత్తము నాగబెత్తమున్
లలిఁగను పట్టు కిన్నెరయు లాహిరిమోదము సింగినాదమున్
జెలువలరంగ నొప్పు నొక సిద్ధుఁడు సింగపు వారువంబునన్.

ఈ పద్యమున మనశ్చక్షువున కెంత మాత్రము సిద్ధుఁ డగపడలేదు. ఇది యీ పద్యములోని లోపము. పెద్దన్న పద్యములోఁ గొన్ని యంశములు వదలఁబడినను వస్తువుల విరిసి వ్రాసి యున్నాఁడు.

ఇట్లేతెంచిన యప్పరమయోగికి భక్తితో నెదుర్కొని యర్ఘ్య పాద్యాదు లిచ్చి యిష్ట మృష్టాన్నములఁ దృప్తుఁజేసి యతనితో సరస సంభాషణ లాడఁ జొచ్చెను. ఈ భాగమున బూర్వోత్తర విరోధములేక ప్రవరాఖ్యుని గుణము చక్కఁగాఁ బోషింపఁబడి యున్నది. అంతఁ బ్రవరాఖ్యుఁడు-

క. మీమాటలు మంత్రంబులు
మీ మెట్టిన యెడ ప్రయాగ మీపాదనవి
త్రామలతోయము లలఘు
ద్యోమార్గ ఝురాంబు పౌనరుక్త్యములుర్విన్.

ఉ. వానిది భాగ్యవైభవము వానిదిపుణ్య విశేష మెమ్మెయిన్
వాని దవంధ్య జీవనము వానిది జన్మము వేఱుసేయకె
వ్వాని గృహాంతరమ్మున భవాదృశయోగిజనంబు పావన
స్నాన విధాన్నపానముల సంతసమందుచుఁ బోవు నిచ్చలున్.

అని సిద్ధునిస్తుతించెను.

ఈ రెండవ పద్యము వంటి పోలిక గల పద్యము నైషధమునందు నాల్గవ యాశ్వాసమున నున్నది. పోలికగా రచించుట గ్రంథచౌర్యములో జేరినది కాదు. భాగములు గ్రహించుటయే నీచము. అనవుడు నాయోగియు గృహస్థాశ్రమ ధర్మముఁ బొగడఁ దొడఁగె,

సీ. కెలఁకుల నున్న తంగెటి జున్ను గృహమేధి
యజమానుఁడంకస్థితార్థపేటి
పండిన పెరటి కల్పకము వాస్తవ్యుండు
దొడ్డిఁ బెట్టిన వేల్పుగిడ్డి కాపు
కడలేని యమృతంపు నడబావి సంసారి
సవిధమేరునగంబు భవనభర్త
మరుదేశపథ మధ్యమప్రవ కులపతి
యాఁకటి కొదవు సస్యము కుటుంబి

బధిర పంగ్వంధ బిక్షుక బ్రహ్మచారి
జటి పరివ్రాజకాతిథిక్షపణ కావ
ధూతకాపాలికాద్యనాథులనుఁ గావ
భూసురోత్తమ గార్హస్థ్యమునకు సరియె.

వైజయంతి - జూన్, 1896. శ్రీ మానవల్లి రామకృష్ణకవి

# 2. రామకృష్ణార్జున రూప నారాయణీయము

ఇది శ్రీమదుమా మహేశ్వరప్రసాదలబ్ధ సరస కవితా సామ్రాజ్య కౌండిన్యస గోత్ర పవిత్ర సుకవి శేఖర సోమశేఖర ప్రణీతంబు. ఇది శ్రీమత్పూసపాటి శ్రీ నారాయణ రాజుగారి కంకితము సేయఁబడినది. ఇది త్ర్యర్థి కావ్యము. రామాయణ భారత భాగవత గాథలు గలది. మొట్టమొదటఁ ద్ర్యర్థి కావ్యములకు దారిచూపిన యతఁడు బాలసరస్వతియను కవి. బాలసరస్వతులకుఁ బూర్వము మూడర్థములు గల పద్యము నచ్చటచ్చటఁ గొందఱు వ్రాయుచుండిరి కాని మూడు వేర్వేరు కథలను గూర్చి యొక్క కావ్యముగా నెవ్వరు వ్రాయలేదు. బాలసర్వతులు తన రాఘవ యాదవ పాండవీయమున-

గీ. ఖ్యాతికై కొందఱేమొ త్ర్యర్థ కృతులఁ
జేసితి మటందురది కల్లసేయనేల
సరసులకుఁ బ్రతిపద్య విస్మయ మొసంగు
నాదు కష్టంబునకు సాటిలేదు గాన.

వ. అని యఖిలలోకాద్భుత ప్రబంధ రచనాసాహసోత్సుకుండనై అని వ్రాయుచున్నారు.

ఇవియే కథలు గూర్చిన త్ర్యర్థి కావ్యములు మఱి ముగ్వురు రచించి యున్నారు. వీని నన్నిటిలో బాలసరస్వతి కవిత్వము మిక్కిలి ప్రౌఢముగాఁ జిత్రముగా నుండును. ఇట్టి శ్లేషకృతులు విరచించుట మిక్కిలి కష్టము. వీని యందు వట్టి కథాభాగము లిముడ్చుటకే ప్రయాసకరము గావున మూడర్థము లకు వేర్వేఱంశములు సాధారణ కావ్యముల యందువలె వర్ణించుటకు వీలులేదు. శ్లేషములేని సమానార్థ భాగముల యందలి కవిత్వము మృదువై చక్కఁగా నున్నది. అందున కుదాహరణముగా నీ క్రింది పద్యముఁ జూపవచ్చును-

సీ. బాలవాసంతి కాజాల జాలకరాజి
కలమానమౌ కి కావళులుగాఁగ

సర్వంసహాతలాచ్ఛాదిత సమపఙ్క్తి
తపనీయ సత్కథాస్తరణగాఁగ
ఘనలతాగ్రనికాయ కాయమానప్రభల్
పటు వితాన వితాన పటముగాఁగ
కమనీయ తరుభూజ కాండకాండ శ్రేణి
విపుల శుంభ స్తంభ వీథిగాఁగ

చారుమధు శీకరములు పన్నీరుగాఁగ
భ్రమర గానంబు సంగీత ఫణితిగాఁగ
తతపికధ్వని సుకవి సన్నుతులుగాఁగ
మరుసభాసద్మ యనఁగ నామనిదనర్చె.

బాలసరస్వతి కవిత్వము శ్లేషలేని భాగముల భావగర్భితమైనను సర్వసౌలభ్యముగా నుండదు. ఈ సోమశేఖరకవి యించుమించుగాఁ బింగళి సూరన్న మార్గము ననుసరించి విశేషవర్ణనాంశములు లేకయే సులభముగా నర్థము బోధపడునట్లు వ్రాసెను. బాలసరస్వతి యనేకవర్ణనలు గూర్చెను.

సీ. దృక్కించిదుత్క్షేప దృష్టామరావతీ
జన విహారోపాత్త సమ్మదములు
వ్యావిద్ధ నిజదర్ప వామనీభూత సం
దృశ్యమాన మహామహీధరములు
కక్ష్యానిరోధ సంకటభా జ్ననభశ్చర
ద్గ్రిహదుర్దశాకృత ప్రహసితములు
భాస్కర ప్రతికారపటు గవాక్షోత్కాంత
ధూప ధూమతమిస్రధూర్వహములు

శశికర ద్యుతి శశిశిలా శకలముకుల
సలిలకణపాత చిటచిట స్వనవదభ్ర
గర్భనిర్భర విద్యుత్ప్రకాండములు పు
రంబులోఁ బొల్చు కనకహర్మ్యవ్రజములు.

చంద్రికాపరిణయము వంటి కావ్యము వ్రాసిన కవి యిట్టి జటిల సమాసముల పద్యము గూర్చుట యాశ్చర్యము కాదు. ఈ సోమశేఖరకవియితర

విధ చిత్ర కవిత్వముల యందును ప్రముఖుఁడు. కొన్ని వ్యాకరణ దుష్టములగు ప్రయోగము లగపడుచున్నవి. 'మనీశుఁడు', మను + ఈశుఁడు ''యాగచరుతాంతల సత్కారునిన్'' అనునది రామార్థమున ''యాగచరుతా + అత' యనియు భారతార్థమున ''యాగచరున్, తాంతలసత్కారునిన్' యనియు నగుచున్నది. అపుడు భారతార్థమున 'యాగచరుఁదాత' యని యగును. దీని యందుండు టీకయందు గాంతల సత్కారు అని వ్రాయఁబడియె. అట్లయిన యతిభంగము. ఈ గ్రంథమునకుఁ గవియో మఱి యెవ్వరో టీకయు వ్రాసి లోకమునకు గొప్ప సాహాయ్యము చేసిరి. ఈ కవి సుమారు నూరు సంవత్సరముల క్రిందట నున్న వాఁడని తోఁచెడిని. ఇతని శైలి తెలియుటకై రెండు పద్యము లుదాహరించెదము.

సీ. పొత్తిళ్ల లోపలఁ బొదలు చుండెడివేళ
    శరగర్భ గత పూర్ణచంద్రులనఁగ
మోకాళ్ల దలలెత్తి ప్రాకుచుండెడివేళ
    దివ్యపన్నగ కులాధీశుఁడనఁగ
మెలమెల్ల నింతింత మెలఁగుచుండెడివేళఁ
    గొమరొప్ప నేనుఁగుగున్న లనఁగ
బాలురతోఁ గూడి బంతులాడెడివేళ
    గుఱిమీఱ సింగంబు కొదమలనఁగ

నలరునట ధర్మజగుణార్జునాఖ్యులగుచు
గ్రాలుచుండఁగ బలహరుల్ గవలఁ గూడి
రామలక్ష్మణులనఁగను రహి జెలంగ
వినయ భరత శత్రుఘ్నులు వెలసిరంత.

మ. సతి మందోదరి చిత్రరేఖ తరుణీ పరిశోభితాకారసం
తతసమృద్ధివరేణ్య కృష్ణమృగనేత్ర శ్రీమహోదార స
ద్గతి గో భూతల నాగలోక విలసత్ క్ష్మాపాల వీరాగ్రణి
స్థితులన్ జూపుచు చిత్రభంగి మెఱయన్ దేల్చెన్ బ్రియాలాపతన్.

జయంతి - డిసెంబరు, 1896. శ్రీ మానవల్లి రామకృష్ణకవి

# 3. కవుల చరిత్రాంశములు

రత్నాకరమునందు నత్తగుల్లలుగూడ నుండుట దానికి దోషావహము కాదు. తులలేని రత్నభారమును మన్నింప సముద్రపు నీటిపైఁదేలు చీదర కట్టెలను జూచి దాని మహిమను మానమును గుర్తించినటులగాక, నేను శ్రీయుత రావుబహదరు వీరేశలింగంపంతులుగారి కవుల చరిత్రములోని కొన్ని యంశములు ప్రమాదపతితములని యెత్తి చర్చింపబోవుచున్నాను. ఇట్లు విమర్శింపవలసిన యావశ్యకము నన్నయభట్టుగుఱించిన చర్చవలనఁ గలిగెను. నన్నెచోళుని కుమారసంభవమునుగూర్చి దానిలో షష్ఠ్యంతములు కలవనియుఁ ప్రథమపద్య మాంధ్రకవిత్వమే యనియుఁ దిక్కనకు బూర్వమిట్టిమర్యాద పొడ గానరాదనియుఁ, గావున జోళుఁడు తిక్కనకు నర్వాచీనుఁడనియు, శ్రీయుత బ్రహ్మయ్యగారును దత్పక్షావలంబులును గ్రహించుచున్నారు. మఱియుఁగొందరు విమర్శకులు పెద్దన ప్రబంధమార్గదర్శకుడనియు గుమారసంభవకథ పురాణము లలోనుండి గ్రహించి నానావర్ణనాంశములతోఁ జోళుఁడు ప్రబంధరూపముగా రచించెననియు, గాఁబట్టి నన్నెచోళుఁడు పెద్దనకు నర్వాచీనుఁడనియు వ్రాయు చున్నారు. వీరలు తమవ్రాతల కాధారముగా శ్రీ రాయబహదరు వీరేశలింగం పంతులవారి గ్రంథములోనుండి యుదాహరించుచున్నారు. వీరి సత్యాసత్యములు గుర్తెఱుంగక యివి యాధారములుగా గ్రహించి చోళుని కాలనిర్ణయముచేయుట యుత్కృష్టమార్గమని నాకుతోచలేదు. శ్రీవీరేశలింగంపంతులువారు సత్యాన్వేషణ మునందే జీవితకాలమును వినియోగించువారు గావున మిత్రప్రత్యయమును దోషముగా గ్రహింపకుండుటకు మొదట వారి క్షమావణము వేఁడుకొను చున్నాఁడను.

శ్రీయుత పంతులవారు కవులచరిత్ర వ్రాయునప్పటికిఁ దిక్కనకుఁ బూర్వకవులు నన్నయయు మల్లనయు మాత్రమే. వీరు విన్నకోట పెద్దనను దిక్కనకంటెఁ దర్వాతవానిగా గ్రహించినట్లు తోఁచుచున్నది. కావున భారతాదియు, మల్లన గణితగ్రంథాదియు, నిర్వచనోత్తరరామాయణాదియు, గావ్యాలంకారచూడామణిగ్రంథాదియు, శ్లోకములతో నుపక్రమింపబడినందునను గావ్యాలంకారచూడామణిలోఁదక్క దక్కిన కృతులలో షష్ఠ్యంతములు లేకుం

డుటవలనను వీరు తిక్కనకే షష్ట్యంత ప్రథమరచనయు నాంధ్రప్రథమ పద్య రచనయుఁ దగిలించిరి.

అంతియకాక వేఱాధారములు వీరికి గలవని నాకుఁ దోచినదికాదు. ఇది కేవలమూహయే. కుమారసంభవములో నీ రెండు లక్షణములు గలవు. కుమార సంభవకర్త యే చోళుఁడైనను దిక్కనకుఁ దరువాతివాఁడుకాదు. అయిదుగురు నన్నెచోళులలోఁ గడపటివాఁడు క్రీ॥ శ॥ 1220లో నుండియుండుటచే 1260లో నుండిన తిక్కనకుం బూర్వుఁడే. విమర్శకులు చోళుని నన్నయకుఁ బూర్వుఁడు కాఁడని సాధింపఁగలిగిరేనియుఁ దిక్కనకు నర్వాచీనుఁడని సాధించుటమాత్రము కానేరదు. దీనివిషయ మిటుండనిండు. ఇప్పుడు తిక్కనకుం బూర్వకావ్యములు పెక్కులు గలవు. వానిలోఁగూడఁ బ్రథమపద్యము లాంధ్రముగానే యున్నవి. విన్నకోట పెద్దన్న తిక్కనకుం బూర్వుఁడని నాయభిప్రాయము. మాచన వఱకును నాకు లభించిన కావ్యములలో నెచ్చటను బూర్వకవి స్తోత్ర మే యాంధ్రకవులనుగూర్చి కానరాదు. నన్నయభట్టును గారణాంతరమున బేర్కొనిరి. నమస్కృతిపూర్వకముగా నెవరును స్తుతింపరైరి. కావ్యాలంకార చూడామణిలో షష్ట్యంతములుగలవు. దశకుమారచరిత్రములో బై రెండు లక్షణములును గలవు. అది భారతరచనకుఁ బూర్వమే తిక్కన కంకితమీయ బడెనని యూహించుచున్నాను. కుమారసంభవములోఁ బ్రథమపద్యము స్రగ్ధరా వృత్తమున గూర్పఁబడినది. ఈమర్యాద యాంధ్రమున నేఁటివరకు గానరాదు. కావున నితఁడు 1911 క్రీ॥ శకములో నుండబోవువాఁడేమో ? ఇట్టి చిత్రములు కూడ హేతువులగునా ?

ఇఁకఁ బ్రబంధరచనావిషయము విచారింతము. అల్లసాని పెద్దనయే ప్రబంధరచనకు దారిచూపి యాంధ్రకవితాపితామహుఁడని బిరుదమునొంది నట్లు గతానుగతికము వ్రాయుచున్నారు. పితామహశబ్దసార్థకత్వమునకై యీ కథ యల్లిరేమో? తిక్కనకుఁ గవిబ్రహ్మయని యేలచెప్పిరి ? వారు నిర్వచన కావ్యమును సృష్టించినందుకా ? "సుమతిశతకముఁగావించిన ప్రౌఢఁ గావ్య కమలాసనుఁడన్" "కావ్యచతుర్ముఖ బద్దెభూపతీ" అని చెప్పుకొనిన బద్దెన నన్నెచోళున కెందులకీ బిరుదముకలిగెను. అల్లసాని పెద్దన్న నూతనముగా సృజించిన ప్రబంధప్రణాళిక యేదియో నాకు గుర్తింపరాదు.

పురాణగాథేతిహాసములలోనుండి కథను గ్రహించి వర్ణనాంశములను జొప్పించుటయా? అట్లయిన రఘువంశ, భారవి, సేతుబంధ, మాఘాదికావ్యము లెట్టివి? ఆంధ్రభాషలోమాత్రమే యని యందురా? విక్రమార్కచరిత, తిక్కన విజయసేనము, పెద్దన ప్రద్యుమ్నచరిత్ర, భోజరాజీయము, అమరేశ్వరుని విక్రమసేనము, భల్లటుని విక్రమార్కచరిత, హరవిలాసము, కేయూరబాహు చరిత్ర, శకుంతలాపరిణయము, రుక్మాంగదచరిత్ర, కలావిలాసము, కుమార సంభవము—ఇత్యాదులేవి? వీనికిని మనుచరిత్రధాతులకుఁగల భేదమెట్టిది? పైకృతులేవియు దెనిగింపఁబడినవికావు. అవియు నాంధ్రమున నూత్నపు ప్రబంధములే. మఱియు నెఱ్ఱనకుఁ బ్రబంధపరమేశ్వరబిరుదము భారతారణ్య పర్వమును బ్రబంధరీతిగా రచింపఁబడినందున గలిగెనని చెప్పుచున్నారు. పెద్దనయొక్క ప్రణాళిక శంభుదాసుఁడెట్లు గుర్తెఱింగెను? బ్రహ్మవిష్ణు మహేశ్వరులవలెనున్న నన్నయ తిక్కన శంభుదాసులలో మూఁడవవాఁడగు నితఁడు శివపక్షపాతియైనందున భారతప్రబంధ రచనాకర్తయగుటవలనను పరమేశ్వర బిరుదమును బొందెను. "యాత్రయిఁ దాఁ బ్రబంధపరమేశ్వరుఁడై రచియించె" నని పంచమవేదమగు భారతము రచించునప్పుడు మూఁడవమూర్తిగా బుధులు వర్ణించిరి. ఇచ్చట త్రయీశబ్దమునకుఁ గవిత్రయమని యపార్థమును గల్పింపఁ జాలు వ్యాఖ్యాతృ శిఖామణులుఁగలరు.

ప్రబంధమనగా, గేవలము కావ్యబంధము. ఈ శబ్దము మనుచరిత్రాది కావ్యములకే గాక భారతాది గ్రంథములకును, బురాణములకుఁ గూడఁ జెప్ప వచ్చును. పెద్దలగు బూర్వులీ పదమును గ్రంథరూపమగు కవికర్మమున వాడి యుండిరని నేను చూపెదను. పెద్దనకే యీ విచిత్ర ప్రబంధ కర్తృత్వ మెట్లు కలిగెనో యెవరైన సుముఖులు నాకు దెలుపుడు. నేనీ క్రిందఁ జూపఁబోవు ప్రయోగము లన్నియు పెద్దనకుంబూర్వ కావ్యములలోనివి: "క॥ సాళువనరసింగ మహీపాలుని సత్యంతఘన కృపాళుని ననుహృత్పాలిత నగరీ పశ్యత్పాలుని నాచేయు కృతికిఁబతి గావింతున్" అని ప్రబంధంబు జెప్ప నుద్యోగించు సమ యంబున "అని జైమిని భారతము. "తెల్లంబిప్పుడు రామభారత కథాధీన ప్రబంధావళుల్" నన్నపార్యుఁడు. "ప్రబంధ ప్రౌఢ వాసనా సంపత్తి సొంపు పుట్టింప నేర్పు" శకుంతలాపరిణయము. "అపచిదేవయత్రిపురారి గృతి స్వామిగా హరవిలాసంబను ప్రబంధంబు చెప్పందొడంగి యమ్మహాప్రబం

ధంబునకు" హరవిలాసము ఆ ౧-౧౨. "ఘనునిం బద్మపురాణ సంగ్రహ కథా కావ్య ప్రబంధాధిపున్ నాకుఁగృపసేయు మొకప్రబంధమ్ము నీవు" భీమఖండము. "సమస్త జగత్ప్రసిద్ధమై పరఁగుచు నుండ మాకొక ప్రబంధ మొనర్పు" నారాయణకవి పంచతంత్రి. "ఆంధ్ర భాషా కార్య రచనాభినయ విశారదుఁ బ్రబంధకర్తను" విష్ణుపురాణము. "పెద్దలు సత్ప్రబంధముల్ వ్రాయక చెప్పిరిట్లు" విక్రమార్కచరిత. "కావున ప్రబంధ రచనా ప్రావీణ్యము" నృసింహపురాణము. "భక్త్యాథవాస్యైవ మమ ప్రబంధే సూక్ష్మోయమున్మీలతి శక్తిలేశః" నవసాహసాంక చరిత. "అతో ధ్రువం నేహమమ ప్రబంధే ప్రభూతదోషేఽన్య యశోవకాశః" నేమినిర్వాణ కావ్యం. "సర్వానవద్యస్తు కథం ప్రబంధః సంజాయతే దుర్జన హంతకారః" శ్రీకంఠచరితం. "కావ్యాధిరాజ పదమర్హతి సప్రబంధః" మంఖుకుడు. "ప్రత్యక్షరశ్లేషమయ ప్రబంధ విన్యాస వైదగ్ధ్య నిధిర్నిబంధం" వాసవదత్తా. "సుశ్లిష్ట పదవిన్యాసం ప్రబంధం రచయంతియే శ్రావ్యబంధం ప్రసన్నార్థం తే మహాకవయో మతాః" "నిస్తవఃకతిచిచ్ఛోకాన్ సర్వోఽపి కురుతేకవిః పూర్వాపదార్థఘటనై ప్రబంధో దుష్కరోమతః" జిన సేనుని మహాపురాణము. "సత్కవి కవిరాజ హంస నెనెవేళ లొడర్చిదనీ ప్రబంధమం" నాగవర్మనకాదంబరి. "వించి సువేంమనం బయసె మల్లి జినేంద్రమహాప్రబంధమం" అభినవపంపన మల్లినాథపురాణం. "ఇదు విదిత వివిధ ప్ర బ ం ధ న న విహార పరిణత" కవిరాజ కుంజర విరచిత మప్పలీలావతీ ప్రబంధదోళ్" నేమి చంద్రన లీలావతి. ద్రవిడ భాషలో నమ్మాళ్వారులు రచించిన వేదమునకు దివ్యప్రబంధమనియు, నాలాయిరప్రబంధమనియు నామము. మఱియు "యాతేది వంపితరి తమద్వచనై వసార్ధం విచ్ఛేద మాపభువి యస్తుకథా ప్రబంధః" ఉత్తరకాదంబరి. "యద్వ్యవ్య సౌ ప్రబంధేషు ప్రాచాంసాధు నిరూపితా" "ప్రసిద్ధం చైతన్మహాప్రబంధేషు పరివద్ధ ఇ విణ్ణాణం-ఇతి" ప్రతాపరుద్రీయము. దీనిలో నుదాహృతప్రాకృత పద్యము సేతుబంధములోనిది. విద్యానాథుని యభిప్రాయమున నదియు మహాప్రబంధమే.

"తజ్ఞులు పొగడం బ్రబంధములు చోద్యము పుట్ట రచింపవచ్చునే" మడికిసింగన్న నీతితారావళి. "భాగవత ప్రబంధ మతి భాసురతన్ రచియించి" వీరభద్ర విజయము. అయ్యోయిన్ని ప్రబంధములు పెద్దనకుఁ బూర్వముండగా

నతఁడెట్లు మార్గదర్శియయ్యెను? ఈ మాట నాధారము చేసికొని ప్రబంధ రూపమున నుండు కుమారసంభవము పెద్దన కంటె నర్వాచీన మనుట విచిత్ర ప్రతిభా ప్రదర్శనమే.

ఇఁకను షష్ఠ్యంతవిషయమున దశకుమారచరిత కావ్యాలంకారచూడామణి గాక మనుమంచిభట్ట రచితమగు హయలక్షణశాస్త్రమునందును షష్ఠ్యంతములుగలవు. హయలక్షణవిలాసము చాళుక్య కంపభూపతి కంకితమీయబడినది. ఇతండు నన్నయభట్టు కంటెఁ బూర్వుండాయని సందేహింపవలసి యున్నది. ఈ గ్రంథములోని యవతారిక నాకెవరేని బంపుదురేని చాల గృతజ్ఞుడనయ్యెదను. శ్రీయుత వీరేశలింగం పంతుల వారు తిక్కన తండ్రియగు కొమ్మన శివలీలావిలాసము రచించెనని కవుల చరిత్రమున వ్రాసియున్నారు. నాకు లభించిన కొమ్మన శివలీలావిలాసమున గూడ షష్ఠ్యంతములు గలవు. "భాషాధవచాతుర్య విశేషకళా ధుర్యమతి విజృంభణ విద్వత్పోషణ లబ్ధయశస్స్రవ ఘోష విశాలునకు జగద గోపాలునకున్" ఇత్యాదులు నేను వాదపక్షము ననుసరించి చెప్పితినిగాని కొమ్మన శ్రీవత్సగోత్ర జాతుఁడగుటయు, శివలీలావిలాసము వీరభద్రారెడ్డి తమ్ముడగు దొడ్డ భూపాలున కంకితమీయఁబడుటయు, కొమ్మన కవిత్రయమును స్తుతించియుండుటయు, నేనెఱుగనివాఁడనుగాను. పాల్కురికి సోమనాథుఁడు షష్ఠ్యంతములు విరచించెను. అతఁడు ప్రథమప్రతాపరుద్రుని కాలమువాఁడు. అతని 1222లో నుండిన సోమరాజు తన యద్భుతకావ్యమున స్తుతించియున్నాడు. కావున దిక్కనకుం బూర్వుఁడు. తిక్కన కాలము 1260 కంటె దరువాత నగుచున్నది. 1257 క్రీ.శ.లో మనుమసిద్ధి నందలూరిలో శాసనము కొట్టించెను. అతని తండ్రియగు నెల్లూరి తిరుకాళమనుజ విభుని సమ్ముఖంబున సాహిత్యసరణి నెఱపిన పెద్దయామాత్యుని మనుమడు జక్కన ప్రథమదేవరాయల యాస్థానమున నుండెను. తిక్కనచే నుతిగన్న బయ్యనమున్మనుమడు అనంతకవి క్రీ. శ. 1434 లో రసాభరణము రచించెను. తిక్కన బూర్వకావ్యములు పెక్కులాంధ్ర పద్యములతోనే ప్రారంభింపఁబడినవి. ఇట్టివి గుర్తింపగల శ్రీయుత వీరేశలింగం పంతుల వారప్పటికిఁ దమకు లభించిన గ్రంథ సామగ్రి ననుసరించి వ్రాసిన యంశముల నించుక శోధించి తక్కినవారి వ్రాఁతలపై పూర్వ పక్షమునకు దొడరుటయే మేలు.

ఆంధ్రభారతి, జూన్, 1911 మా - రామకృష్ణకవి.

# 4. తుక్కాపంచకము

ఆషాఢమాసపు భారతీసంచికలోఁ దుక్కాదేవి రచించెనన్న శ్లోకపంచకమును గూర్చి వ్రాయుచు వానిలో రెండు వల్లభదేవుని సుభాషితావళిలో నుదాహరింపబడి యుండుటయు, నొక్కటి ముకుళభట్టుచే నభిధావృత్తిమాతృకయను గ్రంథములో నుదాహరింపఁ బడియుండుటయుఁ జూడ నాశ్లోకములు కృష్ణరాయల భార్యయగు తుక్కాదేవి రచించియుండుట సంభవింపదని వ్రాసియుంటిని. ముకుళభట్టు కాశ్మీరదేశమును క్రీ. శ. 850 కాలములోఁ బరిపాలించుచుండిన యవంతివర్మ కాలములో శంకరావతారమని పొగడ్తగన్న భట్టకల్లటుని కుమారుడగుటచే నీపద్యములు క్రీ. శ. 1520లో నుండిన కృష్ణరాయనిభార్య రచించి యుండుననుట వీలుగాదని నాయభిప్రాయమును నాధారముగా నందుఁజూపితిని. భట్టకల్లటుఁ డవంతివర్మకాలములో నుండెనని కల్హణుఁడు రాజతరంగిణిలోఁ జెప్పియున్నాఁడు. ఈ తుక్కాపంచకముమీఁది నావిమర్శమును వేడుకగా నాక్షేపించుచు శ్రీ రంగస్వామిసరస్వతిగారు కార్తికమాసపు సంచికలోఁ బ్రత్యుత్తరమిచ్చిరి. అందుఁ గృష్ణరాయలు గజపతికూఁతుఁ బెండ్లాడెననుటయు, తుక్కాశబ్ద మనేకులకు నామమగుటచే గజపతికూఁతున కాపేరు వాడుకలో నుండవచ్చుననియు, నాశ్లోకపంచక మామె యితర కవుల చాటువులవలననో కావ్యములవలననో సేకరించియుండవచ్చుననియు, భట్టకల్లటునిగూర్చి కల్హణుని యభిప్రాయము విశ్వాసము కాదనియు, గజపతి పండితుడై పండితాదరము చూపినందున నతని కుమార్తెయు విదుషియైయుండనోపుననియు ఫలితార్థము తేల్చినట్లుతోఁచుచున్నది.

ఈ యంశములలోఁ దుక్కాదేవి ప్రాచీనుల పద్యముల సేకరించెనని వారంగీకరించునప్పుడు మా యభిప్రాయము గతార్థమయ్యె. ఆమె కవయిత్రి యని పెక్కండ్రు చరిత్రములలో వ్రాయుట కీశ్లోకపంచకమే కారణముకాని పక్షమున ఆమెకవనధోరణి విని యాసతిఁగీర్తింప మాకును గుతూహలము కలదు. కేవలమును బూర్వకవిపద్యములఁ గృష్ణరాయలకు నపదేశభంగిగాఁ దుక్కాదేవి పంపియుండినయెడలఁ గృష్ణరాయఁడు ప్రియురాలిసమయోపస్థితికి మెచ్చుకొని

తుక్కా వైదుష్యమునకైనను దానితో సాంగత్యము గోరఁగల సామాన్యరసికుఁడు కావలయును. అట్లుకాకున్న సంస్కృతవాఙ్మయమున కేవలము పరిశ్రమ పాట వములేక తత్కృతములుగానే భ్రమించి యామెను జేపట్టి యుండవచ్చును. ఎట్లైనను దుక్కాదేవికిఁ గవనశక్తిగలదా యను నంశము సందిగ్ధమే.

ఈ సందర్భములో ముకుళభట్టు తండ్రియగు భట్టకల్లటునిగూర్చి కల్హ ణుఁడు వ్రాసినకాలము నమ్మదగినదికాదని శ్రీ సరస్వతిగారు వ్రాసినవ్రాఁతను బరిశోధింతము. కల్హణుఁడు తనకుఁ జాలఁ బూర్వకాలమువారి చరిత్రములు వ్రాయుటలోఁ బొరఁబడియుండవచ్చును. తనకంటెను మూఁడు శతాబ్దులకుఁ బూర్వమేయుండిన కల్లటుని విషయములో కల్హణుని కాలనిర్ణయము ప్రమాద దుష్టమనినేను సాహసించి చెప్పజాలను. కల్హణుని ప్రామాణ్యమేటఁ గలయ నిండు. 1180 క్రీ. శ.లోనుండిన కల్హణునికంటెను భట్టకల్లటుఁడు తరువాతి వాఁడగునా? కృష్ణరాయలు క్రీ. శ. 1509 లో నుండినవాఁడు. తుక్కాదేవి కంటెను కల్లటునిఁ బేర్కొనిన కల్హణుఁడు 350 సంవత్సరములు పూర్వుఁడని శ్రీ సరస్వతిగారే యంగీకరించి తీరవలయును. ఈ యంశము స్పష్టముగాఁ జెప్పక "పేరుగన్న కష్ణరాయలకు భార్యయైన తుక్కాదేవి ఈ యైదు శ్లోకములు సేకరించి యుండదనుట యెంతసాహసము" అని వ్రాసిరి. సేకరించుట కంతటి గజపతికూతుఁరును నాంధ్రభోజుని భార్యయుఁ గావలసిన యావశ్యములేదు. సామాన్య స్త్రీయును జేయఁగలదు. సేకరించుపని యామెచేతఁగాదని యెవరు సాహసించిచెప్పిరి? అట్లుచెప్పినవారిపై శ్రీ సరస్వతిగారికిఁ గోపము తప్పక రావలసినదే.

ముకుళభట్టు ప్రాచీనుడని వారు స్పష్టముగా నంగీకరింపనందున నేను మరలఁగొన్ని యాధారములఁ జూపదలచినాఁడను.

(1) భట్టకల్లటుఁడును, గల్హణుఁడును దుక్కాదేవికిఁ దరువాతివారనియే క్షణకాల మంగీకరింతము. ముకుళభట్టు భట్టోద్భటుని కావ్యాలంకారసంగ్రహ మునకు వాఖ్యరచించె. దానిలోని పంక్తులను గుంతలకుఁడు వక్రోక్తి జీవితములోఁ దృతీయోన్మేషమున ఖండించెను. కుంతలకుఁడు లోచనవ్యాఖ్యాత యగునభినవ గుప్తునకంటెఁబూర్వుఁడని యతనినాట్యశాస్త్రవ్యాఖ్యానమువలన స్పష్టమయ్యె.

(2) ముకుళభట్టుశిష్యుఁడు ప్రతీహారేందురాజు కొంకణదేశస్థుఁడు. క్రీ.శ.

సుమారు 930 లో నుండినవాఁడు. గురుప్రశంసను తన యుద్భటాలంకార వ్యాఖ్యలో విస్తరించెను.

(3) ముకుళభట్టు కుమారుఁడు హర్షటుఁడు జయదేవచ్ఛందమునకు వ్యాఖ్యగూర్చెను. దాని నభినవగుప్తుఁడు తన నాట్యశాస్త్రవ్యాఖ్యలోఁ బేర్కొనియె. అభినవగుప్తుని గ్రంథములన్నియు క్రీ. శ. 1030లోఁగా విరచింపఁబడియె.

(4) కావ్యాలంకారసూత్రములు వామనాచార్యుఁడు రచించి చనిపోఁగా నందుఁగొన్ని భాగములు చెదపట్టఁగా ముకుళభట్టుదానిఁదెప్పించి పూరించెనని తెలియుచున్నది. అభినవగుప్తాదులు వామనునిఁ బూర్వునిఁగాఁ బ్రశంసించి యున్నారు. వామనాలంకారవ్యాఖ్యాతలలో నతిప్రాచీనుఁడగుసహదేవుఁడు తద్గ్రంథమునకు ముకుళభట్టసంబంధ మిట్లువివరించుచున్నాఁడు.

వేదితా సర్వశాస్త్రాణాం భట్టోఽభూన్ముకుళాభిధః
లబ్ధ్వా కుతశ్చి దాదర్శం భ్రష్టామ్నాయం సముద్ధృతమ్.
కావ్యాలంకారశాస్త్రం యత్తేనైత ద్వామనోదితమ్

వామనభట్టు రాష్ట్రకూట జగత్తుంగుని సభ దర్శించినట్లు తోఁచుచున్నది, ముకుళభట్టును నతనికి సమీపకాలమువాఁడే.

(5) క్రీ. శ. 1100 కాలములో నుండిన మమ్మటుడు శబ్దవ్యాపార మను గ్రంథమున ముకుళుని యభిధావృత్తిమాతృకలో నీక్రిందిశ్లోకము నుదాహరించెను.

"వక్తుర్వాక్యస్య వాచ్యస్య రూపభేదా ద్విభిద్యతే." అభి-6.

(6) క్రీ. శ. 1180 ప్రాంతములోనుండిన హేమచంద్రాచార్యుఁడు కావ్యానుశాసనవ్యాఖ్యానమున

"అస్మాభిరితిః నచ భట్టముకుళాదిభిః, త్రైర్హి రూఢిమపి
ప్రయోజనతయా ఉపన్యస్య లక్షణతయా ప్రవర్తితా।
యదాహుః, రూఢేః ప్రయోజనాద్వాపి
వ్యవహారోఽవలోక్యతే' (ఇతి కావ్యాను-పుట 25)

అనెను. ఈ శ్లోకార్థ మభిధావృత్తిమాతృకలోనే (12శ్లో) యుండుటగాక దీనికుపష్టంభముగానే తుక్కాపంచకములోని శ్లోకముదాహరింపఁబడియె.

(7) కావ్యప్రకాశవాఖ్యాతయగు మాణిక్యచంద్రుఁడు (క్రీ. శ. 1200 కాలమువాఁడు) ముకుళభట్టును ఖండించె.

(8) విద్యారణ్యులవారి భ్రాతయగుభోగనాథుఁడు రచించిన కావ్యాలంకార సుధానిధి యను మహాగ్రంథమున ముకుళభట్టురచించిన యభిధామాతృకలోని శ్లోకము ఖండింపఁబడియె. భోగనాథుఁడు క్రీ. శ. 1380 కాలమువాఁడు. కల్హణునికల్లటుఁ డేకాలమువాఁడైనను ముకుళునిఁ బేర్కొన్న వీరందఱును కృష్ణరాయనికిఁజాలఁ బూర్వులు. కావునఁదుక్కాకర్తృత్వము శ్లోకములకుఁ బొందు పడదుగదా!

ఇఁక గజపతికూఁతుపేరు తుక్కాయనియెట్లు సిద్ధాంతమయ్యె? కృష్ణ రాయలు గజపతినోడించి యతనికుమారితెఁ బెండ్లియాడుట నిశ్చయమేకాని యామెపేరు తుక్కాదేవి యనుట కాధారమేమి? వారుదాహరించిన,

"ప్రతాపరుద్రస్య గజేశ్వరస్య
పుత్రీం బవిత్రీకృత భూతధాత్రీమ్;
ప్రత్యగ్రహీ ద్యః ప్రకటప్రతాపో
భద్రాం సుభద్రామివ పాండవేయః."

అనుశ్లోకము వలననే గజపతికూఁతురు "తుక్కా"కాదనియుభద్రాదేవియో లేక సుభద్రాదేవియో యని యేర్పడును. కళింగ రాజులకుఁ గులదైవములు జగన్నాథములోని కృష్ణుఁడును, సుభద్రాదేవియుఁ గావున వారిబిడ్డలకు సుభద్ర యని నామముంచుట యాశ్చర్యముకాదు. సరియైన యన్వయమును వదలిపేరు చెప్పక కవిపద్యము వ్రాసెననుట యంత సమంజసముకాదు. ఒకవేళ తుక్కా నామము సుభద్రకు దాదులో విదూషకులో పెట్టియుందురేమో! గజపతిపాండిత్య పరాక్రమములును, కృష్ణరాయని యాంధ్రభోజత్వమును మనమెంత మెచ్చు కొన్నను తుక్కాదేవి యొకతెయుండి యామె కృష్ణరాయల పత్నియై యీ శ్లోక పంచకముగాక వేఱుపద్యములు రచించి యుండునేని యామెకీర్తి కొనియాడఁ దగినదే. అట్టిరసికురాలి కవితాసౌభాగ్యము లనుభవింపక కేవలము మాటవాసికి నిలిచెనన్న కృష్ణరాయఁడు వ్యర్థుఁడనియే నిందింపవచ్చుగాని యట్టిస్థితి నిరూపింపఁబడలేదు.

గతానుగతికముగా సందిగ్ధాంశములనుగూడ సత్యోత్తరములుగా (?) నితరులు వ్రాయుచుండుటవలనఁ దుకా_కథామూలమును శోధింపవలసివచ్చెను గాని శ్రీసరస్వతిగారికిఁ బ్రామాణ్యభంగారోపణము చేయుట మామతముకాదు. వారి వ్రాఁతనాధారముగాఁ గొని యితరులు పరంపరగా వ్రాయుటచే నింత చర్చింపవలసివచ్చెను. ఇట్లే కవి చరిత్రకారులవ్రాఁత లాధారములుగా నెన్ని క్రొత్త దొంతులు నిరాధారములయ్యును భావనాగగనాంగణమున గంధర్వనగర జ్యోతుల వెదచల్లుచున్నవి!

భారతి – క్రోధన, జ్యేష్ఠమాసము } మా–రామకృష్ణకవి

# 5. సురేశ్వరాచార్యులెవ్వరు?

అద్వైతమతవ్యవస్థాపకులగు శ్రీ శంకరభగవత్పాదులకు ముఖ్యశిష్యులగు సురేశ్వరాచార్యులు బృహదారణ్యకభాష్యవార్తికమును, తైత్తిరీయభాష్యవార్తికమును, నైష్కర్మ్యసిద్ధి యను ప్రకరణగ్రంథమును రచించిరి. ఇందులో మొదటిది చాలఁ బెద్దగ్రంథము. దానిలోఁ బీఠికాభాగమునకు సంబంధవార్తిక మని పేరు. ఈమూఁడు గ్రంథముల నధ్యాయాంత గద్యభాగముల శంకరభగవత్పాదశిష్యులగు సురేశ్వరులచే విరచితమగు నాయాగ్రంథమున నని యున్నది. ఈ సురేశ్వరులు పూర్వాశ్రమమున నేనామముతోఁ బ్రసిద్ధివడసిరి? ఈ సందేహము నెల్లరకుఁ జాటించుటయే యీ వ్యాసోద్దేశము. మేమును మామిత్రులు నీవిషయమై యాంగ్లేయభాషాపత్రికలలోఁ గొంత చర్చించినారము. తద్భాషాపరిచయము లేనిశిష్టులకై నూతన లబ్ధాధారహేతువులఁ గూర్చుచు నాంధ్రభాషలో దీని విశదీకరించుట చర్వితచర్వణదోష మంతగాఁ గానేరదు.

సురేశ్వరులు మండనమిశ్రు లనియు, విశ్వరూపాచార్యుఁ డనియు, ఉంబేకుఁ డనియు, భవభూతియనియు వివిధ ప్రవాదములు గలవు. వీరెల్లరు గ్రంథకర్తలు. వీరి నిబంధనము లిప్పుడు లభించుచున్నవి. మండనమిశ్రులు విధివివేకము, భావనావివేకము, విభ్రమవివేకము, స్ఫోటసిద్ధి, బ్రహ్మసిద్ధి యను నైదుగ్రంథములు రచించిరి. వానిలో దేనిఁజూచినను గ్రంథాధ్యాయాంతముల "ఇత్యార్యమండనస్య కృతిషు" అని కాని, "ఇత్యాచార్యమండనస్య కృతిషు" అనికాని కానఁబడుచున్నది. విశ్వరూపాచార్యులపేర యాజ్ఞవల్క్యస్మృతివ్యాఖ్యాన మగపడుచున్నది. దానిలోఁ బ్రకరణాంతమున గద్యమున, "విశ్వరూపకృతవివరణ బాలక్రీడాయాం" అని యున్నది. ఉంబేకుఁ డనునతఁడు కుమారిలభట్టవిరచితమగు శ్లోకవార్తిక మను గ్రంథమునకు సుమారు రెండువేల శ్లోకములకు మాత్రమే తాత్పర్యటీక యనువాఖ్యానము రచించినట్లు తద్గ్రంథలబ్ధిచేఁ దెలియుచున్నది. మఱియు మండనమిశ్రకృతమగు భావనావివేకమునకు వ్యాఖ్యాన మొకటి యుంబేకకర్తృత్వముతోఁ బ్రచురింపఁబడి యున్నది. మొదటిదానిలో "ఇతిభట్టోంబేకవిరచితాయాం తాత్పర్యటీకాయాం"

అనుగద్యము కూర్పఁబడియె. భవభూతి యనుకవి మాలతీమాధవము, ఉత్తర రామచరితము, మహావీరచరితము అను మూఁడునాటకములు రచించె నవి సుప్రసిద్ధములేకదా! భవభూతికి శ్రీకంఠపదలాంఛనుఁ డనుబిరుదము గలదు. శ్రీకంఠుఁ డనునొక యాచార్యుఁడు బ్రహ్మసూత్రములకు భాష్యము రచించెను. పైఁబేర్కొన్న నామములన్నియు సురేశ్వరునివా యని సందేహము. వేర్వేఱు పేర్ల వేర్వేఱు గ్రంథము లుండ నవియెల్ల భిన్ననామములతో నొక్కఁడే రచించెనా యని విస్మయము కలుగక తప్పదు.

ఇఁక వీరియైక్యమును బ్రతిపాదించు పంక్తులు విచారింతము.

ఉంబేకుఁడు భవభూతి యనుటకు— (౧) మాలతీమాధవాదర్శపుస్తకములో "ఇతి భట్టకుమారిలశిష్య పదవాక్యప్రమాణ పారీణ భట్టోంబేకవిరచితే మాలతీమాధవే" యని గద్యము కనఁబడినట్లు శంకరపండితులుగారు గౌడవధ గ్రంథపీఠికలో వ్రాయుచున్నారు. దీనివలన భవభూతి కుంబేకనామము కల దనియు, నతఁడు కుమారిలశిష్యుఁడనియుఁ దేలినది. (౨) చిత్సుకాచార్య విరచితమగు తత్త్వప్రదీపిక యను గ్రంథమున నాప్తవాక్యప్రమాణము నిర్దేశించుచుఁ దద్గ్రంథకర్త మాలతీమాధవకర్తయగు నుంబేకు నాప్తుఁగా గ్రహింపఁ దగునా యని పూర్వపక్షము సేయుచున్నాఁడు. మఱియు నవినాభావనిర్వచనము చర్చించునప్పుడు "సంబంధోవ్యాప్తిరిష్టాత్రలింగధర్మస్య లింగినా'' యను కుమారిలశ్లోకమున కుంబేకుఁ డిట్లు చెప్పెనని చిత్సుకాచార్యులు వ్రాయఁగాఁ దచ్ఛిష్యుఁడగు ప్రత్యగ్రూపాచార్యుఁడు దానికి వ్యాఖ్యవ్రాయుచు, "ఉంబేకో భవభూతిః" అని వివరించెను. (౩) భట్టోంబేక కర్తృత్వముతో నుండెడు శ్లోకవార్తికవ్యాఖ్యానమున మొదటి శ్లోక మిట్లున్నది:

యే నామ కేచిదిహ నఃప్రథయంత్యవజ్ఞాం
జానంతు తే కిమపి తాన్ప్రతి నైషయత్నః;
ఉత్పత్స్యతే మమతుకోఽపి సమానధర్మా
కాలోహ్యయం నిరవధిర్విపులాచ పృథ్వీ.

ఈ శ్లోకమే మాలతీమాధమున నటీసూత్రసంభాషణమున "తస్యకవేరియం వాచోయుక్తిః—యే నామ.........పృథ్వీ" యని కానవచ్చుచున్నది. ఇందుచే భవభూతి కుంబేకనామము సిద్ధమగుచున్నది.

ఇతఁడు కుమారిల శిష్యుఁడా ?— (౧) భట్టోంబేకుఁడు శ్లోకవార్తిక వ్యాఖ్యానమున శ్యేనచయన ప్రశంసలో భట్టకుమారిలుఁడు మీమాంసాభాష్య కారుఁడగు శబరస్వామి మతమునకు విరుద్ధముగాఁ బ్రవచింపఁగా దాని ఖండించుచు నీ క్రిందిశ్లోకమును గురువచనఖండన సమర్థకముగా సూచించెను. "గురోరప్యవలిప్తస్య కార్యాకార్యమజానతః, ఉత్పథప్రతిపన్నస్య న్యాయం భవతిశాసనమ్" అని. ఇది వ్యాసభారతములోనిది. దీనిచేఁదాగురుపంక్తి ఖండింపదగు ననిసమర్థించె. (౨) శ్లోకవార్తికమున కుంబేకుఁడు ౨౩౦౦ శ్లోకములవరకు వ్యాఖ్య రచించి విడిచిపెట్టఁగా భట్టకుమారిల పుత్రుడగు జయమిశ్రుఁడు దానిఁ బూరించెను. దీనిచే నుంబేకుఁడు కుమారిల జయమిశ్రుల నడుమకాలమున నున్నందున నతని శిష్యత్వ ముండిన నుండ వచ్చును.

సురేశ్వరులు విశ్వరూపాచార్యు లనుటకు హేతువులు:—(౧) సురేశ్వర కృతమని ప్రసిద్ధిచెందిన నైష్కర్మ్యసిద్ధికి మళయాళ దేశాదర్శములలో, "ఇతి గోవింద భగవత్పూజ్యపాదశిష్య విశ్వరూపాచార్య కృతాయాంనైష్కర్మ్యసిద్ధౌ" అని యున్నది. (౨) విద్యారణ్యులవారు వివరణప్రమేయ సంగ్రహమున—

"అధ్యాస్యాహమితి మమేతి చాకారద్వయం స్నేహతారతమ్యా దుప పద్యతే, తత్తారతమ్యంచ తదేతత్ ప్రేయః పుత్రాత్, ఇత్యస్యాః శ్రుతే ర్వ్యాఖ్యా నావసరే విశ్వరూపాచార్యైర్దర్శితం—

'విత్తాత్పుత్రః ప్రియః పుత్రాత్ పిండః పిండాత్తథేంద్రియమ్, ఇంద్రి యేభ్యః ప్రియఃప్రాణః ప్రాణాదాత్మా పరః ప్రియః' ఇతి."

అని విశ్వరూపాచార్యశ్లోక మని యుదాహరించిరి. ఇది సురేశ్వరుల బృహదారణ్యకవార్తికమున మొదటియధ్యాయమున నాల్గవ బ్రాహ్మణమున నున్నది. దీనిచే విద్యారణ్యులు సురేశ్వరవిశ్వరూపుల యేకత్వ మంగీకరించిరి. (౩) మళయాళదేశమున వ్యవహారముననున్న యాచార్యవిజయ మను శంకర విజయమునఁ దద్గ్రంథకర్త గోవిందుఁడు విశ్వరూపాచార్యుఁడు శంకరులతో వాదించి పరాభవముసెంది సన్న్యాసాశ్రమము స్వీకరించి సురేశ్వరనామమున శంకరుల రెండుభాష్యములకు వార్తికములు రచించెనని చెప్పుచున్నాఁడు.

భవభూతి సురేశ్వరుల యేకత్వము—యాజ్ఞవల్క్యస్మృతికి బాలక్రీడ యనువ్యాఖ్య విశ్వరూపాచార్యులు రచించిరికదా. దానికిని మూఁడువ్యాఖ్యలు గలవు. అందుఁ గర్తృనామరహిత మగునొకదానిలో మొదట—

"యత్ప్రసాదాదయం లోకో ధర్మమార్గస్థితః సుఖీ, భవభూతిసురేశాఖ్యం విశ్వరూపం ప్రణమ్య తమ్."

అని మూలకర్తృనమస్కార మగపడుచున్నది. దీనిచే భవభూతియు, సురేశ్వరుఁడును, విశ్వరూపుఁడు నొక్కఁడ యని తద్వ్యాఖ్యాత యభిప్రాయము.

పైపంక్తులవలన భవభూతి కుంబేకుఁడని నామము. అతఁడు గోవింద భగవత్పాదుల శిష్యుఁడు; విశ్వరూపసురేశ్వరనామములఁ బ్రసిద్ధిచెందెను. ఇందు నేను సూచించునది యేమన, "భవభూతి" యనుశబ్దరచనచే నితనికాపేరు కావ్యములలోఁ బ్రఖ్యాతమైనట్లు భోజచరితములో నున్నది. ఉంబేకుఁడనుటయె యతనియింటివారివ్యవహారనామము ఇతఁడు శంకరులతో వాదించి యోడి వారిగురువు లగు గోవిందపాదులవలన నాశ్రమాంతరము స్వీకరించి విశ్వరూపాభిధానము చెందెను. సురేశ్వరనామము యతులలోని బిరుదనామముగా గ్రహింపఁదగు.

ఇఁక మండనమిశ్రసురేశ్వరులయైక్యవిషయము విచారింతము. విద్యారణ్యులవారి శంకరవిజయమున శంకరులు కుమారిలభట్టదర్శనము చేసి యతఁడు జీవ ప్రాయశ్చిత్తవిధిలో నుండఁ దా రచించినసూత్రభాష్యము చూపి దానికివృత్తి గూర్పుమని కోరఁగా నాస్థితిలో నతఁడు వ్యాఖ్య వ్రాయనేరక యతనిమిత్రుఁడగు మండనమిశ్రునియొద్దకుఁ బొమ్మని చెప్పఁగా నాచార్యు లాకాశయానమున మాహిష్మతీపురమునకుఁ జనియె ననియు నచ్చట మండనునితో వాదించి యోడించి యతనికిఁ బరమహంసాశ్రమ మిచ్చి సురేశ్వరనామముతో నతనిశాఖ యగు తైత్తిరీయమునకును, బృహదారణ్యమునకును దా రచించిన భాష్యములకు వార్తికముల రచింప ననుజ్ఞ యిచ్చినట్లున్నది. దానిలో మండనమిశ్రులఁ గుమారిలుఁడు సూచించుఘట్టమున—

ఉంబేక ఇత్యభిహితస్య హి తస్య లోకై
రుంబేతి బాంధవజనై రభిధీయమానా;

దుర్వాససాజని వధూర్ద్వయభారతీతి.

(౭—౧౧౬)

అని అతనిభార్య యగు ద్వయభారతికి ''ఉంబ'' యనియు నతని కుంబేకుఁ డనియు పేళ్ళున్నట్లు శంకరవిజయకారుఁడు చెప్పుచున్నాఁడు మఱియు నతఁ డందే—

సర్వాసు శాస్త్రసరణీషు సవిశ్వరూపో
మత్తోఽధికః ప్రియతమశ్చమదాశ్రమేషు;
తత్ప్రియసీం శమధనేంద్రవిధాయసాక్ష్యే
వాదే విజిత్య త మిమం వశగం విధేహి. 7-112.

అని చెప్పిట్లున్నది.

మఱియు—

ఇత్థం న ఉక్తో భగవత్పదేన
శ్రీ విశ్వరూపో విదుషాం వరిష్ఠ;
చకార భాష్యద్వయవార్తికే ద్వే
హ్యాజ్ఞా గురూణాం హ్యవిచారణీయా. (13-63)

అనుటచే విశ్వరూపోంబేకనాముఁడగు మండనమిశ్రుఁడు శంకరులతో వాదించి యోడి తురీయాశ్రమము గ్రహించి సురేశ్వరుఁడయ్యెనని శంకరవిజయ కారుని తాత్పర్యము. అతఁడైతిహ్యము విన్నయట్లురచించెనని తోఁచుచున్నది. మండనమిశ్రుఁడే సురేశ్వరుఁడనుటకు వేఱ యాధారములు లేవు.

ఉంబేక మండనమిశ్రు లొక్కరే యనివాదించుటలో మొదటిబాధకము మండనమిశ్రుని భావనావివేక మను గ్రంథమునకు భట్టోంబేకవిరచిత మగు వ్యాఖ్యాన మగపడుటయే. దోషమేమి, మూలకారుఁడే స్వోపజ్ఞవ్యాఖ్యగూర్చె నందురేమో! మూలమే కారికా వృత్తిరూపమున నున్నది. ఆరెంటికిని వ్యాఖ్య వివరణము. ఎట్లైనను రెండునామధేయములఁ గర్తృత్వమేల శాసింపవలయు?

శైలియు భేదిల్లుచున్నది. ఉంబేకమండనుల యైక్యమును సూచించిన గ్రంథములు విద్యారణ్య శంకరవిజయమును, చిద్విలాసకృతమగు శంకరవిలాసమును మాత్రమే. వీనిలో రెండవది మొదటిదానికిఁ బ్రతిలేఖ. అట్లైననచో శంకర విజయ ప్రామాణ్యము చర్చింపఁదగు.

శంకరవిజయము విద్యారణ్యకృతమని దానిలో నున్నది. గ్రంథకర్త తాను వ్యాసాద్రి కవికృత మగు శంకరవిజయము ననుసరించెనని చెప్పుచున్నాఁడు. అయ్యది దానికి మూలమైనచో నది లభించునా? అది తంజాపుర పుస్తకభండారమునను, గేరళమునఁ దిరుచూరు మఠమునను నున్నది. దానిలో మండనమిశ్రుల ప్రశంసయేలేదు. గోవిందకృతమగు నాచార్యవిజయమున విశ్వరూపాచార్యులు సురేశ్వరులైనట్లున్నది కాని మండన మిశ్రుల ప్రశంసలేదు.

పైయంశములను బట్టిచూడ శంకరులు విశ్వరూపుల నోడించి సురేశ్వరులఁగాఁ జేసి వార్తికముల వ్రాయించెననియు, సురేశ్వరుఁడు చతుర్థాశ్రమమును గోవిందభగవత్పాదులయొద్ద స్వీకరించెననియు, విశ్వరూపనామ మొకవేళ పరమ నామమై యుండుననియుఁ, బూర్వాశ్రమమున నతనిపుట్టుక పేరుంబేకుఁడనియుఁ, బద్యమొకటి రచించుటచే భవభూతి యనియు వెలసెననియుఁ దేలుచున్నది.

భట్టకుమారిలుఁడు చతుర్థాశ్రమమును స్వీకరించినట్లు శంకరవిజయాములఁ గానరాదు. కాని నైష్కర్మ్యసిద్ధి వ్యాఖ్యానమున "తాన్ప్రత్యవ్యక్త మేవేతి ముక్త్వాన్యత్సిద్ధాంతందర్శయతి పరమహం సాశ్రమానుష్ఠానపూర్వమమలాగ్రంథే భట్టాచార్యాః పునః ప్రయాతి వేదాంతనిషేవణేన ఇత్యాదినా" యని చెప్పఁబడుటచేఁ గుమారిలుఁడు కడపట సన్న్యాసాశ్రమము ధరించినట్లుతోఁచుచున్నది. ఈ శ్లోకపాదము శ్లోకవార్తికమున నాస్తికవాదనిరాకరణఘట్టమున నున్నది." ఆత్మాస్తితాంభాష్యకృదత్రయుక్త్యా దృఢత్వ మేత ద్విషయశ్చబోధః; ప్రయాతి వేదాంత నిషేవణేన'' అని.

మండనమిశ్రులే సురేశ్వరులన శంకరవిజయకారునకుఁగల కారణము లేవన: మండనమిశ్రుల బ్రహ్మసిద్ధిలోని ద్వితీయ తృతీయ కాండములలోని యంశములే సురేశ్వరుని సంబంధవార్తికములో నున్నవి. అవి బౌద్ధప్రభాకర మతఖండనయుక్తులు. వారిరువురునొక్కరే యని యంగీకరింపకున్న సురేశ్వరులు మండనమిశ్రుల బ్రహ్మసిద్ధిలో నుండి గ్రంథచౌర్యము చేసినట్లేర్పడును. ఈ కారణమున శంకరవిజయకారుఁడువారిరువురునొక్కఁడేయని శాసించెను.

శాస్త్రగ్రంథములలోఁబూర్వపక్షానువాదముననేకాక పరగ్రంథపంక్తులు పూజ్యార్థ మునఁగూడ ననువాదము సేయుదురు. బ్రహ్మసిద్ధిపైఁ బ్రభాకర శిష్యుఁడగు శాలిక నాథుఁడు ''అద్వైతాభిమానీ తుభవా నాత్యంతికమేవ నిషేధ మభిలష్యతి సోఽ యమాత్మీయ ఏవ బాణోభవంతం ప్రహరతి—

"లబ్ధరూపేక్వచిత్కించిత్తాదృగేవ నిషిద్ధ్యతే;
విధాన మంతరేణాతోన నిషేధస్యసంభవః.''

అని బ్రహ్మసిద్ధిలోని శ్లోకము నుదాహరించి దూషించుచున్నాఁడు. మఱియు''తత్రాన్యః పండితమ్మన్యోమన్యతే''యని బ్రహ్మసిద్ధికారుని జాతినిర్ణయ ముననిరాకరించుచున్నాఁడు. ఈఖండనములకుసురేశ్వరుఁడు ప్రతిసమాధానములఁ జేర్చి బ్రహ్మసిద్ధికారుని యుక్తులతో నీసమాధానములఁగూర్చి ప్రభాకర భర్తృ ప్రపంచ మతఖండనమును సంపూర్ణము చేసెను. ఇట్టి యనువాదమునే గ్రంథ చౌర్యముగా లోకము గ్రహించునేమో యని మండనమిశ్ర సురేశ్వరైక్యమును బ్రతిపాదించిన శంకరవిజయకారుఁడు విశ్వరూపుఁడే మండనమిశ్ర సురేశ్వరు లని కథ కల్పించియుండును.

మండనమిశ్ర సురేశ్వరులమతము లభిన్నములుగా సంక్షేపశారీరక గ్రంథకారుఁ డగుసర్వజ్ఞాత్ముఁడు చెప్పుచున్నాఁడు. మఱియుమండనుఁడు భర్తృ హరి ప్రతిపాదిత మగుశబ్దబ్రహ్మస్ఫోటవాదము ననుసరించి బ్రహ్మసిద్ధియు, స్ఫోటసిద్ధియు రచించె. సురేశ్వరుఁడు స్ఫోటమును నిరాకరించె. మండనుఁడు జ్ఞానకర్మసముచ్చయవాది. సురేశ్వరుఁడు కర్మ నిరసించి జ్ఞానమే ప్రతిపాదించె. మఱియు మండనమతమునే చాలవఱకు వాచస్పతిమిశ్రుఁడుగ్రహించి శంకర భాష్యమునకుఁ బ్రస్థాన భేదమును భామతీగ్రంథమున సూచించెను. సురేశ్వర మతము నిష్టసిద్ధికారాదులు, నానందగిరియు ననుసరించి వార్తికకారమతమని శంకరభాష్యమునకుఁ బ్రస్థానాంతరము కల్పించిరి. పంచపాదికావివరణకారులు తద్భాష్యమునకు మూఁడవప్రస్థానమును నిశ్చయించిరి. వివరణ, వార్తికకార, భామతీమతములు మూఁడునుగలిసి ప్రస్థానత్రయమని మాయభిప్రాయము. కొందఱు భామతి, కల్పతరు, వివరణములు గలసి యీనామము చెందెనని చెప్పు దురు. ఈమూఁడు గ్రంథములు నేక మత (మండనమత) ప్రభవిష్ణువులే కావున వానికి వేఱ్వేఱఁబ్రస్థానశబ్దము చెల్లఁజాలదు.

భారతి—ప్రభవ - కార్తికమాసము — మా. రామకృష్ణకవి

# 6. కొన్ని యాంధ్రగ్రంథములు

## విష్ణువర్ధనమంత్రి

ఆంధ్రభాషలోఁ గావ్యములకుఁ గాని శాస్త్రగ్రంథములకుఁ గాని సంస్కృత ద్రవిడభాషలలోవలె వ్యాఖ్యానములు విస్తరముగాఁ గానరావు. వసుచరిత్ర రాఘవపాండవీయాదులు వ్యాఖ్యానసాపేక్షము లగుటచే వానికి వ్యాఖ్య లేర్పడినవి కాని సాధారణముగా భాషాగ్రంథములు సుగమము లగుటచే నున్నట్లే యథారుచిగా లోకమునఁ బ్రవర్తిల్లుచుండును. సంస్కృతగ్రంథములకు నాంధ్రభాషలో సాధారణముగాఁ బూర్వకాలమున వ్యాఖ్యలు గానరావు. ఆంధ్ర శబ్దచింతామణికి బాలసరస్వతి పాతక్రమరీతిగా లఘువ్యాఖ్య విరచించెను. బృహజ్జాతకమను వరాహమిహిరప్రోక్తమగు జ్యోతిషగ్రంథమున కాంధ్రభాషా భాష్య మొకటి దృగ్గోచర మగుచున్నది. దానిలో గద్యము "కౌశికాన్వయులైన ద్రవిడమండలచక్రవర్తి ప్రధానులైన శ్రీ విష్ణువర్ధనదండనాయకులు చెప్పి (న) సరితెనుంగుభాష్యం (ము) లో......సంపూర్ణము." అనియున్నందున విష్ణువర్ధన సేనాపతి దాని రచించె ననియు, "సరితెనుంగుభాష్య" మనుటచే నది సంస్కృత భాష్యము ననుసరించె ననియుఁ దోఁచుచున్నది. సంస్కృతమున బృహజ్జాతకమునకు వాసనాభాష్య మను ప్రసిద్ధవ్యాఖ్య గలదు. కాని దానికిది తెనుఁగు గాదని రెంటిని బోల్చిచూడఁగా దేలుచున్నది. వ్యాఖ్యాత ద్రవిళమండలచక్రవర్తి ప్రధాను లనుటచే నతఁడు కులోత్తుంగచోళుని సేనాపతి యగునేమో యని సందియము కలుగుచున్నది. కౌశికాన్వయు లనుటచే బ్రాహ్మణుఁ డై యుండును. తమ్మేలిన రాజులపేరులు మంత్రి పురోహిత సేనాపతి కవి గాయకాదులు తమ బిడ్డలకుఁ బెట్టుటచే, విష్ణువర్ధనుఁడను పేరు గమనించి చూడఁగా, దూర్పు చాళుక్యులు రాజమహేంద్రవరమున నింకను బలిష్ఠులై యుండఁగా విష్ణువర్ధనునికీర్తి స్మరింపఁదగుకాలములో నీవ్యాఖ్యాత కాపేరు తల్లిదండ్రులు పెట్టియుండవచ్చును. విష్ణువర్ధననామము చాళుక్యులకుఁ గులనామమువలె నొక్కొక్కనికిఁ జెల్లుచుండెను. ఈ వ్యాఖ్యాత కాలనిర్ణయము సేయుటకు వేఱె యాధారములులేనందున నితఁడు క్రీ. శ. ౧౧౦౦ కాలమువాఁడు కాబోలునని తలఁచుచున్నాను.

బృహజ్జాతకము ప్రాచీనములగు ప్రామాణికగ్రంథములలో నొకటి. ఇది వ్యాఖ్యానసాపేక్ష మనుటకు సందేహము లేదు. దీనిలో యవన మణిత్థ శకాది హోరాశాస్త్రజ్ఞుల మతము లనువదింపఁబడియుండుటచేతను, గ్రంథము లిప్పుడు నష్టప్రాయములగుటచేతను, గణితప్రక్రియ దీనిలో నెక్కువయయి కేవల సంప్రదాయప్రమాణపరిష్కృతములగు నంశములు పెక్కులుండుటచేతను వ్యాఖ్య లేకున్న నిది దురధిగమ మనుట నిక్కము. విష్ణువర్ధనుఁడు తన వ్యాఖ్యను భాష్యమని చెప్పుటచే దానికి గౌరవ మెక్కువ యగుచున్నది. ఇది కొన్ని యంశముల భట్టోత్పలుని వ్యాఖ్యకంటెను మిన్నగా నున్నది. క్రీ. శ. ౧౧౦౦ కాలమున దేశమున నెల్లెడల సకలవిద్యలకుఁ బరిశ్రమపరిశీలనములు మెండయ్యె. అంత కింపుకపూర్వమేగదా భోజాదులు సర్వశాస్త్రములందును విద్వన్మణుల కాదరముచూపిరి. పావులూరి మల్లనయు నీకాలమువాఁడే. విష్ణువర్ధనుఁడు తన భాష్యమున గణితశాస్త్రవైదుష్యము, హోరాశాస్త్రసంప్రదాయము కూలంకషముగాఁ జూపుటయకాక భాషారచనఁ బరిశుద్ధముగాఁ గూర్చెను భాష్యభాష నన్నయభట్టు పచనభాగముల ప్రౌఢిమను దలఁపించుచున్నది. పెక్కులు నూతనపదము లందంద కానవచ్చుటయ కాక కావ్యరచనయఁ గొన్ని చోట్ల మన కదృష్టప్రాయముగా నున్నది. శాస్త్రరహస్యవేదు లీగ్రంథమును దప్పక యాదరింపఁదగినంత యతిశయ మీభాష్యమునఁ గలదు. విషయమును మఱుగుపఱుపక, కఠినస్థలముల సుగమములని జాఱిపోక, పూర్వోత్తరసంగతి ప్రదర్శనమునఁ గ్లేశపడక, గహనమైన విషయము సైతము లఘుతరముగా విమర్శించి వివరించుచు నీగ్రంథకర్త సంప్రదాయజ్ఞుల కీశాస్త్రమును మధురముగాఁ జేయుచున్నాఁడు. దీని రచనాప్రణాళిక తెలియుటకై యొక స్థలము నుదాహరించుచున్నాను.

> "ఉదయరవిశశాంకే ప్రాణికేంద్రాధిసంస్థా
> ప్రథమ...మధ్యేఽంత్యే చ దద్యుః ఫలాని;
> న హి ఫలవిపాకః కేంద్రసంస్థా వ్యభావే
> భవతి హి బల...పూర్వ........."

"...(ఉదయ) రవిశశాంకులలో మువ్వురిలో బలాబలవిభాగములయెట నొక్క రూపాధికుండదియబలవంతుండని యెరుంగునది...దశ మొదలుగా నట్టి మొదలి దశాధిపతియున్న రాసి మొదలుగా...కేంద్రముల నున్న గ్రహములబలములలో

విభాగములం జేసి యెయ్యే (య్యే) దేని నొక్కండు యతిబలుం డగునదియ రెండగు దశాధిపతియగునని యెరింగి మరియు దానికంటె మధ్యమదశాధి బలుండు మూండగుదశాధిపతి యగునని యెరింగి యీరూపుల కేంద్రములనున్న గ్రహముల దశాక్రమ మెరుంగున్నది। ఇది కేంద్రముల ప్ర థ మ ద శా ధి క మెరుంగురూపు। రెండగు దిన (?) పణపరముల నున్న గ్రహముల దశముల కేంద్రములనున్న గ్రహముల కడపట బలాబలవిచారములం జేసి బలాధికుండు ముందరా దే [ర ద ?] శాధిపతు లగునని యెరుంగున్నది। మూండగు వికల్పము పణపరముల నున్న గ్రహముల కడపట నాపోక్లీబంబుల నున్న గ్రహములని రూపునంజేసి దశలు బలాధికుండు ముందరగా దశాధిపతు లగుదురు। ఇది ప్రథమదశాధిపతి కేంద్రపణవరాపోక్లీబంబుల గ్రహములు గలయ నుండిరేని దశాఫల। మెఱుంగురూపు । ప్రథమదశాధిపతి కేంద్రముల గ్రహములులేకుండి పణవరఆపోక్లీబంబులందు గ్రహములు గలయ నుండిరేని పణపరమున గ్రహబల విచారములంజేసి అధికబలుండు రెండగు ధశాధిపతి యగు। మరియు నందున్న గ్రహముల బలాబలవిచారములంజేసి తొల్లిటిక్రమమున ఆదశ లెరుంగునది। ఇది ప్రథమ యేక్పణము [?] పణపరముల కడపట ఆపోక్లీబంబుల నున్న గ్రహముల బలాబలవిచారములంజేసి దశబలాధికుండు ముందర దశాధిపతి యగు। ఇది రెండగు దశాధికల్పము। పణపరఆపోక్లీబంబులందు గలయ నుండిరేని యెరుంగురూపు। మరియు ప్రథమదశాధిపతి కేంద్రపణపరముల గ్రహములు లేకున్న ఆపోక్లీబంబులనెల్లా గ్రహములున్నన అధికబలుండు దశాధిపతియెరుంగు రూపు। ఇది...నికంటె మధ్యమబలుండు మూఁడగు దశాధిపతి। మరి తక్కిన గ్రహములలో నధికబలుండగు దశాధిపతి తట ... ... డగు తక్కిన రెండు గ్రహంబులలోన నధికబలుండు యేడగు దశాఫలములెల్లాం గలయ నున్న ప్రథమదశాధిపతికి కేంద్రములందు గ్రహములలో నధికబలుండు రెండగు దశాధి పతియగు। తక్కినగ్రహములలోన నధికబలుండు మూఁడగు దశాధిపతియగు। యీరూపున యెల్లగ్రహముల నెరింగి కేంద్రముల నున్న గ్రహముల దశమల దశల కడపట పణపరములనున్న గ్రహములలో నధికబలుండు ముందర యధిక దశాధిపతి పణపరములలోనున్న గ్రహములలో నధికబలుండు ముందర యధిక దశాధిపతి యగు। మరియు త్రివిధమ [?] దశాధిపతికీ పణపరముల గ్రహములు లేక కేంద్రయాపోక్లీబముల [?] నెల్ల గ్రహము లున్న కేంద్రములలో నధిక

దశాధిపతి యగు తక్కినగ్రహములను నీరూపులని యెరింగి కేంద్రములనున్న గ్రహముల కడపట ఆపోక్లిబముల గ్రహముల బలవిచారములం జేసి యీరూపు దశాధిపతు లగుదురు। మరియు ప్రథమదశాధిపతి పణపరాపోక్లిబముల ప్రాణములు లేక కేంద్రమున నెల్లగ్రహము లున్న అధికబలుండు రెండగు దశాధిపతి యని యెరింగి యీరూపున నధికబలుండు ఘుందరగ దశాధిపతి యని యెరుంగున్నది [నది?]।. మరియు ప్రథమదశాధిపతి కేంద్రాపోక్లిబములయందు గ్రహములు లేక పణపరముల నెల్ల గ్రహములున్న నం దధికబలుండు రెండగు దశాధిపతి యని యెరింగి యీరూపున నధికబలుండు ముందరగా దశాధిపతి యని యెరుంగునది। మరియుం బ్రథమదశాధిపతి కేంద్రాపోక్లిబములయందు గ్రహములు లేక పణపరములనెల్ల గ్రహములున్న నధికబలుండు రెండగు దశాధిపతియగు నీరూపున నధికబలుండగు। ముందరగా దశాధిపతియగు నని యెరుంగున్నది। యిట్లు బహుప్రకారంబులంజేసి దశలుగ నెరుంగుకొనునది। ఇది సామాన్యబలమునంజేసి దశ గడపెడి రూపు। మరియు దీనన విశేషించి ఆయుపు నిచ్చుబలము గల గ్రహము దశ ముందరగ నని చెప్పి వెండియు ముందరి.... యీరూపు చెప్పెద॥"

మరియొక ఘట్టము...

"యస్మిన్ యోగే పూర్వమాయుః ప్రదిష్టం
తస్మిన్ ప్రోక్తం చక్రవర్తిత్వ మన్యైః;
ప్రత్యుక్తోఽయం తేషు దోషావరోఽపి [?]
జీవత్యాయుం పూర్ణమంత్రైర్విృనాపి."

భాష్యము: విష్ణుగుప్తసిద్ధసేనులు దారు "దోషశ్చేషం [?] జాయతే ప్లౌతు రిష్టం, హిత్వా నాయుర్వింశతి స్యా దవస్తాత్ [?]" అని షష్ఠమ [అష్టమ?] దోషము వాసిన ౨౦ యేండ్లులోసం గాని వేలు లేదు. ఆయు వని చెప్పెడిది ప్రమాణం గాదేని వీటం జేసి యెరుంగంబడియున్న 'అనిమిషపరిమాంశకే విలగ్నే [?]' యను అయినం జేసి పుట్టిన ప్రాణికి పూర్ణాయువేమని చెప్పిరి। ఆయోగము గాదె చక్రపర్తిత్వముం జెప్పెడిది॥"

ఈ రీతిగా గ్రంథమునఁ బదియపయధ్యాయముమాత్రమే లభించుచున్నది. లేఖకదోషములుగా నుండు ప్రయోగములు తొలఁగించి తక్కినభాగము సామాన్య

దృష్టితోఁ జూచినయెడ గ్రంథమంతయు నాకాలపు సలక్షణభాషలో రచింపఁబడి యున్నట్లు తోఁచుచున్నది.

## చారులీలావిలాసము

మన యాంధ్రభాషలోఁ గేవలము చర్వితచర్వణప్రాయవర్ణనాపూర్ణములగు ప్రబంధములుతక్క హృదయవర్ధకముగాఁ జదువఁదగిన కావ్యములు లేవని కొందరు విమర్శకు లాడుచుందురు. ఎంత వారు దూషించినను సామాన్యపాఠక విమర్శకులు ప్రబంధములనే చదివి యానందింతురు. భాషలో విస్తరముగాఁ గాకున్నను మితముగానైన నూతనపథక్కిఁ ద్రొక్కిన ప్రబంధములు, కథలు, శాస్త్రగ్రంథములును గలవు. అవి సర్వజనహస్తగతములు గాకపోవుటయో, లేక ముద్రితములయ్యు నధికారుల పక్షపాతముచే మూలఁ ద్రొక్కబడుటయో యను నవస్థావిశేషములఁ బొంది యప్రసిద్ధము లగుచుండును. ప్రబంధము లలోఁ గథాసంవిధానము, వర్ణనాంశములు సాధారణము లనుట యంత యసత్యము కాదు. పెక్కండ్రు కవులు నూతనప్రణాళికగాఁ గథలు కల్పించి యథోచితవర్ణనలతో రసపరిపోషణము సేయుచున్నను వారి వాగ్ధోరణి సరస్వతీ పదపాంసుపరిపూరితము గాకపోవుటచే మనోహ్లాదకము కాక కాలక్రమమున వారికృతులు మాసిపోవుచున్నవి. కథావైచిత్రి గల ప్రబంధములలో విమర్శకుల స్మృతిపథమును బాయని దొక్క కళాపూర్ణోదయమే. షోడశకుమారచరితము, మదనమోహినీవిలాసము మొదలగు నూతనకథాకృతు లడుగంటిపోయె. చారు లీలావిలాస మను నొకకృతియు నదృష్టపూర్వములగు నిట్టి ప్రబంధములలో నొకటి.

దీనిలోని గద్యము –

"ఇది శ్రీ మదుమారమణచరణారవింద సేవా సమాసాదిత కవితాపవిత్ర కౌశికగోత్రపవిత్ర మారుపెద్ది తిరుమలరాయ పౌత్ర వేంకటరాయపుత్ర చెంగల్వ రాయ నామధేయప్రణీతం బైన చారులీలావిలాసం బను ప్రత్యగ్ర ప్రబంధంబు నందు"

అని వెలయుచున్నది. కవి చెంగల్వరాయఁడు. కథారంభమువరకుఁ బత్రములు నష్టమైనందున నతని కులగోత్రములు తెలియరావు. మూఁడవ యాశ్వాసము నడుమ తెగియున్నది. కథాభాగము విస్తరముగా నుండవలసి నందునఁ బెక్కాశ్వాసములు నష్టమైన ట్లూహింపవలసి యున్నది.

దీని కృతిపతి వైద్యనాథ భూరమణుఁడు. ద్వితీయాశ్వాసాంతమున—

ఉ. రాజకులావతంస కవి
రాజసరోవరహంస కీర్తివి
భ్రాజితదిగ్విటంక పరి
భావితశాత్రవయూథనాథ నా
నాజగదీశ్వరాదృతగు
ణాకర కాంతిజితప్రభాకరా
వ్యాజసుఖప్రదైకవిభ
వాస్పద వస్తువిచారతత్పరా!

అనియుఁ, దృతీయాశ్వాసప్రారంభమున—

నాథకులసుధానిధాన నారీమదనా
సాధుజనాంబుజినీదిన
నాథా పరవైద్యనాథ నాటకవినోదా.''

అనియుఁ గానవచ్చు ఘట్టములే కృతిపతిచరిత్రబోధకములు. భూరమణశబ్దము కేవల మౌపచారికము కాక ''రాజకులావతంస'' యను విశేషణముచే వైద్య నాథుఁడు రాజే యైయుండవచ్చును. కాళభూపతి యెవ్వఁడో యెఱుఁగరాదు. నెల్లూరి మనుమసిద్ధి వంశ్యులలో ''తిరుకాళభూపతి'' యుంట సుప్రసిద్ధము. ఈ గ్రంథరచనము పరిశీలింప నిది రెండుశతాబ్దుల క్రిందట రచింపఁబడియుండు నని తోఁచుచున్నది. దీనిలోఁ గొన్ని కావ్యదోషము లున్నవి.—

''వసుధాధీశ్వరసారసధ్వజవినే
వా నాదువృత్తాంతమున్''
''శోభావైభవముల్ ప్రవృద్ధమదరం
జూతాము రమ్మంచు గం, ధేభాళిన్''

ఇత్యాది ప్రయోగములు మితముగాఁ గానవచ్చును. ఇట్టివి దక్షిణాంధ్రకృతులఁ బ్రాయశః కనుపట్టుచున్నందున నిదియుఁ దంజాపురప్రాంతమున వసించిన కవిచే రచితమేమో యను సంశయము పొడముచున్నది.

గ్రంథరచనలోఁ గవులు తమ వైదగ్ధ్యమును నానావిధములఁ జూపు దురు. కవులలో శక్తియు, సంస్కారము, మనోధర్మము, శిక్షాపాటవమును

భేదించుచున్నందునఁ గవి ప్రతిభలు భిన్నరుచులఁ జవులు కొలుపుచుఁ బాఠకు లకు రక్తిభేదము నాపాదించుచుండును. ఈ చెంగల్వరాయకవి యాంధ్రభాషలో సర్వసాధారణము కాని శాస్త్రముల సార ముపదేశింప వలయు నని తలంచి కాఁబోలుఁ గథాభాగమున నించుక యసందర్భములుగానే నాట్యసంగీత కామ శాస్త్రముల సారాంశము కూర్చుచున్నాఁడు. గ్రంథమంతయు లభించినచోఁ జిత్రలేఖనాది విద్యావినోదముల విరచించియుండునేమో యెఱుఁగఁ దగి యుండును. పురాణములయందును, దేవతానాయకములగు కావ్యముల వేదాం తాది శాస్త్రసార మెత్తిచెప్పుట తద్రచనకుఁ బరమోద్దేశము. దీనిలోఁ గథాభాగ మతిచిత్రముగా రచింపవలయునని కవి ప్రయత్నించినట్లు కానవచ్చుచున్నది.

శోభావతీపురాధిపుఁ డగు సుదర్శనభూపాలుఁడు సభార్యుఁడై హిమవ త్పర్వతప్రాంతముల విహరించుచు నందలి యాశ్రమముల తపోధనుల దర్శిం చుచు నొకానొకమహర్షి యనుగ్రహముచే సర్వదేవతాహ్వాన సమర్థకమగు నొక జపమాల సంపాదించి స్వపురంబునకు వచ్చి పిదప మృగయావ్యాసక్తుఁడై సమీపారణ్యముల సంచరించుచు నొకనాఁడు తీరని వేఁటతమిచే నుదయాస్త మయముల గుర్తింపక చరమసంధ్యావేళ నొక సరోవరతీరంబున నలసి నిద్రింప నొక రాక్షసుఁడు వీనిఁ బరిభవింప నిద్రితునిఁ గొంపోయి సముద్రమధ్యమున నొక పర్వతసానుప్రదేశమున విడిచి యదృశ్యుఁ డయ్యె. అపుడు సుదర్శనుఁడు నిద్రమేల్కొని తన విషమావస్థకు వగచుచు నగతిశరణ్యమగు జప మాలఁ జేఁ బూని శివునిఁ దలంచుకొనియె. భగవంతుఁ డెదుర నిలువఁగా రాజు మ్రొక్కి చేమోడ్చి స్తుతింప హర్షించి శివుఁడు ప్రసన్నుఁడు కాఁగా రాజు సంతానముఁ గోరెను. మహేశ్వరుఁడు—

తే. అంగనలతోడ మేలము లాడునప్పు
డంచితప్రీతి మమ్ము రప్పించినాఁడ
వగుట శృంగారలీలాసమగ్రవిగ్ర
హం బలరఁ దనయఁ బడయుదు వనియె హరుఁడు.

వ. మఱియును—

క. ఆఁడది చూచినయెడ మగ
వాఁడై కనుపట్టుఁ బురుషవర్యుఁడు ప్రీతిన్

జూడఁగ నాఁదది య్యె కడు
వేడుక లడరించు నదియు విస్మయలీలన్.

అని విచిత్రకన్యకాజనన మను గ్రహించెను. కొన్నాళ్ళకు భగవదను గ్రహానుసారము రాజు భార్య ప్రశాంత యనుదేవి చారులీల యను కన్యకం గనియె. అదియు దినదిన ప్రవర్ధమాన యగుచుండ నొకనాఁడు రాజు నిండోల గంబుండ నొక యోగివర్యుఁ డేతెంచి రాజుచే నర్ఘ్యపాద్యాసనాదిసపర్య లంది వేత్రాసనమునఁ గూర్చుండి తనత్రిలోకజ్ఞానము మెఱయునట్లు రా జెఱుంగఁదగు విషయ మున్నం దెలిపెద ననపుడు సుదర్శనుండు యోగివరునిం జూచి యారూఢయౌవన యగు తనతనూజకుం భర్త యెట సంఘటిల్లు నని ప్రార్థిం పఁగాఁజిత్రరశ్మిభూపాలనందనుఁ డగు సారసధ్వజుఁడ దానికి భర్త కాఁగలఁడని వాక్రుచ్చినఁ దత్సమీపగత యగు నొకపరిచారిక విని చారులీలతో విన్నవింపఁగా నదియు దేశకులరూప ప్రభావము లెఱుంగకయ యతనియం దపూర్వమదన బద్ధయై విహ్వలించుచుండ సఖీప్రాయ మగు కీర మొకటి చారులీలకు నాశ్వాస వచనములుగా దానివిరహవిధురత్వము నెత్తి చెప్పుచు స్వప్రజ్ఞావిశేషమును--

"అఖిలదిగ్దేశరాజాధిరాజాంతఃపు
  రము లెల్లఁ గొలువుకూటములు మాకుఁ
బార్వతీగోమతీభారతీప్రముఖామ
  రాంగనల్ పలుకుఁ దోడంద్రు మాకుఁ
బృథులనందనచైత్రరథముఖ్యవివిధోప
  వనవిహారములు మాకనుభవములు
ఘనసారకదళికాపనసామ్రఖర్జూర
  ఫలభక్షణములు మా ప్రాభవములు
వసుమతీస్థలి వేయుసంవత్సరములు
బ్రదికి యొండొంటికిని సంధిపరప నేర్తు
మంబుదాలక సకలలోకంబులందు
మే మెఱుంగనిచిత్రంబు లేమి కలవు."

అనిచెప్పుకొనఁగాఁజారులీల ప్రహృష్టచిత్తయై యోగీంద్రుని వచనముల దానికింజెప్పి యారాజేంద్రునిఁ జూచి కులరూపవయోవిలాసముల గుర్తించి తన కామితము సఫలని కెఱింగించిరమ్మని యనిపె. చిలుకయు ననేకదేశములఁగడచి

శ్రీనిధి యనుపురంబుఁ జొచ్చి చిత్రరశ్మి యనురా జేలుట విని యతనిసుతుఁ డగుసారసధ్వజుని దర్శించి తనయునికియుఁ దనదేవి నెఱింగించి దానిరూపలావణ్యములు వర్ణించియతని కింపుపుట్టునట్లు చేసి మదనదైవతమున కర్పించి మరలి వచ్చెను. చారులీల విరహవ్యథను వర్ణించుచుఁ జిలుక—

గీ. సకలచిత్తవ్యథల నాఁగఁ జాలినట్టి
కాంచనవిపంచి చేసిన కర్మ మేమి
కేల నంటదు బెబ్బులిలీలఁ జూచు
దళితరిపుజాల సారసధ్వజనృపాల!

శా. ప్రావీణ్యంబునఁ బల్కు నేర్తునని చె
ప్పం గాదుగా చారులీ
లావైదగ్ధ్యము ముగ్ధభావములఁ బో
లం జాల గాంక్షించునే
వేవేగం బయనంబు చేసికొని నా
వెంటన్ దయన్ రమ్మటన్
నీవే కన్నులఁ జూచినన్ దెలియదా
నిక్కంబు రాజోత్తమా!

ఆ. సీమలోఁ గలట్టి భామలవలె గాసి
తాళఁ జాల దట్టితనువు కాదు
అంటిచూడఁ జేతి కంటును లావణ్య
గరిమ యేమనందు ధరణినాథ!

అని మొదలుగా వచించి సొక్కు పుట్టించి చారులీలయొద్దకుం గ్రమ్మఱి వచ్చి తన చేసినకర్జము వివరించి చెప్పినంత రాజకుమారిక మదనోన్మాదంబు రెట్టింపఁ జెలికత్తెలచే శీతలోపచారప్రకారంబుగ నుద్యానవిహార జలక్రీడా మదనపూజాదులఁ గామవ్యథ మఱపింపఁబడియు మనంబునం గుందుచుండ సుదర్శనుఁడు భార్యచేఁ గూఁతుమనోవైషమ్యము నూహించుకొని సారసధ్వజు రప్పింపనుపాయాంతరంబు గానరామి స్వయంవరము చాటించి యశేషరాజలోకమును రప్పించె. జపమాల ప్రభావమున వివాహమంటపము నిర్మించి యందొక కనక వేది ప్రతిష్ఠాపించి స్తంభాంతరమున నవ్వేది నారోహింపఁగలవారే చారులీలాకర

గ్రహణసమర్థు లని చాటించుపత్రమును గట్టి వేలవైచెను. సారసధ్వజుఁడును స్వయంవరమునకు వచ్చెను.ఒకానొకఖేచరుఁడు సమస్తరాజచక్రము నోడించుచు సారసధ్వజునితో యుద్ధము చేసి యోడిపోవుసమయమున సుదర్శనుఁడు సంధి చేసె. సారసధ్వజుఁడు నిఖిలరాజుల యెదర వేది నారోహించి పిదపఁ జారు లీలం బెండ్లియాడె. వివాహవినోదసమయమున నొక దేవతాస్త్రీ నర్తనమాడుచు నాట్యశాస్త్రలక్షణము వివరించుచు లక్ష్యముగా నాడిచూపుచుండెను. పిదప సారస ధ్వజుఁడు చారులీలంగొనిపోయి సుఖరాత్రములఁ గడపుచు నొక్కనాఁడు దానికిఁ గామసూత్రోపదేశము సేయుచుండెను. ఈ ప్రదేశముననే కృతి యసమ గ్రముగా నిలిచిపోయె. ఇఁక ననేకశాస్త్రసారములఁ గవి దెనిగించియుండును. భరతసంగీత శాస్త్రసారము నవీన ప్రస్థానము ననుసరించినందునఁ గవి రెండు వందలకంటెఁ బ్రాచీనుఁడుకాఁడు.

"సీ.విను సారసధ్వజ విశ్వప్రసిద్ధమౌ
భరతంబు పదియాఱుతెఱఁగు లయ్యె
నది యెట్టులన్నఁ గోహళమతంబును శుక్ర
గురు నారదర్షి ఫల్గున మతములు
నందికేశ సమీరనందన యాజ్ఞవ
ల్క్యయ భరతాచార్య కృతమతములు
గీర్తింపఁ దగిన సంగీతరత్నాకరా
దులు పది యిలలోన గలిగియుండుఁ
గడమ యెచ్చట నున్నదో పడయు టరిది
గాన నానేర్చినంత నిక్కముగ సభ్యు
లలరఁ బలికెద జారులీలాంతరంగ
జలజమదభృంగ సకలశాస్త్రప్రసంగ.'

"సీ.శాస్త్రరీతి నెసంగుసప్తస్వరంబుల
లక్షణలక్ష్యంబులను ఘటించి
ఘననయదేశ్యమార్గములను బరికించి
షాడవముఖరాగసరళి నరసి
ఆరోహణావరోహణగమకస్ఫూర్తి
వెలసి డెబ్బదిరెండు పథము లైన

మేళకర్తల నేర్పు మీఱంగఁ బాడుచోఁ
కలుగువర్జావర్జముల నెఱింగి
యెలమి స్త్రీపురుషాఖ్యల వెలయు రాగ
మైత్రి కనుగొని గానవైచిత్రిమెఱయ
నచ్చరలు మేలు మే లని యిచ్చ నలర
మించు ప్రౌఢిమ వీణ వాయించుచుండె."

ఇందుఁ జెప్పఁబడిన డెబ్బదిరెండుమేళకర్తలు కృష్ణరాయల కాలములోనే వ్యవహారమునకు వచ్చినవి. తత్పూర్వగ్రంథములఁ గానరావు.

ఈకృతిలోఁజారులీల, ప్రశాంత, సారసధ్వజుఁడు మొదలగునామముల సారస్యము గమనించిచూడఁగాఁగవి యేదో శృంగారభావనావిశేషమును హృదయమున నుంచుకొని విచిత్రకథావిధానము నెలకొల్పియుండు నని తోఁచుచున్నది. చారులీల నెవ్వతెయో చూచినంత నది పురుషుఁడుగాఁ దోఁచి యనురాగప్రవృత్తి నొంపొంది విస్మయాపాదకముగ మరల సారసధ్వజుఁ డేతేర స్త్రీగా నైయుండు నట్లు కథావైచిత్రి యుండక తప్పదు. ఇట్టిగ్రంథముల యునికి లోకులకు దెలుపుటయైన మేలెయని యీవ్యాసము విరచించితి. గ్రంథకర్తలపేరులు గానరాని మఱికొన్నికృతులఁగూర్చి ముం దించుక ప్రశంసించెద.

—భారతి—ప్రభవ—ఆషాఢమాసము మా. రామకృష్ణకవి

# 7. ఎలకూచి వేంకటకృష్ణరాయకవి

ఇతఁడే బాలసరస్వతియను బిరుదుతోఁ బ్రఖ్యాతుఁడై నన్నయభట్టీయ వ్యాకరణమునకుఁ డీక రచించి కవిచరిత్రకారుల నిందాస్తుతి శరపరంపరలకు లక్ష్యమై యంధ్రలోకమునలంకరించినకవి. ఇతఁడు రచించిన యంధ్రశబ్ద చింతామణివ్యాఖ్యను బెక్కండ్రు మూలాంచలశాఖాంచలముల ఛేదించి ప్రకటించి యున్నందునఁ బలుభావనలకుఁ దావలంబయ్యె. తద్గ్రంథప్రారంభ మిట్లున్నది.

"ఉ. శ్రీకరశాఖమై ద్విజనిషేవితమై
సుమనః ప్రజీవనం
బై కలధౌతసుందరమహాచ్ఛదమై
సుమసౌరభద్యుతి
ప్రాకటమై ప్రశస్తనవపల్లవమై
యలరారు నాశ్రితా
నీకఫలప్రదంబు హరినిర్జరశాఖి
సమాశ్రయించెదన్.

సీ. చిన్ని చెందొవవిందు కన్నె గేదఁగిరేకు
దోఁపినయందపుఁ దుఱుముతోడ
సరసదూర్వా దళాంకురగుచ్ఛక చ్ఛాయ
లీను నిద్దంపు నెమ్మేనితోడఁ
గరుణారసమరందభరసంభృతములై త
నర్చునేత్రారవిందములతోడఁ
గాలాహిక్రియ నభక్తజనంబులకు భయో
త్పాదియౌ నభయహస్తంబుతోడ
హృదయమునఁ గానిపించి యభీప్సితప్ర
బంధశబ్దార్థవిజ్ఞానభవ్యశక్తి
యొసఁగుఁగావుత తల్లి భక్తౌఘదురిత
లావి దక్షిణకాళికాదేవి మాకు.

వ. అనియిష్టదేవతాప్రార్థనంబుచేసి మున్నొకనాఁడు విద్యానగరిలో నచింత్యకారణోపాయాగమజ్ఞ సాహచర్యుండగు శివయోగివర్యుచేత దైవచోదనంబునఁ బరిప్రాప్తంబైన యంధ్రశబ్ద చింతామణిగ్రంథంబునకు సకలలోకోపకారకంబుగాఁ డీక గావింప గోరి నెమ్మనంబున,

ఉ. ఏమిమహాద్భుతం బిది హ
రీహరి యెక్కడి యంధ్రశబ్దచిం
తామణి భక్తి యెక్కడిమ
తంగనగంబు యుగాదిసంభవుం
డై మునుచన్న నన్నయ మ
హాకవి యెవ్వఁడు సిద్ధుఁ డెవ్వఁ డా
హా! మదగణ్యపుణ్యసము
దగ్రతఁ జేకుఱెఁగాదె యింతకున్.

మ. ఇలఁ బ్రజ్ఞాధికులౌ కవుల్ మునుపు లే
రే వారు వ్యాఖ్యానక
ర్తలు గానోపరె పెక్కువత్సరము లం
తర్భూతమై యున్నయీ
తెలుఁగున్వ్యాకరణంబు నా కొసఁగెఁ బ్రీ
తిం డీక గావింపు మం
చల సిద్ధుండు మదిష్టదేవత విరూ
పాక్షుండు నిక్కంబుగన్.

వ. అని గణించి లోకోపకారసుకృతకీర్తిసంభరితోదర్కంబునకుఁ బ్రహర్షించి యంధ్రవ్యాకరణభాష్య నిబంధనోత్సుకుండనై యం దాది నస్మచ్చరిత్ర మభివర్ణంచెద;

సీ. స్థిరకీర్తి యెలకూచి తిప్పనార్యుఁడు గాంచె
శుచిశీలు వల్లభసోమ......
......సుచరిత్రు లిద్దఱు
సుతులు......

...తిప్పనకు భైరవన్న నన్నయనాఁగ
నలఘు లిద్దఱు తనూజులు జనించి
ఈతని...నకునౌజ్జప తిర్మలయ్య రా
మనయుఁ జిట్టనయు సూరనయు నాఁగ
...లేంద్రుఁ డళియరామావనీశ
దత్త యెడపల్లెముఖ్యసద్గ్రామ హేమ
......వచ్ఛత్ర వల్యంకికామణీవి
భూషుఁడై వైదుషీస్ఫూర్తిఁ బొలుపుమిగిలె

ఉ. అత్యనఘుండు రామఘనుఁ
డాత్మజలం గనియెన్ శుచిత్వసాం
గత్య...రుభైరవుని
నాగన నప్పన రామధీమణిన్
ధృత్యమరాద్రి భైరవమ
నీషికిఁ గల్గిరి సత్కుమారు లా
దిత్యుఁడు కృష్ణసత్కవి సు
ధీజనవందితుఁ డబ్బనార్యుఁడున్.

గీ. ప్రాకనాటి సకల పండిత కవిజనా
చార్యుఁడైన కృష్ణయార్యవర్యు
నకును లక్ష్మణాంబికకు నేను నాదిత్య
కవియుఁ గల్గితిమి జగన్నుతముగ.

సీ. భాషాధికగ్రంథపరిచయోదాత్తుఁడఁ
గౌముదీ నాటక కావ్యకలన
భాషావివరణాఖ్య భవ్యశాస్త్రకరుండ
భాహటస్థాననిబంధనుండఁ
జంద్రాపరిణయాది సత్కృతిస్రష్టను
దీప్ర వామనపురాణప్రబంధ
భామతీగీతి ప్రబంధౌఘకర్తను
దక్షిణకాళికాతంత్రచణుఁడఁ

ప్రకట యాదవ రాఘవ పాండవీయ
నామకశ్లేష కవితాప్రణాయకుండ
నలఘు కౌండిన్య గోత్రుఁడ నఖిలసుకవి
తాస్వతంత్రుఁడ బహుకళాదరుఁడ నేను.

వ. వేంకట కృష్ణరాయాఖ్యుఁడ నంధ్రశబ్దచింతామణిఁ దెలిఁగించెద నిది తొల్లి సకలకవితాప్రవర్తకుండగు శబ్దశాసనుండు సకల కవిహితంబుగా యథోచిత సూత్రగర్భితంబులగు నార్యావృత్తంబులఁ బంచపరిచ్ఛేదకంబుగా నమకట్టె. నేనును నానేర్చుకొలందిఁ దత్తత్సూత్రవిభాగంబును, దత్ప్రమేయ వివరణంబును, దదుదాహరణస్వరూపంబులును నంధ్రభాషామయగద్యపద్యంబుల నేర్పఱిచినాయాత్మదేవతయగు నంబాదేవి కర్పించువాఁడఁ దదుపక్రమం బెట్టిదనిన."

అని ప్రారంభింపఁబడి పరిచ్ఛేదాంతముల దక్షిణకాళికామంత్రాక్షర పరిపూతంబగు సంబోధనంబుల ఘటింపఁబడిన యీ గ్రంథమున నంకితాంకపద్యములీనడుమ నెవ్వరోయాంధ్ర పత్రికలోఁ బ్రకటించినందునఁ జర్వితచర్వణమగుటచే వాని వదలితిమి.

ఇతని గ్రంథములలో యాదవ రాఘవ పాండవీయము ముద్రితమయ్యుఁ బ్రఖ్యాతి చెందదయ్యె. గ్రంథాంత పత్రము మాత్రము చెన్నపట్టణమునఁ జిరకాలమునకుఁ బూర్వమే మంగళద్రవ్యములమ్మెడు ప్రసారమునఁ జూడఁగలిగె. భాషావివరణము ప్రాకృతసూత్రములకు వివరణగ్రంథము సంస్కృతభాషలో రచింపఁబడియె. దీనిని జదువం గలిగితిమి; కాని యుత్పలదేవ త్రివిక్రమ కృష్ణలీలాశుకాదుల సర్వంకషపాండిత్య మిందుఁ గానరాదు. చంద్రికాపరిణయము ద్వితీయాశ్వాస మధ్యపర్యంతమే లభించుచున్నది. అదియు రేచర్ల మాధవరాయల చంద్రికా పరిణయమునకుఁ దీసిపోవునేమోః బాహటాంధ్రకృతియు, భామతీగీతప్రబంధములు లభించినవికావు. భామతి శంకరభాష్యమునకు వ్యాఖ్యానమగు వేదాంత గ్రంథము. ఇదిగాక వేఱొకభామతి యున్నదాః భామతి గీతరూపముగాఁ దెనిఁగించుట శ్లాఘ్యమేగాని గీతపద్యచక్రవర్తియని పేరుగన్న నేఁటికాలపుఁగవికి బిరుదలోపము లేకుండుటకుఁగాబోలు తత్కృతి యంతర్ధానమయ్యె. కౌముదియే, రంగకౌముదియను సంస్కృతనాటకము.

ఇతని ముత్తాత యళియ రామరాయలయొద్ద నెడపల్లెగ్రామము నంది నందున 1608 క్రీ. శ. లో వ్యాకరణము రచించెనుట యాశ్చర్యముకాదు. గ్రంథమునిచ్చిన శివయోగియే సారంగధరుఁ డగునని యప్పకవి యూహించి యుండును. నన్నయభట్టుకాలము యుగాదియని బాలసరస్వతియే వచించె. అప్పకవికి బరువు తటిగెఁ బరువు కలిగె. ఇతఁడు నియోగికులజుఁ డనుటకుఁ గూడ నిందుఁ బొందికలు గలవు.

—భారతి—క్రోధన—పుష్యమాసము. మా. రామకృష్ణకవి

# 8. శ్రీకృష్ణలీలాశుకకవి

మందారమంజరీ స్యంది మకరందరసాబ్ధయః ।
కస్య నాహ్లాదనా యాలం కర్ణామృతకవే ర్గిరః॥

— గంగాంబ

సకల జన నిరంతరాస్వాద్యమగు కృష్ణకర్ణామృతము రచించిన మహా కవి యెవ్వఁడో యతని శీల మెట్టిదో యేదేశమతనిఁగని సాఫల్యము చెందెనో యతని పితృభ్రాతృకళత్రపుత్రాదు లెవ్వరో యను సందేహ పరంపరలు విప్ర సమారాధనములందును, బువ్వపుబంతులందును, వెన్నెలపులగములందును, బాఱువేఁటల వనభోజనములందును గృష్ణకర్ణామృతకారుని వాగమృతధారలఁ గ్రోలిన వారు పొందకుండరు. అతడు చింతామణి యను వేశ్యకై తనశీలమును ధారవోసి తత్ప్రేమభరముచే జ్ఞానోదయము నొంది శృంగార సర్వస్వ రసాధి దేవతయగు శ్రీకృష్ణునిఁ బరమప్రేమమున భజించి యతనితో సాయుజ్యము పొందెనని కథలు చెప్పుదురు. అతఁడాంధ్రుఁడని మనమెల్లరము తలఁచి యున్నారము. కృష్ణవేణ్ణానదీ తీరమున నమరేశ్వరముచెంత నొక మఠమున నతఁడు జీవించియుండెననియు, శ్రీకాకుళక్షేత్రమున నుండెననియు కొందఱు జెప్పుదురు. ఓఢ్రులును వంగదేశీయులును శ్రీపురుషోత్తమ మగు జగన్నాథమున నతఁడు నివసించెననియు నతనియింట బిల్వవృక్షము మంగళాస్పదముగా నున్నందున నతనికి బిల్వమంగళస్వామియని పేరు గలదనియు మొదలుగాఁ బెక్కు కథలు గూర్చి భాగవతమునఁ ద్రయోదశస్కంధము రచించి యతనిఁ బరమ భాగవతాగ్రగణ్యుఁగా నొనర్చి యర్చింతురు. శ్రీకృష్ణ పూజా పరమార్థు లగు నోఢ్రులకుఁ గృష్ణునిలీలాశుకం బారాధనీయం బనుట యేమి వింత?

నేఁటి కాలమునఁ గవుల చరిత్రము మాత్రము చక్కఁగాఁ దెలిసికొని యొందు రెండు పద్యములు నోటికి రప్పించుకొనినచో నొక్కొకని కవితా సర్వస్వమంతయుఁ గ్రోలినంత సంతోషము పడుచున్నారము. ఇట్టి సులభ సంతోషులగు మనలఁ గీర్తిశేషులగు కవులు స్వర్గలోకమునుండి చూతురేని తప్పక యామోదింతురు. కావున నతని చరిత్రము విని తృప్తిఁ బొందుదము. లీలాశుకుం డెవ్వఁడనుట యతని గ్రంథములు మఱికొన్ని లభింపఁగా నించుక

వెలివడుచున్నది. మనయాంధ్రులకును నోఢ్రులకును మాళవఘూర్జరులకును సైత మాశాభంగము కలిగింపఁజాలిన యతని జన్మస్థానము కేరళ దేశమున నని చెప్పుటకు సిగ్గుపడుచున్నాను. అతఁడు బాల్యముననే శంకరాచార్యులవలె సన్యసించినందున నితని ప్రియసర్వస్వమగు "చింతామణి" భక్త జనచింతామణి యగు కృష్ణుఁడే కాని చర్మసుందరియగు నాఁడుది కాదు. తురీయాశ్రమవర్తియై కేరళమున భారతీనదీ తీరమునఁ దిరునావాయను నామాంతరముగల శ్వేతారణ్యమున నతఁడు దన కాలమంతయుఁ బుచ్చెను. ఆతని కృతులఁ జదువఁగా గంగా బృందావన ప్రాంతములఁ గొంతకాల మతఁడు విహరించి యుండునని తలఁపవలసియున్నది. ఇతఁడు మూఁడు వ్యాకరణముల నాచార్యుఁ డనఁ దగినంత పాండిత్యము నుపార్జించి సంస్కృత ప్రాకృత వ్యాకరణములకు వ్యాఖ్యలం గూర్చె. దేవప్రణీతమగు దైవవ్యాకరణమునకుఁ బురుషకారమను వ్యాఖ్యయు, భోజదేవుని యష్టాధ్యాయికిఁ గృష్ణలీలావినోదమను వృత్తియు, వరరుచి కృతమగు ప్రాకృతప్రకాశమున కొక్కొక్క సూత్రమున కుదాహరణముగా గోవిందాభిషేకమను ప్రాకృతకావ్యమును మఱికొన్ని కృతులును లీలాశుకుని శబ్దశాస్త్ర పరిశ్రమ ముద్ఘోషించుచుండును. సుబంతతిజంత సామ్రాజ్యములను గ్రంథములు నితనివే యని నేను సందేహించెదను. అవి భోజుని యష్టాధ్యాయి ననుసరించి సిద్ధాంత కౌముదివలె శబ్దనిష్పత్తి ప్రదర్శకమగు గ్రంథములు."బుభుక్షితై ర్వ్యాకరణం న భుజ్యతే"యన్నట్లు భక్తిరసమున కేఁకటి గొనియున్నఁ మనకతని వ్యాకరణ రచనతోఁ బనిలేదు. లీలాశుకుఁడు గోవిందాభిషేకమున నెనిమిది సర్గలు రచించి వరరుచి ప్రాకృతవ్యాకరణమునకు మార్గము చూపిన పిదప నతని శిష్యుఁడు దుర్గాప్రసాదయతి దానికి వ్యాఖ్య రచించి మఱియు నాలుగు సర్గలు త్రివిక్రమవ్యాకరణలక్ష్యముగా రచించి ముగించెను. ఇతఁడు లీలాశుకునిఁ గూర్చి యేమనియెః

కోదండమంగళవచోగ్రథితే హి దామ్ని
శ్రీకృష్ణ దర్శనపరః కిల కర్ణభృత్యః
జాతః క్రమేణ పరహంసపదే స్థితోఽస్మిన్
యోఽంకస్థిత స్తమవలోక్య జగామ తృప్తిమ్.
శ్రీపద్మపాద మునివర్య వినేయవర్గ
శ్రీభూషణం ముని రసౌ కవిసార్వభౌమః

శ్రీకృష్ణరూపపరమామృతపానశీల
శ్చక్రే తదీయచరితం బహుధా హితాయ.

అని వ్యాఖ్యా ప్రారంభమునను;

శ్రీకృష్ణలీలాశుక బద్ధ కావ్యం
వివృత్య లోకస్య హితాయ పూర్వమ్
తచ్ఛేషపూర్తిం చ పున ర్విధాయ
వివృణ్మహేఽథో త్తరభాగ మేతమ్.

అని నవమసర్గ ప్రారంభమునను;

ముక్తిస్థలాలయ శివాపద భక్తివేశా
ద్దుర్గాప్రసాదయతి రిత్యభిధాం దధానః
కర్తా స్వయం సుకృత మత్ర ఫలానభీప్సుః
కృష్ణేఽర్పయా మ్యథ విశుద్ధికరా మహాంతః.

అని గ్రంథాంతమునను జెప్పుకొనియె. నడుమ నొకచో "చావమంగళ గృహో యతీశ్వరః"అని లీలాశుకునిఁ బేర్కొనియె. పై విషయము లాలోచింప నితని గృహనామము విల్వమంగళ మనియు (విల్వయనఁ గేరళభాషలో వింటి సంబంధమనుట) నితఁడు పద్మపాదాచార్యుని వంశమునో శిష్యవంశమునో పవిత్రీకరించెననియుఁ దోఁచుచున్నది. ముక్తిస్థలము శ్వేతారణ్యమునకు దక్షిణమున ముక్కుత్తాలయని భగవతీక్షేత్రము, పశ్చిమాంబుధికిఁ గొన్ని మైళ్ల దూరమున నుండును. 'వబయో రభేద'యను న్యాయమున బిల్వమంగళ శబ్దము జనించి పిదప బిల్వవృక్షమును దత్సంబంధమగు చిలిక కథలును బుట్టియుండు నేమోః ఇతని కాలమెప్పడని స్పష్టముగాఁ జెప్పటకు వలను గాదు. క్రీ. శ. 1050 వఱకు నుండిన భోజుని యష్టాధ్యాయికి నితఁడు వ్యాఖ్య రచించుటయుఁ బురుషకారమున హేమచంద్రు నుదాహరించుటయు నితని గ్రంథముల విద్యారణ్యులు ధాతువృత్తిలోఁ బేర్కొనుటయుఁ జూడ సుమారు క్రీ.శ. 1250-1300 ప్రాంతముల నుండెనని యూహింపపచ్చును. ఇతఁడు పెక్కు కృతులు నానా విషయముల రచించె. అన్నిటిలో శ్రీకృష్ణునిస్తుతియే ముఖ్యవిషయమైయుండును. ఇతఁడు పూర్వోత్తర మీమాంసల నుత్కృష్ట పాండితి గడించెనని యితని కేనోపనిషద్భాష్య వ్యాఖ్యానముచలనఁ దెలియును. దానిపేరు వలెనే నిక్కముగా నది "శంకరహృదయంగమ"యే. ఈతఁ డీశానదేవుఁడను మహా

తాంత్రికుని శిష్యుఁడు గావున గృష్ణపూజాపరముగాఁ గ్రమదీపికయను నొక తంత్రగ్రంథము నిర్మింపఁగలిగెను.

ఈశానదేవచరణాభరణేన నీలీ
దామోదర స్థిరయశః స్తబకోద్గమేన
లీలాశుకేన రచితం తవ దేవ కృష్ణ
కర్ణామృతం వహతు కల్పశతాంతరేఽపి.

అని కృష్ణకర్ణామృతమునఁ జెప్పిన యితని గురువగు నీశాన దేవుఁడు తంత్రపద్ధతి యను మహాగ్రంథమును రచించిన ఋషికల్పుఁడు. అతఁ డాదిత్య ప్రజ్ఞుఁడను మహాత్ముని శిష్యుఁడు.

ఆదిత్యప్రజ్ఞ సంజ్ఞం య దాదిత్యా దధికం మహః
నిర్జితః సమదృష్ట్యైవ నిర్లోభేనైవ మన్మథః
అర్జితై రస్త్రకుసుమై రారా దారాధయన్ యయౌ.

నిర్లోభుఁడగు నతని సమదృష్టిచేతనే జయింపఁబడి మదనుఁడు నైతము తన యస్త్రార్థ మేరి తెచ్చిన కుసుమముల నతని పాదములఁ బూజించి పోవు నంతటి యాదిత్యప్రజ్ఞుని శిష్యుఁడు.

ఈశానదేవ ఇత్యాసీ దీశానో మునితేజసామ్
అస్పదస్య హి యస్యాసీ దశేష గుణసంపదామ్
అద్వితీయ ఇతి ఖ్యాతి రాత్మబుద్ధ్యా న కేవలమ్.

ఈశానదేవుఁ డధ్యాత్మ దృష్టిచేతను లోకమువారలకును నద్వితీయుఁ డయ్యె. వీరిరువుర నాశ్రయించిన శిష్యులు—

'తయో రనుగ్రహాపాంగ సంక్రాంతజ్ఞానసాగరాః
సాగరా ఇవ గంభీరాః సంతి ధన్యా స్సహస్రశః'.

అని పెక్కండ్రుడు విద్యా సాగరులవంటి యతులు కీర్తిస్తంభములవంటి కృతులు రచించుట యచ్చెరువేమి?

'తయోరేవ కృపాపాత్రం కృష్ణలీలాశుకో మునిః
యదాశ్రమాంగణే నిత్యం రమంతే తంత్రవిస్తరాః'

అనినట్లు లీలాశుకుఁడు వారి శిష్యుఁడు. పై కర్ణామృత శ్లోకములోని నీలీ దామోదరులే యితనిఁ గన్న తల్లిదండ్రులు—

'తిలకం కులపాలీనాం నీలీతి నిలయం శ్రియామ్
యమళం జనయాంచక్రే యంచ కీర్తించ శాశ్వతీమ్'

పతివ్రతాతిలకమగు నీలికి లీలాశుకుఁడును. గీర్తియు నమడలుగా జనించిరట. మృత్యు భయములేని కీర్తియను కూతురే యామె సౌభాగ్యమును శాశ్వతముగా నిలిపెను.

'యస్య దామోదరో నామ పితా సవితృసన్నిభః
అనృణస్య హి యస్యాన న్నధమర్ణా మరుద్గణాః'.

ఇతని తండ్రియగు దామోదరుఁడు హవిర్భాగముల నొసఁగి దేవతల నప్పుల కాఁపులుగా జేసికొనియెనఁట. ఇతని మిత్రుఁడు భాగవతాది వ్యాఖ్యాత యగు రాఘవేశానయతి. ఇతని మనస్సు

'యస్య దక్షిణకైలాన లీలాపరిణతం మహః
చర్చాచందన గుంభేన సుగంధయతి మానసమ్'

అని దక్షిణ కైలాసమను కీర్తికన్న శ్వేతారణ్యమునఁ బ్రసన్నుఁడగు మృత్యుంజయస్వామి దర్శనముచే నిత్య వికసిత మగుచున్నదని.

"కృష్ణలీలాశుక స్యాస్య కిశోర మధిదైవతమ్
స్తుతిరత్న మిదం బ్రూతే వేణువాదిముఖేందునా"

కృష్ణుఁడే మురళీనాదమధురమగు వాక్కున నీకవి ప్రశంస రచించెనని తన పుట్టువు నించుక యిమ్మహాకవి స్మరించుకొనకున్న మనము సంశయ విభ్రమముల పాలు గావలసి వచ్చును. ఇతని కృతులు పెక్కు లత్యున్నతములయ్యె. లభించిన వానిలో త్రిభువనసుభగ, కాలవధము, గోవిందాభిషేకము, గణపతి స్తుతి, రామచంద్రస్తుతి, అభవస్తుతి, కృష్ణచరితము, కృష్ణబాలక్రీడ, బృందా వనస్తుతి, కౌస్తుభమాల, క్రమదీపిక, శంకరహృదయంగమ మొదలగు నవియు వ్యాకరణగ్రంథములును ముఖ్యములు.

కథా నిర్వహణ దక్షులగు మహాకవుల ప్రతిభకును మనస్సు కరఁగి భక్తి పారవశ్యముచే "వాచవి లోనుగా నొడలి వాకిళులం బొడచూపు తీపులం ద్రోచి" భగవంతుని దివ్యాకార సౌందర్య ప్రవాహమున మునింగి యతని మహిమము నిలుపోపక కొనియాడు కవుల స్వచ్ఛందకవితకును మహాంతరము గలదు. స్తుతిపరములగు కావ్యములలో విష్ణుస్తుతులే మృదు మధుర పద సంద

ర్భోచితములై హృదయహారకములై యున్నవి. దేవీస్తుతులును మహేశ్వర స్తుతులును నిగూఢార్థ గంభీరములై ప్రౌఢోక్తి గుంఫ సంభృతములై బహు తంత్ర వేత్తలకుఁ గాని యన్యులకు నోరు మెదల్ప నెడమీయవు. "భగవదను గ్రహ విశేషవాచా" విలాసుండగు కాళిదాసుండును దన చిద్గగనచంద్రికలో నొనర్చిన దేవీస్తుతియుఁ జాతకుల పాండితీ దర్పదళనము గావించుచున్నది. గేయప్రబంధ రత్నమగు గీతగోవిందము పాదాంత ప్రాసములతో మనోహరమై శృంగార రసపరిపాక బంధురమై పామరులకుఁ గృష్ణ సాన్నిధ్యసోపాన పరం పరకుఁ జేయూఁత యిచ్చుచున్నది. అతినిపుణ పరీక్షకుల కందుఁ గొన్నిచోట్ల గవిశిల్పము వెల్లడియై యది యించుక కృత్రిమముగాఁ గానవచ్చును. రూప గోస్వామి ప్రభృతుల కృష్ణోల్లేఖనమున భక్తిప్రవాహ పాతముతో శబ్దతాండవము కలసియాడ నోపదు. కృష్ణలీలాశుకుఁడు కృష్ణ బాలక్రీడలే తలంచుచు గోపగోపీ జనంబులలోఁ దన్నుఁ గలుపుకొని పరిపక్వమై యున్నదియున్నట్లు చెప్పఁ జాలు తన సహజవాగ్ధోరణియు నూరకుండమిచే నేమైన పఠించుచుండఁగాఁ దాను "వసుదేవసుత సరోవరములో నోలలాడు సనకాది దివ్యహంసములలోన" నొక హంసయై కాషాయమాత్ర రాగియై విలసిల్లుచుండె. ఇతని కృష్ణస్తుతి మహిమము కర్ణామృతమున నెల్లరెఱుంగుదురు. వేఱ కొన్నియెడల నుండి కొంత యుదా హరించెదను.

**బృందారణ్యస్తుతిలో**

దేవీ సరస్వతీ స్వైరం సేవావసరకాంక్షిణీ
దేవదేవ మియం ధన్యా సేవతాం దేవకీసుతమ్"

కృష్ణ స్తుతిసేవ యెప్పుడెప్పుడు కలుగునో యని యువ్విళు లూరుచున్న సరస్వతి యింక యథేష్టము సేవించి ధన్యురాలగుఁ గాక అని తెరయెత్తి చూపిన లీలాశుకుని దివ్యవచనములు వినఁగోరెడు కృష్ణ భక్తులు చెవులార గ్రోలుదురు గాక.

వందే బృందావనేంద్రస్య విశ్వనాథస్య శైశవమ్
వైభవోద్గంధి మాంగల్య కటాక్షోక్షితి దిఙ్ముఖమ్.
వందే కందర్పసామ్రాజ్య బృందావన వనేచరమ్
బృందై రిందీవరాక్షీణాం బందీకృత మిత స్తతః.

అవిశంక మనంగసంకులాభి ర్వనితాభి ర్వినతాభి రాత్తరాసమ్
కమలారమణం కిశోరవేషం పరిపుష్య న్మమ చిత్త మభ్యుదేతు.
మధ్యేమధ్యే కృష్ణమాణిక్యమిశ్రా మాలా కాచి ద్వల్లవీనాం సహస్రైః
చిత్రాభోగై ర్భోగినాం ధన్య ధన్యై ర్భాయా దేషా దీర్ఘ మాఘ్రాయమాణా.
బృందావనవ్యసనిన స్తవ దేవ కృష్ణ
లీలాశుకేన రచితా నిచితా రసౌఘైః
ప్రత్యక్షరం పరిదుహన్మధు కర్ణయో స్తే
స్తోత్రం తదేత దనిశం విలిహంతు ధన్యాః.

అని మొదలుగా నఱువది శ్లోకములలోఁ గృష్ణుని రాసక్రీడ వృత్త విశేషములతో నిక్కువి వర్ణించెను. రాసక్రీడా వర్ణనము పెక్కండ్రు శృంగార రస మనోజ్ఞముగా వర్ణించినను భక్తిప్రాధాన్య ధన్యముగాదు. విద్యాచక్రవర్తి యను మహాకవి రుక్మిణీకల్యాణమున రాసక్రీడ యత్యద్భుతముగాఁ దనవిద్యా గాంభీర్య మెఱుకపడ నొక సర్గ మంతయు వర్ణించెను.

శ్లిష్టాభయవ్రతవినిస్సరణోత్తరాణి
వ్యగ్రాగ్ర చంక్రమణవం త్యవికీర్ణరేణు
అర్ధక్రమస్ఖలదనుల్బణలంఘితాని
రేజుః పదాని సుదృశాం చలనూపురాణి.
స్వేస్వే సహాభినయసీమ్ని నిరభ్యసూయః
ప్రేమ ద్రుతాంతరతయా పరనిర్వ్యపేక్షః
రూపేషు పార్శ్వయుగ సన్నిహితేషు విష్ణోః
గోపీజనస్య వవృతే మదనోపచారః.

ఇత్యాది భావములు మనకుఁ గవితయుఁ బాండిత్యము నొసఁగుఁ గాని తీవ్రముగా హృదయ గ్రంథిని భేదించునా యని సంశయించెదను.

లీలాశుకుఁడు తన రచించిన పద్యము లెల్లనుఁ గృష్ణ ప్రోక్తములనియే తలంచుచుఁ దన్నతనికి సర్వార్పణము చేసికొనియె. కాలవధకథ (మార్కండేయుని కొఱకు శివుఁడు యముని జయించుట) కృష్ణుఁడే యేమేని వినఁగోరిన గోపికలకుఁ జెప్పినట్లున్నది.

ఇత్యాత్మనా నిగదితం సకలప్రజానాం
విస్మాపనాయ వచనామృత మాకలయ్య
అంతర్నిగూఢ హసితేన జగత్త్రియస్య
నాథేన నిర్మిత మిదం శ్రవణామృతత్వమ్.
మందస్మితస్నపిత ముగ్ధముఖారవిందం
మందానిలాకలిత కోమల కాకపక్షమ్
అంగం తదేత దఖిలవ్రజలోచనానాం
మాంగల్య మస్తు కిమతఃపర మస్తి కృత్యమ్.
పింఛావతంసరచనోచిత కేశపాశం
పీనస్తనీ నయనపంకజ శోభనీయమ్
మందారవర్షభరితం సురసుందరీభి
ర్మందం ముహుః క్వణితవేణురసాభిరామమ్
కించేద మద్భుతరసం చరితం పురారేః
శృణ్వంతు-

అని శివుని కథయుఁ గృష్ణుని నోటనే వినుచున్నారము. యముని గర్వము సంహరించి శివుఁడు కోపరూప ముపసంహరించుకొని విష్ణువుతో యథావిధి సుఖసల్లాపముల నుండ మహర్షివరులకు "రజతగిరిమీఁద హరిహరారాధనంబు" గలిగిన.

అఖిల మునిజనానా మంతరన్వేషణీయం
నిఖిల నిగమవాచాం విభ్రమై ర్లక్షణీయమ్
నయనపథ ముపేతం మంగళానందపూరం
సపది త మనుభూయ వ్యాజిగీషు ర్మునీంద్రాః.

అని జగత్సృష్టికి సితాసిత బీజరూపమగు నద్దైవతద్వయమును నొక సర్గమున మాలినీవృత్తగంధి యగు ద్రుతద్రుపవలోఁ బాడుచుఁ గొనియాడి ధన్యులైరి.

ఫణిమణిగణ లక్ష్మీ క్రపుంజ మంజూకృతేన
ప్రతిభయ లలితాంగం దంతి చర్మాంబరేణ

మధుర మమరనారీమంథరాపాంగలీలా
వ్యతిథురితవిహారాగారపీతాంబరేణ.
గిరివర నిజకన్యా లోచనచ్ఛాయపూ_రై
రపిచ భుజగహా_రై రాదృతా బాహుమధ్యే
నిచిత మురసి లక్ష్మ్యా దివ్యలీలారవిందై
రవిరతవనమాలాషట్పదాన్ వారయంత్యా.
సజలజలదనీలం శారదాంభోదశీలం
కబళిత నవనీతం కాలకూటానురాగి
ఘుసృణమసృణవేషం ఘూర్ణితోద్భ్రామిభూషం
శరణ మిదమిదం నః శాశ్వతం ధామ భూయాత్.
అవిచలిత తరంగోత్తుంగ గంగావతంసం
సమధురమధుధారాపారసూనావతంసమ్
కలిత శశికలాంశు శ్రేణిసంచార గౌరా
రుచిర వివిధరత్న ప్రోద్గతోద్గారశారమ్.

అని మొదలుగా వర్ణనాస్తుతి స్వచ్ఛందధారామనోజ్ఞ మని తలఁపవలయు. శివ స్తుతిలో లీలాశుకుఁడు శాంత రసోచిత భావములే కూర్చెను.

త్వాం మేకే ముకురాయమాణమనసః స్వామిన్ సమస్తాత్మనా
మన్యంతే కతిచిత్పునః పరిణతం వ్యస్తాత్మనా మన్వతే
అన్యే వ్య_స్తతనుం సమ_స్తవపుషం జానంతి కేచిత్పునః
న వ్య_స్తం న సమ_స్త మిత్యల మహో దూరే ధియాం తత్పరమ్.
దేవ త్వదీయ చరణాంబుజ భ_క్తిభాజాం
ధర్మార్థకామగతయః సహము_క్తిలక్ష్మ్యా
దాస్యో భవేయు రితి చిత్ర మిదం నచే త్స్యాత్
బాణస్య వేశ్మని భవానపి వేత్రపాణిః.
అస్తోక వి_స్తరభ_రై రపి వాఙ్మయానా
మస్పృష్టసీమ భువనాద్భుత మాదిధామ
కిం బ్రూమహే కియదిహ స్తుమహే మహేశ
కేవా వయం తవ గుణార్ణవ వర్ణనేషు.

అని యయత్న సిద్ధముగాఁ బ్రవహించు కవిత

జిహ్వారసాయనసుధా గుళికా సుధానాం
కర్ణావతంసరచనా చ కవీశ్వరాణామ్
విశ్వాధికస్తుతి రియం తవ దేవ కృష్ణ
లీలాశుకస్య సహజా విజయాయ భూయాత్.

అని లీలాశుకుని కీర్తి లక్ష్మీ విలాసమై యుండుటయేమి యచ్చెరువు? లీలాశుకాదియతీశ్వరులు శృంగార రసభావమందును భగవంతుని లీలలు వర్ణించినప్పుడు కేవల మద్వంద్వులై సాక్షిపద భూతులై యంటు జంటెఱుంగక తత్త్వజ్ఞానమాత్ర తనులై హృదయసంవాది భగవచ్చేష్టా సంవిత్పరిస్పంద పరమానంద భరితులై యుందురు. వారికిఁ గాక మనయట్టి విషయోన్మజ్జన నిమజ్జనులకుఁ దద్భాసమానమగు తత్త్వవిశేష మెఱుంగఁ బోలునే?

అర్ధోన్మీలితలోచనస్య పిబతః పర్యాప్త మేకం స్తనం
సద్యః ప్రస్నుత దుగ్ధ దిగ్ధ మపరం హస్తేన సంమార్జతః
మాత్రా చాంగుళి లాలితస్య చిబుకే స్మేరాయమాణే ముఖే
విష్ణోః క్షీరకణాంబుధామధవళా దంతద్యుతిః పాతు నః.

అని యిట్లు స్వభావోక్తిరమ్యముగా స్తుతించు కవి యిఁక జన్మమెత్తి మరల జననీ స్తన్యపానము చేయఁ గలుగునా? (లీలాశుకుని యా బాలకృష్ణ స్తన్యపాన లీలావర్ణనము వినియుండెనేని రవివర్మ తన చిత్రలేఖన కౌశలము చూపుచు మఱియొక చిత్రపటమును మన కనుగ్రహించియుండును). ఈ పద్యమునం దశ్లీలదోషము కలదందురేమో? ఈ దేహమున నీజగంబున నించుక కనుదెఱచి చూచినవార లశ్లీలము జుగుప్సయు లేని యణువైనను గానఁజాలరు. ఆదోషాదులు దొలఁగిన మనమును లీలాశుకుని వంటి భాగవతులమే యగుదుము.

పర మిమ ముపదేశ మాద్రియధ్వం
నిగమవనేషు నితాంతఖేద ఖిన్నాః
విచినుత భవనేషు వల్లవీనా
ముపనిషదర్థ ములూఖలే నిబద్ధమ్.

అని లీలాశుకుఁడు ద్వైతాద్వైత శూన్యవాదాది పదభ్రమణ ఖిన్నులై దరిగానక యలయుచుండు జనులకు సులభముగా గోపికలు రోటికిఁ గట్ట గలిగిన యాపరతత్త్వమే యుపనిషత్తులు వెదకి వేసారిన పరలక్ష్యమని భక్తిరస పారమిత లోకమున కనుగ్రహించె. లీప్రభావమంతయు నుదాహలాకుశునిరణ ములతో గ్రంథరూపముగాఁ ద్వరలో బ్రకటించుటయే యుత్తమమని దీని నింతటితో విరమించుచున్నాఁడ.

భారతి, 1922 మా. రామకృష్ణకవి

# 9. ఉపవేదములు - గ్రంథసూచిక

మనుష్యుఁడు నేర్చుకొనఁదగిన దంతయు వేదములోనే కలదనియు నది యనాదియై ప్రత్యక్షాది ప్రమాణముల కతీతమై స్వతః ప్రమాణసిద్ధమని మన యార్యులెల్ల నంగీకరించియు, దదర్థవాద భాష్య వివరణ రూపములుగా బహు గ్రంథములు బహుముఖములుగా వెలువడి యున్నవి కదా. ఉపవేదములు, షడంగములు, విద్యలు, కళలు మొదలుగా విద్యావిభాగములు పెక్కులు గాన వచ్చుచున్నవి. ఈ చిన్న వ్యాసమున నుపవేదములేవో వానిలో నేయే గ్రంథములు మనకు లభించునవి గలవో యించుక విచారించెదము. ఒక్క యుపవేదమునైన లోనఁగల విషయముల నెత్తి యాంధ్రమునఁ గ్రోడీకరించి వ్రాసినను వేయిపుటలైనఁ దప్పక పట్టును. ఇందు గ్రంథముల పేరులు మాత్రమే సూచించినను స్థలసంకోచము నిక్కముగాఁ గలుగవచ్చును. ఋగ్యజుసామాథర్వణముల మథించి బ్రహ్మ నాలుగు వేదముల సృజించెనట.

"ఆయుషం ధానుషంచైవ గాంధర్వం చార్థమేవచ
సర్వలోకోపకారార్థ ముపవేదా నృగాదయః"

అని యామలాష్టక తంత్రమునఁ గలదు. ఆయుర్వేదము, ధనుర్వేదము, గాంధర్వవేదము, అర్థవేదము అని నాలుగు. వీనిలో నర్థవేద స్థానమునఁ గొందఱు స్థాపత్యమనియు (శిల్పము), తంత్రమనియుఁ బఠించెదరు. ప్రపంచ హృదయమునఁ బైనాలుగింటినే తద్గ్రంథకర్త పేర్కొనియె. ఆయుర్వేదమన వైద్యశాస్త్రము. ధనుర్వేదము విలువిద్య. గాంధర్వము సంగీత నాట్యములఁ బ్రతిపాదించునది. అర్థవేదము ద్రవ్య సంపాదన రక్షణ క్రమముల నెఱింగించు నర్థశాస్త్రము. ఈ నాలుగింటిలో నొక్కొక్కటియుఁ జతుర్వేదముల సారమని గ్రహింపవలయు. గాంధర్వమును గూర్చి భరతుఁడు.

''జగ్రాహ పాఠ్యం ఋగ్వేదా త్సామభ్యో గీతమేవచ
యజుర్వేదా దభినయం రసా నాథర్వణాదపి''

అని పాత్ర సంభాషణాదుల ఋగేద్వము వలనను, అభినయ కరణాంగహారవేషరచనాదుల యజుర్వేదమువలనను, గీతతాళధ్రువాదులగు స్వరకాలమాన విశేషమును సామవేదమువలనను, భావరసముల నథర్వవేదము వలనను బ్రహ్మ

గ్రహించి గాంధర్వవేదమును లోకమున నవతరింపఁ జేసెనని చెప్పుచున్నాఁడు. ఇట్లే తక్కిన యుపవేదముల విభాగము చతుర్వేదసంభూతమని తలఁపవలసి యున్నది.

## ఆయుర్వేదము - I

ఈ యుపవేద కర్తలు మహర్షులు పెక్కండ్రు గలరు. వారి గ్రంథములు పెక్కులు పేరు లేకయుఁ గొన్ని నామావశిష్టములుగాను నశించినవి. కొన్ని మాత్రమే లభించుచున్నవి. మొట్టమొదట బ్రహ్మసృష్టింపగా నాలుగును గలసి లక్ష గ్రంథపరిమాణమే కలదియయ్యె. గ్రంథమనఁగా 32 అక్షరముల పరిమితి గల పంక్తి. ఆయుర్వేదము ముప్పది యాఱువేల గ్రంథముగా బహు విషయములు నిర్ణయించునట్టిది బ్రహ్మచేతను బిదప నఱువది నల్వురు ఋషులచేతను విరివిగాఁ గూర్పఁబడియె.

ఆయు స్త్రింశత్సహస్రం స్యా ద్గ్రంథస్య పరిసంఖ్యయా
యత్రైవహి ప్రదృశ్యన్తే పిణ్డోత్పత్త్యాది లక్షణమ్
ఆయుర్వినిర్ణయాధ్యాయః ప్రకృతిజ్ఞాన మేవచ
నాడీధాతునిదానంచ వస్తుదోష నిరూపణమ్
శారీరగుణ విజ్ఞాన మౌషధోత్పాదనక్రమః
గజాశ్వనరరోగాది చికిత్సాకరణక్రియాః
రసాగ్నిమూలికారక్తపాకదేశక్రమాత్మనామ్
నిదానం షట్చికిత్సానాం వ్యాధే ర్గుణనిరూపణమ్
పూర్వాపూర్వాఘవిజ్ఞానం కర్మదోష ప్రదర్శనమ్
ఏవమాదీని భూయాంసి సంత్యాయుషి సహస్రశః
ప్రత్యక్షఫలదో నౄణా మాయుర్వేదః ప్రదర్శితః.

ఆగర్భాధాన పిండోత్పత్తి మరణము గలుగు శరీరాభివర్ధనక్షయ లక్షణములును, ఆయుర్నిర్ణయము, వాతపిత్తశ్లేష్మాది ప్రకృతియుఁ, గాలస్వరూపమును, నాడీధాతువుల తత్త్వమును, భోగ్యానుభోగ్య వస్తువుల గుణాగుణములును, కాలవయోభ్యాస సాహచార్యాచార భోజనాదులఁ గలుగు శారీర వికారములును, ఔషధకరణ విధియు, గజాదిమృగ వైద్యమును, రసాదుల యౌషధయోగములును, పుటభేదములును, మూలికాజ్ఞానతత్సంగ్రహ క్రమములును, రసాదులచే లోహముల రాగాభివర్ధనమును, ఔషధపాక క్రమమును, వ్యాధి లక్షణములును, జన్మాంతర కర్మదోషముల నెఱింగి తత్తద్వ్యాధి చికిత్స నుపదేశించుటయు

మొదలుగాఁ బెక్కువిషయము లాయుర్వేదమునఁగలవు.ఇందాయుర్వేద సూత్రము (వేదభాగము)ను, జరక సుశ్రుత భేళ కృతములగు సంహితలును, వృద్ధవాగ్భట ద్వితీయవాగ్భటుల యష్టాంగ సంగ్రహ హృదయములును, శార్ఙ్గధర బసవరాజా నంతాదుల ప్రకరణ గ్రంథములును సహస్రములు గలవు. ఇవియెల్లరకు విదితమే. కావున నించుక దుర్లభములగు వాని గురించి కొంత వచించెదము.

కైలాసకారకమను మూలికా విచార గ్రంథము మంథాన భైరవ తంత్ర ములో నుండి గ్రహింపఁబడినది. ఇందు మూలికల సిద్ధౌషధీ, దివ్యౌషధీ, మహౌ షధీ, రసౌషధీ విభాగములు సూచింపఁబడియె. సిద్ధౌషధులు దేహ లోహ వేధల కుపయుక్తమగు రసమును సద్యోమరణమున భస్మీకరించునట్టివి లోకమున ముప్పది రెండే కలవఁట.

"రక్తస్నుహీ సోమలతా రుదంతీ కృష్ణ చిత్రకమ్"

నాలుగు పలకల యెట్టి జెముడు, చంద్రకళలతో వృద్ధిక్షీణములఁ జెందు సోమలతయు, నడవిసెనగయు, నల్లని చిత్రమూలము మొదలగు ముప్పది రెండింటి లక్షణములుఁ బ్రయోగములు నిందుఁ గలవు.

సిద్ధరసార్ణవము రససాధనమును లోహసాధనమును రసాయనౌషధ కరణ సేవాక్రమమును విస్తరముగా నెఱింగించు సంగ్రహ గ్రంథము. దీని నతి నిపుణముగాఁ బరీక్షించిన రసతత్త్వమంతయుఁ దెల్లమగు. ఇందునిప్పును జూచిన నావిరియై పోవు రసమునకు రసాగ్నుల రెంటికిఁ బరమమిత్రమగు కాంచన మును నిత్యద్రవరూపమునకుఁ దెచ్చి సోమానల యంత్రమున రసకాంచనములఁ బొసఁగించినచో నగ్నికి రసము పాఱకుండునని సూత్రరూపముగా నొకయంశము చెప్పఁబడినది. ఇట్లే రసవాదవిద్యకు మూలభూతముగ సకల ధాతులోహముల కును రాగములు (Units of Energy which radiates light) గల వనియు వేనివేని కెన్ని గలవో వివరించి యొకదాని నుండి మఱియొకటికి రాగ ములు మార్చు తెఱంగు చెప్పి లక్షరాగములు గల రసమునకు వజ్రాదిధాతువుల రాగ సంఖ్య నెక్కించి "సారణ" యను మార్గము నుపదేశించి సిద్ధరసమును దేహలోహవేధసిద్ధు లుపయోగింతురని చెప్పఁబడియె. రసరత్నాకరమను పంచ ఖండాత్మకమగు గ్రంథము నిత్యనాథ సిద్ధునిచే రచింపఁబడియె. ఇందు సామాన్యముగా రసలోహధాతువుల స్వరూపమును భస్మీకరణ విధానమును

ప్రథమమగు రసఖండమునఁ జెప్పఁబడియె. ఈ భాగము మాత్రము త్తరదేశమున ముద్రితమయ్యె. రెండవది యగు రసవాద ఖండము 19 ఉపదేశములతో రసమునకుఁ బదునెనిమిది సంస్కారములును, సకలలోహములును, నిత్యద్రవీకరణ విధానములును, భూమిలో నెచ్చటెచ్చటనో లభించు రక్తస్నుహి మొదలగు సిద్ధౌషధుల లక్షణములును, స్వర్ణ ముక్తా ప్రవాళ పద్మరాగకరణ ప్రకారములును, వివరింపఁబడి మనోహరముగా నుండును. రసాయన ఖండము మూఁడవది. దీనిలో దేహమును దీర్ఘ జీవిగా జేసికొనుటకు నౌషధసేవా క్రమములు గలవు. రసేంద్ర ఖండమున బసవరాజీయ చింతామణి గ్రంథములలోని సకల రసలోహధాతు మిశ్రౌషధములఁ జేయు ప్రకారములును నైదవది యగు సిద్ధఖండమున సకల మంత్రములును నింద్రజాల చిత్రౌషధ విషయములును గలవు. ఈ యైదు ఖండములును లభించుచున్నవి. మంథానభైరవతంత్రమను నద్భుత గ్రంథము సంపూర్ణముగా లభింపకున్నను 10 వేల గ్రంథము చిక్కుచున్నది. దీనిలో నమృతీకరణ విశ్రాంతియు రసాయన విశ్రాంతియు ''ఆనందకంద'' మను పేర వెలయుచున్నందున నీ గ్రంథమును రసానందకందమనియు నానందకంద మనియుఁ బేర్కొందురు. మంథానభైరవుఁడు చిరంజీవులగు 32సిద్ధులలో నొక్కఁడని హఠయోగ ప్రదీపికలోఁ బరిగణింపఁబడియె. ఇతఁడు శ్రీశైలప్రాంతమునఁ దపస్సుచేయుచుండఁగా సింహళాధీశ్వరుఁడగు మహేంద్రుఁడు శ్రీముఖములఁ బంపి పిలిపించి సింహళద్వీపమున (అనూరాధపురమున?) గొప్ప ధర్మవైద్యశాల మృగమనుష్య సంపాతమున కనుకూలముగా నిర్మించి దానిపై మంథానభైరవున కధికార మేర్పరచి ప్రతిదినము రోగుల స్థితిఁ బరీక్షించుచుండెనని సింహళ చరిత్రమున నున్నది. కావున నితఁడు క్రీ శ. 200 ప్రాంతములవాఁడు. ఇతని మహాతంత్రము రసవాదమునకు రసాయనమునకు సామాన్య వైద్య లోకమునకును గామధేనువు వంటిది. అత్యద్భుతముగాఁ బ్రక్రియా విషయము సంపూర్ణముగాఁ జెప్పఁబడినది. రసాష్టాదశ సంస్కారములు సకలలోహధాతు స్వరూప మారణములును ఓషధీతత్వములు రసాయన సేవాక్రమములు సిద్ధౌషధులగు సోమలతాదుల సేవాక్రమములు గంధకకల్పాద్యద్భుత రసాయన ప్రయోగములును మనుష్యుని నిత్యచర్యా విధానమును దీర్ఘాయుర్విధానమును కాకిణీస్త్రీకరణోపచార విధియు మొదలగునవి పెక్కులంశములు వివరింపఁబడియున్నవి. ఈ గ్రంథ సహాయములేక సిద్ధరసార్ణవము, రసరత్నాకరము, రససారము,

రసరత్నసముచ్చయము మొదలగు గ్రంథములలోని రహస్యములు పూర్ణముగా నన్వయింపవు.

ధాతువాదము సుమారు వేయిగ్రంథము మాత్రమే లభించు ధాతుకల్ప మను భాగము రుద్రయామళతంత్రము తంజాపుర సరస్వతీ భండారమునను లండన్ నగర గ్రంథ భండారమునను సులభముగా లభించుచున్నది. దీనిలో సకల ధాతువులు ఇంగిలీకము, మనశ్శిల,తాళకము మొదలగువాని చిత్ర ప్రయోగ ములు గలవు. ఖండకాపాలికము (నేత్రచికిత్స) కల్యాణకారకము మొదలగు మంచి ప్రకరణ గ్రంథము లోషధులతోడనే నిత్యకృత్యములకు వలసిన యౌష ధములు చేసికొను మార్గములు వివరింపఁబడినవియుఁ గలవు. సుప్రసిద్ధములగు మహాగ్రంథములఁ జెప్పక విడిచితిమి. ఈ యాయుర్వేద మెనిమిది కాండము లుగా ఋషలు విభజించిరి :

రసేశ్వరంతు ప్రథమం వానస్పత్యం తతఃపరమ్
తృతీయం గుణపాఠాఖ్యం శారీరం తుర్య ముచ్యతే
వ్యాధితత్త్వ పరిజ్ఞానం పంచమం చ రసాయనం
రుజ్నిదానం క్రియాకాండ మాయుర్వేదే ప్రకీర్త్యతే.

అని సూచింపఁబడియె.

## అర్థవేదము— II

అర్థ సంపాదన రక్షణ క్రమముల నుపదేశించునది యర్థవేదము. ఇందు రాజ ధర్మములును అర్థార్జన రక్షణక్రమములును గలసి బ్రహ్మ లక్ష యధ్యాయ ములుగాను, రుద్రుడు 50000, స్కంధుఁడు 25000, ఇంద్రుఁడు 12000, వాల్మీకి 6000, బృహస్పతి 3000, శుక్రుఁడు 1000 అధ్యాయములుగా గ్రంథ ములు రచించిరఁట. భయంకరములగు నీ పెద్ద గ్రంథములు తిన్నఁగా భుజింప నవకాశము చాలని మన కాలము వఱకు రాక నశించిపోయినవి. వీనిని సంగ్ర హించి భారద్వాజుఁడు 700 అధ్యాయములలోను, గౌరశిరుఁడను ముని 500 అధ్యాయములలోను, వ్యాసులు 300 అధ్యాయములుగా నర్థశాస్త్రములు రచించిరఁట. అవియుఁ బైవానిగతియేఁ జెందినవి. అర్థవేదము సంగ్రహ రూపముగాఁ బదునాలుగువేల శ్లోకములతో రచింపఁబడినది. అందుఁ బెక్కు విషయములు నిరూపింపఁబడినవి.

చతుర్దశ సహస్రాణి హ్యర్థవేదః ప్రమాణతః
యత్రై9వాష్టాదశాధ్యాయాః సంతి ప్రత్యక్ష సిద్ధదాః
కల్పాధ్యాయో రసాధ్యాయః ప్రయోగాధ్యాయ ఏవచ
ధాతు ధ్మానక్రియాధ్యాయో రత్నాధ్యాయ స్తదైవచ
త్రపుసీ సజయాధ్యాయో లోహాధ్యాయ స్తతఃపరమ్
మూషామృల్లోణ తగరాధ్యాయో వాదజయ స్తతః
హేమ సంపాదనాధ్యాయః సిద్ధాధ్యాయోఽఖిలార్థదః
మూలికాశోధనాధ్యాయః పుటాధ్యాయో మహత్తరః
నాగాభ్రచంద్రికాధ్యాయో యోగాధ్యాయోఽర్థదాయకః
కాలపాక క్రియాధ్యాయః సంభిన్నాధ్యాయ ఏవచ
విక్రియాకరణాధ్యాయ ఏతే సర్వార్థదాయకాః॥

అనియామళతంత్రమునను న్నది. (ఇందు నాగాభ్రములఁ జంద్రికమను నది దోషము) వీనిలోఁ బెక్కు విషయము లాయుర్వేదమున రసతంత్రమునకుఁ జేర్చుకొనిరి. కావున నర్థవేదముక్షీణించి ధర్మార్థశాస్త్ర రూపములుగా సంగ్రహింపఁబడియె. రెండును నర్థ రక్షణ క్రమమే చెప్పును. అందర్థశాస్త్రమను నామముతోనే రాజనీతి ప్రధానముగాఁ జెప్పఁబడియె. శుక్ర బృహస్పతి విశాలాక్ష బాహుదంతి భీష్మోద్భవ చాణక్య ప్రభృతులు విస్తరముగా రచించిన రాజనీతి శాస్త్రములలో చాణక్యుని కౌటిలీయము మాత్రమే లభించుచున్నది. బార్హస్పత్య సూత్రములని యిటీవల ముద్రితమైనదియు, లఘుచాణక్య సూత్రములను గ్రంథమును సామాన్యములైనవి, యాధునికములని మాయభిప్రాయము. శుక్ర బృహస్పతుల గ్రంథములకు శుక్రనీతి సారమనియు, బార్హస్పత్య నీతిసారమనియు జాణక్యుని కౌటిలీయమునకుఁ గామందకకృత నీతిసారమును సంగ్రహ గ్రంథములు గలవు. ఇవి యన్నియు నాంధ్ర భాషలోఁ బూర్వమే తెనిగింపఁబడియున్నను, మనకు లభింపవయ్యె. 1584 క్రీ. శ. రచింపబడిన తెలుఁగు కామందకము మాత్ర మున్నది. బార్హస్పత్యము రుద్రదేవుఁడు తెనిఁగించెనని తోఁచుచున్నది. ఈ గ్రంథములలోని పద్యములు సుమారు వేయింటిని గూర్చి మడికి సింగన సకలనీతిసమ్మతము రచించెను. (అది ముద్రితమై యాంధ్ర పత్రికా కార్యాలయమున లభించుచున్నది) శుక్రనీతిసారము మూలము ననుసరింపక యథేచ్ఛాఫక్కికముగాఁ గలగూరగంపవలెనున్నది. బార్హస్పత్యమున

గజాశ్వాది శాస్త్రములును, ధనుర్వేదమును గలసియున్నవి. కౌటిలీయము కేవలము రాజనీతిని దెలుపును. ఇది పదునైదధికరణములుగా 180 అధ్యాయములలో రాజవిద్యా వినయ గృహాత్మరణక్షణములును, అధ్యక్షుల విధానమును (దుర్గము, పట్టణములు, కప్పము, సుంకము కోశము శాసనము గోవులు గజాశ్వములు భోజనశాల ముద్ర మొదలగు విషయములపై నధికారు లధ్యక్షులు) వ్యవహార స్వరూపమును, దత్పరిష్కారమును, రాజ్యములో నుండు నంతశ్శత్రుశోధనము, సేవకాది పరిపాలన విధి, ప్రజాసంపత్తును, దేహసంపత్తును, యానాసన సంశ్రయణ ద్వైధీభావసంధి విగ్రహ స్వరూపములును, ప్రజా పురుష సేవా మిత్ర రక్షణవ్యసనము, దండయాత్రా క్రమము, యుద్ధప్రకారము, సంఘవిధియు బలవజ్జయోపాయక్రమము, దుర్గలాభోపాయము, ఇంద్రజాల మాయాక్రమములును వరుసగా వివరింపఁబడినని. దీనిపైఁ బ్రభామతియను భౌద్ధభిక్షువు చాణక్య టీకయు, శంకరాచార్యులు జయమంగళయు, మాధవమిశ్రయజ్వ నయచంద్రికయు, భట్టస్వామి ప్రతిపదపంచికయు వ్యాఖ్యానములుగా రచించిరి. వానిలో గొంతకొంత భాగములు లభించుచున్నవి. భిక్షుమాధవుల వ్యాఖ్యానములు మంచివి. భట్టస్వామిది హీనరచనము. అయినను దీనిని ద్రవిడులును గేరళులును దమతమ భాషలోనికి ననువదించుకొనిరి. (ఇన్ని వ్యాఖ్యలతోఁ గౌటిలీయము నాంధ్రీకరింపమాకునభిలాషయుఁ జాపల్యముఁ గలుగఁగా నేదో యొక రీతిగా దాని నడపుచున్నారము). ఆంధ్ర భాషలోఁ గేవలము కావ్యము మాత్రమే వృద్ధి పఱచి తక్కిన వాఙ్మయాంగముల నాంధ్రులు వర్జించిరని పెక్కండ్రు తలంచుచున్నారు. ఆంధ్రులకెల్ల గీర్వాణభాషయుఁ దెనుఁగున గ్రాంథికభాషయుఁ దుల్యస్థానములైయున్నందున వస్తు నిర్వచన నిష్కృష్టికిని బహుదేశవ్యాప్తికి ననుకూలమగు సంస్కృతమును విషయ పరిశోధన ధర్మతత్త్వ నిరూపణములకు సాధకభాషగాను, హృదయమును గరఁగించు రసభావములఁ బ్రత్యక్షపాంచాలాది రీతుల నెత్తిచూపి చదివించుట కనుకూలమగు మాతృభాష యగు తెనుఁగును గావ్యభాషగాను మనవా రాదరించిరి. అయినను మనుమంచిభట్టు, గోకర్ణుఁడు, మల్లన్న, యెల్లన్న, దామరాజు సోమన్న, గోవిందన్న మొదలగు వారు క్రమముగా హయ గణిత భరత సంగీత శాస్త్రములును శకుంతలాపరిణయ కర్తయగు కృష్ణకవి ధనుర్విద్యా విలాసమును రచించియున్నారు. 1400 క్రీ. శకమునకుఁ బూర్వమే యర్థశాస్త్ర ప్రబంధములు తెనిఁగింపఁబడియె. చాణక్య

సప్తతిని భద్రభూపాలుఁడు నీతిశాస్త్రముక్తావళి పేరను, బార్హస్పత్యమును రుద్ర దేవుఁడు నీతిసారమను పేరను, శివదేవయ్య పురుషార్థసారమనియు రచించినవి గాక నీతిభూషణము, (ఆంధ్రక్షేమేంద్రుని) ముద్రామాత్యము, నీతి తారావళి మొదలగునవియు నుండినవి.

## ధనుర్వేదము – III

ధనుశ్శబ్దము వింటికి రూఢమైనను ముక్తము, అముక్తము, ముక్తా ముక్తము, యంత్రయుక్తము-అనుచతుర్విధ ప్రహరణముల వర్తించుచు ధనుర్వే దము శత్రు దండ రూపమగు సమస్త ప్రయోగ సామగ్రి తత్త్వమును ప్రతి పాదించును. అది యిరువది వేల శ్లోకములతో నీశాన సంహిత యను పేరుతో శివునిచేఁ బార్వతి కుపదేశింపఁబడియె. అందు:

వింశత్సహస్రమానస్తు ధనుర్వేదోఽపి కీర్తితః
యస్మిన్ నిగద్యతే సర్వలోకతత్త్వం వరాననే
బలాపాదన[1]కాధ్యాయః స్థానా[2]ధ్యాయః ప్రవర్తనమ్[3]
భౌతికాపాద[4]నాధ్యాయః సంధివిక్షేపణం[5]తథా
ఆశ్రమోజ్జీవనో[6]ధ్యాయః శ్రమప్రాప్తేర్హి లక్షణమ్
ఆయుధ గ్రహణం శిక్షాక్రమ స్తత్పరిశీలనమ్
సన్నాహ స్థాన చలన మపసవ్యస్థితిక్రమః
ఆశ్లేషావాంతరాలంబ హస్తాటన పటుక్రియా
ముష్టిబంధ స్థానబంధో ధృష్టాతాపాదనం తథా
సంగ్రామ విద్యా విజ్ఞానం సర్వాయుధ విలంబనమ్
సూత్రాధ్యాయః పరీక్షాచ పాదపాయూపఘట్టనమ్
రథాశ్వేభాద్యవస్థాన లక్షణాధ్యాయ ఏవచ
(విలుంటనం మోటనం చ భ్రమణం పరిశీలనమ్
ఆయుర్జ్ఞానం మోహనంచ భిన్న ముల్లాసితం తథా)
చాపాది లక్షణ జ్ఞాన మస్త్రాణాం కరణం తథా
అస్త్ర మంత్ర పరిజ్ఞానాధ్యాయో, మదవినిర్గమః
ఏవమాద్యా ధనుర్వేదే విద్యాః సంతి సహస్రశః.

అను నిరువది తొమ్మిది యంశములు వి స్తరింపఁబడియె. ధనుర్వేద సూత్రములు పరశురామకృతములై శాండిల్య భాష్య వివృతములై కేరళ దేశమున లభించుచున్నవని తెలియుచున్నది. ఇది నాలుగు పాదములు గలది. ప్రథమము దీక్షాపాదము, రెండవది సంగ్రహపాదము, మూఁడవది సిద్ధిపాదము, నాల్గవది ప్రయోగపాదము. ధనుశ్శబ్దము సర్వప్రహరణముల వర్తించు. అది ముక్తాది చతుర్భేదకము. ముక్తమనఁగాఁ జక్ర వజ్ర వలయ శక్తి తోమర కుంత పాషాణాదికము. అముక్తమనఁగా నంకుశ పాశ క్షురికా అసి గదా ముసల దండాదికము. ముక్తాముక్తమనఁ బాశ వాగురా రజ్జు వలయాదికము. యంత్ర ముక్తమనఁ జాప శతఘ్ని శల్యక మంజూషార్క వర్ణాదికము. మన శాస్త్రాను సారముగా సర్వశస్త్రములలో ధనువు శ్రేష్ఠము. వింటి యంగములు బాణము అర్ధచంద్రము, శిలీముఖము, నారాచము, మోచకము మొదలగునవి. అస్త్రము మంత్రాక్షర ప్రతిలోమ పఠితమై యధిదైవత ప్రేరితమై యుండును. మంత్ర దేవతా భేదముల ననుసరించి బ్రాహ్మము, ప్రాజాపత్యము, వైష్ణవము, శైవము, ఐంద్రము, వారుణము, ఆగ్నేయము, వాయవ్యము, సౌమ్యము (చంద్ర దైవతకము), ఆదిత్యము, దౌర్గము (దుర్గాదైవతకము), గాణేశ్వరము (వినాయకాధి దైవతకము), స్కాందము, శాక్తేయము, యాక్షము, రాక్షసము, నాగము, గారుడము, గాంధ ర్వము, పైశాచము, పైత్రము (పితృదైవతకము), పార్థివము, ఆప్యము (జలాధి దైవతకము), తైజసము, పావనము, నాభసము (ఈ కడపటి యైదును పంచభూత ముల గ్రమముగా స్తంభింపఁజేయునట), సాముద్రము, పార్వతము, గాయత్రము, త్రైష్టుభమానుష్టుభము మొదలగునవి (కడపటి మూఁడును ఛందోదైవతకములగు మంత్రములు ప్రయోగములుగాఁ గలవి). ఈ యాయుధశిక్ష కధికారులు క్షత్రియు లును బ్రహ్మణులును తదనుయాయులును నగుదురు. రథగజతురగపదాతులే వాని కధికరణములు. ఈ సూత్రపాఠమునఁ బ్రథమ పాదమున ధనుర్వేదాభ్యాసము నకు దీక్షాభిషేకశకున మంగల్య కరణాదికము వివరింపబడియె. రెండవదియగు సంగ్రహపాదమున సకలాస్త్ర శస్త్రముల సంగ్రహ విధియు, మూఁడవదియగు సిద్ధిపాదమున సంగ్రహించిన యస్త్రములకుఁ బునఃపునరభ్యాసమున మంత్ర దేవతానియమ జపహోమోపాసన క్రియలును వి స్తరింపఁబడియె. మంత్రదేవత సకళ యనియు నిష్కళయనియు నిరుదెఱంగులఁ బరుగు. అదియు చేతనా వత్త్వము, ఇచ్ఛావిగ్రహత్వము, యష్టష్యత్యము, తుష్టిమత్త్వము, ఫలదాతృత్వము

అనునైదుగుణములు గలదని పూజాహోమోపాసనాదుల సాధకులు నుడువుదురు. షోడశోపచారములచే సిద్ధదైవతమిచ్చు ఫలదానముచే సాధకుఁ డస్త్రప్రయోగము నొనర్చుట నాల్గవపాదమున విస్తరింపఁబడియె. శస్త్ర గ్రహమునకు ధనుర్వేద మున నియమము గలదు—సామదాన భేదములచే నసాధ్యుఁడయి దుర్వినీతుఁ డగు పురుషునిగాని, బహుప్రజాసంరక్షణార్థము తత్పాతకునిగాని, దేశకాలావస్థో చితముగా గర్తృకరణశక్తి కనుగుణముగా నాపత్కాలమునను, సర్వదా ధర్మ రక్షణమునను దండము విధేయమని శాస్త్రజ్ఞులు గ్రహించిరి.

ఈ ధనుర్వేదమున ముక్తాముక్తాది చతుర్భేదములుగాక నియుద్ధమని పంచమభేదమును తరువాతి శాస్త్రజ్ఞులు గ్రహించిరి. తద్భేదము లన్నియు మల్ల యుద్ధములలోఁ బ్రయోగింపఁబడునవి. నాచన సోమనాథాదులు యుద్ధ ప్రక్రియల నుత్తరహరివంశాదుల వర్ణించియుండుట యెల్లరకు విదితమేగదా.

ధనుర్వేద దైవత స్వరూప మంత్రముల వైశంపాయనుఁడు దనసీతి ప్రకాశికలో నిట్లు వర్ణించుచున్నాఁడు.

"చతుష్పాచ్చ ధనుర్వేదో రక్తవర్ణ శ్చతుర్ముఖః
అష్టబాహు స్త్రిణేత్రశ్చ సాంఖ్యాయనసగోత్రవాన్
వజ్రం ఖడ్గో ధను శ్చక్రం దక్షిణే భుజమండలే
శతఘ్నీచ గదా శూలౌ పట్టిసం వామబాహుషు
ప్రయోగకోటీరయుతో నిత్యాంగో మంత్రి కంచుకః
ఉపసంహారహృదయః శస్త్రాస్త్రోభయకుండలః
అనేక వల్గితాకార భూషణః పింగళేక్షణః
జయమాలాపరివృతో వృషారూఢ స్స ఉచ్యతే.

అని స్వరూప ప్రతిపాదనానంతరము :

తన్మంత్రంచ ప్రవక్ష్యామి వైరిజాల నికృంతనమ్
ఆత్మసైన్య స్వపక్షాణా మాత్మన శ్చాభిరక్షకమ్
ఆదౌ ప్రణవ ముచ్చార్య నమ ఇత్యక్షరే తతః
వతేతి భగపూర్వంతు ధనుర్వేదాయచోచ్చరేత్
మాం రక్ష రక్షే త్యుచ్చార్య మమ శత్రూన్ వధేతిచ
భక్షయేతి ద్విరుచ్చార్య హుంఫట్స్వాహే త్యథోచ్చరేత్
అహమేవ ఋషి శ్చాస్య గాయత్రీ చ్ఛంద ఉచ్యతే

మహేశ్వరో దేవతాస్య పిసిమోగోఽరిని గ్రహే
ద్వాత్రింశద్వర్ణకమనుం పక్షసంఖ్యాసహస్రకైః
జపిత్వా సిద్ధి మాప్నోతి రిపూం శ్చాత్యధితిష్ఠతి.

అని మంత్ర లక్షణము నుపదేశించెను. ముక్తాది భేదములుగాక ధనుర్వేదము మతాంతరముగా

ఆధానంచైవ సంధానం విమోక్షః సంహృతి స్తథా
ధనుర్వేద శ్చతుర్ధేతి వదంతీతి పరే జగుః

అని బాణము నెత్తుటయు ఎక్కువెట్టుటయు తెగగొని యేయుటయు లక్షిభేదము అని నాల్గు క్రియల నుద్ద్యోతించు విభాగములు గలవని కొందరూహింతురు. మఱికొందఱు శస్త్రము, ప్రతిశస్త్రము, అస్త్రము, పరమాస్త్రము అని చతుర్విధముగా విభజించిరి. వసిష్ఠసంహితయు, సారంగధరుని వీరచింతామణి, కోదండచతుర్భుజము, కోదండమండనము, హరిహర చతురంగము, రాజవిజయము, వైశంపాయనుని నీతిప్రకాశికయు నిప్పుడు మనకు లభింపఁగలవు. పరశురామ సంహిత, రాజవిలాసము, భోజుని ధనుస్సంహిత, ఈశానసంహిత, విశ్వామిత్ర సంహిత, లోహార్ణవము, లోహరత్నాకరము మొదలగునవి యుత్సన్నము లయ్యె. సోమేశ్వరుని యభిలషితార్థ చింతామణిలోను, కెళది బసవేంద్రుని శివతత్త్వరత్నాకరమునను, వీరమిత్రోదయభాగ మగు లక్షణ ప్రకాశమున దైవజ్ఞవిలాసమున రాజనీతిఖండమునను, అగ్నిపురాణమునను, విష్ణుధర్మోత్తరమునను, ధనుర్వేదమును గుఱించి విస్తరించు నధ్యాయములు గలవు. ఇవి యన్నియు మనకు లభించునవియే. శుక్రనీతిలో గజాశ్వ రాజనీతి ఖండములు గాక ధనుర్వేదము విస్తరముగాఁ జెప్పఁబడియె అందు యవక్షార గంధకాది మిశ్రితమగు నస్త్రబాణ క్రమములు యంత్రముచ్యములు వర్ణింపఁబడియె. ఖడ్గాది నానాయుధ లక్షణము లద్భుతముగా వివరింపఁబడియె. ఉదాహరణముగా నీవంకఁ జూడఁదగును-ఖడ్గమును బ్రశంసించుచు జమదగ్నికి శుక్రాచార్యుడు:-

అసిరేవ పదం శస్త్రం స్వహస్తే నిత్యకోఽక్షయమ్
అమోఘాకారి సదృశం సర్వశత్రుక్షయప్రదమ్
ఉత్తానేవాథ కుబ్జేవా బలేనాభిగతేఽపి వా
సంవిష్టే చోపవిష్టేచ ఖడ్గ ఏవ పరాయణమ్
సంకటేచ విషమే గిరిదుర్గే నిమ్నగర్త సికతాస్థగితేవా

కంటకద్రుమవృతేఽపిచ దేశేఖడ్గ ఏవ శరణం జమదగ్నే
క్షితౌ రథే వాజిని కుంజరేవా గృహే ద్రుమే నాగరకే ప్రమాదే
సర్వత్ర సర్వస్యచ భార్గవేంద్ర పరాయణం స్యాదసిరేవ నిత్యమ్
ధను రిహ శరపాతా దేవ వై హంతి శత్రూన్
దహతి రిపుసమూహం వాజివహ్ని ర్జవేన,
సుభట కరగతస్తు క్షిప్ర మభ్యాసమాత్రే
శమయతి రిపుసేనాం పాతయోగేన ఖడ్గః
మతంగజస్థో రథ వాజిగోవా శరక్షయే శస్త్రగణక్షయే చ
సమస్థితోవా విషమస్థితోవా నరోఽసినామర్దయతీహ సర్వాన్

అని సంగ్రహ శ్లోకములు పఠించెదు. గదను వర్ణించుచు, ''గదాలక్షణం వక్ష్యతే సమాహితో నిబోధ తత్ర పంచాశదంగుళాయామా శ్రేష్ఠా, చత్వారింశ దంగుళాయమా మధ్యమా, త్రింశదంగుళాయామా నికృష్టా భవేదితి త్రివిధా గదా బుధై రుపదిష్టా, పలావాంసహస్రన ముత్తమాయా శతాన్యష్టౌ మధ్యమాయా షట్శతాని కనిష్ఠాయా ఇతి గదాయాః త్రివిధం గౌరవం భవతి. యస్తు బలదర్పితః సమర్థాగౌరవో దేవదేవవరాధిష్ఠితః ఏతాం గృహ్ణాతి తస్య ముక్తస్యచ దోషాః సంభవేయుః. తథా గదా లఘీయసీ భవతి న సా సంగ్రామే యుద్ధవిశారదైః ప్రశస్యతే. తస్మాత్సమా సర్వేషాం ప్రశస్తా భవతి. యా హి ప్రతిచారే ప్రహారే చారికాసుర సంచారమోక్షా సమేత్యభిధీయతే, త్ర్యస్త్రావృతాశ్రిర్వా సుగాత్రా వ్రణరహితా సువిహితా ప్రియదర్శనా కర్తవ్యా, గ్రహే (పిడి) దశాంగులాయామో దశాంగుల పరిణాహశ్చ త్రయాణాం పురుషాణామ్ మూలతః సుద్రవ్యాణి పద్మగర్భోపమా పూర్ణచంద్రోపమా వాగ్ర హమూలం చిత్రజ్ఞైశ్చిత్రితం భవతి. స్థూలాగ్రా విశిష్టా చతురస్రా మధ్యమా, తాలమూలాకృతి ర్నికృష్టా భవతి. తప్తకాంచన పద్మైర్వా బహుచిత్రరూపై ర్మూలమధ్యాగ్ర బంధనై ర్విచిత్రీకృతా గదా శ్రేష్ఠా భవతి సర్వశస్త్రేషు. సాహి క్రియావిధౌ వపుష్మత్త్వా ద్బలవత్త్వాచ్చ సుఖయోగా భవతి. నానాచిత్రై రలంకృతా సర్వేభ్యః శస్త్రేభ్య శ్చాక్షయ్యా. సాహి గదా శస్త్రజ్ఞైరాయుధవరే త్యభిధీయతే.

గదను గురించి రాజవిజయమున సంగ్రహముగా:-

పంచాశదంగులో దండో దలేష్వర్కాంగుళా గదా
దళాని షోడశైవ స్యుః కలశోఽంగుళిమాత్రకః

అని సంగ్రహింపబడియె.

శుక్రనీతిలో శక్తి యను నాయుధమునకు లక్షణ మిట్లు చెప్పఁబడినది :

''వత్స జమదగ్ని శృణు యన్మాం త్వం పరిపృచ్ఛసి. ఉత్తమా మధ్యమా కనిష్ఠా చేతి త్రిసః శక్తయో భవంతి. తాసాం దండశ్చ తుర్విధో వైణవః దారు మయోదండమయ ఆయసశ్చేతి. సుస్నిగ్ధత్వం నిర్వ్రణత్వం పూజితత్వం చేతి దండగుణాః స్యుః. తాసు పంచహస్తా ఉత్తమా,మధ్యమా ద్వివిత స్తిహీనా, త్రివి త స్తిహీనా త్వధమా భవతి. తాసాం కక్షద్వయోపఘటిత లక్షణ ముభయతః ఫలద్వయభవ (ఫలమనఁగా ఖడ్గపురేకు) హస్తమాత్ర మతితీక్ష్ణం కాయభేదేన సమర్థ మతిఘనం తచ్చ నిస్త్రీం శాకారం కార్యం సంక్షిప్త మధ్యభాగం భవతి. తచ్చ ద్వివిధం మూలయుక్తం మూలాశ్రితముఖయుక్తం చేతి. తచ్చ దండే పత్ర భాగాది చిత్రాన్వితం నాగబంధై ర్బధ్నీ యాత్. అథోత్తమాయా శ్శక్తేః ఫలాగ్రేణ శతపల వర్ధితం గౌరవం భవతి. మధ్యమాయా స్త్వశీతిపలమ్. కనిష్ఠాయాః షష్టిపల మితి శక్తి లక్షణ ముక్తమ్.

ఈ యుదాహరణ ధోరణి గనుగొన్న శుక్రనీతి మూలగ్రంథ మంతయుఁ బ్రాకృతముననో మాగధీ భాషనో గాథారూపమున రచియింపఁ బడియుండునని తోఁచుచున్నది. పైపంక్తులలోని యర్థచ్ఛేదమును గమనించి మాగధికి మార్చినచో సులభముగా గాథారూపము చెందుచున్నది. గాథ యనఁగాఁ బ్రాకృత మాగధీ భాషలలో నార్యావృత్తమువంటిది. ఇది కందపద్యమునందలి రెండవ నాల్గవ పాదములకొనలో రెండుమూడు మాత్రలు తగ్గినట్టి యొకానొక జాతి పద్యము.

## గాంధర్వ వేదము - IV

ధర్మసంరక్షణ వ్యాజంబున లోభకౌటిల్యంబులె నీతిపథంబులని యుప దేశించి పితృ పుత్ర భ్రాతృ మిత్రులయందేని విశ్వాసంబు చొనుపనీయక శత్రు భావంబు నెలకొల్పి కఠోర హృదయులం గావించు నర్థశాస్త్రంబుగాని, జుగుప్సా భాషణంబును నిత్యసన్నిపాత గ్రస్తంబును నగు నియ్యొడలు పంజరమును బలె దెఱచిచూపి సౌందర్యాభిమానంబులఁ బాయఁ బెట్టించి వీతరాగులం జేయు నాయుర్వేదంబుగాని, చతురుపాయములలో దండంబ పరమక్షేమకర మనియు, సకలపాతక సంహారకము ("రణరంగ జయం బఖిల దోష రాశిం గడుగున్") అనియు నేర్పి ప్రజ్ఞా దేవ ధన సర్వస్వంబు మంటను నీటను గలిపింపఁజాలి మహామారి కంటెను వేయింతలు వికట భీషణ వేషంబునం

ప్రజ్వలించు ధనుర్వేదంబుగాని, దర్శనీయ శైలారోద్యానంబుల నేకాంత సుఖసంపదను పరమశివుచే నపెచ్చిన్నానురాగ భావబంధురంబుగ నుపదేశంబు నెందిన పార్వతీదేవికి సుకుమార కళయై, నందనవన సౌరభంబులకు సహచారంబుఁ గల్పించి దేవేంద్రు కొలువులోని మహర్షులనయితము సాలభంజికలవలె బొమలెత్తి నిలుపంజాలిన యూర్వశీ ప్రభృతులను ముల్లోకంబుల విజయించి తెచ్చుమచ్చుమందునై, మురళీ నినాద మధురంబగు యమునా సైకతంబునఁ గృష్ణుని భువనమోహన రూపంబు చూచుచు ఱెమెత్తి మదనోన్మాద మదవిభ్రమంబుల శుకాదులనైన భ్రమింపఁజేయు నాడిన గోపికాజనంబునకు జీవనామృతంబునునైన గాంధర్వవేదమున కీడురాఁగలవని యెవ్వరు తలంతురు? ఇట్టి గాంధర్వంబు నృత్తగీత వాద్య భేదంబుల మూఁడు తెఱంగుల భరత నారదాది బహుప్రస్థాన విస్తీర్ణమై సౌరాష్ట్ర మాళవ లాట కాశ్మీర కర్ణాటాంధ్ర మగధ వంగోత్కల ద్రవిడ రాజులచేతనె యుపలాలితంబై పరరాజ ధాటికి నిలువఁజాలక స్వస్వరూప విశేషంబులం బాసి శాస్త్ర మొక్కపథమున, నభ్యాసము వేఱొక్క త్రోవను, ఉపదేశము మఱియొక్క మార్గమునను బాఱుచుండఁ బవిత్రమగు గంగా ప్రవాహంబువోలె త్రిపథగా ప్రభావంబై రానురాను నిమ్నపదవిం ద్రొక్కుచుఁ బాతాళమున నడుగంటుచున్నది. అహో భారతీ దుర్విలాసము. యామళాష్టకతంత్రము-

గాంధర్వవేదః షట్త్రింశత్సహస్రగ్రంథ సమ్మితః
యత్ర సప్తస్వరోత్పత్తి కథనం పరికీర్త్యతే
వీణాతంత్రం కలాతంత్రం రాగతంత్ర మనుత్తమమ్
మిశ్రతంత్రం తాళతంత్రం గీతికాతంత్ర మేవచ
లాసికోల్లాసికాతంత్రం మేళతంత్రం మహత్తరమ్
జాతిగ్రహలయస్థానం మార్గాంగ ప్రక్రియా క్రియా
కాలజ్ఞానం వాద్య వల్లీ త్రిభిన్నాధ్యాయ ఏవచ
తురంగరతి సారంగ సింహలీలా విజృంభణమ్
అంగహార ప్రవిక్షేపాధ్యాయ స్సంక్షోభణక్రియా
ఏవమాదీని గాంధర్వవేదే సంతి సహస్రశః.

అని 36000 శ్లోక పరిమితిగల యుమామహేశ్వరసంహిత సూచింపఁబడియె. (తంత్రమనఁగా విద్య. షష్టితంత్రమనఁగా నఱువది విషయములు విశదీకరింపఁబడిన సాంఖ్యశాస్త్రము)

తంత్రములని చెప్పఁబడిన వానిలో శైవ, వైష్ణవ, పాశుపత, వైఖానస, శాక్తేయ, యామళాదితంత్రములు పెక్కులు గలవు. వానిలోఁ బరస్పర మతభేదములు గలవు. తంత్రములలో సకల విద్యా ప్రశంసలు వచ్చుచుండును. గాంధర్వము శైవశాక్తేయ యామళతంత్రములలో సాధారణముగా వర్ణింపఁబడి నృత్తగీత వాద్యములలో గొన్నిటికిఁ బ్రాముఖ్యము చూపఁబడును. యామళతంత్రములు ముప్పది రెండింటిలో—

ఏకోనవింశం వీణాఖ్యతంత్రం లక్షప్రమాణకమ్
నాదబ్రహ్మానందసిద్ధి ర్యేన సిద్ధ్యతి వైనృణామ్
నిషాదాదిస్వరోత్పత్తి ర్గీతోత్పత్తేర్హి లక్షణమ్
రాగాణాం భేదకథనం రాగకాలానుకీర్తనమ్
ధ్వని ప్రభేద కథనం మిశ్రామిశ్రావబర్హణమ్
తాలశ్రుతిలయాదీనా ముద్భవ శ్చోపవర్ణనమ్
చతుర్విధానాం వీణానాం లక్షణం తంత్ర (?) లక్షణమ్
కిన్నరస్వరయంత్రాది లక్షణం మేళలక్షణమ్

(కిన్నెర, స్వరమండలము అనునవి వీణలు)

షడ్గీతాది ప్రకథన ముత్పత్తి స్థాన వర్ణనమ్
ఏవమాదీని కీర్త్యంతే యస్మిన్ తంత్రే సహస్రశః.

అని పందొమ్మిదవదియగు వీణాతంత్రము లక్షగ్రంథ పరిమితమై సంగీతశాస్త్రము సంపూర్ణముగా వివరింపఁబడిన గ్రంథమఁట. తొమ్మిదవదియగు కళాసారతంత్రమున రసభావ నాట్యనాటక లక్షణ కామశాస్త్రాది విషయములు గలవందురు. పదునెనిమిదవది కుండీశ్వరతంత్రము—

అష్టాదశం లక్షమానం కుండీశ్వరమతాహ్వయమ్
యత్రానేకవిధానాంతు విద్యానా ముపవర్ణనమ్
నానా నాటక విద్యానా మలంకారానువర్ణనమ్
సంగ్రామవిద్యా బేతాళవిద్యా లోకాద్భుతా మహా
సూదవిద్యాచ గాంధర్వవిద్యాశ్చర్యవిధాయినీ
వీణావేణుమృదంగానాం తాళన ర్తనయోరపి

విద్యా సంగీతవిద్యాచ సర్వస్రోత్రమనోహరా
చిత్రకర్మకరీ  న్యా చిత్రార్థస్య విధాయినీ
చిత్రాభాసా లేఖనికావిద్యా దృశ్య విధాయినీ
రసవాదకరీ విద్యా విద్యా ధాతుజయాపహా
పరకాయావేశకరీ సర్వాశ్చర్యవిధాయినీ
నానావిధానాం గంధానా మాకర్షణవిధాయినీ
జనయిత్రీ నరాంగేషు విద్యా సంమోహకారిణీ
ఏవమాద్యా మహావిద్యాః కథ్యంతే యత్ర కోటిశః.

అని యందు గాంధర్వ చిత్రలేఖన మాయేంద్రజాల విద్యలు గలవఁట.

ఇరువదెనిమిదవ స్రోతాళ తంత్రమున-
"స్రోతాళ నామకం తంత్ర మష్టావింశం సలక్షకమ్
యస్మిన్ భరతసర్వస్వం సాక్షాచ్ఛివముఖోద్గతమ్
లక్షణం తాళభేదానా మంగుళోన్మాన లక్షణమ్
మార్గక్రియాంగజాతీనాం కలాగ్రహలయోద్భవః
ధ్రువాది సప్తతాళానాం తద్భేదానాం చ లక్షణమ్
వైనాయకానా మైళానాం వాగ్భవానాంచ లక్షణమ్
అన్యేషాం తాళకోటీనాం దేశీయానాం చ లక్షణమ్
చచ్చత్పుటాది తాళానాం శివాగమభువాం తథా
విధా త్రిభిన్నలీలానాం యస్మిన్ తంత్రే ప్రకీర్త్యతే.

అని నాట్య తాళ విషయములు మాత్రమే లక్షగ్రంథమున వర్ణింపఁబడెనఁట. ఈ తంత్రగ్రంథము లేవియు మనకు లభింపవయ్యె. అనుదినము చిత్ర విచిత్రములుగా నతిప్రాచీన గ్రంథములు లభించుచున్న మనకివియెల్ల నబద్ధ పంచాంగములోని వర్జ్యములని తలంచుసాహసము జనింపఁజాలదు. శాక్తేయ తంత్రములలో నుడ్డీశమహోదయమను గ్రంథమున శివపూజా షట్టమున వాద్యలక్షణము లానుషంగికముగా వర్ణింపఁబడియుండుట మనకు లభించుచున్నది. అందు-

ప్రథమం తాళనిలయం ద్వితీయం ఝల్లరీ తథా
పంచమం భేరి విజ్ఞానం షష్ఠంతు తిమిలా తథా
సప్తమంతు హుడుక్కాచ తథాష్టమ మిడిక్కనా

నవమం డమరుకం చైవ దశమం ముురవం తథా
ఆలావణి స్తథా వాద్యం త్రయోదశ మతఃపరమ్
చతుర్దశంచ సంప్రోక్తం జ్ఞేయం సంరావహ స్తకమ్
పంచాదశక ముద్యంతా విద్యాద్ఘోషవతీ తథా
షోడశం బ్రహ్మకంకాళ మేతై రధ్యాయషోడశైః
క్రమేణ వాద్య విజ్ఞానం విస్తరేణ వదామి తే

అని పదునాఱు వాద్య లక్షణములు పదునాఱధ్యాయముల నిప్పుడు లభించు చున్నవి. అవి తంత్రము నడుమ వచ్చుచున్నవి. గ్రంథకర్త యొకటికి విస్తరముగా దత్కరణ ప్రయోగ విధుల నిచ్చియున్నాఁడు.

జర్ఝరి నాఱు తెగలుగా వర్ణించి-
ఇతి పరమ విధానం విస్తృతం జర్ఝరీణాం
ప్రతి ఖలు వివిధానాం వాద్య భేదాన్ నిశమ్య
నరపతినిలయే వా దేవగేహే మనుష్యే
సురముని హితవాద్యం విశ్రుతో మంగలోఽయమ్.

అని నారద మతానుసారమని ముగింపఁబడియె. ఇట్లే తంత్రములు లేకుండెనని చెప్పుట సాహసము. గాంధర్వ విద్యలోఁ బ్రస్థానములు పెక్కులు గలవు.

"సదాశివస్య శివయోః గౌర్యా మతం వాసుకేః వాగ్దేవ్యా అపి నారదస్యచ మునేః కుంభోద్భవవ్యాసయోః శిష్యాణాం భరతస్య"

అని నందికేశ్వర ఉమామహేశ్వర వాసుకి సరస్వతీ నారదాగస్త్య వ్యాస మతములు గలవని శారదా తనయుఁడు పేర్కొనియె. ప్రస్థాన భేదములుగా- నందీశ్వర దుర్గా యాష్టిక దత్తిల నారద భరత మతము లాఱును మనకుఁ గొంత తెలియుచున్నవి. నందీశ్వరసంహిత 350 సంవత్సరములకుఁ బూర్వము తంజాపురీ రఘునాథుని పజ్జకు లభించియుండె, నేఁడు గానరాదు. దానిలోని సారమగ్గు (ఔమాపతము) భరత నారదాది మతములకు విలక్షణముగా నున్నది. ఆ రఘునాథుఁడు సంగీత సుధలో-

సమీక్ష్య నందీశ్వర సంహితాం తా మాలోక్య శాస్త్రం భరతప్రణీతమ్
గ్రంథం బృహద్దేశ్యభిధం మతంగ మునిప్రణీతం నిపుణంవిలోక్య
విచార్యతాం యాష్టిక సంహితాంచ జ్ఞాత్వాంజనానందన సంహితాంచ

ఉమాపతే రాధునికస్య తంత్ర ముద్వీక్ష్య నందీశమతానుసారి
సంగీతసారం సమవేక్ష్య విద్యారణ్యాభిధశ్రీచరణప్రణీతమ్
నిశమ్య సంగీతక చంద్రికాఖ్యాం కృతించ భట్టాదిమ మాధవస్య
శ్రీశార్ఙ్గ దేవేన కృతాంచ సప్తాధ్యాయీం తథా లక్ష విరోధిలక్ష్యామ్
(సప్తాధ్యాయీతి సంగీత రత్నాకరః)

ఏనాం స్ఫుటీకర్తు మిహ ప్రవృత్తౌ తౌ బ్రాహ్మణౌ కేశవకల్లినాథౌ
టీకాద్వయేనాపి కృతా న తాభ్యా మలోడితాః స్పష్ట పదార్థభేదాః.

అని నందీశమతమున కుమాపతి (1350 క్రీ.శ.) రచితమగు నౌమాపతము సంగ్రహరూపమని యేర్పడును. ఇది 40 అధ్యాయములలో నతి సంగ్రహ విషయకముగా లభించుచున్నది. పై సుధలోఁ బేర్కొన్న మతంగుఁడు బృహద్దేశియను నద్భుత గ్రంథమును రచించెను. దానిలో 6 పరిచ్ఛేదములుగా 3500 గ్రంథము గల భాగము మాత్రమే యనంతశయనమున లభించుచున్నది. అందు స్వరోత్పత్తి శ్రుతిభేదముల నిర్ణయము మాత్రము కలదు. శిష్ట భాగము లభించునేని లోకమునకుఁ జాలమేలగు. మతంగుఁడు ప్రాయశః భరతమతానుసారి. యాష్టికమతసారము 200 శ్లోకములలోఁ గానవచ్చుచున్నది. నారద మతమునకు నారదశిక్షయను సామవేద శిక్షగలదు. నారదసంహిత మాకు లభించినది కాదు. బృహన్నారదీయ పురాణమునను నారదోపనిషత్తునను నారద మత సారమీఁబడియె. సంగీతమకరందము నారదప్రోక్తముగా ముద్రింపఁ బడినది. దానిని నారదమత సారముగా నెవ్వఁడో తన్నామమునే రచించి యుండును. ఏలయనఁగా గీతదోషములు వివరించుచు "మహామహేశ్వరేణోక్తః సదోషో గాయకాధమః" (IV పాదము-39 శ్లో) అని మహామహేశ్వరాచార్యాభినవగుప్త (1000 క్రీ.శ.) దగ్గ్రంథకర్త స్మరించుచున్నాఁడు. ఈ గీత దోషములు చక్కఁగా వివరించిన వారు భోజాభినవగుప్తులేయని శారదా తనయుఁడు-

ముదితం చ ద్రుతంచైవ దోషాః సప్తైవ గీతిజాః
ఈదృక్స్వరూపం భోజాద్యైః స్వప్రబంధేషు వర్ణితమ్
భట్టాభినవగుప్తార్యపాదై రేత త్ప్రదర్శితమ్
మయాపి శారదీయాఖ్యే ప్రబంధే సుష్ఠు దర్శితమ్.

అని చెప్పెను. నారదశిక్షకు నాచార్య శుభంకరుఁడు సుందరమైన వ్యాఖ్య రచించె. ఈ రెండును దన్మతమును జక్కఁగా నెఱుఁగుటకు మనకు లభించుచున్నవి. రాగసాగరమను పేర దత్తిల నారద సంవాదరూపముగా నొక గ్రంథము కలదు. అది సుమారు 300 సంవత్సరముల నాఁటిదనియుఁ దన్మతముల వ్యక్తీకరింప నుసామర్థ్యము చాలదనియు మాయభిప్రాయము.

సంగీతరత్నాకరకారుఁడు భరతమతమును సాధారణముగా నవలంబించినను దుర్గా దత్తిల మతములును గొంత గ్రహించె. గీత విభాగమున "శుద్ధాచ భిన్నాచ తథైవ గౌడీ స్యాద్వేసర స్త్వత్ర భవే చ్చతుర్థీ సాధారణీ పంచమికాతు గీతి ర్దుర్గామతజ్ఞైరితి పంచ ధోక్తా.

ఆశ్రిత్య దుర్గామతమేవ సమ్యక్తాః శార్ఙ్గదేవేనతు పంచధోక్తాః
త్రిప్రస్తుతా యాష్టిక సంమతాః స్యుః భాషై వ శార్దూలమతేతు గీతిః

అని రఘునాథుఁడు వివిధ మతములు చెప్పి శార్ఙ్గదేవుఁడు దుర్గామతమును గ్రహించెనని తన దశధావిభాగమును నెలకొల్పెను. శార్దూలమతమనఁగాఁ గోహళీయమతమునకు నామము. కోహళుఁడును శార్దూలమునియు సంవాదము సలిపినట్లె కోహళీయము నడచుచున్నది.

పై మతములలో నెల్లఁ గాలపరీక్షకు నిలిచి విద్వాంసులు చేయాడినది భరత ప్రస్థానమే. బ్రహ్మవలన భరతుండెఱింగి గాంధర్వమంశయు నృత్తగీత వాద్య విభాగముగా రెండు గ్రంథముల ద్వాదశసహస్ర గ్రంథముగాఁ బెద్ద దొక్కటియు షట్సహస్రియను చిన్న దొక్కటియు రచించె. అందు పెద్దది యిప్పుడు కానరాదు. శారదా తనయుడు—

"నాట్యవేదాచ్చ భరతాః సారముద్ధృత్య సర్వతః
సంగ్రహం సంప్రయోగార్థం మనునా ప్రార్థితం వ్యధుః
ఏకం ద్వాదశ సాహస్రైః శ్లోకై రేకం తదర్ధతః
షడ్భిః శ్లోకసహస్రై ర్యో నాట్యవేదస్య సంభవః
భరతై ర్నామత స్తేషాం ప్రఖ్యాతో భరతాహ్వయః''

అని రెండు విధగ్రంథముల నుపయోగించెను. శారదాతనయుఁడు క్రీ. శ. 1150 లో నుండినవాఁడు. క్రీ. శ. 1200 కాలమున నుండిన బహు

రూప మిశ్రుఁడు తన దశరూప వ్యాఖ్యలో-అంకావతారమను సంధి స్వరూప మును వర్ణించుచు-

"సమాప్యమాన ఏకస్మి న్నంకేఽన్యార్థత్వ సూచనమ్
సమాప్యతేహి నాట్యజ్ఞై స్తైస్తై రంకావతార ఇష్యతే"

ఇతి ద్వాదశసహస్రీకారః యథా మాళవికాగ్నిమిత్రే ప్రథమాంకావసానే" అని యుదాహరించినందున 1200 క్రీస్తుశకము వఱకు వృద్ధ భరతము పఠనములలో నుండెనని తోచుచున్నది. భరతశిష్యుఁడు కోహలుఁడు భరతుని గ్రంథమున స్థూలముగాఁ జెప్పఁబడిన పదునొకొండంగములఁ బెంచి యవాంతర భేదసహస్రములు గల్పించి పదుమూఁడు విషయంబులఁ బెద్ద గ్రంథము రచించెనని వ్యాఖ్యాతలు చెప్పుచున్నారు. సుమారు 200 సంవత్సరముల పూర్వము కోహళీయము సంపూర్ణముగా లభించుచుండె. మనకంచు దాళాధ్యాయము మాత్రమే చిక్కినది. భరత కోహళమతము లల్ప భేదములు గలవైనను నేక ప్రస్థాన సమ్మతములు. ప్రాచీనుఁడు నఖకుట్టకాచార్యుఁడు నాట్యశాస్త్రము రచించెనండ్రు.అది యుత్సన్నమయ్యె. బహురూప మిశ్రుఁడు తోటకమను రూపక విశేషమును నాటకములోనంతర్భూతమని "తథా తోట కస్యాపి నఖకుట్టాదిభి ర్నాటకాంతర్భావేనైన లక్షణముక్తమ్, దివ్యమానుషసంయోగ స్తోటకం నాటకానుగమ్ ఇతి నఖకుట్టః" అని యుదాహరించె. ఈ విషయముననే ప్రశంసించుచు శారదాతనయుఁడు "దివ్యమానుష సంయోగో యత్రాంకై రవిదూషకైః తదేవతోటకంభేదో నాటక స్యేతి హర్షవాన్" అని హర్షుని మతము పేర్కొనుటచే హర్ష నఖకుట్టు లొక్కరాయని సందియము కలుగవచ్చును. బ్రహ్మమతమని భరత ప్రస్థానము కంటె బ్రాచీనమైనది యొకటి కలదు. వరరుచికాలమునకు బ్రహ్మమతమేముఖ్యము. భరతుఁడును బ్రహ్మమతము నుదాహరించె.

భరత మతంబె యడుగంటక నిలిచియున్నందునఁ దన్మతావలంబకము లగు గ్రంథములలో గొన్నిటి విచారింతము. భారతీయమునకు రాహుళకుఁడను బౌద్ధుడు (200 క్రీ. శ. 400?) భిన్నవృత్త జాతికమగు కారికారూపముగ నొకవృత్తియు, శ్రీహర్షదేవుఁడు (క్రీ. శ. 400?) ఆర్యాప్రాయముగ నొక కారికయు, భట్ట లొల్లటుఁడును (650 క్రీ. శ.) మయూరుని పుత్రుఁడగు శంకుకుఁడును (670 క్రీ. శ.) కాంచీపతి మహేంద్ర విక్రముని యాస్థానకవి

రత్నము రుద్రటాచార్యుఁడును (621 క్రీ. శ.) ఉద్భటుఁడును (800) ఘంట కుఁడును (?) హృదయదర్పణమనుపేర భట్టనాయకుండును (929 క్రీ. శ.) ప్రౌఢవ్యాఖ్యలు రచించిరి. ఇవియన్నియుఁ జాల భాగము నశించినవి. అభినవ గుప్త (100 క్రీ.శ.) వ్యానదేవ (1020) భాష్యములు మాత్రమే పూర్ణముగా లభించుచున్నవి. భరతుని నాట్య శాస్త్రము సర్వసులభముగా నాబాలగోపాల మర్థమగుచున్నట్లు తోచినను లభించిన వ్యాఖ్యలతోఁ జదివినప్పుడు మాత్రమది సుదుర్గ్రాహ్యమనియుఁ గేవల సంప్రదాయ విద్యమాన బహు ఘట్టకం బనియు, దచ్ఛాస్త్రజ్ఞులకు సైతము స్ఫురింపకమానదు. భారతీయమునఁ గ్రమముగా నాటక రంగస్థల నిర్మాణ క్రమము కరణాంగహార నిరూపణము రసభావ స్వరూపము చతుర్విధాభినయ లక్షణము ఛందోభాషాలంకార రామణీయకము దశరూపకవిధానము భారత్యాది వృత్తిసంధ్యంగతత్త్వము వేషరచనయు పాత్ర పరస్పరోపచార ప్రకారము గీతతాళ ధ్రువాసంమేళన విధియుఁ జక్కఁగా వివరింపఁబడియె. కోహళుఁడు వీనిలో నొక్కొక్కటియుఁ బెంచి యవాంతర భేద ములఁ గూర్చి విస్తరించె. నందికేశ్వరుఁడు వివాహ పట్టాభిషేక దేవతోత్స వాదుల మంగల్యమగు నృత్తసరణి విస్తరించి భిన్నప్రస్థానకముగా భిన్న పరి భాషా బంధురంబుగ రచియించె. ఉదాహరణముగా నంది చెప్పిన ప్రేంఖణము పేరణి కుండలి జక్కిణి శ్యామల దండలతిక మొదలగు పదియు భారతీయ మునఁ గానరావు. ఇవియన్నియు నధునాతన ఫక్కికోద్భూతములని మాయభి ప్రాయము.

"కుండలీ భోగవత్యాంతు కల్పితా మాందకర్ణినా
అయోధ్యాయాం కృతాపూర్వం పేరణి ర్వాయుసూనునా
ఘూర్జరీ ద్వారవత్యాంతు కల్పితా బాణకన్యయా
కాశికాయాః కృతే జాతా మతంగేనైవ జక్కిణీ"

ఇత్యాది లక్షణోత్పత్తియుఁ, జిందును గురించి (చిందులు ద్రొక్కుట యని యాంధ్రభాషా జాతీయము)-

"మృదంగ కరటా కాంస్య తాళకాహళ వాదకైః
వాద్యమానేషు వాద్యేషు ప్రతిప్రహరణాదిషు
రుద్రాక్షాభరణైః శ్లక్ష్ణ తప్తభూతి త్రిపుండ్రకాః
శివైకతత్పరా భక్తా నరా నారీజనోఽథవా

శ్రేణీభూతాః ప్రమోదేన గాయంత శ్చంద్రశేఖరమ్
అంశై ర్యథోచితైః పాదై ర్లాస్యాంగై ర్గతిసంయుతైః
అన్యోన్యాభిముఖీభూయ ద్విధాభూతాః కదాచన
కదాచి న్మండలీభూతా యుక్తిభి ర్బహుభంగిభిః
శివోత్సవేషు కర్తవ్యం నృత్తమేత చ్ఛివప్రియమ్
కరతాళయుతోపేతై ర్వాద్యై ర్వక్త్రభవైః సహ
పాదై ర్లలితలాస్యాంగై శ్చారిభిర్గతిభి స్తథా
గీతాభినయనోపేతైర్ద్విపదై శ్చిందుసంజ్ఞకైః''

''చిందు నృత్తమితి ప్రోక్తమిదం ద్రవిడవల్లభైః'' అన్నట్లు పై లక్షణము చెదరకుండ నాఁడును నేఁడును బాండ్యకవాటకమగు పయణిమల మీఁదఁ గుమారస్వామి యెదుట నాడిపాడిన భక్తజనులకు శివసాయుజ్యము ముహూర్త మాత్రమేని యీఁ జాలిన యీ నృత్త విశేషమును "కళ్యాణకటకే పూర్వం భూత మాతృమహోత్సవే-

''సోమేశః కౌతుకీం కాంచి ద్భిల్లీవేష ముపేయుషీమ్
నృత్యంతీ మథ గాయంతీం స్వయం ప్రేష్య మనోహరమ్
ప్రీతో నిర్మితవాం శ్చిత్రం గొండిలీవిధ మద్భుతమ్
తతో భిల్లీ మహారాష్ట్రై ర్గొండిలీ త్యభిధీయతే''

అనునట్లు చాళుక్య సోమేశ్వరుఁడు (1129 క్రీ. శ.) కల్పించెనన్న గొండ్లి (కుండలీ భేదము) నృత్తమును మొదలుగా నవాంతర భేదములు నంది పరిగ్రహించి వెలయించెనని యూహింపఁదగియున్నది. ఆంధ్రరాజుల సభ లలో నీనవీన ప్రస్థానమే యెక్కువ యాదరింపఁబడియెననుటకుఁ దత్పారి భాషికపదములు వాడుక భాషలో నోట మెదగుచుండుటయె సాక్ష్యము. వాగడము-

పిశాచవానరాదీనాం వేషచేష్టానుకారకమ్
వికృతై రాననోష్ఠాక్షికుక్షివాక్చరణాదిభిః
వితాళం వికృతం నృత్తం హాస్యకృ ద్వికటం విదుః
కైశ్చి ద్వాగడ మిత్యుక్తం హాసకానాం ప్రసిద్ధితః"

అని వికృతచేష్టాసూచకమగు శబ్దమును, పాట, కోలాటము, (వీరరసవ్యంజకము) గొండ్లి, చిందులు మొదలగు పదములు కావ్యములలో సాధారణములయ్యె.

"సర్వంసహాకాంత పేరణము నూప"

"ఉజ్జ్వాఁత లూఁగెడు నుదయా స్తగిరులచే నాకాశలక్ష్మి కోలాట మాడ"

"కమలసంభవుఁడు పెక్కణమొనర్ప" అని సోముఁడును;

"ఎక సక్కెముగ నాడు నేదైన నొకమాట పాడు సొయ్యన పాట పాట పాట"

"ఉఱుమ చప్పుళ్లకును బిళ్లఁ దొరులబ్రోఁత" (జక్కిణిలక్షకము)

"గొంద్లి యాడించుచున్నారు గొరిగ పడుచు"

"మత్తల్లీ మహా నృత్యముల్" అని శ్రీ నాథుఁడును మొదలుగా నెల్లరు గ్రహించిరి.

ఇట్లు గీత నృత్త తాళముల మూఁటను నవనవోన్మేష ప్రతిభా విలాసమునకు భారతీయ మందక పోవుటచే విచిత్ర తాళ పరంపరలును మూఁటి సమ్మేళనమునఁ బ్రబంధ విశేషములును లెక్కలేక జన్మించినవి. కావున భారతీయము కేవలము జ్ఞానాభివృద్ధికే గాని ప్రథమ శిక్ష కుపయోగింపదని తోచుచున్నది. అభినవగుప్త వ్యాఖ్యతో రసభావాధ్యాయ వివరణము మహాప్రౌఢమై విద్వ దాదరణీయమైయున్నది. దానినే యలంకారికులెల్ల సాధారణముగాఁ గొని తమతమ బుద్ధిపై చిత్రిని బ్రకటించిరి. భారతీయామృత సరస్సు నుండి తీసిన పిల్లకాలువల నించుక పరిగణింతము.

గీతస్కంధమున నాగార్జునుని గ్రంథభాగము ప్రాచీనమైనది (క్రీ.శ. 100) లభించుచున్నది. క్రీ. 1000కి దరువాతి గ్రంథములలో నభినవ గుప్తుని భరత వ్యాఖ్య నిరూపమానమై యతిప్రౌఢమై బహుప్రస్థాన పరీక్ష కంబై యున్నది. అతని నాట్యలోచనము లభించినది కాదు. త్రిలోచనుని నాట్య లోచన భాగము దొరకును. పార్థవిజయమను నద్భుత నాటకము రచించిన త్రిలోచనుఁడే దీని రచియించియుండిన నిది రాజశేఖరునకుఁ (900 క్రీ. శ.) బూర్వ గ్రంథమగును. ఇది వృత్తమునే ప్రతిపాదించుచున్నది. క్రీ. శ. 1120 లోఁ బాశ్చాత్య సోమేశుఁడభిలషితార్థచింతామణిలో నృత్తవాద్య ప్రబంధ లక్షణములు విస్తరించి సుష్ఠువుగా విరచించె. 1210 ప్రాంతములఁ ద్రివిధ గాంధర్వముఁ బ్రతిపాదింపఁగల సంగీతరత్నాకరమును శార్ఙ్గదేవుఁడు రచియించె. ఇతఁడు కర్ణాట రాజగు సింగణుని సభలో గాయకరత్నము. దీనిపై సంగీత కౌస్తుభమను నల్ప వ్యాఖ్యయుఁ, గల్లి నాథుని ప్రౌఢ వ్యాఖ్యయుఁ గలవు.

1160 ప్రాంతములఁ గాకతీయ రుద్రదేవుని సభాలంకారమగు పేరభల్లటదేశికుఁడు నాట్యశేఖరము రచించెనఁట. అది యిప్పుడు గానరాదు. నాట్యసంగీత గ్రంథ కారులలోఁ బెక్కండ్రు సన్న్యాసులు శైవాచార్యులు అస్ఖలిత బ్రహ్మచారులు శాక్తేయులు నగుట విచిత్రముగా నున్నది. క్రీ. శ. 1236 ఆనంద వర్షమునం గాకతీయ గణపతి దేవుని గజసైన్యాధిపతియు బావమఱఁదియు నగు జాయ సేనాపతి నృత్తరత్నావళియని యెనిమిది పరిచ్ఛేదముల మార్గ దేశీరీతుల రెంటను నృత్త లక్షణము పూర్ణముగా రచించె. ఇది లభించుచున్నది. 1300 కాలమునఁ బార్శ్వదేవుఁడు జైనకర్ణాటకవి సంగీతసమయసారమున గీత స్కంధమునే మార్గదేశీరీతుల వివరించెను. ఇతఁడు భోజ సోమేశ్వరాదులఁ జాల ననుసరించె. 1230 కాలమున భల్లాళ రాజగు ప్రతాప చక్రవర్తి జగదేక మల్లునిచే సంగీతచూడామణి నృత్త గీతాధ్యాయములు పుష్కలముగాను, వాద్య లక్షణము న్యూనముగాను రచింపఁ బడియె. 1200 (?) కాలమున మగధేశుఁ డగు కుంభకర్ణ నరేంద్రుఁ డద్భుతముగా సంగీతరాజమను పేరఁ ద్రివిధ గాంధర్వమున సన్నిమతములఁ గ్రోడీకరించి 17000 గ్రంథముగాఁ గూర్చెను. అందు 12000 మాత్రము లభించును. కాని నృత్తాధ్యాయము గానరాదు. 1220 (?) కాలమునఁ జాపక్య హరిభూపాలుఁడు సంగీతసుధాకరమును శ్రీరంగ మున నాడు వేశ్యల కొఱకు రచియించిన గీతనృత్తాత్మక లఘు గ్రంథము దొరకును 1340 (?) కాలమున నష్టావధాన విఖ్యాతుఁడగు సోమనార్యుఁడను నాంధ్రుఁడు నాట్యచూడామణియనుపేర గీతనృత్తముల నవీనప్రస్థానకముగా విరచించె. ఇతఁడే నాచన సోముఁడాయని సందియము గలుగుచున్నది. 1360 ప్రాంతమున విద్యారణ్యులు సంగీతసారము రచించిరి. అది ప్రాచీన గ్రంథ ములలోని దోషములను విరోధములను బరిహరించి విలక్షణముగా రచియింపఁ బడియుండునని తెలియుచున్నది.

> ''నిరూపితా లక్షణతో వివిచ్య రాగా శ్చతుఃషష్ట్యధికం శతే ద్వే
> కర్ణాటసింహాసన భాగ్య విద్యారణ్యాభిధ శ్రీచరణాగ్రణిభ్యః''
>
> —సంగీతసుధ

మాకు లభించిన సంగీతసారము లఘువిషయకమై పై లక్షణమందుఁ గానరాకున్నందున విద్యారణ్యుల నిబంధమింకను వెదకవలసియే యున్నది. 1420 కాలమున దేవణభట్టను విద్యానగరాస్థాన పండితుఁడు సంగీతముక్తావళి

యని నృత్తగీతలక్షణముల సామాన్యరూపముగా రచించె. ఆ కాలముననే శ్రీనాథ వామనభట్టాదులకుఁ జేయూఁతయై రసిక సార్వభౌముఁడగు పెద్దకోమటి వేమన సంగీతచింతామణి యను నృత్తగీత లక్షణ గ్రంథము రచించె. అది యిప్పుడు ననంతశయనమున లభించుచున్నది. ఈ కాలముననే రేచెర్లవంశమణి యగు సింగయ్య మాధవేంద్రుని సభాలంకారమగు నాంధ్రకవి గౌరన లక్షణ దీపికయను పేర సంగీతభాగమును జిత్రవిషయకముగాఁ గూర్చినది కలదు. 1350 (?) కాలమున దామిరాజు సోమన భారతీయమంతయుఁ దెనిగించినట్లు కానవచ్చుఁ గాని యది సంపూర్ణముగా లభింపదయ్యె. 1500 (?) ప్రాంతమునఁ గర్ణాట సంగీతమునకు భిన్నప్రస్థానముగా నాసిక ప్రాంతవాసియగు పుండరీక విఠలుఁడు నర్తకనిర్ణయమని నృత్తగీతాధ్యాయముల రమణీయముగాఁ గూర్ప నౌత్తరీయలు దానిఁ జేయూఁతగాఁ గొనిరి. వీణావాదనమున కుపకారిగాఁ గర్ణాట రామరాయల యాస్థాన భూషణమగు రామామాత్యుఁడు స్వరమేళకళానిధియని సంగీత లక్షణమే చక్కఁగా వివరించె. మేళ విషయమున దోష పరిపూరితమని గ్రహించి దీనిని తంజాపుర రఘునాథుని శిష్యుఁడగు వేంకటమఖియను మీమాంసకుఁడు తన చతుర్దండిప్రకాశికలోఁ గఠోరముగాఁ దిట్టినను రామా మాత్యుని మేళలక్షణమే నిర్దిష్టమని సంప్రదాయజ్ఞులు చెప్పుదురు. 1600 కాలమున నహోబలుఁడు సంగీతపారిజాతమనుపేర నిర్దుష్టముగ గీతభాగమును లఘు రూపమున వివరించె. ఇతఁడు రామామాత్యుని మేళలక్షణములను సమర్థించు చుండును.

1620 ప్రాంతమున ''సుజ్ఞానజనకుం''డను బిరుదము వహించిన తంజాపురీ రఘునాథరాజు నాశ్రయించి తత్సభలో సంగీత సాహిత్యముల సామరస్యముఁ జూపి యచ్చరల కేవల గాంధర్వ కౌశలముఁ బరిహసింపఁ జాలు మధురవాణి, రామభద్రాంబ, రంగాజి మొదలగు భోగినీజనుల పుట్టు మైలను గడిచివైచి వారికిఁ గీర్తి సౌరభముఁ దేఁజాలిన గాంధర్వ విద్యాధి దేవత చోళ దేశమును నిజపీఠముగాఁ జేసికొని త్యాగరాజాదుల యపూర్వగీత గమకములకు ననువాదినీ యంత్రముల సైతము స్ఫురిత కంపితములఁ దేలింపఁ జాలెననుట యచ్చెరువు కాదు. అట్టి రఘునాథుఁడు రచించిన సంగీతసుధయను నిరుపమాన గ్రంథములో నాల్గధ్యాయములు మాత్రమే స్వరశ్రుతిరాగ ప్రబంధ లక్షణములు గలవి లభించుచున్నవి. నృత్తతాళాధ్యాయములు లభింపవయ్యె.

శాస్త్రలక్షణ రహస్యములు తెలియఁగోరు వారు దీని జదువక మానరు. ఇందుభిన్న ప్రస్థానముల మతవిశేషములును వివరింపఁబడియె. లక్ష్య లక్షణ విరోధములఁ దీర్చి కృతిరాగ స్వరూపము నొక్కమారు వినినంత మనసులో నాటు కొను నట్లీ రాజకవి యతిస్ఫుటముగా విషయవిమర్శము చేయుచుండును. 1640 లో నితని శిష్యులలో నొక్కఁడగు మహా మీమాంసకుఁడని కీర్తి గన్న వేంకటమఖి తన చతుర్దండిప్రకాశికలో వీణాలక్షణమును శ్రుతి స్వరూప రాగస్వరమేళ నము నూతన ఫక్కిగా విశదీకరించె. రఘునాథ వేంకటమఖు లిరువురు క్రొత్త వీణల సృష్టించి వాడుకలోనికిఁ దెచ్చిరి.

ఓఢ్రదేశపు రాజులు శాస్త్ర సాహిత్యములందేకాక సంగీతమునను గ్రంథ రచన పోషించిరి. భట్టశుభంకరుని నారదశిక్షావ్యాఖ్యయు, నతని సంగీత దామోదరమును, (పర్లాకిమిడి) గజపతి నారాయణ దేవుని సంగీతనారాయణ మును, కలాంకురనిబంధమును, సంగీతసరణియు మొదలగునవి యోఢ్రుల భారతీసేవను బ్రకటించుచున్నవి. ఇవియన్నియు నేకప్రస్థానగాములై చాల లోఁతునకు దిగక సామాన్యముగా గాంధర్వ ప్రక్రియ నెత్తి చెప్పఁజాలు.

ఈ శాస్త్రావతారక్రమము నించుక యవధరించి చూచిన మొదట సౌరాష్ట్రమున జనించి కర్ణాట చాళుక్య రాజుల చల్లఁ జూపులఁ బెరిగి యాంధ్ర రాజులగు కాకతీయ రెడ్డి విద్యానగర తంజాపురీ రాజుల కరావలంబమున సౌభాగ్యము వహించి భావరస గర్భితములగు క్షేత్రయపదాదులకు విచిత్ర వైఖరిం గూర్చు నంధ్రభాషతోడనే యేకసఖీత్వముగన్న గాంధర్వ విద్య యాంధ్రుల గర్వాభిమానములఁ బురికొల్పుననుట యేని యసమంజసము. ఇట్టి దివ్య విద్యను గూర్చి యాకాశ విమానగామి భూమండలము మీఁది పైనునుపుఁ జూపించినట్లు శాస్త్రగహనంబుఁ జొరక వాదజ్వరము సోఁకెనేని ముకుట భంగమగునేమోయని వెఱచుచుఁ బత్రికలో స్థలము సంకోచమయ్యెనని మిష చూపి మాయజ్ఞానమును గప్పిపుచ్చుకొనుటకు మమ్ము విజ్ఞులు క్షమింతురు గాక.

ఈ యుపవేదముల నాలుగింటికి నాలుగంగవేదములు పిల్లలు గలవు.

"ఆయుఃశిల్పం జ్యోతిషాఖ్యో ధాతుద్యోతస్తు వై క్రమాత్"

అందు శిల్ప ధాతుద్యోతముల గురించి మత భేదములును గ్రంథనామ ములును స్థలాంతరమున వివరించెదము.

భారతి, 1923. మా. రామకృష్ణకవి

# 10. ప్రకీర్ణ విషయములు-1

## మల్లినాథుఁడు

ఇతనిగురించి బ్రహ్మశ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిలవారు ఆంధ్ర పత్రిక యుగాది సంచికలో విస్తరించి వ్రాసియుండుట యెల్లరకు విదితము. ఇతని కాలనిర్ణయము సమర్థించుట కనుకూలముగ నితని గ్రంథమొకటి యిటీవల లభించెను. ''వైశ్యవంశసుధార్ణవ'' మను నొక నిబంధన నితడు రచించి, యందుఁ గోమటులకు వణిగ్వైశ్యశబ్దప్రయోగౌచిత్యమును దెలిపి వణిగ్వృత్తి వారల ధర్మమగునో కాదో యను సంశయము శాస్త్రరీతిగా బరిష్కరించి యున్నాఁడు.

కర్ణాటరాజగు వీరప్రతాప ప్రౌఢదేవరాయలు మల్లినాథుని బిలువనంపి కాంచీపురమునుండి తత్రస్థవైశ్యమహాజనశాసనమును దెప్పించి, పైయంశములను బరిష్కరింపుమని ప్రార్థింపఁగా మల్లినాథుఁడా గ్రంథమును సపరిష్కారముగా రచించెనట. ఈ ప్రౌఢదేవరాయఁడు విరూపాక్షుఁడను నామాంతరముగల మహాపండితుఁడు. హరిహరరాయల పుత్రుఁడు. మల్లినాథుఁడు రసార్ణవసుధా కరమును దన వ్యాఖ్యలలో నుదాహరించి యున్నందున దత్కర్తయగు సింగ భూపతి 1400 క్రీ. శకమునకుఁ బూర్వుఁడని యెఱుఁగవలయును. మల్లినాథుఁ డాగ్రంథములో-

> "ప్రారిప్సితస్య గ్రంథస్య నిష్ప్రత్యూహసమాప్తయే
> లక్ష్మీనారాయణ స్యాంఘ్రికంజద్వయ మహం భజే" ఇతి
> మంగళంవిధాయ వాణిజ్యనైర్గాత్యయో ర్వివదమానయో
> ర్వివాదశాంత్యర్థం కాంచీస్థ శాసనోక్తప్రకారేణ వైశ్య
> శబ్దాభిధేయ నాగరవైశ్య నగరేశ్వర దేవతోపాసకత్వం
> తృతీయజాతీయత్వం కాంచీస్థశాసనే యస్య ప్రవర్తతే తస్య
> భవతు నేతరస్యేతి శ్రీమద్రాజాధిరాజ రాజపరమేశ్వర
> శ్రీవీరప్రతాప ప్రౌఢదేవ మహారాయేణ విజ్ఞాపితమ్, ఆజ్ఞాప
> నానంతరం తచ్ఛాసన మానీయ దృష్టమ్, దృష్ట్వా తేనైవ
> విద్యానగర ధర్మాసనప్రకారోఽయమ్ యస్తు వైశ్య......

అని తనశ్లోకములకే తాను వ్యాఖ్యవ్రాయుచుఁ బ్రారంభమున నవతారికఁ గూర్చియున్నందున నితని కాలనిర్ణయము కొంతవరకు స్పష్టమగును. గద్యములో—

ఇతిపదవాక్య ప్రమాణ పారావార పారీణ మహోపాధ్యాయ కొలచర్ల మల్లినాథసూరి విరచితే వైశ్యవంశసుధార్ణవే స్మృతిపురాణేతిహాస నైఘంటుకాది ప్రసిద్ధ వైశ్య వాణిజ్య వణిజ్నాగ రోచజ వైశ్యరత్న కాంచీస్థలశాసనోదాహర ణోపరచిత విద్వజ్జనహృదయానందకమలే చతుర్వర్ణనిర్ణయో నామ దశమోఽధ్యాయః

అని కడపటగలదు. దీనిలో ధర్మపురాణమను నాంధ్ర ద్విపదకావ్యము నుండియుఁ గొన్ని ప్రయోగముల జాత్యాచారములను నిర్ధారించుటకుఁ గొన్ని పంక్తు లుదాహరింపఁబడినవి.

## సర్వజ్ఞ సింగభూపతి

రేచెర్ల వంశస్థులలో నితఁ డెన్నవపురుషుఁడో, యితఁ డేకాలమునం దుండెనో యన్నవిషయమింక స్పష్టముగాఁ దేలినదికాదు. బ్రహ్మశ్రీ చిలుకూరి వీరభద్రరావుగారును, బ్ర॥ వేటూరి ప్రభాకరశాస్త్రులవారును గొంత యభిప్రాయ భేదములను జూపిరి. కవుల చరిత్రకారుల యూహలన్నియు నిరాధారములై పూర్వపక్షితములైనందున నిటీవలి వారి యాధారములఁ బరీక్షించువారల కుపోద్బలముగా నీక్రిందియంశముల నుదాహరించెదను. రసార్ణవసుధాకరమును భారద్వాజగోత్రజుఁడగు విశ్వేశ్వరకవియే రచించి దానికి సింగభూపతి కర్తృత్వ మారోపించెనని చమత్కారచంద్రికలోను రసార్ణవసుధాకరములోను "మమైవ కందర్ప సంభవే" యను వాక్యరత్నమువలనఁ దేలుచున్నది. "సింగభూపాల రచితే రసార్ణవసుధాకరే" యని చమత్కారచంద్రికలో విశ్వేశ్వరకవి దానిఁ బేర్కొనుటచే నారెంటిలో రసార్ణవసుధాకరము పూర్వగ్రంథమని విశదమగు చున్నది. విశ్వేశ్వరకవి యీరెంటినిగాక కందర్పసంభవము, వీరభద్రవిజయము, అనపోతనాయకీయము మొదలగు బహుగ్రంథములు రచించినవాఁడు. ఇతని చమత్కారచంద్రికలోని చక్రబంధోదాహరణపద్యమును సాయణాచార్యుఁడు తారచించిన యలంకారసుధానిధిలో నుదాహరించుటయే కాక ప్రబంధపలయస్థ సంకేతనామములగు "చమత్కారజ్యోత్స్న, విశ్వపతికవి, సింగప్రభుయశః"

అను మాటను 3, 7, 9 వలయములలో నుండునట్లు వివరణముచేసి యెత్తి చూపియున్నాఁడు. సాయణునిపంక్తములో నొక విశ్వేశ్వరుఁడున్నట్లు తోఁచుచున్నది. అది నిజమే యైనయెడల విశ్వేశ్వరకవి కర్ణాటరాజ్యమునుండి యాంధ్రదేశమునకు వచ్చి వెలమరాజులసభలోఁ కీర్తివడసినట్లూహింపనగును సాయణుఁడు తన యలంకారసుధానిధిలోఁ దనతమ్ముఁడగు భోగనాథుని యుదాహరణమాల, శృంగారమంజరి, గౌరీనాథాష్టకము, త్రిపురవిజయము మొదలగువానిలోని పద్యములను, బహుప్రాచీన పద్యముల నుదాహరించెను. ఇతఁడు గద్యమున "ఇతిశ్రీమత్పూర్వ పశ్చిమోత్తర సముద్రాధిపతి బుక్కరాజ ప్రథమదేశిక మాధావాచార్యానుజన్మనః శ్రీమత్సింగమరాజ సకలరాజ్యధురంధరస్య సకలవిద్యావిధానభూతస్య భోగనాథాగ్రజన్మనః సాయణామాత్యస్య కృతావలంకార సుధానిధే" అని చెప్పుటచే సంగమరాజుకాలముననే యలంకారసుధానిధిలో నుదాహరింపఁబడిన చమత్కారచంద్రిక యంతకంటెను ప్రాఁతదై యుండవలయును. దానికంటెను రసార్ణవసుధాకర మించుక పూర్వగ్రంథము. ఈ యాధారముల నాలోచింప రసార్ణవసుధాకరకర్తృ ప్రఖ్యాతి వహించిన సింగభూపతి 1330 ప్రాంతమున నుండియుండును. ఇతని శ్రీనాథుఁడు దర్శించెననుట పొసఁగునని తోఁచదు. శ్రీనాథుని యవసానకాలము క్రీ॥ శ॥ 1480 వఱకును దిగుచున్నది. రసార్ణవసుధాకరకారుఁడగు సింగభూపతికి సర్వజ్ఞ బిరుదము లేదని కొందఱు పొరపడుచున్నారు. రసార్ణవసుధాకరనామమువలెనే సంగీతరత్నాకర వ్యాఖ్యయగు సంగీతసుధాకరమను గ్రంథము సింగభూపాల విరచితము. అందు:—

> అతిగంభీర విషయకే
> కతిపయవేద్యే త్విహ గ్రంథే,
> సమ్యగ్వ్యాఖ్యాకుశలః
> సర్వజ్ఞ స్సింహోహ్వాయ ఏవైకః"

అని యుండుటచే సింగభూపతికి సర్వజ్ఞ బిరుద ముండియుండుననుట విశదము.

## దశకుమారచరిత్రములోఁ బాఠక్రమము

ఆంధ్రభాషలో దినదినము ననేక ప్రాచీనగ్రంథములు ముద్రింపఁబడుచున్నవి. భారత భాగవతాది సుప్రసిద్ధ గ్రంథములు తక్కఁదక్కిన యుద్గ్రంథ

ములు ప్రాయశః మితమాతృకాసహాయముననే ప్రచురింపఁబడుచున్నవి. అనేక ములకు రెండవమాతృకయు లభించుట యరుదు. లబ్ధమాత్రకం ముద్రణార్థము నవరించునప్పుడు గ్రంథకర్తృకృతములను లేఖకకృతములును అగు దోషముల వివేచించుట కష్టమై పరిశోధకులు తమ యజ్ఞానమువలన నపూర్వ పదప్రయోగ ముల దిద్ది తమ మనోధర్మజ్ఞానమానముల కనుకూలముగాఁ బాఠముల సిద్ధాం తముచేసి ప్రచురించుటయుఁ గొన్నియెడల జూచుచున్నాము. ఏకమాతృకా మూలములగు ప్రాచీనగ్రంథముల ముద్రితప్రకారముగా నమ్ముకొని యపూర్వ లక్ష్యలక్షణ విమర్శమునకుఁ బూనుకొనుట ప్రశంసనీయము కానేరదు. బహు మాతృకాలంబనముగల భారత భాగవతాదులు సహితము లక్ష్యవిశేషములకుఁ గతులుగానక పరిభ్రమించుచు మాతృకాంతరములఁ బరికించిచూడఁగా సుంద రములగు ప్రయోగములు సర్వసమ్మతలక్ష్యప్రాయములుగా లభించుచున్నవి. ఇట్టి యవస్థ నాలోచింపఁగా సమస్తగ్రంథములకును దాళపత్రాదిలిఖితమాతృక లను సంపాదించుట యవశ్యమని తోఁచును. సంస్కృతమునను నీగతి నిశ్చయమే.

శాకుంతలోత్తరరామచరితాదులలోఁగూడ ముద్రితపాఠగ్రంథపాఠముల కంటె మిక్కిలి సరసతరమైన పాఠములు తాళపత్రమాతృకలలో లభించు చున్నవి. లక్షణగ్రంథములలో నుదాహరింపబడియుండు పాఠములు సామాన్య ముగా ముద్రితపాఠములకంటె రమణీయములుగా నుండుట పెక్కు సందర్భ ములలో జూచియున్నారము.

ప్రాచీనగ్రంథములలో నొక్కటి రెండు మాతృకలతో ముద్రింపఁబడి యుండు సమస్తగ్రంథములును శుద్ధములుకావని మా యభిప్రాయము. మేము ముద్రించిన గ్రంథములకును నీ దోషము సామాన్యమే. పరిశోధనాభ్యాసపాటవ మున నీరెంటికైన దోషబాహుళ్యమునఁ దారతమ్యము తోఁచవచ్చును. ఎఱ్ఱ ప్రెగ్గడ నృసింహపురాణము, కేయూరబాహుచరిత్రము, ఉత్తరహరివంశము, దశకుమారచరిత్రము, క్రీడాభిరామము, భీమఖండము, మొదలగునవి యబద్ధ పాఠపూరితములనుటకు సందియములేదు.

ఇట్టి యసందర్భముల నమ్ముకొని దేశచరిత్రకారులు యథేచ్ఛముగా గంధర్వనగరములఁ గట్టి త్రైశంకవసామ్రాజ్యముల స్థాపించుచుఁ గల్పనా

వికల్పడోలికలఁ బాఠకుల నూఁచుచుఁ బరివాదవాదమందిరా పరవశులై యద్భుతములు ప్రకటించుట విశ్రాంతిచింతా వినోదులకు క్షణకాల హాస్యాదర్శము కలిగించుచున్నది.

కేతన దశకుమారచరిత్రము తిక్కనసోమయాజి కీర్తిసౌరభమునకు నిదానమనుట యట్లుండగా భాషలో స్వచ్ఛంద సౌకుమార్య మనోహరములగు కావ్యములలో మిన్నయని నిశ్శంకముగాఁ జెప్పవచ్చును. అదియు తంజాపురములోనుండు నొకమాతృక ననుసరించియే ప్రచురింపఁబడియె. దానిలో నైదవయాశ్వాసమునుండియుఁ గడవఱకు దన్ముద్రాపకులకు యథాశక్తి మేము మాతృకను ముద్రణమునకు సవరించి యిచ్చియుంటిమి. ప్రథమాశ్వాసమున ముఖ్యముగా దేశచరిత్రకారుల కుపయోగించు ప్రదేశముల ననేకపాఠములు ముద్రాపకుల చిత్తభ్రంశమువలనఁ బ్రమాదపతితములై తిక్కనాదుల చరిత్ర సరణిలోఁ గంటకములుగా దగులుచున్నవి. కొన్నిటి నీ క్రింద నుదాహరించెదము.

నెల్లూరి మనుమసిద్ధి తండ్రియగు తిక్కనృపాలుని వర్ణించు పద్యము—

సీ॥ బలిమిచేఁ బృధ్వీశ వసుధేశతలద్రుంచె
గటక సామంతుల గర్వమడఁచె
గౌళవవిభు నహంకారంబు మాన్పించెఁ
బాండ్యునిచేతఁ గప్పంబుగొనియె
ద్రవిడమండలికులందఱఁ దక్కగెలిచి చో
డని నిజరాజ్యపీఠమున నిలిపె
నెఱుకుమన్నీల నివ్వెఱపుట్టఁగా నేలె
వైరివీరుల నామలూరునోర్చె

యోధహరిరాయ పెండరుఁ డభయకటక
వీరుఁ డభినవభోజుఁ డాకారమదనుఁ
డవనిభారధౌరేయ మహాత్మ విజిత
దిక్కరీంద్రుండు ఘనచోళ తిక్కనృపతి.

అను పద్యము ముద్రాపకుల మాతృకలో

సీ॥ బలిమిచేఁ బృథ్వీశతలఁద్రుంచి సేవణ
కటకసామంతుల గర్వమడఁచి
ద్రవిడమండలికులందఱఁ దక్కనేలెఁ జో
డని నిజరాజ్యపీఠముననిలిపెఁ
గర్ణాటవిభు నహంకారంబు మాన్పించెఁ
బాండ్యునిచేతఁ గప్పంబుగొనియె
నేఱువమన్నీల నెఱపుట్టఁగానేలె
వైరివీరుల నామలూరనొర్చె
త్రిభువనీరాయ పెండారుఁ డుభయకటక
వీరుఁ డభినవభోజుఁ డాకారమదనుఁ
డవనిభారధౌరేయ మహాత్మ విజిత
దిక్కరీంద్రుండు చోళల తిక్కనృపతి.

అనియున్నది. ఇందుఁ బాదముల పరివృత్తి యటుండగాఁ బాఠములమార్పు చాల చోద్యముగానున్నది. ఇట్లే కవులచరిత్రములోఁ బెక్కుచోట్ల నిట్లు మార్పఁబడిన పాఠములతో నబద్ధసోపానపరంపరాపరీతములైన మాయాసిద్ధాంతసరోవరములు త్వరలోఁ బ్రాచిపట్టి పాఠకుల చిత్తాదర్శములకు మకరతవిభ్రాంతితరళత్వ మాపాదించుచున్నవి. పైపద్యమున సేవణకటకమనఁగా దేవగిరి. సేవణ రాజుల మరచి కటకశబ్దమునకు రాజధానియను నర్థము స్ఫురింపక కటకపురి మీఁద జిత్తముపారఁగా దటుక్కున "వసుధేశ" శబ్దమును నడుమదోపి కేతన సాధారణముగా ప్రయోగింపని "వబ" లయతిని గవితలకుఁగట్టిన ముద్రాపకుల చాతుర్యము శ్లాఘ్యమైనదే. కటకశబ్దము నిట్లే పొరపడిన పాశ్చాత్య పండితుఁడు రుద్రదేవుని యనుమకొండ శాసనములో 1162 క్రీ॥ శ॥ "ప్రాతీచ్యాంతా కటక నికటస్థాయినీ రాజ్యలక్ష్మీ" అన్నచోట కాకతీయరాజ్యము చాళుక్యకటకమగు కళ్యాణపురము సమీపమువఱకు వ్యాపించెననుటకు మాఱు కటకపురమువఱకు విస్తరిల్లెనని భ్రమపడి లిఖించియుండఁగా మా పంతులవారికి దోషమేమియని యెవరైన సమర్థింతురేమో. రెండవపాదమున "దక్కనేలె" నను మాటకు స్పష్టముగా నర్థముగాక 'గెలిచి' యని పంతులవారు దిద్దిరి. తక్కనేలుట యనఁగా బరాశ్రయమునకుఁ బోనీకతానయేలుట యని యర్థము. "కేనము లేకను రక్తయైన భాషాంగనఁ దక్కనేలిన మహత్త్వము" అని నన్నెచోళుని ప్రయోగము

కలదు. మూడవపాదమునఁ గర్ణాటవిభుఁడు పద్యములోఁ జొచ్చె. ఇతఁడు పంతులవారి మనోరాజ్యములో ఋషికల్పనానుఁడు కాబోలు. తరువాత ఏఱువ "దొఱలు", "ఎఱుకుమన్నీలు" గానైరి. త్రిభువనరాయ పెండారుఁడు యోధ హరిరాయ పెండారుఁడయ్యె. ఈబిరుదమిట్లు మార్చి యెదురఁబఱించినయెడలఁ దిక్కనృపాలుఁడు విసియేమనునో. చోళలనఁగాఁ జోళరాజులు. చోడఁడనియే యేకవచనము. ఘనచోళయని దిద్దుట తచ్ఛబ్దప్రయోగరహస్యమునకు స్వరూప నాశముకదా!

23 వ పద్యమునఁ గేతన తనవాసస్థానమును వర్ణించుచోట, వేఁగివిషయ మున "వెంటిరాలనుపేర" అనుటకు "వెట్టిరాలను" నొక క్రొత్తగ్రామము సృష్టింపఁబడియె.

53 వ పద్యమున— "వనజాననయన్నమకుఁ బ్రవర్ధితకీర్తుల్" అని యుండఁగా "యచ్చమకు" అని ముద్రింపఁబడియె.

58 పద్యమున "సరసిజముఖికూచమకున్" అని యుండవలయు. 'మాచమ' యని దిద్దుట దోషము.

60 పద్యమున—

"వనితాజనుల చూపులను తూపులకుఁ దన ప్రసన్ననిమేను లెప్పంబుగాఁగ" అని మాతృకలోనుండఁగా 'లేపంబు' అని ముద్రింపఁబడియె.

75 పద్యమునకుఁ దరువాత, 'ఆతని యనుజుండు' అను వచనభాగము తేలిపోయెను.

79 పద్యమున—

'ఉరవడి నుగ్రసేవణపయోనిధి' యని యుండఁగా సేవణశబ్దమున కర్థముగాక పంతులుగారు దాని "శాత్రవ" యని దిద్దిరి.

అందే 'బాచని నన్ననగంధవారణున్' అను పద్యము ముగియఁగా 'సద్భట గంధవారణున్' అని సవరింపఁబడుట వికారము. 'నన్ననగంధ వారణు'ఁడను బిరుదము పెక్కండ్రు ప్రభువులకుఁ గలదు.

79 పద్యమునకు వెంబడిగా

క॥ ఇమ్మడిఖచరాధీశ్వరుఁ
డిమ్మడి దిననాథతనయుఁ డిమ్మడి సప్తుం?
డిమ్మడి బలీంద్రుఁడనఁగాఁ
బెమ్మడు వితరణగుణమునఁ బెంపు వహించెన్

అన్న పద్యము పంతులుగారికి దృష్టిగోచరము గాక పాఠకులు చదువు భాగ్యముఁ బొందదయ్యె.

96 పద్యమునకుఁ బిదప షష్ఠ్యంతములలో

క॥ భాస్వద్గుణ వితరణజిత
భాస్వత్తనయునకు వినయపరునకుఁ గరుణా
ర్ద్రస్వాంతునకు నమాన త
పస్స్వాధ్యాయాది సుకృత పరిపాకునకున్

అన్నపద్యమును బంతులవారు ముద్రణములో వదలిపెట్టిరి. ఇందుఁ దిక్కనకు విశేషణరూపమగు 'తపస్స్వాధ్యాయాది సుకృతపాకము' ముద్రాపక కర్మమునకుఁ బ్రతియోగి యగునేమో.

భారతి, జూన్, 1924. మా॥ రామకృష్ణకవి.

# 11. ప్రకీర్ణవిషయములు – 2
## వీరభద్ర విజయము

ఈ గ్రంథము భాగవత కర్తయగు పోతనామాత్యుఁడు రచియించె నాయని పెక్కుండ్రు సందేహ పడుచున్నారు. వీరభద్రవిజయములోని గ్రంథ కర్తృవంశావళి భాగవతములోని తద్భాగమునకు సరిపోవుచున్నది. ఇవ్వటూరి సోమనారాధ్యుఁడు పోతనను శైవ గ్రంథరచనకుఁ బ్రోత్సహించుచు "బిన్న వాఁడ"వని చెప్పుటచేఁ పోతన బాల్యముననే యీ శైవ గ్రంథరచనమునకుఁ దొడంగియుండును. భాస్కరరామాయణ భాగవత గ్రంథములు నడుమఁ నడుమఁ దెగిపోయి పరకవి పూరితము లగుటకు ముఖ్యకారణ మోరుంగల్లు తురకలచేఁ బడి రాష్ట్రిమెల్ల విప్లవ పరిభూత మగుటయే యని మా యభి ప్రాయము. పోతన యోరుగంటి వాఁడని క్రీడాభిరామ పీఠికలోనే చెప్పి యుంటిమి. వీరభద్రవిజయము కూడ నిట్లు పరకవి పూరితమై యుండునేమో యని శంకగిలుగుచుండి దానినిఁ బరీక్షింప నందు నాల్గవ యాశ్వాసవుఁ దీఱు వేఱని తోఁచినది. గ్రంథము శ్రీశైల మల్లికార్జున దేవునకంకిత మీయఁబడియె.

ప్రథమాశ్వాసమునఁ గృత్యవతారికయు, దక్షునియహంకారమును, శివ ద్వేషమును, యజ్ఞార్థము దేవతల నాహ్వానించుటయు, దాక్షయణీ యజ్ఞగమన మును, సతీపరిభవమును, శంకరుశాపమును, పార్వత్యవతారమును, దపో నిష్ఠుఁడగు శివునకుఁ బార్వతి శుశ్రూషకు నియమింపఁబడుటయును, గల కథా భాగము వర్ణింపఁబడియె.

ద్వితీయాశ్వాసమునఁ దారకాసుర విజృంభణమును, మదనదహనమును, పార్వతీతపోయోగమును, శివసాక్షాత్కారమును, వర్ణింపఁబడియె. తృతీయా శ్వాసమున శివపార్వతీ వివాహమునకు సప్తర్షుల సంధానమును, వివాహమును, శివపార్వతీవివిక్తసల్లాపములును వర్ణింపఁబడియె. నాల్గవ యాశ్వాసమున మరల దక్షయజ్ఞకథయు, వీరభద్రావతారమును, దక్ష పరాభూతియు, శివప్రసాదం బును వరింపఁబడియె.

ఈ కథా ప్రణాలిక చదివినతోడనే నాల్గవ యాశ్వాస కథ యసందర్భ మని తోఁచకమానదు. రెండవ మూడవ యాశ్వాసముల మొదటఁ గందపద్య

మున శ్రీశైలనాథుని సంబోధనము తక్కిన యాంధ్ర కావ్యముల మర్యాద ననుసరించి చేయఁబడియున్నను నాల్గవ యాశ్వాసము మొదట:-

ఉ. శ్రీరమణీయ వీరసర
సీగణ రంజితసోమ వాసవాం
భోరుహ సంభవ ప్రముఖ
భూరినిలింప భుజాబలప్రతా
పోరు మహాంధ కారపట
లోగ్రనిఖండన చండభాను గం
భీరగుణాభిరామ రణ
భీమ వినిర్జితకామ శంకరా.

అనియుత్పలమాలలో సామాన్య శివరూప సంబోధనముఁ గలదు. నాల్గవ యాశ్వాసములోని పద్యములు కొంచెము నీరసములుగా నున్నవి. ఇదియేమని యాలోచించుచుండ వీరభద్రవిజయము తాటియాకుల ప్రతి యొకటి లభించె. దానిఁ బరికించి చూడ నాల్గవ యాశ్వాసము ముద్రిత పాఠమున కంటె సర్వథా భిన్నమయి శివపార్వతీ కైలాస విహార వర్ణనమును, కుమార జననమును, దారకాసురసంహారమును, దెలుపు కథాభాగము విస్తరించునదిగా నున్నది. నూతనముగా లభించిన యీ భాగమునను పూర్వాశ్వాసములలో వలెనే మహర్షులకు వాయుదేవుండే కథ చెప్పినట్లున్నది. ఆశ్వాసాంతమునఁ గొన్ని పత్రములు లేనందున నీ భాగము పోతన కృతమగునా కాదా యనునంశము స్పష్టముగా చెప్పుటకు వీలులేక పోయినను, గవిత్వ ధోరణి ననుసరించియుఁ గథానుస్యూతత్వమును జూచియు నిదిపై మూడాశ్వాసములకు సంబంధించి యెకకవి కృతమని తోఁచుచున్నది. ముద్రితమగు భాగము పరకవి పూరిత మగుటచేఁ గాబోలు నుత్పలమాలతోఁ బ్రారంభింపఁబడియె. ఇట్లిప్పుడు లభించిన భాగములో నుండి కొన్ని పద్యము లుదాహరించుచున్నారము.

క. శ్రీకర నతజన హృదయ వ
శీకర - - మ మృతలింగ చేతోబ్జలస
ద్భాకర వలయీకృతధ
రీకర రాజేశలింగ వృషభతురంగా.

వ. అవధరింపు మవ్వాయుదేవుండు మహామునుల కిట్లనియె నక్కైలాస శిఖరంబునఁ బరమేశ్వరుండు హైమవతీమాన సోత్సాహంబు విస్తరింపం దలంచి శృంగార చేష్టాయుక్తుఁడై ప్రమథగణంబుల నొకరినొకరి ననేక నాటక సూత్ర వేషంబు లాడుటకనుజ్ఞ యిచ్చి యుమాసమేతుండై నవరత్న సింహాసనంబునఁ గూర్చుండి యుండెనంత.

క. గౌరీశు నాజ్ఞఁ దలనిడి
పారిషదౌఘములు ప్రమద భరితాత్మకులై
చారుతర చిత్ర నాట్యము
లారూఢి ననేక గతుల నాడం దొడఁగెన్.

క. శ్రుతితాళ పటహ వీణాం
చితగీత మృదంగ సమితి చెలువొందంగా
నతి రమ్యలీల నిలిచిరి
చతురత వేషముల నాడ శంకరు ప్రోలన్.

క. తెరవచ్చి (విచ్చి ?) మొదల గణపతి
వరవేషము నటన సలుప వర్ణింపఁదగన్
హరసుతుఁడు నాట్య రాగము
లరయంగా నాడు సరణి యప్పుడు తోఁచెన్.

చ. పలుకువెలంది పుక్కిటను
బంగరు బొజ్జయుఁ బైని జంద్యముల్
నలుదెసలన్ ముఖంబులు స
నందన ముఖ్యులు చుట్టుఁ గొల్వఁగాఁ
దెలుపగు వారువంబొనర
దేవపితామహ వేషమెన్నఁగా
నలరు విరించి చందముగ
నప్పుడుఁ దోఁచెను జూడఁ జిత్రమై.

సీ. కడునీలివన్నియ కాసె చక్కఁగఁ గట్టి
యిమ్ముగా నీలంపు (?) సొమ్ము వెట్టి

కస్తూరిమైఁ బూసి కచము సొంపుగఁ దీర్చి
లోమీఱ నుదుటిపైఁ దిలకమలఁది
కరమొప్పఁ బదములఁ గంచు గజ్జెలు గట్టి
వెలయంగ నొకచేత వీణఁ బూని
కలకంఠరవ మొప్ప గానంబు సేయుచుఁ
దెరచాటుగా నిల్చి తరుణి పల్కె

వినుఁడు మాయాభిదానంపు వెలఁది నేను
చిత్తమున నున్నముచ్చటఁ జెప్ప నేర్తు
ఘనుల హృదయాంబురుహముల కనువు దొనఁగ
ననుచు నలర సభాపతి నభినుతించె.

శ్లో. స్వభావమూర్తిం గిరిజా సమేతం
విభావితం పంకజ విష్ణు ముఖ్యైః
ప్రభాకరా - - ంతనిభాత్మ కాంతిం
సభాపతేః త్వాంగిరీశం భజేఽహమ్.

సీ. నల్లని మసిపూఁత కుళ్లాయితల పైని
మిడిగ్రుడ్లు తెలిగండ్లు మిట్టపండ్లు
పలువంకలగుమేను మెలిగొన్నచే కాళ్ల
బొక్కియందపు వాక్కు బుఱ్ఱముక్కు
కొఱమాలిన కురూపు గూను గల్గిన వీపు
గొప్పైన దవడలు దొప్పచెవులు
బొల్లి గంధపుఁబూతఁ డొల్లు గట్టుడు పాఁత
సంకుపూసల బారు సరులతీరు

తనరఁ దనరాక సభవారు గనుచునవ్వఁ
గుంటి నడపులు నడచుచు గెంటినట్లు
పరఁగ దండాలు దండాలు దొరకు ననుచుఁ
బ్రౌఢ పరిహాసకుఁడు వచ్చె భర్గు సభకు.

సీ. ఇరు చెక్కులను గురు లొలగిన తలపాగ
వలు వన్నెపుఁలుగు ఱెక్కల తురాయి
లలిమేన నుదుటిపై లత్తు గంధపుఁ బూఁత
పచ్చని పట్టంగి పైని వెలయు
మెండు నొక్కటి ఘండి (?) గండపెండారముల్
చాలంగ బిరుదులు వ్రేలు బొమ్మ
మణిమంత్ర మూలికల్ మలచిన తాయెత్తు
లహి పేటికలకావ డంసమునను

చెలఁగ నాగస్వరము వలచేతఁ బూని
తనర డాచేత నొక క్రోతి త్రాడుపట్టి
యద్భుతంబుల గల్పంబు లాడుకొనుచు
నరవి నహితుండికుఁడు వచ్చె హరుని సభకు.

క. వినుఁడేను గారడీఁడను
గనుఁడీ నాపేరు వీరగారడి యనఁగా
ననువొంది విద్యలకునేఁ
బెను బిరుదులు గట్టి బొమ్మ వెట్టిన నాడున్.

సీ, చప్పన్న భాషలు చౌషష్టి విద్యలు
తగజలంబుల నిడి త్రావినాఁడ
గజకర్ణగోకర్ణ గారుడేంద్ర మహేంద్ర
జాలవిద్యల కెల్ల సద్గురుఁడను
ఈరేడు జగముల నెల్ల రాజ సభాంత
రముల నేను జయించి ప్రబలినాఁడ
నగ్నిజల స్తంభ నారామ పట్టణో
త్పాదనాంతర్ధాన పటిమనేర్తు

నిన్ను తెలుపుటకై వచ్చితిటకు నేను
మమ్ము గెలుచుటకై రండుమల్ల చఱచి
లేక యున్నను గనుఁడీ పరాకుమాని
యనుచు బహువిద్యలెల్లఁ దానాడఁదొడఁగె.

సీ. వీణా మృదంగ నిక్వాణంబులకుఁ దగ
శ్రుతి గూర్చి గానంబు సొంపుమీఱ
చారుసప్త స్వరజనిత భేదంబులు
తాళసప్తక శబ్దతతుల కొనర (?)
పాదహస్తముఖాది భాసుర సర్వాంగ
చలనంబు శృంగార కలనమెఱయ
చక్రఖడ్గాంతరిక్షాసనాదికవృత్తి
నటనలత్యాశ్చర్య పటిమఁ దెలుపఁ

బద్యగద్యాది గీత ప్రబంధములను
హావభావాది భావస్వభావమలర
నఖిలరసయుక్తి కరముల నభినయించి
చెలఁగి మాయాప్రభావంబు చెప్పఁ దొడఁగె.

## తుక్కాపంచకము

ఆంధ్రభోజుఁడను ప్రఖ్యాతి వహించి పెద్దనాది కవికీరముల కాశ్రయ కల్పకమై తురుష్క సేనాధాటి కడ్డుకట్టయగు కృష్ణరాయనికిఁ దుక్కయను భార్య యుండెనఁట. కటకాధిపతియగు ప్రతాపరుద్ర గజపతి కృష్ణరాయనిచే విజితుఁడై తనకుమారిత యగు తుక్కాదేవి నతని కొసఁగి తత్కోపానలము శమింపఁ జేసెనఁట. విజయియగు రాయలు తుక్కాదేవిని బరిగ్రహించియు నేకారణముచేతనో దానివలన సహచారిణీ సుఖంబనుభవింపఁ జాలక కంభమను కోటలో దాని నిరోధించియుంచెనఁట. ఆమె చక్కని కవయిత్రియు, దాత్రియు, కుంభస్థల తటాక నిర్మాత్రియునయ్యెనని "విజయ నగర చరిత్రమున కాధారములు" (Sources of Vijaynagar History) అను గ్రంథమున గాన వచ్చుచున్నది. అమె తుక్కా పంచకమను నైదు శ్లోకరత్నములం దుమ్మెదల నంబోధించుచు, మగనినెత్తి పొడుచుచు నన్యాపదేశంబుగా రచించెనట. ఆయైదు శ్లోకములునందే కలవు అందొకటి—

శ్లో. చరన్వనాంతే నవమంజరీషు
నషట్పదో గంధఫలీ మజిఘ్రత్
సాకింనరమ్యా నచకింనరంతా
బలీయసీ కేవల మీశ్వరాజ్ఞా.

(వనాంతరముల నవనవ ప్రసవగుచ్ఛంబులం బొలసాడు తేఁటి చంపక లతను వాసననైనఁ జూడదు. అదియేమి రమ్యమైనదికాదా? తేఁటియు (రసికత్వము గల) క్రీడాశాలి కాదా? ఈవియోగము కేవల మీశ్వరాజ్ఞయే) అని యామెయవస్థా విశేషమును వర్ణించుకొనెనఁట.

''మాకింశుక! ప్రకటయాత్మనిమేషమాత్రం
మన్మస్తకే విహరరీతి మధువ్రతో౽యమ్ (?)
కింమాలతీ విరహవేదనయా త్వదీయం
దృష్ట్వా ప్రసూన మచిరా దనలభ్రమేణ.

భ్రమర! భ్రమతా దిగంతరాళే (ణి)
క్వచిదాసాదిత మీక్షితం శ్రుతం వా
వద సత్యమపాస్య పక్షపాతం
యది జాతీ కుసుమానుకారి పుష్పమ్.''

(ఓ తుమ్మెదా! దిగంతరములు సంచరించు నీవు జాజి పూవుల కెనయైన పూవు వేఱొండు చూచితివా? పొందితివా, లేక విననైన వింటివా! పక్షపాతము లేక సత్యము చెప్పుము.) అని యామె యాత్మ సౌభాగ్య ప్రకటనమును భర్తృ వివేకమును నన్యాపదేశమిషమున వెలయించుచున్నదఁట.

''కుసుమాని లిఖంతునామచిత్రే
కతచిత్కారు విశేష రూఢిశిక్షాః,
సురభిత్వ మమూని కిం లభంతే
కిముచైతేషు రసం పిబంతి భృంగాః
కింమాలతి! మ్లాయసి మాంవిహాయ
చుచుంబ తుంబీకుసుమం షడంఘ్రిః
లోకే చతుర్భిశ్చరణైః పశుః
స్యాత్స షడ్భి రత్యర్థ పశుర్నకింస్యాత్''

తుక్కాదేవి రచించిన యీ యైన పద్యములను విన్నంతనే కృష్ణరాయలు కేవలము వీరలక్ష్మి గాథ కరగ్రహణ మొాచ్చెంగాని యిక్షుచాపుని రసాధి దేవత ప్రణయాతిరేకమున దూలఁజల్లు మానోపాలంభముల నోర్వ లేకుండెనని తోఁచవచ్చును. కృష్ణరాయల పూర్వోత్తర కాలముల గంగాదేవి, తిరుమలదేవి, మధురవాణి, రామభద్రాంబ మొదలగు వారలాంధ్ర సంస్కృత కవయిత్రులై ప్రసిద్ధి చెందియుండ నీ తుక్కాదేవి కవిత చెప్పుట యేమి యాశ్చర్యమన వచ్చును. ఈ శ్లోకముల నేను మొదటఁ జదువఁగా గంగాదేవి మొదలగు కవులు స్మృతి ఫలకములో నున్నను వీనిని రచించిన కవి ప్రాచీనుఁడేమోయని కొన్ని పద ప్రయోగములవలన సందేహించితిని గాని నోరెత్తి చెప్పఁజాలక స్త్రీ కవి యనియు, శ్రీకృష్ణరాయల దేవియనియు లోకము నమ్మియుండఁగా గేవల సందిగ్ధముగా శ్లోకములు ప్రాచీన కాలవాసన నెఱపుచున్నవని చెప్పినచో హాస్య పాత్ర మగుదునని తలంచితిని. దానిని తుక్కాదేవికి నంటఁగట్టిన బ్రహ్మశ్రీ సరస్వతి గారెచ్చట నుండి యీ సంబంధము సాధించి తెచ్చిరోయెఱుఁగఁ జాలఁ. వీనిలో మొదటి శ్లోకమగు ''చరన్వనాంతే'' యనునది వల్లభదేవుని సుభాషితా వళిలో 755-వ పద్యముగా నున్నది సుభాషితావళి కృష్ణరాయనియనంతరము లిఖింపఁబడి యుండరాదా? యనియందురేమో? భ్రమర, భ్రమతా, దిగంతరాణి యనునదియు దానిలోనే 727వ శ్లోకముగా నున్నది. దానిచేతను సిద్ధించిన విశేషమేమి? ''భ్రమర, భ్రమతా'' యను శ్లోకమును భట్టకల్లటుని కుమారుఁడు ముకుళభట్టు తన యభిధావృత్తి మాతృకలో సాదృశ్య లక్షణ కుదాహరణము నిచ్చి ''అత్రహి భ్రమర పుష్పశబ్దే సంబోధనాన్యథానుపపత్త్యాబాధితముఖా ర్థావభిధేయ సాదృశ్యాత్తద్గతగుణ సదృశ ప్రయుక్తమర్థాంతరా లక్షణ యావగ మయతః'' అని లక్షణ లక్ష్య సమన్వయము చేయుచున్నాఁడు. భట్టకల్లటుని గురించి కల్హణుఁడు రాజ తరంగిణిలో-

> అనుగ్రహాయ లోకానాం భట్టా శ్రీకల్లటాదయః
> అవంతివర్మణః కాలేసిద్ధా భువామవాతరన్.

అని యవంతివర్మ కాలములో నుండినట్లు తెలుపుచున్నాడు. ముకుళభట్టు-

> భట్టకల్లట పుత్రేణ ముకుళేన నిరూపితా
> సూరి ప్రబోధ నాయేయ మభిధావృత్తి మాతృకా.

అని చెప్పుటచేతను అభినవగుప్తుని కంటెను (1000 A.D.) ప్రాచీనుఁడగు ప్రతీహారేందు రాజు తనకు ముకుళభట్టు గురువని ప్రశంసించుట చేతను, వామనాలంకారము శిథిలము కాఁగా దానిఁ బూరించి లోకమునకు ముకుళభట్టు ప్రసాదించిన పిదప నభినవగుప్తాదులకు నది లభించియుండుట చేతను ముకుళుఁడు 870 క్రీ. శ. కాలమువాఁడనుట నిశ్చయము. ఇతఁడుదాహరించిన యీ తుక్కా పంచకములోని ద్వితీయరత్నము తత్పూర్వ ప్రథితమనుటకు సందేహములేదు గదా. కావున "చరన్వనాంతే" యను శ్లోకము గూడఁ ప్రాచీనమైనదే.

భ్రమరపంచకమను నొక లఘు కృతి గలదు. ఈయైదును నందులోనివే. చరిత్రకారులు వీనిని తుక్కాదేవికి నంటఁగట్టి యామెను గవితాసామ్రాజ్య పదవికిఁ బట్టాభిషిక్తఁ జేసినను, నీ కవితాసింహాసనము పూర్వకవులచే నపహరింపఁబడుటచే నామెయుఁ గేవలము భావనాపదవిలో జనించి కృష్ణరాయనికి సహృదయకవి సార్వభౌమత్వము దొలఁగింప నెంచిన మిథ్యారూపిణియో యనుసంశయము మమ్ము బాధించుచున్నది. దేశచరిత్ర పరిశోధకులును వాఙ్మయ విమర్శకులు నామెకుఁ దోడ్పడి యామె కీర్తిని నిలుపుదురుగాక.

భారతి, జూలై 1924 రామకృష్ణకవి

# 12. కాళ కళభకవి

ఆంధ్ర కావ్యాభివృద్ధిసరణి పరిపూర్ణముగా నెఱుంగవలసి యున్నది. ఆంధ్రుల చరిత్రౌన్నత్యము సర్వాంగవిస్తృతముగా తెలియఁగోరినను, సంస్కృత ద్రవిళ కర్ణాటాది భాషాభివృద్ధియు, కళింగ ద్రవిళ కర్ణాటాది రాజ్యాభివృద్ధి క్షీణ దశలను, గుర్తింపక పరితృప్తి కలుగనేరదు. కావున నాంధ్రేతర భాషావిషయ ములను, తదితర దేశచరిత్రాంశములును, సర్వదా యుపకారములే. కాళ కళభ కవియను నపూర్వనామ మపశ్రుతపూర్వమనుట యాశ్చర్యముకాదు. ఈ కవిని గూర్చి యెక్కడను విమర్శనము గానరాదు. ఈతడు సంస్కృతమున దోర సముద్రపురాధీశ్వరుడగు వీరసోమేశ్వరుని చరిత్రమును గద్యకావ్యముగా రచించెను. అయ్యది యపూర్ణముగా లభించినను జరిత్రకును గావ్యచమత్కృతి కిని విమర్శనీయగ్రంథమని దీనిని గైకొనుచున్నారము.

పాశ్చాత్యచాళుక్యులలో ముఖ్యులగు సాహవమల్ల త్రిభువనమల్లుల కాలములో ననేక సేనాధిపతులు స్వస్వసైన్యములతోఁ జాళుక్యచక్రవర్తులక్రిందఁ బనిచేసి, యసమానమగు యుద్ధకౌశలము సాధించి, వారి యనుగ్రహముచే పొందిన చిన్నభూఖండములకు సామంతరాజులై వెలయుచుండిరి. భల్లాల కాకతీయులు నట్టివారే. క్రీ॥ శ॥ 1330 ప్రాంతములో ద్వారసముద్రపు భల్లాళ రాజ్యము, కాకతీయప్రభుత్వము, తురకలచేఁ బడఁగా దత్తత్సేనాధిపతులు చెదరి పోయి, విజయనగరప్రభువుల నాశ్రయించిరి. కాకున్న వెలమరెడ్డిరాజులవలె స్వతంత్రరాజ్యములు స్థాపించుకొని కాలముగడపుచుండిరి. హిందూదేశ చరిత్ర మున గొన్నవేలుతక్క, సాధారణముగా నేరాజవంశముగాని, 250 సంవత్స రముల కధికముగా నేకచ్ఛత్రాధిపత్యము వహించియుండలేదు. రాజ్యములకును జన్మవృద్ధి క్షీణములు జంతువులకువలెనే యనివార్యములైయుండును. నిరంత రము దిగ్విజయమిషమునను, జయలక్ష్మీకరగ్రహణ వ్యాజమునను బూర్వవైర నిర్యాతనభావమునను రాజులు పరస్పరము పోరాడుచు, దత్కాలమునకొక్కడు ప్రగల్భుడైన మఱునాడు మఱియొక్కఁడు విజయోన్నతిచే జయస్తంభము నాటును. మూడవనాఁడు మూలనణగియుండిన వేఱొకరాజు సాహసికుఁడై జయ

మత్తులగు పూర్వుల సులభముగా నోడించి జయపతాకముతో యశఃకర్పూ రమును దిక్కుల వెదజల్లుచుందురు.

"భుజంగజిహ్వా చపలాన్నృపశ్రియః" యన్నట్లు వీరి ప్రాభవము క్షణ భంగురమగుటయ కాక యనుక్షణము శంకావహమగుచుండును. ఈ రాజులు తమ యశశ్చంద్రికలఁ గావ్యబంధములనైన నిలుపఁగోరియో, కవిజనుల నాద రించి వారిచే తమ తమ విజయప్రశస్తిచరితముల రచియింపించికొని, దేవతా కథలఁ జెప్పించి, తమ వంశావళులనందు ముఖాలంకారములుగా జొప్పించికొని, తమ జీవితముల గల్పాంతస్థాయిగా నెలకొల్పఁగడంగిరి. పుణ్యమును బురుషార్థ మునుగాని కేవల రాజగాథల నెవ్వఁడు చదువును? సకల ధర్మాధర్మవిచార క్షమంబగు భారతంబును, జన్మతారకమగు భగవచ్చరిత్ర నిబంధనంబగు భాగ వత రామాయణాది ప్రౌఢగ్రంథజాలంబును నొక పురుషాయువునకు జాలినంత యుండ నున్మత్తచేష్టిత పరంపరాప్రతిమానమగు రాజగాథావళిఁ దత్కాలమునఁ దక్కఁ జదువువారు సాధారణముగా నుండరు. మఱియు వైరిరాజన్యులు ప్రబలినచోఁ దమచే విజితులైనవారి కథలు విని వాని స్థిరీకరింపనొల్లరు. కాళిదాసువంటి మహాకవియు, విక్రమాదిత్యునియట్టి రాజేంద్రునికీర్తి వెలయింపఁ జేసిన కుంతలేశ్వరదౌత్యమను కావ్యము కేవలమనాదరముచే నదృశ్యమయ్యె గదా! రాజులు విద్వత్సభలనడిపి పోషించుచున్నందున విద్యాసంచయముతో వారి ప్రశస్తులను గాలసముద్రమున భగ్ననౌకాంగములవలె నచ్చటచ్చట గొట్టుకొని తీరాంతరము చేరుచున్నవి. ఇట్టి రాజగాథాకావ్యములు ప్రౌఢకవితా మనోజ్ఞములు గాకుండెనేని యొక్క పురుషాయుఃపరిమితకాలమైన నిలువవు. ప్రౌఢకావ్యములు నిలిచినను గేవల కావ్యవినోదులే చదివి కరుణాద్భుతశమాది మనోధర్మముల క్షణకాలముద్రిక్తులై యానందింతురు. కల్పనా కథారమణీయ మగు కాదంబరినైనఁ జదువుదురుగాని, హర్షవర్ధనుని కీర్తివిస్తారమును హర్ష చరితమును గవితారసమునకైన సాధారణముగాఁ జదువరు. బిల్హణునికీర్తి చోరశృంగారగాథారూపమున వెలయుచున్నదేకాని యతని విక్రమాంకదేవచరిత మించుక రసభరితమైనను జదువనొల్లరు. పరిమళ కాళిదాసబిరుదాంకితుని నవసాహసాంకచరితము ప్రసన్నకవితావల్లభమయ్యు బఠించువారు లేరు. ఇఁక శూద్రకచరిత్ర, శాతకర్ణిహరణము, అశ్మకవంశము, దిలీపవంశము మొద లగు కావ్యరత్నములు సహితము నష్టములగుట కేవల రాజగాథాప్రలాపము

లగుటచే నాత్మసంస్కారములు, విశ్రాంతచింతావిశేషములు పశ్చాత్తాపనివారకములుఁ గాకపోవుటచేతనే యని యూహింపఁదగును. అట్టి రాజగాథాశల్యములు లభించునేని దేశచరిత్ర నిర్మాణశిల్పుల కత్యంత పరితోషకరములు గావచ్చునని యీ కళాకళభుని వాగ్విస్తృతిఁ బ్రకటించుచున్నారము.

౧. కాళకళభుఁ డెవ్వఁడు? ౨. వీరసోమేశ్వరుఁ డెవ్వఁడు? ౩. గ్రంథములోఁగల దేశకాల ప్రశంసయుఁ, గావ్యచమత్కృతియు నేవి? యను నీ యంశము లీ వ్యాసమున సూత్రింపఁబడును. పరమేశ్వరుని కొలువున నారదుఁడీ కథను జెప్పినట్లున్న తత్కథా ప్రణాళికలో మనకవిగురించి-

“కాత్యాయనీ చరణశేఖరేణ కాళకళభనామ్నా కవిచక్రవర్తినా ప్రవర్తమానేన విరచిత మనపద్య గద్యసంపర్భం కమపి ప్రబంధ”
మనియు, గ్రంథమున నొక ప్రకరణాంతమున

“కవిరాజరా జాభినవభట్టబాణ కలికాల కాళిదాస కాహళ కవిసార్వభౌమ కాళకవికళభ సకలవిద్యాచక్రవర్తి విరచిత గద్య కర్ణామృత”
మనియు నుండుట చూడఁగాఁ గాళకళభనామముకూడ బిరుదమనియే తోఁచుచున్నది. లేదా కాళహస్తియనుటకు బర్యాయపదమైయుండునేమో! కాళన యనియు, దిరుకాళత్తి యనియు పేరులుగలవుకదా? ద్వారసముద్రవాసియగు నితఁడు కాళహస్తీశ్వర భక్తిద్యోతకమగు నీపేరు జన్మకాలమునఁ బొందెనా యను సందియము కలుగును. లేక కాహళకవిసార్వభౌముఁడనుటచే నితనిపేరు కాహళుడనవచ్చునా? డిండిమాడంబరమున గవితారాజ్యమేలిన కవులకు డిండిము లని పేరు గలిగినట్లు వీనికిఁ గాహళమే పరకవిప్రకంపనమగు చిహ్నమై తన్నామమే పౌరుషనామమయ్యెనా? ఇతని కభినవభట్టబాణుఁడని బిరుదము కలదు. దోరసముద్రరాజులలో వీరసోమేశ్వరుని పితామహునియొద్ద నుండిన జైనకర్ణాట కవియగు సుమనోబాణుఁడీ బిరుదము వహించెనట. కర్ణాటకవుల కున్నంత బిరుదము లేభాషాకవులకుఁ గానరావు. వారు తమగ్రంథములలో వానినెల్ల బ్రకటించుకొనుటయు నతివిచిత్రముగా నుండును. ఈ కవికి విద్యాచక్రవర్తియని బిరుదము కలదు. కవులు తమ బిరుదనామములతోడనే గ్రంథరచన చేయుదురు. ఉంభేకనాముఁడగు భవభూతియు, నగస్త్యనాముఁడగు విద్యానాథుఁడును, వేంకటరాయనామకుండగు బాలసరస్వతియు బిరుద

నామములతోడనే లోకులలో ఖ్యాతిచెందిరి. విద్యాచక్రవర్తి యనువారు మువ్వురు ఖల్లాళరాజుల సభలలో నుండిరి. వారివంశవృక్షము నిచ్చెదను—

విద్యాచక్రవర్తి i ...... వీరభల్లాళుఁడు ii–1181 నుండి 1206 క్రీ॥శ॥
(భార్య పద్మ) పాండ్యకామదేవుని జయించెను.

వైద్యనాథకవి — ఇమ్మడి వీరనృసింహుఁడు ii క్రీ॥ శ॥ 1223–1250
చోళపాండ్యులను జయించెను.

విద్యాచక్రవర్తి ii — వీరసోమేశ్వరుఁడు క్రీ॥ శ॥ 1250–1259
భార్యలు దేవిల, సోమిల, బిజ్జల

వాసుదేవకవి — ముమ్మడి నరసింహుఁడు iii క్రీ॥ శ॥ 1260–1300
(భార్య పట్టమాంబ)

మహదేవకవి–విద్యాచక్రవర్తి iii ముమ్మడిభల్లాళుఁడు iii క్రీ॥శ॥ 1300–1330

పై వంశవృక్షముల సంబంధించి చదువ, మువ్వురు విద్యాచక్రవర్తు లొకరొకరు పౌత్రులగుచు వీరభల్లాళ, వీరసోమేశ్వర, ముమ్మడిభల్లాళుల సభల నలంకరించినట్లు విశదమగును. ముమ్మడి విద్యాచక్రవర్తి పైవంశావళిలోని వంశక్రమనామములు వివరముగాఁ దన రుక్మిణీకళ్యాణమను రమణీయకావ్యమున నను గ్రహించెను. ఇతఁడు కావ్యప్రకాశాలంకారసర్వస్వములను మహాగ్రంథము లకు సంజీవనీనామముల వ్యాఖ్యలు గూర్చెను.

''ఇతి సంజీవనీకారః''

యని పండితరాయ లితని వ్యాఖ్యానములనే దూషించెను. అట్లు దూషితములైనను దద్వ్యాఖ్య లతిరమణీయములనుటకు సందేహములేదు. పండితరాయలచే ద్రవిడ శిశువని దూషింపఁబడిన యప్పయదీక్షితులవారు మనకుఁ ద్రోపుడగుదురా? ప్రభాకరునిచే—

"ఇద మజ్ఞానవిలసిత''

మని పరిహసింపఁబడిన భట్టకుమారిలపంక్తి యనాదరణీయమగునాః సింహములు పరస్పరమెట్లు నడుచుకొన్నను మన కవి సింహములేకదా. ఇమ్మడి విద్యాచక్రవర్తి వీరసోమేశ్వరుని యాశ్రితుఁడు. దేవీపంచస్తవిలో ప్రసిద్ధమగు లఘుస్తుతికిని, విరూపాక్ష పంచాశికయను ప్రత్యభిజ్ఞాశాస్త్రసారసంగ్రహమునకును, వ్యాఖ్యలుకూర్చె.

మొదటి విద్యాచక్రవర్తి గ్రంథరచనావిషయము తెలియరాదు. హోసల రాజు జయగాథలు చారుశయ్యలలో గూర్చి శిలోట్టంకితములుగా నీకవివంశ్యులు చేసినట్లు రుక్మిణీకళ్యాణమునఁ జెప్పఁబడియె. ముమ్మడి విద్యాచక్రవర్తి

తేనోపనీ యావరజో వినీతః
ప్రసిద్ధనామా కవిచక్రవర్తీ;
భల్లాళభూపస్య మనోஉభిరామై
ర్వాచాం విలాసై రతివల్లభోஉభూత్
ఉన్మూలితస్థాపిత భూమిపాల
దేశేషు పద్యైరుపవర్ణ్య గీతాః
ఉట్టంకితా యేన మహాశిలాసు
భల్లాళ భూపస్య భుజప్రతాపాః
ఉదాహృతిత్వేన నయై ర్నిబధ్య
కావ్యప్రకాశాదిషు లక్షణేషు.
నివేశితా యేన జగత్సమక్షం
ఖ్యాతింగతా హోసల రాజగాథాః
యశ్చత్ర భద్రాసన చామరాద్యైః
స్ఫీతై ర్మహారాజపదై ర్బునక్తి;
సభాసు రాజ్ఞాంచ వినిశ్చితంచ
సాహిత్యరాజ్యం కవిచక్రవర్తీ.

ఇట్టి మహైశ్వర్యము ననుభవించెననుట సందియములేదు. మువ్వురు విద్యాచక్రవర్తులును దమతమ కాలముల హోసలరాజులకు మత గురువులును విద్యాగురువులునై యుండిరి. వీరెల్లరు కాశ్మీరశైపమను ప్రతీతిగల ప్రత్యభిజ్ఞా శైవాద్వైతమతము ననుసరించి దీక్షఁబొందినవారు. మొదటివిద్యాచక్రవర్తి

విద్యాసు సామ్నా భువనత్రయేఽపి
యశ్చక్రవర్తీ త్యుపగీతకీర్తిః,
ఆస్థానబద్ధ ప్రవరస్య తస్య
రాజ్ఞః ప్రశస్తిః ప్రథయాంబభూవ
అయత్న సంసిద్ధ కులానుయాయీ
విద్యావతా ముగ్రతరైస్తపోభిః,
ఉమాపతే ర్దక్షిణతోముఖాద్య
స్సాక్షాత్ప్రపేదే పరతత్త్వదీక్షామ్
నిరగ్నిహోత్రాః పరిమందవాచో
న కేచన బ్రహ్మవిచారశూన్యాః
ఆసన్న నైసర్గిక సిద్ధవిద్యా
ద్విజాః కులే యస్య తపోభి రిద్ధైః''

అని వర్ణింపఁబడిన జ్ఞానదీక్షాగురుండన నెగడుటయకాక వారి వంశ్యులు ననూచానసంతానులై రనుట యతిశయోక్తి కాదు. కాత్యాయనీ చరణశేఖరాది విశేషణములఁబట్టి కాళకళభుఁడు రెండవ విద్యాచక్రవర్తి కావచ్చునని తోఁచు చున్నది. ఒక్కరాజునాస్థానమున నిరువురు విద్యాచక్రవర్తు లుండగలరా? ఒక్కయింట నిద్దరు సవతులైన నుండగలరుకాని, యొకగుహలో రెండు మగ సింగము లుండఁజాలునా? కావున వీరసోమేశ్వరుని యాస్థానకవియగు విద్యా చక్రవర్తియే మన కాళకళభుఁడని యిప్పటికి నిర్ణయింతము.

హోయసలరాజులు వీరసోమేశ్వరుని ముత్తాతయగు వీరనరసింహుని కాలమువఱకును జైనమహాకవులనే యధికముగా నాదరించుచుండిరనియు వీర భల్లాళుని (1172-1219 క్రీ॥ శ॥) మొదలు శైవకవులే రాజాస్థానమున నెగ్గు చుండిరనియు నూహింపవలసియున్నది. బసవేశ్వరుని శైవమతోత్థాపనము దానికిఁ గొంతకారణమై యుండవచ్చును. అయినను శివాద్వైతము కుమారిల శంకరాచార్యులకుఁ బూర్వమే దక్షిణదేశమున సుప్రసిద్ధమైయుండె ననుటకు నాచార్య సుందరపాండ్యుఁడును, భర్తృప్రపంచుఁడును సాక్షిభూతులగుచున్నారు. పిదపఁ బ్రత్యభిజ్ఞాసిద్ధాంతము కాశ్మీరమునుండి ద్విగుణితశక్తిమంతమై మత మయూర శిష్యులగు విమలశివాదులచేఁ బ్రస్థానాంతరముగా మాఱె. బసవేశ్వ రుఁడు వేదప్రామాణ్య వేదకర్మల నుల్లంఘించి శివాద్వైతమున నూతనపక్కి

శాసించె పండితారాధ్యుఁడు శైవముననే ద్వైతమును సంపూర్ణముగా సంగీక రించి యద్వైతమును నిరసించి తన యధిమతమును శివతత్త్వసారమునఁ బ్రకటించుచున్నాఁడు. వీరసోమేశ్వరునికాలమున నచ్చటఁ బ్రాచీనశివాద్వైతమే ప్రబలుచుండెను.

హోయసల రాజులు క్రీ. శ. 1040 నుండి 1330 వఱకును సుమారు మునొకండుమంది ప్రభుత్వము చేసిరి. వీరలెల్లరు తమ చుట్టు నున్న రాజు లతో నిరంతరము పోరుచుండ తుట్టతుదకుఁ దురుష్కులచే నందఱును గీర్తి శేషులై వంశ నిశ్శేషులైరి. ద్వారావతీపురము వీరులకు రాజధాని. దక్షిణమున గాంగ బాణ పాండ్య చోళ చేర కేరళ రాజ్యములును, దూర్పున గలచురి పాశ్చాత్య ప్రాచ్యచాళుక్య తెలుగు చోడ రాజ్యములును, నుత్తరమున గలచురి సేవణ కాకతీయ వంగ గాంగ ఘూర్జర మాళవ త్రైపుర రాజ్యములును వీరులకు నిరంతరము రణమృగయకు గహన భూములవలె నుండెను. వీరిలో మనకు ముఖ్యుఁడగు సోమేశ్వరుని తాతయగు (రెండవ) వీరభల్లాళుఁడు (క్రీ.శ. 1181-1206) మహారాష్ట్రసీమను జయించి-

"గంధద్విపై ర్యస్య విలోడ్యమానే
పంకాకులే వారినిధిం ప్రపన్నే
గోదావరీ వారిణి సేవుణానాం".

దేవగిరి రాజుల

''యయౌ యశోవారిధి రావిలత్వమ్''

అన్నట్లు తూర్పువంక విజయధ్వజము సారించెను.

మఱియుఁ బాండ్యరాజగు కామదేవు నోడించి చోళరాజుఁ దఱిమి పాశ్చాత్య చాళుక్య రాజగు సోమేశ్వరుఁ బరాజితుం జేసెను. మన సోమేశ్వరుని తండ్రియగు (ఇమ్మడి) వీరనరసింహుఁడు 1120-1235 మకర రాజ్యమును జయించి-

"యః ప్రాప్య దుర్వారభుజప్రతాప
శ్చోళంచ పాండ్యంచ రణేస్తిజిగాయ"

యన్నట్లు దక్షిణ దిక్కున నెక్కువగాఁ దిరిగి చోళరాజ్యమునఁ దన బావ మఱది నిలిపి చోళరాజ్యస్థాపక బిరుదముపొందె. మన కథానాయకుఁడగు వీర

సోమేశ్వరుఁడు చుట్టునున్న రాజ్యముల నన్నిటితోఁ బోరి జయాపజయములు పొందుచుండెను. ఘూర్జరరాజుల జయించి దేవికయను తద్రాజ కుమారిఁ బెండ్లి యాడెను. సేవుణ రాజులచేనోడి పిదప నెల్లూరి తెలుగు చోళఁడగు తిక్క-నృపాలుచే బరాభూతుఁడయ్యె. కేతన దీనినే-

"కర్ణాటవిభు నహంకారంబు మాన్పించె"

ననియుఁ దిక్కన నిర్వచనోత్తర రామాయణమున-

"కమలాప్త ప్రతిమానమూర్తియగు నా
కర్ణాట సోమేశు దు
ర్దమ దోర్గర్వము రూపుమాపి నిజద
ర్పంబుం బ్రతిష్ఠించి లీ
లమెయిం జోళుని భూమిపై నిలిపి చో
ళస్థాపనాచార్య నా
మముదక్కం గొని తిక్కభూవిభుఁడు సా
మర్థ్యంబు చెల్లింపఁడే"

యనియు వర్ణించిరి. ఇటు సోమేశ్వరుఁడు పరాజితుఁ డగుటకుఁ గారణము సంపురాయఁడు, శంభురాజు, సాంపరాయఁడు అనునామాంతరములు గల యొక తెలుఁగు రాజుతో (తెలుంగాధీశ సాళువరాజులకుఁ బూర్వ పురుషుఁడు) నెల్లూరి తిక్కరాజుఁ గలసి సోమేశ్వరు నోడించి, కాంచీపురము తాఁగొని యొర యూరుపురమునఁ చోళరాజు నిలిపె గాని సుందర పాండ్యుఁడు బల్లవరాజగు "కోపెరుశింగ దేవుడు" వేత్వేఱ కంచిపై దండెత్తి తిక్కరాజుఁ దఱిమి వేయుచు వచ్చిరి.

కోపెరు సింగదేవుఁడు (పెద్ద రాజ సింహదేవుడని యఱవ పదమున కర్థము) పల్లవవంశస్థుడై యించుమించుగా జుట్టు రాజులనెల్ల జయించి యుత్తరమున దాక్షారామమువఱకు మృగయా విహారమున నరణ్యము సొచ్చి, చనినట్లు దండెత్తి యచ్చటఁ దన విజయాంకశాసనము స్థాపించెను. ఇతఁడు వీరసోమేశ్వరునే కాక యతని తండ్రియగు వీరనరసింహుని కూడ నోడించి తుదకోడి పోయెను. ఇతఁడే చోళరాజగు ముమ్మడి రాజేంద్రుని జయించి తత్సింహాసనము నుండి వాని దొలగించినందునఁ దిక్కరాజు కోపెరు సింగ

దేవునితో యుద్ధము చేసి రాజేంద్ర సింహాసనము నిలిపెను. రాజేంద్రుఁడు వీర సోమేశ్వరునికి బావమఱది కొడుకు. రాజ్యప్రవృత్తిలో బాంధవము ముఖ్యము కదా! తిక్కరాజు శంభురాజులతో జేరెనని కాఁబోలు వీరసోమేశ్వరుఁడు చోళరాజుతోఁ గలసి వచ్చిన పాండ్యరాజుతో, గాంచీపురమునకు నాగ్నేయమున సముద్రముననుండు మహేంద్రమంగలమను పట్టణ ప్రాంతమున యుద్ధము చేసినట్లు కాళకళభకవి కావ్యములోఁ బ్రధానాంశము. నారదుఁడు దాని సాక్షాత్తుగాఁ జూచి సరస్వతి వీణవాయించుచుండ నంతకంటె రుచికరముగాఁ బరమేశ్వరునితోఁ గైలాసమునఁ బార్వతీ సమక్షమున వర్ణించెనట. అంతఁ బాండ్యరాజు కూఁతురగు లక్ష్మీదేవి ప్రశంస వచ్చు స్థలమున గ్రంథము నిలిచి పోయె. శాసనములచే సోమేశుఁడు సుందర వీరపాండ్యులవలనను రాజేంద్రుని వలనను నోడింపఁ బడియెనని తెలుచుండెను. పాండ్యుఁడు వీనికి గాల దండ మనుటచే సోమేశుఁడు చోళదేశ యుద్ధభూమిలో జచ్చెనని తలఁచెదను. 1256 క్రీ.శ. కాలములో నితఁడు చనిపోయి యుండును.

మహేంద్రమంగల యుద్ధములో సోమేశుఁడు యౌవనములో నుండె ననుటం జేసియు, నితడు ముప్పురు భార్యలఁ బరిణయమై వారియందు సంతానమువడయుటకుఁ గాలవ్యవధి వలయుటం జేసియు, నితనిపుత్రులగు రామనాథ నరసింహులు క్రీ.శ. 1258 ప్రాంతములకే యుద్ధ క్రీడల నడపి శిలాశాసనములు స్థాపించినందునను మన కాళకళభకవి సూచించిన మహేంద్రమంగల యుద్ధము 1245 క్రీ. శ. ప్రాంతములకు దరువాత నడచియుండదు.

మహేంద్రమంగలము నిశ్చితముగా నెచ్చట నున్నదో తెలియరాదు. కాంచీపుర సమీపమున దక్షిణసముద్ర తీరముననని కవి చెప్పుచున్నాడు. ఈ ప్రదేశమనేక రాజులకు యుద్ధ భూమియయ్యు నేఁటికి స్థలనిశ్చయము సులభముగాఁ గానరాదు.

చోళేషు మంగళ మితి ప్రథితార్థ నామ్ని
గ్రామే వసన్ పితృగురో రభిధాం దధాన
జ్ఞానోత్తమః సకల దర్శన పారదృశ్వా
వ్యాఖ్యా మిమాం వితనుతేస్ఫుట మిష్టసిద్ధ్యై.

అని జ్ఞానోత్తముడు తనవేదాంత వ్యాఖ్యాన గ్రంథములో వ్రాయుచున్నాడు. ఈ మంగళ నామకాగ్రహారములు 100 చోళదేశమునఁ గలవు. ఇది యేదియో యిపుడు నిర్ధారింప వలను కాదు.

గ్రంథరచనా క్రమము : కైలాసమునఁ బార్వతియుఁ బరమేశ్వరుం డును విహరింపుచుండ సాయంతన సమయమున నారదుఁడు వారి సన్నిధానముఁ జొచ్చి యథావిధి సమస్కరించి "దేవా, నా శిష్యులగు వ్యాస వాల్మీకులు భూలో కంబునఁ గాళకళభ కవి రచించిన యొక కావ్యంబుఁ దెచ్చియున్నారు. దాని దేవర యవధరింపఁదగు"నని విన్నవింపు నంతలో దేవీసఖియగు మంజుళిక యచ్చటికి వచ్చెను. మహేశ్వరుఁడంత సంధ్యాసమయంబగుట మఱునాఁ డుదయమున దాని వింపమని చెప్పి నారదునిఁ బంపి, పార్వతీ మంజుళికలతో నుద్యానవన విహారము చేసి, యిల్లు చేరి, మఱునాఁడు సభలోనుండి సరస్వతీ దేవి యతి మనోజ్ఞముగా వీణ వాయింపఁగా విని గానము మెచ్చి, ముక్తాహార మొకటి వాగ్దేవికిఁ బ్రీతిదాయక మొసఁగెను. అంతలో నారదుఁడు సభకేతేర నుమావిభుఁడేల సరస్వతీ గానము వినుటకు రావైతివని నారదునడుగ నతండు "రాత్రి యాదవ సోమేశ్వరునకును బాండ్య భూపతికిని దక్షిణ సముద్రతీరమున యుద్ధము జరిగెను" అనవుడు మహేశ్వరుఁడా యుద్ధ ప్రకారము వర్ణింపు మన నట్టి యుద్ధరంగము తానెప్పుడు చూచినదిలేదని తద్వృత్తాంతమంతయు ద్వారసముద్ర రాజవంశ వర్ణనముతోఁ జెప్పుచున్నాఁడు. గ్రంథము పాండ్య రాజు కుమారి వివాహముతో ముగిసియుండును. ఈ గద్యకర్ణామృతములో శివుని సంధ్యావిహార ఘట్టమును రచనామాధుర్యము గోచరించునట్లుదాహ రించెదను.

"అత్రాంతరే వనలతాంతరితవిగ్రహా దేవీపరిచారికాను కాచిత్ప్రాభృతికా నామ కళమధురా మిమాం గాథా మగాథయత్"

తమసి సఖి యూథికే త్యజ
గౌరీ నిశ్వసిత సౌరభ స్పర్థామ్
కి మకృత సముచ్ఛ్వసంతీ
సాసూయం మాలతీవ లతా॥

అథ నిశీథసూచినీ మిమా మార్యా ముమాపతి రుమయా సహ శ్రుత్వా స మేరుతలా దుదతిష్ఠత్. ఉత్థాయ చ నిజనికేతనాభిముఖో వృషభకేతనః కాంతయా సహ పరిణత హిమకరకిసలయితేన కైలాససానువర్త్మనా జగామ. గౌరీగచ్ఛంతీ క్వచి దుతూహలాకృష్టలకమలదళశయనతలనిషణ్ణ మితరేతరాంగ సంస్పర్శ సుఖ నిమీలితలోచన మివ నిద్రాయమాణం హంసమిథున మాశింజిత

నూపురేణపదేన అస్పృశత్. తత స్తచ్చరణచాలితమపి ముహూర్నిశీధని ద్రాంతర మంథరే కథమపి కృతకళగద్గదరవ ముస్మీల్య లోచనే పునరపి నిమిమీల హంస యుగళమ్; అత్ర క్వచిత్సర స్తీరసీమ్ని విరహవిధురా మధారత (యా) విహితారవ మాళిజనేన గ్రాహయిత్వా చక్రవాకీం ప్రియసమీప మానినాయ సా; పునరానీతా ప్రియతమ మంతికగత మప్యజానతీ విధివశా దన్యతోయాంతీ కరుణ తర మాచక్రంద చక్రవాకీ; కుత్రచిత్కాంత మనుసరతీ మంతరా కౌముదీ మదవిఘూర్ణమానలోచనా మపథ ప్రస్థితాం నివార్య వర్త్మని చకార చకోరీం చకోరాక్షీ; క్వచిద్బహిరవస్థిత మధుకరానుశోచితాం విరచిత వివిధ ప్రలాపాం స్వరుచి పంకజోదరబంధనస్థాం మధుకరీం వివిచ్య ముకుళా విజయాకరేణ విమోచయామాన–ఇతి. వివిధ విహార వ్యాపృతాం వినోదయ న్నయితాం మద చపలచకోర లోచనపుట పాటలిమపల్లవిత చంద్రికా ప్రసరేణ మందమారుతాం దోళితశేఫాలికా పరిమళ లహరీ పరిప్లవమాన షట్పదేన పదేన చంద్రకాంత దృషన్నిష్యంద శ్వేతశిశిరశైలేయ సురభి శిలాతలేన శీధయూథికామోద వాసిత వనదేవతాకుందశేన(?) నిరన్తర విస్మమర కైతకపరాగధూసర చకోర కామినీ చరణేన రజతాచలమేఖలాపథేన సవిలాస మాలయ మాజగామ గౌరీపతిః.''

కథారచన లోకాతీతమగు భంగితో గూర్పఁబడియు మృదు మధుర పదవిన్యాసరమణీయమగు వర్ణనా ప్రఘట్ట మింపు గొలుపుచుండును. సాహిత్య మలవఱచుకొను వారల కిది యుత్తమ కావ్యములలో నొకటియని యంగీక రింపక తప్పదు.

భారతి, ఫిబ్రవరి, 1925. మా. రామకృష్ణకవి

# 13. ఉదయనోదయము

ఈ గ్రంథము నారనమంత్రి కుమారుఁడగు సూరనచే రచింపఁబడియె. ఇతనిగురించి "యాంధ్రకవి చరిత్ర పరిశిష్టభాగము"న విస్తరముగాఁ జర్చించియుంటిని. ఇరువది యేడ్గురు కవుల చరిత్రమువ్రాసి ముగింపకయుండిన భాగమును కం॥ వీరేశలింగము పంతులవారు చాలవేఁడి పుచ్చుకొని పోయియు వారి కవుల చరిత్రము రెండవ భాగములోఁ చేర్చుకొనుటకుఁ బూర్వమే వారు లోకాంతరగతులగుటచే నా ప్రయత్నము లేమయ్యెనో తెలియరాదు. కావున జర్వితచర్వణమైనను నారన సూరనగూర్చి మరలఁ గొంత ప్రసంగించుచున్నాఁడను. ఈకవి వనమాలివిలాసమునుగూడవిరచించెను అది కొండూరి యక్కయ్యమంత్రి కంకితమీఁబడియె. అది సరస కవితా విలాసితమై, సరళ రచనా బంధురమైయున్నది. దానిలో నాద్యంతములులేని మూఁడాశ్వాసముల యాదర్శభాగము నాయొద్ద నున్నది. ఆ కృతిని గవి తన పూర్వ వయస్సులోనే రచించెఁగాఁబోలు.

ఉదయనోదయ మైదాశ్వాసముల భాగమే వాసవదత్తా వివాహపర్యంతము లభించుచున్నది. కవి యింక నెంతభాగము రచించెనో యెఱుఁగరాదు. కాని యతని కుమారుఁడు తద్గ్రంథమును ముగింపకయే తనతండ్రి కీర్తిశేషుఁడైనందునఁ దానాగ్రంథమును లోకయ మంత్రికుమారుఁడగు బాచయ కంకితముగ బూర్వపీఠిక రచించెనని చెప్పుకొన్నందునను, ఉదయనోదయమను నామము ననుసరించి మృగావతీ కథయేగాక యుదయనుని వివాహముగూడ వర్ణింపఁబడి యుండుటవలనను సూరనమంత్రి యంతయే రచించియుండునని తలంచుచున్నాను.

ఇతనికాలనిర్ణయమును స్మరించుచు వనమాలివిలాసమునుగూర్చి వ్రాసిన వీరేశలింగం పంతులవారు "ఇతఁ డాధునికుఁడని చెప్పుటఁదక్కఁ గవి కాల నిర్ధారణము చేయుటకు బుస్తకమునం దాధారమేదియుఁ జిక్కలేదు" అని యాధారములు లేనందున నతని నాధునిక కవికోటిలోఁ జేర్చిరి. అదియుఁ జెప్పకుండిన గొంత మేలైయుండునేమో ! ఆంధ్రదేశమునఁ బెక్కండ్రు బాచయలు లేక భాస్కర మంత్రులుండిరి. వారు భిన్నభిన్న శతాబ్దులవారు.

వారిలో లోకయమంత్రి కుమారుఁడు బాచయ ఘూ పరిశోధనమునఁ జిక్కినవాఁ డెవ్వఁడును లేఁడు. ఇతఁడు నందవరమున జన్మించిన నియోగిబ్రాహ్మణుఁడు. శ్రీవత్సన గోత్రుఁడు. ముడియము వంశోద్భవుఁడు. ప్రాయశః కొండవీట నధికారము చెల్లించు చుండినవాఁడు. వ్యాసమహాయతిరాయల శిష్యుఁడు, బయకార రామదండాధినాధునకు గుడిభుజము వంటివాడు– మొదలుగాఁ గృతి పతిని గుఱించి యుదయనోదయమునఁ గలదు.

కవి –

సీ॥ కౌండిన్య గోత్ర విఖ్యాతుండు సత్కవి
మాన్యుండు నారన మంత్రిమణికి
వనితయక్కాంబకు వరతనూజుఁడగిసా
నాఖ్యునకును గూన నాహ్వయునకు(?)
గారాపు సయిదోడ నారాయణ పదార
వింద సంసేవనా విమల మతిని,
గావ్య నిష్ణాతుఁడ గజరావు బిరుదాంకుఁ
డగు రాచవారికిఁదగు హితుఁడ,
సృష్టివాచీఘర............వక్ర
నాభిరాముండ, నయకళామందిరుండ
సూరనాఖ్యుండ, సత్య సంశోభితుండ.

అని కవియే తన్నుఁగూర్చి, పూర్వకృతులలోఁ జెప్పుచున్నట్లు కుమా రుఁడు చెప్పుచున్నాఁడు. ఈగ్రంథమాతృక యబద్ధ పాఠమయమైనందున యథాశక్తిఁ జరిత్రాంశభంగము లేకుండునట్లు మేముదాహరించుచున్నాము.

కృతిపతియగు ముడియము భాస్కరుండు వ్యాసమహాయతిరాయల శిష్యుఁడట. ఆ యతివర్యుఁడు కృష్ణరాయలచే నిత్యసమ్మానితుండగుచుండెనని "వ్యాసయోగిచరిత్ర" మను సంస్కృతకావ్యమున నున్నది. రాజుచే రత్నసింహా సనమున యతిరాయలు కనకరత్నాభిషేక గౌరవమందెనని తెలియుచున్నది. కావునఁ గృతిపతియుఁ గవియును గృష్ణరాయల కాలమువారని చెప్పవచ్చును. వ్యాసరాయలకుఁ దరువాతివారు పెక్కండ్రు తత్పీఠము నెక్కినవారెల్లరును వ్యాసరాయబిరుదము వహించినందునఁ గాలనిర్ణయమున విపర్యాసము కలుగు

నేమో! ముడియము భాస్కరుని ప్రభుపతంసము కొండవీటిని గర్ణాటరాజుల యొద్ద సమ్మానముగాఁ బొందిన బయకార రామదండాధినాధుఁడు "కర్ణాట సింహాసన సామ్రాజ్యలక్ష్మీ సార్వభౌమ కారుణ్యలబ్ధ కొండవీటి ప్రముఖ నిఖిల దుర్గాధిపత్యభిరామ బయకార రామప్రధానసుత్రామ సర్వసర్వంసహాభార భరణ సంధుక్షణ దక్ష దక్షిణ భుజాస్తంభుండును," "అతఁడు బయకారరామదండాధి నాధ! రాజ్యలక్ష్మీ శుకీపద్మరాగరత్న పంజరాయిత ఫణిసార్వభౌమ దీర్ఘ బాహు వీరుండు లోకేంద్ర భాస్కరుండు"

క॥ సారతర కొండవీటి మ
హారాజ్య ప్రాజ్యవైభవైశ్వర్య కళా
ధౌరంధర్య నిరూఢ
శ్రీరామప్రభు కృపావిశేషోన్నతికిన్॥

అని కృతిపతినిగూర్చి చెప్పఁబడుటచే బయకార రామప్ప కర్ణాటరాజుల సేనాని యని తోచును.

బయకారశబ్దము వాగ్గేయకార శబ్దార్థమునకు వికృతరూపమని నేనుఁ దలచుచున్నాఁడను. వాగ్గేయకార బయకార శబ్దముల నిర్వచించుచుఁ దంజాపుర రఘునాథుఁడు తన సంగీతసుధలోఁ బ్రకీర్ణకాధ్యాయ ప్రారంభమున—

"సంగీతశాస్త్రే ప్రథమాధికారీ వాగ్గేయకారః ప్రతిపాద్యతే ప్రాక్,
వాచంచ గేయంచ కరోతి యస్మాత్ వాగ్గేయకారః కథితస్తథాఽసౌ,
వాక్ఛబ్దపర్యాయతయైవ మాతుః శబ్దః ప్రయుక్తః కిల గీతిదక్షైః
గేయస్య పర్యాయతయా తు ధాతుశబ్దం తథా గీతివిదో వదంతి,
బంధం పదానాం ప్రవదంతి మాతుం స్వరౌఘ సందర్భ ముశంతి ధాతుమ్,
మాతుంచ ధాతుంచ ద్వయం కరోతి యస్తం విదుశ్చోభయకారసంజ్ఞమ్
తమేవ లోకా బయకారనామ్నా వదంత్యపభ్రంశ పదేన సర్వే.

అని వాగ్గేయకార శబ్దార్థమే యపభ్రంశమున బయకార శబ్దరూపము దాల్చెనని చెప్పుచున్నాడు.

బయకార రామప్పయే వాగ్గేయకార తోడరమల్ల తిమ్మామాత్య నందన రామామాత్యుఁడనియు, స్వరమేళకళానిధియను గ్రంథమునకుఁ గర్తయనియు నూహింపవచ్చును. స్వరమేళకళానిధిలో రామామాత్యుఁ డళియరామరాయలకు

మేడ గట్టించి యతనికి సడిభుజమై కొంపవీడు మొదలగు దుర్గముల యాధి పత్యము సంపాదించెనని చెప్పుకొనియె.

ఆదాయ తా మారచితానుమోదో
విచారయామాస స రామమంత్రీ,
సఏవ పూర్వాధిక కొండవీటి
ప్రధాన దుర్గ ప్రతిపాదనేన,
పూర్వార్ణ వేనైన పరీతమూర్తేః
ప్రభుత్వముర్వ్యాం వితతార మహ్యమ్.

ఈగ్రంథము క్రీ. శ. 1546 లో రచింపఁబడియె.

గాంధర్వ శాస్త్రవేత్తయగు నాతఁడు సేనానియై మధుర రూక్ష రసాను భూతిచే వీరశృంగార రసాధిదేవతల నీర్ష్యలేక యేలుట యాశ్చర్యమే. కాకతీయ గణపతిదేవుని గజ సైన్యాధిపతియగు జాయ దండాధినాథుఁడును భరత విద్యా నిపుణుఁడగుట ప్రమోదాశ్చర్యములు గొలుపుచుండును.

బయకార రామప్ప తిమ్మయ కుమారుఁడు-

"శ్రీమహిమాస్పద తిమ్మయ రామామాత్య ప్రతిష్ఠ రాజ్యాంగభరా
క్రామిత నిజ భుజ విభవోద్దామ ప్రాకేశ(?) బాచదండాధీశా.

(ఉ ద 11 - 1)

స్వరమేళకళానిధి కారుఁడగు రామామాత్యుఁడును దిమ్మయనందనుండు.

ఇదియునుంగాక బల్లారి మండలమున జిక్కతిమ్మాపుర, కామసముద్ర తటాక నిర్మాతయగు నొక రామయామాత్యుని శాసనములు రెండు గలవు. తిమ్మాపురము తండ్రిపేరిటను. గామసముద్రము కామమ్మ యను కొమార్తె పేరిటను బుణ్యముగా నొక బయకార రామప్పయ్య కట్టించినట్లు వానిలోఁగలవు. పరాశరగోత్రజుఁడగు భావయమంత్రికి రామయమంత్రియు, నతనికిఁ బెద తిమ్మయ్యయు, చిన్నతిమ్మమంత్రియు, భాస్కరచమూపతియు, బాచయయుఁ గల్గిరి. బాచయమంత్రి యచ్యుతరాయలవలనఁ గొండవీటి పరిపాలనముఁ బొందెనఁట. రామయభాస్కరుఁడు కొండవీటిలో గోపీనాథ స్వామికి గోపురము గట్టి యాంధ్రదేశము పరిపాలించెనఁట. పెద్దతిమ్మయ్యకును లక్కాంబకును రామయ్యమంత్రి జనించి ఖ్యాతివడసి యచ్యుతరాయల యనుగ్రహమునఁ గొండవీ డేలుచుండినట్లు ననేకాగ్రహార నిర్మాతయనియు, శా. శ. 1461 కాలమున నచ్యుతరాయలచే నొంటిగోడు, కీడుహళ్ళి మొదలగు పురములు

వడసినట్లు నా శాసనములలోఁ గలవు. రామయమంత్రి తిమ్మాపురసమీపమునఁ బదునాలు చెఱువులు గట్టించెనఁట. వీనివలన రామయమంత్రి భాస్కరునకు నన్నకుమారుఁడే బయకార రామప్పయని తేలుచున్నది. రావిపాటి తిప్పరాజు చాటుధారయని "సరిబేసైరిపు దేల భాస్కరులు" అను పద్యము నప్పకవి యుదాహరించుట చూడఁగా నది తిప్పరాజు రచించినదికాదో లేక మఱియొక రామయ భాస్కరుని గుఱించి తెలుపునో యెఱుఁగము. ఏలయనఁగా రావిపాటి తిప్పరాజు క్రీడాభిరామమున స్మరింపఁబడియె. కొండవీటి గోపీనాథ దేవాలయ ద్వారప్రాంతమున లిఖింపఁబడిన-

సీ॥ నిర్మించెనేమంత్రి నిరుపమ ప్రాకార
నవకంబుగా గోపినాథపురము
గెలిచినాదేమంత్రి లలిత విక్రమమునఁ
బ్రబలుఁడై యవనుల బలమునెల్ల
నిలిపినాఁడేమంత్రి నియత వైభవమున
గోపికావల్లభు గూర్మి వెలయఁ
బాలించెనేమంత్రి ప్రకట ధర్మఖ్యాతి
మహిమమీఱఁగ నాంధ్ర మండలంబు
నతఁడు భూపాల మంత్రీంద్ర సతత వినుత
ధీవిశారదుఁ డచ్యుత దేవరాయ
మాన్యహితవర్తనుఁడు శౌర్య మహితయశుఁడు
భానుతేజుండు రామయ భాస్కరుండు॥

బయకార రామప్పకుఁ బినతండ్రియని తేలుచున్నది.

ఇట్టి ప్రఖ్యాత పురుషసంబంధియగు నిక్కావ్యము మధ్యకవుల కాలములో రచింపఁబడినను నించుక ప్రాచీనశైలిఁ జూపట్టుచున్నది. రచనాధోరణి యెఱ్ఱాప్రెగడ శ్రీనాథులకాలము స్మరింపఁజేయును దీనిలోనుండి కొన్ని పద్యము లుదాహరించెదను.

మ॥ విరహిగ్లానికరంబు భూజన సుఖావేశంబు నానావనీ
తరువల్లీతనుసిద్ధి షట్పదసముత్సాహంబు నిర్జీవిత
స్మరసంజీవన సిద్ధవిద్య పికవాఙ్మానవ్రతోద్యాపనం
బరుదెంచెన్ మధుమాస మంచితలతాంతామోదితాశాంతమై॥

సీ॥ మొకరి తుమ్మెద మూఁకిముట్టని నవకంపుఁ
   గ్రొవ్విరుల్ మేలేర్చి కోసికొనుచు
గండుఁగోయిల నోరఁగమిచిత్రుంచని మంచి
   చెలువంపులేఁ బొరల్ చిదిమికొనుచు
సమదకీరములు నాసలఁగ్రుచ్చి చూడని
   తనికమ్మపండ్లు విదల్చికొనుచు
నొలని తెమ్మెరలు తావులఁ గ్రుమ్మరింపని
   వఱలుపూఁదేనియల్ వడిచికొనుచు

భాను కిరణంబుచే నంటు పడనిపుట్టు
కేసరంబుల పుప్పొడి కిసలయంపు
బుట్టిగలఁ బట్టికొనుచు నింపులుదలిర్ప
సమదగజగామినులు కేలి సలిపిరంత॥

సీ॥ చిన్నారి ముత్యాల చేరుతోడ లలామ
   కంబు నెన్నొసలిపైఁ గదలియాడ
మీఁటినవస ఁాల్చు మెఱుఁగు బుగ్గలమీఁద
   మకరకుండలరుచుల్ మలసియాడ
పులిగోటివజ్రాల తళుకుల క్రొమ్మెఱుం
   గులు చిన్నయురముపైఁ గునిసియాడ
పెసరకాయలఁబోలు నెసకంపు నునువ్రేళ్ల
   నుంగరంబులచాయ లొలసియాడఁ

గటితటంబున మొలనూలి గంటలొలయఁ
నడుగుదమ్ముల మువ్వలు నందియలును
జప్పుడొప్పంగ ముందఱ తప్పటడుగు
లిడు తనూభవుఁగను వేడ్క కేదిసాటి.

సీ॥ అంతట నొక్కనాఁ డయ్యిందుముఖి మాత
   మకరదంష్ట్రి యను మంకుజఱభి
విటులెందఱేఁగోసి విడిచిన ముక్కును
   జెవులును భీకరస్థితి ఘటింపఁ

గాసుకాహత కశాఘాత జాతములైన
కాయలంగంబున గలయమెఱయఁ
గలహవేశల సారెఁగమిచ్చి త్రెంచఁగజీకి
చివికిఁబోయిన తలచీఁదురేగఁ

బొలుచు చెఱువుపొంత భూతంబు నా వగ్గు
రక్కెసనఁగఁ గాళరాత్రి నాఁగ
వివిధ విటుల పేర వేరు వితన లెట్టి
కుక్క నాఁగనున్కి వక్కురాలు॥

ఆ నరనాథపుత్రి యసమాయుధకేతన యష్టి యిందిరా
సూనుని భాగ్యదేవత ప్రసూన శిలీముఖు రాజ్యలక్ష్మి శో
భానిధి భాగినేయ మతి భాపజు మోహన బాణశక్తినాఁ
దా నుతికెక్కె సద్గుణ నిధానము వాసవదత్త యిమ్మహిన్.

ఈ కృతిరత్నము ముద్రితమైనచో నెల్లరకు నుల్లాసకారియనుట నిక్కమయ్యె నాకుమాత్రము ప్రథమదర్శనము ననంత సంతోషమును క్షణకాల పశ్చాత్తాపంబును జనియింపజేసె. బాల్యచాపల్యంబునను యతి గణప్రాస సంవేశన దర్పంబునను మృగావతియను కావ్యంబు బాల్యంబున రచియించి ముద్రింపించియుంటి నిమ్మహా కావ్యపఠనంబున మత్కావ్యంబు ముద్రితంబయ్యు మృతనష్ట కల్పంబయ్యెను దానికిఁ బునర్మరణంబు కలిగెననియు నట్లుంగాకున్నను సమాసన్నమరణభీతుఁడైన సూరన యర్పించు ప్రౌఢ సారస్వత సర్వస్వ ముకుటాయమానంబగు నుదయనోదయముతోఁ బాలజల్పితకలంకితంబును బహుదోషదూషిత గహనకంటక లతాకల్పంబును నగు మత్కావ్యంబును బోల్పఁజాలు విమర్శకుల విస్మయ కోపసంతాపావధీరణ బీభత్సాది వికృతి సంప్లవంబునకు గారణంబయ్యెననియు బలుమఱు సంతాపించియుఁ గావ్యరచనా చాపలంబు క్షణభంగురంబగు కీర్తికాసించినను నిరవధికమగు దుష్కీర్తి నాపాదింపఁజాలెననియు బహుభంగుల నాకు శోకింపవలసె. ఏలయన మృగావతి కథయు, నుదయనోదయ కథయు నొక్కటియె. పూర్వకృతి వాసవదత్తా వివాహపర్యంతము కలదు. మత్కృతి యుదయన జననముతో నిలుచుచున్నది. కాని విద్యాసంస్కారమునను, రచనాభ్యాస పాటవమునను

భావనా చమత్కృతిఁబంచుసు, బహురసాస్వాద సంపాదిత హృదయవాసనా పరిపాక ముద్రిత భావనాప్రపంచ సహస్రరేఖా విజృంభణమునను మిన్నయగు తత్కృతియు నేగుణంబును నించుకయేని లేక యనాస్వాదితానావిష్టవిద్యాలోక ధర్మంబగు మత్కృతియు నేకతులారోపణంబు సేయుటయె విమర్శకులకుఁ గల ప్రతిభంగ కారణంబని యూహింపవలయు. కావ్యనిర్మాణ చపలులకుఁ గలుగు వైషమ్యమును బరిహాసభాజనత్వమును గేవల ముత్తమకావ్యరసాబ్ధి నిమజ్జనోన్మజ్జన సుభగులకుఁ బొరయదని యూహించినను దారతమ్య జ్ఞానసంపాదనంబునకును సహృదయ హృదయ సంవదనాపాదనంబునకును, వికృతిలేకున్న నిర్ద్వైతమగు ప్రకృతికి సౌందర్యద్యోతనం బెట్లు గలుగనేర్చుననియు సమాశ్వాసము చేసికొనవలసె.

భారతి, జూలై 1925 — ౦. రామకృష్ణకవి

# 14. లీలావతి కథ

ఇదియొక ప్రాకృతకావ్యము. సంపూర్ణవ్యాకరణములేని యాంధ్రభాషలో శబ్దసంస్కార మెఱుంగుటకుఁ బ్రాకృతభాషలు చాలఁ బ్రయోజనకారులగును. నన్నెచోడుని కుమారసంభవములోని ప్రాచీన ప్రయోగములకంటెఁ, గొన్ని శిలాతామ్ర శాసనప్రయోగములకంటెను, బ్రాచీన తరములగు వేఱు అక్షరములు గానరాకున్నందునఁ దెనుఁగు శబ్దముల మూలమును బరీక్షింప సంస్కృత, ప్రాకృత, శౌరసేనీ, మాగధీ, పైశాచులుతప్ప గత్యంతరములేదు. పాశ్చాత్యు లగు శబ్దతత్త్వజ్ఞులు సకలభాషామూల పరిశోధకులై యార్యభాషా సంఘముతో ద్రవిడభాషా సంఘమునకు సంబంధములేదని యుద్ఘోషింతురు. కాని ద్రవిడభాష లకు సంస్కృత ప్రాకృతములే మూలములనియు, విశేషించి ద్రవిడభాషా సంఘములో నాంధ్రభాషా శబ్దములే తమిళ కర్ణాటభాషావదములకంటెఁ బ్రకృతి రూపసంపన్నములనియు, నాంధ్రభాషా శబ్దధాతు రూపములకు మూలధాతువులు కొన్నియేయనియు, నవి ద్రవిడభాషాసంఘమునకెల్ల సాధారణ ధాతువులనియుఁ, దత్ప్రయత్నము ప్రాచీన సంస్కృత ప్రాకృత వికార ధర్మవంతమనియు, మాయభిప్రాయము. ఏతద్భావ సంస్కారముతో సంస్కృత ప్రాకృత కావ్య పరిశోధనము ముఖ్యమని నివేదించుటకే యప్పుడప్పుడు తద్భాషా గ్రంథ సంజల్పముతోఁ గాలవిడంబము చేయఁగోరుచున్న మమ్ము భాషావేదులు క్షమింతురుగాక.

ప్రాకృతభాషను మనపూర్వులు చాల నాదరించిరనుటకుఁ బెద్దకోమటి వేమభూపతి శ్రీనాథాదులు సాక్షులగుచున్నారు. ప్రాకృతములో సప్తశతియు, సేతుబంధమును జాలఁ బ్రౌఢములైనవి. బహుకవి సుభాషితరత్నముల సమాహ రించి శాలివాహనుఁడు పద్యకోశముగా సప్తశతియను పేరఁ గూర్చెను. సేతు బంధకర్త ప్రవరసేనుఁడను కుంతలాధీశ్వరుఁడు కాళిదాసునకు మిత్రమట. కాళిదాస భవభూతులు విదర్భదేశవాసులనియు, దానినాంధ్రులనియు విశ్వసించు చున్నాము. విక్రమాదిత్యుఁడు సంస్కృతమును బోషించినట్లే శాలివాహనుఁడు ప్రాకృతమును గొనియాడెను. బౌద్ధమత ప్రచారబలమున దేశభాషా ప్రవృద్ధి చెందుచున్న కాలములో మహారాష్ట్రి దేశవ్యాప్తమగు ప్రాకృత విశేషమును

శాలివాహనాదులు గ్రంధస్థమగునట్లు లక్ష్యలక్షణ సంపన్నముగా జేసిరోయని యూహించెదము.

"శ్రూయతే చ కుంతలేషు సాతవాహనో నామరాజా,
తేన ప్రాకృతభాషాత్మక, మంతఃపుర ఏవేతి సమానం పూర్వేణ"

అని రాజశేఖరుడును,

"కేఽభూవ న్నాఢ్యరాజస్య, రాజ్యే ప్రాకృతభాషిణః,
కాలే శ్రీసాహసాంకస్య, కేన సంస్కృత వాచినః"

అని శృంగార ప్రకాశమున భోజుండును సాతవాహనుని ప్రాకృత భాషాదరమును వర్ణించియున్నారు. ఆఢ్యరాజే శాతవాహనుఁడని రత్నేశ్వరమిత్రాదుల మతము. ప్రాకృతభాషలో మధురమై ప్రసన్న గంభీర భావగర్భమైన కావ్య సంచయమే మనకాలమువఱకు శేషించె. సర్వసేనుని హరివిజయము, నాఢ్యరాజు రావణవిజయము, మారీచవిజయాదులు నంతరించెననుట శోచనీయము.

శాతవాహన నామకరాజ వంశజులు ప్రాకృతభాషాదరణ మఖండముగాఁ జూపి సంగీత సాహిత్యశాస్త్రములుకూడ నందే కూర్పించుచుండిరి. తుంబురుఁడు తన నాట్యశాస్త్రమును ప్రాకృతముననే రచించి శాతరాజును దద్గ్రంథాంతమున నిట్టు పేర్కొనుచున్నాడు.

జఇ వడఇ సాఅశా అ
గంధర్వ కశంజ...తుంబురుణా
సరదవిణోదేణ కిదం
నాడ అగే అంసలక్షణం ఏదం."

ఛాయా !-

[యది పఠతి శాతరాజా గంధర్వకళాం
నో (గంధర్వకులజేన) తుంబురుణా, శరద్వి
దేవ కృతం నాటక గేయస్య లక్షణ మేతత్]

"అమిఅం పాఅడకబ్బం" (అమృతం ప్రాకృతకావ్యమ్)అని శ్లాఘగన్న తద్భాషా కావ్యజాలములో లీలావతి యను నొక గ్రంథము మేము చదివి యానందింపఁ గంటిమి. సహృదయాహ్లాదకరమగు దానిగుఱించి యించుక నివేదింపంబూనుట కేవలము జిహ్వాచాపలమే.

లీలావతీ కథానాయకుఁడు సుప్రసిద్ధుఁడగు హాలుడను శాతవాహనుఁడు. లీలావతి సింహళ రాజకుమారిక. దానిచెలులు మహాణుమతియుఁ, గువలయావళియు. కాదంబరీకథలో మహాశ్వేతవలె మహాణుమతి యిందుపనాయికయయ్యె హృదయదారణమగు శోకరస సామ్రాజ్యమును నెలకొల్పుచున్నది. కవిపేరు మాత్రము గానరాదు. అతనితండ్రి భూషణభట్టు. తాత బహుళాదిత్యుఁడు. వీరిరువురును నాల్గువేదముల నేకముఖమున నక్లిష్టముగావహించినవారు. యజ్ఞముల నొనర్చి దేవఋణమునఁ బాసి త్రివర్గఫలమును బొందినవారు. ఇట్టి శ్రోత్రియ వంశమునఁబుట్టిన మహాకవియయ్యుఁ దన నామధేయమును బ్రకటింపనొల్లక ''యసారమతి''యను నొక విశేషణమును బ్రయోగించుకొనుట వినయధార్ఢ్యము లలో నొండని కొందఱు తలఁతురు. ఈకవి యేకాలమువాఁడో స్పష్టముగాఁ దెలియరాదు. హేమచంద్రుఁడు కావ్యానుశాసనమున—

> ''గద్యేన పద్యేన వా సర్వభాషా కథా...కాచిద్గద్యమయీ
> కాదంబరీ కాచిత్పద్యమయీ యథా లీలావతీ''

అని దాని స్మరించుచున్నాడు.

క్రీ. శ. 1000 లో నుండిన వల్లభాచార్యుఁడు న్యాయలీలావతి యను వైశేషికగ్రంథమున నార్షజ్ఞాన ప్రకరణమున,

> ''యథా వా స్వేచ్ఛాస్మృత పదార్థ సార్థే శాలివాహనో నృపతి
> రిదానీం శృంగార సరసేతరే దేవ్యా లీలా వ్యసహ లలిత మధురం
> సంగీతకమను తిష్ఠతీతిజ్ఞానమ్''

అని దాని నుదాహరించెను.

క్రీ. శ. 1000–1050లో నుండిన భోజుఁడు దౌత్యప్రకాశమున ''సహ పాంశుక్రీడా కువలయావళీ మహాణుమత్యాం లీలావత్యాం'' అనియు, ఐదు నొకొండవ ప్రకాశమున గథా లక్షణ ఘట్టమున ''యా నియమితగతిభాషా దివ్యా దివ్యోభయేతి వృత్తవతీ, కాదంబరీవ లీలావతీవ వాసా కథా కథితా'' యనియు లీలావతిం బేర్కొనియె. ఈ లీలావతి సంస్కృత కృతియో లేక భాషాంతర నిబద్ధ కావ్యాంతరమో యనియుఁ గొందఱు తలఁపవచ్చును. భోజుఁ డనురాగప్రకాశమున నుదాహరించిన

"తాకా బహు ఏహింమి
చింతె ఏహిం నలకూబరో వరో హోఉ,
ఏత్తాహి వస్స తణఓ
గఅముహ మహతుహ వసాఏణ''

అను పద్యము లీలావతిలో 321వ పద్యముగా నున్నది. మఱియు నందే యుదాహరింపఁబడినది.

"జం అణు ఇఅం కుమారీ
అణస్సలజ్జా ఏ సాహి ఆకులస్స
తం సంవిసేసం విఅన హి
మహహ అహి అఏణ పారద్ధం''

అనునది 485వ దిగాను,

"తం సిద్ధకుమారం వే
చ్ఛి ఊణ ఏఏహిం సహిఅణజ్జేహిం
అవిణయమగ్గోహఅలో
అణాహిం నీఅమ్హకిం భణిమో॥

అనునది 487వ దిగాను,

"నసహఇ కాలక్ఖేవో
హి అ అం మహ మయణహు ఆవహపతిత్తాం
తస్సది సందేహగ అం
నిసు అంచిఅతఏవి''

అనునది 566వ పద్యముగాను లీలావతిలోఁ గానవచ్చుచున్నందున భోజుఁడు పేర్కొన్న గ్రంథము మనప్రాకృతకావ్యమే యని యూహించుకొన వచ్చును. కావ్యశైలి నిపుణముగాఁ బరీక్షింపఁ బ్రవరసేనుని సేతబంధరచనకును, హరివిజయ రావణవిజయ రచనలకును జాలవఱకుఁ బోలియున్నది. ఈ కడపటి రెండుగ్రంథము లిప్పుడు లభింపకున్నను నూఱులకొలఁది పద్యములు భోజాదులచే నుద్ధరింపఁబడినవి విమర్శకులకు గోచరములే. హరివిజయకారుఁడు ప్రవరసేనునకుఁ బూర్వుఁడు. ప్రవరసేనుఁడు వాకటకరాజగు కుంతలేశ్వరుఁ డాంధ్రదేశమునుగూడ జయించి రామగిరిలోఁ గొంతకాలమేలుచున్నట్లూహింపనై

యున్నది. ఇతడు క్రీ. శ. 420 కాలములో నుండియుండును. లీలావతిలోని ప్రాకృత రచనను గ్రంథకర్తయే,

"భణిఅం చ, పియఅమాఏ
రఇఅం మరహట్ట దేసిభాసాఏ
అంగాఇం ఇమీకహాఏ
సజ్జణసంగజోగాఇ"
"భణితం చ ప్రియతమాయై
రచితం మహారాష్ట్రి దేశ భాషాయామ్
అంగాన్యేతత్కథాయాం
సజనాసంగయోగ్యాని."

అని చెప్పుటచే మహారాష్ట్రి ప్రాకృతమున నిది రచింపఁబడియెనని చెప్పు చున్నాఁడు.

"మహారాష్ట్రాశ్రయాం భాషాం
ప్రకృష్టం ప్రాకృతం విదుః
సాగరః సూక్తి రత్నానాం
సేతుబంధాది యన్మయమ్'

అని దండి ప్రశంసించిన యీ ప్రకృష్ట ప్రాకృతముననే హరివిజయ సేతుబంధ లీలావతులు రచింపఁబడుటచే నించుమించుగా నివి నాతి చిరకాలాంతర ప్రబద్ధములై, ప్రాకృతభాషా పఠనావేశకాల విద్వద్గోష్ఠీరంజకములై యుండు ననుటకు సందేహములేదు. అట్లు తలంచిచూడ లీలావతి క్రీ. శ. 600 నుండి 700 లోగా రచింపబడియుండును. లేకున్న దత్పూర్వకాలకృతమేమో. దీనిలోఁ గాళిదాస కవనచ్ఛాయయు, బాణుని శ్లేషరేఖయు రెండుమూఁడు స్థలములలోఁ గలవు. కాళిదాస బాణులయందు మనకుఁగల పరమభక్తియే లీలావతీకారుఁడే వారి గ్రంథములలోనుండి యొండు రెండు భావములు గ్రహించెనేమోయని యతనికే కళంకమాపాదింపఁబురికొల్పుచున్నది. కాళిదాసుఁడు విక్రమోర్వశిలో-

"అస్యాః సర్గ విధే ప్రజాపతి రభూ
చ్చంద్రో ను కాంతిప్రదః
శృంగారైకరసః స్వయం ను మదనో
మాసో ను పుష్పాకరః,

వేదాభ్యాస జడః కథంను
విషయవ్యావృత్త కౌతూహలో
నిర్మాతుం ప్రభవే న్మనోహర మిదం
రూపం పురాణో మునిః"

అని వర్ణించిన యుర్వశీవర్ణనలోని "వేదాభ్యాస జడః" "విషయవ్యావృత్త కౌతూహలః" "పురాణః" అను విశేషణములను లీలావతిలో,

"అహ కహ వేయ జడస్స
తస్స విసయాహిలాస విముహస్స
నిప్పజ్జఇ లోఅపిఆ
మహ స్స ఏవంవిహం రూవం"
[అథ కథం వేదజడస్య తస్య
విషయాభిలాష విముఖస్య,
నిష్పద్యతే లోకపితామహ
స్యైవం విధం రూపమ్]

అను కథానాయికా వర్ణనములో "వేదజడస్య, విషయాభిలాష విముఖస్య, పితామహస్య" యను విశేషణములకును బోలిక గలదని తోఁచుచున్నది.

మఱియు లీలావతిలో శాలివాహన ప్రశంసలో—

"జోసో అవిగ్గహో విహు
సవ్వంగావయవ సుందరో సుహఓ,
దుద్దంసణోవి లోఅణం
లోఅణాణందసంజణతో — 63.
కువఈవి వల్లహో పణ
యియా ణ తహ నయపరో వి సాహసిఓ,
పరలోఅభీరు ఓవిహు
వీరేక్కరసోతహచ్చేఅ — " 64.
సూ(శూ)రోవి న సత్తాసో
సోమోవి కలంకవజ్జిఓ నిచ్చం
భోఈ వి న దోజీహో
తుంగోవి సమీవ దిన్నాఫలో — 65.

[యోఽసావవిగ్రహోఽపిఖలు
సర్వాంగావయవసుందరః సుభగః,
దుర్దర్శనోఽపి లోకానాం
లోచనానంద సంజననః.

కుపతిరపి వల్లభః ప్రణ
యినాం తథా నయపరోఽపి సాహసికో,
పరలోకభీరు రపి ఖలు
వీరైకరస స్తథైవ.

సూ(శూ)రోఽపి స సప్తాశ్వః
సోమోపి కలంకవర్జితో నిత్యమ్,
భోగ్యపి న ద్విజిహ్వ
స్తుంగోఽపి సమీపదత్త ఫలః]

అనునది బాణకవి రచనా చమత్క్రృతితో నాశ్లేషించుచున్నది.

లీలావతిలోని మధుపానవర్ణనమున

వివిహాఇం వివిహావణ్ణు
జ్జలాఇం సహఆరసురహి వాసాహిం।
నీలుప్పల పరిమళవా
సిఆఇం దిజ్జంసి పాణాఇం॥ 1263.

[వివిధాని వివిధవర్ణోజ్జ్వలాని
సహకార సురభి వాసితాని
నీలోత్పల పరిమళవాసితాని
దృశ్యంతే పానాని]

అను భాగముతో నీశ్వరసేనుని ధూ ర్తవిటసంవాదములోని

నచకిలశక్యం సముపచితోత్పలఖండకానాం
సహకారతైలోద్గత చంద్రకాణాం కామినీ
నిశ్వాస విక్షోభిత తరంగాణాం ప్రస్ర్ఫుత్తబర్హి
ణాకారాణాం వారుణిచషకాణాం గంధ
మాత్రమపి విజ్ఞాతమ్"

అనుభాగము సంవాదము చెందుచున్నది. ఈ ముప్వురిలో బాణుఁడర్వా చీనుఁడు. కావున లీలావతీకారుఁడు పరభావగ్రహణపారంపరీవిలాస దృష్టితోఁ జూచినను క్రీ॥శ॥ 700 కంటె నిటీవలివాఁడు కాఁడు.

మఱియు గథాభాగమున నుపనాయికయగు మహాణుమతి సప్తగోదావరీ క్షేత్రమగు భీమేశ్వరాలయ సమీపమునఁ బాశుపతాశ్రమమును నిర్మించుకొని తన విరహావస్థచేఁబూనిన పాశుపతవ్రతమునఁ గాలముపుచ్చుచుండెననియుఁ దత్పినాకిభవన పాశుపతాశ్రమములు గోదావరీతరంగ పవిత్రితప్రాంతము లనియు నిందు వర్ణింపఁబడియె—

"తం సత్తాముహవిహత్తాం
ఋనివహ నిద్ధోఅకలి మలుప్పంకం।
కహ కహవి దేసుఇరే
ణసత్తా గోదావరీ భీమం॥
[తం సప్తముఖ విహస్తాం
ఋనివహ నిర్ధూతకలిమలోత్పంకమ్
కథం కథమపి దేవ
సుచిరేణ సప్తగోదావరీ భీమమ్] 190

"ఇయ తస్స కణఅ దేవా
అయస్స దాహిణ దిసాఇఅణులగ్గం।
గోలాణఇవయణవిసే
సఅంవ రమ్మం మఠాయఅణం॥
[ఇతి తస్యకనకదేవా
లయస్య దక్షిణ దిశ్యనులగ్నమ్
గోదావరీనదీ వదనవిశే
షక మివ రమ్యం మఠాయతనమ్] 242

"ఏవం భణిఓ సోతే
ణనరవఈ అగణిఏహిందియహేహిం
సంపత్తో కమలదళ
చ్ఛిసత్త గోదావరీభీమం"

[ఏవం భణితః సతే
నరపతి రగణితై ర్దివసైః,
సంప్రాప్తః కమలదళాక్షి
సప్త గోదావరీ భీమమ్] 1147

ఇత్యాది వర్ణనములచే మహాఋమతి యాశ్రమము సప్తగోదావరీక్షేత్ర మగు దాక్షారామములోనని యూహింపవలసియున్నది. దీనిలో దక్ష దక్షారామ ప్రశంసలు గానరాదు గాని భవానీప్రాధాన్యము చూపఁబడియె. ఈ సందర్భమున దక్షారామము అష్టాదశశాక్తేయ పీఠములలో నొకటియని స్మరించుకొనవలయును,

"కొల్లాపూర్యాం మహాలక్ష్మీ
ర్మాహు రావేకవీరికా,
ఉజ్జయిన్యాం మహాకాళీ
పీఠాయాం పురుహూతికా
ఒడ్డాదౌ గిరిజాదేవీ
మాణిక్యా దక్షవాటకే"

అను పురాణవచనము కలదు. మఱియు దక్షారామమున సప్తగోదావర మను సరస్సుకలదు కాని సప్తహస్తాలంకారభీమమగు గోదావరినది కానరాదు. మఱియు నానది మూఁడుక్రోశములదూరమున నున్నది. భీమేశ్వరపురాణమున గోదావరి యచ్చట భయంకరముగా బ్రవహించినట్లును, మహర్షుల ప్రార్థనమున నంత ర్వాహిని యయ్యెననియుఁ జెప్పఁబడియె.

నన్నయభట్టు "జగదాదియైన భీమేశ్వరంబును" అని పొగడిన యనాది క్షేత్రము మొట్టమొదలు గోదావరీతీరముననే సప్తశాఖాప్రవాహదర్శన రమణీయంబుగ నిర్మింపఁబడియుండుననియుఁ గాలక్రమమున నది దక్షిణదిక్కునకు దూరముగాఁ దొలఁగి ప్రవహించుచుండ నచ్చటి సరోవరమే సప్తగోదావరనామంబునఁ బరగుచున్నదనియు నూహించుచున్నాము. లీలావతీరచనాకాలమున గోదావరి దాక్షారామమునొద్దనే సప్తహస్తాభిరామయై విహరించి కొంతదూరముననే సముద్రునింజేరుచుండును. దక్షునిసంబంధమగు స్థలమహత్త్వము కాలక్రమమున నుద్భవించియుండునేమో!' కావున నీదృష్టితోఁజూచినను లీలావతీకారుఁడించుక ప్రాచీనుఁడై యుండును.

మఱియు గథానాయకుఁడగు శాలివాహనుఁడు హాలుఁడను నామాంతరముగల సుప్రసిద్ధుఁడు. ప్రాకృతభాషాభిమాని. గుణాఢ్యుఁడు పైశాచీభాషతో బృహత్కథను రచించి యితనియొద్దకే పంపెను. శ్రీపాలితుఁడను మహాకవి యితని యాస్థానభూషణము. తరంగలోల యను నద్భుతకథావిశేషమును ప్రాకృతమున రచించి కీర్తిఁగన్నవాఁడు. లీలావతీకారుఁడు శ్రీపాలితుఁడా లేక హాలుని సభాలంకారుఁడగు మఱియొకఁడా ? అట్లాకాలమువాఁడైనయెడల మహాణుమతి మొదలగు గంధర్వజాతిస్త్రీలకథతో మనుష్యనాయకులగు లీలావతీ శాలివాహనుల కథ కలిపి యసంభవముగ హాలుని జీవితకాలములో నెట్లు సంభావితముగాఁ గవి ప్రచురింపనేర్చు ? ఈ సంశయమును దొలగింపఁ గవి కల్పనలు గలవు. పరిమళకవి సింధురాజు నాశ్రితుఁడై నవసాహసాంకచరిత్ర మనుపేర నతని కథయే రచించి యందు సింధులుఁడు పాతాళమునకేఁగి శశిప్రభ యను కన్యను వరించినట్లు వర్ణించుటను సింధురాజెట్లు మన్నించె ? ఇది యసంభవము కాదా ?

దీనినే మేము సప్తపదీవిలాసమను షడ్దర్శనీగర్భిత హాస్యప్రబంధమున సంస్కృత కవివర్ణనమున నిట్లు లిఖించితిమి.

సీ॥ "పద్మావతీదేవి పడకింటఁగలఁ గాంచి
వానవదత్తకై భాసుఁడేడ్చె
నూఱేండ్లకగ్నిలో దూఱి శూద్రకరాజు
చిత్తమెల్ల వసంతసేనకిచ్చె
జానకీహరణంబు జగము మెచ్చఁగఁజేసి
రావణుఁదన్నె లంకావిభుండు
భిక్షాటనముచేసి బృందారకస్త్రీల
శివభక్తదాసుఁడు చెఱలఁబట్టె
పందికొక్కవోలెఁ బాతాళమునుద్రవ్వె
బరిమళుఁడు శశి ప్రభాగవేక్ష
సప్తపదుల నేడుసారులు ద్రొక్కించు
తరుణికొసఁగినాఁడ ధర్మకవిత"

ప్రాకృతకావ్యవిమర్శన మహాగహనానుయాయి పాఠకమహాశయులకు విశ్రాంతికావ్యముగానో లేక, నాటకరంగము నడుమ నసంబద్ధప్రలాపమున

విదూషకుండుంబోలె, స్వోత్కర్ష డిండిమ తాడనంబుననో, మనఃశ్రోత్రాయస కరముగా మా పద్యముదాహరించినందులకు వారు క్షమింతురుగాక.

కాళకళభకవి, ఖల్లాళరాజగు సోమేశ్వరుఁడు చోళరాజును మహేంద్ర మంగలమను స్థలమున నోడించి యతని పుత్రిని వివాహమాడి పరమేశ్వర సాన్నిధ్యమునఁ దనకీర్తిని నారదవ్యాసులచేఁ బాడించుకొనియె నను నద్భుత కల్పనఁగల్పింపఁగ సోమేశ్వరుని విద్వత్సభ దాని నెట్లుఁ గీర్తించె? నెట్లంగీకరించె? కావున దివ్యమానుషసంపర్కతరంగితములగు ప్రభుచర్యావర్ణనంబులును గవులయెడఁ గావ్యధర్మమే యగుచున్నందున లీలావతి కర్తయు శాలివాహనుని యాస్థానకవియై యుండునన్న వాదమంత యసమంజసము కానేరదు.

ఇఁకఁ గథానాయకుఁడగు హాలునిఁగూర్చి విచారింతము. శాలివాహన శబ్దము వంశనామము. పెక్కండ్రావంశమున బుట్టి మగధాంధ్రకుంతల లావంత్యా నూప విదర్భదేశములఁ బరిపాలించిరి. వారిలో హాలుఁడు సుప్రసిద్ధుఁడు. వీరి నాంధ్రచరిత్రకారు లాంధ్రరాజులని పేర్కొనుచున్నారు కాని యదియెట్లు సిద్ధాంతమగునో యెఱుఁగరాదు. వారాంధ్రదేశమునుగూడఁ బరిపాలించుటయు గోదాతీరమున నుండు ప్రతిష్ఠానపురమునను బిదప నాంధ్రమండలములోని ధాన్యకటకమందును రాజధానుల నిర్మించుకొనియుండుటయు నిక్కమే కాని వారుపుట్టుకచే నాంధ్రులాయని సందియముకలదు. వారిలో హాలుఁడేకాలము వాఁడు? వాని సమకాలికులెవ్వరు? వానికథలు విలసిల్లునంత ఘనకార్యముల నతఁడేమిచేసె? అను సందేహము లుప్పతిల్లుట యెల్లరకు సహజమే.

లీలావతిలోఁ గవి శాలివాహనుని సాలాహణుఁడనియు సాలవాహణుఁ డనియుఁ బ్రాకృతరూపములఁ బేర్కొనుటయేకాక స్పష్టముగా హాలుఁడని సహితము పర్యాయవాచకముఁ బ్రయోగించుచున్నాఁడు.

"తో గురువ అరేణ ఏసా
తం చియవ హుమన్ని ఊణతహభణి అం,
సవ్వాయరేణ హాల
స్స పేసి ఆవచ్ఛ ఓ సహాఏ."

[తతో గసుపచనేష్వైషా
తమేవ బహుమత్వా తథా భణితమ్
సర్వాపరేణ హాలస్య ప్రేరా
వ్రజతు ప్రభాతే 673]
లేచ్చిరయాలంప ఇమో
కోస హాలస్స పరివసిఓ 974.

ఈ హాలుఁడు మత్స్యాది పురాణ వంశానుచరితముల ననుసరించియు పాశ్చాత్యుల కాలనిర్ణయము ననుసరించియు క్రీస్తు పూర్వము మూఁడవశతాబ్దిలో నుండెనని చెప్పవలసియుండును. లీలావతి తండ్రి సింహళరాజగు శిలామేఘుఁడు హాలుని యాస్థానమున మంత్రిపదవిలోనున్నవాఁడు నాగార్జునభిక్షువని మన కావ్యములలోఁ గలదు.

బహుమన్నంతోతం చిఅ
మరణం సంతోసదిన్న నియహి అఓ
నాయజ్జు ణో వరోహే
ణనిగ్గ ఓనియపురా హింతో 1018.
నాయజ్జుణ భిక్ఖుపుర
స్సరేణ సంతార సంఠిఓరాయా,
విజయాణందేణ సమం
వివరా హుత్తాం పరిక్కంతో॥
[బహుమన్మత స్తమేవ
మరణం సంతోషదత్తా నిజహృదయే,
నాగార్జునోపరోధేన
నిర్గతో నిజపురాభిముఖః
నాగార్జున భిక్షుపుర
స్సరేణ సరిత్తీర సంస్థితోరాజా,
విజయానందేన సమం
వివరాభిముఖం పరిక్రాంతః ]

సిద్ధనాగార్జునభిక్షువు క్రీ॥శ॥ రెండవశతాబ్దములోనుండి మాధ్యమికసిద్ధాంతమును నెలకొల్పెనని పాశ్చాత్యపండితుల యభిప్రాయము. కథాసరిత్సాగరము

లోనే నాగార్జునకథ కలదు. గుణాఢ్యుఁడే యక్కథను బృహత్కథలోఁ బొందించియుండవలయును. గుణాఢ్యహాలులు క్రీ॥పూ॥ మూఁడవశతాబ్దివారని తోఁచుచున్నది.

మఱియు హాలునకుఁ గుమారుఁడను మంత్రియొకఁడున్నట్లు లీలావతిలోఁ గలదు. అతఁడు మీమాంసాప్రవర్తకుఁడను కుమారిలభట్టు కాఁడు. అట్లు ద్యోతింపఁజేయు విశేషగుణములును గానరావు. శాతవాహనుని సప్తశతిలో ప్రాచీనకవిపద్యములును గలవు. అతని యాస్థానకవి యగు శ్రీపాలితుని శ్లోకములు పెక్కులు గలవు కదా! బొంబాయిలో ముద్రింపఁబడిన సప్తశతిలోఁ బ్రథమశతకాష్టమగాథ కుమారిలకృతము. కావున మీమాంసునకంటెఁ బ్రాకృతకవి కుమారిలుఁడన్యుఁడును బ్రాచీనతరుఁడునై యుండును.

మఱి నిందు నగ్నపాశుపతుఁడొకఁడు మహాణుమతీ కథాసందర్భమున భీమేశ్వరమునఁ బాశుపతమఠమున నుండువాఁడుగా వర్ణితుఁడై యున్నాఁడు. పాశుపతశైవము చాల నధునాతనమని కొంచఱి యభిప్రాయము. లకులేశుఁడే దాని స్థాపించెననియు, నతఁడు క్రీ॥శ॥ పదియవశతాబ్దివాఁడనియు భావించెదరు. లకులేశుఁ డంతకంటెను బూర్వుఁడేకాని యతఁడు తన్మతోద్ధారకుఁడేకాని తన్మత జనకుఁడు కాఁడు. క్రీ॥ శ॥ ఆరవశతాబ్దిలోనే పాశుపతసిద్ధాంతమనుష్ఠానములో నున్నట్లు మహేంద్రవిక్రముని మత్తవిలాసప్రహసనములవలనఁ దేలుచున్నది.

భరతమహర్షియు నాట్యశాస్త్రమున

"నానాచిత్రాణి వాసాంసి
కుర్యాత్పాశుపతే ష్వథ."

అధ్యా 21. శ్లో 110.

ముని నిర్గ్రంధ శాక్యేషు
యతి పాశుపతేషుచ॥

అధ్యా 21. శ్లో 108.

అని చెప్పుటచేఁ బ్రాచీనుఁడగు భరతునికంటెఁ బాశుపతులు ప్రాచీనతరులనుట నిర్వివాదాంశము. వీరిలో సంయమావస్థయను నుత్తమయోగమున నగ్నత్వ మాచార్యులకు విధానమే యనుటకు హరిభద్రాచార్యుఁడు షడ్దర్శనసముచ్చయ మను గ్రంథమునఁ బాశుపతసమయప్రకరణమున నిట్లుపష్టంభముగాఁ జెప్పు చున్నాఁడు. "తేచదండధరా ప్రౌఢకౌపీన పరిధానాః, కంబళికాప్రావృతాః,

జటాధారిణో, భస్మోద్ధూళనకరాః, యజ్ఞోపవీతినో, జలాధారపాత్రకరాః, నీరసాహారాః, ప్రాయోవనవాసినో, దోర్మూలేతుంబకంప్రాయాజాః, కందమూల ఫలాశినః, ఆతిథ్య కర్మనిరతాః, సస్త్రీకాః, నిస్త్రీకాస్తేషాత్తమాః, తేచపంచాగ్ని సాధనపరాః, కరేజటాదౌచ ప్రాణలింగధరాశ్చభవంతి, ఉత్తమాం సంయమా వస్థాం ప్రాప్తాస్తు నగ్నం భ్రమంతి" అని.

ఈ సందర్భమున నొక యంశ మపభ్రంశప్రాయమైనను నించుక వ్యవ ధానముతోఁ బరీక్షించినయెడల దేశచరిత్ర నమ్మర్శనమునకు సహకారియగునని యప్రస్తుతముగా స్మరించుచున్నారము. దీనిలో లీలావతి సింహళరాజకుమారి. ప్రాకృతమున సింగళమనియున్నందున సంస్కృతమున సింహళ సింగళశబ్దము లలో దేనినైన గ్రహింపవచ్చును. సింగళమనునొక ద్వీపము శ్రీకూర్మమునకు దక్షిణముగా గోదావరీమండలప్రాంత సముద్రముననే యున్నదని చెప్పుదురు. దానిసమీపముననే రామేశ్వరమను మఱియొక ద్వీపముకూడఁ గలదు. మేఘ నామకులగు రాజులు కళింగమునఁ బరిపాలించుచున్నట్లు తెలియుచున్నందునను మనగ్రంథములోని సింహళమే యా సంగళద్వీపమని కొందఱు వాదింపవచ్చును. మాకు నేఁటిపఱకును విశదముగా నర్థముకాని భీమకవిపద్యమగు

"ఆనీతాభ్యుపదాను సింగళాలద
భ్యాలంబిత స్తంభమా"

అనుదానిలో శృంఖల సింగళాది పాఠములీ సింగళద్వీపమునే సూచించినను లీలావతిలోని సింగళము రావణుని లంకయగు సింహళమనియే తోఁచుచున్నది. దీనిలో మలయాచలమును, గేరళపురమును ప్రధానకథలో వచ్చుటయేకాక సముద్రవేలావన రమణీయకవర్ణన ప్రఘట్టకమున

"లక్ఖిజ్జ ఇ అజ్జ విగుం
జిరావి ఉలవలయవా ఉలల అహిం,
మహణుత్తిణ్ణే రావణ
ముగ్గోసత్తచ్ఛ అతరాణహిం
సేవిజ్జ ఇ సరసోహం
సకణఅ భవణేసు సిద్ధమిధుణేహిం
జమ్మిలవంగే లావణ
పరిమళవాసి ఓ పవణో"- 174

అని యేలాలవంగసంవాసనురభిశ్వసిత సుఖమగు దక్షిణాశావధూవిలాసమును వర్ణించుటయుఁ బ్రాకృతభాషాను సంధిమహిమచే అమృతమథనోత్తీర్ణమగు నైరావతమార్గమును గుంజదళికులవ్యాకులశాఖంబులగు సప్తచ్ఛద తరువులు సూచించుచున్న వనివర్ణనమున రావణమార్గము సప్తచ్ఛదతరువులచే గుంజదళికుల శాఖాహస్తవ్యాజమున నిరోధింపఁబడియె నను ధ్వనితప్రక్రియయు సింహళ మనియే శాసింపనేర్చును.

ఇఁక నిట్టి సంశయ డోలాభిరోహణక్రీడల విమర్శకభావనా విలసితం బుగ వదలి కొంతతడవు కథా శరీరసౌందర్యవిభాగవిస్మిత హృదయులమై విహరింతము.

"నిశ్శేష సస్యసంపత్తిప్రముదితాశేష పామరజనౌఘంబును సుఖసంవర్థిత గోసహస్ర హంబారవముఖరిత దిగంతంబును, అవియుక్తకృతయుగ ధర్మ సన్నివేశంబును, నిశ్శేష సుఖనివాసంబునునగు ప్రతిష్ఠానపురంబు, "మరహట్టి ఆపయోహర హాళిద్దపరిపింజ రంబువాహి" యను గోదావరీలహరిచేఁ బవిత్రంబై యుండును. అందు "నిఖిలగుణావగూహిత శరీరుండును" యశఃపూరపరిపూత త్రిభువనుండును, నగు శాలివాహనుఁడు నిజస్నేహప్రసాధిత ప్రజామండలుండై పరిపాలించుచుండు. ఈ రాజు నాశ్రయము లేకున్నచో దుఃఖితుల మనోరథం బులును, సత్కావ్యవినివేశయోగ్యంబులగు కవుల మనోరథంబులును, హృద యములయందే విలయించుచుండును. అతఁడు పాంథజన దురాలోకమాకంద మంజరీసమనుమేయ మన్మథ కిరాత దురాగతంబగు వసంతకాలంబున మధుశ్రీ సమాగమాస్థాన మంటపంబున నవమాలికాసురభిళంబగు మలయానిలంబున వికసన్మనోరథుండై సురసుందరీప్రభావ పరిభావిహావభావలగు వారవిలాసినులచేఁ బరిచరితుఁడై వికసితశత పత్రికాశతమధ్య విరాజమాన రాజహంసంబుంబోలెఁ బత్రరాగరంజితుండై యుండఁ దనప్రోలనిలుచుచున్న చంద్రలేఖియను తరుణి దరహాసచంద్రికాక్షాళితవదనఫలకయగు దానిఁ దిలకించి తత్తదంగవిచిత్రంబగు మకరికాపత్రంబునైపుణంబు పరికించి, "యిట్లు సర్వాంగమనోహరంబుగ నెవ్వఁడు మదనశరబంధువగు తనకుంచికతో నేకైకవదనమ్మృణాళదానపళిత కంధరాబంధంబగు హంసమిధునంబును జరణయుగంబున లిఖించి, రాగరంజి తంబగు హృదయంబును జిత్రంబుతో నుస్మీలింపఁజేసి నిజవిజ్ఞానప్రకటనాద రంబున నవిభావితగుణదోషుండయ్యె'' నని పరిహాసపేశలంబుగ నడుగఁగా నయ్యువతియు లజ్జాజవనతవదనయగుచు నిట్లనియె.

భారతి, ఫిబ్రవరి 1925 మా. రామకృష్ణకవి

# 15. కవికంఠపాశము

ఆంధ్రఛ్ఛందోగ్రంథములలో నన్నయభట్ట విరచితమగు లక్షణసార మును, నథర్వణ విరచితమగు లక్షణదీపికయు గ్రంథపాతములతో స్వల్ప భాగములుగా లభించుచున్నవి. తిక్కన కవివాగ్బంధ మల్పగ్రంథము. పూర్ణ ముగా నున్నను మిక్కిలి ప్రయోజనకారిగానేరదు. అతి ప్రాచీనాంధ్రఛ్ఛందో గ్రంథములఁ గవిజనాశ్రయమే మనకు లభించువానిలోఁ బ్రాఁతది. దానిలో

క. "జయదేవాది చ్ఛందో
నయమున నంక్షేపరూపునం జెలువుగ మ
ల్లియరేచనసుకవిజనా
శ్రయుఁడీ ఛందంబుఁ జెప్పె జనులకుఁ దెలియన్."

అను పద్యమునఁ జెప్పఁబడిన జయదేవచ్ఛందము సంస్కృత భాషకొఱకుఁ దద్భాషలో రచింపఁబడినది. జయదేవచ్ఛందములోనివని కస్తూరి రంగకవి మొదలగువారు కొందఱు కొన్నిపద్యము లుదాహరించిరి. అది ప్రాయశః సంస్కృతమున కనువాదమై యుండునని తోఁచుచున్నది. భీమన సూచించినది సంస్కృతమై యుండును.

ఆంధ్రభాషకు సంస్కృతభాషలో వ్యాకరణము వ్రాయఁబడినట్లే ఛందో గ్రంథములుగూడ విరచింపఁబడి యుండుట చిత్రముగానున్నది. ఆ కాలమున సంస్కృతభాషలో శాస్త్ర కావ్యపాండిత్యము ప్రధానమై దేశభాషాజ్ఞాన మంగ రూపముగా వెలయుచుండెననుట నిక్కము. ఎట్లున్నను భాషాచ్ఛందోగ్రంథము లలో ''ఆంధ్ర భాషాయాం ఛందసి,'' "కవి కంఠపాశే" "కవి గజాంకుశే" అనియు సంస్కృతములోని వ్యాఖ్యా మర్యాదననుసరించి యుద్ధృత భాగములు గలవు.

లక్షణదీపిక యను గౌరనార్య విరచిత చ్ఛందోగ్రంథములో,
''యథాకవి గజాంకుశే"

"శునీదుగ్ధమివత్యాజ్యం
పద్యం శూద్రకృతం బుధైః

గవామివ పయోగ్రాహ్యం
కావ్యం విప్రేణ నిర్మితమ్.''

అను శ్లోక ముదాహరింపఁబడి యున్నది. భైరవుని శ్రీరంగమహత్త్వము ముద్రించునపుడు ప్రమాదవశమున గౌరన యుదాహరించిన కవిగజాంకుశ శ్లోకము తత్పుత్రుండగు భైరవుని కవిరాజగజాంకుశములోని పద్యమని భ్రమించి, భైరవుఁడు గౌరనపుత్రుడగునో కాదోయను సంశయమున నీ యుదాహరణము బాధకమగునని పీఠికలో వ్రాసియుంటిమి.

కందుకూరి వీరేశలింగము పంతులుకూడ దానినే గ్రహించి తన కవుల చరిత్రలోఁ దాను సంపాదించిన స్థలము చెప్పకయే దోషము నెక్కించుకొనియె. ఇప్పుడు గౌరన యుదాహరించిన కవి గజాంకుశ శ్లోకమొక సంస్కృత గ్రంథమునఁ గానవచ్చుచున్నది. సుమా రిన్నూఱు శ్లోకములుగలదైన నయ్యది యపూర్ణమనియేఁ జెప్పఁదగు. భైరవుని కవిరాజగజాంకుశ మాంధ్రగ్రంథము; అది ముద్రితము గాకున్నను సర్వత్ర లభించుచున్నది.

ఛందోగ్రంథములలో నుదాహరింపఁబడుపద్యము లే లక్షణగ్రంథములోని వని గ్రంథకర్త చెప్పనో యాలక్షణగ్రంథములలో నాపద్యములు వెదకిచూచినఁ గానరాక మఱియొక పుస్తకమున నుండునట్లు కొన్నియెడలఁ దటస్థించుచున్నది. మఱియు ఛందోగ్రంథములలో న్యూనాధికత్వములు లేక శుద్ధములగు నాదర్శములు లభించుట దుర్లభముగానున్నది. సాహిత్యపరిషత్తువారి కవిజనాశ్రయములోఁ గవి వనితలంపఁదగిన పద్యములు ప్రక్షిప్తములుగాను, ప్రక్షిప్తములు గ్రంథములోని వనియు నిర్ణయింపఁబడినవి.

కందుకూరి వీరేశలింగముగా రుపయోగించిన కవిజనాశ్రయపుఁ బ్రతిలోఁ గావ్యాలంకారచూడామణిచేఁగాక మధ్యకాలకవుల కావ్యప్రయోగములు కూడ నుదాహరణములక్రిందఁ జొనుపఁబడియె-

ఆనందరంగరాట్ఛందము,
గణపవరపు వేంకటకవికృత లక్షణశిరోమణి,
రఘునాథుని లక్షణదీపిక -

మొదలగు గ్రంథములలో సహితము కవిజనాశ్రయములోని వని యుదాహరింపఁబడిన పద్యములు అనంతుని ఛందోదర్పణమునను గోకర్ణ చ్ఛందములోనివి, అధర్వణచ్ఛందములోనివి అని యుదహరింపబడినవి ఛందోదర్పణ కవిజనాశ్రయాదులలోను గానవచ్చుట సంభవించుచున్నది. కావున నాంధ్రలక్షణగ్రంథములలో నుదాహరింపఁబడిన పద్యములు లేక శ్లోకములు తద్గ్రంథకర్తలు పేర్కొన్న గ్రంథములలోనివే యగుట కించుక సంశయింపవలయు.

ఇప్పుడు మనకులభించిన సంస్కృత రచితమగు నాంధ్రచ్ఛందమునకుఁ బేరు కానరాదు. దానిలో ప్రారంభ మిట్లున్నది-

"విప్రఏవ కవిర్న్యాన
మత్రోదాహరణం శ్రుతిః
శునీదుగ్ధం యథాత్యాజ్యం
కావ్యం శూద్రకృతం బుధైః
గవామివ పయోగ్రాహ్యం
పద్యం విప్రేణ నిర్మితమ్."

అని యాశీర్నమస్క్రియావస్తు నిర్దేశములు లేక యేకదేశముగా గ్రంథము ప్రారంభించుచున్నది. ఒకవేళ మనకులభించిన ప్రతి యాద్యంతములు లేనిదై యుండునేమో? పై సార్ధ శ్లోకములో "శునీదుగ్ధ" మిత్యాది శ్లోకము గౌరనలక్షణ దీపికలోఁ గవిగజాంకుశములోని దని యుదాహరింపఁబడియె. కావున నీ లక్షణ గ్రంథము కవిగజాంకుశమగునా యను సందియము వొడమును. మనకు లభింపఁదగిన ఛందోగ్రంథములలో సంస్కృత కవిగజాంకుశముదాహృతమైన స్థల మిదియొక్కటియే. ఇందు,

'ణం శ్రుతి"

యన్నప్పుడు "శునీదుగ్ధ" శ్లోకము, శ్రుతశ్రుతి శబ్దములు శాస్త్రార్థమునఁగూడఁ బ్రయోగింపవచ్చుఁ గావున గ్రంథాంతరములలోనిదా యను సందేహము గలుగుచున్నది. ఇఁక గ్రంథమంతయుఁ బరిశోధింపఁగాఁ దేటపడిన యంశమేమన - అయ్యది కవికంఠపాశ మైయుండనోపునని.

యథాకవి కంఠపాశే-

పర్వతానాం యథామేరుః
సురాణాం శంకరో యథా
మృగాణాంచ యథా సింహో
గణానాం నగణ స్తథా''

అనియు

''దేవనృతిర్యగ్గౌరవ
భేదాగత యశ్చతుర్విధా వర్గాః
తత్రతు లఘవో దేవాః
కచటతపాః స్థితా నరా దీర్ఘాః''

మఱియు

''దేవతావాచకాః శబ్దా
యేచ భద్రాది వాచకాః
తే సర్వేనైవ నింద్యాః స్యు
ర్గణతో లిపితోఽపివా''

అనియు

వ్యోమ శూన్యం వితనుతే-

అని మొదలుగా రంగరాట్ఛందములోను గౌరన లక్షణదీపికలోను నుదాహరింపఁబడిన భాగము లిందుగలవు. గౌరన,

సాహిత్య చంద్రోదయే -

''నగణాద్యప్రయోగేతు
దుఃఖవర్గః శుభోభవేత్
అయఃకాంచనతామేతి
స్పర్శాద్వై స్పర్శవేదినః''

అను శ్లోకమును

యథాసాహిత్య చూడామణౌ -

''నగ్రహో నచ నక్షత్రం
నరాశి ర్నచ మిత్రతా
నాక్షరా నహి చింతాస్యా
ప్రయోగే నగణస్యతు.''

అనునదియు నీ గ్రంథమున నున్నవి. అట్లున్నయెడల నిది నానాఛందోగ్రంథ శ్లోకములతో సూచితమగు గ్రంథమేమో యని తలఁపవచ్చును. కాని విషయ విభాగక్రమమును, గ్రంథాంతరప్రశంస యెక్కడఁ గానరామియుఁ బరికింప నేకకర్తృత్వమే దీనిలో వెలయుచున్నదని చెప్పనగు. ఇప్పటికిఁగల యాధార మునుబట్టి యిదియే కవికంఠపాశమని తలంచుచున్నాము.

దీని రచనాకాలము స్పష్టముగాఁ దెలియరాదు. క్రీ॥శ॥ 1400 కాలములో నుండిన గౌరన దీని నుదాహరించుటవలన నిది యప్పటికిఁ బ్రాచీనతరమగుట నిస్సంశయము.

దీనిలో

"పర్వతానాం యథామేరుః"

అను శ్లోకమున కాంధ్రానువాద మథర్వణచ్ఛందములోనుంచి కస్తూరి రంగకవి యుదాహరించుచున్నాఁడు-

తే. "పర్వతములందు మేరువు భాతియగుచు
సర్వసురలందు శంకరు చందమగుచు
నరయ మృగములయందు సింహంబు కరణి
గణములందెల్ల నగణంబు గరిమఁగాంచు".

ఇది నిశ్చయమైనచో మన కవికంఠపాశ మథర్వణచ్ఛందముకంటెఁ బ్రాచీన తరమని తలపవచ్చును.

కవికంఠపాశము సంస్కృతభాషలో రచియింపఁబడినను బ్రాయశః భాషాచ్ఛందోరూపముఁ దెలుపుచుండును.

ఈ గ్రంథమునఁ బైనుదాహరించిన సార్ధశ్లోకమునకుఁ బిదప షడ్వింశ చ్ఛందస్సులు నక్షరకూట దేవతాలక్షణములు గణలక్షణములు చెప్పఁబడియె. సంస్కృతభాషలో వైదికచ్ఛందముగాక కావ్యచ్ఛందము రెండు తెలుఁగుల లక్షణకారులచే వివరింపఁబడియె. పింగళ బృహస్పతి కాశ్యపాదులమతమనియు, శైవాచార్యమతమనియు ఛందశ్శాస్త్రమునఁ బ్రస్థానభేదములు రెండు గలవు. పింగళమతమే సాధారణముగా సంస్కృతచ్ఛందోగ్రంథములను, గర్ణాటాంధ్ర లక్షణగ్రంథములను వాడఁబడియున్నది.

శైవాచార్యమతమున మ, య, భ, జ, స నాదిగణవిభాగము గానరాదు. పద్యపాదమునకు మధ్యముననో, యంతముననో, విశ్రాంతి లేక విదారి (Caesura) యనఁబడు సంహిత యేర్పడుటఁజేసి పంచాక్షర, షడక్షర, సప్తాక్షర గణముల నియమించి తల్లక్షణకారులు నడిపిరి.

భరతుఁడు నాట్యశాస్త్రమున (దాక్షిణాత్యపాఠానుసారము) గురు లఘు స్థానసంఖ్యలం బేర్కొనియెనుఁగాని భజసనాది త్రితగణములతో లక్షణము ప్రవచింపఁడు. శైవాచార్యమతమున జనాశ్రయమను సంస్కృతగ్రంథము మకుటాయమానమైయున్నది. విష్ణుకుండినవంశనరేంద్రుఁడగు జనాశ్రయుడు తన్మతమవలంబించి మూలసూత్రములు రచింపఁగా గణస్వామి తద్భాష్యమును గూర్చె.

ఆంధ్రములోని కవిజనాశ్రయమను మాట వినఁబడంగానే సంస్కృతము లోని జనాశ్రయచ్ఛందము స్మరణకురాక తప్పదు. అయినను సంస్కృత జనాశ్రయము క్రీ॥శ॥600 పూర్వమే విరచింపఁబడియె. కవికంఠకారుఁడు పింగళ మతము ననుసరించె.

దీనిలో గణలక్షణములకుఁ బూర్వము వర్ణస్థానములును, తత్ఫలములును, తజ్జాతులును, దద్గతిభేదములును, బీజాక్షరలక్షణంబును, నాందీముఖాక్షర ప్రయోగవిధియు, సిద్ధసాధ్యాదిచక్రవిధానమునుఁ, బ్రథమాక్షరగ్రహమైత్రియుఁ, గృతిపతికర్తృనామాక్షరములఁ బొంతనమును, బిదప గణములకావ్యారంభగణ నియతియుఁ, దత్ఫలములును, గావ్యారంభకాల నిర్ణయమును వివరింపఁబడియె. పిదప—

"దోషస్వల్ప గుణాధిక్య
వశాత్తత్రాపి నిర్ణయః
శుభవర్ణ గుణోపేతా
నాందీ పద్యాన్వితాకృతిః
స్వీకార్యా విభునేత్యుక్తం
కృతే ర్లక్ష్మోచ్యతేఽధునా"

అని గ్రంథకారుఁడు వర్ణారంభలక్షణాంతరము కావ్యలక్షణము క్రింది శ్లోకములఁజెప్పె—

''గుణై రీతిర సైర్వృత్తి
పాకశయ్యాభిరేవచ
అలంకార చమత్కారై
ర్యుతా సా కృతిరుచ్యతే''.

గుణములు పదియు, రీతులు గౌడీవైదర్భీపాంచాలీలాటులని నాల్గును, నవరసంబులును, కైశిక్యాదివృత్తులును, ద్రాక్షానారికేళపాక ద్వయంబును బేర్కొని గ్రంథకర్త ''శయ్యా పదవినిమయా సహనా
పదమిత్రతా పదదాంపత్యమితియావత్''
అని లక్షించి నలువదియలంకారముల సూచించె.

చమత్కారములన-

''పద్మ బంధశ్చక్రబంధః
క్షురికాబంధ ఏవచ
తథాగోమూత్రికా బంధో
మురజాందోళికాభిదౌ.
కంకణం సర్వతోభద్రం
తథారోహావరోహయోః
వృత్తైక్యం వృత్తభేదశ్చే
త్యేవమాద్యాశ్చ మత్క్రియాః.
వృత్తైక్యం కేషుచిద్భేదః
కేషుస్యాదవరోహిణీ
ఉపాయో వా కథం తత్ర
భవేదిత్యత్ర కథ్యతే-''

అని చెప్పుచుఁ గవి యారోహణావరోహిణీ చమత్కృతుల వృత్తభేదములతోఁ గ్రిందిశ్లోకముల వివరించుచున్నాఁడు. అదియుఁ జమత్కారియే కావున విపులముగా నుదాహరించెదము.

''ఇంద్రవజ్రోపేంద్రవజ్రా
వుపజాతీ రథోద్ధతా
శాలినీ స్వాగతా శాంతా
సైనికా స్రగ్విణీ తథా

చామరం శశికలాహ్యా
శ్వగతి ర్మంజుభాషిణీ.
సుమంగలీత్యమీషాంచా
వరోహేహిస్యురేవతా
కాంతాజలోద్ధతగతిః
సైనికాచ రథోద్ధతా.
ఇంద్రవజ్రో పేంద్రవజ్రా
ముక్తామాలాచతోటకమ్
దోధకోపస్థితౌమంజు
భాషిణీప్రమితాక్షరా.
సుమంగళీత్యమీషాంస్యా
ద్వ్యాత్తిభేదేఽవరోహిణీ
వృత్తైకత్వంభవేద్యేషాం
తత్రోపాయ ప్రదర్శ్యతే-
ప్రాతిలోమేచై ంద్రవజ్రా
దిత్యేషష్ఠాక్షరస్యతు
ఏవమే వోపేంద్రవజ్రా
పాదాంతే లఘుచేద్భవేత్.

ఒ ప్యేవం నియతమిశ్రణాత్
చతుర్థాష్టమయోర్లఘ్వో
ర్ద్విత్వంస్యాచ్ఛ రథోద్ధతా.
చతుర్థాష్ట మయోర్గుర్వో
ర్ద్విత్వం చేచ్చాలినీభవేత్
త్రిషష్ఠ నవమద్విత్వే
స్యాత్కాంతే వావరోహిణీ.
సైనికాస్రగ్విణీ స్యాతాం
తే ఏవ ప్రతిలోమతః
చామరం చామ రం హి స్యాత్
ప్రాతిలోమేన పాఠతః.

ప్రాతిలోమ్యే శశికళా
సైవస్యాదంత్యలాఘవే
పాతమాత్రేణాశ్వగతిః
సద్యః స్యాదవరోహతః.
స్యాన్మంజు భాషిణీసైవ
రోహిణీ త్యంతలాఘవే
ఆద్యాబ్ధి దశమాంత్యానాం
ద్విత్వేసైవ సుమంగళీ.
ఇత్థం వృత్తైకత్వ మార్గో
దర్శితోహ్యవరోహిణీ
అవరోహే వృత్తభేద
మార్గః కేషుప్రదర్శ్యతే.
కాంతాతు ప్రాతిలోమ్యేన
పతితా దోధకం భవేత్
జలోద్ధత గతేరంత్య
లాఘవే నవమాలినీ.
ఆద్యమధ్యాష్టమద్విత్వే
సైనికా స్వాగతాభవేత్
రథోద్ధతా సైనికాస్యా
త్త్యర్యద్విత్వేఽవరోహిణీ.
ఇంద్రవజ్రోపేంద్ర వజ్రా
షష్ఠద్విత్వేఽంత్యలాఘవే
లఘుత్వే పంచమస్యైవ
మేషా సా నాంత్యలాఘవే(?)
కాంతా మౌక్తికమాలాయాః
షష్ఠద్విత్వే భవేద్ధ్రువమ్
ఆద్యపంచమ యోర్ద్విత్వే
శిఖండి విరుతంచసా.
తోటకం ప్రాతిలోమ్యేఽత్య
లఘుద్రుత విలంబితమ్

తదేవ హీంద్రవంశోవా
చతుర్థే సప్తమే తదా.
దశమేచ భవేద్ద్విత్వం
వంశస్థావాంత్య లాఘవే
దోధకం ప్రాతిలోమ్యేస్యా
దాద్య ద్విత్వేఽప్యుపస్థితా.
ద్విత్వా భావేతు కాంతాస్యా
దాద్యవర్ణస్య నిశ్చయః
ఉపస్థితేంద్రవజ్రాహి
భవేద్ద్విత్వే త్రిషష్ఠయోః.
భవేదుపేంద్రవజ్రోవా
యదిస్యాదంత్యలాఘవమ్
మితాక్షరా త్రిపూర్వాంత్య
లఘ్వీచేత్స్యాత్ ప్రియంవదా.
లలితా వా భవేత్సైవ
ద్విత్వంచే ద్దశమాక్షరే
ద్విత్వేతుర్యద్వయోర్మంజు
భాషిణీ స్యాత్సుమంగళీ.
సుమంగళ్యా భవేత్సావా
ద్విత్వేచదశమాంత్యయోః
ఊర్ధ్వాధః స్థిత యోర్ద్విత్వా
ద్గురులఘ్వోస్తు నిత్యయోః.
కాదాచిత్కత్వ సిద్ధ్యర్థం
ద్విత్వాజ్ఞానీహి యత్కృతమ్
ఇత్థం వృత్తైక్యతద్భేదా
దారోహీ చావరోహిణీ.
ధీమద్భి రూహితుం శక్య
ఇతిమత్వోపరమ్యతే''

అని లఘుగురువుల మార్పుచే వృత్తములు భేదిల్లునట్టి చమత్కారము విస్తరించి వర్ణించె. ఇది సామాన్యముగా ఛందోగ్రంథములయందుఁ గానరాదు. కావునఁ

జాతకుల కెప్పుడైన వినియోగపడవచ్చునని పూర్ణముగా నుదాహరించి యించుక విరసత్వదోషము నాపాదించితిమి.

తరువాత దీనిలో మహాకావ్య లక్షణము చెప్పఁబడినపిదప నాంధ్ర చ్ఛందోవిధాన మించుక సూచింపఁబడియె-

"షడ్వితిభ్యశ్ఛందోభ్యో
జనితం శ్లోకలక్షణమ్
య త్తదేవాంధ్ర భాషాయాం
వృత్తపద్యేషునోపృథక్''

అని. పిదప లయగ్రాహి, లయవిభాతి, లయహారి, త్రిభంగి, దండకము, మాత్రావృత్తములలోఁ గందమును నిర్వచింపఁబడియె. ఇంద్ర చంద్ర సూర్యగణములఁ బేర్కొన్న వెనుక గ్రంథకారుఁడు యతిప్రాస లక్షణ మిట్లు చెప్పెను.

యతి ప్రాసలు :

"భవేత్పాదాద్య వర్ణేన
యతి స్త త్సదృశేనవా
ప్రాసః పాద ద్వితీయేన
త త్తత్పాద ద్వితీయకే.
ప్రాయశః కథితం హ్యేత
త్తయోర్భేదస్తు కథ్యతే
భవే త్తత్ర యతిస్స ప్త
దశధాల క్ష్మ భేదతః.
కథ్యంతేలక్షణేష్వేవ
తేషాం నామాని నోపృథక్"

అని లక్షణములతోఁ బదునేడు యతులు పేర్కొనఁబడియె.

స్వరయతి
వర్గవడి
సవర్గయతి
అఖండవడి
అజ్ఝలోర్వడి (?) (ప్రాదియతి)

అనుస్వారవడి
ప్లుతయతి
సంయుక్తవడి
యక్కటివడి
ఉత్వయుగ్వడి
సరసవడి
వ్యంజన స్వరవడి
వృద్ధివడి
ఆదేశ వ్యంజనవడి
అభేదవడి
గూఢ స్వరవడి
సమానవడి.

అంత

"వడి ప్రభేధః కథితః
ప్రాసశ్చాష్టవిధోమతః
తేషాం నామాని కథ్యంతే
లక్షణేష్వేవ నోపథృక్."

అని గ్రంథకారుఁడు, దుష్కర, ద్వి, త్రి, చతు, రంత్య, వర్గప్రాసముల నాటింటినే లక్షణోదాహరణములఁ బేర్కొనెయె.

ప్రా స లు

| | |
|---|---|
| దుష్కర ప్రాసము | చతుష్ప్రాసము |
| ద్వి ప్రాసము | అంత్య ప్రాసము |
| త్రి ప్రాసము | వర్గ ప్రాసము. |

గణములు – ఉత్సాహాది లక్షణములు :

తరువాత సూర్యేంద్ర చంద్రగణోప యోగము వివరించుచు నుత్సాహాది లక్షణ మిట్లు వచించె–

"ఉత్సాహ స్త్రివిధోగీతిః
పంచధైవ ప్రకీర్తితా
చతుర్దశ విధః సీస
స్తేషాం లక్షణ ముచ్యతే."

అని ఉత్సాహ లక్షణానంతరము—

ఆట వేలఁదీచ విజ్ఞేయ
స్తేటగీతిశ్చ మేళనః
ఎత్తుగీతి రితిహ్యేతే
గీతికాః పంచధా మతాః.

అన్నను నాలుగు గీత లక్షణములే వివరింపఁబడియె.

సీ స ము

సీస లక్షణమునఁ బెక్కులు గ్రంథపాతములు వడియె.

యత్ప్రాససీసం నవడి
సమసీసం తదుచ్యతే
యత్ప్రాసవడి నిష్ప్రాసం
తచ్చావకలి సీసకమ్.
గీతి యుక్తా కలిప్రాస
సీసేప్రాసవడిం త్యజేత్
వడిస్థానేషు......
న్యసేత్ప్రాసం ద్వయోర్ద్వయోః
సర్వతః ప్రాససీసంస్యా
దక్కలి ప్రాసతుల్యతా
ఇయానత్ర విశేషఃస్యాత్
ప్రాసః సర్వత్ర నద్వయోః
త్రిపాత్త్రిపాత్ప్రాసవడిః
శేషస్తు వడి మాత్రయుక్
విషమాంఘ్రిప్రాస సీసం
తదేవస్యాన్న చేతరే.
ప్రత్యంఘ్ర్యై కైకాక్షరేణ
కుర్యాత్ ప్రాసవడిం యది
తం నిష్ప్రాసం పాదపాదై
కాక్ష............
వడిమాత్రం పూర్వఖండ

ప్రాససీసం తదుచ్యతే
పూర్వఖండే ప్రాససీసం
రణితం వ్యత్యయేన చేత్.
తదేవాపర ఖండాఖ్యం
ప్రాససీసం నసంశయః
అంఘ్రిష్వేకైకవర్ణేన
వడిం కుర్యాచ్చతుర్థకే.
భిన్నవర్ణా ద్విషమపద
వడిసీసం తదుచ్యతే—

అనునట్టి సీసలక్షణములతో గ్రంథ మసంపూర్ణముగా లభించుచున్నది.

ఇందుఁబదునేడు విధములుగా యతులు నిర్ణయింపఁబడియె. కవిజనాశ్రయ కారుఁడు పదింటి, ఆంధ్రజయదేవుఁడు తొమ్మిదింటి, ఉత్తమగండఁడు పదునెనిమిదింటి పేర్కొనిరి. ఈ సంఖ్య ననుసరించి కవి కాలనిర్ణయము చేయఁదగదు. ఏల యనగా నన్నయభట్టు లక్షణసారమున నిరువదేడు యతులు, (క్రీ. శ. 1600లోని) ముద్దరాజు రామన పంద్రెండు యతులును బేర్కొనిరి.

## క ం ద ము

కందమనునది ప్రాకృతములో స్కందకమనఁబడును. కందము స్కంద శబ్దమునకుఁ దద్భవము. సీసము శీర్షక శబ్దభవము. కందలక్షణము పింగళుఁ డిట్లు చెప్పెను.

‘‘చఉమత్తా అట్ఠగణా
పువ్వద్ధే ఉత్తరద్ధహోఇ సరూఆ
సోఖంద ఆవిఅణహు
పింగళ పభణే ఇముద్ధి బహుసంభేఆ.
[చతుర్మాత్రా అష్టగణాః షేపూర్వార్ధే
ఉత్తరార్ధే భవంతి సరూపాః
తం స్కంధకం విజానీతపింగళః
ప్రభణతి ముగ్ధే బహుసంభేదమ్]

స్కందకము 29 విధములుగా గానశిక్షాకారులచే విభజింపఁబడియె.

సీ స ము

సీసమనునది సామవేదమున బ్రహ్మగీతము వలనఁ బుట్టినది. అక్షరపిండ ప్రధానమై, చంచత్పుటాది తాళనియమబద్ధమై యుండును. అట్టి పాదముల కొనలలోఁ తాళాంతరముచే వ్యవసితమగు గీత మొక్కటి సర్వమునకు శీర్షప్రాయముగా నుండుటచే శీర్షమై యంతయుంగలిసి శీర్షకమయ్యె.

"శీర్షకాణా మనియమో
భవేత్పాదనిధానతః
నానావృత్తవినిష్పన్నం
కుర్యాత్ వై శీర్షికం బుధః.
గుర్వాది రథలఘ్వాది
ర్యుగ్మః సర్వలఘుస్మృతః
చతుర్మాత్రా గణోజ్ఞేయః
పూర్వచ్ఛందోవికల్పనాః.
అర్ధాష్టమగణాః పాదాః
శీర్షకస్య భవంతివై
చతుర్మాత్రస్తు విజ్ఞేయో
యుగ్మోజాక్షరికైః పదైః.
శీర్షకస్యైక వింశత్యా
షడ్వింశతి పరస్తథా
అక్షరాణాం షవేత్పిండః
పాదేహ్యేకత్ర నిశ్చయాత్".

అని భరతుఁడు ధ్రువాగీతి విధానమునఁ జెప్పెను. జనాశ్రయకారుఁడు గీతాలక్షణానంతరము

"శీర్షకం గీతి కాపరా"

అనిసూత్రింపఁగా, భాష్యకారుఁడు—

"సైవాధికాక్షరా గీతికాపరా భవతిచేత్ శీర్షకం నామ భవతి ఏకైక వృద్ధ్యా లలిత సుభద్రా విద్రుమవంశ పుష్పదంత మాలాః ఇత్యేవం నామకాని సప్తశీర్షకాణి భవంతి. తత్ర లలితస్యపాదే సప్తగణాభవంతి. అంతే గీతికాచ. ఏవం శేషకాణి శీర్షకాణ్యేకైక వృద్ధ్యా జ్ఞేయాని" అని చెప్పెను.

## క్రౌంచపదము

క్రౌంచపదములోని గణములు మాత్రాగణములుగా మార్చి యంత్యగురువు రెండు లఘువులగునేని సీసమగును. ప్రాకృత లక్షణకారులు క్రౌంచపదమును సీసములలోఁజేర్చిరి. ఆ న్యాయము ననుసరించి కాఁబోలు నన్నెచోడఁడు క్రౌంచపదమునకు సీసమునకు వలెఁబూర్వార్ధ ప్రాసమును ఉత్తరార్ధ పరస్పర యతియుఁగల్పించెను. అక్కరలును గీతములును ద్రవిడ భాషలో గలవు. జీవక చింతామణిలోఁ బెక్కు విధములు నిరూపింపఁదగు.

గణవిభాగముచేయునప్పు డర్ధానుస్వారద్రుత నియమముల లఘువులుగా గ్రహించిన యెడల మన యింద్ర సూర్యగణములలో నవియు నేదోషము లేక నడచుచున్నవి. "తిరువాయ్ మొజ్హి'' అను ద్రవిడగ్రంథమునఁ బ్రథమ దశకములో సర్వతఃప్రాససీసమున కెత్తుగీతిలేని యుదాహరణము గలదు. ఇచ్చట గ్రంథసౌలభ్యము చాలమింజేసి యుదాహరణములఁ జూపఁజాలమైతిమి. భరత శాస్త్ర పీఠికలో దీని విస్తరించి వ్రాయఁదలఁచి యున్నారము.

భారతి అక్టోబరు 1927 మా. రామకృష్ణకవి.

# 1. ఆంధ్రరాజకవులు

లక్ష్మీసన్నిధానముననే సరస్వతీ మహిమ ప్రకాశించుచున్నది గాని యేక పదావాసమును జెంది లక్ష్మీసరస్వతులు నిర్మాత్సర్యమున నుండుట మిక్కిలి యరుదు. బహుకార్య ధురంధరులును, భోగైక పరాయణులును, వీరలక్ష్మీ సంభావితులునగు రాజేంద్రులకు కాలాంతరఫలదాయకమై సద్రశ్శ్రమ రూపమై, గురుకుల క్లేశ మాత్రఫలంబగు విద్యావ్యసనము హృదయంగమముగాక సప్తవ్యసనములకంటెను హేయమగుచుండును. అయినను కవుల కృతిపటములు లేక ప్రతాపాఢ్యులగు నరేంద్రుల చరిత్ర చిత్రములు స్వప్నమునందును బుట్టనివి యగును. కావుననే స్వతస్తేజముగల నక్షత్రములవంటి కవిబ్రహ్మలఁ జేరదీసి రాజచంద్రులు తమ యౌదార్య తేజముల విలసిల్లఁ జేయుదురు. అనుక్షణ విభాస్వరములగు ప్రజ్ఞారత్నముల నడుమ నాయకమణియు శోభాయమానమగుట యాశ్చర్యముగాదు. రత్న సాన్నిధ్యము గన్నస్ఫటికమును వెలుఁగుచుండును. భ్రమరముల నడుమఁ జిక్కిన కీటకము భ్రమరమగుచుండుట లేదా? అదియునుంగాక వివిధ రసాస్వాదనలుబ్ధులగు భూపరులకుఁ గావ్యరసము లేక తనివిగలుగదు. కావ్యామృతము తక్కిన రసములలోని నీరసత్వమును జూపి కృతిముఖముల రాజుల కీర్తి శరీరముల నజరామరములుగఁ జేయును. కవిరత్నముల కాశ్రయణీయులగు ప్రభువులు నికషోపలముల వంటివారు గాకున్న మహామతులట్టి వారి సభాభవనములు ద్రొక్కఁజనరు. సంస్కృతమున రాజకవులనేకులు గలరు. విక్రమాదిత్యుఁడును, ప్రవరసేనుఁడును, హర్షుఁడును, సింధురాజును, కర్ణుఁడునుఁ, గులశేఖర పాండ్యుఁడును, శాతవాహనుడు, వాక్పతిరాజును జాల ప్రఖ్యాతులు. కావుననే వీరి యాస్థానములఁ గాళిదాస బిల్హణ గుణాఢ్యాదులు కీర్తిరూపములగు జ్యోతిర్మయశరీరములతో విహరించిరి.

ఆంధ్రభాషలో రాజకవులు పెక్కుఱు గలరు. వీరిలోఁ గొందఱు చక్రవర్తి పదమును, మహారాజ పదవినిఁ జెందినవారు. మఱికొందఱు రాజబంధువులై కావ్యరసమునే గ్రోలుచు విద్యావిలాసముల నెగ్గ్తె కెక్కిరి. ఇట్టి రాజకవులను గుఱించియు వారి కావ్యములను గూర్చియు స్థూలరూపముననిందుఁ జెప్పఁబడును

# నన్నెచోడ దేవుడు (క్రీ. శ. 940)

వీరిలోఁ జరిత్రాంశముల శోధించి చూచినంతలోఁ బ్రాథమికుఁడు నన్నెచోడ దేవుఁడు. ఇతఁడు కావేరీ తీరమున నొరయూరనుపురము రాజధానిగాఁ జోళమండలము నేలినవాఁడు. ఇతనికి దిగ్విజయమును బట్టి టెంకణాదిత్యుఁడనియుఁ గవిత్వకౌశలమువలనఁ గవిరాజశిఖామణి యనియు బిరుదములు గలిగెను. ఈతఁడు క్రీ. శ. ౯౪౦ సంవత్సరమునఁ బాశ్చాత్య చాళుక్యులతో నెదిర్చి రణరంగమున నిహతుఁడయ్యెను.

క. పురుషుఁడు పురుషున కని న
స్థిర జీవితలోభయుతమతిని వినమితుఁడై
స్మరకలహకుపితఁ బ్రాణే
శ్వరినాయుధ సమితిఁ దెలచువాఁడటు మీఁదన్.

ఉ. మంచిగఁ బ్రీతిబాయక సమస్త జనంబులు దన్నుఁ గొల్వ జీ
వించిన ధన్యుఁడాపుహిమ వీడిన జీవము మేన నిల్వనా
సించి, విభుండుతానొకట సేవకుఁడై మనుకంటె ముందఱా
ర్జించిన కీర్తి నిల్వనని సేకురగా ననిచావు సేగియే.

అని కవియే తన కుమారసంభవమునఁ జెప్పుకొన్నాఁడు. తత్పూర్వము రాజ్యపదభ్రష్టుఁడై యజ్ఞాతవాసము చేసి మరల లబ్ధరాజ్యుఁడై కొంతకాలము రాజ్యము చేసెను. ఇతని తండ్రి చోడబల్లి, తల్లి శ్రీసతి. ఇతఁడు కుమారసంభవమను పది యాశ్వాసముల గ్రంథమును రచించెను. ఇది కాళిదాసు కావ్యమునకుఁ దెలుఁగు గాదు. ఆంధ్రభాషలో నూతన కావ్యసృష్టికి నితఁడె ప్రాథమికుఁడు. దీనిలో గణపతి జననము, సతీదహనము, మదనసంహారము, పార్వతీవివాహము, కుమారోదయము, తారకాసురసంహారము, తత్పరాజయమును వర్ణింపఁబడినవి. ఈ కవిశిఖామణి కావ్యములోని వర్ణనము లత్యద్భుతములై నూతనములై యున్నవి. ఏతత్కృతి చాలఁ బ్రాచీన మైనను సకల కావ్యలక్షణములకుఁ బుట్టి నిల్లగుటచే నప్పుడ మెఱుఁగిచ్చి తీర్చిన చిత్రమువలె మనోరంజకముగా నున్నది. రాజకవులలోను గవిరాజులలోను నిట్టివాఁడు లేఁడనుట యంత యతిశయోక్తిగాదు. దీనిలో నుండి కొన్ని పద్యముల నుధాహరించెదను,

క. కని కోపించెనొ కానక
మును కోపించెనొ మహోగ్రముగ సుగ్రుఁడు నూ
చినఁగాలెనొ, చూడక యట
మును గాలెనొ, నాగనిమిషమున నఱఁగాలెన్.

క. గిరిసుత మై కామాగ్నియు
హరు మైరోషాగ్నియుం దపంగజు మై ను
ద్ధుర కాలాగ్నియు రతి మై
నురు శోకాగ్నియును దగిలి యొక్కట నెగసెన్.

రతి సహగమనోద్యుక్తయై చితిఁ జొరఁజను నప్పుడాకాశవాణి యాత్మహత్యవారించిన, శోకాగ్నితప్తయగుచు-

క. కరువునఁ బూరితమై లో
హరసములోఁ గాలునట్టు లంగజు శోకో
ద్ధురశిఖి రతి తను విమ్మగఁ
గరఁగియుఁ బొడవఱక లోనఁ గాలుచునుండెన్.

సీ. అలమటసెడి యుండె నిలువదు చిత్తంబు
మూర్ఛిల్లిపెకఁ బాసిపోవ దొండె
నూఱటఁ గొని యుండె నాఱదు శోకాగ్ని
వారిమాలఁ గొని కాలిపోవ దొండె
ఘర్మాశ్రుజలము లొక్కటఁ గట్టుకొనవొండె
బొడవంతయుఁ గరంగి పోవదొండె
పర్వఁనిట్టూర్పులు పట్టునఁ బడవొండె
బొందిమ్మగా బాసి పోవదొండె

గీ. నిట్టి కడలేని దుఃఖాబ్ధిఁ బెట్టి ముంప
దలఁచియో కాక పోనీక, బలిమినాదు
ప్రాణమొడలిలో నాకాశవాణి దెచ్చి
మగుడఁ జెటఁ బెట్టెనని రతి మఱుగుచుండె.

వీర పురుషులు యుద్ధమునకు వెడలుచుండ నొక వీరపత్ని పచ్చవలు వయుఁ గంథమాల్యములును వీరమద్దియలును ధరించి నిశ్చిత హృదయుండగు పతింగనుగొని చెప్పుచున్నది—

ఉ. ఓలము లేదు కూర్చునని యూఱడి యుండితిఁ గూర్మియెల్లనే
డాలము సేసి నన్నుఁ బెడయాకులఁ బెట్టి మనః ప్రియుండు త
న్నాలములోనఁ బెట్టి దివిజాంగనలం గలయంగనెత్తెనే
నాలనె బేలగాక చెలియా! యని నెచ్చెలి మీఁద వ్రాలుచున్."
ఈ కవి సర్వజ్ఞుఁడు.

## భద్ర భూపాలుఁడు. క్రీ. శ. 1050

ఇతఁడును నన్నె చోడునివలె "రవికుల శేఖరుండుఁ గవి రాజశిఖామణి". ఇతఁడే సుమతిశతకమును, నీతిశాస్త్రముక్తావళియు రచించినవాఁడు. కవిబ్రహ్మయను బిరుదు గలవాఁడు.

''క. శ్రీవిభుఁడ, గర్వితారి
క్ష్మావరదళనోపలబ్ధజయలక్ష్మి సం
భావితుఁడ సుమతిశతకముఁ
గావించిన ప్రోఢ కావ్యకమలాసనుఁడన్."

అని తన ముక్తావళి నారంభించెను. ఈతఁడు పాశ్చాత్య చాళుక్యులలో భువనైక మల్లునకుఁ గప్పముఁ గట్టు సామంతప్రభువు. కృష్ణాతీరమున షట్సహస్ర గ్రామాధికారి. రాజరాజ మనోజుఁడనియు, దశదిశాభరణాంకుడనియును, నరేంద్రచతురాననుఁడనియును రాజబిరుదములు గలవాఁడు. ఇతని కవిత కుమారసంభవమువలెఁ గఠినముగాక, ద్రాక్షాపాకమున నతి సరళముగు నుండును. భావములు నూతనములై హృదయంగమములుగా నుండును. ఇందుఁ గొన్నింటి నుదాహరించెదను—

"ఉ. ఎత్తిన కాలెకాని సిరికెన్నఁడు నిల్చిన కాల నిల్వఁగాఁ
జిత్తము లేదు కాన సిరిఁజెందిననాఁడ పరోపకారమా
యత్తతఁ జేయుచుండు మెవరైన పదంపడి వేఁడఁ గొందమన్
చిత్తమకాని యిత్తమను చిత్తము పుట్టునె యెట్టి వారికిన్.

చ. అలుక ప్రతాపమీగి యలవాలము బుద్ధి పరాపవాదముల్
పలుకుట ప్రౌఢ్ధపోక ప్రజబాధ దలంపమి పెద్దప్రల్లదం
బలవు వికారమొప్పు వినయంబు మహత్త్వము చేటు బొంకు వా
గ్బలము జఘన్యులైన నరపాలురకుం బరపక్షభైరవా.

## గోకర్ణ నృపాలుఁడు (క్రీ. శ. 1130)

ఇతఁడు సూర్యవంశపు క్షత్రియుఁడు. పై యిరువురఁబోలె నితఁడు చోళవంశీయుడు. ప్రస్తుతము నైజాము రాజ్యమున వనపర్తి సంస్థానమునకు సమీపమున శిథిలమైయున్న వర్ధమానపురమున కధీశ్వరుండు. ఇతని తండ్రి భీమన. గురువు వాగీంద్రచూడామణి యను జైన సమయాచార్యుఁడు. ఇతఁడే భీమకవికిఁ గర్తృత్వ మారోపింపఁబడిన కవిజనాశ్రయమను ఛందోగ్రంథమును రచించి జగదేకమల్లునకు సేనాధిపతియగు రేచభూపున కంకితముచేసెను. ఈ రేచనికిఁ గవిజనాశ్రయుఁడనియు, గోకర్ణునకు శ్రావణాభరణాంకుఁడనియు బిరుదములు గలవు. దీనిలో నాలుగాశ్వాసములును జైన కావ్యధర్మముల ననుసరించి వాగ్దేవతాస్తుతితోఁ బ్రారంభింపఁబడినవి. దీనిలో విరమణస్థానమునకు, యతి స్థానమునకు భేదము గల్పింపఁబడినది. యతి యాంధ్రభాషలోవలెను, విశ్రమము సంస్కృతములోవలెను, బూర్వకాలమునఁ బ్రచారమున నున్నట్లు తోచుచున్నది. సంస్కృతమునగాని, ద్రవిడభాషలోఁగాని పరిపూర్ణ పాండిత్యము లేక, కుతర్క వంచనా చుంచువులగు వైతండికులు కొందఱు సంస్కృతములోని యతి నియమమే తెనుఁగున నక్షరరూపమైనదని వాదించుచున్నారు. గోకర్ణుని మనుమడే ఉదయాదిత్య భూపతి. గోకర్ణుని యుదయాదిత్యునిఁ గాకతీయ ప్రోలరాజును రుద్రదేవుఁడును జయించిరి. ఉదయాదిత్యుని పుత్రికయగు పద్మావతిని రుద్రదేవుఁడు హరించుకొనిపోయెను. ఇయ్యుదయాదిత్యుఁడే కర్ణాటకమున నొక యలంకారగ్రంథము రచించెను. ఇతనినే శాసనమునఁ జోడోదయుఁడని చెప్పుదురు. వేములవాడ భీమకవి రచించినది నృసింహపురాణముగాని, కవిజనాశ్రయము కాదు. సంయుక్తయతి లక్షణమున –

"క...... భాస్కర
కుల విలసిత వార్ధి చంద్ర గోకర్ణ నృపా"

యనుటయే చాలిన నిదర్శనము. గోకర్ణుఁ డనే కాగ్రహారముల బ్రాహ్మణోత్తముల కిచ్చి శాసనములు వేయించియున్నాఁడు. ఈతని కవిత మృదువై సరళమై యుండును.

## కృష్ణరాయలు (క్రీ. శ. 1509 - 1530)

ఇతఁడు కర్ణాట దేశప్రభువు. విజయనగరము రాజధానిగా సపాదలక్ష గ్రామములఁ బరిపాలించెను. ఇతఁడు సింహాచలము మొదలుకొని పాండ్య మండలము వఱకును జయించి, దిగ్విజయ గౌరవధన్యుఁడై కావ్యాలాపములఁ బ్రొద్దుపుచ్చుచుండెను. పదపాటవమున గణనకెక్కు కవితాపితామహుఁడును, ముద్దుపలుకుల తిమ్మనయు. నమృతవాక్కగు ధూర్జటియు, గాఢశైలీ ప్రతిపాద కుండగు పుత్తేటి రామభద్రుండును, నీ కవిపారిజాతము నాశ్రయించిన కవికోకిలములు. ఇతని యాముక్తమాల్యద మాలిన్యము తొలఁగింపని వజ్రమణి వలె నున్నది. పొట్టకూటికొఱకుఁ జెప్పికొనిన బ్రాహ్మణకవుల భావములకంటె లీలార్థము వచించిన రాజకావ్యములు గంభీరగుంభనలకు మేలైనవనుట యేమి యాశ్చర్యము ? శ్రీరంగవిభుఁడు చూడుకుడుత్త నాంచారమ్మను బరిణయమైన కథయే ప్రధానముగాగల యిక్కావ్యమున ఋతువర్ణనాదికము లతివిపులములై ప్రాచీనకృతుల నెగఁజూచు చున్నవి. దీనిని బెద్దన రచించెననుట కేవలము వాదమే. నిర్దోషమై బంధపాటవముగల కవితచెప్పు పెద్దన భావముల నిమిడింపలేక చచ్చి చావని పాకమునఁ గూర్పఁజాలఁడు. ఆముక్తమాల్యద నామూలము శోధించి చూచి, ద్రవిడ సంస్కృతములలో నక్కాలపు వైష్ణవుల కావ్యములతో నించుకఁ బోల్చిచూచినచో నెవ్వఁడో వైష్ణవశిఖామణి యాంధ్రరచనాలోభము వలన రచించి కృష్ణరాయలపేరిట నెలకొల్పెనేమోయను సందియము తోచు చున్నది. ఈ విషయమై నిదర్శనములు తత్కావ్యమునఁ బెక్కులు గలవు.

## కట్టు వరదరాజభూపతి (క్రీ. శ. 1560)

ఇతఁడు కృష్ణరాయల యల్లుఁడగు రామరాయల పినతల్లి కొమరుఁడు. ఈతఁడు శ్రీరంగమాహాత్మ్యమను దశాశ్వాసముల గ్రంథము రచించి శ్రీరంగపతి కంకితమిచ్చెను. అపారమాధుర్యముగల యితనికవిత చాలమృదువై జాతీయమై ప్రాచీనకవుల నడక ననుసరించి యున్నది. భైరవుఁడను విప్రకవియు, శ్రీరంగ మహత్త్వమును రచించెను. దుష్కవిఘోరపిశాచము లదల్చు గురుభైరవుండగు

భైరవుని కవితాప్రవాహమున కిక్కువివాక్పుష్పదామములు నిలువఁజాలకున్నను వర్షాంతపునదివోలె నది నీరసమగుచుండ నిత్యపరిమళశోభితంబగు వరదరాజ కృతి సరసమై పండితబృందముల కాకర్షణయంత్రమువలె నున్నది. ఇతఁడు మఱియుఁ బరమభాగవతచరిత్రమును రామాయణద్విపదయు రచించెను. ఇతని కావ్యములలోనుండి యొండు రెండుదాహరించుటయ మేలు.

ఉ. ఏల తదన్య తీర్థములకేఁగ జనాళి మహాసరస్వతీ
కూలనికుంజ మంజు గురు గుల్మ లతావళిఁ దేఱిచూచినన్
బాలికకోటి జిహ్వలను భారతి తాండవమాడు బ్రహ్మ యి
ల్లాలట యమ్మహానది ప్రియాశయముల్ తమ కీయఁజాలవే.

సీ. కదలుఁచో బూరేకులదరితేనెలు చిందఁ
దనయిచ్చఁ బవనకందళచయంబు
మెదలవచ్చునె మంచు మించు నెత్తమ్ములు
ముగిడింప జక్కువ పగఱనైనఁ
గాయుచో బీరెండ కామినీవదనముల్
చెమరింప వేసవిఁగుముదవైరి
కురియునో సస్యవిస్ఫురణకై తగినట్టి
వాన మాత్రమకాక వారిదములు

గీ. మినుకవచ్చునె జను లుర్విమీఁదనిచటఁ
గిముకు మనవచ్చునో యమకింకరులకు
నెపుడు మదనుగ్రహములేక యిహపరైక
మంగళప్రదమైన శ్రీరంగమునను.

సీ. అత్తమామల కెదురాడు దుశ్చారిణి
వావివర్తనలేని వాడవదినె
కొండ్యాలఁ గొంపలుగూల్చు పాతకురాలు
బలి భిక్షమిడని నిర్భాగ్య యువతి
మగనితో నేవేళ జగడించు జగజంత
పసిబిడ్డలను దిట్టు పాపజాతి
దినము వేబాసలు దెగిసేయు నడిగొంటు
ఖుళ్లకంబులు దెచ్చు ముళ్లమారి

గీ. కాసు ప్రాణంబుగాఁ జూచు కష్టురాలు
పఱవ కూఁతలుగూయు దబ్బరల దాసి
వెలని మేలు వహింపని చిలివిషంబు
దీనికై నీవు కనికరమూనఁదగునె."

## రంగప్పరాజు (క్రీ.శ. 1560)

ఇతఁ డళియ రామరాయల పెదతండ్రి కొమారుఁడు. ఈ కవిశిఖామణి సాంబోపాఖ్యానమను కృతి రచించి శ్రీరంగనాథుని కంకితమిచ్చెను.

" క. అగునగు నిక్కవిచంద్రుఁడు
జగతి నపూర్వార్థ శబ్దచారుకవితమై
నెగడిన 'బాణోచ్ఛిష్టం
జగత్త్రయం'బనిన పలుక నఫలంబయ్యెన్.

అనిన కేతనభావ మిక్కవికన్వయ మగునంత శబ్దార్థ రచనా వైశద్యమునుజూపి యుల్లములఁ జూఱగొనునట్టి సామర్థ్య మీకవికి గలిగినను గాఢనిబంధనమువలన మాధుర్య మించుక కొఱవడెననుట నిజమునకు దవ్వుగాదు. దీనిలో జాంబవతీ వివాహాదులు చెప్పఁబడినవి. అన్నివర్ణనలనుఁ గవి ప్రౌఢిమనుఁజూపుచున్నాడు. శ్రోతల కపూర్వ పదసంయోగముచేతను, అశిథిల బంధముచేతను, గొంచెము క్లిష్టముగా నగపడునుగాని భావరంజకత్వముచే శ్రమాపహారము గలుగును. దీనిలోఁ గొన్నిటి నుదాహరించెదను-

" చ. అలఘు కళానిధిం గువలయప్రియు రాజును జూడరోసి బ
ల్లిశములతల్పు బిగ్గనిడి తామరమొగ్గల మూలయింటిలో
నలి చెలిగాఁ బరాగ పటికాపృతమైన సరోరుహేందిరన్
కిలకిల నవ్వుచుండ గిలిగింతలు పెట్టెదుగా దినాధిపా.

చ. జడనిధి మేఖలా ఘటిత సర్వమహీతలవాసులందునా
కడిదిప్రదాతచే ధనము గాననివాఁడు మొగిళ్లక్రిందటన్
నడువనివాఁడు, భాను కిరణంబులు సోఁకనివాఁడు వానలం
దడియనివాఁడు గాడ్పు మెయిదాఁ కనివాఁడును లేఁడ యెవ్వఁడున్.

## తంజావూరి రఘునాథుఁడు

ఈతఁడు శూద్రకులజుఁడు; అచ్యుత రాయల మఱఁదలి మగఁడు. చోళ దేశపు మహారాజు. అనుదినము పంచాశత్సహస్ర భూసురుల కన్నదానము

చేసియే భుజించువాఁడు. శ్రీరామ భక్తుఁడు. ఇతఁడు రామసేతు, కుంభకోణ, మన్నారుగుడి, శ్రీరంగ, విజయ రాఘవపుర, శ్రీముష్ణ ప్రదేశముల రామభద్ర దేవాలయములు స్థాపించి కీర్తి గన్నవాఁడు-ఈతని యాస్థానమున సంగీత సాహిత్యములు రెండును తులఁ దూగుచు వన్నె కెక్కెను- ఈ కవిరాజునకే విజయవిలాసము, సారంగధరచరిత్ర, కృష్ణాధ్వరిరచితమగు నైషధపారిజాతీయము, మధురవాణి రామాయణము, అచ్యుతాభ్యుదయము అంకితమీయబడినవి. విజయవిలాసమున వెంకటపతి, రఘునాథరాయలకవితను గూర్చి చెప్పిన-

"ఉ. తారస పుష్టిమై ప్రతిపదంబున జాతియు వార్తయున్ జమ
త్కారము నర్థగౌరవముఁ గల్గు ననేకకృతుల్ ప్రసన్న గం
భీరగతిన్ రచించి మహిమించినచో నిక శక్తు లెవ్వర
య్యా రఘునాథ భూపరసికాగ్రణికిన్ జెవిసోఁకఁ జెప్పఁగన్.

ఈ పద్యము రఘునాథ రాయల కావ్యజాలముల జదివి చూచినవారెట్టి స్వభావోక్తిగా గ్రహింతురో చిత్రము. ఇక్కవి వాల్మీకిచరిత్ర, రామాయణము, పారిజాతాపహరణము. జానకీ పరిణయము, అచ్యుతాభ్యుదయము, సావిత్రికథ మొదలగునవి పెక్కులు రచించినను మొదటి రెండు మాత్రమే నాకు లభించినవి. ఇతఁడు-

క. చెప్పవలెఁ గప్పురంబునఁ
గుప్పలుగాఁ బోసినట్లు కుంకుమ పైపై
గుప్పిన క్రియ విరిపొట్లము
గప్పినగతి ఘుమ్మనం గవిత్వము సభలన్.

అని వాల్మీకి చరిత్రమునఁ జెప్పుకొనినట్లు సర్వజన సౌలభ్యమై యత్యంత మనోహరముగా నున్నది. విజయవిలాసములోఁ బోలె దీనిలో నే దోషములు గానరావు. ఇతని రామాయణమును మెచ్చి మధురవాణి యను వేశ్యారత్నము దానిని సంస్కృతమునకు మార్చెను. ఇట్లే వసుచరిత్రయు, విష్ణు చిత్తీయమును సంస్కృతమునకుఁ దేఁబడినవి. ఇతని రెండు గ్రంథములలో నుండి యుదాహరించెదను. ఇతని భావనా శక్తియు, కల్పనాశక్తియు సంభాషణ చాతుర్యమును శ్లాఘాపాత్రములు. హాస్యరసమున నితఁడు మిన్న. ఇట్టి చాతుర్యము గలవాడు

కావుననే విజయవిలాసమును మెచ్చుకొనెను. ఎట్టి వీర్యమును, ఎట్టి కావ్యచాతుర్యమును గలవాఁడైనను వేంకటపతి మొదలగు వేశ్యాపుత్రుల నడుమను, మధురవాణి శశిరేఖ మొదలగు నేఁబదియాఱు వెలయాండ్రనడుమ నితఁడు చిక్కితన నిర్మల కీర్తిపటమున భోగమువలని విషబిందువులనుఁ జిలికి మలీమసుఁడయ్యెను-

సీ. చెలువలు పన్నీరుజలము లిచ్చినఁ గాశి
కుప్పెల జలమంచుఁ గ్రోలనెంచు
సతులు జవ్వాది యొసంగ గోపీచందన
మని ఫాలమునఁ దీర్పనగ్గలించుఁ
గాంతలు మరువంపుఁ గాను కిచ్చినఁ దుల
సీదళంబనుచు భక్షింపఁ జూచుఁ
బొలఁతులు దెలిగందవొడి యిచ్చిన విభూతి
యిది యటంచుఁ ద్రిపుండ్ర మిడఁదలంచు

గీ. అలరుఁబోడులు వజ్రాలహార మొసఁగఁ
బటికపు జపాక్షరసరమంచుఁ బాణిఁబూని
మేని జరియింపదివురు నెందైనఁ గలదె
ముగ్ధలగువార లిటువంటి ముగ్ధగలఁడె-

## కదిరీపతి (క్రీ. శ. 1620)

ఇక్కవిరా జనంతపురము జిల్లాలోనుండు కదిరి యనుపురమునకుఁ బ్రభువు. చతుర్థకులజుఁడు. ఇతని తండ్రి రామదేవరాయల యొద్ద సేనాధిపతిగా నుండెను. ఇక్కవి శుకసప్తతియను బంకుటాండ్రయు, బొంకుటాండ్రయు కథలు గల కావ్యము నొక్కటి రచించి స్వభావోక్తి వర్ణనలను వలలు పన్ని జాతీయ వచోరత్నములను గాలములనిచ్చి దుర్నీతివిముఖములగు పండితచిత్తములను సైతము బలాత్కారముగా నాకర్షించునంతటి కవితాచాతుర్యము చూపియున్నాడు. ఇతఁడు జగచ్చక్షువు. సర్వేంద్రియ వ్యాపారుఁడు.

''ఇక నొకసారి పల్కిన ఘటిల్లని చింపనా నోటి ముత్యముల్''

ఇట్టి యతి సరస ప్రయోగములును జాతీయములును దేశీయములును దీనిలో బెక్కులు గలవు. దీనిని రచించిన కవి యద్వంద్వుఁడో లేక మన్మథుని

జంత్రమో తెలియరాదు. దీనిని సరస్వతీ పత్రికాధిపతులిప్పుడ ముద్రించిరి కావున నుదాహరణము లనావశ్యకము.

## మల్లారెడ్డి (క్రీ. శ. 1600)

ఇతఁడు భాగ్యనగరమను నన్వర్థనామముగల హైదరాబాదునకు 40 మైళ్లుత్తరముగా నున్న బిక్కనవోలిపురమున కధీశ్వరుఁడు. ఇతని యన్న యగు కామినేని కామారెడ్డి ఢిల్లీ పట్టణమున నక్బరుచే సన్మానింపఁబడినవాఁడు. అతని పేరటనే సోమనాథకవి బ్రహ్మోత్తరఖండమును, సూతసంహితను రచించెను. మల్లారెడ్డి సమీపముననుండు గోదావరీ తీరమున వేములవాడ యను క్షేత్రమున రాజేశ్వరస్వామికిఁ బరమ భక్తుఁడై శివదీక్షాపరుఁడై యుండెను. ఇప్పటికిని వీరి సంతతివారి శైవభక్తియు నిష్కాపట్యమునుఁ జాలఁగొనియాడఁ దగినవి. ఇతఁడు షట్చక్రవర్తి చరిత్రయు, శివధర్మోత్తరఖండమును రచించెను. మొదటిది ప్రబంధము. రెండవది శైవశాస్త్రాగమము. పై యది వర్ణనా ప్రధానమైనది. క్రిందటిది ప్రమాణ పూర్వకమైనది. అచ్చటచ్చట దోషము లున్నను గవిత్వమించుక ప్రౌఢముగానే యుండును. శివధర్మోత్తర ఖండ మెనిమిది యాశ్వాసములు గలది. ఈతఁడు వ్యాకరణ వేదాంత శైవాగమముల జితపరిశ్రముఁడని తోచుచున్నది.

## సాయపవేంకటపతి (క్రీ.శ. 1620)

అప్పకవి యితని పేరు తన కృతి షష్ఠ్యంతములలో వేర్కొనెను. ఇతఁడు పెమ్మసాని చిన తిమ్మాభూపతికి నల్లుఁడు. కడప జిల్లాలోఁ బినాకినీ నదీతీరమున నుండు గండికోట దుర్గమునకుఁ బ్రభువు. ఇతఁడు సకలజన సంజీవనిపేరఁ బ్రసిద్ధుఁడగు రామానుజాచార్య చరిత్రమును స్వయముగా రచియించెను. ఇక్కవికి ద్రమిళ భాషలో నిరర్గళ పాండిత్యము గలిగియున్నట్లు తద్గ్రంథములోని కొన్ని ప్రదేశములు తిరుప్పావు మొదలగు వైష్ణవ ప్రబంధములతోఁ బోల్చి చూచిన యెడల మనసుఁ దోఁచును. ముకుందమాల మొదలగు స్తోత్రములనితఁ డక్కడఁ దెలిఁగించి కావ్యమునఁ జొప్పించుచున్నాఁడు. ఇది యైదాశ్వాసముల గ్రంథమైనను జాల పెద్దది. కవిత యంతమనోహరమైనది కాదు శృంగారరసమే ప్రధానముగాఁ గల యాంధ్రకవితలఁ జర్చించిన నాకు విష్ణుభక్తి ప్రధానమగుదీన స్వారస్యము గ్రహింపబుద్ధి మాంద్యము గలిగెనేమో?

అనేక ద్రవిడప్రబంధములు తెనిఁగింపబడి యుండుట యెవ్వరికింకనుఁ దెలియ రాదు. నమ్మాళ్వారు రచించిన తిరువాయి మొళియుఁ గులశేఖరులు,యామునులు-వీరలస్తోత్రములు రామానుజులవారి తత్త్వప్రకాశికయు బహుకాలమునకుఁ బూర్వమే యాంధ్రీకరింపబడి యున్నవి.

ఉ. కారణమస్తక స్థల విగాఢ సముత్కలికమ్య లబ్ధభా
గారముసంగిరీటమణికాండ మెసంగఁ బొసంగ వీర శృం
గారతరంగ పంక్తులసఁగా గనకాంశుక గాంతగాంతు లెం
తేరహిఁ బన్ను నిన్నఖిల దేవవరేణ్యు శరణ్యు నెన్నెదన్

## కళువె వీరరాజు (1645 ఎ.డి.)

ఇక్కవి రత్నము మహిసూరిరాజగు దేవరాయలకునుఁ జిక్కరాయల కును సేనాధిపతియై చోళపాండ్య మండలములను బయించి ముద్దళగిరిని కొంత కాలము దోలి మధురాపురమున నుండెను. ఇతఁడు భారత వచన కావ్యమును చిక్కదేవలీలయును రచించెను. ఇతని వచనభారతము వ్యాసరచిత కథకు తెనుఁగు గాని నన్నయ ఫక్కి ననుసరించినది కాదు.

నన్నయ్య భట్టారకుఁడే వచనమున మూలమును మార్పక తెనిగించి యున్నచో నదియెట్లుండునో యితని వచనమునంత గంభీరమై మిక్కిలి యిం పుగానున్నది. నా కాదివర్వము మాత్రమే చూడతస్థించినది. ఇతనికొమారుఁడు పెక్కులు వచనగ్రంథములు హాలాస్య స్కాంద వైంగ్యాదులు రచించెను. ఈ వీరరాజునకంకితముగా నొకఛందోగ్రంథము వీరభూపాలీయము రచింపఁబడి నది. అప్పకవి తన సామగ్రినంతయు నీగ్రంథమునుండియే పూర్ణముగా గ్రహించుకొనెనని చెప్పుటకు మిక్కిలి లజ్జగానున్నది- వీరభూపాలీయము పెద్దన లక్షణ సారసంగ్రహములేకున్న నప్పకవీయమును, ముద్దరాజు రామనకవి సంజీవనియు రత్నాకరములేకున్న గూచిమంచి తిమ్మకవి లక్షణసారసంగ్రహ మును మనముచూచి నవ్వునంతటి భాగ్యము మనకులేకుండును.

## రేచర్ల మాధవరాయలు (1680 ఎ.డి.)

ఇతడు జటప్రోలు సంస్థానవిభుండు. సర్వజ్ఞసింగమ నాయనివంశజుఁడు-ఇతని ప్రపితామహుఁడగు మాధవరాయడు వాల్మీకి రామాయణమునకు సంస్కృత వ్యాఖ్యరచించెను.ఇతనితాత మల్లనృపతి, బాలసరస్వతిచే భర్తృహరి

తెనిగింపజేసెను. ఇతఁడు చంద్రికాపరిణయమును రచించెను. బాలసరస్వతి రచించిన చంద్రికాపరిణయము సర్వవిధముల దీనికంటె శ్లాఘాపాత్రము. అనేక ప్రబంధములను, పిల్లవసుచరిత్రములని వేర్కొనుచున్నారుగాని యేలదీనిని వసుచరిత్రమునకుఁ బ్రతిబింబమని చెప్పనొల్లరో! దీని నిక్కవి తోరణాల చొక్కయ అను నియోగిపుంగవుని సహాయంబున రచించినట్లు తెలియుచున్నది. ఇక్కవియు, శూద్రోచ్ఛిష్టమునకుఁ బ్రతికల్పించుటకు సిగ్గుపడమిచే సహచరులగు విద్వాంసులు

"తోరణాల చొక్కదొంగకుక్క"

యని వసుచరిత్ర పత్రమును ద్రోసిచెప్పిరట! అయిన నిక్కావ్యబంధము వసుచరిత్రవలె సులభముగాగాక గాఢముగా నుండును. ఇది చేవలబుట్ట యల్లినట్లు శిథిలబంధమున గూర్పఁబడక, పదముల బిగువుగలదుగాని యాదికవుల కావ్యములలోని పారిశుద్ధ్యముగాని తంజావురీ తొండమాన్ రఘునాథాముల రసస్ఫూర్తిగాని యిందగపడదు. ఉత్ప్రేక్షాతిశయోక్తులకుఁ బుట్టినిల్లై శ్లేషలకుగనియైనను, రాతికి గోతికింగలుగు బిడ్డలును కొండలఁ గాలిగోరనెగఁ జిమ్ముమగలునునిందుఁగానరారు. కృతిసుప్రసిద్ధమైనందున నుదాహరణము లనావశ్యకములు.

## గద్వాలసోమభూపతి (1700 ఎ.డి.)

ఇతఁడు నైజాము రాజ్యమున నుండు గద్వాలకుఁ బ్రభువు. ఇతనియాస్థానముననే భద్రాపరిణయము రచించిన కాణాదము పెద్దన సోమయాజి యుండినది-ఇక్కవి హరిహరప్రణీతమగు రతిశాస్త్రమును మూడాశ్వాసములుగా రచించెను.

## పామనృపాలుఁడు (1700 ఎ.డి.)

ఇతఁడు నైజాము రాజ్యమునసుండు సురపుర సంస్థానమునకుఁ బ్రభువు. కాణాదము పెద్దన సోమయాజి శేషశైలేశలీలయను పంచవర్గీయ కృతియు మత్స్యపురాణమును నితనికంకిత మొసంగెను. ఇక్కవి భార్గవపురాణ మతిలలితముగాఁ దెనిగించెను.

## బిజ్జుల తిమ్మభూపాలుఁడు (1700 ఎ.డి.)

ఇతఁడు కృష్ణాతీరముననుండు ప్రాకుటూరీ పురవరుండు; వేమారెడ్డివంశజుఁడు. ఇతఁడు మురారిప్రణీతమగు ననర్ఘరాఘవనాటకమును జంపూకావ్యము

గాఁదెనిఁగించెను. అయ్యది చాలఁ బ్రౌఢమై నిరుపమానమైయున్నది. దీనినే నేటి కాలమునఁ గొందఱు తెనిఁగించిరి కాని తిమ్మభూపాలునికృతి కీడురాదు. చూడుఁడు కవిప్రౌఢిమ-

శా. జాతాపక్వపలాండు పాండిమ ధరచ్ఛాయన్‌గనెన్ దారలు
ద్ద్యూతింగైకొనెఁ బ్రాచికొన్ని కిరణంబుల్ పద్మజీవాతువుల్
లూతాతంతు వితానవర్తుల నభోలోలాత్మ బింబంబుతోఁ
బ్రాతఃప్రోషిత రోచియై డిగియెఁ దారానాథుఁడస్త్రాద్రికిన్.

సీ. లోకత్రయీపాళిలోచనోత్పలపాళి
కసమపీయూష ధారాగ్రయణము
నధ్వనీనోన్మాది హవ్యవాహోచ్చల
దాలాతనిబిడలేఖావలంబు
ప్రకటతమఃపుంజ ముకుళిత విష్టపో
ద్ఘాటనపాటవోదగ్రకుంచి
జగములొక్కట గెల్వఁజాలు వీరులలోనఁ
గమలసాయకు నాద్యగణితరేఖ

గీ. సతత వికసన జాగ్రన్మ సారకచభ
రాముఖాంబుజ శ్రీపతిరాజబీజ
మనుపమానంద కల్పద్రుమాంకురంబు
నిందుఖండంబుఁ గనుగొంటి నిందువదన.

## కోటరాయ రఘునాథుఁడు (1720 ఎ.డి.)

ఇతఁడు దక్షిణ దేశమునఁబుదుక్కోట సంస్థానాధీశుఁడు. తొండమాన్ చక్రవర్తివంశజుఁడు. ఇతని సభలో నుదురుపాటి వెంకనకవి యను ప్రఖ్యాతకవి యాంధ్రభాషార్ణవము అనునిఘంటువు రచించెను. రఘునాథుడు పార్వతీపరిణయము కవిజనసంజీవనము అనురెండు కృతుల రచించెను. పార్వతీపరిణయము వ్యాకరణ దోషములకెల్ల నిలయమనుట యొక్కటే యక్కవికి న్యూనత గాని మహాకవుల కావ్యగుణములన్నియు దీనఁగలవు. అద్భుతభావ కల్పనలకుఁ గాని, హాస్యరచనాకౌశలమునందుఁగాని కృష్ణరాయల కాలమునకు దరువాత

నిట్టికవులు పెక్కురులేరు. భావములు నూతనములై యుండుట తంజాపుర పుదుకోట మధురాపుర రాజకవులకే చెల్లును. హాస్యరచనాచాతుర్యము, వ్యాజోక్తులును వీరికృతులలో స్వతంత్రముగా నెఱయుచున్నవి- ఇదిముద్రిత కావ్యము గావున నుదాహరణము లనావశ్యకము.

స్థలసంకోచముచే ననేకాంశములు త్యజింపఁబడినవి. స్థలాంతరమున విరివిగా వ్రాయఁదలఁచినారము. దామర వెంకటపతి, విజయరాఘవుఁడు, విజయరఘునాథుఁడు, ఎల్లవిభుఁడు, ఎఱ్ఱభూపతి, ముద్దళగిరి, నంజరాజు, దొడ్డరాజు మొదలగు రాజకవులనేకులున్నారు.

[ ఆంధ్ర పత్రిక-ప్రథమ సంవత్సరాది సంచిక-బొంబాయి
196-204 పుటలు.
సాధారణనామ సంవత్సర చైత్రశుద్ధ పాడ్యమి భానువాసరము ]

1910 మా. రామకృష్ణకవి

# 2. తెనాలి కవులు

వశ్యవాక్కులగు పండితాగ్రగణ్యుల యభిప్రాయములను లోకమునఁ జిరకాలము నూఁదివచ్చు పుక్కిటి పురాణములను సులభముగాఁ బూర్వపక్షము చేసి యబద్ధమని స్థాపించుట మహామతులకేనియు సంపూర్ణ సామగ్రితోనైనను గడుదుష్కరము. తెనాలిరామకృష్ణుఁ డాకృష్ణరాయని సభలో హాస్యరస చతురుఁడై యుండెనో లేకయతని యనంతరము నూటయిరువదియేండ్లకునుఁ దనపాండురంగ మాహాత్మ్యమును రచింపఁడయ్యెనోయనునంశము చిరకాలము నుండి నాహృదయమును వేధించుచున్నది. ఈ వ్యాసములో సుప్రసిద్ధుఁడగు రామకృష్ణుని కాలనిర్ణయమును గుఱించి వ్రాయఁదలంచి యాపేరుగల మఱి కొందఱుండుటచే వారల సహితమిందుఁజేర్చి యించుక విచారించినఁ బ్రతివాద బుద్బుదములుప్పతిల్ల సౌకర్యము చాలదని యీ వ్యాసమునకుఁ బైనామమిడ వలసివచ్చెను. తెనాలివారలు రామకృష్ణకవి, అన్నయ్య, గిరియప్ప, రామకృష్ణ కవి, రామభద్రుఁడు, రామలింగఁడు, అని కొందఱుగలరు. ఇందఱి పేరులు క్రొత్తగనుడువుట తన్నామధారినగు నా హాస్యచాతుర్యమని యెవ్వరును దలఁప కుఁడు. పైపరంపరలోఁ గడపటి రామలింగఁడు స్వర్ణకార కులజుఁడు; గోల కొండ తానీషాయొద్ద మంత్రులుగా నుండిన యక్కన మాదనల యాస్థానకవి. "శ్రీ మదుమామహేశ్వర చరణారవింద సేవాప్రవీణ తెనాలివంశ పవిత్రార్యజన స్తోత్రపాత్ర మృత్యుంజయనామధేయపౌత్ర మల్లికార్జునతనూభవ రామలింగ నామధేయకవి విరచితంబగు ధారజనమనోవిరాజితం'' బనునొక యేకాశ్వాస గ్రంథము స్వర్ణకారకులజ ప్రాశస్త్యమును వర్ణించునది విలసిల్లుచున్నది. ఇది సుమారు 250 సంవత్సరముల క్రిందటిది. కవిత కేవలము కథాసూత్రమునే యనుసరించుచు సామాన్యముగా నడచుచున్నది. సకలజన మనోనయన హరణ కౌశల ప్రభావిశేషంబులేకున్నను, రంగస్థలీ విలాసంబులగు మాయాప్రసాధన విజృంభణంబు లిందుగానరావు.

ఉ॥ పూర్ణకళావిశేషముల పొల్పుచెలంగు ముఖంబులన్ సువి
స్తీర్ణ వికాసనేత్ర సరసీరుహముల్ మృదులాంచితప్రభా
కీర్ణవిలాసమూర్తిరుచి గీల్కొనఁజెక్కుల నవ్వులున్ మహా
ద్వర్ణములున్ సజీవములు వావిరిగల్గనొనర్చిరయ్యెడన్.

అను వద్య మతని రచనాధోరణి కుదాహరించితిఁ గాని యిందులోఁగల యర్థము మాత్రము చదువువారలకుఁ గలుగునట్లు కవి రచియింపఁడయ్యె. ఇఁకఁ దక్కిన వారెల్లరును సగోత్రులు సకుటుంబులు. తెనాలి రామకృష్ణకవియు,అన్నయ్యయు, శ్రీగిరియు నన్నదమ్ములు; ఇమ్మడి రామకృష్ణుఁడు శ్రీగిరి కుమారుఁడు. పీరరాఘవుఁడును రామభద్రుఁడును రెండవరామకృష్ణుని పుత్రులు. వీరందఱును గ్రంథకర్తలే. వితరణశాలులగు రాజేంద్రుల సభలు నిర్నిరుద్ధద్వారములై యుం డఁగా "ఊరూర నింటనింట... పదుగురేసి కవులు భవ్యచరిత" అను మాట యేల నిక్కము కాఁగూడదు? వీరిలో రామకృష్ణకవి కందర్పకేతు విలాసము, హరిలీలా విలాసము, పాండురంగ మాహాత్మ్యము, ఘటికాచలమాహాత్మ్యమును; తెనాలి యన్నయ సుదక్షిణాపరిణయమును; శ్రీగిరి శ్రీశైలమాహాత్మ్యమును; ఇమ్మడి రామకృష్ణుఁడు కృష్ణచరితమును; రామభద్రుఁ డిందుమతీకల్యాణమును విరచించిరి. వీనిలో నిందుమతీకల్యాణమును బాలచురికృష్ణభూపాలున కంకితము సేయుచు రామభద్రకవి కవిస్తుతిలో -

ఉ. మామక నవ్యకావ్యము సమంచిత మాధురిసాధురీతిగా
యామకృత ప్రబంధ రచనాయత పాక చతుర్విధైక వా
ర్తా మహిమోజ్జ్వలాఢ్య కవితా ఘనతామహు మత్పితామహున్
రామయ రామకృష్ణ కవిరాజుఁదలంచి నుతించి మ్రొక్కెదన్.

గీ. తదనుసంభవమణిని దక్షిణా ప
రిణయ ముఖ కావ్యరచనాధురీణు నంధ్ర
కవి కదంబములోనఁ బ్రఖ్యాతిఁగన్న
యన్నప కవీంద్రు ధీసాంద్రు నభినుతింతు.

అని చెప్పి, తద్రాజేంద్రుఁడు తన్నుఁ బిలిపించి,

సీ. ప్రౌఢి మీపెదతాత పాండురంగాది స
త్కృతులు సేసెను రామకృష్ణ సుకవి
అనుజుఁ డన్నప్ప మీపినతాత రచియించెఁ
బరఁగ సుదక్షిణా పరిణయంబు

మీతాత శ్రీగిరి చాతురీ విఖ్యాతి
శ్రీశైల మాహాత్మ్య కృతియొనర్చెఁ
గడిమి మీతండ్రి యిమ్మడి రామకృష్ణాఖ్యుఁ
డనఁ గీర్తిగనె సంస్కృతాంధ్రములను
గీ. దొరలనిపించె మీయన్న వీరరాఘ
వాఖ్యకవి సర్వ కవితామహత్త్వమునను
నిన్ననూచాన సంతాను నెన్నఁదరమె
ప్రాజ్ఞ హృదయాబ్జరవి రామభద్రసుకవి!

అని పొగడినట్లు తన యిందుమతీకళ్యాణమునఁ జెప్పుకొనియె. ఇఁక మనకు గలుగు సామగ్రితో స్థిరహృదయములగు పండితభూధరములతోఁ దగురునుం బోలె నించుక సమీపించి చూచెదను. శృంగభంగమైనను విలాససౌష్ఠవమే.

శ్రీయుత వీరేశలింగం పంతులవారు రామకృష్ణుని గుఱించి యొక్కచో నతఁడు క్రీ॥ శ॥ 1560 - 70 సంవత్సర ప్రాంతముననుండి కవియై యుండ వచ్చుననియు, వేఱొకచోఁ బదునేడవ శతాబ్దియందుండె ననుటకు సందేహము లేదనియు, మఱియొక్కచోటఁ బాండురంగమాహాత్మ్యము రచింపఁబడిన కాలము 1650 సంవత్సరముకంటెఁ బూర్వమై యుండదనియు వ్రాసిరి. తెనాలి రామకృష్ణకవి కృష్ణరాయని సభలో నుండెనని తక్కిన చరిత్రకారుల యభిప్రాయము.

1. పాండురంగమాహాత్మ్యము విరూరి వేదాద్రి మంత్రి కంకితమయ్యె. అతఁడు కందాళ యప్పళాచార్యుల శిష్యుఁడు; మంగయ గురువరాజు కుమారుఁడగు పెద్ద సంగభూపాలునకు వ్రాయసకాఁడు. ఇందులోఁ గందాళ యప్పళాచార్యునే చిత్రభారత కృతికర్తయగు చరికొండ ధర్మనయు, వైజయంతీ విలాసకర్తయగు సారంగు తమ్మకవియుఁ బ్రశంసించి యున్నారు. తమ్మకవి యయ్యాచార్యునకు శిష్యుఁడు; చరికొండ ధర్మన కాశ్రయుఁడగు నిమ్మలపల్లి పెద్దామాత్యుని తండ్రియు నయ్యాచార్యుని శిష్యుఁడట; ధర్మన భట్టపరాశర దేశికుని పౌత్రుఁడగు రంగనాథదేశికుని శిష్యుఁడు.

2. రామకృష్ణుఁడు భట్టపరాశరుని కుమారుఁడగు చిక్కభట్టరుకు శిష్యుఁడు.

క. వాక్కాంతాశ్రయ భట్టరు
చిక్కాచార్యుల మహాత్ము శ్రీగురుమూర్తిన్
నిక్కపుభక్తి భజించెద
నిక్కావ్య కళా కలాప మీడేరుటకున్ (పాండు.)

లింగముకుంట తిమ్మనయు నతనికే శిష్యుఁడు.

3. ఇఁక రెట్ట మతమనెడి జ్యోతిషగ్రంథము కొండ్రాజు తిమ్మరాజు కుమారుఁడగు వేంకటాద్రికి నంకిత మీఁబడియున్నది. ఆవెంకటరాజు మంగయ గురువరాజు కుమార్తెయగు పాపమాంబకుఁ బుత్రుఁడు. అనఁగా విరూరివేదాద్రి మంత్రికి యజమానియగు పెదసంగభూపాలునకు జెల్లెలికుమారుఁడు. ఈ వేంకటాద్రికిఁ గామందకమను రాజనీతి గ్రంథ మొకటి యంకితముగా రచింపఁబడి యున్నది. దానిలోఁ బ్రథమాశ్వాసాంతమున-

క. శ్రీచంచద్భట్టరు చి
క్కాచార్య వరార్య శిష్య యతులిత శౌర్య
ప్రాచుర్యవర్య గుణర
త్నాచల జయలలిత ధైర్య నయవినయనిధీ.

అని యున్నందున వేంకటాద్రియుఁ జిక్కభట్టునకు శిష్యుఁడు.

పై సూచించిన యంశములలోఁ జిక్కభట్టరు భట్టపరాశరుని కుమారుఁ డనుటకుఁ దప్పఁ దక్కినయన్నిటికిని శ్రీయుత పంతులవారే కవిచరిత్రములో నాధారములు సూపిరి. స్థలసంకోచముచే నిందు వాని నుద్ధరింపజాల. చిక్కభట్టు పరాశరభట్టు కుమారుఁడు. తంజాపురీనాథుఁడగు విజయరాఘవుని సభలో నుండిన శేషము తిమ్మకవి తన యంబరీషచరిత్రమున భట్టపరాశరుని పుత్రుఁడు చిక్కభట్టనియు నతనిపుత్రుఁడు రంగనాథదేశికుఁడనియు నతనికుమారుఁడు చిక్కభట్టనియు మరల నతనిపుత్రుఁడు రంగనాథుఁడు తన గురువనియు వ్రాసికొనియె.

శ్రీయుత పంతులవారు రెట్టమతము కడపటనున్న యీ క్రింది పద్య మాధారముగా నొనర్చి రామకృష్ణుని కాలనిర్ణయమునకు సమకట్టిరి.

సీ. కలియుగ ప్రథమభాగము నాల్గువేల యె
న్మిదినూర్ల పైని డెబ్బదియునొకటి
శాలివాహనశకసమలిల వేయునా
ర్నూట తొంబదిరెండు రూఢిగాఁగ
ప్రభవాది గతములు పరఁగ నిర్వదిమూఁడు
నేండ్లయ్యె నెంతయు నెన్న బుధులు
అట్టికాలంబున నయ్యన భాస్కర
కవివర్యులలరాజకమలహితుని

యాజ్ఞఁ బూర్వోక్తరెట్ట మతాఖ్య కావ్య
మును నొనర్చిరి యాచంద్రముగను గిరి.

ఈపద్యము ప్రాచ్య లిఖిత పుస్తకభాండాగారమున నుండు నాల్గు ప్రతులలో నొకదానిలో మాత్రము కలదు. నే నిటీవల సంపాదించిన ప్రతులలోఁ గానరాదు. వ్రాఁతప్రతిలోనుండిన లేఖక దోష సహస్రమును, బంతులవారు వివరించిరి. ఈపద్యముననుసరించి కృతిపతి క్రీ.శ. 1769లో నుండియుండఁగా నతని మేనమామయగు పెద్దసంగభూపాలునకు వ్రాయసకాఁడగు విరూరి వేదాద్రి మంత్రి క్రీ. శ. 1650 ల కంటెఁ బూర్వుఁడు కాఁజాలఁడు గావునఁ బాండురంగకృతి యంతకంటె నర్వాచీన మనుట దోషముకాదు. అయినను బంతులవారు మామకును నల్లునకును 119 సంవత్సరములు భేదముసూపిన యుక్తి యద్భుతముగా నున్నది. మంగయగురువరాజునకుఁ దొమ్మండ్రు పుత్రులు. వారలలోఁ బెదసంగ భూపతి మూఁడవవాఁడు; పాపమాంబ కడగొట్టు చెల్లెలు. ఈ సమృద్ధ సంతతిలో నొక్కొక్కనికి బదియేండ్లచొప్పున గర్భధారణ కాలభేదము చూపినను మూఁడవ కుమారున కెట్లు కడగొట్టు చెల్లెలికుమారుఁడు 120 యేండ్ల పిదప నుండ సంభవించెనో యస్మాదృశుల బుద్ధుల కగోచరమై యున్నది. ఇంత విశాల కాలము సునిష్ఠిత వీర్యుఁడగు మంగయ గురువరాజెట్టి రససిద్ధుఁడో యెఱుఁగఁజాల.

మఱియు నీ వేంకటాద్రి-

సీ. శ్రీ మదహోబల స్వామి మహారాజ్య
రక్షకుండగుచు నేరాజు వెలయు

సభిరామ కామందకాఖ్య సత్కావ్య ర
త్నముఁనకు నేరాజు నాథుఁడయ్యె
నెరయూరి పురవరా ధీశాది బహు బిరు
దాంకుఁడై యేరాజు యశముగాంచె
జానకీనాయక చరణసంసేవన
ప్రౌఢిచే నేరాజు ప్రబలుసిరుల

గీ. నతఁడు కొండ్రాజు తిమ్మభూపతివరేణ్య
తనయ పెదతిమ్మరాజవతంస గర్భ
వార్ధి చంద్రుండు సత్కులవర్ధనుండు
నతతవిభవుండు వేంకటక్ష్మావిభుండు.

అని రెట్టమతమున వర్ణింపఁబడినట్లు కామందక కృతిపతియు నహోబల స్వామి భక్తుఁడునై యుండెను. రెట్టమతములోనుండి పంతులవారు సూపిన పద్యాధారము నిశ్చయమాయని మనకుఁ దోచుచున్న సందేహమును దీర్పఁ గామందక కృతియే మనకు శరణ్యము; అహోబలస్వామియే యాపన్నపరిత్రాణుఁడు. కామంచక కృతికర్తలు వేంకటరామకృష్ణులు. దాని నెనిమిదాశ్వాసములుగా రచించి వేంకటరాజున కంకితమిచ్చిరి. తర్వాతనే యతనికి రెట్టమతము విరచితమయ్యెఁగదా. తిక్కనాదులకుఁ బూర్వమే మఱియొక కామంచకము గలదు. మన కామందకమున–

రమణీయంబుగ శాలివాహ శకవర్షంబుల్ గతంబై సహ
స్రము వేనూఱును నాఱునై వెలయఁగా బ్రౌఢిందెనింగించి రౌ
ర మహిందిమ్మయ వేంకటాద్రి విభువేరన్ వేడ్కఁగామంచకీ
యము శ్రీవేంకటరామకృష్ణులు స్వభావన్వబ్దంబునన్ రూఢిగన్.

అని యున్నది. అనఁగా క్రీ. శ. 1584 సంవత్సరమగుచున్నది. ఇది మనకుఁ దోడువడియె; ఇఁక శరణాగతత్రాణ బిరుదుండగు నహోబలపతి యనుగ్రహమెట్లుండునో యతని దివ్యాయతనముఁజొచ్చి చూతము. అదిగో! మహాద్వార శాసనమగపడుచున్నది. చదువుదమా?

"శుభమస్తు. దేవశ్రేణీ శిరోరత్నం దైత్య ద్విపఘటాంకుశం, జయతు శ్రీనృసింహస్య దేవదేవస్య శాసనం" "స్వస్తిశ్రీ జయాభ్యుదయ శాలివాహనశక

వర్షంబులు 15౦6 అగు నేటి తారణ సం॥ వైశాఖశుద్ధ 14 శ్రీమద్రాజాధిరాజ రాజపరమేశ్వర శ్రీవీరప్రతాప శ్రీవీర శ్రీరంగరాయ దేవమహారాయలుగారు పెనుగొండ నగరమందు వజ్రసింహాసనారూఢులై పృథ్వీ సామ్రాజ్యము చేయు చుండగాను శ్రీమద్వేదమార్గ ప్రతిష్ఠాపనాచార్య సర్వతంత్రోభయ వేదాంతా చార్యులయిన శ్రీ శఠగోప జియ్యంగారి కార్యకర్తలయిన రాచప్పగారున్ను శ్రీఅహోబల స్థానంవారున్ను, కాశ్యపగోత్ర ఆపస్తంబసూత్ర యజుశ్శాఖాధ్యాయు లయిన సూర్యవంశోద్భవులయిన మూరురాయర బసవశంకరగుత్తిహం నిబ్బర గండ యొరయూరిపురవరాధీశ్వరులయిన శ్రీమన్మహా మండలేశ్వర కొండ్రాజు తిమ్మరాజుగారి పౌత్రులయిన తిమ్మరాజుగారి పుత్రులయిన వేంకటరాజు దేవ మహారాజులుంగారికి యిచ్చిన శిలాశాసనక్రమమెట్లన్నను, ప్రాక్ బహుధాన్యా నామసంవత్సరాన నిభరాముహారు హండేవారిని కూడుకొని సీమయంతారాచూరా వట్టి అహోబల స్థలానికివచ్చి అహోబలం అంతా పాడుచేసి అహోబలస్థలం అయిదు ఆరు యేండ్లు తమవశంచేసుక ఆక్రమించి నడుస్తూవున్న నిమిత్యం శ్రీఅహోబలేశ్వరులు సన్యాసం ప్రసాదించిన ఆదిమమైన శఠగోపజియ్యంగారికి ఏడోతరమై శ్రీ పురుషోత్తమ ఆచార్యుల ప్రతిష్ఠచేసి ముకుందదేవునిచేత పూజ గొని రామానుజ దర్శనోద్ధారకులైన శ్రీపరాంకుశమహాముని శిష్యులయినటువంటి శ్రీమచ్ఛఠకోపస్వామివారి స్థలం యీతీరున అయిన నిమిత్తం శ్రీ రంగరాయ దేవమహారాయల సముఖాన తాము మనవిచేసి మీరు యీతీరున రత్నసింహాసనా రూఢులై వుండిన్ని మీకులస్వామియైన అహోబల స్వామిస్థలం తురకలు"

అయ్యో! "శిలాభోగం నరాభోగం"అను మాట నిశ్చయమై "భుజంగ జిహ్వా చపలా నృపశ్రియః"అన్న భాసవాక్యము దేవతలకుఁగూడ ననుభూత మయ్యెనా? పై శాసనము మనకేకాక చరిత్రకారులకునుఁ బ్రయోజనకారి యగునని విపులముగా నుదాహరించితిని. ఈ శాసనకాలము సహితము క్రీ. శ. 1584 అగుచున్నది. ఇది శకవర్షములు. ఈకాలముననున్న వేంకటరాజునకు మేన మామ యగు పెద్దసంగభూపతి 20 ఏండ్ల పూర్వమున్నను, పాండురంగ కృతి రచనాకాలము 1564 అగుచున్నది. శైలియు బదబంధముల ననుసరించి చూడఁగా బాండురంగకృతి హరలీలావిలాసముకంటెఁ దరువాత రచితమని తోచుచున్నది.

పైఁ జూపిన శాసనములోని వేంకటాద్రి యొరయూరీపురవరాధీశ్వరుఁడగు సూర్యవంశోద్భవుఁడు కావునఁ దెలుగుచోడులలోఁ జేరినవాఁడు. కామందకమున షష్ఠాశ్వాసమున మొదట-

క. శ్రీదేవ చోడవంశమ, హోదధి పరిపూర్ణ చంద్ర...
.........కొండ్రాజు వేంకటాద్రి నరేంద్రా.

అనియు, రెట్టమతమున—

మ. కపటారాతి విభంజనోద్ధతమతీ కర్ణాటసింహాసనా
ధిపతి ప్రాప్తరమాధురీణ కరుణాబ్ధీ కంతుసౌందర్య కా
శ్యప సద్గోత్రపవిత్ర నమ్రతరవాచానైపుణీనిర్జితా
హిప కామందక కావ్యనాయక కవీంద్రేష్టార్థసంధాయకా.
భానువంశాగ్రణీ బంధు చింతామణీ!

అనియుఁ గలవు కావున శాసనములోని పురుషుఁడే యీ కృతుల భర్తయనుటకు సందేహముండదు.

ఇఁక సుదక్షిణాపరిణయమును గుఱించి పంతులవారు తత్కృతిపతియగు పులిజాల సోమామాత్యుఁడు 1580సంవత్సరప్రాంతములనుండెనని తెలుచున్నదని వ్రాసిరి. అట్లయినఁ దద్గ్రంథకర్తయగు తెనాలి యన్నయ్య కన్నయగు రామకృష్ణుఁ డెట్లు 1650 సంవత్సరములకుఁ దరువాత నుండ సంభవించును? పులిజాల సోమామాత్యుఁడు కోనేటి తిమ్మరాజు కొడుకగు రామరాజునొద్ద మంత్రియైయుండె. రామరాయలకు మనుమనివరుసయగు కోనేటి రామరాజు బుక్కయ రామరాజునకుఁ బెద్దకుమారుని సంతతిలోఁ జేరినందున 1560 లకే యళియ రామరాయలకు మనుమలు కలిగినందున వారు నాకాలమువారనుటకు సందేహింపఁ బనిలేదు. కావున సుదక్షిణాపరిణయరచనకాలముకూడ 1565వ సంవత్సరమే అగుచున్నది.

మఱియు, క్రీ. శ. 1542 పరాభవ సంవత్సరమున గండికోట ప్రభువు కందాళ యప్పలాచార్యునకు భూదానమిచ్చినట్లు భూదాన శాసనము గలదు. అతనికి సమకాలికుఁడగు రామకృష్ణుఁడు నూఱేండ్లపిదప నెట్లుండును? వైష్ణవాచార్యులయొద్ద ముద్రాధారణమును గైకొనువారెల్లరు వారికిశిష్యులే.ఈవ్యాసమునఁ

జూపిన శిష్యులెల్లరు ముద్రాంకన శిష్యులుకాని విద్యాశిష్యులు కారు. కావున బాల గురువుల యొద్దను దక్షిణామూర్తికిఁ బలె వృద్ధశిష్యులుండవచ్చును.

మఱియుఁ దెన్నాలి రామభద్రకవి యిందుమతీకల్యాణమునఁ గృతి పతినిగూర్చి-

గీ. తిరుమల శ్రీనివాసాఖ్య దేశికులకుఁ
ప్రబల షడ్దర్శనైక పారంగతునకు
శ్రీవరార్చనాదరునకు శిష్యుఁడగుచు
భక్తిచిగురొత్తఁ గృష్ణ భూపాలుఁ డలరు.

అని చెప్పెను. కర్మవిపాకమను కృతిలోఁ దత్కర్తయగు తిరుమల వేంకటా చార్యుఁడు తమ పూర్వుల మహాప్రాభవము వర్ణించుకొనుచుఁ నిట్లు చెప్పుకొను చున్నాడు: అంగిరసగోత్రులలో శఠమర్షణుని వంశమున శొట్టముని జనించె; వారి పరంపరలో నాళవంచారు తిరుమలనంబియుఁ దాతాచార్యుఁడునుఁ దిరుమ లయుఁ బెద్దార్యుఁడును గ్రమముగా జనించిరి. పెద్దార్యునకు నలుగురుపుత్రులు- తాతయ్య, చినతిరుమలయ్య, కొండమయ్య, సింగరయ్య. వీరిలోఁ దాతయ్యకే పంచమతభంజన తాతాచార్యులని పౌరుషనామము. వారికుమారుఁడు కంచి తాతాచార్యుఁడు వేటూరి పరిష్కారుఁడునై యుండె. చినతిరుమలయ్య కుమారులు తాతయ్య, పెద్దయ్య, రామానుజయ్య. వీరు మువ్వురును-

తే. గురువు లార్వీటికుల తిలకులకు బుక్క
రాజ వర తిమ్మరాజ సత్ప్రభుల కెలమి.

ఉ. క్ష్మానుత కీర్తిశాలియగు కందనవోల్పెదరామరాజ భూ
జానికిఁ దాతలా సుగుణశాలులు బుక్కవిభుండుఁ దిమ్మరా
జా నృపులాత్మ శిష్యులుగ నట్టు ప్రవర్తిలు మువ్వురందు రా
మానుజ సద్గురుల్ గురువులై రిభనేతకు శత్రుజేతకున్.

ఈ పెద్దయార్యున కహోబల, వేంకట, శ్రీనివాసాచార్యు లను మువ్వురు పుత్రులు. చినతిరుమలాచార్యుని తమ్ముఁడు సింగరాచార్యుఁడు విష్ణుపురాణ కృతికర్తయగు బసవయ రాఘవునకు గురువు. పెద్దయార్యుని కుమారుఁడు శ్రీనివాసాచార్యుఁడు కందనవోలు కోనేటి తిమ్మాధీశ్వరునకు గురువు. అతని మనుమఁడు శ్రీనివాసాచార్యుఁడు నంద్యాల కృష్ణరాజునకు గురువు. పెద్దార్యుని

తమ్ముఁడు రామరాజుని ముమ్మనుమఁడు శ్రీనివాసాచార్యుఁడే పాలచురి కృష్ణ భూపాలునకు గురువు. పెద్దార్యుని పుత్రుఁడగు నహోబలాచార్యుని ముమ్మనుమఁడు (స్త్రీ సంతానమూలకముగా) పూడూరి శోభనాద్రి రాజునకు గురువై కర్మవిపాకమును 1650 లో విరచించెను. ఈ గురుపరంపరనుబట్టి చూడఁగా నిందుమతీకళ్యాణమునకు భర్తయుఁ గర్తయు సుమారు 1590-1600సంవత్సరములో నుండినట్లు తేలుచున్నది. అప్పుడు రామకృష్ణుఁడు తన మనుమనికంటె 50 సంవత్సరములు తరువాత నుండెననుట కేవల మైంద్రజాలిక లీలావిలాసమే.

ఇఁకఁ గందర్ప కేతువిలాసము చిట్టమంత్రి కంకితముగా రచింపఁబడినది. ఈ చిట్టమంత్రి నాదెండ్ల యప్పన గోపనలకు సన్నిహితజ్ఞాతియు సమకాలికుఁడగు "చిట్టరసు" అనునతఁడే యైనయెడల నాకృతియు 1545ప్రాంతములో రచింపఁబడియుండవలయు. అప్పాజియను నామము సాళ్వ తిమ్మరసునకుఁగాక యతని మేనల్లుఁడగు నాదెండ్ల యప్పమంత్రికే చెల్లునని నాయభిప్రాయము.

పై సందర్భములన్నియుఁ గూర్చి యూహింపఁగా రామకృష్ణకవి కృష్ణరాయలసభలో నూత్న యౌవనము చెల్లించి తిరుమలరాయల రాజ్యకాలమునకు వృద్ధుఁడై ఘటికాచలమాహాత్మ్య కృతిలోఁ జే వడఁకుచుండును.

ఘటికాచలమాహాత్మ్యము కృతినందిన ఖండోరాయనికే గిరియప్పయను కవి ద్విపద నలచరిత్ర మంకితమొసఁగియున్నాఁడు. నలుగురు ఖండోరాయలలో నితఁ డేకాలమువాఁడని యూహించుటకుఁ గొంత యాధారము లభించినది కాదు. వారిలో నొకఁడు 1600 సం॥ములో నుండినట్లును, మఱియొకఁడు 1684లో నుండినట్లును శాసనములు గలవు. ఖండోజి కాలమున రామకృష్ణుని మనుమఁడుండినందున నిది స్పష్టముగాఁ దెలిసినఁ గొంత యాధారమగును. నాకుఁ దోచిన యంశములు బయలుపఱచితిని; చరిత్రకారులు తమపరిశ్రమతోఁ జేర్చి యూహించినచో నిశ్చయము బయలుపడును.

1914 ఆంధ్ర పత్రిక సంవత్సరాది సంచిక మా. రామకృష్ణకవి

# 3. సంస్కృతభాషలోని కొన్ని విస్మృత నాటకములు

అహో! వృథివి నేటికిని రత్నగర్భయే! వెదకెడివాఁడును భోగించెడి వాఁడును నుండిన రత్నములకేమి తక్కువ? శాకుంత లోత్తరరామచరిత్ర రత్నావళీ స్వప్నవాసవదత్తములు చదివి యింక సంస్కృతభాషలో నుత్తమ నాటకములు గలవా యని పెక్కండ్రు తలంచుచున్నారు. విస్మృతి మహార్ణో రాశిలోఁ గాలపురుషుని దండఘాతమునకుఁ దూంట్లువడి మునిఁగిపోయిన కృతి నౌకల నిప్పుడిప్పుడు మహాప్రయత్నముల వెలువరింపఁగాఁ గవిలోక మతివిశాల మనియుఁ గావ్యవినోదులకు విహారరమణీయములగు నారామములు వయోబుద్ధి విద్యాగుణవిశిష్టుల నొక్కొక్కరికిఁ దగినట్లు పెక్కులుకలవనియు నిరుపాధిక సుఖాసక్తుల నుద్ఘోషింపఁజాలునన్ని శిల్పవైచిత్రులు పొడ కానవచ్చుచున్నవి. ఈ వ్యాసమునఁ గొన్ని రూపకములనుగూర్చి ప్రస్తావించి కేవలము నామావ శిష్టములగు మఱికొన్ని రూపకములఁ బేర్కొన్నచో లోకులు వానిని సంపా దించి మాసిపోవుచున్న మహాకవి కీర్తిచరిత్రముల కించుక మెఱుఁగుపెట్టి వానినిఁ బునరుజ్జీవింపఁజేసి కృతార్థులగుదురుగాక యని యీ యల్పప్రయత్నమునకు దిగితిమి.

మేము నిశ్చితాంశ సందిగ్ధాంశముల సూచించినట్లె సర్వత్రప్రమాణబుద్ధితో వ్రాయఁగలము గాని యొక్కొక మాటకు నాధారములుచూపి తమకుఁ దామె స్త్రీలో పురుషులో యని సందేహమునైతము గలుగఁజాలినట్టి మహాపురుషుల మేము మెప్పింపఁజాలము. దీనిని సంస్కృతభాషలో రచించి సర్వసామాన్య ముగాఁ బ్రచురింపవలసియున్నను, మాకు గీర్వాణభాషలో వచన రచనాకౌశల మలవడకుండుటయు నాంధ్రభాషపైఁగల పక్షపాతమును నాంధ్రుల బహుపథ సంచరణశీలమును నీ యుద్యమమునకు గారణంబులయ్యె.

ఈనడుమఁ గొన్ని నష్టప్రాయములగు నలంకారశాస్త్ర గ్రంథములు లభింప వానిని శోధించితిమి. పైవానిలో శారదాతనయుని భావప్రకాశము, భోజదేవుని శృంగారప్రకాశము, అభినవగుప్తపాదుల నాట్యశాస్త్రవ్యాఖ్యానము, అమృతా

నందుని కావ్యాలంకారసంగ్రహము, ముకుళుని యుద్భటాలంకారవాఖ్యయు ముఖ్యము. వీనిలోఁ బేర్కొన్న నాటకములు పెక్కులుత్సన్నములయ్యె. వానిలోఁ గొన్నింటిఁ బేర్కొని ప్రలబ్ధనాటకములనుగుఱించి విస్తరించెదము-

## శారదచంద్రిక

దశమావస్థ రూపకముల వర్ణించుట నిషేధ్యమనియు, నాయకమృతి పునరుజ్జీవనమునఁ బర్యవసించునేని దుష్టముకాదని చెప్పుచు శారదాతనయుడు "చంద్రాపీడస్యమరణం ప్రత్యుజ్జీవనకాంక్షయా కల్పితం భట్టబాణేన యథా శారదచంద్రికా" యనెను. బాణుని శారదాచంద్రికల్లోఁ గాదంబరీకథయే కథా శరీరము గాఁబోలు. క్షేమేంద్రుఁడు-

"అంగేఽనంగజ్వరహుతవహశ్చక్షుషి జ్ఞానముద్రా
కరేజీవః కరకిసలయే దీర్ఘశాయీ కపోలః
అంసే వీణాకుచపరిసరే చందనం వాచిముద్రా
తస్యాః సర్వంకృతమితిపునస్త్వాం వినాక్వాపిచేతః"

అని యుదాహరించిన పద్యము కాదంబరీవిరహావస్థను సూచించునని చెప్పుటచే శారదచంద్రికలోనిదే కావలయును.

## తాపసవత్సరాజము

హైహయవంశస్థులగు కలచురిరాజులలోఁ బ్రఖ్యాతుఁడగు ననంగవర్షుఁడు తాపసవత్సరాజమను నాటకమును రత్నావళీస్వప్న వాసవదత్త కథాభాగములఁ గైకొని రచించెను. ఈతఁడును క్రీ. శ. 7-8 శతాబ్దులలో నుండినవాఁడు. ఈ నాటకరాజము మనకు లభింపకున్నను యూరోపుఖండమున నొక్క ప్రతి యెచ్చటనో నిలిచియున్నది. దీనిలోని పద్యములు విప్రలంభకరుణ రసప్రధానములుగా నానందవర్ధనభోజాదు లుదాహరించిరి. దీనిలోఁ బద్మావతి నుదయనుఁడు పరిణయమాడినను వాసవదత్తపైగల మోహముననే, విప్రలంభావస్థచేఁ బ్రకటించుచు హృదయములు నీరుగా గరఁచు భావములు వెలువరించును. తృతీయాంకమున లావణకాగ్నిలోఁ గాలిన వాసవదత్తను స్మరించుచు-

''సర్వత్ర జ్వలితేషు వేశ్మసు భయాదాలీజనే విద్రుతే
శ్వాసోత్కంప విహస్తయా ప్రతిపదం దేవ్యా పతంత్యా తదా

హానాథేతి ముహుః ప్రలాపపరయా దగ్ధం వరాక్యాతయా
శాంతేనాపి వయం తు తేన దహనేనాద్యాపి దహ్యామహే''

పంచమాంకమున—

"దేవీస్వీకృత మానసస్యనిభృతమ్ స్వప్నాయమానస్య మే
తద్గోత్రగ్రహణాదియం సువదనా యాయాత్కథం న వ్యథామ్
ఇత్థం యంత్రణయా కథం కథమపి క్షీణా నిశా జాగ్రతో
దాక్షిణ్యోపహతేన సాప్రియతమా స్వప్నేఽపి నాసాదితా."

అనునవి యుదాహరణీయములు.

## అభిసారికాచండికము

విశాఖదేవుఁ డభిసారికాచండికమను వత్సరాజ పద్మావతీపరిణయ వానసవదత్తా విప్రలంభమునే వర్ణించు నాటకమును రచించె. ఇందుఁ బద్మావతి పుత్రవధకు సమ్మతింపఁగా రాజు క్రిందివాక్యముల నామె హృదయము భేదించును—

ప్రదుష్టోగ్రగ్రాహం సరితమవగాఢః శ్రమవశా
దుపాలీనః శాఖాం ఫలకుసుమలోభా ద్విషతరోః
ప్రణాలీరత్నాక్తీచ్యుత పరిచయాం క్రౌర్యనిరతాం
విషజ్వాలాగర్భాం చిరమురగకన్యామనుసృతః.

## రామాభ్యుదయము

భవభూతిని మెచ్చి సన్మానించిన కాన్యకుబ్జాధీశుఁడు యశోవర్మ రచించిన రామాభ్యుదయము షడంకనాటక మతిమనోహరముగా నుండునని యూహింపఁ దగియున్నది.

## ముకుటతాడితకము

బాణుని ముకుటతాడితకమున గదాయుద్ధభాగముఁ దత్పూర్వకథయు వర్ణింపబడియున్నవి. భీముఁడు దుశ్శాసనవధానంతరము ద్రౌపది క్రొమ్ముడి ముడిచి—

"ధ్వస్తాఃక్షుద్రాః ధార్తరాష్ట్రాః సమస్తాః
పీతంరక్తం స్వాదు దుశ్శాసనస్య।
పూర్ణా కృష్ణే కేశ బంధప్రతిజ్ఞా

తిష్ఠత్యేకః కౌరవస్యోరుభంగః॥
ఊరూం నిపీడ్యగదయా యదినాస్యతస్య।
పాదేన రత్నముకుటం శకలీకరోమి,
దేహం నిపీత నిజధూమ విజృంభమాణ
జ్వాలాజటాలవపుషి జ్వలనే జుహోమి॥"

అనిశపథముచేయు భాగము భోజుఁ డుదాహరించెను.

## దేవీచంద్రగుప్తము

చాణక్యచంద్రగుప్తులకథ ముద్రారాక్షసమునందె కాక ప్రతిభాచాణక్య దేవీచంద్రగుప్త నాటకముల వర్ణింపఁబడియె దేవీచంద్రగుప్తమునఁ జంద్రగుప్తుఁడు స్త్రీవేషమును ధరించియుఁ గృతకోన్మాదమును బూనియుఁ జాణక్యునకు సహాయుఁడై రాజ్యలాభముంబొందినట్లు తోచుచున్నది. అందు నాయికయగు వసంతసేనతో మాధవుఁ డిట్లుచెప్పెను—

"ఆనందాశ్రు సితేతరోత్పలరుచో రాబధ్నతానేత్రయోః
ప్రత్యంగేషు వరాననే పులకిషు స్వేదం సమాతన్వతా
కుర్వాణేన నితంబయోరుపచయం సంపూర్ణయోరవ్యసౌ
తే(కే)నాప్యస్పృశతావ్యధోనిపతస్రగంధి స్తవోచ్ఛ్వసితః".

మరియుఁ జంద్రుగుప్తుఁడు ప్రవీరజనసంఖ్యఁ జూచి బెదరుచున్న విదూషకునితో నిట్లనెను—

సద్వంశ్యాన్ పృథువర్ష్మవిక్రమబలాన్ దృష్ట్వోద్భుతాన్ దంతినః
హాసేనేన గుహాముఖాదభిముఖం నిష్క్రామతః పర్వతాన్
ఏకస్యాపి విభూతకేసరసటాభారస్య భీతామృగాః
గంధాదేవ హరేర్ద్రవంతి బహవోవీరస్య కిం సంఖ్యయా".

## పార్థవిజయము

త్రిలోచనమహాకవి పార్థవిజయమును రచించెను. లోచనద్వయులమగు మనకుఁ ద్రిలోచనకృతి గాంభీర్యమెఱుఁగరాదను నింత రమ్యమగు నక్కృతియు నింక లభ్యమైనదిగాదు. దానిలో గాంధర్వరాజపరిభూతుఁడగు దుర్యోధనునుని విడిపించి యర్జునుఁడు —

"స్వైర్వైరే కురుపాండవాంతర కృతోయస్మిన్ విశేషో స్తినః
తస్మిన్ తత్కి మసాధువస్తు కథమిత్యార్యాని జానంతితత్
యత్రైకాభి జనాన్వయేత్వభిభవ క్షత్రస్యతస్మిన్ పునః
భ్రాతౄణాం పురతోఽభియోగసమయే సంచో త్తరం స్యాచ్ఛుతమ్.''

అని చెప్పగా దుర్యోధనుఁడు సిగ్గుపడి మాఱుపలుకనోడి యెట్టకేలకు-

"భ్రాతర్హా మిత్యసదృశం మమ దుష్కృతై స్తై
శ్చేష్టా భవానితి తదత్ర దశావిరుద్ధం
యద్య ద్బ్రవీమ వచసా నతు తత్తు తత్ర
కామం భవేచ్ఛరణ మప్రతిప త్తిరేవ."

అని యు త్తరమిచ్చెను.

ఇట్లే యుత్పన్నములగు నాటకములు

కృత్యారావణము
రామానందము
పాండవానందము
మాలతిక
చంద్రరేఖ
కుసుమశేఖరము
సౌభద్రిక
తరంగద త్త
సముద్రద త్త
మూలదేవచరితము
చండాలరామాయణము
పుష్పభూషితకము
రామానుజము
గౌరీగృహము
నళవిక్రమము
మారీచవంచితము
సుగ్రీవకేళనము
దేవీపరిణయము

చైత్రావళీ
మదలేఖా
స్తంభితరంభక
మేనకానాహుష
పద్మావతీ పరిణయము
సాగర కౌముదీ
గంగా భగీరథము

మున్నగునవి లెక్కలేనివి గలవు.

పైని పేర్కొనఁబడినవన్నియు నతిప్రాచీనరూపకములు - క్రీ. శ. 8వ శతాబ్దికి పూర్వము పుట్టినవి కాని నవీనములు కావు.

మన కిటీవల లభించిన నాటకములలో శర్మిష్ఠాయాయాత వీణావాసవ దత్తములు తక్కఁ దక్కినవన్నియు సమగ్రముగా నున్నవి. వీనిలోఁ బ్రాచీన ములని చెప్పఁదగిన కొన్నింటినిఁ గూర్చి యించుకఁ బ్రశంసింపఁదగును. కొన్నింట కృతిపేరులునుఁ గొన్నింట కవి నామములును గానరావు.

## కుందమాలా

దీని ధీరనాగుఁడో దిఙ్నాగుఁడో రచించెను. దీనిలోనిపద్యములు వామన భోజాభినవగుప్త శారదాతనయ విశ్వనాథాదు లుదాహరించినందున ఇది క్రీ. శ. 8వ శతాబ్దికిఁ బూర్వపుఁ గృతియని తోచుచున్నది.

ఈ షడంక నాటకమున నుత్తర రామచరితములోవలెనే కథ కూర్పఁ బడియె. విప్రలంభ కరుణరసప్రధానములగు దీని పద్యములు భావగర్భములై మృదువులై హృదయంగమములై యున్నవి.

ప్రథమాంకమున లక్ష్మణుఁడు సీతను వనాంతరమున విడిచి,

జ్యేష్ఠస్య భ్రాతురాదేశాదానీయ విజనే వనే
పరిత్యక్తాసి దేవి త్వం దోషమేకం క్షమస్వ మే.
జాతశ్రమాం కమలగంధకృతాధివాసైః
కాలే త్వమప్యనుగృహాణ తరంగవాతైః
దేవీ యదాచ సవనాయ......విహాగతే త్వాం
భాగీరథి ప్రశమయ క్షణమంబు వేగం.

యే కేచిదత్ర మునయో నివసంత్యరణ్యే
విజ్ఞాపయామి శిరసా ప్రణిపత్య తేభ్యః
స్త్రీత్యుజ్ఝితేత్యశరణేతి కులాగతేతి
దేవీ సదా భగవతీత్యనుకంపనీయా''.

అని చెప్పుచు నయోధ్యకు మరలిపోవఁగా, వాల్మీకి సమిత్కుశార్థము వనసంచరణమున సీతను గాంచి యాశ్రమమునకుం గొంపోవుచు,

''ఏతస్మిన్ కుశకంటకే లఘుతరం పాదౌ నిధత్స్వాగ్రతః
శాఖేయం వినతా నమస్వ శనకైః గర్తో మహద్వామతః
హస్తేనామృశ తేన దక్షిణగతం స్థాణుం నమం సాంప్రతం
పుణ్యేఽస్మిన్ కమలాకరే చరణయోర్నిర్వర్త్యతాం క్షాళనమ్.''

అని సుకుమారియగు సీతకుఁ గుమారికింబోలె బ్రమాదభీతి సూచించుచు నాశ్రమపదమునకుఁ దెచ్చి కుశలవులకు బుంసవనాదికృత్యములు నడపెను.

తృతీయాంకమున రాముడు వనాంతముల సంచరించుచు గోమతీతీరమున మదకల కలహంస గీత రమ్యోపకంఠములగు ప్రదేశములు జూచి,

''ముక్తాహారా మలయమరుత శ్చందనం చంద్రపాదాః
సీతాత్యాగాత్ప్రభృతి నితరాం తాపమేవావహంతి
అద్యాకస్మాద్రమయతి మనో గోమతీ తీరవాయు
ర్నూనం తస్యాం దిశి నివసతి ప్రోషితా సా వరాకీ''.

అనెను.

వాల్మీక్యాశ్రమమునుఁ జూచి

"సురభి కుసుమగంధైర్వాసితాశాముఖానాం
ఫలభరనమితానాం పాదపానాం సహస్రై
ర్విరచిత పరివేష శ్యామలోపాంతరేఖో
రమయతి హృదయం తే హంత కశ్చిద్వనాంతః''.

''అస్మిన్ కపోలమదపానసమాకులానాం
విఘ్నం న జాతు జనయంతి మధువ్రతానాం
సామధ్వనిశ్రవణదత్తమనోఽవధాన-
నిష్పంద మంద మదవారణకర్ణతాళాః"

"ముక్త్వా వసంతసమయేఽపి మునిప్రభావా-

దున్నిద్రసాంద్రకుసుమాం సహకారశాఖాం
ధావంత్యమీ మధుకరాః క్రతుహోమధూమ-
సంత్రాసితాః సరసి వారిరుహోదరాణి.''

అని రామకాణపులు సల్లాపించుచు నాశ్రమసమీపమునఁ బట్టోత్తరీయమును గాంచి గైకొని రాముఁడు-

''ద్యూతే పణః ప్రణయకేలిషు కంఠపాశః
క్రీడాపరిశ్రమనుదం వ్యజనం రతాంతే
శయ్యా నిశీథకలహే హరిణేక్షణాయాః
ప్రాప్తం మయా విధివశాదిదముత్తరీయం.''

అనుచు సంస్మృతి విషమావస్థ ననుభవించుచు,

''ప్రియజనరహితానామంగుళీభిర్వధూనా-
మవధిదివససంఖ్యావ్యావృతాభిః సహైవ
వ్రజతి కిరణమాలిన్యస్తమేకైకశోఽస్మిన్
సరసి కమలపత్రశ్రేణయః సంకుచంతి.''

అని తనహృదయావేదన వ్యక్తపఱచును. రాముఁడు పిదప నాశ్రమముప్రవేశించి, వాల్మీకి సీతాకుశలవాది దర్శనము రామాయణ గానమాధుర్యము వినుట మొదలుగా రమణీయముగాఁ గూర్చబడినది.

## ఆశ్చర్యచూడామణి

దీనిని రచించిన కవి దాక్షిణాత్యుడగు శక్తిభద్రుఁడు. ఇతఁడు శ్రీశంకరపాదుల కాలమువాఁడనియుఁ దన కృతి నాచార్యపాదులకుఁ జూపి వారిచే మెప్పు వడసెననియుఁ గేరళదేశమున నైతిహ్యముదక్క సీతనికాలము నిర్ణయించుట కాధారములు గానరావు. ఈ షడంక నాటకమున రామాయణ కథ పంచవటీ పర్ణశాలావాసము మొదలు రావణవధానంతరము సీతాపరిశుద్ధియు నయోధ్యాగమనము తుదిగాగల భాగము విస్తరింపఁబడియె.

శూర్పణఖ సీతావేషమున రాముని వంచించుటయు రావణుఁడు రామవేషమున సీతను గొనిపోవుటయు విశేషాంశములు. ఇందుఁ బెక్కులు పద్యములు సరసములై భావగర్భములై యున్నవి. శూర్పణఖ మోహింపఁగా లక్ష్మణుఁడు-

"వాసోవల్కల మాస్పదం విటపినో వన్యం శరీరస్థితిః
శయ్యా దర్భలతా ప్రసాధనమపాం పర్షీ జటానాం భరః
బాలే! కిం బహునా వనే వనమృగన్యాయస్య న త్వం పదం
సారంగాక్షి! తపోభృతః క్వ తపసాం శత్రుః క్వ సంకల్పజః."
అనియెను. రాముఁడు పాపాత్ముఁడగు క్షత్రియునకు

"సాధారణీ నయవిదాం ధరణిః కళత్ర
మస్త్రాణి మిత్రమరయః సహజాః సుతాశ్చ
పాపాత్పరశ్యపతనం నరకేషు లాభః
ద్వే చామరే చ సితమాతపవారణం చ."

అని చామరచ్ఛత్రమాత్రలాభమగు రాజ్యవైభవము నధఃకరించి పలికె.

రావణునకు మంత్రి ధర్మోపదేశము చేసి రాజ్యాది సర్వస్వనాశనము రాఁబోవునని సూచించి వినక కోపముగొన్న రావణునితో నిట్లనెను-

"యుద్ధమునకు వెఱచియుఁగాదు. నీ శత్రువగు రామునిపక్షము వహించియుఁగాదు నీకీపలుకులు పలుకుట; ప్రభువులు సేవకుల కంఠమున ఖడ్గ మెత్తిపట్టినను సజ్జనుఁడు స్వామికి హితమే ప్రశంసించును (అసిమర్పయతో౽పి కంఠదే సుజనః శంసతి పథ్యమేవ భర్తుః).

హనుమంతుఁడు సీతకు రామవిశ్వాసార్థము రామవాక్యములుగా నీ సందేశముఁ దెలిపెను-

"ఆయాతం మామపరిచితయా వేశయా మందిరం తే
దండశ్చోర స్త్వమితిమధురం వ్యాహరన్త్యా భవత్యా
మందే ద్వీపే మధులవముచాం మాలయా మల్లికానాం
బద్ధం చేతో దృఢతరమిదం బాహుబంధచ్ఛలేన."

## కౌముదీమహోత్సవము

దీనిని రచించినవాఁ డెవ్వఁడో యెఱుఁగరాదు. పాటలీపుత్రాధీశ్వరుఁడగు సత్యషేణుఁడు విశ్వాసఘాతకుఁడును, ననుకూలశత్రువునగు చండసేనునిచే వంచితుఁడై రాజ్యమును ప్రాణములును గోల్పోవగాఁ గుమారుఁడగు కల్యాణవర్మ నాశ్రమవాసులు ప్రచ్ఛన్నముగాఁ దెచ్చి పెంచుటయు మంత్రగుప్తాదిమంత్రులు రాజనీతిప్రయోగకౌశలమునఁ బాటలిపుత్రమును మరల సంపాదించుటయు;

కల్యాణవర్మ ఛాత్రి రాజ్యవిప్లవకాలమునఁ బాఱిపోయి, పరివ్రాజికయై శూరసేనాధీశునింట నివసించి దేశాటనముసేయుచు నతని కుమారియగు కీర్తిమతితో కల్యాణవర్మ దాగియున్న కిష్కింధమునకు వచ్చుటయుఁ గీర్తిమతీ కల్యాణవర్మల పరస్పరానురాగవర్ధనము వెలయుటయు రాజశ్రీయును దేవియు లభించి కల్యాణవర్మ రాజ్యమున నెలకొనునపుడ కలుగు కౌముదీమహోత్సవమున నీకథయే నాటకముగాఁ బ్రదర్శింపఁబడియెనని యెఱుఁగనగును.

నిక్కముగా నీపేరీ నాటకమునకుఁ గలదా యనుటయు సందియమే. కల్యాణవర్మ రాజ్యము క్రీ॥ శ॥ 600 లోగా నుండునని తోచుచున్నది. ఈ నాటకమునఁ బరివ్రాజిక తనచే లభించిన చిత్రపటమున

"శౌనకమివ బంధుమతీ కుమార మవిమారకం కురంగీవ
అర్థాతి కీర్తిమతీయం కాంతం కల్యాణవర్మాణం."

అని లిఖించె.

అవిమారకమను నాటకము భాసరచితరూపకములలో ముద్రితమయ్యెఁ గాని చక్కఁగా జదివి చూచిన భాసునివి యొక్కటి రెండుండునేమోకాని యవి యన్నియు వేత్వేఱుకవులచే రచింపఁబడియెనేమో యని సందియము గలుగుచున్నది. అవిమారకకథ బృహత్కథాదులనైతము గానరాదు. దీనిలోఁదక్క తత్కథాప్రశంసయు నెందును గానఁబడదు. ఈ నాటకశైలియు నవిమారక శైలియు నొక్కటియే. రెంటిలోను భావవైరళ్యమును మీమాంసాశాస్త్రపరిజ్ఞానమును, సమానముగా నుండుటచే రెండు నేకకవికృతములేమో ? 'బంధుమతీ శౌనకము' లభించినదికాదు.

పంచాంకమితమగు నీ రూపకమునుండి కొన్ని పద్యము లుదాహరించెదము:

ఆకాశమునుండి పడు చిత్రపటమునుచూచి పరివ్రాజిక-

"దృష్ట్వా నభ స్తశ్శిఖిబర్హభార
శారోదరం చిత్రపటం పతంతం
అనభ్రసంసర్గమభూతపూర్వ
మైంద్రం ధనుఃఖండ మనుస్మరామి" అనియె.

విరహావస్థను సూచించుచు రాజు-

"పార్శ్వేస్థేవ పురఃస్థితేవ దివసే రాత్రౌ చ సర్వాత్మనా
సంకల్పేన యథాపురః ప్రియతమా సైవేయ మాలక్ష్యతే
రమ్యద్వేషనిబంధనో మనసి మే కష్టం వియోగోచిత
స్సంతాపోఽప్యుపచీయతే భగవతో ధాతుర్విచిత్రా గతిః."

అనియు, నాయికారూపము చొక్కపుఁజూడ్కికిఁ గానరాక

"ఉపకృతవతీమపి దృశం
రూపామృతసంవిభాగేన
వంచయతి స్మరణసుఖే
తస్యా హతహృదయమేతన్మే"

అని ప్రలపించును— పాటలీపుత్రమునుఁ జొచ్చి నిర్వ్యాజ సుఖసంపన్మనోహర మగు తన శైశవావస్థనుఁ దలంచుకొనుచు,

"కాలాపకర్షే సతి భంగురత్వా
త్పరిక్షీణ సంస్కారభువాం స్మృతీనాం
స్ఫురంతిమే శైశవచేష్టితాని
జాతిస్మరస్యేవ భవాంతరాణి."

అని విలపించుట హృదయంగమమే.

కీర్తిమతి లేక రాజ్యభారమును వహింపఁజాలక రాజు—

"గిరిమివ దుర్వహరూపం
వియోగదుఃఖం వహామి కాంతాయాః
మమ కిల తస్యాపి వినా
కందుకలఘురాజ్యమతిభారమ్."

అని హృదయతత్త్వమును నివేదించుచుఁ దన ప్రథమసంప్రయోగ సంస్కృతిలోఁ దవిలి—

"పాతుం పద్మసుగంధిలోలనయనం రోమాంచితం గండయో
ర్యావద్విద్రుమపాటలాధరపుటం వక్త్రం మయోన్నామితం
వైలక్ష్యప్రతిషేధవిక్లబగిరా తన్వ్యా తయా ముగ్ధయా
పశ్చాత్తామరుచా కరేణ మమ తు ప్రచ్ఛాదితే లోచనే."

అని స్వప్నములోవలె సుఖమనుభవించును.

## భగవదజ్జుకము

ఈ యేకాంక ప్రహసనమును రచించిన మహాకవి బోధాయనుఁడని తత్ వ్యాఖ్యాతృవచనమువలనఁ దెలియవచ్చుచున్నది. బోధాయనకృతమగు మహా నాటకము మాకుఁ జూడఁగలిగె. బోధాయనుఁడు మహాకవియనియు క్రీ॥ శ॥ 1400 కంటెఁ బూర్వమువాఁడనియు సుకుమారకవి వాక్యములవలనఁ దెలియు చున్నది.

సుకుమారుఁ డాత్మస్తుతిఁ బ్రకటించుచు-
''యైర్బోధాయన వాక్యపుష్పకలికాః కర్ణావతంసీకృతా
ఏషా బిల్హణసూక్తి మౌక్తికసరాః కర్ణానలంకుర్వతే
మాధుర్యైకభువాం మురారి వచసామస్వాది యైః స్వాదిమా
సంతుష్యంతి తయేవ నూతన సుధావేణీషు వాణీషు నః.''

అనుటచే బోధాయనుఁడు ప్రఖ్యాతుఁడనియే తోఁచుచున్నది. ఇతఁడు శ్రౌత సూత్రకారుఁడో, బ్రహ్మసూత్రభాష్యకారుఁడో, తదన్యుఁడో యీ గ్రంథమువలనఁ దెలియరాదు.

ఈ చిన్న ప్రహసనము సహృదయులు తప్పక చదివి యానందింతురు గాక యనిమాత్రమే చెప్ప సాహసింతుముగాని దాని శిల్పిచాతుర్యమిట్టిదని యెత్తి చూపుటకు మాకు సంవిత్ప్రభావంబు చాలదు. దీని కతి విపులవ్యాఖ్యయున్నను సామాన్యులకునైతమిది యథోచితముగా రసవంతముగా నుండును— షడ్దర్శనీ వల్లభులకును సుఖసంచరణము నీయని హృదయసంవాది రసనిష్యందమునను బొందుచుండును.

కేవలము సద్దిముద్దకుఁగా నొకఁడు పరివ్రాజకు నాశ్రయించి శ్రమణకుఁడై భిక్షాటనముచే జీవించుచు గురువుతో ధర్మసూత్రములు వాదించుచుండ నొక నాఁడు పరివ్రాజకుఁడు నిస్సంగత్వస్వరూపమును బోధించుచు-

''సుఖేషు దుఃఖేషు చ నిత్యతుల్యతాం
భయేషు హర్షేషు చ నాతిరిక్తతాం
సుహృత్స్వమిత్రేషు చ భావతుల్యతాం
వదంతి తాం తత్త్వవిదో హ్యసంగతాం.''

అని రాగద్వేషముల మాధ్యస్థ్యముపదేశింప శాండిల్యుఁ డట్లుండుట శక్యముఁగా కనఁ బరివ్రాజకుఁ డేలయన "మీకు మాటిమాటికిఁ గోప మేల రాయలయు"నని

పరి:- నీవు చదువవని.

శిష్యుఁడు- నేనధ్యయనము సేయకున్న ముక్తుఁడగు నీకేమయ్యె?

పరి- ఉపగతుఁడగు శిష్యుని క్షేమార్థము తాడనము సహితము విధేయము గావున నిన్నుఁ గొట్టెదను.

శిష్యుఁడు- మచ్చరము కోపము లేక కొట్టెదరా? సంతోషమే. భిక్షావేళ యతిక్రమించె.

పరి- మూర్ఖ! యిదే యుదయమయ్యె. రోఁట రోఁకలియుఁ బ్రొయ్యిలో నిప్పును బెట్టువేళయెగదా. ఇంచుక విశ్రమార్థముద్యానము జూత్తము.

శిష్యుఁడు- ప్రతిజ్ఞాహానివలదు.

పరి- ఎట్లు?

శిష్యుఁడు- మీరు సమసుఖదుఃఖులు గదా?

పరి- నాయాత్మ సమాన సుఖదుఃఖమె; కర్మాత్మ విశ్రాంతిఁ గోరుచున్నది.

అని యీ రీతి సంభాషించుచుండ నొక వేశ్య యిరువురు చేటికలతో నుద్యానము చొచ్చి పూవులుకోయఁ బ్రయత్నించును. పరివ్రాజకుఁడు ఋతు మహిమను వర్ణించుచు-

"అభ్యాగతః కిసలయాభరణో వసంతః
ప్రాప్తా శరత్కుముదషండవిభూషణేతి
బాలోృనవేష్వ తుష్యతి నామ లోకే
యజ్జీవితం హరతి తత్కిల రమ్య మన్య."

(పల్లవములతో మెఱయుచున్న వసంత కాలము వచ్చెననియుఁ దెల్లకలువలతో మనోహరమగు శరత్కాలము వచ్చెననియు ఋతువు ఋతువునకు జనుఁడు బాలునింబోలె యానందపడునట్లుండు- ఏది జీవితము హరించుచున్నదో అట్టి కాలమె వీనికి రమ్యమని తోచెగదా!) ఇత్యాది తత్త్వోపదేశము చేయుచుండ గణిక

మదనుని మహాప్రభావమునుఁ బ్రకటించు గీతములు పాడుచు పువ్వులు గోయు చుండెను.

"మధుమాసజాతదర్పః
కందర్పః కామినీటాక్షసఖః
అవియోగినామపి మనో
విధ్యతి పుల్లై రశోకశరైః.
పరభృతమధుకరనాద జ్యాఘోషః
కామఏష ఉద్యానే
తిష్ఠతి సహకారశరో
ముహ్యాతి నూనం మనోఽపి మునే."

అంత యమభటుఁడు ప్రవేశించి కాలప్రేరితుఁడై సర్పరూపమున శాఖాశ్రయము నొంది యాసుందరి ప్రాణములు హరించె. అంత నవ్వసంతర్తు శోభయే మూర్తీభవించినట్లున్న యత్తనువు నేలపైఁబడ నొక చెలి దాని తల్లిం దోతేరఁ జనుటయు శాండిల్యుఁడు నిలుపోవక-

"స్వకర్మ భోక్తుం జాయంతే ప్రాయేణైవ హి జంతవః
క్షీణే కర్మణి చాన్యత్ర పునర్గచ్ఛంతి దేహినః."

ఇత్యాది గురువాక్యములచేఁ దనివి చెందక శవము సమీపించి శుశ్రూషాపరుఁడైనం బరివ్రాజకుఁడు చూచి వీని వ్యామోహము దొలఁగింపఁ దానా దేహముఁ జొచ్చి దాని తల్లియుఁ బ్రియుఁడగు రామిలకుడను వాఁడును రాగా వారి స్పృశింప నొల్లకఁ బెడమొగమయ్యె. రామిలకుఁడు-

"ఏకం నివర్తయ సృగాళిముఖారవింద
మీషత్తరంగ పరివృత్తమివారవిందమ్
ప్రీణాతి సామ తవ వక్త్రమసర్పదృష్ట

అని కటాక్షవీక్షణమునకు యాచించుచుండ, వైద్యుఁడు ప్రవేశించి గణికతో వాదించుచుండ యమభటుఁడు పొరపడి వేఱొక గణికప్రాణములకు మాఱు దీనిందెచ్చితినని క్రమ్మఱి సజీవయగు వేశ్యంజూచి యాశ్చర్యముఁ జెంది పరివ్రాజకుని మేన గణికాప్రాణములు నిలుపఁగాఁ బరివ్రాజకుఁడు శాండిల్యరామిలకులఁ గౌగలింపఁ బిలుచుటయు మొదలుగాఁ గొంత హాస్యమైన పిదప యమ

భటుఁడాయా ప్రాణముల వినిమయము నేసిపోవఁగా శాండిల్యుఁడు మరల పరివ్రాజకుని నిజతత్త్వము నున్న వానింగా గని యెల్ల నేమియని యడుగఁగానే బరివ్రాజకుఁడు-

"అస్తంగతోహి దినకృద్గగనాంతలంబీ
మూషాముఖస్థ ఇవ తప్తసువర్ణ రాశిః
యస్య ప్రభాభిరనురంజిత మేఘబృంద
మాలక్ష్యతే దహనగర్భమివాంతరిక్షం."

అనునట్లు సంధ్యయయ్యె. కథ పెద్దది యథావకాశముగాఁ జెప్పెదనని నిష్క్రమించును.

అక్కటా! ఇట్టి కవుల కావ్యములు, భరత ఖండాలంకారములు కాల పురుషుని యున్మత్తహస్తములకు విక్రృతకందుకములయ్యెఁగదా! ఈ కథాసారమును విశదీకరింపఁగా.

"అస్మిన్ నాట్యరసే నిసర్గగహనే యోగీంద్ర శిష్యావుభే
ఆత్మానౌ పరజీవశబ్దకవితాకన్యా తథైవాజ్జుకా
మూలాధారసముద్గతా ససుషిరా నాడీ సుషుమ్నా పరే
చేట్యౌ చోభయ పార్శ్వగే న సుచిరే నాద్యానిడాపింగళే."

అని జీవాత్మ పరమాత్మ కుండలినీ శక్తి రూపములగు శిష్య పరివ్రాజక గణికల రంగస్థలముల నాడించి నిసర్గగహనమగు యోగమార్గమునుఁ బామరుల కన్నులకుఁ జూపఁగల కవులు కొందఱె జన్మించిరి.

## మత్తవిలాసము

ఇదియు నేకాంకప్రహసనమే. మతముల పేళ్లు పెట్టుకొని మతాచార్యుల బోధసార మెఱుఁగక కులక్రమాగత సదాచారము నీటఁ గలిపి, నూతన బోధనల లోని దురాచారములను మాత్రమే యనుష్ఠింపఁజాలిన మహానుభావముల కంధప్రాయమగు జ్ఞాన చక్షువును దెఱిపింపలేక, చర్మచక్షువులకైన నాడి చూపుటకనియో, యీ రూపకమున బౌద్ధకాపాలికోన్మత్తులు భిక్షాశనమున జీవించుచున్నను మద్యపాన మత్తులై కుక్కగొనిపోయిన భిక్షాపాత్రమునకుఁగా నొకరి నొకరి నాడికొనుచు నాచార్య పురుషులను సైతము హేళనము సేయుచుఁ బ్రొద్దు

పుచ్చినట్లు కథాశరీరమును గల్పించి కాంచీపురాధీశ్వరుఁడును పల్లవకుల సంజాతుఁడునునగు మహేంద్ర-విక్రమవర్మ దీనిని రచించెను. ఇతఁడు క్రీ. శ. 8వ శతాబ్దిలో నుండినట్లు తోఁచుచున్నది. ప్రబోధచంద్రోదయములో క్షపణక బుద్ధాగమ సోమసిద్ధాంతులఁ గూర్చుటకిది మూలముఁగాఁబోలు.

ఇట్టిదే పూర్ణపురుషార్థ చంద్రిక యను నాటకము మఱియొకటి గలదు. దానిని జాతవేదో మహాకవి రచించె.

మత్తవిలాసమునఁ గపాలి త్రాగి యాడుచున్న దేవసోమ యను భార్యతో

"తపస్సుచేఁ గామరూపము సిద్ధించుననుట కాపాలికవ్రతతత్పరవగునీ యెడ నిక్కమయ్యెఁగాఁబోలు." నీకు

"ఉద్భిన్నశ్రమ వారి బిందువదనం సభ్రూలతావిభ్రమం
ఖేలం యాతమకారణాని హసితాన్యవ్యక్తవర్ణాగిరః
రాగాక్రాంతమధీరతారమలసాపాంగం యుగం నేత్రయో
రంసోపాంతవిలంబినశ్చ విగళన్మాలాగుణా మూర్ధజాః."

అని వేషవిశేషమును వర్ణించెను.

ఇట్లే మఱియొక ప్రాచీనకవి కుసుమపుర వైశికమున విలాసవిహారము సేయుచు, మధుపానమోహ సద్యః ప్రత్యాగతస్మృతి యగు నొక విలాసవతిం జూచి విటుఁడు-

గద్య. వామః కుభగాభవః త్వాం హ్యల్పావశేషమదాం సావ
శేష సంధ్యారాగామివ, ప్రతీచీం దృష్ట్వా ప్రస్రస్తశరా
సనః కుసుమాయుధోపి తావద్వ్యాకులతాంగచ్ఛేత్.
కింపునరన్యః?

శ్లో. ప్రణష్టా న వ్యక్తి ర్భవతి వచసస్సైకమృదుతా
న రాగో నేత్రాబ్జే త్యజతి న చ లజ్జావ్యపగతా
స్మృతిప్రత్యాయాతా పరిహృషితమద్యాపిచ ముఖం
మదో దోషా న్యక్త్వా త్వయి పరిణతి స్తిష్ఠతి గుణైః.

అని వర్ణించినట్లు తన భాణములోఁ జెప్పెను.

# కాదంబరీనాటకము

దీనిని గంగాధర కవికుమారుఁడు విశ్వనాథకవి సోదరుఁడునగు నరసింహకవి రచించెను. ఈతఁ డేకాలమువాఁడో తెలియదు కాని పెద్దకోమటి వేమభూపాలునిపేర రచింపఁబడిన సాహిత్యచింతామణిలో దీనిలోని పద్యము లుదాహరింపఁబడియున్నందున నరసింహకవి క్రీ॥ శ॥ 1400 కంటె పూర్వుఁ డనుట నిస్సంశయము. శ్రీనాథుని నూతనయౌవనకాలము వామనభట్టభాణుని కవితాసామ్రాజ్యము వేమభూపాలునివద్దనే చెల్లియున్నవి:

మధురావిజయమను కావ్యమున గ్రంథకర్త్రియగు గంగాదేవి-

"చతుస్సప్తతి కావ్యోక్తి
వ్యక్త వైదుష్యసంపదే
అగస్త్యాయ జగత్యస్మిన్
స్పృహయేత్కో న కోవిదః."
స్తుమస్తమపరం వ్యాసం
గంగాధరమహాకవిమ్
నాటకచ్ఛద్మనా దృష్టాం
యశ్చక్రే భారతీకథామ్.
చిరంన విజయీ భూయాత్
విశ్వనాథకవీశ్వరః
యస్య ప్రసాదాత్
సమింధేమా దృశేష్వపి."

అని వర్ణించిన ముచ్చరిలో నగస్త్యుఁడు విశ్వనాథ నరసింహులకు మేనమామ. గంగాధరుఁడు తండ్రియనగుట కవివంశము స్తోత్రభాజనమగుచున్నది. సౌగంధికాహరణమను ముద్రితనాటకమున, విశ్వనాథకవి యగస్త్యకవి మేనల్లుఁడని వర్ణింపఁబడుటం జేసియు గంగాదేవికి విశ్వనాథకవి గురువగుటయు నరసింహకవియు, వేమభూపాలుని యాస్థానముననున్నవాఁడో లేక యించుక పూర్వుఁడో యెఱుఁగరాదు.

దీనిలో మొదటి యెనిమిదంకములు మాత్రమే మాకు లభించినందున దాని పరిమితి చెప్పఁజాలము. 9 అంకములు గలదియేమో? నాటకమున 5 మొదలు 10 వఱకు నెన్నియంకములైన నుండవచ్చునుగదా.

''శాకుంతలం తు సప్తాంక
మష్టాంకం నలవిక్రమమ్
దేవీపరిణయం చాత్ర
నవాంకం నాటకం స్మృతమ్.''

అని భావప్రకాశము. ఈ నాటకమునఁ గాదంబరీకథ యంతయు నంకములుగా విభజింపఁబడి మృదుమధురమగు సులభశైలిలో సంభాషణము నడిపింపఁబడి యున్నది గాని, భావములు బాణభట్టు కాదంబరిలోవలె మత్తెక్కించి క్షణ మాత్రము బాహ్యప్రపంచమును మఱపింపఁజేయునవి కావు.

అచ్ఛోదసరస్తీరమునఁ జంద్రాపీడుఁడు దిగి శివాయతనముననున్న మహాశ్వేతనుఁ జూచి వీణవాయించి నిలిపినదాని తపశ్చర్యకాశ్చర్యపడి దానిచే సత్కారముబొంది హృదయశంకాశంకువగు దాని చర్యావిశేషమును ప్రశ్నము చేసి యదిగి వృక్షములుసహితము నిలువునీరుగా నేడ్వఁజాలినట్లు తన మదన భంగమును వర్ణించి చెప్పెడి సందర్భమునఁ జంద్రాపీడుఁడు-

''బాష్పైర్లోచనశుక్తిగర్భనిభృతైర్ముక్తాఫలాభైః క్షణం
స్థూలస్థూలనిబద్ధబిందుపరితఃపద్మాగ్రసంపిండితైః
సించంతీ స్వ మురోజయుగ్మ మభితః శ్వాసం సృజంతీ గురుం
కృచ్ఛ్రాత్పీడిత కంఠగద్గదరనా పర్యాకులం రోదితి.''

అని తలఁచుకొనెను.

పంచమాంకమునఁ జంద్రాపీడునియెదుట నడపిన యంతర్నాటకమున సూత్రధారుఁడు నాట్యము నిట్లు ప్రశంసించెను-

"చాతుర్విధ్య మముష్యపంకజభువా దేవేభ్య ఉత్థాపితం
కర్తుం భూతభవిష్యతోరల మిదం ప్రత్యక్షతామర్ధయోః
అంగత్వం ప్రతిపాద్య చాస్యసకలాః కామంస్వదంతే కలాః
సామ్రాజ్యస్య ఫలం న కస్య హృదయోల్లాసాయ నాట్యామృతమ్."

## విజయవిక్రమము

ఇది యార్యసూర్యమహాకవిచే రచింపఁబడిన ఏకాంతవ్యాయోగము. ఆర్యసూర్యుఁడు కౌండిన్యగోత్రజుఁడు. ఆర్యసూర్యుఁ డను బౌద్ధకవి

యుజ్జయినిలో రాజసభలోఁ గవితావిద్యఁ బరీక్షయిచ్చి బ్రహ్మరథమెక్కి యూరేగినట్లు కావ్యమీమాంసలో జెప్పఁబడియున్నది. అతఁడే యితఁడైన యెడల విజయవిక్రమము క్రీ॥ శ॥ 4–5 శతాబ్దులలో రచియింపఁబడియుండ వచ్చును. శైలివలన నది 8 వ శతాబ్దిగ్రంథమని కానవచ్చుచున్నది. దీనిలోఁ బదబంధము భావములు కథోచితముగా వీరరసప్రకర్షమును బొంది ప్రౌఢములుగా నున్నవి. ప్రస్తావనలో వసంతవర్ణనమున–

''మానం విమోచయతి జీర్ణ మివాశుపర్ణం
రాగం ప్రవాళమివ నూతనమాతనోతి
వీరుత్స్వివప్రతినవోత్కలికాకులాసు
యోషిత్స్వపి ప్రచరతి స్ఫుటమేషచైత్రః.''

అను భావము రమణీయమే. పౌలికలనికి సైంధవవధార్థము పోవునప్పుడు కృష్ణుఁ డర్జునునితోఁ బెక్కు లుత్సాహకరముగాఁ జెప్పుచు–

''రణప్రస్థానోద్యత్పటుపటహనాదశ్రుతి భవ
స్ముదా ప్రాదుర్భూతప్రచురపులకాంకా తవ తనుః
అయం తే కృష్ణాయాః కుచకలశసంబాధసుభగః
పరీరంభో భూయో ద్విగుణఫలకైర్దంతురయతి.''

భీష్మునిఁజూచి–

తీక్ష్ణైః కటాక్ష విశిఖైరపి సుందరీణా
మక్షోభ్యమాణ హృదయస్య దృఢవ్రతస్య
వీరశ్రియోపగతయా విషమాస్త్రయుక్త
కేళీజుషః పరమభూదవకీర్ణితాస్య.''

''పిత్రర్థం త్యజతా సముద్రవలయక్షోణీగతప్రాభవం
భ్రాత్రర్థంచ సముజ్ఝితః ప్రణయినీ సంభోగలీలారసం
పౌత్రార్థం జహత స్తథా ప్రియతమాన్ ప్రాణాన్ రణప్రాంగణే
లోకో త్తీర్ణ మహో న కిం గుణగణోత్తుంగస్య గంగాయనేః.''

ద్రోణునిఁగూర్చి–

క్షత్రశ్రియం ప్రకటయన్ విషమాస్త్రచిహ్నాం
బ్రాహ్మీశ్రియం నకలయన్ముఖవేదిలక్ష్యాం

యః క్రూరసౌమ్యహృదయో మథనాత్పురస్తా
దంతర్విషామృత యుతోఽబ్ధిరివావభాతి.''
ఇత్యాదులు పెక్కు పద్యములు గలవు.

## ఉభయాభిసారికా

ఇది వరరుచికృతభాణమని తత్‌గ్రంథస్వామి లిఖించుకొనుటగాని దీనిలోఁ గృతి కవినామములు రెండును గానరావు. పేరునులేని భాణములును నాటకములును బెక్కులు గలవు. భాణము సాధారణముగా నేకాంక పరిమితిగా నొక విటుఁడో ధూర్తుఁడో ప్రవేశించి, వేశవాటమును వర్ణించుచు నాకాశ భాషితమునఁ బ్రశ్నోత్తరములు జరుపుచు శృంగారభావములు విస్తరింపఁజేయు రూపకవిశేషము. ఇందును వైశికోచితములగు భావములు పెక్కులు గలవు. దీనిలో నొకనిఁగూర్చి యిరువురు వేశ్య లభిసరించి ప్రేమించుటయె కథ గాఁబోలు. వేశమునఁ దిరుగుచున్న విటుఁడు తన గణికలతో సల్లాపించి యాశీర్వాదములు సేయుచుఁబోవుచున్న ఘట్టములలోఁ గొన్నిపద్యము లుదాహరించెదము–

''కృచ్ఛ్రాద్దత్తోష్ఠబింబం విరళమృదుకథం హాసలీలావియుక్తం
జృంభోష్ణశ్వాసమిశ్రం పరిశిథిల భుజాలింగనం వీతరాగం
దుఃఖాదాశ్రిత్యశయ్యాం కృతకరతివిధౌ చేష్టితం భావహీనం
వ్యక్తం బాలేఽక్రుథా స్త్వం నిశిదివసకరస్యోదయం చింతయంతీ''.
అని వేశ్యా విరాగమును సూచించును.

ఇట్టి యొక మహాకవి భాణమున వేశ్యాసంగమము నీరసమను వ్యంగ్యార్థమును బోధించుటకుఁగా దత్తకసూత్రమును పూర్వపక్షము సేయుచు–

"దుఃఖాశ్లేషయుతుం కథా ప్రతివచో లబ్ధుంచ దుఃఖం తతః
లబ్ధేఽపి ప్రచురే కథా వ్యతికరే విస్రంభణం దుష్కరం
విస్రంభేఽపితతః స్వభావసదృశీ దుఃఖా విఘాతుం రతిః
సమ్యక్ ప్రాప్తరతేఽపి వేశయువతీ రజ్యేత వా నైవవా."
అని గణికాకృతకరాగదౌర్బల్యమును వర్ణించెను.

ఒక బౌద్ధ పరివ్రాజిక గూఢవైశికవ్యాపారఁ జూచి, విటుఁడు సంభాషింపనది షట్పదార్థ బహిష్కృత సంభాషణము తన వైశేషికమతమున నిషిద్ధమని యతని నిరోధింప–

"ద్రవ్యంతే తను రాయతాక్షి దయితారూపాదయస్తే గుణాః
సామాన్యం తవ యౌవసం యువజనః సంస్తౌతి కర్మాణి తే
త్వయ్యార్యే సమవాయమిచ్ఛతి జనో యస్మాద్విశేషోఽస్తితే
యోగ స్తే తరుణైర్మనోభిలషితైర్మోక్షోఽప్యనిష్టాజ్జనాత్."

అని తూలనాఁడి—

మఱియొకచో వేశ్యాజనలోభముచే నిర్ధనుఁడై, ఏకశాటీమాత్ర పరిచ్ఛదుఁడై దివ్యముని శాపహతునివలె నున్న యొకని యవస్థానివేదనమున కనుతాపము నెంది వైశికుఁడు—

"శాంతిం యాతి శనైర్మహౌషధిబలాదాశీవిషాణాం విషం
శక్యో మోచయితుం మదోత్కటకటాదాత్మా గజేంద్రాద్వనే
గ్రాహస్యాపి ముఖాన్మహార్ణవజలే మోక్షః కదాచిద్భవేత్
.వేశస్త్రీబడబాముఖానలనగతో నైవోత్థితో దృశ్యతే".

అను నిర్వేదకరమగు వాక్యముల విషాదమును సూచించి గణికలెల్లరు తమ తల్లుల ముందు ద్రోచి విత్తార్జన మనురాగకైతవమున సంపాదింతురను నర్థముం దేల్చుచు—

"యథా నరేంద్రాః కుటిలస్వభావాః
స్వం దుష్కృతం మంత్రిషు పాతయంతి
తథైవ వేశ్యాః శఠధూర్తభావాః
స్వం దుష్కృతం మాతృషు పాతయంతి."

అని రాజవేశ్యలగుణౌపమ్యము లక్షించెను. ఇందుఁ బాటలిపుత్ర వైశిక ప్రశంస ప్రధానమయ్యె. వరరుచి సర్వజ్ఞుఁడనియుఁ గంఠాభరణాది కావ్యములును సప్తాధ్యాయి యనునలంకారశాస్త్రమును రచించినట్లు తెలియుచున్నది. కానియవి మాకు లభించినవి కావు.

సప్తాధ్యాయిలోఁ గొన్ని పాదములకు వ్యాఖ్యానము తంజావూరి పుస్తకశాలలోఁ గలదు. ఈ సర్వజ్ఞుఁడు మాతంగకన్యనుఁ బరిణయమైనట్టునుఁ గేరళదేశమున బదిరెండు జాతులలో సంతానమును వెలయించినట్టును, ఐతిహ్యము కలదు. ఎంత నిశ్చయమో కాని భోజుఁడొకానొక నాటకములోనిదని—

"ధూర్తైర్యత్స్వవశీకృతో వరరుచిః సర్వజ్ఞకల్పోఽపి సన్
జీవన్నేవ పిశాచతాం చ గమితో భర్తుర్యదభ్యర్చ్య ధీః

ఛందోగోయమితి ప్రభాకరగురుర్దేశాశ్చ నిర్వాసితో
యద్వృత్తాంత విజృంభితేన మహతా తత్సర్వమల్పీకృతమ్."

అని యుదాహరించుట చూడఁగా వరరుచిని మాలలలోఁ గలిపి రని తేలుచున్నది. భర్చువు బాణుని శిష్యుఁడనియు నవంతిరాజమంత్రి యనియుఁ గొందఱు చెప్పు చున్నారు (ఆవంతిః కావ్యమానర్చ భర్చుర్మౌఖరిశేఖరః).

## పాదతాడితకము

ఇది శ్యామలక మహాకవిచే రచింపఁబడిన భాణము. దీనిలోని పద్యములు వల్లభదేవుని సుభాషితావళిలోను క్షేమేంద్రుని యౌచిత్యవిచారచర్చాసువృత్త తిలకములలో నుదాహరింపఁబడియున్నవి. ఇతని కవిత క్రీ.శ. 6-7 శతాబ్దుల కంటెఁ బూర్వపు రీతికలదని తోచుచున్నది. సుమారు క్రీ. శ. 960లో నుండిన వ్యక్తివివేకకారుఁడు మహిమభట్టు తాను శ్యామలమహాకవి శిష్యుఁడనని వ్రాసికొని యున్నాఁడు. ఎట్లయిన నీతఁడు క్రీ.శ. 950 కంటెఁ బూర్వుఁడనుట సిద్ధము. ఈ భాణము చాల పెద్దది. దీనిలో విష్ణునాగుఁడను రాజశాసనకరుఁడు విద్వాంసుఁడును బ్రాహ్మణుఁడునై యుండి సౌరాష్ట్ర దేశమున సార్వభౌమ నరేంద్రపురమున వేశ్యయింట రాత్రి చెల్లించి వేకువఁ బ్రణయకోపవిశేషము చేఁ గాబోలు దానిచేఁ బాదతాడితుఁడై వృషలీపాదఘాతమునకుఁ బ్రాయశ్చి త్తము వెదకుచు బ్రహ్మసభకు రాగా వారు సమస్త స్మృతులు తిరుగవైచి చూచి యెందును దానికిఁ బ్రాయశ్చిత్తము విధింపఁబడలేదని చెప్ప నతఁడు శోకించి యగతికుఁడై మొత్తోయనుచుండ, నాసభలో నొకఁడీ దోషము శృంగార రసాను భవమున నడచెఁ గావున దీనికిఁ బ్రాయశ్చిత్త విధానము, విట సభలోఁ గాని తెల్లముఁగాదనియె.

అంతనతఁడంగీకరింప విటసభలో సపరాహ్ణమున విటులొక్కొక్కరు ప్రాయశ్చిత్త విధాన విశేషముల యథోచితముగా వివరించి, యతని సంతుష్టుం జేసి పంపుటయే దీనిలో కథ. విటులఁ బిలువఁబోవువాఁడే దీనిలో ముఖ్య పాత్రము. విటసభలో నానాదేశ విటులఁ గూడి తమతమ చిత్రప్రాయశ్చిత్త విధానము దెలుపుట సరసముగానుండక తప్పదు-దీనిలోని కొన్ని పద్యము లుదాహరించెదము[1]-

1. శ్యామిలకుని పాదతాడితకమును – శ్రీ బాలాంత్రపు రజనీకాంతరావుగారనువ దించిరి (భారతి-మార్చి, 1971-సం॥)

"ఇద మిహపదం మాభూదేవం
భవత్విదమన్యథా
కృత మిద మయం గ్రంథే
నార్థో మహానుపపాదితః।
ఇతి మనసి యః కావ్యారంభే
కవేర్భవతి శ్రమః
స నయనజలో రోమోద్భేదః
సతాం తమపోహతి.

లలాటే విన్యస్య క్షతజసదృశం చందనరసం
మృణాళైః క్రీడంతీ కువలయపలాశైః సకమలైః।
సలీలం భ్రూక్షేపై రనుగత సుఖ ప్రాశ్నిక కథా
విరక్తా రక్తావా శిరసి రుజమాఖ్యాతి గణికా."

ఈ మహాకవి పద్యములే లక్షణగ్రంథములలో నుండి యుదాహరించెదము-

"సోత్కంఠై రివ గచ్ఛతీతికమలైః మీలద్భిరాలోకితః
ప్రచ్ఛాయై రధిరుహ్య వేశ్మశిఖరాణ్యుత్సార్యమాణాతపః।
తైః స్పృష్ట్వా చిరమున్ముఖీషు కిరణై రుద్యానశాఖాస్వసౌ
యాత్యస్తం వలభీకపోతనయనై రాక్షిప్తరాగో రవిః.

"కామ స్తపస్విషు జయత్యధికారకామో
విశ్వస్య చిత్తవిభురింద్రియవాజ్యధీశః।
భూతాని బిభ్రతి మహాంత్యపి యస్య శిష్టిం
వ్యావృత్తమౌళిమణి రశ్మిభిరుత్తమాంగైః."

"ఉత్క్షిప్తాలక మీక్షణాంతగళితం కోపాంచితాంతర్భ్రువా
దత్తార్థోష్ఠమధీరదంతకిరణం ప్రోత్కల్పయంత్యాముఖమ్।
శింజన్నూపురయా వికృష్య విగళద్రక్తాంశుకం పాణినా
మూర్ధన్యస్య సనూపురస్సమదయా పాదోఽర్పితః కాంతయా."

## పద్మప్రాభృతకము

ఇది శూద్రకకవి విరచితమగు నేకాంక భాణము. ద్వ్యంకత్ర్యంక భాణములను మాతృగుప్తాచార్య కోహళులు వివరించియున్నారు. ఇందుజ్జయినీపురవేశ

వాటి వర్ణింపఁబడియె. దీని కవిత్వము రమణీయమై హృదయంగమముగా నున్నది. శూద్రకుఁడు మహాకవి యనుట మృచ్ఛకటికముచేతనే గాక వామానాద్యాలంకారికు లెల్లరు విస్తారముగా వీని పద్యము లుదాహరించుటచేఁ దెల్లము. ఇందు విటుఁడు తన స్నేహితుని విరహావస్థ నిట్లు వర్ణించుచున్నాఁడు-

''ఉన్నిద్రాధికతాంతతామ్రనయనః ప్రత్యూష చంద్రాననో
ధ్యానశ్యానతనుర్వ్విజృంభణపరః సంతప్త సర్వేంద్రియః।
రమ్యైశ్చంద్రవసంతమాల్యరచనాగాంధర్వగంధాదిభిః
యైరేవ ప్రముఖాగత స్స రమతే తైరేవ సంతప్యతే.''

కందుకక్రీడఁజేయు నొక గణికం జూచి-

"ప్రేంఖోలోత్కుండలాయాం బలవదనిభృతం కందుకోన్మాదితాయా
శ్చంచద్బాహుద్వయాయాః ప్రవికచవిసృతోద్దీర్ణపుష్పాలకాయాః।
ఆవర్తోద్భ్రాంతవేశప్రణయవిలసితక్షుబ్ధకాంచీగుణాయా
మధ్యస్యావల్గమానస్తనభరనమితస్యాస్య తే క్షేమమస్తు."

అనియు గ్రంథాంతమునఁ దనమిత్రుని ప్రియంగనుగొని దాని విరహావస్థ నవలోకించి తన మిత్రుని దైన్యస్థితికిఁగా నొకానొక యుపహారముంగోరి-

''ఈషల్లీలాభిదష్టం స్తనతటమృదితం పత్రలేఖానువిద్ధం
ఖిన్నం నిశ్వాసవాతైర్మ్లయతరురసక్లిష్టకింజల్కవర్ణమ్।
ప్రాతర్నిర్మాల్యభూతం సురతసముదయప్రాభృతం ప్రేషయాస్మై
పద్మం పద్మావదాతే కరతలయుగళభ్రామణక్లిష్టనాళమ్."

అని దాని పూర్వరాత్రవిరహక్లిన్నమగు పద్మమును గ్రహించి మిత్రునకర్పించి ప్రాణముల నిలుపును.

## మఱికొన్ని భాణములు

వీనినామములును గర్తల పేళ్లను గానరానందున నించుమించుగాఁ బూర్ణములగు పెక్కు భాణములలో నొక్కదానిఁ గూర్చి మాత్ర మించుక తెలిపెదము.

ఇందుఁ గుసుమపురవేశమే వర్ణింపఁబడినది. ఒక విటుఁడు వీథులలోఁ దిరిగి వేశము సొచ్చి యొకధూర్తునితో ననురాగశాస్త్ర సిద్ధాంతమును చర్చించును. దత్తకుఁడను కేరళదేశ రతిశాస్త్రజ్ఞుఁడు పాటలిపుత్ర వేశ్యలకుఁ గాఁ గామశాస్త్రమున వైశికప్రకరణమును సూత్రరూపముగా నిర్మించి యుండెనని వాత్స్యాయనాదులు చెప్పటగాక తత్సూత్రసారసంగ్రహము మనకు లభించుచున్నది. ఈ దత్తకమతముఁ బూర్వపక్షము సేయుచు, సంవాద రూపమున స్వసిద్ధాంతము నెలకొల్పుచు విటుఁడు కుసుమపురమును వర్ణించుట దీనిలోని విశేషము.

"కామోఽర్థనాశః పుంసాం"

అను దత్తకసూత్రమిందు వివరింపఁబడియె. దీనిలోని కవిత్వము కాళిదాస బాణభవభూతుల కవితాసారము చేరి పరిపక్వమైనపిదప నందుద్భూతమైన రసపాకగుళికయో యనునట్లు మువ్వురి గుణవిశేషము లేకీభవించియున్నవి. ఇతఁడు వారలకంటెఁ బ్రాచీన తరుఁడేమో? వర్షావర్ణనమున—

"తే దగ్ధాః ప్రవసంతి యే న మదనానాయాంతి వా ప్రోషితాః
ముగ్ధాస్తేఽనునయంతి యేనకుపితాః కుప్యంతివాత్యాయతమ్
ధన్యాస్తే ఖలు యే ప్రియావశగతా యేషాం ప్రియాయా వశే
కాలః కామయతీవ మేఘపటహైరేవం జగద్ఘోషణామ్."

అనియు—

ఒక తండ్రిక్రిందికుమారుఁడు వేశమున నుండిరాఁగా విటుఁడు వాడు తన తండ్రి మూఢత్వములను నిర్బంధములను వర్ణించుచు—

"పితా నామ ఖలు స యౌవనస్య పురుషస్య మూర్తిమాన్ శిరోరోగః" అనియుఁ "బితగలవానికి పరస్పరామర్ష వివర్ధితపణరాగంబును సాధిక్షేప వచనాలంకృతంబును, తేజస్విపురుషనికషోపలంబును నగు ద్యూతంబు దర్శింప నైన నలవిగాదు;

సముపచిత్రోత్పల ఖండకంబును, సహకార తైలోద్గత చంద్రికంబును, గామినీ నిశ్వాస విక్షోభిత తరంగంబును,బ్రవృత్తబర్హిణాకారంబును నగువారుణీ చషకంబుల వాసనయేని చూచుటకును'

ద్విధాభూతగోష్ఠీ జనంబును, వయస్యార్ధాసనోపవిష్ట గణికాజనంబును గామినీసాన్నిధ్యంబునం జేసి యాలోచింపక పణంబుల నొడ్డువారిఁ గలదియు

నగు విటసభలోఁ బ్రాశ్నికములు నడిపించుటకును మొదలుగానలవిగాదు; ఇప్పుడు నాకు గండ్రగొడ్డలింగొని జమదగ్నికుమారుఁడగు రాముఁడు క్షత్రియ వధోద్యమమునకుఁ జొచ్చినట్లు లోకమపైతృకము సేయమనస్సు పుట్టు చున్నది......

ఈవృద్ధులు సామాన్యముగా నింతయేని యెరుఁగరు. వికచకమలాం తర్గత సురభియు నమృతరస సదృశాస్వాదమునగు వేశ్యాముఖరసము చచ్చిన పురుషుని సైతము సంజీవింపఁజేయు"నని చెప్పుచు-

"కాంచీతూర్యమసక్తపీనజఘనం విస్రంభదంష్ట్రాధరం
శ్వాసోత్కంపితనర్తితస్తనతటం భ్రూభౌదజిహ్మేక్షణమ్।
సీత్కారానువిషిక్త రోమపులకం కాలేనకోపాంచితం
వేశ్యానాం క ఇహాస్తి భో మదవశాదాజ్ఞారసం విస్మరేత్."

అని చెప్పుచు నతనికి తండ్రి మూఢుఁడై వివాహము చేసిన కష్టదశవినుటకంటె వేశ్యామహాపథమున నిలిచి గొంతెత్తి యేడువ వచ్చుననియు......

"జాత్యంధాం సురతేషు దీనవదనా మంతర్ముఖాభాషిణీం
హృష్టస్యాపి జనస్యశోకజననీం లజ్జాపటేనావృతామ్
నిర్వ్యాజం స్వయమస్యదృష్టజఘనాం స్త్రీరూపబద్ధాం పశుః
కర్తవ్యం ఖలునైవ భోః కులవధూకారాం ప్రవేష్టుం మనః."

అని "కులవధూ కుమార్గమును" దూషించుచు గోత్రగ్రహణ పాదతాడితాది విలాసక్రీడల సముద్దేశమును నిరూపించుచు, వేశ్యాంగణములలోనే జరాభార మును బొందియుఁ దాను-

"విస్రంభో గతయౌవనాసు నకృతోః బాలాః పరీక్ష్య స్థితాః
దూరాదేవ సమాతృకాః పరివృతాః సద్యః సపత్న్యా ఇవ।
మన్యుర్నాస్తి విమానితస్య న పున స్సంప్రార్థితస్యాదరో
వేశా చాస్మి జరాంగతో నచకృతః స్వల్పోఽపి మిథ్యావ్యయః."

అని చెప్పుచు స్వర్గసుఖములు నిస్సారమని నిందింపుచు

"ఈ తపస్విలోకము పిపీలికాధర్మ మనుసరించి యన్యోన్యాను చరితమునఁ బ్రాణత్యాగహేతువులచేఁ దామె పరీక్షింపక స్వర్గముస్వర్గ మని మృగతృష్ణికా సదృశమగు నొకానొక యనద్వాదమున నెలకొల్పఁబడిన

దానింగూర్చి హృదయమునర్పించి మరుత్ప్రతాపాగ్నిప్రవేశనాదులచేతను,
ఘోరజపహోమవ్రతనియమవేషములచేతను స్వర్గమభికాంక్షింతురు;
పరీక్షింపనొల్లరు."

స్వర్గమున మహాప్రమాదములు సన్నిహితములై యుండు. పరస్పర విరోధులగు మనుష్యజాతుల కందు సుఖోత్పత్తి గలుగదు – నిత్యసాన్నిధ్యంబునం జేసి విరహావస్థ లేక ప్రీతియెట్లు జనించును. సౌవర్ణమయములగు నావానశయ్యా భోగాలంకారములు స్త్రీలకు నిత్యప్రియములుగావు. మన గృహోపవనములఁ బిల్లలవలె పెంచిపూచిన బాలవృక్షములకు సుమసముదాయముచే నామోదితములగు యువతి కేశహస్తములుపభోగ రమ్యములగును గాని సౌవర్ణాలంకారములు నీరసములు కావా ?

వసిష్ఠాగస్త్య ప్రభృతులగు మహర్షులకుఁ బరిచర్యలచే నామోదము గల్పింపఁజాలిన యచ్చరల విస్రంభము సంపాదింప మనుష్యులకెట్లు సాధ్యమగు." అని మొదలుగఁ జర్చించి నిశాగమనమునకు నుత్కంఠతో నిరీక్షించుచున్న సతీలోకమును వర్ణింపఁగోరి సంధ్యాకాల సూచనమిటుచేసి నిష్క్రమించును.

"బధ్వా మానిని మేఖలాం ప్రశిథిలాం పీత్వా సకృద్వారుణీం
కృత్వా కాంతకచగ్రహప్రణయినః పుష్పోత్కటాన్ మూర్ధజాన్
హస్తాలంభితమేఖలాభిసరకృత్ స్త్రీభిః కటాక్షాహతః
హైమః కూర్మ ఇవావసీదతిశనైః సంక్షిప్తపాదో రవిః."

భాణములు శృంగారరస ప్రధానములని విద్వాంసులు చదువనొల్లరు. వానిలో దేశాంతర, కాలాంతర సాంఘికాచారములు వర్ణింపఁబడి యున్నందున దేశచరిత్రకారుల కవి ముఖ్యములే కాఁబోలు.

ఇంకనుఁ బెక్కు నాటకములు మాకు దృష్టిగోచరములైనను వానింజదువ నవకాశము లేమింజేసి తద్గుణదోషముల నెత్తిచూప వీలైనది కాదు.

చంద్రికాజానమేజయము
చంద్రికాకలాపీడము
కలావతీకామరూపము
శర్మిష్ఠాయాయాతము
అభిరామచరిత్రలేఖీయము

రఘువీరచరితము
భీమపరాక్రమము
త్రైవిక్రమము
పార్థపరాక్రమము
యోగానంద ప్రహసనము
జాంబవతీకల్యాణము

మొదలైనవి నూటి కెక్కుడుగా గలవు. పైనిపేర్కొన్న భాణములు కాళిదాసాది కవులకంటెఁ బ్రాచీనములని కొందఱు తలంచుచున్నారు.

"వరరుచి రీశ్వరదత్తః శ్యామిలకః శూద్రకశ్చ చత్వారః
ఏతే భాణాన్ బభణుః కా శక్తిః కాలిదాసస్య."

యను శ్లోకము శూద్రకనాటకముతుదిని లేఖకుఁడు వ్రాసికొనియె. వానిలోనిట్టి సారస్యమున్నదనుటయు సాహసము కాదు.

దేశాటనము సేయుచు మార్గమధ్యమునఁ బూర్ణసామగ్రి లేక యథాశక్తి నతివేగముగాఁ గూర్చిన పైవ్యాసము నీరసముగా నుండక తప్పదు. సహృదయులు మమ్ము క్షమింతురుగాక యని యింతట విరమించుచున్నాము.

ఆంధ్రపత్రిక-9 వ సంవత్సరాదిసంచిక—కాళయుక్తి

1918 మే 1 తేది.

మా. రామకృష్ణకవి.

# 4. వసుచరిత్రకు ద్రవిడభాషలోననువాదము

ఆంధ్రభాషలో మధ్యకాలవాఙ్మయమున వసుచరిత్రకుఁ గలిగినంత ప్రసిద్ధి తక్కిన గ్రంథములకుఁ గలుగదయ్యె. అది వ్యాప్తమైన పిదపఁ బ్రబంధ కల్పనాశైలి మాఱి తదనుసారియే యయ్యె. "వసుచరిత్రాదికావ్యప్రీతబహు నృపప్రాపితానేక రత్నాప్లవుండ" అని తద్గ్రంథకర్తయే హరిశ్చంద్ర నలోపాఖ్యానమునఁ దనకవితా పరిశ్రమకృతకృత్యతను వర్ణించుకొనియె. పైయాత్మ శ్లాఘ యసంభావితము కాదు. ఆంధ్రభాషాగ్రంథములు భాషాంతరమున ననువదింపఁ బడినవి కొన్ని గలవు. తిక్కనభారతము భీష్మాదిగఁ గన్నడమున షట్పదీ ఛందమునఁ దిమ్మకవిచేతను బ్రభులింగలీల మొదలగు శైవకృతులును సుమతి శతకమును గన్నడమునఁ బ్రకాశితములయ్యె.

వసుచరిత్రము సంస్కృతమున నప్పయదీక్షితులశిష్యుఁ డగుకాళహస్తి కవిచేఁ బరివర్తనము చేయఁబడియె. దానిగుఱించి స్థలాంతరమున నించుక సూచించినారము. అది ద్రవిడభాషలో సహిత మనూదిత మయ్యె ననుట యాంధ్రులకు శ్రుతిపర్వ మగునని తద్విషయము గొంత తెలుపుచున్నారము.

అరవమునకుఁ బరివర్తించిన ద్రవిడకవి యంబలత్తాడుమయ్యన్–అనఁగా శబ్దార్థభంగిగా (చిదంబరమున నాట్యమాడు దేవుఁడు–నటరాజు.) ఈ కవి దాని నరవములో రచించునప్పుడు తనకు మాతులనమశ్శివాయయ్యయు, వీరశైవ బాలయ్యయు నాంధ్రగ్రంథములోని యర్థస్వారస్యమును విస్తరించి చెప్పినట్లు వ్రాసికొనెను. వన్నాడు దేశమున వాలిగండపురమునఁ దదధీశుఁ డగు వంట కులతిమ్మభూపాలుఁడు ప్రోత్సాహ మొనర్పం గవి దీనిఁ బరివర్తించెనఁట. వాలిగండపురవర్ణనము 20 పద్యములలోఁ గలదు. తెనుఁగున నుండుతిరుమల రాయవంశవర్ణనము సంస్కృత ద్రవిడానువాదములలోఁ గానరాదు. తిమ్మ భూపతి వంటకులజుఁడని ద్రవిడకవి వచించుటచే నతఁడు రెడ్డిసామంతుఁడై యుండును. ద్రవిడకవియు నతనికిఁ బదార్థసౌందర్య మెత్తి చెప్పిననమశ్శివాయ బాలయ్యలు వీరశైవమతము నధివసించిన తన్మతాచార్యులు. ఇందులో మాతులుఁ డని నమశ్శివాయయ్య కుపపదము చేర్చినందున నతఁడు కవికి మేన

మాయయై యుండును. కవియుఁ దత్సహాయులును క్రీ.శ. 1650 కాలములోఁ గాని యించుక పూర్వమునఁగాని యుండవచ్చును. ఆనగొందిరాజ్యము సర్వ క్షీణము గాకపూర్వమే ద్రవిడానువాదము రచింపంబడియుండును.

విరిపుగల్ సేర్ వసుసరిదై తెలుంగై అరుందమిజినాల్ విలంపుదర్ కె
యుఁరియకళైపయి నమచ్చివాయదేవనుక్కరుత్తమురై చెయితానార్,
పెరుమైయుఱ వితళ్కువియా రామకథైతోడై పునైందోన్‌పొన్‌ఞానత్
తిరుమరువుమ్ వీరశైవప్పాలయ్యన్ సెయ్‌పాలయ్యదేవన్‌రానె
విరిపుగళ్ వసుసరిదమెనాన్ తెలుంగిన రుత్తమదై విరిత్తొరైత్తా
నిరువర్‌మాతుల నమశివాయనయ్యన్ బాలయ్యనివర్‌కళివర్‌గళ్ పూనిఙ్
సౌరుపమిగు తమిళ్ సెయిదాన్ వీర మిగుతొండమాన్ ఉరయిల్‌వాళుం
పెరుమైతిగళందిడు గురువంపలత్తాడుమయ్య నేనపొ్పర్ పెట్రోనే.

ద్రవిడానువాదము కవిప్రవరులు సంతరించు ప్రాచీనశైలిలో లలిత మధురవాక్కులతోఁ బ్రసన్నార్థబంధురముగాఁ గూర్పబడియె. ఆంధ్రములో "ననుపమశ్లేషవాగాడంబరం" బించుక గలదు. ద్రవిడములో నాంధ్రభాషా మాత్రశ్లేషలు వదలివేయఁబడినను సంస్కృతపదశ్లేషలు ప్రాయికముగా గ్రహింపఁబడియె. సాధారణపండితునకు సహితము రసవత్తరమై యన్వయ కాఠిన్యము లేక ప్రసాదగుణ సంపన్నమైనందున జనరంజనము గలుగునట్లు ద్రవిడానువాద మొప్పుచున్నది. ఆంధ్రములో నుభయభాషా సంస్కారవంతునకే ధ్వనివ్యంజనా విశేషములు హర్షదము లగును.

అరవములోనుండి కొన్ని పద్యము లుదాహరించుచున్నారము. కేవలాంధ్రుల కవి శ్రుతిమాత్రరమణీయములు గాఁదగినను విమర్శవిధానము ననుసరించి తదుదాహరణక్రియ యుపేక్షాభాజనము కాదు.

గిరికాదేవి విరహావస్థ భరింపఁజాలక యేడ్చునప్పుడు

శా. ఆజాబిల్లివెలుంగువెల్లికల డాయన్ లేక రాకానిశా
రాజశ్రీసఖ మైనమోమునఁ బటాగ్రం బొత్తి యెల్గెత్తి యా
రాజీవానన యేడ్చెఁ గిన్నరవధూరాజత్కరాంభోజకాం
భోజీమేళవిపంచికారవసుధాపూరంబు తోరంబుగాన్.

అను పద్యమునకు

తనివెణ్ణిలవు క్కా ట్రాదు తన్నంకమలమలర్ముగత్తిల్
వనమెన్కదలి త్తనీరనయ కలయిన్ రలయైవెత్తుమిగ
వినియవెజిల్ వింజయర్ మగళిర్యాబినీసైక్కుంకాంపోగి
యెనవన్ శిలయుంకరైందురుగ విలమెన్కోదై యజుదనళాల్.

దీనినే సంస్కృతమునఁ గాలహస్తికవి—

తదను వదనరాకాతారకానాథకాన్తే
నిహితమహితచేలా నిస్త్రపం సా రురోద
కిసలయమృదురాజత్కిన్నరీపాణివీణా-
సరసరవసుధాఞ్చత్స్వారపూరానుకారమ్॥

అని రచించెను. ఇందు సంస్కృతమునఁ గాంభోజీశబ్దము వదలఁబడియె. అరవమున "రాలు గరఁగునట్లు" అను విశేషణము కూర్పఁబడియె.

మోహోపదేశతమోముద్రితములైన కనుదమ్ముల హిమాంబు లునుపరాదు
శ్రమబిందుతారకాగమఖిన్న కుచకోకములఁ జంద్రనామంబు తలఁపరాదు
శీర్యదాశావృంత శిథిలతానులతాంత మసియాడ వీవనల్ విసరరాదు
పటుతాపపుటపాక పరిహీణతను హేమ మింక పల్లవ పర్చి యిడగరాదు
లలన కానంగకీలికీలాకలాప
సంతతాలీఢ హృదయ పాత్రాంతరాళ
పూరితస్నేహపూరంబు పొంగి పొరలఁ
జల్లనిపటీరనలిలంబు చల్లరాదు.

అనుపద్యమునకు నరవములో

మరత్తొడు మోగవెన్రి మీరంవందదాళ్
మురైప్పడు పీజిమరై ముగిజతాదలి
నీరైత్తిడు తన్పని నీరై అన్బుపో
లిత్తైకొ్కణాతెన్ర న రినమినార్ సిలర్
సురుక్కమిల్ వెయర్వై అన్తుళియెన్జారగై
పొరుక్కెన ఉదిత్తలార్పుజుంగుకి గింద్రనమెన్
గురుక్కణా నేమియం గురుక్కిన్ మేర్శళి
తరికాణా దెన్తనర్ తయలార్సిలర్
వియవేణు మంగియాల్ వెందపొన్నయీణ్,

డజగియతళిరిన్ మేర్కిడత లాగుమో
నజవల సెయాయన్దుణరి నారిమీర్
ఎజిల్పెర విసిఱలుమియల్వన్ రెం౯డనర్
కళిప్పుఱ కామవేవ్వజలిఱ్ కాంయిందిడు
ముళ పెరుంకలయ మీదుౖటనేయమే
యళప్పరవ్పొంగుమిపోదిలారనీర్
తెళిక్కొ తెననర్ తెరిఱవై మార్సిలర్.

సంస్కృతమున

మోహధ్వాన్తసనిద్రదృఙ్మలినయోర్మృద్యం హిమామ్భః కథం
స్వేదామ్బూద్గమఖిన్న చక్రకుచయోః శీతాంశునామాప్యలమ్ ।
ఆశావృన్తచలాసు మానసవిధేః కిం తాళవృన్తానిలై-
స్తప్యేఽస్యాః స్తనహేమ్ని పల్లవపుటీతేజోఽర్పణం కిం క్షమమ్ ॥
స్మరాగ్నితప్తహృత్పాత్ర స్నేహపూరసముల్బణే ।
పద్మాయతాక్ష్యాః కిం కార్యం పటీరరససేచనమ్ ॥

గిరికావీణాగానవర్ణనమున

వలుదగుబ్బలు ప్రసేవకృవత్తిఁ దగు గుబ్బకాయల కపరంజిచాయ లొసఁగ
లలితాంగుళీదళంబులు సమేలములైన సారెలపై రాగసంపద లిడఁ
బాణికంకణరుతుల్ ప్రాణానుబంధంబు గలతాళగతి కనుగ్రహము లీన
నాలాపభంగి యత్యక్తసంవాదిస్వరంబులకు గ్రామమ్ము లునుప

ప్రచురతానామృతముల మూర్ఛనలచేత న
చేతనంబులు చేతనరీతి దనరఁ
జేతనంబు లచేతనభాతి నొనర
వీణ వాయించునొక యలివేణిఁ గంటి.

ఎడుత్తయాజ్ కుడుకిర్ కొళియినై తనంగలిందిడై పదలిగడమక్కుత్
తడుప్పరు మీరాక మంగుళియిదపత్ తాళమాయ్ కరశై యెలిప్ప
అడుత్తసేతనము మసేదనమాగ వసేదనన్ సేదనమాక్క
కొడుత్తిడు మొరుపణ్ ణితనళ్ పుడైకూజ్ కొదయర్ పూరై యెన్తురైప్ప.

అను ద్రవిడానువాదములో సంగీతశాస్త్రమర్మములు మిక్కిలి గాన కున్నను రసభావ ప్రక్రియ కథాధోరణి కనుసరించియున్నది.
వసంతవర్ణనములో

మహిళామండలమంజుల భ్రమరకామర్దంబు శ్యామాముహు
ర్మహురున్మీలితపత్రభేదనిపుణంబుం బద్మినీకంకణ
గ్రహణాపాదియునై సగంధ విటపప్రాప్తిన్ విజృంభించుచున్
విహరించెన్ మధుమత్తగంధవహ మవ్వేళన్ వనాంతంబునన్.

తునుపైం గొడియిన్ సెనిజత్ తూయపన్ మలరుతిర్తుమ్
ఉన్నరుమ్ తళిరిన్మేయ వురువినై పిడితలైత్తుమ్
మన్నుకొకళగ కన్నార్ తోట్టినై మలైత్తున్ తెన్రల్
ఎన్నుమామత్తిన్పందాని ణైయటా విడనేయాగి 19వసంతప్పడలుబమ్.

కవి యిందలి మహిళయనుటకుఁ బైడితీగ యనియు,పద్మిని యనుటకుఁ బద్మాక్షి యని వ్రాయుచు భ్రమరకపత్రభేదకంకణశబ్దముల స్వారస్యమును వదలెను.

శ్లేషలు గలపద్యముల భాషాంతరములో ననువదించుట కష్టము. అయి నను ద్రవిడకవి కొంత శ్రమించి చాలవఱకుఁ జమత్కృతిని బోషించె. గిరికా వసురాజుల సురతాంతవర్ణనమున నాంధ్రములో

శా. భూనాథాగ్రణికిన్వధూమణికి సంభోగాంతసౌఖ్యంబు బ్ర
హ్మానందానుభవంబుఁ దెల్పె ననవద్యంబై యవేద్యాంతరం
బై నిర్లేపకలాపమై క్రమవిముక్తానేక బంధానుసం
ధానంబై యపునర్భవప్రభవఖేదంబై విజృంభించుచున్.

నాపది తనక్కుం ఇన్బనారిక్కుంపోగాన్ తత్తిల్
విరివుఱు ప్రిమాన్మందమెవియ తవిత్తై యింద్రాయ్
ఎరుగియ కరణబంద మిన్మియాయ్ పేశోనాదా
యురైతరి నగవరుత్తమొజిందదాయ్ మిగవిళంగ-50 మీన్చిఎడలమ్

ఇందు సురతాంతసుఖము బ్రహ్మానందముగా వర్ణింపఁబడియె. అవేద్యాం తరం బనుటకు అనిర్వాచ్యతరంబనియు, అనవద్యమనుటకు నవిద్యారహిత మనియు, పునర్భవభవము ( నఖక్షతము )లవలన ఖేదములేని దనుటకు

"అహావరుత్తం, నహావరుత్తం" అని యక్షరశ్లేషచే నర్థము ద్రవిడకవి సాధించె, తెనుఁగులో ననవద్యమనుటకు మాఱుగా ననవిద్యంబై యని యుండవచ్చును. అవిద్య లేనిది బ్రహ్మానందము. సుఖరూపమువలెఁ దోచు కృత్రిమసుఖము లేనిదని సురతార్థమునఁ జెప్పవచ్చును.

ఇట్టే యెన్నియేనియు నుదాహరణములు చూపవచ్చును.

ఇందు ద్రవిడకవి పేర్కొన్న బాలయ్య తండ్రి వీరబాలయ్య తాత రామకథ రచించినట్లు తెలుపఁబడియె. పిడుపర్తి బసవసుతుఁడు బసవప్ప రచించిన నిరోష్ఠ్యరామాయణము కలదు. బాలయ్యసుతుఁడు బసవన్న ప్రభులింగలీల విరచించె. ప్రౌఢరాయలకాలములో నుండిన పెదసోమయ్య కేడవపురుషుఁ డగు బసవప్ప 1600లో నుండుట యసంభవము కాదు. తత్ప్రపౌత్రుఁడు బాలయ్య సుమారు 1680 కాలములో నుండవచ్చును. నిరోష్ఠ్యరామాయణము పంటకుల చింతభూపతి కంకితమయ్యె. పంటకుల తిమ్మభూపుఁ డతని వంశజుఁడగునేమో. అతఁడే ద్రవిడ వసుచరిత్రకుఁ గారకుఁడు. మాతులనమశ్శివాయయ్య కవి కన్వయింపక బాలయ్యకు విశేషణము గాఁదగునో యని సంశయించెదము. తిమ్మప్రభు వాసస్థానము వాలిగండపుర మను బ్రహ్మదేశము.

మూలముతోఁ బోల్చి చూచి పద్యముల ద్రవిడముననుండి యెత్తుటకుఁ జాల సాయముచేసిన మా సహోద్యోగులును ద్రవిళభాషాపండితాగ్రేసరులు నగు టి.పి. పళణియప్పపిళ్ళగారికి మాయభినందనము సమర్పించుచున్నారము.

Journal of sri Venkateswara Oriental Institute

మా. రామకృష్ణకవి

# 5. ఐరావత చరిత్రము

శ్రీ వేంకటేశ్వర విద్యాపరిశోధకమండలి పుస్తకాలయమునఁ గొన్ని లిఖితగ్రంథములు సేకరింపఁబడియె. అవి సంస్కృతాంధ్ర ద్రవిడభాషలలోఁ గలవు. ఆంధ్రవాఙ్మయమునకు సంబద్ధము లగునొక కొన్నిటి నిందుఁబేర్కొను చున్నారము.

ఐరావత చరిత్రము. ఇది చెన్నపురి ప్రాచ్యలిఖిత గ్రంథాలయములో నుండు మాతృక ననుసరించి ముద్రింపబడియె. అందుఁ గవికాలాదుల నిర్ణయించుట కనుకూలములగు పూర్వాపరభాగములు లుప్తములగుటచే నాగ్రంథకర్త విషయమేమియుఁ దెలియదయ్యె. సాహిత్య పరిషద్భాండాగారములో నున్న ప్రతి కొంచె మధికభాగము కలదగుటచేఁ గవి త్రిపురాంతకుఁ డనితెలిసినది. అతఁడు సుప్రసిద్ధుఁడగు రావిపాటి త్రిపురాంతకుఁడు గాఁడు. తన్నామధేయుఁ డతఁ డెవ్వఁడో యని కుతుకపడుచుండ దక్షిణదేశమున సంపూర్ణ మగుమాతృక యొకటి లభించె. అది చెంగల్పట్టు జిల్లా తంద్రగ్రామములో నుండు ప్రఖ్యాత వైద్యులయింట లభించెను. దానివలన మఱికొన్ని యంశములు తేటపడఁగలవు. గ్రంథారంభములో—

శ్రీకాంతాకుచకుంకుమాంకితశుభశ్రీయుక్తవిస్తారవ
క్షోకాండం బగుచున్నకౌస్తుభమణిస్ఫూర్తుల్ ప్రకాశింపఁగా
లోకంబుల్ కరుణాకటాక్షముల నాలోకించులక్ష్మీశుఁ డ
స్తోకస్ఫూర్తిని గాఁచుఁగాత సుజనస్తోమంబు నింపొందగన్.

అని యాశీర్వాదరూపమంగళమును గూర్చె. ఇందు వక్షోకాండము అని యున్నప్పుడు వక్షఃకాండ మని గైకొన్న వ్యాకరణమును, 'అకాండ' యని గ్రహించినయెడల యతియుఁ గక్కుఱితి యగును. అకాండము = తక్కువ గానిదని యర్థమగునేమో లేక కృత్యాద్యవస్థ కిది పాల్పడియెనా? రెండవ పద్యము శివస్తుతిహృద్యము.

కలితజటావలిం బొలుచుగంగఁ గనుంగొని గౌరి యీశునిన్
నెలకొని హస్త మెత్తుటయు నెట్టెపుఁబాము శిరోమణివ్రజం
బుల నొగి వేయుమస్తముల మున్నిడి నెత్తుడు నైవరించు భీ
తిలి తనుఁ గౌగిలించిన మదిం భయ మంది శివుం భజించెదన్.

దీనిలో లేఖకదోషము లుండుటచేనర్థము తెల్లముగానేరదు. గంగయునికిఁ జూచి శివుఁ బ్రత్యక్షాపరాద్ధుని జేయఁ బార్వతి చేయెత్తగా భీతిలి శేషుఁడుతన్ను రక్షించుకొన వేయుపడగల నెత్తుకొనఁగా నద్రికన్య భయరసముతో భర్తను గౌఁగలించుకొనఁగా నతఁడును భీతి నెందెనఁట. ఇట్లు భీతి పరంపరా ప్రకాశమగు పురాణదంపతీ విలాసము కవి భజించుచున్నాఁడు. ఇందు మానోన్ముఖమయిన పార్వతీ సముద్యోగము భయపరాభూతమై శివున కాలింగన సుఖముతో ధృష్టతాచ్ఛాదనము గలిగించెనని వర్ణించి యించుక చమత్కృతి గర్భముగాఁ గవి భజించె. మూఁడవపద్యమున బ్రహ్మనిట్లు కవి సంస్తుతించె—

ఆమేధాధికపద్మమధ్యమున సత్యాసీనుఁడై ఋగ్యజు
స్సామాథర్వణవేదముల్ తనకు భాషామాత్రముల్ గాఁగ వా
గ్భామామానసహంసయై భువనముల్ భావించుటల్ క్రీడలై
భీమాబ్జాక్షులయొద్ది యౌనలువ నేఁ బెంపారఁ గీర్తించెదన్.

వాగ్దేవతావాల్మీకివ్యాస సంకీర్తనానంతరము.

సన్నుత భారతార్థములు సర్వము వర్ణసమృద్ధిఁ బొందగాఁ
గ్రన్ననఁ బద్యరూపమునఁ గావ్యముఁ బొల్పుగ నంధ్రభాష సం
పన్నతఁ జెప్పి యెల్లెడలఁ బ్రస్తుతి కెక్కిన పుణ్యమూర్తులన్
నన్నయభట్ట తిక్కకవినాథులఁ గొల్తుఁ గవిత్వసిద్ధికిన్.

"అని యిష్టదేవతాప్రార్థనంబును బురాతనకవీంద్రస్తోత్రంబును" నలిపి ప్రబంధరచనాకుతూహలి యైనట్లు చెప్పుటచే భారత శిష్టభాగము రచించిన యెఱ్ఱప్రెగ్గడ నేలవిడిచెనో యెఱుఁగరాదు. తరువాతఁ గావ్యరచనోద్యోగియై "భారత ప్రబంధాంశంబును గుమారవ్యాసప్రోక్తంబైన యైరావతచరిత్రంబు నాంధ్రభాష విరచితంబు సేయంబూని—

సురుచిరాపస్తంబసూత్ర పవిత్రుండ భారతీశ్వరపాదభక్తిరతుఁడఁ
బ్రకటితాంగిరసబార్హస్పత్యమాన భారద్వాజగోత్రవిరాజితుండ
ఘుటికభైరవకృపాగుణలబ్ధసత్కవితారూఢసంశోభితాన్వయుండ
షట్కాలశంభుపూజా ప్రవర్తనశాలి యనునట్టియమృతనాథయ్యసుతుఁడ
జగతిఁ బ్రఖ్యాతమగు కరయుగయుగంధ
రావధానమహాబిరుదాంకితుండ
సుకవిమాన్యుండ విమలయశోధనుండ
నమృతకవిత్రిపురాంత కాఖ్యాఘనుండ.

అని త్రిపురాంతక దేవున కంకితంబుగాఁ దత్సనామ్ముఁ డీకృతి రచించె.

పై పద్యముచే నీత్రిపురాంతకకవి యమృతనాథసుతుఁడు బ్రాహ్మణుఁ డనియు శివపూజాధురంధరుఁ డని స్పష్టమగుచున్నది. కర్ణాటభారతమును షట్పదీచ్ఛందమునఁ గూర్చిన కుమార వ్యాసకవి క్రీ-శకము 1510లో నుండి నందున నీకవి పదునాఱవ శతాబ్దివాఁడై యుండవచ్చును.

దుర్యోధనాది సుతశతంబు త్రవ్వితెచ్చిన మంటితో నేర్పఱచిన గజమున నైరావతారోపణము సేసి గాంధారి గజవ్రతమొనర్చి తోడికోడ లగుకుంతికి జ్ఞాతిత్వముచేతను మదాంధయై యవజ్ఞ సూపఁగా నదియు నవమానఖేదావకుంఠ నముతోఁ దలవాల్చి యొక్కవజ్జ నుండ నర్జునుండు తత్కారణం బెఱింగి యీర్ష్యాక్రోధావిష్టుఁడై సాక్షాదైరావతము నింద్రునకు వీరలేఖ యంపి తెప్పించి సర్వకామినీసమక్షమున సాక్షాదైరావతవ్రతము కుంతిచే నడపి గాంధారికే కాక దుర్యోధనాదులకును దీర్పరానిఖేదావమానముల వినిమయము సేసె. ఈకథ బాలురకు వీరరస ముత్పాదించుచుఁ బండితులకు క్షణకాలము "వామాః కుల స్యాధయః" యన్న తత్త్వార్థస్మరణతో విస్మయము గలిగించుచుండును.

గద్యమున "శ్రీమద్ఘుటికభైరవప్రసాదలబ్ధకవితావిశేష ధురీణస్తోమ నయ నాంగుళీ ఘంటావధాన ప్రవీణ సమస్తాభిధాన నిర్మాణ కలియుగ గంధేభాభిధ బిరుదాంక సుకవిజనస్తోత్రామృతకవిపుత్ర త్రిపురాంతక ప్రణీత" మని యున్నది. ఇందు నయనాంగుళీ ఘంటావధానమన నేమో దాని తత్త్వ మెఱుఁగఁజాలము. అభిధాన మన నిఘంటువు. ఆయర్థమే కవిసముద్దిష్టమయినచో నితఁడు రచించిన సమస్తనిఘంటు విప్పుడు గానరాదు. ప్రేమాభిరామాదులు రచించిన రావిపాటి త్రిపురాంతకుఁ డనుమహాకవి త్రిపురాంతకవాసి. ఘుటికభైరవమూర్తియే గ్రామ మునఁ బ్రతిష్ఠితమయ్యెనో తెలిసిన యెడ నిక్కవివాసస్థల మెఱుఁగనగును.

Journal of sri
Venkateswara
Oriental Institute

మా. రామకృష్ణకవి

# 6. నరసభూపాలీయములు

ఆంధ్రభాషా గ్రంథములలో నరసభూపాలీయమను నామాంతరము గల కావ్యాలంకారసంగ్రహమును జదువని పండితు లుండరు. రాయల రాజ్య కాలములో బట్టుమూర్తి యను నొకకవి ప్రఖ్యాతుఁడై యుండెనని పండితేతరులు నెఱుంగుదురు. కొందఱు వసుచరిత్రయు హరిశ్చంద్రనలోపాఖ్యానమును రచించిన రామరాజభూషణుఁడను కవియు బట్టుమూర్తియు నొక్కఁడే యందురు. ఇతరులు వార లిరువురు భిన్ను లనియుఁ బినతండ్రి పెదతండ్రి కుమారులనియు చెప్పుదురు. ఎట్లున్నను మూర్తి నరసభూపాలీయము రచించె ననుటకు సందేహము లేదుకదా. అది యలంకారశాస్త్రగ్రంథము. అది యళియ రామరాయల తోఁబుట్టువగు లక్కమాంబకుఁ గుమారుఁడగు తొరగంటి నరస భూపతి కంకితమయ్యె. దీనిలో నరసరాజునకు వీరపురుషుఁడగు కుమారుఁడు పుట్టియున్నట్లు వర్ణింపఁబడియె. నరసభూపాలీయము క్రీ॥ శ॥ ౧౫౭౦ యో లేక ౧౫౮౦ ప్రాంతమున రచింపఁబడి యుండునని యూహింపఁదగియున్నది. ఈనరసరాయల తల్లికి నోబమాంబ యను నొకసోదరి గొబ్బూరి తిమ్మభూపతికిఁ బత్నియై నరసభూపతి యను పుత్త్రుంగనెను. ఆ నరసభూపతికి సంస్కృతమున నరసభూపాలీయ మను నలంకారశాస్త్ర మంకితముగాఁ గృష్ణకవిచే విరచింపఁ బడియె. గొబ్బూరి నరసరాజునైతము విద్వత్పక్షపాతియై యయ్యలరాజు రామభద్రునిచే రామాభ్యుదయకావ్య మంకితముగాఁ గొనియె.

సంస్కృత నరసభూపాలీయమును జూచినంత నాంధ్రగ్రంథమునకును దానికిని సంబంధము గలదేమో యను సందియము తప్పక కలుగునుగదా. కృతిపతు లిరువురును బినతల్లి పెదతల్లికొడుకులు. వీనిలో నేది పూర్వకృతియో, దాని మఱియొక నరసరాజు చూచి కీర్తిలోభుఁడై యట్టిదానిఁ దన యాశ్రితునిచే రచియింపఁజేసి యంకితఖ్యాతి చెందెనో యనుట యసంభవము కానేరదు. ఈ రెంటిని జదువఁగా సంస్కృతగ్రంథమే పూర్వకృతమని మాకుఁ దోఁచు చున్నది. ఈ రెంటిఁగూర్చి యించుక చెప్పుటయే వ్యాసోద్దేశము.

ఆంధ్రభాషలో దౌర్భాగ్యవశముననేమో యలంకారగ్రంథములు పెక్కులు గానరావు. విన్నకోట పెద్దన కావ్యాలంకారచూడామణి భాషలోఁ దజ్జాతికృతులలో

ముకుటాయమానముగా నున్నది. దానికిఁ దర్వాత గణనకు రాఁదగినది నరస భూపాలీయము. అనంతకవి రచించిన రసాభరణము మిక్కిలి చిన్నగ్రంథము. దానిలో నాయికానాయక విషయములే యత్యల్పముగాఁ జర్చింపఁబడియె. శృంగార రసాలవాలము, ఆంధ్రచంద్రాలోకము, కువలయానందము మొదలగు నవి ప్రఖ్యాతికి రావయ్యె. నేఁటికాలమున గావ్యాదర్శము, కావ్యప్రకాశము, కావ్యమీమాంస, కావ్యకల్పలత మొదలగునవి పండితులచేఁ దెనిఁగింపఁబడు చున్నవి. భామహ దండి మమ్మటాభినవగుప్తాదుల గ్రంథములు ప్రసన్న పద బంధములయ్యు గంభీరార్థనిబంధము లగుటచేఁ దెనిగించువార లించుక షడ్దర్శనీ పరిచయహీను లైనచోఁ బ్రమాదాపభ్రంశములపాలై చిక్కువడుదురు. ఉన్న వెన్నియైనను మనభాషలో నలంకారమున సంస్కృతములోవలెఁ దర్కపరిష్కా రముతోఁ బదార్థచర్చ చేసి పూర్వపక్షసిద్ధాంతప్రక్రియగా రచింపఁబడిన గ్రంథము కానరాదు. అట్టి ప్రక్రియకు ననేక శాస్త్రపరిజ్ఞానమును విషయవివేచనా శక్తియుఁ దత్తత్పారిభాషిక పదప్రయోగకౌశలమును నైజముగా నలవడుట యత్యావశ్యకము. అట్టి సామర్థ్యము గలవాఁడు సంస్కృతముననే గ్రంథరచన సేయ నుత్సహించుఁగాని సుకుమార మతిమనోమోహన మగు నాంధ్రవాఙ్మయ మున నతికర్కశమనీషోదర్కమగు తర్కపరిష్కారముఁ జొనుపంగోరండు కాపుననే కావ్యాలంకారచూడామణియు నాంధ్రనరసభూపాలీయమును నొకవేళ కేవల మాంధ్రలోకమునకుఁ బ్రౌఢగ్రంథములుగాఁ దోచినను వానిలోఁ దర్క నికషోపలధారలకు నిలువఁగల వజ్రసారమగు పద్యమొండైనను గానరాదు. విన్నకోట పెద్దన మృదుమధురముగాఁ బద్యములఁ గూర్పనేర్చినను గావ్యా దర్శాదులలోనుండి తెనిఁగించిన లక్షణభాగము లన్నియు నస్పష్టపదార్థభేదములై యవ్యాప్త్యతివ్యాప్త్యాది దోషములకు లక్ష్యభూతములై యున్నవి. ఆ గ్రంథమే యట్లుండ నరసభూపాలీయముగతి యేమి? వేంకటగిరి సంస్థానాధీశ్వరులవారి ప్రేరణమునఁ గొల్లాపురాస్థానపండితులచే రచింపఁబడిన నరసభూపాలీయ విమర్శమే తజ్జాతిగ్రంథము లెంత పరీక్షాక్షమములో దాని నుద్ఘోషింపఁజాలు. వారును బిచ్చుకపై బ్రహ్మాస్త్రమేలయనికాఁబోలు విషయముఁ బైఁబై దర్కించి విడిచిపెట్టిరి.

సంస్కృతగ్రంథమును రచించినకవి సుప్రకృష్ణయజ్వ, వాధూళస గోత్రుఁడు. సూరిభట్టోపాధ్యాయ పుత్త్రుఁడు. "సర్వశాస్త్ర రహస్యజ్ఞుఁడు

సర్వాలంకార కోవిదుఁడు.'' కృతిపతియగు గౌర్బ్రాలి నరసరాజు కవినలంకార శాస్త్రమును రచింపుమనఁగా నతఁడు —

తేనాలంకృతిశాస్త్రతత్త్వసరణి ప్రవ్యక్తయే ప్రేరితః
సాహిత్యార్ణవకైరవప్రణయినాం సత్ప్రీతయే సాదరమ్।
వక్ష్యామి క్రమశోఽత్ర వర్ణగణయోః శబ్దార్థయోశ్చ ధ్వనే
ర్వృత్తేర్నేతృరసస్య దోషగుణయోశ్చాలంకృతే ర్లక్షణమ్.

అని వర్ణగణ, శబ్దార్థప్రతిపాదన ధ్వని నిరూపణ, వృత్తిస్వరూప నాయకాదిగుణ విస్తరణ, రసవిచార గుణదోషవివరణాలంకార లక్షణములుగల గ్రంథమును రచించెనఁట. ఇందులో నాలుల్లానములే లభించె; నేడవది యగు నలంకారభాగము నహితము తక్కినభాగములవలె గుణవంతమై యుండవచ్చును. కాని నానాశాస్త్రముల నెఱింగియు నిర్ణిమిత్తముగా దుష్కతర్కమునకు దిగక సాహిత్యశాస్త్రమర్యాద ననుసరించి మధురాక్షరములతోడనే మధురతరముగ నుపాదేయాంశముల నిరూపించుచున్నాఁడు. లక్షణముల సామాన్యముగా విద్యానాథు ననుసరించి చెప్పినను లక్ష్యభాగమునఁ దానిచ్చిన లక్షణమునకుఁ బొందికగా న్యూనాధికతలు లేక యుదాహరణము లిచ్చుచున్నాఁడు. ప్రాయశః ప్రతిలక్షణమునకును రెం డుదాహరణము లిచ్చుచుండును. క్షుద్రకావ్యములకుఁ దన రచనానైపుణియు సాహిత్యపరిశ్రమము గోచరించునట్లు విద్వజ్జనశ్లాఘ్యములుగా నుదాహరణములు గూర్చును.

ఇఁక రెండు నరసభూపాలీయముల పరస్పరసంబంధ మూహించుటకుఁ బూర్వము సామాన్యముగా నలంకారశాస్త్ర రచనాప్రణాళికగురించి యించుక యతిప్రసంగమైనను విషయవివేకమునకుఁ దోడ్పడవచ్చు నని కొంత యవకాశము వేఁడుకొనుచున్నాను.

సాధారణముగా నలంకారశాస్త్రమునఁ గావ్యకర్తలకును గావ్యపాఠకులకును శబ్దార్థరచనారహస్యము, తద్వైచిత్ర్యము, కవివైదగ్ధ్యము నెత్తిచూపునట్టి వస్తువిమర్శము గలది. సంస్కృతమున దీనిఁ గవిశిక్షాగ్రంథ మందురు. భోజాదులు రచించిన శృంగారప్రకాశాది గ్రంథములు చదువఁగా మహాకావ్యములేరీతిగాఁ జదివి పరిశీలించిన నానందమును ధర్మాదిజ్ఞానవిశేషమును గలుగునో యాపద్ధతియు నుపదేశించుచున్నందునఁ గవులకే కాక తక్కినవారలకు నలంకారశాస్త్రము ప్రయోజనకారియే యని చెప్పఁదగు. అది సామాన్యముగా రసప్రధానమై

కథావస్తుశరీరము నాశ్రయించి యొక సరణియు, కేవలము శబ్దార్థరచనా ప్రధానమైన కవినైపుణి ప్రదర్శించునట్టిది రెండవ సరణియుగా నిరుదెగ వెలయుచుండును. రుద్రటుని శృంగారతిలకము, భానుదత్తుని రసమంజరి, భావప్రకాశము, శృంగారప్రకాశోత్తరభాగము మొదటి సరణి నాశ్రయించినవి. కావ్యప్రకాశ, ప్రతాపరుద్రీయాదులు రెండవ సరణిలోఁ జేరినవి. నరసభూపాలీయములు రెండును రెండవతెగయగు రచనాప్రసక్తి ప్రధానముగఁ గలవి. దీనిలో గావ్యనాయక లక్షణములు శబ్దవృత్తిస్వరూపము, ధ్వని, గుణదోషములు స్థూలముగా రసస్వరూపము, శబ్దార్థాలంకార లక్షణములు ప్రతిపాదింపఁబడును. ఇట్టి గ్రంథములు సాధారణముగా మమ్మటుని కావ్యప్రకాశము ననుసరించుచు నించుక న్యూనాధికతలతో నొప్పుచుండును. నరసభూపాలీయములు రెండును ప్రతాపరుద్రీయము ననుకరించును. విద్యానాథుని గ్రంథమున ముఖ్యవిశిష్టగుణమేమనఁగా గావ్యప్రకాశకారాదులు లక్షణమునకు లక్ష్యమును బ్రాయికముగాఁ బ్రాచీనగ్రంథములనుండి వెదకి యిత్తురు. ప్రతాపరుద్రీయమున విద్యానాథుఁడు తానే రాజుపేరట లక్ష్యములఁ గల్పించి శాస్త్రరచన చేసెను. అట్టి యేకనాయక ప్రశంసాలక్ష్యములు గ్రంథకర్తృకల్పితము లగుటలో లక్షణము సరిగా సమన్వయమునకు రాక యవ్యాప్త్యతివ్యాప్తులు చెందుటయు, సర్వత్ర హృదయావర్జకము లగు భావములు స్ఫురింపకుండుటయుఁ గేవల మర్త్యనాయకులయందు ధీరోదాత్తులగు రామాదుల దివ్యగుణముల నారోపించి వర్ణించునపు డతిశయోక్తిచ్ఛాయ నవలంబించి మిథ్యాత్వము నెలకొల్పుటయు, బహుమతభేదగహన మగు నలంకార శాస్త్రమున విషయవివేకము నల్పునపుడు గ్రంథకర్త పొందుచున్న భ్రాంతి సంక్రాతిదోషములకు లక్ష్యముల నిలుపుటయు, మొదలగు పెక్కు దోషములు సంభవిల్లును. ప్రాచీనకవిప్రయోగముల లక్ష్యములుగాఁ జూపువారి కిట్టి కష్టములు లేకున్నను అవాంతరభేదములకు సుకరముగా లక్ష్యములు లభింపకుండుటయు, బహుగ్రంథ పరిశీలన మతినిపుణముగాఁ జేయవలసివచ్చుటయుఁ, దుట్టతుదకు స్వప్రతిభాద్యోతము గాక యసామర్థ్యము నవలంబించుటయుఁ దటస్థించుచుండును. మఱియుఁ బూర్వుల లక్షణములపక్కి మార్చి నూతనముగా మార్గనిర్మాణము సేయుట యెల్లరకును సులభసాధ్యము కాదు. మహాత్ములు చూపినత్రోవఁ బలువురచే క్షుణ్ణమగుటచే దానినే చక్కఁబెట్టి పునఃప్రతిష్ఠ సేయుట యుత్తమమని తలఁతురు. కావునఁ బ్రాచీనలక్షణములు వస్తువిభాగమును భరతాదిమహర్షులచే నిరూపింపఁబడినందున వానిని నిరసించుటకును గ్రొత్తత్రోవ సృజించుటకును

సుకుమారమతుల కలవికాదు. కావున నలంకారశాస్త్రకారులు లక్షణభాగములఁ బూర్వులవలన గ్రహించి లక్ష్యముల నేఱియో స్వముముగాఁ గూర్చియో గ్రంథ రచన సేయుదురు. ప్రతాపరుద్రీయ, నాగభూపాలీయ, కావ్యాలంకారసంగ్రహ, సాహిత్యదర్పణాదులు బాలురకుఁ బ్రథమశిక్ష కర్హములేకాని ప్రౌఢమతులకు క్షోదక్షమములు గావు. కావ్యప్రకాశము విషయగాంభీర్యముచే వీనికంటె నించుక మేలైనది. ఈ శాస్త్రము ననేక దేశభాగముల విస్తరముగా నిరూపించు గ్రంథము లలో- ధ్వన్యాలోకము, వక్రోక్తి జీవితము, కావ్యకౌతుకము, శృంగారప్రకాశము, సహృదయదర్పణము, వ్యక్తివివేకము మొదలగునవి ప్రాయశః నూతనఫక్కి- ద్రొక్కుచు గాఢముగా నుండును గావునఁ బ్రథమశిక్ష కుచితములు గావు. శాస్త్రము లభ్యసించినపిదపనే వానిఁ బరిశీలింపఁదగు. ఇఁక నీ లఘుగ్రంథములు ప్రాయశః గతానుగతికములుగా నొకటికి వేఱొకటి ఛాయారూపము వహించు చుండును. తద్ గ్రంథకర్తలును బహువిషయపరిజ్ఞానము లేకున్నను పూర్వ లక్ష్యములకు నిపుణముగాఁ బ్రతిబింబములమాత్రము నిర్మింపఁ గలిగిరేని క్రొత్త గ్రంథములు సేయ సమర్థు లగుదురు.

"త ఏవ పదవిన్యాసా స్తా ఏవార్థ విభూతయః
తథాపి నవ్యం భవతి కావ్యం గ్రథనకౌశలాత్".

అనఁగా పూర్వవస్తువులోనిదే బంగారము, దానిలోనివే రత్నములు దానిఁజెఱిపి మఱియొక యాకారమునఁ గట్టినచోఁ గ్రొత్త యాభరణ మగుచున్నది అన్నట్టు లలంకార గ్రంథములు పెక్కులు పుట్టెను. రెండు నరసభూపాలీయము లట్టివే. ఇది గ్రంథచౌర్యము కాదా యని మా మిత్రులు ప్రశ్నింతురేమో? శాస్త్రకారులకు వస్తుసంహారము నియతము, స్వకపోలకల్పనము శాస్త్రాతిదేశమై ప్రమాదజుష్ట మగును. కావున "ఇది నాయభిప్రాయ"మని యుద్ఘోషింపఁజాలక పండితులు పూర్వకాలమున రాజసభలలో బహుముఖ ప్రతిభావంతుల యెదుట నెగ్గఁజాలక "న స్వాతంత్ర్యా న్న మౌర్ఖ్యాచ్చ కోఽప్యర్థో నిహితః క్వచిత్" అని యాప్త ప్రామాణ్య మనునీడలో నాత్మరక్షణము సేసికొనుచుండిరి. ఇప్పుడు స్వాతంత్ర్య మునకు భంగములేనందున నిరంకుశముగా స్వకీయా పరకీయా శబ్దములకు నర్థపరివర్తనము సేసి రచించినను నడుగువారు లేరు. సంస్కృతాంధ్ర నరస భూపాలీయములలో సంస్కృత గ్రంథమే పూర్వరచితమని తోచుచున్నది. లక్షణభాగమున నిరువురును బ్రతాపరుద్రీయాదులలో నుండి వస్తువు గ్రహించిరి.

లక్ష్యభాగమునఁ గృష్ణయజ్వ రెండు రెండుదాహరణము లిచ్చుచు సాధ్యమైనంత వఱకు నూతనకల్పనలే యిచ్చెను. భట్టుమూర్తి యనేక గ్రంథములలో నుండి కల్పనలు గైకొని పరివర్తన విన్యాస విశేషములచే నాంధ్రమున నూతనములని తోచునట్లు వివరించెను. కృష్ణకవిశ్లోకములు లక్షణార్థము ననుసరించి న్యూనాధికతలు లేక లక్ష్యము లగుచుండునుగాని యాంధ్రకవి యిచ్చిన యుదాహరణములు లక్షణమునకు సరిగా నుండక యవ్యాప్త్యతివ్యాప్తులను దోషములకు లక్ష్యభూతము లగుచుండును. మఱియు నొక యుదాహరణముననే నాలుగైదు చమత్కృతులు గలిసియుండుటచే లక్షణ లక్ష్య సమన్వయము సులభముగాఁ గానేరదు. ఆంధ్రగ్రంథములోని యుదాహరణకల్పన లలంకారగ్రంథములలో నుండియు సంస్కృత నరసభూపాలీయము నుండియుఁగూడఁ గైకొనఁబడినను గల్పనాపహరణమునందును భట్టుమూర్తి కొంత చమత్కృతి చూపియున్నాడు. సంస్కృతమున నేలక్షణమున కది యుదాహృతమో దానికిఁగాక దానిఁ దెనిఁగించి మఱియొకలక్షణమునకు మూర్తికవి దానినే యుదాహరించును. అట్లయినచోఁ జమత్కృతి భేదిల్లి లక్షణమున కెట్లు సమన్వయించునని పండితు లడుగుదురేమో! అయిననేమి? మాయాంధ్రలోకమునకు శ్రావ్యముగాఁ బద్యము లున్నం జాలుఁగదా శాస్త్రచర్చలును సమన్వయ సిద్ధాంతములును మా కేల? వలయువార లుండిరేని యా నిష్ణాతబుద్ధులు వ్యక్తివివేక, రసగంగాధరాదుల గ్రంథికంటక ప్రఘట్టముల యథారుచి సంతరింతురుగాక. మూర్తికవి పరలక్ష్యముల గ్రహించునపుడు కేవల మేకగ్రంథముననుండి గైకొనక నానాకృతులలో నుండి కొనుటయేకాక భిన్నలక్షణములకు లక్ష్యము లగువానినిగూడఁ దీసికొని యించుక పర్యాయ శబ్దప్రయుక్తిచే రూపాంతరముఁ బొసంగించుచుండును. ప్రతాపరుద్రీయమునుండి లక్షణములేకాక లక్ష్యములంగూడఁ గొన్నిటిని గైకొనెఁగదా· ఎట్లన—

ఖండితానాయిక కుదాహరణముగాఁ బ్రతాపరుద్రీయమున—

> రాత్రిర్యామత్రయపరిమితా వల్లభా స్తే సహస్రం
> మార్గాసక్త్యా మమ గృహమపి ప్రాతరేవాగతోఽసి,
> కిం కర్తవ్యం వద నృపతిభి ర్వీక్షణీయా హి సర్వాః
> కో వా దోష స్తవ పునరహం కామమాయాసయిత్రీ.

నృపులకు నెల్లవారల భరించుట యోగ్యముగాన నేఁటిరే
యపరిమితోత్సవంబునఁ బ్రియాసదనంబుల కేగియేగి యా
నెపమున మద్గృహంబునకు నీ వరుదేరఁ బ్రభాతమయ్యెఁ గా
కిపుడు నృసింహ నీవయి నొకించుక వంచన లే దెఱుంగుదున్.

ఈ రెంటిలో నర్థమున నత్యల్పభేదము కలిగినను వాక్యార్థము సమానమే. సంస్కృతమున నాత్మోపాలంభనవాక్యమగు "పునరహం కామమాయాసయిత్రీ" యనునది తెనుఁగున వ్యక్తముగాఁ గానరాదు.

మఱియు — "ఈర్ష్య" కుదాహరణముగా—

"లక్ష్మీ ర్యస్య విలోచనాబ్జవసతిః సేర్ష్యా త్వదాలోకనే
వక్త్రస్థా చ సరస్వతీ న సహతే సాకం త్వయా భాషణమ్,
లీలాకర్షణవిఘ్నకృత్ త్వయి మహీబాహుస్థితా కాకతి
క్షోణీంద్రే న హి కైతవాని సుభగే మానేన కిం తామ్యసి ?"

వదనాగ్రంబున వాణి యున్నది మమున్ వాక్రువ్వనీ దిందిరా
మదిరాక్షీమణి యున్న దక్షుల మమున్ మన్నించి వీక్షింపనీ
దదియుంగాక నృసింహ! నీవిపులబాహాశ్లేష మే నొంద నో
ర్వదు భూదేవి బహుప్రియారత! నినుం బ్రార్థింప నింకేటికిన్?

రసార్ణవసుధాకరములో నుండి కొన్ని చౌర్యోదాహరణములు చూడ వచ్చును. విహృత మను చేష్టకు దృష్టాంతము సింగభూపతి యిట్లు రచించెను—

అద్యాపి తన్మనసి సంపరివర్తతే మే
రాత్రౌ మయి క్షుతవతి క్షితిపాలపుత్ర్యా ।
జీవేతి మంగళవచః పరిహృత్య రోషాత్
కర్ణేఽర్పితం కనకపత్ర మనాలపన్త్యా.

బాలిక యల్కతో మరలఁ బల్కకయుండియుఁ బ్రాణనాథుఁ డ
వ్వేళ క్షుతం బొనర్పఁ గడు వేగఁ జిరాయు వటంచుఁ బల్కఁగాఁ
జాలక రోషముం బ్రణయసంభ్రమమున్ మది దొమ్ములాడ నీ
లాలక కుండలద్వయ ముదగ్రగతిన్ ఘటియించె వీనులన్.

అని మూర్తికవి తెనిఁగించె.

ఇట్లె శృంగారచేష్టలలోఁ బ్రథమభేద మగు భావము "రసజ్ఞానయోగ్యతా మాత్ర" మగు మనఃపరిస్పంద మని నిర్వచించి సింగభూపాలుని యుదాహర ణము నిట్లు తెనిఁగించె—

వరుఁ డని పేర్కొనన్ శిరము వాంచుఁ దలోదరి సాలభంజికా
పరిణయవేళ నెచ్చెలులఁ బాయక యెప్పటియట్ల కేళికాం
తర మొనరింపఁబోదు చనెనా యెదఁ బయ్యెదఁ జేర్చి సిగ్గునం
బరఁగుఁ బ్రియాంగనానుకృతి భావన కేలికిఁగాఁగ నిచ్చలున్.

దీనికి మూలశ్లోకము—

బాలా ప్రసాధనవిధౌ విదధాతి చిత్తం
దత్తాదరా పరిణయే మణిపుత్రికాణామ్,
సా శంకతే నిజసఖీజనమందహాసై
రాలక్ష్యతే తదిహ భావనవావతారః.

ఇందు సఖీజనహాసశంకను గాఢలజ్జానుభావముగా మార్చుటచే మూర్తికవి "భావము మనస్సునఁ బ్రథమపరిస్పంద" మనుట మఱచి యుత్తరావస్థను జూపె నేమో !

ఇట్లె మూర్తికవి కావ్యప్రకాశాది గ్రంథములలో నుండియు లక్ష్యములు గైకొని తనకృతి కొనసాగించుకొనెను. పాణినిశ్లోక మగు—

పాణౌ పద్మధియా మధూకముకుళ భ్రాన్త్యా తథా గణ్డయోః
నీలేన్దీవరశఙ్కయా నయనయో ర్బన్ధూకబుద్ధ్యాధరే,
లీయన్తే కబరీషు బాన్ధవజన వ్యామోహజాతస్పృహో
దుర్వారా మధుపాః కియన్తి సుతను స్థానాని రక్షిష్యసి.

అని నాయిక యభినయించు శిలీముఖబాధను నాయకుఁడు దాని మౌగ్ధ్యము నుపాలంభించినట్లు సౌందర్యమహిమను బ్రకటించును. దాని నిట్లు మూర్తికవి తెనిఁగించె—

వదనసరోజవాసనకు వచ్చినతేఁటి నదల్చి చూడఁగా
నది యసితోత్పలంబు లని యక్షుల వాలినఁ జే విదుర్పఁగా
నది మరలం బయోజమని హస్తయుగంబున వ్రాల నవ్వె న
మ్మదవతి యేమి సేసినను మాన దిదేమి యటంచు నెంతయున్.

దీనిలో మూలములోని ఛాయమాత్రము గ్రహింపఁబడి వ్యంగ్యరూపముగా నాయకుని దృఢప్రయత్నమును తెలుపుచున్నది.

తిర్యగ్జంతువుల శృంగారవిలసనము రసాభాస మని విద్యానాథ సింగభూపాలుల యభిప్రాయము ననుసరించి మూర్తికవి విద్యానాథుని యుదాహరణమే తెనిఁగించెను.

ప్రాసాదగర్భవలభీషు కపోతపాల్యాం
పారావతీం రమణచుమ్బితచఞ్చుకోటిమ్
ఆవిర్భవత్సురతకూజిత రక్తకణ్ఠ
మాలోక్య కాకతివిభుః స్మిత మాతనోతి॥

అలఘువిశీర్ణపక్షయుగమై యమితోన్నమితోర్ధ్వకాయమై
గళరవముల్ దలిర్పఁ బ్రియకాంతకు ముద్దులు వెట్టి యుబ్బునం
బలుమఱు మేడపై కెగసి పక్షము ద్రిప్పుచుఁ గుంచితాస్యమై
పౌలతుకఁ భిల్చు విభ్రమ కపోతము హుంకృతనాదమాధురిన్.

అని మూలమును బుష్టిచేసి తెనింగించె. తిర్యక్శృంగారము రసాభాసము కాదని కృష్ణకవి సిద్ధాంతపఱచి దండియుదాహరణ మగు—

కలక్వణితగర్భేణ కణ్ఠేనాఘూర్ణితేక్షణః,
పారావతం పరిక్రమ్య రిరంసు శ్చుమ్బతి ప్రియామ్.

అని సూచించి—

బాధో ముఖ్యరసస్య స్యా దున్మర్యాదప్రవృత్తినా,
యత్ర హ్యఙ్గరసే నైష రసాభాసః ప్రకీర్తితః.

అని సంగ్రహశ్లోకమున స్వసిద్ధాంతమును బ్రకటించెను.

కాళిదాస కుమారసంభవమున "మధు ద్విరేఫైః" ఇత్యాది శ్లోకచతుష్టయము రసాభాసము కా దని భోజుఁడు శృంగారప్రకాశమునఁ దదౌజ్జ్వల్యము నొక్క ప్రకాశమున నతివిస్తరముగా వర్ణించెను. మాయురాజు తాపసవత్సరాజమునఁ దృతీయాంకమున—

కిఞ్చిత్కుఞ్చితచఞ్చుచుమ్బన సుఖస్ఫారీభవల్లోచనా
స్వప్రేమోచితచారుచాటుకరణై శ్శ్లేతోఽర్పయన్తీ ముహుః।
కూజన్తీ వితతైకపక్షతిపుటే నాలిఙ్గ్య లీలాలసం
ధన్యం కాన్త ముపాన్తవర్తిన మియం పారావతం చుమ్బతి॥

అని విరహకాతరుం డగు వత్సరాజు తనదౌర్భాగ్యము ధ్వనించునట్లు "చిక్కని రాలు మ్రింగియు సదా కామార్తులై యుండు" పారావతములచర్యను విదూషకునకు వర్ణించెను. కృష్ణకవిమతానుసార మిది యంగరస విలసనమగుటచే దోషము కానేరదు. సింగభూపతిమతమే మూర్తికవి గ్రహించె.

ఆంధ్ర సంస్కృత నరసభూపాలీయములలో సంవాదబహులము లగు ప్రఘట్టముల నొండు రెండు చూతము.

అపరాంగమున కుదాహరణము—

భవద్భటావళ్యసిపుత్రికాభిర్గృహీతకంఠా విషమాస్త్రవిద్ధాః,
నృసింహభూవల్లభ భూరిరాగాద్ ద్విషోఽభిజగ్ముః సురతానుభూతిమ్.

అత్ర వీరస్య వాక్యార్థస్య శృంగారోఽఙ్గతయా ప్రతీయతే ఇత్యపరాఙ్గమ్.

మెడఁ గ్రుచ్చి కౌఁగిలించును నొడలెల్లం బారవశ్య మొందించు నరిన్
వడి మోహనిద్రవుచ్చును బుడమి నృసింహేంద్రుఖడ్గపుత్రిక యౌరా.
—II. 151.

రంగుగ నీయెడ ధ్వనియగు
శృంగారము రౌద్రరసవిశేషమునకుఁ దా
నంగంబై విలసిల్లుచు
నంగతి నపరాంగ మనఁగ సన్నుతికెక్కున్.

ఇందు వీరరసమే యంగియగుఁగాని మూర్తికవి తలఁచినట్లు రౌద్రము కాదు. దానికిఁ దగిన విభావములు ధ్వనింపవు.

కటాక్షవర్ణనమున—

సాభిప్రాయైః సదరహసితైః సత్రపైః సానురాగై
ర్లీలాలోలై రలసవలితై రాదరానందగర్భైః।
కందర్పాణా మయుత మనిశం కల్పయద్భిః కటాక్షై
శ్రీగొబ్బూరీనరసనృపతిం ప్రేక్షతే పంకజాక్షీ॥

అలసాలోలములై యచంచలములై యాకేకరాగ్రంబులై
యలఘువ్రీడములై యనిందితములై యానందపూర్ణంబులై
సులభాసూయములై సుతీక్ష్ణరుచులై సువ్యక్తరాగంబులై
చెలువంబొందెడు చూపు లింతి నెఱపెన్ శ్రీనారసింహేంద్రుపైన్.

ఇందుఁ దృతీయచరణములలోఁ జూడ్కులు నానావిధమదనరాగజనకంబులను సంస్కృతమునకుఁ బ్రణయ కోపప్రసాదసూచకంబులని తెనుంగున మార్చుట ప్రతిభావైచిత్రియే.

గొబ్బూరి తిమ్మభూపతి గృష్ణకవి యిట్లు వర్ణించె-
చిత్రం కీర్తిరహీనతామహిపతే ర్మష్ణాతి కృష్ణాత్మతాం

క్షీరాబ్ధిం నిలయం నయత్యపహర త్యబ్జస్య చిహ్నం మహత్।
ఐశానీం శ్రియ మావృణోతి కురుతే గఙ్గాం సభఙ్గాం దివో
వాణీం వర్ణనిగర్హితాం వితనుతే తిమ్మక్షమాధీశితుః॥
అతద్గుణాలంకారమున కుదాహరణము—
బలరిపుభోగ యోబనరపాలనృసింహ భవద్యశంబుచేఁ
దెలుపగు నిందులాంఛనము దెల్పగుఁ బ్రాక్తనభోగిభోగముల్
దెలుపగు రుద్రుకంధరము దెల్పగు భారతికొప్పు గాని త్వ
త్ఖలరిపుదుర్యశోరుచి వితానము తెల్పయియుండ దెన్నఁడున్.

ఇందు సంస్కృతమున నహిపతిప్రభృతులకు సహజదోషముల నాపాదింప నాంధ్రమున శత్రుజనుల యపకీర్తి మాత్రము దెలుపుగాదయ్యె ననుట సరసతరమగు.

ఇరువురు నవతారికలో నాత్మప్రగల్భత నిట్లు వర్ణించుకొనిరి—
మాఘస్యాఘనివాకృతౌ నిపుణతాం కాంతేర్భరం భారవే
ర్బాణస్యార్జవ ముజ్జ్వలం మధురిమోత్కర్షం మయూరధ్వనేః।
హర్షస్యానుసరన్ ప్రకర్షమసమం కుర్వన్ మురారేః పద
ధ్యానం కాంచిదలంక్రియాం ప్రథయతే (?) ప్రీత్యై నృసింహప్రభో॥

బాణువేగంబును భవభూతి సుకుమార
తయు మాఘుశైత్యంబు దండిసమత
యలమయూర సువర్ణకలన చోరునియర్థ
సంగ్రహమ్ము మురారిశయ్య నేర్పు
సోమప్రసాదంబు సోమయాజుల నియ
మంబు భాస్కరుని సన్మార్గఘటన
శ్రీనాథుని పదప్రసిద్ధి ధారాశుద్ధి
యమరేశ్వరుని సహస్రముఖ దృష్టి
నీక కల చటుగాన ననేకవదన
సదనసంచారఖేదంబు సడలుపఱచి
భారతీదేవి నీజిహ్వఁ బాదుకొనియె
మూర్తికవిచంద్ర విఖ్యాతకీర్తిసాంద్ర!

పై పద్యములలోఁ గేవలము ఛాయారూపమగు సంవాదము కలదుకాని రెంటను బ్రస్తుతార్థము హీనమై యప్రస్తుతము పుష్టమగుట నీరసముగా నున్నది. శ్లేషకుఁగాఁ దత్తత్కవిగుణవిశేషముల మార్చి లేనివాని నారోపించుట కేవలము హాస్యాస్పదము. కావున నీరసత్వము రెంటికిని సామాన్యము. బాణునకు వేగము, భవభూతికి సౌకుమార్యము, సోమునకుఁ బ్రసాదము, సోమయాజికి నియమము, భాస్కరుని సన్మార్గము తత్తత్కవులకు ముఖ్యగుణములని గ్రంథజ్ఞులు తలఁపరు.

ఇఁక నిరువురి వస్తువిభాగ నిర్వచనలక్ష్య సమన్వయభంగులఁ గొంత విచారింతము.

కథానాయకగుణము లేవన—

గుణా మహాకులీనత్వ ముజ్జ్వలత్వ ముదారతా
తేజస్వితా మహాభాగ్యం ధార్మికత్వం విదగ్ధతా
పాండిత్యం ధీరతేత్యేవమాద్యా నేతు రుదాహృతాః.

కులము మహాభాగ్యము ను
జ్జ్వలత యుదారత మహోవిశాలత ధర్మా
కలనయు వైదగ్ధియునన
నిల నాయకగుణము లమరు నివియేర్పఱుతున్॥

సంస్కృతమునఁ బాండిత్యధీరత లితరగుణములలో నంతర్భావము నెందునని కాఁబోలుఁ దెనుఁగుఁగని పరిహరించి విద్యానాథుని మతమునే యాశ్రయించె.

కాంతాసమ్మితమగు కావ్యోపదేశమువలనఁ గలుగు ఫలశ్రుతి నిట్లు వర్ణించిరి.

కీర్తిం యా కురుతేఽత్ర కార్తికకనజ్జ్యోత్స్నా ప్రతిస్పర్థినీం
శుక్రశ్రీసదృశీం శ్రియం దిశతి సంసూతే కళాకౌశలమ్
చింతాశాంతి ముదశ్చయత్యపి పరానన్దం విధత్తేతరాం
కాన్తాసమ్మితయా తయా విహరతే కోవా న కావ్యశ్రియా॥

"అంగనాజన విలాసాలాపలీలాసమప్రాదుర్భావము
పరమజ్ఞానలతాలవాలము జగత్ప్రఖ్యాతివిఖ్యాతసా
గరచంద్రోదయమిష్ట సంఘటన రేఖాదివ్యధేనూత్తమం

బురుకార్పణ్యదశానిశాదిన ముఖం బుద్వేలనిర్వాణభ
వ్యరసాస్వాదరసాయనంబనినఁ గావ్యం బెన్నసామాన్యమే.

తెనుఁగున రూపకాలంకారముచే మూలములోని భావఖండములు బహుళీకృతములై శోభిల్లుచున్నవి.

ఆంధ్రగ్రంథము సర్వజనులకుఁ జిరపరిచిత సౌందర్యవిశేషమే కావున నముద్రితమగు సంస్కృత నరసభూపాలీయమును గుఱించి యించుక విచారింతము. భరత రాహుళ రుద్రట భోజ ప్రభృతులు నానారసభావ నిర్మథనమున దక్షులై యశేషలోకానుభవశాస్త్రవిగతులఁ గృతశ్రములగు మహావిద్వాంసులకునైన నుద్బోధకముగా గ్రంథరచన యొనర్చిరి. అట్టి ప్రబంధములు సహృదయజన మనోమోదములై యుండఁగా నరసభూపాలీయాదులలో వర్ణింపఁబడిన లక్షణములకు నిష్కృష్టార్థతయు సర్వంకషతయుఁ గానరా వనుట యచ్చెరువుకాదు. ఇవి యన్నియుఁ గేవల ముదరపోషణార్థము సాలసులై విద్యాపరిశ్రమ వేదితృకీర్తికాములగు భూవల్లభులకు నిష్కించనులచే ముఖస్తుతి వస్తుకములుగా రచింపఁబడినవి. ఇట్టి వానిలోఁ గించిద్వైచిత్రియున్ననది కవి ప్రతిభాద్యోతకమే యండ్రు. అఖండరసవాహినులఁ బుణ్యావగాహము లభింపని వారి కల్పనరస్సుసహితము సురదీర్ఘికయేకదా.

స్థాళీపులాకనీతిగాఁ గొన్నిటి నెత్తి చూపుదము. రసోద్బోధకములగు సంచారిభావములలో సుప్తియనునది యొకటి. 'నిద్రయా యః సముద్రేకః సా సుప్తిః పరికీర్తితా' అని నిర్వచించి కృష్ణకవి—

స్వప్నేదష్టాధరకిసలయా చుమ్బితా ఫాలభాగే
శ్రీగౌబ్బారీ నరసః భవతాభావికారాగరమ్యమ్।
పశ్యత్యేవ ప్రణయని జనే బాలికా జాతకమ్పా
ముగ్ధా హస్తే కలితముకురా పశ్యతే ప్రాతరాస్యమ్॥

ఇందు గాఢనిద్రావశమున సంభవించిన స్వప్నాయితవృత్తము యథార్థమని తలఁచి సఖీజనుల సాన్నిధ్యము నెఱుఁగకయే నాయిక దర్పణాలోకనముచే శంకాత్రపాద్యనుభావములు ప్రకటించును. సింగభూపాలుఁడు—ఉద్రేక ఏవ నిద్రాయాః సుప్తిః స్యాత్తత్ర విక్రియా—అని సుప్తిని లక్షించె. నాట్యదర్పణమున సుప్తంనిద్రాప్రకర్షోఽత్ర స్వప్నాయితఖమోహనే ( షడింద్రియానవ

ధానము)-అని యుపలక్షింపఁబడియె. భోజుఁడు—నిద్రాధికార్యం సుప్తం-అని నిర్వచించి చతుర్థియగు సంవర్కావస్థకుఁ గుమార సంభవములోని

త్రిభాగశేషాసు నిశాసు చ క్షణం
నిమీల్య నేత్రే సహసా వ్యబుధ్యత
క్వ నీలకంఠ వ్రజసీత్యలక్ష్యవా-
గసత్యకంఠార్పిత బాహుబన్ధనా.

అని స్వప్నాయితవృత్తానుబంధిని యగు చర్య నుదాహరించె.

మూర్తికవి—'అతినిద్ర సుప్తి' యని

లలన నృసింహుని కౌఁగిట
నలసియొ పవ లెల్ల నిద్ర నందెడి నెలమిన్
నెలపొందున రే ముద్దులు
గులికి పగల్ నిద్రవోవు కుముదినివోలెన్.

అని దివాసుప్తవైభవము నుపమాలంకారరంజితముగా వర్ణించినను శాస్త్ర చమత్కృతి యిందుఁ గానరాదు. స్వప్నాయితవృత్తమే రసపోషణప్రధాన మని ప్రాచీనులు గ్రహించిరి. రాహులాది శాక్యాచార్యులును మాతృగుప్తుఁడును నిద్ర యనుసంచారిభావమున నంతర్భావమగు నని సుప్త్యవస్థను వేఱ వర్ణింపక తత్ స్థానమున శౌచమను నవీనసంచారిని సృష్టించిరి. తన్మతానుసారులు—

దౌర్బల్యాలస్యవిపచ్ఛిన్నాభిశ్చ ప్రజాయతే నిద్రా।
నిర్దేశ్యా ముఖగౌరవజృమ్భా స్వప్నాయితై ర్వికారైఃసా॥
యథా—
భీమో నిద్రాం గతో హన్మి కీచక త్వాం క్షణా దితి।
స్వప్నాయితేన కృష్ణాయాః పాణేరే వాగ్ర హూక్షిపత్॥

అని భీముఁడు స్వప్నమున నొనర్చు కీచకవధోద్యోగము ద్రౌపదీకరాకర్షణ మనుభావముగాఁ గావ్యచమత్కృతి నుదాహరించిరి.

శౌచ ముత్తమనాయకులకు శ్రుతిశాస్త్రవివేకములచే జనించి దమ శమ సత్యాద్యనుభావములఁ బ్రదర్శితమగునని బౌద్ధులమతము. అర్వాచీనులు భరత మత విరుద్ధమనియుఁ జమత్కారరహిత మనియు గాబోలుఁ బరిహరించిరి. రసభావోత్కర్షకారి యగు చమత్కృతి లేక కేవలము గాఢసుప్తిలో మఱఁగినకవి-

నేరక నిద్రించినవాఁ డాగయమేలొ [illegible]మ్మునన్

అని చెప్పఁదగు.

విరహాతిరేకమున నాయికానాయకులలోఁ గలుగు దశావస్థల నిరూపించు నెడ నిరువురుకవులును భిన్నాభిప్రాయు లగుచున్నారు.

కృష్ణకవి—

దృక్ప్రీతిర్మనసః సఙ్గః సఙ్కల్పోఽథ ప్రలాపితా
జాగరః కృశతా ద్వేషో విషయేషు త్రపాచ్యుతిః
జ్వరోన్మాదౌ తతో మూర్ఛా మృతి ర్ద్వాదశ తాః స్మృతాః॥

మూర్తి—

ఇలఁ జూచుట చింతించుట
తలఁచుట గుణవినుతి యరతి తాపము లజ్జా
స్థలనము గమనము మూర్ఛయు
నల ధన్యత యన నవస్థలగు నెట్లన్నన్.

అని ద్వాదశభేదముల నొక్కఁడును దశవిధముల నితరుఁడును వర్ణించె. ఈభేదము సంస్కృత గ్రంథాంతరములలోను గలదుగాని మూర్తి విప్రలంభోద్దిష్టమగు మరణావస్థకు మాఱుగా సంభోగశృంగారాంతర్భేదమగు ధన్యత యని క్రొత్తయవస్థ దెచ్చిపెట్టి లోకశాస్త్ర మర్యాదల నుల్లఘించి యవస్థా విశేషమును బొందుచున్నాఁడు. వస్తుతత్త్వము బాహ్యాభ్యంతరములఁ జక్కఁగాఁ బరిశీలించి విషయవిభాగ మొనర్చిన భరతాదులకంటె మూర్తికవి ధన్యతను దశమావస్థగాఁ జేర్చినను దా ధన్యతఁ జెందఁడయ్యె. మరణావస్థ యన ప్రాణచ్ఛేదము. నాయికానాయకులలో దాని వర్ణించినచో గథావిచ్ఛేద రసభంగము లగునని కవులు వర్ణింపరు. పునరుజ్జీవనము కలుగునేనిఁ గాదంబరిలోఁ జంద్రాపీడాదుల మృతిఁబోలె వర్ణింతురు.

"చంద్రాపీడస్యమరణం యత్ర ప్రత్యుజ్జీవనాంతిమమ్,
కల్పితం భట్టబాణేన యథా శారదచన్ద్రికా"

అని శారదాతనయుఁడును, "తస్యైవంవిధస్య మరణస్య లక్షణ మనంగవృత్తిత్వాదాచార్యేణ నోపవర్ణిత మలమస్యోపన్యాసేన॥ యథాహ—

ఇతి మరణ మనఙ్గవర్తి ముక్త్వా
నటతి నటీవ యుపత్యశేషభావాన్।
నటతి ఖలు యువాపి బాలలబ్ధ
స్మరలలితాతిశయః కదాచిదేవమ్."

అని సాగరుఁడును ప్రాచీనమతోద్దేశము నెత్తిచూపిరి. శారదచంద్రికయనునది కాదంబరిలోఁ జంద్రాపీడమరణ కథాభాగమునకుఁ బేరగు. అనంగవృత్తియన నంగాభావస్థితిచే ననుభావాప్రతిపత్తి గలుగుట.

మూర్తికవి ధన్యతయను దశమావస్థ కిట్లులక్ష్యమొసంగె-
శుకవర్గం బొకమాటలో మెలఁగె నా సూనాయుధుం డాంతరం
గికుఁడై యుండె మరాళ మొక్కనడకం గ్రేళ్లుబ్బి వర్తించెఁ బా
యక వేడ్కన్ సుముఖత్వమొందె శశి మా యబ్జాక్షి సేమంబుతో
నకలంకస్థితి నీవు గూడ నరసింహా రాజకంఠీరవా!

అని దీని నెవ్వరును విప్రలంభావస్థ యని లక్షింపరు. కావున నవావస్థలే నిక్కముగా నుద్దేశించి మరణ మవర్ణ్యమని వర్ణింపఁదయ్యెఁగాని "దశమీం దశామ్" అను లోకోక్తినెట్లు భంజింపఁగలఁడో!

ఉద్దీపన విభావమును వర్ణించుచుఁ గృష్ణకవి యిట్లు కూర్చె—
ఆభాత్యమ్బరచుమ్బి చమ్పకరజో నాసీర రేణూపమం
లీలా కాహళకూజితస్య కురుతే పుంస్కోకిలానాం స్వనమ్,
ధాటీనూనమటత్యయుగ్మవిశిఖః సాకం వసన్తేన త
త్కాన్తానాం కుచశైలభూర్విరహిణాం యూనాంగతి ర్నాపరా.
మూర్తి—
చిగురుఁగటారితోఁ జెఱకు సింగిణితో నలరంపగుంపుతో
నిగనిగమించు చెంగలువ నేజముతో వడిఁ జిల్క తేరిపై
మగటిమి నెక్కి శూరుఁడయి మారుఁడు కోకిలకంఠకాహళుల్
నెగడ లతాంగిపై వెడలె నేఁడు నృసింహా! యెఱుంగఁ జెప్పితిన్.

ఈ రెంటికిని జన్యజనకభావము లేకున్నను సాదృశ్యరేఖ గలదు. ఆంధ్ర పద్యమును మెచ్చుకొని రసికజనమనోరంజనకారుఁడు దానిఁ బ్రతిబింబము నిర్మించి తన చమత్కృతియో ప్రతిభాదారిద్ర్యమో చూపెను.

ఉభయగ్రంథములలో నిట్టే వస్తువర్ణనావిశేషములు పరీక్షింపఁ బెక్కులు గలవు. "సంక్షిప్తవస్తురమ్యోఽర్థేవ కదాచిద్ విరజ్యతే" అన్నట్లు బహూపాదానము నైరస్యహేతువని యీ ప్రసంగ మింక నిలుపుచున్నారము. కృష్ణకవి గద్యమున–శ్రీమద్వాధూళ గోత్రతిలక సుష్ఠుపదాంక సూరిభట్టోపాధ్యాయతనయ కృష్ణయజ్వవిరచితే అలంకార ముక్తావళ్యపరపర్యాయే నృసింహభూపాలీయే–అని" ప్రవరము చెప్పుకొనెను.

నైషధపారిజాతీయాది గ్రంథరచయిత యగు కృష్ణయజ్వ మఱియొకఁడు గలఁడు. అతఁడు తంజాపురి రఘునాథుని యాస్థానకవి. మన కృష్ణయజ్వ తంజాపుర కృష్ణాధ్వరికంటె నించుక సాహిత్యశాస్త్రముల నెక్కువగాఁ బరిశ్రమించియుండునని వారల గ్రంథపరిశీలనమువలనఁ దోచుచున్నది.

కేవలము గ్రంథపరిచితి దోషముచే భిన్నకాలముల భిన్నావస్థలలోఁ గూర్పఁబడిన యీ వ్యాసమున నసంగతత్వ మతి జాడ్యాదిదోషము లుండెనేని దోషజ్ఞులు క్షమింతురుగాక!

మా. రామకృష్ణకవి

భారతి, బహుధాన్య–మాఘము

# 7. కొన్ని కాకతీయ శాసనములు

౧

నేను గొంతకాలము వనపర్తిసంస్థానములో నుంటిని. అపుడు నైజాము గవర్నమెంటు వారికొఱకుఁ గొన్నిస్థలముల సంచరించి నాలుగు నూఱుల శాసనములవఱకును మసితోఁ గాగితలపై నచ్చుతీయించి (Ink impressions) వానిలోఁ గొన్నిటిని జదివియుఁ గొన్నిటిఁ జదువకయు నట్టెయుంచి కార్యాంతర ప్రసక్తుడనైయుండుటచే వానిలోఁ గొన్ని క్షీణించుచుండుటంజేసి కొన్నిటినైనఁ బ్రచురింత మనుతలంపుతో నీ క్రిందిశాసనముల నాంధ్రలోకమున కొసఁగు చున్నాఁడను. ప్రయత్నముచేయువారలకే దోషములు కలుగుచున్నందున వీనిలో నానావిధ దోషములు సంక్రమింపవచ్చు ననుటాశ్చర్యముకాదు. ఏతత్పరిశ్రమ వేదులు మాస్ఖాలిత్యముల కలుగకుందురుగాక!

ఈక్రిందిశాసనము కాకతీయ శిలాశాసనములలో నతిప్రాచీనమైనది. ఇంత వరకుఁబ్రకటితముకాదు. అనుమకొండలో నూరికుత్తరభాగమునవెలిపొలములోఁ బెద్దగుండునకుఁగొట్టఁబడిన యీశాసనము తత్సమీపముననుండి యిప్పుడునశించిన యొకానొకశివాలయంబునకు సంబంధించినదన్నితోఁచుచున్నది.దీనిలో 16పంక్తులు గలవు. 1001 శాలివాహనశక వత్సరములకు సరియగు 1079 క్రీ. శకములో- సిద్ధార్థి సంవత్సరమున సూర్యగ్రహణకాలమున కాకతీయబేతరాజు (తన తండ్రి పేర నిర్మింపఁబడిన?) బేతేశ్వరంబునఁ బ్రోలేశ్వరదేవునకు దీపనైవేద్యములకు భూమిదానము చేసినట్లు దీనిలోఁ జెప్పఁబడియె. దీనికి మూలమై మసితోఁ దీసిన కాగితమును గవర్నమెంటు శాసనపరిశోధకులకుఁ బంపియుంటిని.

(The oldest kakatiya Inscription of 1001. S. S. -1079 A. D)

1. శ్రీమా న్విక్రమచక్రి శ్రీ బద్దమ
2. ణ్ణశికోత్తమః । ప్రాదాత్ప్రోలేశ్వరేశాయ
3. దీప మాచంద్రతారకం॥ స్వస్తిషకవర్షంబు
4. లు ౧౦౦౧ యగు సిద్ధార్థిసంవత్సర
5. సూర్య గ్రహణంబున శ్రీమన్మహామ
6. ణ్డశేశ్వర భేతమయ్యలు బేతేశ్వరంబున......త

7. బ్రోలేశ్వరదేవునకు నందదీవియకు నిత్యం
8. పంౘెండుమానికలు నేయి యాచం
9. ద్రతారకంబుగఁ బోయునట్టు గాందే-
10. ...సెప్పి ని......ర.....వ్వ - స్సరమయ్యర్ద...మ(?)
11. సీరినేల యంబదిమఱుతులు
12. మోడజాన్ సుడనయల్లునుగాను సర్వబాధా (?)
13. పరిహా ర్తము దణ్ణుగువెలిగా నడప్పవారు
14. దేవర కాపై సఃఖంబుణ్డు వాణ్డు ॥ స్వదత్తం ప
15. రదత్తంవా యో హరేత వసుంధరాం। షష్టిర్వర్ష
16. సహస్రాణి విష్ఠాయాం జాయతే క్రిమిః

దీనిలో 10, 12, పంక్తుల నచ్చుకాగితములో మొదటఁ జదివినప్పుడు తోఁచకపోవుటచేఁ దోఁచినట్లు వ్రాసికొనియుంటిని. వానినిమాత్రము మరల నచ్చుకాగితమునుగాని శాసనమునుగాని చూడఁదటస్థించినవారు సవరించుకొన వలయును.

ఇందు విక్రమచక్రి యనఁగాఁ బాశ్చాత్య చాళుక్యచక్రవర్తియగు త్రిభువనమల్లుఁడు. కాకతీయరాజులు మొదట వారికి మండలికసామంతులై యుండిరి.

౨

కాకతీయుల ప్రాచీనరాజధానియగు ననుమకొండలో సిద్ధేశ్వరమను నొకకొండమీఁదఁ బెద్దబండపై ననమగ్రముగ నొకశాసనము కలదు. దానియెదుట నొకచిన్న జాతిమఠము కలదు. ఆశాసనమునఁ గాకతీయులప్రాభవోన్నతులఁ గావ్యరూపముగ వర్ణించి శాశ్వతముగ శిలాలిఖితము చేసి కవిలేఖకులు కీర్తి ధ్వజమెత్తఁ బ్రయత్నించిరి. కాని దైవోపహతులై 26 పంక్తులు చెక్కించి కొన్ని శ్లోకములు మాత్రమే లోకమున కిచ్చినట్లు వ్యక్తమగుచున్నది. దీనిలో నాంధ్రదేశసౌభాగ్య ప్రశంసయు నేకశిలానగరవర్ణన ప్రారంభమును గలవు. కొన్ని సంవత్సరముల క్రిందట నే నతిశ్రమమునఁ జాలపొడవుననుండు నీశాసనమును గాకితములపై నచ్చుతీసి 19 పంక్తులవఱకును వ్రాసికొని యప్పటికి నిలిపివేసి చెన్నపురికి వచ్చుటచే నాయచ్చుకాగితములు వనపర్తి సంస్థానములోనే చిక్కిపోయినందునఁ బైభాగమున సరిగా వ్రాసికొనఁజాలకుండఁగాఁ బ్రాచ్యలిఖిత

పుస్తకభండారమున మెకంజీదొరవారి పండితులలో నొకరీశాసనము నచ్చటనే చదివి దాని వ్రాసికొనిన యాదర్శ మాభండారములోనే లోకల్‌రికార్డులో నుండఁగాఁ జూచివ్రాసికొంటిని. అతఁడు శిలనుజూచి చదివినందున బహు దోషముల పాలయ్యె. ఈక్రిందఁ బ్రచురింపఁబడిన శాసనములో 18 వంక్తుల వఱకును సామాన్యముగా దోషములు లేవని గ్రహింపనలయు.

ఇందులోని సంఖ్య పంక్తిసంఖ్య. అక్షరములు రుద్రదేవ గణపతిదేవుల కాలము నాఁటివి.

1. శ్రీ॥ ఆంధ్రా స్సంతి గరీయాంసః కాంచనప్రాయశాలయః । యథా హాటకశైలస్య కటకా రత్నశాలినః॥ కేదారా యత్ర
2. శాలీనాం తరంగితజలాంతరాః । కృష్ణాంగచ్ఛాయహరితా యథాజలనిధే స్తటాః । శాలికా రక్షిణీహస్తతాళైః కంకణనాద
3. తః । త్రాసితాః కిల గచ్ఛంతి యద్గీత్యా సద్గిరా జితాః॥ రసాలసాలహింతా లతాలకేతకక త్తఁనే । కాంతారే యత్ర కాంతానాం జా
4. తః శృంగారసంగరః । రసాలహాలాగంధేన హసనాంగీకృతాదృశః । అళీ నాం యత్ర హాహాంతా లక్షయంతి నగేహినీః॥
5. సంతానకాంతారలతా గంధగ్రంథిలచేతసః । యత్రాలయాః కర్ణికార నిగ్గఁంధేన నిరంతరాః॥ హాలిక స్త్రీకటాక్షాణాం కాంత్యా
6. గళితచేతనాః । న సీదంతి కృతిం యత్ర కేచి త్కుహకనందనాః॥గతాని హాలికస్త్రీణాం లక్షయంతి నిజై గఁతైః । నేత్రాంతనేత్రై హాన్ స్యంతి హరిణ్యశ్చయ
7. దంతరే॥ కేదారసస్యకాంతీనాం సంక్రాంతానాం తతః సరః । చలేన నీర నిచయా యదీయా జాయతేక్షతాః॥ శంఖకంకణజాలస్య లల
8. నాకరసంగినః । కళేన యత్ర నాదేన కలహంసాః శతం జితాః॥ లక్ష్యంతే యత్ర నిచితా లక్షశః శాలిరాశయః । గేహాంగణే యథా కాలే తట (...)
9. ంతిధరా ఘనాః॥ ఖళాః శాలీనతాం యాంతి యత్ర కంటకరక్షితాః । కటంకరీయ నికటనిరాఘాటకస్థలాః॥ కదళీకాననే యత్ర హరితచ్ఛ

10. ద్మహారిణి । కీరా నిరంతరం యాంతి నిజజాతీయశంకయా ॥ హాలాహ లంత్యః సతతం యత్రత్యోత్సాహకారతః । నిర్దిశంతి నిరాతంకం గతన్ నాయ శిఖండి

11. నః॥ యత్ర కాంచనసంకాశా రసాలానాం రజఃకణాః । టంకఘృష్టస్య తరణేర్యథా కేశాశ్చకాసతి । కర్షక స్త్రీ కేశహస్తే హస్తనాళీకసం యతిః । నహరా (......)

12. యత్రధత్తే శంకాతంకం శిఖండిని ॥ నగరాణి గరీయాంసి నారీరమ్యాణి లక్షశః॥ స్థానీయానాం సహస్రాణి యత్రత్యాన్యతిశేరతే । సనందనం చైత్రరథం న

13. చ యత్ర నిరీక్ష్యతే॥ కాంతారం నందనం కృత్యం కృత్వా చైత్రరథా హ్వయాః । కరిణః కరిణీసక్తిం యత్ర సంశ్రితతారకాః ॥ సకళత్రాః శంకయంతే గాత్ర

14. హీనా గజాననాః॥ నిచయై రాసతానీలైః శతశః స్యందనా ఘనాః । నదంతః కింకిణీజాలై ర్యథా కాంతైస్తడిద్గణైః॥ తటాకా యత్ర శతశః సారి

15. ణ్యశ్చ సహస్రశః । సరిన్నాథాన్ దర్శయంతి తేషాంచ కిల గేహినీః॥ ఆదిత్య ఘృష్టిసంకాశా దృశ్యంతే యత్ర దృష్టయః । క్షీరం దదత్యః కృత్యా

16. నాం త్రిజగ త్యఘనాశికాః॥ ఏ కాఽస్త్యైకశిలాఖ్యాత్ర నగరీ యా గరీ యసీ। సాగరాంతాం ధరాం కృత్స్నాం కాంతాకాంతం నిరీక్ష్యతే॥కళాగిరః కృశాంగీణాం

17. రశనాః కింకిణీఘనాః । యత్రాంగదాని చాంఘ్రీణాం నిద్రాహాన్యై కిల శ్రియః॥ చంద్రశాలాసంశ్రితానాం చంద్రాస్యానాం నిరంతరైః ।

18. యత్రాస్య చంద్రైర్గగనే చంద్రజ్ఞానం నశంక్యతే॥ యత్ర రథ్యాంగణ గతా ఘనసారస్య రాశయః । దృశ్యంతే చంద్రికాసంఘో యథా......

19. ణః॥ ఇంద్రనీలై శ్చంద్రకాంతైస్తథా యత్ర నిరంతరైః । అంధకారా శ్చంద్రికాశ్చ దర్శయంతి కదా గృహాః॥ కాంతా ఈక్షంతి యత్కాంతాః కాంతానాం హృదయం దృశా। కాంతాయా ఘాతి యత్కాంతా కాంతానాం

హృదయం దృశా । కళిందకన్యాలహరీ సంఘరింఖాణ హారిణః । కటాక్షా యత్ర నారీణాం దృష్టయతి నరింజనాన్ (?) । హేలారయేణ తరళా యత్రారాళదృశాదృశః। బద్ధరేఖా దర్శయంతి రతినాథకరస్థితాః। అధరా యత్ర నారీణాం సకలా నధరీకృతాన్ । ఆఖ్యాంతి నళినశ్రేణీః కటాక్షాశ్చ కటక్షతాః (?) ॥ తర్జయంతి యత్ర నార్య కరకంకణకింకణీః । ఆక్రీడదీర్ఘికాహంసీ గతితస్కరతాం గతాః । కణకారతికిరణసంకీర్ణా న్నహరిదంకణమ్ (?) । అంకణాయంతి సంగీతం కతశౌఘం యదం గణాః॥ కర్ణకల్హారకణికా హేలాశశి కరోహినః । యత్రాళిన స్త్రాసయంతే కాంతాకటకరుంకృతైః॥ కటాక్ష కాంతికళయా హాసచంద్రైః కళంకితైః। నహాసయంతి నాదానాం రూస్త్రాయణనేక్షణాః కనీనికా కళంకిన్యా కాంతి చంద్రికయా స్త్రియః ఉల్లోళయంతి యత్రత్యా శ్చంద్రికా హారిణః ఖగాన్॥ లలాటేనార్ధచంద్రేణ కృత్స్నచంద్రైస్తదాననైః । యదంగనాః కళాసక్తిం నజానంతి నిజాజితాః (?) । నాసాలంకార కాంతి...... నక్షత్ర...............

ఈశాసనము చదివిచూడఁగాఁ గాకతీయుల సామ్రాజ్యదర్పముఁ గావ్య రూపముచేసి కల్పాంతస్థాయిగా శిలోట్టంకితము గావింపవలయునని సిద్ధేశ్వరము కొండమీఁద మఠముకట్టుకొని నివసించిన యొకానొక శైవారాధ్యుఁడు ప్రయత్నించినట్లు తోఁచుచున్నది. ఇట్టు శిలోట్టంకితములగు ప్రశస్త కావ్య నాటకములు పెక్కులు గలవు. ధారానగరమునఁ బ్రాకృతకావ్యము భోజరాజ కీర్తిచంద్రికోల్లేఖమై రెండుశిలలపై లిఖింపంబడియున్నది. అచ్చటనే మదన మహాకవి కృతమగు పారిజాతమంజరియను నాటిక యర్జునవర్మప్రతాపమును వర్ణించునది శిలాలిఖితము గలదు. చేది దేశావతంసమగు విగ్రహరాజు కీర్తి ప్రతాపముల నెలకొల్పు హరికేళి యనునాటకము శిలోట్టంకితమై యున్నదిగదా!

భారతి, రక్తాక్షి- భాద్రపదము

మా. రామకృష్ణకవి

# 3

ఈ క్రిందిశాసనము కాకతీయ రుద్రమదేవి పరిపాలించుచుండ నామెక్రింద సైన్యాధిపతియగు మల్యాలగుండ దండాధినాథుని భార్యయగు కుప్పమాంబ హైదరాబాదునుండి వనపర్తికిఁ బోవుమార్గమున "బూతుపూరు" అను గ్రామమునకు సమీపమునఁ గట్టించిన గణపవరములోనఁ చడాకము నిర్మించి యందు వేయించిన ప్రశస్తికావ్యము. దీనిలోఁ గవితావిశేషములు పెక్కులు గలవు. ఇది నల్లజాతిపై నాలుగుముఖములను లిఖింపఁబడినదైనను మొదటి ముఖములోన మల్యాలగుండ దంతనాథునిగుఱించి తెనుఁగున వచనరూపముగఁ బ్రశస్తి యున్నది. తక్కిన మూఁడుముఖముల నక్షరములు చిత్రకవితావిశేషములు. ఈ శాసన మీక్రింద నామూలాగ్రము యథాలబ్ధముగాఁ బ్రచురించుచున్నాను. ఈ శాసనమునఁ గ్రిందిభాగమునఁ బద్మబంధము రేఖారూపముగా లిఖింపఁబడియె దానిని మాత్రము శ్లోకరూపముగా నుద్ధరించి దానిలో నంతర్గతమగు గోమూత్రికా బంధస్థశ్లోకమును వేఱుగా వ్రాయుచున్నాను.

## మొదటిముఖము

శ్రీస్వస్తి సమధిగత పంచమహాశబ్ద మహామండలేశ్వ
ర అనుమకొండపుర వరాధీశ్వర మూరురాజజగడాళ
విదితవిక్రమశీల పరమమాహేశ్వర వీరలక్ష్మినిజ
శరీర చలమర్తిగండ కదనప్రచండ శ్రీస్వయంభూ
దేవదివ్య శ్రీపాదపద్మారాధక పరబలసాధక నామా
దిసమస్త ప్రశస్తిసహితం శ్రీమన్మహామండలేశ్వర కా
కతీయ రుద్రదేవ మహారాజులు ఓరుంగల్లు
......గా సుఖసంకథా వినోదంబులం
[బృథివిరా] జ్యంబు సేయుచుండంగాం దత్ప్రసాద ప్రసూ
......క్ష్మీ సమాశ్లిష్టదక్షిణ భుజదండుండును
......శౌండుండును సంకిస పురాధినాథరి
......ండును పెదముట్టు గండండును బా
......కీర్తి పారావారసంజాత హరిచందను
......వరూధినీశ వరనందనుండును కుప్పాంబా
మనఃసరోవర విహరమాణ రాజహంసుండును నిజ

గుణ...ండును శ్రీ విశ్వనాథదేవ దివ్య శ్రీపాదపద్మా
రాధకుండునురిపుకుల భేదకుండునుం నైన శ్రీమ
న్మల్యాలగుండ దండనాథీశ్వరుండు మంత్రిపురోహిత సే
నాపతి దౌవారికమహాప్రధానాంత సామంతసుభట
విటవిదూషక పాఠక పీఠమర్ద నట నర్తకరాజ కరంజకకవిగ
మకివాదివాగ్మి వందివైతాళికహావక భావక గాయకా
ద్యనేక విద్వజ్జనంబులుం గొలువ సుఖోప విష్టుండై యి
ష్టకథా వినోదంబులనుండి పాణినీయ వ్యాకరణవిచిత్రక
విత్వ తత్వజ్ఞుండును పదక్రమయుత యజుర్వేదపారగు
ండును నాత్రేయగోత్ర పవిత్రుండును మయూరార్య
పుత్రుండునుం నైన ఈశ్వర సూరిం గారుణ్య దృష్టింజూచి శ
కవర్షంబులు ౧౧౦౪ వర్తింపం గాను అంగిరస సంవ
త్సరాన బూదుపూరి సమీపంబునం దనస్వామి గణప
తి దేవమహారాజు పేర తడాగంబు నిర్మించి ఆశ్రా
వణశుద్ధ ౧౫ బుధవారాన సోమగ్రహణకాలమ
ందు అత్యంత సంతోష సమాహిత చిత్తుండై సత్కార పూ
ర్వకంబుగం గులశీల విద్యాతపస్సంపన్నులైన బ్రాహ్మల
......దోపరహితంబైన ఈ గణపసముద్రము వెన
......చంద్రార్కస్థాయిగాను వృత్తులు ఇచ్చి తద్ధర్మ స
......త్థంబై సకల లక్షణ లక్షితంబుగాను
......నంబు చెప్పంబంచినం దత్ప్రారంభం బెట్టిదనిన

## రెండవముఖము (సంఖ్యాపంక్తిని సూచించును)

1. శ్రీబాహాబహురాగకారిరుచిర క్రీడాకర శ్రీకర
2. శ్రేయశ్శ్రేణిమరంక షిష్టపరమాంయుష్మాకమీశశ్శ్రియ...,
3. ...మ్మిఙ్ప్రక్రమ డంబరాంబర పర ప్రాచుర్యచర్యాక్షర
4. క్షీరాపారగభీరకూబరపయోరాశిప్రకాశాశయః॥
5. నిర్దంత్యము (1) ప్రోత్త్రిధా త్త్రిసలిలో ద్ధరణపరిణత శ్రీధరః
6. పాతుయుష్మాన్యి [?] ష్టస్యోష్మక్షణోత్థశ్వసనపరిహృతాపార నీరప్ర
7. పూరః। యద్దంష్ట్రాదండలగ్నా క్షితిరతిలసతిప్రస్ఫురద్గ

8. ర్వవప్రక్రీడాసంసక్తరేణు శ్రియమియ మురరికు [ర్వతీ]
9. పర్వతాం శౌ॥ (2) ఇది ఆర్యాగర్భము॥ ఇందుల ఆర్య ॥
10 లసతి ప్రసరతి తారక్రీడాలోల ప్రకారసంనీరే। శ్రీ...
11. స్ఫురదతిసోష్మాధా త్రిధరపరవరః పో త్రి॥ ఈశతే కురు
12. తేసూతే ఖ్యాతియాతివిపద్యతే। నీయతేద్యోతతేఒభ్యేతికీర్త
13. యత్యధికాయతే (3) క్రియాపదభ్రామకము॥ అసుభూ
14. యాత్సమస్తస్య జగతో మంగళం శివం। జనోజంతురతో
15. నౌతితతస్తస్మాదితో గతః॥ (4) పునరుక్తాభాస॥ హిరణ్యగర్భః ప్రవ
16. థమం మురారి గభీరనాభీ కమలాద్భ భూవ। మరీ (చిము)
17. ఖ్యానవలేథసోఒపి తస్మాద్బభూవుః ప్రభవాః (వః) ప్రజానా ( మ్ । త )
18. తోఒభవన్భా సురసత్ప్రభా వా వర్ణా స్సువర్ణా వరపూర్ణ కామాః
19. లోకప్ర కామ స్వకధమ్మ కమ్మన్ రక్తాః కలాలోల మనోఒను భావాః॥(5)
20. నిస్తాలవ్యము॥ కలౌయుగే కాకతిరాజ వంశో విశాలకీర్తిః క్షి
21. తిపాన్వయేషు। తత్రాధిరాజా మహదేవ నామా జాతోఒంధ్రదేశ
22. ంసమలంచకార॥ (6) తస్యాతిశస్య క్షితిపోష దక్షస్స దా స్వ కేక
23. ర్మణి ధర్మమూలే। సుతస్సమాసీ దసమానభూతి ర్భ్యావల్ల
24. భః శ్రీ గణపాభిధానః॥ (7) శత్రూనాశు విపేష వీరనిరతా న్బంధూ
25. న్పపోషాత్మనో దారేష్వేవతు తోష నిత్యవిలసం నిత్యోన్మిమేషా (జి)
26. ని। సౌందర్యంచ ముమోష శంబరరిపో ర్విశ్వం వివేష త్విషా
27. (స) ద్ధమ్మన్ం విశిశేష యః పరహితం తోషాదియేషప్రభుః॥ (8)
28. తద్రాజ భువి సద్బుద్ధి ముద్ధి రుద్ధి మహీపతౌ। అస్మి న్విస్మిత విక్రాం
29. తౌ గుర్వీం (ముర్వీం) ప్రశాసతి॥ (9) ని రీతి నీతేసుప్రీతి భూరి భూ
30. తి నుతిద్యుతి। సుధీనిధి ధృతి స్ఫూర్తి శ్రీ నూతి భువి నిర్విఘ్ని॥ (10)
31. నిష్కంఠ్యము॥ తదీయపా దాంబురు హోప జీవి మల్యాలవం
32. శేకమలేక్షణాంశః। దిగంత విశ్రాంతయశో విలాసః శ్రీదన్న
33. సేనాధిపతిః ప్రసూతః॥ (11) తస్మా దభూ దతుల భావిత పుణ్యమూ
34. ర్తి శ్రీబాచసైనికపతిః ప్రథితప్రభావః। ఉద్దామరాయ గరుడ
35. ధ్వజ వీరలక్ష్మ లక్ష్మక్షమాతల సురక్షణ నిత్య దక్షః॥ (12) తస్మా దస్మాద
36. ధాసీదరికరిరథినీ నాథయూథ ప్రభేద క్రీడాగాఢ ప్ర రూఢ ప్రబ

37. లపరిలసద్ధామ సంగ్రామ భీమః। ప్రాచాం వాచాం విచా
38. రే స మధిక చతురశ్చారు సంచార కీర్తి ర్యా చక్రే గుండ సే
39. నాపతిరతిరసి కస్సచ్చరిత్రైక మిత్రః॥ (13) సాభారతీ నియమితా రస
40. నాగ్ర భాగే సా కోమలాచ కమలానయనాంచలేచ। సా నిర్మ
41. లాలలిత తత్వ కలా విలాస లీలాకలాప కలితా ఖలు యేన (చిత్తే 14)
42. సర్వత్ర సంతతం సాయ ముతావి స పదిస్వపది స్వయం। అవశ్యం
43. యాతి మా నూనం సహసా స్వః స దా సమం॥ (15) అవ్యయా
44. భాస॥ తనుతే తనుతేరాయం విద్యతే విద్యతేరపి। రాజతే
45. రాజతేయం భూః భరతే భరతే శతా॥ పాదాదియమకం॥ (16)

## మూండవ ముఖము

1. శ్రీమ న్కుంఠ శరాసనాదికరణే కర్ణాట పూర్ణౌజసా వీరం
2. మన్యసమాజసేవణపతే సంగ్రామ రంగస్పృహాం। ధాటీం లా
3. ట నృపాటవీ మనుదినం గంతుం మతిం మా భక్తై రుద్యద్గుం
4. డయదండనాథ విల స ద్దో ర్వి క్రమో నిష్క్రమః॥ (17)
క్రియాప ద త్ర
5. య గోపకము॥ శ్రీ గోనకుల దుగ్ధాబ్ధి జాతా సహజ చంద్రికా।
6. శ్రీరి వ శ్రీపతేర్యస్య ప్రేయసీ కుప్పమాంబికా॥ (18) ఈ హాం
7. చక్రే దిశానా మహమహమికయా వ్యాపృతైస్తైస్తుతోషః (తో)
8. యస్సారంగుణో ప్రై రితి కవినికరా స్సంప్రయాతజగా
9. ...ష్టావస్థాతినాం రతి మిహ కృతినాం కుర్వత స్సర్వతోఽరిక్ష
10. ...ణి బిభేద ప్రకటిత యశ సో యస్యమేనే ర తస్య॥ (19)ఇందు లి...
11. భాస పదాలు ఆఱు॥ య దీయ చాతుర్య కృతో తి వర్య
12. పర్యాప్త మాధుర్య కరాంబు చర్యః। అహార్య ధై ర్యే
13. బుధపుర్య వార్య మర్యా ద సౌదర్య కర స్తటాకః॥ (20) స్తబకా
14. వళి॥ కలిత లలిత సార స్ఫార వారి ప్రసారి ప్రమద సమదలోక
15. స్తోక గణ్యస్సపుణ్యః। జలజసహజరంగ చ్ఛంగ రాజీ విరాజీ విపు
16. లవిమల తుంగత్వంగ దాళి స్స శాళిః॥ (21) మిథునావళి॥ కవయ తిక...
17. సౌ సమ్యగ్వచః ప్రభుతామితో గణపజలధే స్తారం నీరశం శి

18. వ సుశీతలం। అమృతరుచిరం పీత్వా నూనం చకోర గణామ్బు...
19. యదధిక రుచిం సాంద్రానం దాం త్యజేదపిచంద్రికాం॥ (22) కేదా రా
20. తతశాలి శాలిజన తాచేత స్సదానంద కృత్సారాకారనిరంత నీరజర
21. జస్సంచార చంచజ్జలః, నైజాధిక్షసలీల సాగరస దా హంకార శం
22. కాకరాః కీర్తిం యస్య దిగంత సంతత తతాం తంతన్య తే యం సదా॥ (23)
23. నిరోష్ఠ్యము॥ తడాగోఽసౌ సదా సేతుసరణిం తరలైరపి। స్వసార ప్రమి
24. వ సంసారీ న స్పృశ త్యూమ్మిన్ పాణిభిః॥ (24) అంతర్ని రంతస్థిత పద్మసద్మపద్మా
25. లయాం దిత్సు రివోత్సు కోఽసౌ। తరంగహ స్తైర్గణపాంబు రా
26. శేః ప్రక్షాళయ న్విష్ణుపదం చకాస్తి॥ (25) బుధపురనరస్ఫారా పార
27. ప్రవ్రచారముదాకరైర్గ ణప జలధిరంగత్తుంగైస్తరంగ కరైరసౌ।
28. కుతుక ఇవ తాం ప్రత్యు ద్యాతుం ద్యులోకతరంగిణీం గగనమ
29. మలం లేఢి ప్రౌఢప్రవ్ర కృష్ట చలజ్జలః॥ (26) కమలావాసిత తనుః కమలా
30. వాసితా తనుః। కమలావాసి లలితః కమలా వాసి లాలితః॥ (27)
31. అక్షర ముష్టిక॥ పురతః ప్రఖురాచార నీరపూరేణ దూరతః।
23. ...గీవగణ పాంభోధిః ప్రత్యుద్యాతి ప్రియా నదీః॥ (28) సద్ధాతు...
33. ద్ధ పృథ్వ్యాధి సమాసాళి సమన్వితః। నదీపూరణ సంపూర్ణః పా
34. ణి నీయాయతే చయః॥ [29] కాంతోపాంత సుజాత నూతనలస ద్వై
35. న్యాన వన్యామిళ త్ఫుల్లత్పల్లవ సంచలత్పి కశుకస్తోమైస్తుతి స్తాయతే।
36. [య] శ్చా శాంత వికాశమాన మహిమావాసైక లీలాలసద్వైశద్యద్యుతి వీచి
37. సూచియశసో యస్యాతిశస్యాత్మనః॥ [30] నిర్మూర్ధన్యము॥ అస్యాశస్యత
38. డాగ స్య కర్తు ర్గుండ చ మూపతేః। దిశోదశ యశోరాశి రాశిషి
39. ష్ట సదాశిషా॥ [31] విదుషేషామలం విద్వ ద్వి దోర్గుం డయశోవహ। తవస్య
40. సకలాంనారీ నంగనేషు నఖక్షతైః॥ [32] అపశబ్దాభాస॥ ఈశ చైషాసభో భో
31. [న] ధాచ యే హ భువోగుణః। ఊర్ధ్వా మోఘ పదో నాథకఠోరఫలితా
32. జడ॥ [33] అనా మృతాక్షరము॥ శాకాబ్దే యుగనందశం కర మితే వర్యేంఽగిరోవ

33. త్సరే మాసే శ్రావణనామకే బుధ దినే చంద్రోప రాగే సతి। సోయం
34. గుండ చమూపతిః కతిపయక్షేత్రం తడాగేధికే
45. శాలేయం ల సదిక్షు శాకట మదాత్తత్ర ద్విజేభ్యో ముదా॥

## నాల్గవ ప్రక్క

1. శ్రీ మన్మల్యాలగుండ దండా ధీశ్వరుండు ఈ గణప సముద్రము [నందు]
2. బ్రాహ్మణులకు ఇచ్చినక్షేత్రము। భరద్వాజగోత్రులైన సోమనాధభట్టో [పా]
3. ధ్యాయులకూనువ...భట్టో పాధ్యాయులకును సర్వ ప్రాయశ్చిత్తార్థ
4. ంబైగోచర్మము నాలుగు మఱుతులూను అడ్డ। ఆసోమనాథ భట్టో పా
5. ధ్యాయలకు ఈ చెఱువు ప్రతిష్ఠాచాయ్యన్‌దక్షిణ అడ్డ। హరిత గోత్రులైవ బొమ్మక
6. ......యంగారికి చాతుమ్మాన్‌స్య నిత్యభూదాన వ్రతానకై ఇను మ
7. ......ఆసూరదేవకూచిం గారికి మఱుతులుం బాది
8. ......కుంబుణ్యముగాను గౌతమ గోత్రులైన దేవరే
9. ......[మ] ఱుతుంబాదిక। అడ్డ। ఆయి అక్కెన ఘటశాసు
10. ......జగోత్రులైన కేశవ ఘటశాసులకు ఉభయముఖిద
11. ......తులు। కామకాయన విశ్వామిత్రగోత్రులైన సోమ య
12. ......టింగారికి సేతు దర్శనమున్ను సముద్రస్నానమున్ను చేయించిన దక్షి
13. [ణ] మఱులు। శ్రీ వత్సగోత్రులైన ఆలేటి పోతమ ఘటశాసులకు తమ
14. శ్రీపర్వతప్రదక్షిణము సేయించిన దక్షిణ ముప్పాదిక। భర
15. ద్వాజగోత్రులైన పురాణము ప్రోలెవ పెద్దింగారికి అలంపూరను త
16 మకైకర్కాటక మాసానను తుంగ భద్రలందు స్నానాలు సేయించినద
17. క్షిణమఱుతులు। కౌండినకులోత్తంసులైన పరమతత్వజ్ఞ నారాయణ
12. మంచెనంగారికి అడ్డ। తరణికంటి ఈశ్వర భట్టోపాధ్యాయులకు మఱుతు
19. లుంబాదిక। ఏవం ప్రార్థిత వాన్దత్వా భావిన స్సర్వభూపతీన్। య.·..
20. రనిశం యత్నః కర్తవ్యం ధర్మరక్షణే॥ శత్రుణాపికృ తోధర్మః పాల
21. నీయఃప్రయత్న తః। శత్రురేవహిశత్రుస్స్యాద్ధర్మ శత్రు ర్న కస్యచి
22. త్॥ స్వ దత్తా ద్వి గుణం పుణ్యం పరదత్తానుపాలనం। పరదత్తాపహారే

23. ణ స్వదత్తం నిష్ఫల భవేత్॥ స్వదత్తాం పరదత్తాం వా యో హరేత వసు
24. ంధరాం। షష్టిం వర్ష సహస్రాణి విష్ఠాయాం జాయతే క్రిమిః॥ శ్రీ.
ప్రథిత- సత్కుల భవాచయవయ్యణ సుతోల్లస। ద్విదిత తత్త్వకర కౌశల వీరయ సూరిణా
లిఖిత మద్భుత కవీశ్వర భాషిత శాసనం। లలిత కౌతుక రస ప్రభతోషిత వాచకం
శ్రీజభోజ భజన్నైజగుం జద్విజగజవ్రజ। అజరాజ దజన్మాజ ధీజరాజయజధ్వజ॥
[గోమూత్రిక బంధము]

## నాల్గవ ముఖమున పద్మబంధము క్రింద

1. ఈ పద్మబంధమునందు శ్రీగుండయ అనెడి నామమున్నది। ఈశ్లోకము రెండు గో
2. మూత్రికలు। ఈ రెండుం గూఢజాలబంధము। ఈ పద్మవృత్తమునందు వ్రాసినది
3. గూఢ చతుర్థన్మైన పద్మవృత్తము। ఇది సదివి [వు] క్రమము। ప్రామొదలు గాను తేకులతు
4. దుల అక్షరాలు మొదలిపాదము। ద్వి మొదలైన మొదలి అక్షరాలు రెండ
5. వ పాదము। లి మొదలైన రెండవ అక్షరాలు మూండవ పాద
6. ము। నాలవ పాదము యీ మూండుపాదాలందున నున్నది
7. ఈపాదము లలిత కౌతుక రస ప్రభ తోషిత వాచకం॥

మా. రామకృష్ణకవి.

భారతి, రక్తాక్షి- పుష్యము.

# 8. గ్రంథచౌర్యము *

ఒకనాఁడు భోజరాజు సభలో-"త ఏవ పదవిన్యాసా స్తా ఏవార్థ విభూతయః" అని సమస్య యొసఁగఁగా "పుంసి పుంసి విశేషేణ కాపి కాపి సరస్వతీ" అని కాళిదాసు పూరింపఁగా, "తథాపి నవ్యం భవతి కావ్యం గ్రథన కౌశలాత్'' అని వేఱొకఁడు పూరించెనట. గ్రంథములు రెండవ పూరణము ననుసరించి రచించువారు కొందఱు కలరు. అట్టివారి విషయమున పరశబ్దార్థాపహార మెంతవఱకు దోషము కాకుండునో యెప్పుడు కీర్తిలోపకరమో విశ్రాంతి చింతావినోదముగా విచారింతము. గ్రంథచౌర్యము దూషించుచు నంధ్ర కవితాపితామహుఁడు చండకోపము వహించి రాజదండనము విధించుచున్నాఁడు.

''భరమై తోచుకుటుంబ రక్షణకుఁగాఁ బ్రాల్మాలి చింత న్నిరం
తరతాళీదళసంపుట ప్రకరకాంతారంబుసం దర్థపుం
దెరువాటుల్ దెగఁగొట్టి తద్జ్ఞ పరిష ద్విజ్ఞాత చౌర్యక్రియా
విరసుండై కొఱఁతం బడుం గుకవి పృథ్వీభృత్సమీపక్షితిన్.''

దీనికి దృష్టాంతముగా మాడయ మైరావణచరిత్రమున —

''ధట్టించినాఁడవు తస్కరకవిరాజు
కోటసింగయమంత్రి కొలువులోన''

అని ప్రభువు తన్ను సంబోధించినట్లు వర్ణించుకొనియె.

లోకసిద్ధ మగు శబ్దార్థజాలము వదలి నూతన సృష్టియెట్లు సాధ్యమగు? లోకసంభావ్యము కానివస్తువు వర్ణించినచో నతిశయోక్తి యందురు. పురాతనకవి వాగ్గోచరము కాని పదార్థము కానరాదు. మాగతి యేమి?

''అగు ననఁ గొమ్మయతిక్కఁడు జగతి నపూర్వార్థశబ్దచారుకవితమై, నెగడిన బాణోచ్ఛిష్టం, జగత్త్రియం బనినపలుకు సఫలం బయ్యెన్'' అని భారత రచనా ప్రతిష్ఠాపితాంధ్రవాగ్దేవతామంగళ విగ్రహుం డగు తిక్కనను నుతించిరికదా! అగును. శబ్దమునకురాని వస్తుజ్ఞానమే లేదు. ''నసోఽస్తి ప్రత్యయో లోకే యః శబ్దానుగమాదృతే'' అని భర్తృహరి చెప్పినట్లు సమస్తార్థ

* ఈవ్యాసభాగము సంస్కృతాంధ్రనిరసభూపాలీయముల రచనాక్రమము విమర్శించుచు నవాంతర ప్రసంగముగా మొదట వ్రాయఁబడి ప్రధానకథకంటెనుపకథ పెద్దగా బలిసినందున వేఱుగాఁ బ్రచురించుచున్నారము. ఇది తత్కారణమున విశీర్ణక్రమ సంధి సంగతికమై న్యూనాధికపుష్టాంగకమై యుండుటకుఁ బాఠకులు క్షమింతురుకాక.

జాలము శబ్దముతో నుచ్చరించినందున బాణునినోటఁబడి సర్వ మెంగిలియయ్యె. ఆంధ్రపదము లతనినోటఁ బడవయ్యెఁగదా! కావుననే తిక్కనశబ్దజాల మపూర్వ మయ్యె. అట్లయినచో నతని సంస్కృత సమాసములగతి యేమి? ఇచ్చట గౌణార్థము గ్రహించి బాణుఁడు తలఁపని యభిప్రాయముల నూతన ఫక్కిగాఁ జెప్పె నన్నచోఁ గేతన పద్యమునకు సమన్వయము గాఁదగుఁ గాఁబోలు. లేక "జగత్త్రియ" మను పలుకు "యథోచితమహాశక్తి విశిష్ట"మని గ్రహింపఁ దగు. "సర్వశుక్లా సరస్వతీ" యన్నచో సర్వశబ్దమునకుఁ గించిదూన మని భోజాదులు శాసించిరికదా. అట్లే పూర్వపక్షానువాద ఖండన ప్రయుక్తాచార్య ప్రబలతర యుక్తి నిర్యుక్త సిద్ధాంతముల ననువాదము సేయునప్పుడు దర్శన నిబంధకారులును, అవ్యాప్త్యతి వ్యాప్తి దోషముల రానీయక వస్తునిర్వచనము సేసిన ప్రాచీన మతముల విస్తరించునపుడు లక్షణకారులును, శబ్దార్థముల రెంటి గైకొనకున్న వారల వ్యాపార మెట్లు నడచును? మండనమిశ్రుల బ్రహ్మ సిద్ధి చాలభాగము సురేశ్వరుల సంబంధవార్తికములో నెక్కినది. భావప్రకాశ మను నలంకారగ్రంథమున కావ్యాలంకారసంగ్రహ, కావ్యప్రకాశ, దశరూపక, సాహిత్యసారాది బహుగ్రంథపంక్తు లితియథోక్తాది శబ్దములు లేకయె గ్రంథ కర్తృ రచితములవలెనే కూర్పఁబడియె. భోజుఁడు, హేమచంద్రుఁడు, గుణ చంద్రుఁడు మొదలగువారు ప్రాచీనగ్రంథవాక్యములఁ దమ నిబంధములలోఁ జొనిపి యభేదముగా ప్రయోగించుకొందురు. ప్రాచీనగ్రంథకారులయందుఁ గల గౌరవముచేఁ దద్వాక్యములనే వారి మతముల పునఃప్రతిష్ఠాపనము చేసితిమని తదర్థగ్రాహు లందురేమో? సాహిత్యమీమాంసలో భోజుని యుదాహరణము లన్నియు నతని పేరైన నుచ్చరింపక తద్గ్రంథకారుఁడు గ్రహించుకొనియె. నవీనాలంకారికుల కిది దోషముగాఁ గన్పట్టదేమో.

దర్శనకారులతో మన కేమి? కావ్యములలో నిది యెంత సమ్మాన్యమో విచారింతము.

గ్రంథచౌర్యము శబ్దాపహారము, అర్థాపహారము, ఉభయాపహారము, ఛాయాపహారము, ప్రతిచ్ఛాయాకరణము, రేఖాపహారము, ప్రతినిర్మాణము, వర్ణనాగ్రహణము, సర్వగ్రంథచౌర్యము మొదలుగాఁ బెక్కుభంగుల విలసిల్లు.

"పూర్వకథావిచిత్ర సన్నివేశములలోఁ బాత్రముల సంరంభోద్దీపితవాక్య చేష్టా విశేషముల విన్నను జూచినను శ్రోతృప్రేక్షకుల కపూర్వావేశ జనిత సంస్కారవాసనా బలము మూలోచ్ఛేదము గాకుంటచే వారు గ్రంథముల

రచించిరేని తత్తుల్య సన్నివేశ నిర్మాణముల శబ్దార్థములు రెండును దమ తమ విద్యాసంస్కార బలముల ననుసరించి వాసనాబలముచేఁ దత్తుల్యములుగానే స్ఫురించుననుట యేమి యాశ్చర్యము? అది భగవత్సృష్టిలోని సామాన్య మనోధర్మము గాని గ్రంథచౌర్య మనెదవా?''

అహో ఏమి యీ సౌగతన్యాయము! మేము కొన్ని దృష్టాంతముల నుదాహరించెదము. వానిలోని నీ మనోధర్మ సాదృశ్యమును. విశదీకరించి మా గ్రంథాపహార సిద్ధాంతమునకుఁ దోడ్పడుము.

శబ్దాపహార మన శబ్దపంక్తులయు సమాసములయు పరిగ్రహణము. వానితోఁ బ్రాయశః తాత్పర్యము భిన్నమైనను గొంతయర్థము గృహీత మగు. సామెతలు గూడ నిందుఁ జేరునేమో. కేవలము శబ్దజాల మెల్లరకు సామాన్యమేకదా; అందుఁ జౌర్యము రానేరదు. హర్ష చరిత్రావంతిసుందర్యాది కావ్యములలో నచ్చటచ్చట సమానచ్ఛాయలు గలియుచుండును. శ్రీనాథుని పదవిన్యాసముల ననేకుల పోల్చి రచించిరి. ''కుదురు మెఱుంగు నిబ్బరపు గుబ్బలపై నయనాంబుపూరముల్'' అనుపాదము పెక్కు ప్రబంధములలోఁ గానవచ్చు. ఇట్టి శబ్దవిన్యాస సంక్రాంతి కవులకు బహుగ్రంథపఠనము వలన నజ్ఞాతముగాఁ దటస్థించుచుండును.

''భద్రం పక్ష్మలయంతు వో నరహరే రక్షుద్రశౌర్యా నఖాః
స్తోకోన్ముద్రిత పారిభద్రకళికా పాండిత్యపాటచ్చరాః.''
''ఆకాశాంచలవీథుల న్నిగిడె సంధ్యారాగరేఖావళుల్
పాకోన్ముద్రిత పారిభద్రకళికా పాండిత్యవైతండికో
త్సేకస్ఫూర్జిత...జటాశ్రేణికిన్.'' (భీమఖండము.)

శ్లోకకర్తయగు లౌహిత్యభట్టగోపాలుఁడు శ్రీ నాథునకంటెఁ బూర్వుఁడు కావున సంస్కృత సమానచ్ఛాయయే తెనుఁగున నజ్ఞాతముగాఁ జొచ్చెఁ గాఁబోలు. ఇట్టివి ప్రయోగసహస్రములు చూపవచ్చు నిది దోషము కానేరదు.

అర్థాపహారము—పూర్వపద్యములోనిభావ మంతయు యథావస్థితముగా గ్రహించి వేఱపదజాలముతో దాని గూర్చుట.

కలిమిం గొందఱు శ్రోత్రియుల్ సతుల కాంక్షల్ దీర్పఁగా లేక యా
కలకంఠుల్ తముఁ బాసి చక్కఁదనముం గాంభీర్యమున్ మన్మథో
త్కలనారంభము వాగ్విజృంభణము సత్కారుణ్యముం గల్గు వా

రలతోఁ బొంది తముం గణింప రనుచుం గ్రంథంబులం దట్లు వ్యా
కులులై వ్రాసినమార్గముల్ తలఁతురే కుంభిం (?) భుజంగాగ్రణుల్.
-(సకలకథాసారసంగ్రహము)

లోకములోనఁ గొంద ఱబలుల్ సతులం దనియింపలేక య
స్తోకమనీషు లన్యపురుషుల్ తమకాంతల నంటకుండఁ దా
టాకులలోన వ్రాసిరి పరాంగనఁ గూడినఁ బాపమంచు న
య్యాకులపాటు చూచి యిటు లాకులపా టెనయంగ నేటికిన్?
-(తారాశశాంకము)

ఇందుఁ బంచపాదియై శుద్ధతాళానుగామి గాక పొల్లుపదములతో నిండిన పుత్తేటిరామభద్రుని కవిత సంస్కరించి యర్థమెట్లిమిడింపవచ్చునో యాశిల్పము నుపదేశింపఁగాఁబోలు శేషము వేంకటపతి యర్థవంతమైన యమకముతో గ్రంథచౌర్య మొనర్చె.

అళిధమ్మిల్ల మృణాళహస్తఁ గమనీయావర్తనాభిన్ మహో
త్పలగంధిం గలహంసయాన విలసద్బంధూకరక్తోష్ఠ ను
త్పలనేత్రిం గమలాస్య నంగజరసాంభః పూరఁ దత్పార్వతీ
జలజావాసముఁ జొచ్చియాడక మనోజాతానలం బాఱునే?
-(నన్నెచోడుఁడు)

లలితాస్యాంబురుహంబు నీలకచరోలంబంబు నేత్రాసితో
త్పల ముచ్చైః స్తనకోక మోష్ఠవిలసద్బంధూక ముద్యత్కటీ
పులినం బుద్గతచిత్తజాతరసవాఃపూరంబు ప్రాణేశ్వరీ
జలజావాసము సొచ్చియాడక మనోజాతానలం బాఱునే?
-(తెనాలి రామకృష్ణకవి)

ఇందు రూపకమున విశేషణవిన్యాసక్రమమున దోషము సంఘటిల్లెననియు దానిని దొలగింపఁ గాఁబోలుఁ జోడనిపద్యము సంస్కరించి భావనోద్బోధిత సంవిచ్చమత్కార శూన్యుఁడగు తెనాలికవి యర్థచౌర్యము గావించె. రెండవ పద్యమునఁ జతుర్థ పాదమును మార్పకుండుట సమస్యాపూరణ కౌశలప్రకాశనము కాఁబోలు.

"ఏమి పరకవి పద్యపాదముల గ్రహించి పూరించివ్రాయు మర్యాదయుఁ గలదా? అది యర్థచౌర్యము కాదా?" పార్శ్వాభ్యుదయమున జినసేనుఁడును

నేమినిర్వాణమునఁ దత్కర్తయు మేఘసందేశ పద్యపాదముల గ్రహించి జైన తీర్థంకరచరిత్రముల కన్వయించునట్లు శేషపాదములఁ బూరించి యన్యమత గ్రంథపఠన మొల్లమియు మహాకవి ప్రతిభావైచిత్రి విడువఁజాలమియు హృద యమును వేధింప జైనకవిసార్వభౌము లీయుక్తి వన్ని యుండుట లోకమెఱుఁ గదా? అర్థమును రసభావములును హృదయోన్మీలితచిత్రసన్నివేశకల్పనయు భిన్నము లగుచుండఁ జౌర్యమెట్లగు?

ఈ యర్థాపహారము కవిత్వశిక్షాభ్యాసకాలమునఁ గాని రాజసభలలో విద్యావినోదకాలములలోఁ జమత్కారముగాఁ గాని సంఘటిల్లును. లేక భక్తి పారవశ్యముచేఁ గాళిదాసాది మహాకవు లొసంగు వాక్పుష్పములఁ దమయశః శరీరము లగు కావ్యబంధముల శేఖరములుగా నునిచికొని తీర్థప్రసాదమువలె గ్రహించి వారి నర్చింతురు. అట్టివి కేవలము చాటువులుగా నిలిచినచో క్షణకాల విస్మయ మాపాదించుఁగాని కావ్యనివేశితములైనచోఁ దప్పక తత్కవుల కనుత్ స్పాల్య శల్యభూతములై కీర్తిశరీరముల వేధించుచుండును.

జలజాక్షిమధ్యంబు సన్మార్గమని యెంచి
తరుణిదుర్మార్గంబు తలఁచ మఱచి
యతివముఖాబ్జంబు నకలంక మని యెంచి
యింతికలంకంబు నెంచ మఱచి
సుందరి చిఱునవ్వు శుచి యని మది నెంచి
నలివేణియశుచి దాఁ దెలియ మఱచి
శుభాంగిచనుఁగవ సువృత్త మని యెంచి [?]
భామదుర్వృత్తంబు పలుకమఱచి
కలికిశృంగారతతి యెంచి కాంత పరునిఁ
గలసి రమియించినట్టి సంగతులు మఱచి
గురునివంటి మహాత్ముండు గొనియె నతిని
అజ్ఞుఁ డనఁ బ్రాజ్ఞుఁడన నెవ్వ రరసిచూడ.

-(సకలకథాసంగ్రహము)

నకియకౌను దలంచి సన్మార్గ మనుఁగాని
యింతిదుర్మార్గత నెంచఁడయ్యె

చెలువచన్గవఁ దలంచి సువృత్త మనుఁగాని
తరుణికువృత్తంబు తలఁపఁడయ్యె
అతివమోము దలంచి యకలంక మనుఁగాని
తెఱవకళంకంబు తెలియఁడయ్యె
సుదతినవ్వు దలంచి శుచి యనుఁగాని య
వ్వెలఁదుక యశుచి భావింపఁడయ్యె
గురువువంటి మహాత్ముఁ డిక్కరణి తరుణి
చక్కఁదనమె గుణంబుగ సంస్మరించుఁ
గాని వ్యభిచారదోషంబు గాంచఁడయ్యె
నజ్ఞుఁ డనఁ బ్రాజ్ఞుఁ డన నెవ్వఁ డవని నింక.

-(కవిరాజమనోరంజనము)

ఇం దబ్బయామాత్యుఁడు పుత్తేటిరామభద్రుని పద్యములోని శబ్దార్థముల సంగ్రహించి నూతనపద్యము చేసి దానిఁ దన సుందరకావ్యముఖమునఁ బ్రసరణశీలమగు శ్వేతకుష్ఠబిందువువలె నెక్కించుకొనియె.

రాజసభలో వినోదముగాఁ బూర్వకవితకుఁ బ్రతికవనమెట్టి దన-
క్షిప్తో హస్తావలగ్నః ప్రసభ మభిహతో ప్యాదదానోఽంశుకాన్తం
గృహ్ణన్ కేశేష్వపాస్త శ్చరణనిపతితో నేక్షితః సమ్భ్రమేణ,
ఆలిఙ్గన్ యోఽవధూతస్త్రిపురయువతిభిః సాశ్రునేత్రోత్పలాభిః
కామీవార్ద్రాపరాధః స దహతు దురితం శామ్భవో వః శరాగ్నిః.

-(అమరుకము)

దీనికి మయూరుని పద్యము-

వస్త్రే గృహ్ణన్నిరస్తః సరభసవిధుతో హస్తమాలమ్బమానః
క్షిప్తః కేశాన్తలగ్నశ్చరణనిపతితః సమ్భ్రమోత్క్షిప్యమాణః,
ఆలిఙ్గన్ దైత్యనారీః పరవశముకుళార్ధేక్షణాః సాపరాధః
కామీవోమద్దామరాగో దిశతు పశుపతేః సాయకాగ్నిః శ్రియం వః.

ఇందుఁ బ్రణయకుపిత యగు ప్రేయసి యెడ నన్యస్త్రీ సంగమాద్యపరాధనిగృహీతుఁ డగుకామి యనునయవిధు లెట్లు సేయునో శివునిపాశుపతాస్త్రము వలని యగ్ని భీత లగు త్రిపురస్త్రీల డాయునప్పు డట్టిభావవిశేషము చూపఁ దొడఁగుచుండె నని భావము. మొత్తముమీఁద భావములు రెంటను సమా

నములే. సాశ్రునేత్రోత్పలాభిః యని కోపశాంతిని మయూరుఁడు పరవశముకు శార్దేక్షణాః యని యాలింగనసుఖపారవశ్యవర్ణనచే సూచించె. ఆర్ద్రాపరాధుఁ డనువిశేషణస్వారస్య మిం దుద్దామరాగుఁడగుకామి యని విశేషించి చెప్పుటచే నాయకుని యనునయవిధిప్రయోగమున భేదాంతరము సూచించినట్లగు. ఎట్లయి నను, రెండు శ్లోకములు చదువఁగా మయూరుఁ డమరుకుని భావము నతిచతుర ముగా గ్రహించె నని చెప్పఁదగు. కవితాభ్యాసకాలమునఁ బూర్వకవుల మనో హరపద్యముల మార్చి పుష్టిలేకున్న నట్లైయైన శబ్దవిన్యాసభేదమునఁ ద్రిప్పి రచించుట కవులకు శిక్షాపదము. రాజసభలలో వినోదము కిట్లు సేయుదు రంటిమి. ఇట్టివి కావ్యనిష్ఠితము లైనచో దూష్యములే. సంస్కృతమునం దిట్టియర్థాపహరణము దోషముగా గణింతురు.

> ఊర్ధ్వాంశుపాశే దిననాథబిమ్బే యాతోదయేఽస్తం వ్రజతీన్దుబిమ్బే,
> ధత్తేయ మద్రి ప్రవిలమ్బమాన ఘణ్టాద్వయాబద్ధగజేన్ద్రలీలామ్.
>
> -(జానకీహరణము)

> ఉదయతి వితతోర్ధ్వరశ్మిరజ్జౌ అహిమకరే హిమధామ్ని యాతి చాస్తమ్,
> వహతి గిరి రయం విలమ్బిఘణ్టాద్వయపరివారితవారణేన్ద్రలీలామ్.
>
> -మాఘము (IV-20)

కుమారదాసుఁడు మాఘునికంటెఁ బూర్వుఁడు కావున మాఘుఁడే పూర్వులయర్థము గ్రహించియుండును. కొందఱు " ఘంటామాఘుఁ "డను బిరుదము సంపాదింపఁ గల యీ శ్లోకము నపహరించి యుండఁడనియు దానిఁ బోల్చి యెవ్వఁడో పద్యము రచించి కుమారదాసుని కావ్యమునఁ బ్రక్షేపించె ననియు ననవచ్చును. ఈ పద్యమును స్మరించియె పెద్దన సూర్యచంద్ర బింబములు రెండు వ్యాయామ మొనర్చువారల సంతోలాలవలె నున్నవని వర్ణించె.

భాషాంతరమునుండి గ్రంథమంతయుఁ దెనిఁగించుట దోషమే కాదు. కొన్ని పద్యముల మాత్రము గ్రహించుకొనుట కవులకు న్యూనతయే.

శ్రీపర్వతపురాణము రచించుచు నసంబద్ధముగా శేషనారాధ్యుఁడు మురారి యనర్ఘరాఘవములోని శ్లోకమును దెనిఁగించి తన కృతిలోఁ జేర్చు కొనియె.

చేతఃశుక్తికయా నిపీయ శతశః శాస్త్రామృతాని క్రమా
ద్వ్యాసై రక్షరమూర్తిభిః సుకవినా ముక్తాఫలై ర్గుమ్ఫితాః,
ఉన్మీలత్కమనీయనాయకగుణ గ్రామోపసంవర్గణ
ప్రౌఢాలంకృతయో లుఠన్తి సుదృశాం కణ్ఠేషు హారస్రజః. (మురారి)

చేతశ్శుక్తికయందు నిల్పి కళలం జేకూర శాస్త్రోదక
వ్రాతం బక్షరమూర్తి మౌక్తికములై పర్థిల్లుడున్ సత్ప్రభా
ఖ్యాతోపేత గుణప్రయుక్తి సదనాలంకారహారాళిగా
రీతిం సత్కవి కూర్ప నేర్చును బుధశ్రేణీగళాగ్రంబునన్.
-(శ్రీ పర్వతపురాణము)

ఇందు "సుదృక్శ్రేణీగళాగ్రంబులన్" అని రచించి యున్నచో మూలా పహార మంతయపసారమై యుండదు.

శ్రీనాథాదులు కాళిదాస మయూరాదికవుల ప్రబంధములనుండి యతి విస్తరముగాఁ దెనిఁగించుకొనిరి. ఇది మహాకవులయెడఁ జూపిన భక్తివిశేష మందురు. అందు ననువాదమున ధ్వనితార్థము విశిష్టముగానున్నచో దోషము కాదని ధ్వనికారు లనుశాసించిరి. మేము దోషమని తలఁచినను బెద్దలయెదుట నోరు తెఱవ భీతిల్లెదము. క్రిందిజత చూడుఁడు—

ఓంకారో మదనద్విజస్య గగనక్రోడైక దంష్ట్రాంకురః
తారామౌక్తికశుక్తి రస్తతమస స్తంబేరమస్యాఙ్కుశః,
శృఙ్గారార్గళకుఞ్చికా విరహిణీ మర్మచ్ఛిదాకర్తరీ
సన్ధ్యావారవధూనఖక్షతిరియం చాన్ద్రీ కలా జృమ్భతే.

మన్మథ దివ్యాగమమున కోంకారంబు భూతేశుసౌదల పూవుదండ
అల్పశృంగార రేఖార్గళకుంచిక యంధతమోదంతి కంకుశంబు
విరహిణీజనమర్మవిచ్ఛేదకర్తరి యంబరక్రోడదంష్ట్రాంకురంబు
తారకామౌక్తికతతికి నంచితశుక్తి యమృతాంబునిధికి ముత్యాలజోగు
మారు పట్టాభిషేకాఖ్యవారికుంభి
చిత్తజుని కోటలగ్గదంచెనపుగుండు
నాఁగ నానాఁటి కభివృద్ధి నారుకొనిన
చంద్రుఁ డుదయించెఁ గాంతినిస్తంద్రుఁ డగుచు.

ఇందు మూలమునఁ దోఁచని చంద్రకలాక్రమపరివృద్ధి తెనుఁగుపద్యమున ధ్వనిత మగుచున్నది. మూలమునకంటెఁ దెనుఁగున స్వారస్య మెక్కు డగుటచే మిక్కిలి దుష్టము కాదందురు.

వ్యంగ్యార్థవిశిష్టము గాని ప్రతికవన మెందైనను దోషయుక్తమే. భోజుని శృంగారప్రకాశమున గ్రంథాంతమున-

యావన్మూర్ధ్ని హిమాంశుకన్దలవతీ స్వర్వాహినీ ధూర్జటేః
యావద్వక్షసి కౌస్తుభస్తబకితే పద్మా మురద్వేషిణః,
యావచ్చిత్తభువ స్త్రిలోకవిజయ ప్రౌఢం ధనుః కౌసుమం
భూయాత్తావ దియం కృతిః కృతధియాం కర్ణావతంసోత్పలమ్.

ఈ పద్యముతో గంగవంశానుచరితమున మంగళాంతస్మరణమును బోల్పఁదగు.

యావజ్జాగర్తి శంభోః శిరసి శశికలా చారుచూడామణిత్వే
లక్ష్మీర్వక్షోజకుమ్భే రచయతి మకరీం యాదవేన్ద్రోఽపి యావత్
యావత్కైఙ్కర్యకార్యే ఘటయతి తరుణాన్ కామినీనా మనఙ్గః
తావ ద్వాగ్వల్లరీ మే ప్రసరతు పరితో గఙ్గవంశావలమ్బా.

ఓడ్రకవికృతపద్యమున విష్ణురచిత మగు మకరికాపత్రావళి శృంగారరసానుభవ రసికత్వము ప్రకాశించినను యాదవేంద్రశబ్ద మనేకకల్పములఁ జూచు విష్ణువును గ్రహింపక యేకయుగావతీర్ణుఁడగు కృష్ణుని లక్ష్మీశబ్దముతో సహచరింపఁ జేయుట రసాపకర్ష మగునేమో. తృతీయచరణమునందు మన్మథవ్యాపార మవిశేషముగాఁ గామిజనుల ప్రేయసీవిధేయత్వము సూచించును. మాళవేశ్వరుఁడు త్రిలోకవిజయప్రౌఢముగా దాని వర్ణించెను. ఇట్లె గురుతరవాక్యార్థసౌందర్యము లేని మఱియొక పోలికం జూతము.

వదన ప్రభూతలావణ్యాంబు సంభూత
కలమలంబు లన వీనికన్ను లమరు
నిక్క పీనులతోడ నెక్కసక్కెము లాడు
కరణి నున్నవి వీనిఘనభుజములు
సంకల్పసంభవాస్థాన పీఠికవోలె
వెడఁదయై కనుపట్టు వీనియురము
ప్రతిఘటించి చిగుళ్ళపై నెట్టివాఱిన
రీతి నున్నవి దీనిమృదుపదములు

నేరెడుపేటియసల తెచ్చి నీరజాప్తు
సానఁబట్టిన రాపొడి చల్లి మెదిపి
పదను సుధ నిడి చేసెనో పద్మభవుఁడు
వీనిఁ గాకున్నఁ గలదె యీ మేనికాంతి.

అని సుప్రసిద్ధమగు కవిపితామహుని పద్యమును బాలకవితావస్థలో రామభద్రకవి సకలకథాసంగ్రహమున ననువదించుచు-

వదనసౌందర్య విస్ఫారాంబుసంజాత
కంజంబు లన వానికన్నుదోయి
మదన సామ్రాజ్యసమ్యక్పీఠిక యనంగ
నరసమౌ వానివక్షస్స్థలంబు
కర్ణకుండలరత్నకాంతులఁ గొననిక్క-
వగలు మీఱెడు వానియెగుభుజములు
అతులప్రవాళసంతతి రుచిసంపద
నదలింపఁ జను వాని మృదుపదములు

సింగముల భంగములఁ జెందఁజేయు నడుము
చందురునియందమును నొందఁజాలు నుదురు
వాని నువుపువ్వులను నవ్వునానికయును
గప్పుకప్పున నొప్పిన గొప్పశిఖయు.

అని నలమహారాజు సౌందర్యమును వర్ణించె. తాతగారి యెత్తుగీతిఁ బరిత్యజించి పురుషాంగవర్ణనోచితముగాఁ బరిహరించిన మధ్యఫాలాది వర్ణనములఁ బొందించి వృత్త్యనుప్రాసకౌశలము చూపినను రామభద్రుఁడు కావ్యశిల్పధర్మముఁ బాటింపఁడయ్యె.

కవితాపితామహునిపద్యమె మఱియొకఁడు ధ్వన్యర్థము కూర్చుటకు మాఱుగా మూలములోని ముఖ్యాంగమును ఛేదించి కాంచనోజ్జ్వలవిగ్రహమునకుఁ బ్రతిస్పర్ధిగా ముక్కుఁ జెవులు పెట్టని మట్టిబొమ్మను సృష్టించెను-

అంకము చేరి శైలతనయా స్తనదుగ్ధము లానువేళ బా
ల్యాంకవిచేష్టఁ దొండమున నవ్వలిచన్గబళింపఁబోయి యా

వంకఁ గుచంబు గాన కహివల్లభహారము గాంచి వే మృణా
ళాంకురశంక నంటెడు గజాస్యుని గొల్తు నభీష్టసిద్ధికిన్.
-(మనుచరిత్ర)

చెన్నూరు దేవాలయ శిలాశాసనపద్యములలో నొకటి-

పాయా ద్వోగణనాయకః పశుపతే రంకే చిరం సంస్థితో
వామార్ధాఙ్గవిరాజితాం గిరిసుతాం జ్ఞాత్వా నిజాం మాతరమ్,
తుణ్డాగ్రం ప్రవిసార్య సంస్మితముఖః పీత్వా స్తనం చాపరం
పాతుం ప్రీతమనాః స్తనం మృగయతే విఘ్నాన్తకః సర్వదా.

ఈ శాసనము కృష్ణరాయల రాజ్యకాలములో శా-శ-౧౪౪౬లో వ్రాయబడియె. అప్పటికి మనుచరిత్ర రచింపఁబడెనేని శాసనకవియే దాని గ్రహించి యుండు. మనుచరిత్రలో నంకితాంకపద్యములలోఁ గటకపురిని గ్రహించిన వృత్తాంత మున్నందున నది ౧౫౨౦కిఁ దరువాత రచింపఁబడియుండవచ్చును. లేక పెద్దనయే శాసనకవియై యుండెనేమో. ఎట్లయినను శిశువులు తమ కభీష్ట వస్తువు లభింపకున్నను సముజ్జ్వల మగు వస్త్వంతరము చూచిరేని నవత్యచాంచల్యముచే దానితోఁ గ్రీడించుచుఁ బూర్వవస్తువు మఱతు రను శైశవధర్మప్రతిపాదనము సంస్కృతకవి గాలికి విడిచివైచె.

ఇట్టి మూలమునకంటె రసలక్షీయ మగు శివకవి పద్యముఁ జూతము-

దైతేయమదవతీధమ్మిల్లములతోడ విరులనెత్తావికి పీడుకోలు
దనుజశుద్ధాంతకాంతాకటాక్షములతోఁ గలికికాటుకలకుఁ గానివాని
దానవమానినీస్తనకుంభములతోడఁ బసపుఁబయ్యెదలకుఁ బాయుతెరువు
దైత్యావరోధనదయితాధరములతో సొబగుపీడెములకుఁ జుక్క యెదురు

నేసి సురసుందరీకరోశీరతాల
వృంతచలితాంతకుంతలవిలసదింద్ర
కులవధూటీలలాటికాకుంకుమంబు
పదిలపఱుపఁ జక్రంబ నీభరమ కాదె.

అను సోమునిపద్యముతోఁ గొమ్మనరచన పోల్పఁదగు:

దైతేయకాంతలతఱుకుఁ గెమ్మోవుల
పీటికాశ్రీలకు పీడుకోలు
వేల్పుటిల్లాండ్రక్రొవ్విదపుఁజన్నుల మీఁది
యశవుఁబయ్యెదలకు నిలువునీడ

విశ్వజగత్త్రి యీ విజయలక్ష్మీగాథ
బిరుదోత్సవములకుఁ బెండ్లివిందు
పరిపంథివాహినీ పరిచితపరిభవ
ప్రాప్తిసంకథలకుఁ బాయుత్రోవ
సేసి యెయ్యది విలసిల్లుఁ జిత్రమహిమ
నది ప్రయోగింప నెత్తె నయ్యచ్యుతుండు
విలయసమయసముద్భూత విపులదహన
దారుణస్ఫూర్జనంబు సుదర్శనంబు.

ఈ రెండు చక్రాయుధ ప్రక్షేపవర్ణనములలో సోముని కులవధూమాంగల్య చిహ్నోల్లేఖము కొందఱు సుకుమారమతులకుఁ బునరుక్తిబంధురముగాఁ దోచునని కాఁబోలుఁ గొమ్మన నిపుణముగా నంశాంతరములఁ గూర్చినను నక్కవి యుత్తరార్ధము నీరసబంధగంధిల మని స్ఫురింపక మానదు. రసభావలోపమును యమకానుప్రాసములు తీర్పఁగలవా?

* సోమునిలలాటికాశబ్దమును లాలాటిక మని కొందఱు పండితాగ్రేసరులు దిద్దుచున్నారు. "లలాటికారుచులు గ్రాలన్" అన్న సోమునిపద్యపాదము నేల దిద్దరైరి? లలాటికయన లలాటపత్రమను నాభరణవిశేషము. "కర్ణలలాటాత్కనలఙ్కారే" యను సూత్రముచే లలాటికాశబ్దము సిద్ధించును. మఱియు లాలాటికశబ్దమునకు రూఢ్యర్థము వేఱు గలదు. "లాలాటికః ప్రభుచ్ఛందదర్శి కార్యాసమర్థయోః" అని కేశవుఁడు.

---

* నేఁటికాలమునఁ బండిత శిరోమణులు విచ్చలవిడిగాఁ దాము ముద్రించు ప్రాచీన కావ్యములఁ బ్రాచీన పదముల పోఁబడి నెఱుంగఁజాలక స్వమతానుసారము దిద్ది పరిష్కరించితి మని తృప్తి వెల్లడించుచున్నారు: పెక్కుచోట్ల సవరణలు వారి యజ్ఞానమును గ్రంథాంతరపరిశ్రమాలసత్వము నుద్ఘోషించుచున్నవి. అప్రస్తుతమైన నొక్క యుదాహరణము చూపెదము–

క్షయకాలంబున సింధుసాగరరసాస్వాదాతిరేకంబునన్
నయనాబ్జంబులు ఘూర్ణితంబులుగ సంధ్యాకాళరాత్రీకర
ద్వయతాళానుగతిప్రకారమున నవ్వారిన్ మహానృత్తమున్
బ్రియ మేపారఁగ నాడు భైరవుఁడు గల్పించున్ మహైశ్వర్యముల్.

ప్రాలేయాంశుమరీచినిర్మలతనూభాగంబు కృష్ణాజిన
వ్యాలోలామలయజ్ఞసూత్రములు నంసాసక్తవీణాలతా
లాలిత్యంబు లలాటికారుచులు గ్రాలన్ నారదుం డిచ్చలన్
గైలాసంబుననుండి వచ్చెఁ గలహైకస్వాంతుఁ డచ్చోటికిన్.

అన్న సోముని పద్యముతో

ప్రాలేయకిరణబింబస్ఫూర్తిఁ దలఁపించు
విశదంపుఁదనుకాంతి దిశలు ప్రాఁక
జిగి నిండ దొలఁకెడు చిగురుటాకుల సొంపు
పాటించు ఘనజటాభరము నెఱయఁ
గాంచనమౌంజీవికాసంబు గెడగూడి
చెలువు సూపుచు మృగాజినము దనరఁ
గమనీయకోమలకరపయోరుహమునఁ
బ్రకటితం బగు విపంచిక దలిర్ప
హరికథాలాపశోభిత మైనయట్టి
యాననంబు ప్రసన్నత నలరుచుండ
గగనముననుండి సమవర్తికడకు వచ్చె
నమరసంయమివరుఁడు విద్యాగురుండు.

అని కాశీఖండ పంచమాశ్వాసమున నొకపద్యము గలదు. మూఁడవచరణము తాళపత్రాదర్శములలో

"ద్వయతాళానుగతిప్రమోదమున మత్తల్లీ మహానృత్తముల్
ప్రియమొప్పారఁగఁ జేయు భైరవుఁడు" అను పాఠము కలదు.

ఇందులో మత్తల్లీశబ్దము నాంధ్రసంస్కృత మిశ్రసమాసముగా గ్రహించి "యవ్వారిన్" అని శ్రీనాథుని విశుద్ధకీర్తి యాంధ్ర సంస్కృత సమాసమువలె సకళంకము గాకుండునట్లు కరుణించి పరిష్కరించిరి. కాని మత్తల్లీనృత్త విశేషము మధ్య పూర్ణమదావస్థలలో వర్ణనీయ మనియు భైరవుని సంహార తాండవమున సప్తసాగర రసాస్వాద మధుమత్త చిత్తమున మత్తల్లీనృత్తచారీ ప్రచారములు సారస్వత సంసారసారములనియు నెఱుంగకుండుట శోచ్యముగా నున్నది. "అవ్వారిలో" జలక్రీడ సేసెనేని భైరవునకేని మధుమద మఁడగి చిత్తము సహజావస్థితి నెందును. ఇట్టి సంస్కరణములు కవిత్రయ సోమనాథాది మహాకవులగ్రంథములలో లెక్కలేక పడి భాషాదేవికి నన్నియు స్ఫోటకపిటక ములవలె నగపడుచున్నవి.

అని చిక్కన రచించిన సీసమును బోల్చిచూడ నది మౌక్తిక లడచి చక్కఁగాఁ గుట్టిన చర్మపుత్రికవలె నున్నది సోముని పద్యమునకు "కలహైక స్వాంత" పదము జీవకళ యొసంగుచున్నది. నానికేతకథలోఁ గలహము నకు స్థానము లేనందునఁ గవిదానిఁ దొలగించె.

౩. ఉభయాపహారమునకు నింతదనుక నుదాహరించిన పద్యములలోఁ గొన్ని లక్ష్యము లగుచున్నవి.

౪. ఛాయాపహారము— ఛాయ యన సౌందర్యము-పరకృతపద్యము నుండి సౌందర్యము గ్రహించి దాని వేఱువిధముగాఁ బొందించుట.

తంత్రీవినోదంబు తడవు సైపని వ్రేళ్ళు
గౌనయంబు తెగలపైఁ గోరి కనుట
యద్దంబుపిడి మట్ట నలయుపాణితలంబు
లస్త్రకం బిరియించులావు కలిమి
చెలికత్తె నొత్తిలి పిలువలేని యెలుంగు
సింహనాదంబుచేఁ జెదరకునికి
ప్రమదనర్తనకేళిఁ బలురమింపనిపదం
బైదుతాణంబుల నలఁతవడమి
సోయగపుఁ జిత్రరూపంబు చూచుచోట
వేసరువిలోచనంబులు వికృతదైత్య
లక్ష్య మీక్షించుటయు మొక్కలంపుఁదెంపు
గైకొనియె సత్యభామ సంగ్రామసీమ.

అరిఁ జూచున్ హరిఁ జూచుఁ జూచుకము ? లందందమందారకే
సరమాలామకరందబిందుసలిలస్యందంబు లందంబులై
తొరుగన్ బయ్యెదకొం గొకింత తొలఁగన్ దోడ్తో శరాసారమున్
దరహాసామృతపూరమున్ గురియుచుం దన్వంగి కేళీగతిన్.
సత్రాజిత్తనయాకరాంతరధనుర్జ్యారావ మైరావతీ
సూత్రానర్గళనిర్గతస్తనితమై సుత్రామచాపప్రభా
పాత్రభ్రూలతికావితానమున కొప్పం గప్ప శార్ఙ్గాంబుము
కృత్రిక్రూరమహాశనుల్ దనుజరాడ్గాత్రంబు గోత్రంబగున్

అనుసోముని నరకసత్యాయుద్ధ వర్ణనముతో బమ్మెరపోతనరాజు తత్కథా వర్ణనమునకే—

పరుఁజూచున్ వరుఁజూచు నొంప నలరింపన్ రోషరాగోదయా
విరతభ్రూకుటిమందహాసములతో వీరంబు శృంగారమున్
జరగన్ గన్నులఁ గెంపుసొంపు పరఁగం జండాస్త్రసందోహమున్
నరసాలోకసమూహమున్ నెరవుచుం జంద్రాస్య హేలాగతిన్.

వీణఁ జక్కఁగ బట్ట వెర వెఱుంగనికొమ్మ
బాణాసనం బెట్లు పట్టనేర్చె
మ్రాఁకునఁ దీగెఁ గూర్పంగ నేరనిలేమ
గుణము నేక్రియ ధనుఃకోటిఁ గూర్చె
సరవి ముత్యము గ్రువ్వఁజాలని యబల యే
నిపుణత సంధించె నిశితశరముఁ
జిలుకకుఁ బద్యంబు చెప్పనేరనితన్వి
యస్త్రిమస్త్రిము లెన్నఁ డభ్యసించెఁ
బలుకు మనినఁ బెక్కు పలుకని ముగుద యే
గతి నొనర్చె సింహగర్జనములు
ననఁగ మెఱసెఁ ద్రిజగదభిరామ గుణధామ
చారుసత్యభామ సత్యభామ.

రచించినపద్యభావము వా క్యార్థమున భేదముచూపినను సోమునికవనసౌందర్యము ఛాయారూపముగా నిందు గ్రహింపఁబడియె నని తెలుపును. ఇదియుఁ బ్రతిభావంతులగు కవుల కపయశఃప్రదమే. "భగవద్భక్తిరసావేశమున నంతరంగము ప్రాచీనకవిభావములతో నుపరంజితమై గాఢసంస్కారవశంబున శబ్దార్థములు పరస్పరము పాయలేక భంగ్యంతరముగాఁ బొంగిపొరలి నిరంతర నిరవధిక ధారాపరిస్యూతములుగా నవతరింప రసభావములతో నతిలోకసౌందర్యమును నిర్మించు పోతనాదులకు గ్రంథచౌర్య మెట్లారోపింతుము?"

సప్తమస్కంధమున రసవత్తరపద్యములలో నొకటియగు దీనిఁ జూతము—

మందారమకరందమాధుర్యమునఁ దేలు
మధుపంబు పోవునే మదనములకు

నిర్మలమందాకినీవీచికలఁ దూఁగు
రాయంచ చనునె తరంగిణులకు
లలితరసాలపల్లవఖాదియై చొక్కు
కోయిల సేరునే కుటజములకు
పూర్ణేందుచంద్రికాస్ఫురితచకోరక
మరుగునే సాంద్రనీహారములకు
నంబుజోదరదివ్యపాదారవింద
చింతనామృతపాన విశేషమత్త
చిత్తమేరీతి నితరంబు చేరనేర్చు
వినుతగుణశీల మాటలు వేయు నేల.

మఱియొకచోట-"చాతకం బేగునే చవుటిపడెకు" అనియు వర్ణంచె.

యుష్మత్ప్రణమనాఖ్యాన రసదుర్లలితం శిరః;
నాన్యప్రణమనే దేవ ధృతిం బధ్నాతి జాతు నః.

కిమమ్భోజరజఃపుఞ్జపిఞ్జరం వారి మానసే;
నిషేవ్య రాజహంసోఽయం రమతేఽన్యసరోజలే.

కిమప్సరఃశిరోజాన్తసుమనోగన్ధలాలితః;
తుమ్బీవనాన్తమభ్యేతి ప్రాణాన్తేఽపి మధువ్రతః.
ముక్తాఫలాచ్ఛ మాపీయ గగనామ్బు నవామ్బుదాత్;
శుష్యత్సరోఽమ్బు కిం వాఞ్ఛే దుదన్యన్నపి చాతకః
-(ఆదిపురాణము-౩౪-౧౦)

ఇందు జినసేన పోతనల జీవితకాల మెఱుంగనివారు తెలుగుఁ జూచి నంస్కృతము విశేషణ పరిపుష్టముగా రచింపఁబడియె నందురు. దీనిలో రేఖామాత్ర సాదృశ్యమే కలదు.

'అశికంబున నక్షిని దాఁచి' యవతరించిన యోసర్వజ్ఞసోమనాథా నీ కవిత లోని మేలిరత్నములను వాని చెక్కడపుఁబనియు నెల్లరు గ్రహించి రూపము మార్చి వెలతక్కువగా నమ్ముకొనుచుండ నూరకుండెద వేల? బిల్హణుఁడు కవుల కేమి బోధించెనో స్మరించెదవా?

'సాహిత్యపాథోనిధిమన్థనోత్థం
కర్ణామృతం రక్షత హేకవీన్ద్రాః,

యదస్య దైత్యా ఇవ లుణ్ఠనాయ
కావ్యార్థ చోరాః ప్రగుణీభవన్తి' అని.

"ఓరీ విమర్శకా, బిల్హణుని తదనంతరపద్యముఁ జదువుము."

గృహ్ణన్తు సర్వే యదివా యథేష్టం
నాస్తి క్షతిః కాపి కవీశ్వరాణామ్,
రత్నేషు లుప్తేషు బహుష్వమర్త్యై
రద్యాపి రత్నాకర ఏవ సిన్ధుః.

"వింటివా, ఎవ్వనియర్థసంచయ మర్థులు స్వేచ్ఛగా దోసిళ్ళఁ గొని యనుభవించి పరితృప్తు లగుదురో వానిజన్మజీవితములు ధన్యములు. ఎంత కాలము నా యల్పగ్రంథములోనివి యేవో కొన్ని పోలికలు మహాకవులు పరిగ్రహింతురో యంతకాలము నాకు యశోలోకములోని కవిగోష్ఠిలో స్థిరాసన ముండును. ముష్కరులగు తురుష్కలధాటీపరంపరచే దేశ మింగలాలగుంటయై క్షత్రలోకము శలభనిచయమువలెఁ గూలుచుండ సామాన్యలోకము తమ జీవ ధనం బగు దారపుత్రాదిబంధుజనంబునేని పరిత్యజించి పాఱిపోవుచుండ నిర్వికల్పక సమాధిస్థితునివలె బాహ్యప్రపంచము మఱచి పరమభాగవతులలో ఒకవ వాఁడని గణనకు రాఁదగినట్లు భగవత్స్తుతిధారాపాతమునఁ దన్నుఁ గడతేర్చు కొన్న పోతరాజు నేల పట్టి వేధించెదవు? ఆదిపురాణకర్తయగు జినసేనుని పదార్థచౌర్యధుర్యత నెఱుంగవా?"

ఓ మహాకవీ, దృష్టాంత మిమ్ము,

"చోరసూత్రకారా, మూలదేవుని యశస్సు నపహరింపఁగోరెదవా? మేల్కొనియె నిద్ర న భి న యి ం చె దు. జినసేనుఁడు వాల్మీకి వ్యాస కాళిదాస భారవి మాఘ శ్రీహర్ష దండి ప్రభృతుల యర్థ విశేషముల నెన్నెన్ని భంగులుగా గ్రహించి లలితమధురం బగు శబ్దవిన్యాసమున వాని నెంత సుందరముగాఁ బొదిగించెనో యెఱుఁగవా?

దండికృతావంతిసుందరిలో గజవర్ణనమునఁ గల నానా పర్వతనదీ విహారసంపత్తినెల్ల భరతుని సైన్యదిగ్విజయమున నెంతనిపుణముగా గ్రహించెనో చూచినాఁడవు కావా?

ద్వీపా దన్యస్మాదపి మధ్యాదపి జలనిధేర్దిశోఽప్యన్తాత్,
ఆనీయ ఝటితి ఘటయతి విధి రభిమత మభిముఖీభూతః.

అను రత్నావళి శ్లోకమును గ్రిందిదానితోఁ బోల్పుము:
ద్వీపాన్తరా ద్ధిశా మన్తా ద న్తరిపా దపాంనిధేః,
విధి ర్ఘటయతీష్టార్థ మానీయాస్వీవతాం గతః. ౧—౧౫-౨
మఱియు

శరదమ్బుధరచ్ఛాయా గత్వర్యో యౌవనశ్రియః,
ఆపాతరమ్యా విషయాః పర్యన్తపరితాపినః. భారవి—౧౧-౧౨
అను భారవిశ్లోకముతో జినసేనుని ప్రయోగద్వయముఁ బోల్పుము.
కో నామ స్పృహయే ద్ధీమాన్ భోగాన్ పర్యన్తతాపినః,
ఆపాతమాత్రరమ్యాణాం భోగానాం వశగః పుమాన్...౧౮-౧౧౧
అతఁడే మఱియొకచోట,

లక్ష్మీ స్తటిద్విలోలేయ మిత్వర్యో యౌవనశ్రియః
ఆపాతమాత్రరమ్యాశ్చ భోగాః పర్యన్తతాపినః.

ఇట్టివి మహాకవులవలన గ్రహించినను జినసేనుని శబ్దలాలిత్యము నర్థ సంఘటనాసామర్థ్యమును మిక్కిలి శ్లాఘనీయములు గావా? జినసేన పోతనలెన్ని స్వభావ జాతీయవర్ణన లెంతమనోహరముగా వేలకొలఁది వర్ణించిరి? నూతనార్థ సహస్రములతో నొండు ప్రాచీనకవిభావములు కలిసెనేని వానిచేఁ గొఱంత ఏమి?''

ఓ మహాకవీ, నీ వచనము విచిత్రము. చోరునిస్వత్వ మపహరించినను, మహాదాత యత్యల్పముగాఁ బరద్రవ్యాపహరణము చేసినను దోషంబుగా గణింపరాదని సూతనధర్మసూత్రకణికలు మను పరాశర యాజ్ఞవల్క్యాల మత మున కపవాదములుగా నున్నవి.

''ఓరి విమర్శకా, నీవు వ్యాసరచనాధికారవశమునఁ బలికెదు కాని సాదృశ్యమజ్ఞాతముగాఁ గూడఁ గలుగవచ్చును. గ్రంథచౌర్యదోషము కొన్ని యెడలఁ జాల మితముగాఁ బ్రసరించును. ఇక దీని సంక్షేపింపుము.''

ఇంక నొండు రెండు చరణములు గలవు. వానిఁ జెప్పి మంగళము పాడి కాలక్షేపము సంక్షేపించెద.

ఛాయాపహారమునకే—నన్నెచోడని వర్ణనము జక్కనయు కృష్ణకవియు నెట్లు గ్రహించిరో చూతము.

ఆకాశనది యని యనిమిషాంగన లెల్ల వేడుకతో జలక్రీడ సలుపఁ
బాలమున్నీ రని పంకజనాభుండు ఫణిశయ్య గావించి పవ్వళింపఁ
పాదరసం బని మోదించి సిద్ధులు మించి ఘటంబుల నించుకొనఁగ
నమృతంబునో నని యఖిలామరశ్రేణి చెలఁగి పానంబులు సేయుచుండ

వెల్లి విరియుచు నుబ్బుచు విశదకాంతిఁ
బొదలుచును దివ్య మగుచును భూరిమహిమ
నఖిలజీవుల కానంద మతిశయిల్ల
నచ్చవెన్నెల విమలమై వెచ్చు పెరిగె.

-(కృష్ణకవి)

దుగ్ధాంబునిధి నిట్ట దోచెనోయని శేషుఁ
బాన్పుగా హరి నీటఁ బవ్వళింప
నాదవి సుధారస ముప్పొంగెనో యని
దేవతల్ దనివోకఁ ద్రావఁదలఁపఁ
దొలఁకాడు మిన్నేఱు వెలివిరిసెనొ యని
లీలసురాంగన లోలలాడఁ
బాదరసం బుర్విఁ బరఁగెనో యని సిద్ధ
నికరంబు కలశముల్ నించికొనఁగఁ

బాండరాంగుండు విశ్వరూపంబు దాల్చి
యెలసెనో యని సద్భక్తు లెలమిఁ గొలువ
నఖిలజీవుల కానంద మతిశయిల్ల
నచ్చవెన్నెల విమలమైయలరి కాసె.

-(నన్నెచోఁడదు)

గంగాప్రవాహంబు గాఁబోలు నని వసిష్ఠాదు లనుష్ఠాన మాచరింప
నమృతంబువెల్లువ యని నిలింపాదులు మునుకొని దోసిళ్ళముంచి క్రోల
దుగ్ధాంబునిధి యని తోయజాక్షుఁడు శేషపర్యంక మిడుకొని వవ్వళింపఁ
బరమేశువిశ్వరూపంబని బ్రహ్మాదులమర దండప్రణామములు సేయఁ

దలఁప భూనభోంతరములకొలఁది దెలిసి
బెరసి యెన్మిదిదిక్కులఁ బొరలి పొరలి

దట్టముగ నంతకంతకుఁ దనరితనరి
యిట్టలంబున వెన్నెల నిట్టవొడిచె".
-జక్కనసాహసాంకము (VIII—57)

రేఖాపహరణమునకుఁ బోతనపద్య ముదాహరణ మయ్యెఁగదా. మఱి యును—

తమవాఁడిచూడ్కి కందర్పున కేవనులైన సాధించుదివ్యాస్త్రము లనఁగ
తమతీయఁబలుకులు ప్రమదరాగాంబుధిఁ దనరారుమవ్వంపుఁదరగ లనఁగ
తమవింతచెయ్వులు కమనీయకోమలశృంగారతరువులేఁజిగురు లనఁగ
తమముద్దునగవులు తమకంపుఁజీకటి నిగిడించు నరిదివెన్నెల లనంగఁ

జొక్కుమందు లనఁగ సోయగంబులగను
లనఁగ సుఖమునిక్క లనఁగఁ జాలి
యనుపమానమూర్తులై యుల్లసిల్లుదు
రంబుజాయతాక్షు లప్పురమున.

అనుశంభుదాసుని పద్యభావములోన రేఖామాత్రము గ్రహించినను క్రింది కొమ్మనపద్యము రమణీయతరముగా నున్నది (ఇందుఁజెయ్వులన హావభావాది శృంగార చేష్టలు).

తమవాఁడిచూపులు దర్పకుక్రొవ్వాఁడి తూపుల కొనపరిప్రాపు లగుచుఁ
దమపల్కు రీతులు దర్పకువిజయసద్గీతుల కలరుసజాతు లగుచుఁ
దమ మందహాసముల్ దర్పకుకీర్తివిలాసంబులకు నను ప్రాసములుగ
దమహావభావముల్ దర్పకులీలాప్రభావములకు మూలజీవములుగఁ

వఱలుశృంగారమంత్రదేవతలకరణి
నతిమనోహరమోహనాకృతులు గలిగి
శాంభవీసర్వసత్పరిచారసరణి
నెనఁగుచుండుదు రందుఁ బూర్ణేందుముఖులు.

ఇట్టిసాదృశ్యము ప్రాయశః ధ్వన్యర్థసహితమై కవుల ప్రతిభఁ జాటించి పరక్షేత్రమును దున్ని చక్కని యెరువువైచి దశగుణితముగా ఫలసంతతి ననుభవించు పురుషుని వ్యవహారకౌశలమునకుం బోలె వారికిఁ బ్రఖ్యాతిఁ దెచ్చును.

పదార్థహరణ మేరీతినైనఁ బూర్వుల యర్థము ఖండించుకొలఁ కనువ దించినను బరిహసింప దాని మార్చి రచించినను దోషంబుకానేరదు. తిక్కన భారతమున నెచ్చటనో శ్రుతిశాస్త్రింబులఁ జదివి విప్రుఁడు యజ్ఞము లొనర్చి స్వర్లోకమున దివ్యాంగనాసమాగమము పొందునను భావమును హరిభట్టు వరాహ పురాణమున నపహరించె. తిక్కన పద్యమును వేదవాక్యముగా నుదాహ రించిన శ్రోత్రియశిఖామణికి దానినే యించుక మార్చి శ్రీనాథుఁడు వాని నపహాస పత్తనముగా నొనర్చె. తిక్కన పద్యము లభింప నందున దానిఁ బోలినదాని నుదాహరించెద.

శ్రుతిపారంగతుఁడై సదక్షిణమఖస్తోమంబు వాటించి స
న్నుతపుణ్యుం డగు భూసురోత్తముఁడు నాకంబందుఁ బ్రాపించు నూ
ర్జితకల్పద్రుమమంజరీమధురమై రేయామృతాస్వాదగ
ర్వితగీర్వాణ వధూనితంబభరనీవీమోక్షసత్సౌఖ్యమున్.

-(హరిభట్టు—వరాహపురాణము)

ఈ భావము నుపహసించిన శ్రీ నాథుని కోలాహలము వినదము—

శ్రుతిశాస్త్రక్రియ లభ్యసించుకొని విప్రుం డర్థి నానాధ్వర
వ్రతుఁడై పోయి కనుం బురందరపురారామద్రుమానల్పక
ల్పతరుప్రాంతలతాకుడుంగసుఖలీలాసుప్తరంభా.......
............కలా పాండిత్య శౌండీర్యముల్.

అని చాటువు.

రేఖాపహారమునకే మఱియొక యుదాహరణము—

అమరులు త్రావుచో నమృత మందురు దీని నహివ్రజం బజ
స్రము గొని యానుచో నిది రసాయన మందురు భూసురౌఘ మా
గమనిధి సోమపాన మని కైకొని యానుదు రర్హణక్రియాం
గమునెడ వస్తు వందురిది కౌశికు లీ సుర పేర్మి వింతయే?

అమృతంబులో లేని యనురాగగుణ మిందుఁ
గల దని విబుధ యుగ్మములు గ్రోలఁ
జంద్రోదకం బింత చవి యగునే యని
సిద్ధకన్యకలు చేసేతఁ ద్రావ

వెలిరసాయన మింత వృష్యమే మీ కని
యచ్చరల్ విటులకు నందియీయ
సోమలతాసిద్ధిఁ జొక్కనే లందిట్టి
మఱపు గల్గునె యని మఖులు సొక్క

వేడ్క లెలరార నాడఖుల వీఁక దక్క
రతిపరిశ్రాంతమైన యౌవతము సెలఁగ
నిదియె సిద్ధౌషధము సద్య మిష్టదంబు
ననుచు సేవించి రోలి దివ్యాసవంబు.

(ఇందుఁ జంద్రోదకము సిద్ధతంత్రము లఁ బ్రసిద్ధమగు రసాయన విశేషము.)

ఈ రెండుపద్యములలో సురామహిమ వర్ణింపఁబడియె. క్షత్రియ కవి రాజ శిఖామణి వర్ణించిన యుల్లేఖములోని జీవకళ గ్రహించి విప్రకవివర్యుఁడు వ్యతిరేకాలంకార చమత్కృతి బంధురముగా మధుగోష్ఠి రచించినను రేఖాపహార మను విషచ్ఛాయ దివ్యాసవంబునఁ జంద్రకోత్పల రేఖావ్యాజంబునఁ బ్రతిఫలించి తదాస్వాదమదముదిత మాళవీ కనీనికానికాయచ్ఛాయల విచ్ఛాయం బయ్యుఁ గీర్త్యంగనకు మూర్చాప్రమోహంబులఁ గలిగింపకుండఁ జాలదు.

ప్రతిచ్ఛాయాకల్పనము—ఇది రేఖాపహారముకంటె హీనతరదోషమగును.

పదబంధంబుల నగ్గలించి బుధశబ్దభ్రాజియై సద్గుణా
స్పదమై దుష్కవిహృత్సరోజవనముల్ భంజింపుచున్ భూరిస
మ్మదలీలన్ విలసిల్లి సత్కృతి జగన్మాన్యప్రభావంబునన్
మదనాగంబునుబోలెఁ గ్రాలవలదా మాఱెందు లేకున్నతిన్.

-(నన్నెచోడఁడు)

పదలాలిత్యము వర్ణశుద్ధియును శబ్దస్థైర్యమున్ మంగళా
స్పదభావంబును రాజయోగ్యతయు దోషస్ఫూర్తిరాహిత్యమున్
సదలంకారవిశేషముంగలిగి విశ్వప్రాణసౌభాగ్యసం
పదమై తేజియుఁబోలెఁ గ్రాలవలదా పద్యంబు హృద్యస్థితిన్.

-(పెద్దపాటి సోమనాథుఁడు)

ఈ రెంటిలోఁ దాత్పర్యము భేదించినను బూర్వపద్యమును స్మరించి సోమనాథుడు నూతనకల్పన సేసెనని తోచును.

ఇంతదనుకఁ గొన్ని చౌర్యచ్ఛాయలుఁ బేర్కొంటిమి. వానిలో నవాంతర భేదములను మరికొన్నివిభాగములను సూక్ష్మబుద్ధులు స్వయముగా నుత్ప్రే క్షించు కొందురుగాక.

కథాశరీరసంవిధానమున రసవత్ప్రకరణములను వర్ణనాగుంభనములను బైచ్ఛాయల సంమిశ్రము చేసి విచిత్రగ్రథనమున నద్భుతప్రబంధమో ప్రక రణమో వర్ణనమో కల్పింపవచ్చు. అప్పుడును దూష్యములు కానిపోకలు గ్రహింపకున్నఁ గవి యవహేళనకు భాజనం బగు.

ఒక కావ్యములోని ప్రకరణ మంతయు గ్రహించి స్వకల్పితముగాఁ బ్రక టించుట కొక యుదాహరణమిత్తము. తంజాపురి రఘునాథుని దేవేరులలో నొకతెయగు రామభద్రాంబ తద్రాజవిజయచరిత్రమును వర్ణించుచుఁ బంద్రెం డవ సర్గలోఁ జాలభాగము శైవతంత్రమున సామ్రాజ్యలక్ష్మీపీఠిక యనుగ్రంథ ములోనుండి యర్థమును గ్రమముగా గ్రహించి సర్గముఁ బూరించె. ఇదిగ్రంథ చౌర్యమగునో కాదో పండితులు నిర్ధారింపఁదగు. మహారాజకరగ్రహణ ప్రభావముచే నవరోధకాంతయయ్యు సభలలో సమస్యాపూరణములు సేసి కనకాభి షేకము సేయించుకొనెఁ గావునఁ జౌర్యదోషమునకామె యవరోధమవరోధము గానేరదు. లేక యవరోధమే యయ్యెనా!

మూలమును ఛాయయు సంస్కృతములోనున్నను దాని మన యంధ్ర వనితా ప్రాగల్భ్యవిలసనం బగుటచే మనము విని యానందింప నర్హులము.

రఘునాథాభ్యుదయము—

అథ లాస్యకలావలోకనేచ్ఛో రవనీనేతు రపాఙ్గసంజ్ఞయైవ;
చతురాః సముపేత్య నాట్యశాలాం సహసాకుర్వత సజ్జితార్హకృత్యమ్.
మహార్హ ముక్తామణి క్లప్తమాలికా వితానసంవీతవితానలక్షితామ్,
సమగ్రకాలాగురుధూపసంజనాం మనోజ్ఞనానామణి జాల జాలికామ్.
దలత్ప్రసూనాఙ్కితదామసౌరభీ మిలన్మిలిన్దారవమేదురోదరామ్,
సలీలలాస్యక్రమచఙ్క్రమోచిత ప్రక్లప్తకర్పూరపరాగభాసురామ్.
విరచితసమయానుకూలవేషః సవిధలసత్సవయః సుధీసహస్రః;

సరసిజనయనాశతైః సమేతో నరపతిమౌళి రగా త్స నాట్యశాలామ్.
సతత్ర నానావిధసంవిధాన మనోహరాయాం మదనావతారః,
అధ్యాస్త భద్రాసన మక్షిజాతాం విలోకనానాం సఫలం వితన్వన్.
కాశ్మీరకామ్బోజకరూశకాశ గాన్ధారకర్ణాటకలిఙ్గవఙ్గాః,
అవన్తికున్త్యాన్ధ్రవిదర్భగౌళ వఙ్గాలనేపాలకబాహ్లికాఙ్గాః.
మత్స్యల్లమత్స్యమరహాట సురాష్ట్ర లాట
తుండీర చేరకురు కేరళపాండ్యభోటాః,
సింధుత్రిగర్తశక సింహల పారసీక
సౌవీరమాలవ వరాటధరాధినాథాః.

కవికోవిదవన్దిగాయకాద్యాః రసికాస్తే రఘునాథపార్థివేంద్రోః;
అవలోకనసంజ్ఞయావనమ్రాన్యవిశన్నాత్ర నిజోచితస్థలేషు.
అథ తాలధరాఙ్గనాదిభిః సముపేతా వనసాలభఞ్జికాః,
సమ మారచయన్ జనేశితుః సవిధే వంశవిధాదిచాతురీమ్.
మదవతీవలయారవమాంసలా ముఖరమర్దలమోహననిస్వనా
అతనుతాగరుధూపపరమ్పరా ఘనఘనాఘనగర్జితనాటికామ్.
అథ యథోచితహాటకకల్పనాం ప్రభుమణేః పురతః ప్రతిసీరికామ్,
ఆవహతామరవిస్ఫవిలోచనే కరవలన్మణికఙ్కణనిక్వణమ్.
ప్రథమం ప్రతిసీరికాన్తరాళే నరనాథాయ నటీప్రవేశలీలామ్,
అవదన్ బిరుదాఙ్కవాద్యనాదైర్మణిపాదాఙ్గద మఞ్జుశిఞ్జితాని.
అథాహృతాయాం ప్రతిసీరికాయా మాలక్ష్యమాణా హరిణాయతాక్షీ,
సాన్ద్రప్రభాసంశ్లథనేన సద్యః సాక్షాత్కృతేవాజని చన్ద్రరేఖా.*
మనోజ్ఞముక్తామణికఙ్కణప్రభాభరేణ సాకం ప్రసవాఞ్జలిం పురః,
అదాత్తాదా నాట్యకలాధిదేవతాం మనోహరా రూపవతీవ మానినీ.
విలోకనాదేవ విభోర్విశిష్యవిలాసినీ సంభృతవిభ్రమా హ్యభూత్,
వసన్తసాన్నిధ్యవశా దతీవ మనోహరా మాధవికా లతేవ.

*రఘునాథుని యాస్థానమున చంద్రరేఖ, రూపవతి యను నాటకీయకన్యలు ప్రగల్భలుండిరి.

''బిరుదుపాత్రలు విజృంభించి యారాజవరుని ముందఱ నిల్వ వారిలోపలను పదచాళి గొనియె రూపవతీవధూటి గొదలేక పేరణి గొనెఁ జంద్రరేఖ

విభుమణే రథ వీక్షణసంజ్ఞయా విధుముఖీ సమయోచితవిభ్రమాన్,
అభినయా నతివిస్మయనోచితాన్ బహువిధం ప్రకటీకురుతే స్మ సా.
అథ రమ్యతరై †ర్నిజాంగహారై రపినాట్యక్రమవేదితాత్మభావైః,
హృదయే రుచి మేధితా మతానీన్మదిరాక్షీ రఘునాథమన్మథస్య.
కులేన రూపేణ గుణేన విద్యయా పరస్పరం సామ్యయుజః పరశ్శతాః,
అనర్తిషుర్నృష్టిముఖై రణూదరారయా దహంపూర్వికయా రసోత్తరమ్.
అపాఙ్గశోభాతిశయే పయోదవ ద్విజృమ్భమాణే సతి భూవిభో స్తదా,
విలోలసల్లాస్యవిలాసలక్షితా మయూరికేవాజని మానినీతరా.
చచ్చత్పుటాద్యై ‡ర్నృపతేః సమీపే భవాస్యజాతైర్నటనప్రపఞ్చమ్,
ప్రావఞ్చయత్పఞ్చవిధైః సలీలం మృగేక్షణా కాచన మార్గతాళైః.
జయమఙ్గలసింహలీలలీలా జయనిఃసారుకచర్చరీత్రిభిన్నైః,
రతిలీలతురఙ్గలీలరఙ్గాభరణానఙ్గహరిక్రమాదితాళైః.
హరినన్దననన్దినన్దనాద్యై రపి నూలాదిభిరన్యకైశ్చ తాళైః
నానామణీఘటితహాటక నాట్యశాలా
పర్యన్తయన్త్రితచలత్ప్రతిమానమూహైః
ఆపాదితేవ నివహై రమరాఙ్గనానాం
విద్యోతతే స్మ పురతో నవపుష్పవృష్టిః.
అభినయనరసానురూపమారాన్ముఖరముఖేషు ముదా సభాజనేషు,
అతులితకనకాభిషేకముఖ్యైః సపది వధూః సమభావయన్మహీందుః.

---

మిక్కిలి కోపుల మెఱవడిఁ జూపి జక్కిణి వినిపించె శశిరేఖ యపుడు.''

-విజయరాఘవుని రఘునాథాభ్యుదయము.

ఇందు పదచాళి, పేరణి, కోపులు, జక్కిణిశబ్దములు నృత్యశాస్త్రమునఁ బారిభాషికపదములు. పెద్దకోమటి వేమన గుఱించి వ్రాయునపుడు వీనిలక్షణము వివరించెదము.

మఱియు

వీరవేంకటరాయ పృథ్వీమహేంద్రదత్త బహువిధబిరుదముల్ దనరుచుండ
సముఖమున నిల్చి యా ముద్దుచంద్రరేఖ వివిధవిద్యలు వినిపించె వింత యనఁగ.

-(రఘునాథాభ్యుదయము)

† అంగహారములు నృత్తవిశేషములు (అర్థాన్తరము)

‡ చచ్చత్పుటాది పంచతాళముల మార్గతాళములందురు.

బుధచారణ వన్దిపూర్వ్యకాణా మభిషేకద్రవిణం యథార్థ మేవ,
బహుధా రఘునాథ పార్థివోఽదాన్ని జవిశ్రాణన నిర్జితేన్ద్రశాఖీ.

సామ్రాజ్యలక్ష్మీపీఠికా

సామ్రాజ్యలక్ష్మ్యాః స్థైర్యార్థం సర్వసౌభాగ్యసిద్ధయే,
పశ్యేల్లాస్యకలాం రమ్యాం నటీభిరభిసూచితామ్.
ఆలోకకాశ్చర్యకరీం మనోనయననన్దినీమ్,
దివ్యమాల్యామ్బరధరో దివ్యాభరణభూషితః.
నాట్యశాలాం సమాసాద్య
విశాలాం స్వాయతాం శుభామ్,
అత్యున్నతాం సమతలాం
సువితానాం సుతోరణామ్.
కాలాగురురజఃక్లృప్త ధూపగన్ధ మనోహరామ్,
సుమనో దామసౌరభ్య భ్రమద్భ్రమరసంకులామ్.
సింహాసనే సమారూఢః శ్వేతచ్ఛత్రేణచారుణా,
అఙ్గవఙ్గకలిఙ్గాన్ధ్ర చోళనేపాళమాళవాన్.
పాణ్డ్యసౌవీర సౌరాష్ట్రాన్నృపానన్యాంశ్చ పార్థివాన్,
ఆహ్వాయయిత్వా పురుషై ర్వేత్రహస్తైః ససమ్భ్రమమ్.
అపాఙ్గసంజ్ఞయా సర్వా నాసనే షూపవేశ్యతాన్,
ఉపవిశ్యోచితస్థానే ష్వవలోకన సంజ్ఞయా,
లాస్యావలోకనపరో భవేద్భూమిపురన్దరః.
అథలాస్యాలోకనేచ్ఛోర్నృపస్యాపాఙ్గసంజ్ఞయా,
పురుషైర్నాట్యశాలాయాం సంజ్ఞితాయాంతు కైశ్చన.
సహతాళధరస్త్రీభిః కాశ్చిత్కమలలోచనాః,
వంశాదిధ్మానచాతుర్యం కలయన్తి నృపాగ్రతః,
పునః కాశ్చన కామిన్యః కఙ్కణస్వనమాంసలాన్,
రచయన్తి ప్రభో స్తస్య పురస్తాన్మర్దళస్వనాన్.
కాంచిద్యవనికాం బధ్వాద్వేతు కాఞ్చన చిత్రితామ్,
పురస్తాద్రాజసింహస్య వహతో ఽతిమనోహరే.
తతో బిరుదవాద్యానాం నిస్వనోఽతి మనోహరః,

ప్రభవేత్ప్రథమే పాత్రప్రాగల్భ్యం కథయన్నివ,
తత్పరం ప్రతిసీరాన్తర్మఞ్జుమఞ్జీరనిస్వనాః,
ప్రభవన్తి ప్రశంసన్త ఇవ పాత్రప్రవేశనమ్.
తత్పరం ప్రతిసీరాయా మాహృతాయాంతు కాచన,
దృశ్యతే చన్ద్రలేఖేవ విశ్లిష్టా సన్ధ్యయా నటీ.
అథ సా నాట్యవిద్యాధిదేవతాయై పురో భువి,
కఙ్కణప్రభయా సాకం దదాతి కుసుమాఞ్జలిమ్.
తతోఽవలోకనాత్తస్య సా భవేదతివిభ్రమా,
లతావసన్తసాన్నిధ్యా దతిరమ్యేవ మాధవీ.
తతస్తస్యాపాఙ్గసంజ్ఞా ప్రేరితా సా నటీ ప్రభోః,
స్ఫుటీకరోత్యభినయా నతివిస్మయదాయినః.
అథ నాట్యోచితైరఙ్గహారైః సా నర్తకీ పునః,
తతః పరశ్శతా వధ్వః రూపవిద్యాగుణైః సమాః.
నటన్తి దేశీముఖ్యాద్యై రహంపూర్వికయాదరాత్,
మయూరీవ లసల్లాస్యా కాచిద్భవతి లాసికా.
కార్యం పఞ్చవిధైర్మార్గతాళైః కైశ్చిద్వధూజనైః,
జయమఙ్గలతాళేన సింహలీలాభిధేన చ.
లీలాజయాఖ్యతాలేన రతిలీలాహ్వయేన చ,
తురఙ్గలీలాభిఖ్యేన రఙ్గాభరణకేన చ.
నన్దినన్దనతాళాద్యైః కర్తవ్యం నటనం ప్రియే,
తతస్తల్లాస్యశాలాయా ఊర్ధ్వభాగప్రకల్పితైః.
ప్రతిమానివహైర్నాట్య కలాం ద్రష్టుమిహాగతైః,
త్రిదివాప్సరసాంసఙ్ఘై రివ మఞ్జులమూర్తిభిః.
ఆప్లావయేత్పుష్పవృష్టి మవనీపతి మాదరాత్,
నటీనాం కారయేద్రాజా కనకేనాభిషేచనమ్.
తతోఽభిషేచనద్రవ్యం కవిగాయకవన్దినామ్,
దత్త్వా గన్ధాదికంచాపి పునః ప్రస్థాప్యతాన్ ప్రియే,
నటీభిః సహ శుద్ధాన్తం ప్రవిశేద్భూపురన్దరః.
ఇతిశ్రీ మచ్ఛైవతంత్రే సామ్రాజ్యపీఠికాయాం...అశీతితమః పటలః.

ఈ రెంటిలోను ప్రకరణవర్ణనము సమాన మగుటయె కాక పెక్కు సమాన విశేషణములు గలసి యున్నవి. ఒకటిఁ జూచి మఱొకటి గూర్పఁబడియె ననుటలో సంశయము లేదు. ఏది మొదటిది యేది రెండవదన్న విషయములోనే సందియము. రఘునాథాభ్యుదయములోఁ దక్కిన సర్గములు మేము నిపుణముగాఁ బరీక్షింపమైతిమి. సామ్రాజ్యపీఠిక తంజాపుర గ్రంథభండారముననె కలదుగాని బహుదేశముల వేలకొలఁది లిఖితగ్రంథములఁ బరీక్షించితిమిగాని మాకీ తంత్ర మన్యత్రదృష్టి గోచరము గాదయ్యె. ఇతరత్రలభింప వచ్చునేమో ? అది యేకాలమున రచింపఁబడెనో యెఱుంగుటకు లబ్ధమాతృకలలోఁ బ్రమాణము గానరాదు. రాజచర్యల వర్ణించు నీ గ్రంథము రఘునాథుని కాలముననే యెవ్వఁడైన రచించియున్నచో నతఁడే రామభద్రాంబ పేర రఘునాథాభ్యుదయము సైతము రచించియుండవచ్చును. లేకున్న రామభద్రాంబయే శుద్ధాంతస్త్రైణ వ్యాపారము విడిచి తంత్రగ్రంథము కూర్చెనో యనియుఁ గొందఱు సందేహింప వచ్చు. రామభద్రకు విద్యాకవితల నేర్పిన కవి కాళన యను నంధ్రబ్రాహ్మణుఁడు. రఘునాథుని పుత్రుఁడు విజయరాఘవభూపతి కాళనకవిగూర్చి—

ఘటికాశతగ్రంథఘటనోత్కట నవీన పాండిత్యగరిమలు భళియనంగ,
నోష్ఠ్య నిరోష్ఠ్యాదికోద్దామ రసగర్భ సందర్భమౌనని సన్నుతింప,
మాకంద మంజరీ మధుఝరీమాధుర్య రచనావిశేష మౌరాయనంగఁ,
బరిహృతేతర యుక్తిభాగ నూతన కథాచాతుర్య ధుర్యత సన్నుతింప,
నయ్య దినముల రామభద్రమ్మవారు, నేఁడు కృష్ణాజి కవితల నేర్పు
మెఱసి, వినికిసేయుట లెల్ల మీ ఘనతగాదె, కవివినుతచర్య చెంగల్వ
కాళనార్య. —రాజగోపాలవిలాసము. ఆ-౧.

అని యామె విద్యాగురువుగాని లేక వేఱొక శైవతంత్రజ్ఞుఁడుగాని రెండు గ్రంథములును రచించెనేమో. ఏల యనఁగా నింతవిస్తరముగా రామభద్రాంబ తక్కిన పదునొకొండు సర్గలు రచియింపఁగలిగి యిక్కడ నింత కక్కుఱితి పడునా ? లేక నిరర్గళధారాపాతముగా సుందరపదపంక్తితోఁ బురాణశైలితో శైవతంత్రము రచించినకర్త సిగ్గులేక స్త్రీయర్థము హరించునా యను విస్మయము కలుగుచున్నది. ఈ యంశ మింకను బండితపరిశోధ్యమే యగును.

"పండిపెద్ది కృష్ణస్వామయ్యగారు సింగరార్యుని బిల్హణీయమును దన రచితముగాఁ బ్రచురించె. రంగాజికృతమగు నానందసుందరీచాతుర్యవిలాస

మును సుందరి తనకావ్యముగాఁ బేరుమాత్రము మార్చి వెల్లడించె. ఇవి గ్రంథ చౌర్యవిభాగములలో నెందులఁజేరును ?"

కొంతశక్తిగలిగి స్వకల్పనములనడుమ నితరుల పదార్థము గ్రహించు వారి కృత్యమే యింతవఱకు లక్షణ లక్ష్యములతో వర్ణించితిమి కాని సర్వస్వ హరణము చేయువారు కవులనికాని వారు కవిగోష్ఠిలో నర్హులనికాని యెవ్వరుఁ దలఁపరు. వారి విమర్శించి లక్ష్యభూతులం జేయుట యధర్మము. ప్రాచీన కవిత్వమార్గముల నుపేక్షించి నవనాగరకతానుసారము కేవలము భావములతో ననంతవర్త్మ మగు కవితాకాశమున విహంగమార్గముల గంధర్వనగర నిర్మాణములు సేయువారల కెన్నఁడును గ్రంథచౌర్యదోషము రానేరదు.

భారతి, మా. రామకృష్ణకవి
ధాత-పుష్యము

# 9. సంగీతరత్నాకర వ్యాఖ్యలు

సంగీతరత్నాకర మనునది సంగీత భరతశాస్త్రముల లక్షణముల నిరూపించు ప్రకరణ గ్రంథము. దేవగిరి రాజధానిగా మహారాష్ట్రాంధ్ర దేశభాగములఁ బ్రౌఢప్రతాపముతోఁ బరిపాలించిన సేవుణ రాజులలో ముఖ్యుఁడగు సింగణ భూపాలుని యాస్థాన మలంకరించిన శార్ఙ్గదేవుడు ప్రాచీన గ్రంథజాలముల విషయవిమర్శనము సేసి భరతమత వ్యాఖ్యాతల సిద్ధాంతభేదముల మర్మము గ్రహించి నిర్బాధక మగు మతమును స్వీకరించి సంగీతశాస్త్రము దుర్గ్రాహ విపులవిషయికమైనను సంక్షేపరూపముగా సంగీతరత్నాకరమను పేర నిబంధరూపముగా రచించెను. శార్ఙ్గదేవుడు కాశ్మీరదేశీయుఁడగు సోఢలుని తనయుఁడు. అతఁడును సింగణుని తండ్రి యగు భిల్లముని కాలముననే కాశ్మీరము నుండి మహారాష్ట్రమునకు దరలివచ్చెను. క్రీ. శ. 7 వ శతాబ్ది మొదలు 12 వ శతాబ్ది తుదివరకు, కాశ్మీరము సరస్వతీపీఠమను నామము నన్వర్థము సేసికొనుచు సకలశాస్త్రములలో నుత్తీర్ణులగు కవుల చేతను, శాస్త్రజ్ఞులచేతను బ్రఖ్యాతివహించియు క్షీణగతి చెందఁగా 12, 13 వ శతాబ్దుల తద్దేశ పండితులు దేశాంతరముల విద్వత్పక్షపాతులగు నరనాథుల సభాంతరంబుల విద్యాచాతుర్యములఁ జూపుచుఁ గాలము పుచ్చుచుండిరి సోఢల శార్ఙ్గదేవులట్టివారే. సోఢలుడు భిల్లముని యొద్ద రాజవ్యవహారభారము సైతము వహించియుండెనని యూహింపవలసి యున్నది.

రత్నాకరమున స్వర, రాగ, ప్రకీర్ణ, ప్రబంధ, తాళ, వాద్య, నృత్య ప్రకరణము లేడును యథోచిత విస్తరముగాఁ బ్రపంచింపఁబడియె. భరత కోహ శాది మహర్షి ప్రణీత శాస్త్రములలో విషయ మతివిపులమై కపిల కణాద జైమిన్యాది దర్శనకారుల పారిభాషికపదములతో నిబిడమై వింధ్యారణ్యగహనముఁ బోలె శ్రోత్ర రమణీయమై హృదయాకర్షమువలె దోచినను దుష్ప్రవేశ దుర్బోధ మగుచుండును. వానిలో స్వర రాగాది వస్తు విభాగములలో సహితము న్యూనాధికవిచారముచే గ్రంథాంతర పరీక్షాపేక్షకలుగుచుండును. అల్పకాలములో విషయమును సమగ్రముగా స్థూలరూపముగా నైన నెఱుఁగఁ గోరు వార

లకు దోషహీనమై గుణాధికమై నాతి విస్తృత నాతిసంక్షిప్త విషయ విభాగక మగు గ్రంథమే శరణ్యమగును. అట్టిది ప్రాయశః సూత్రరూపమై పూర్వపక్ష ఖండన వాక్యసందృబ్ధము కాక కేవల సిద్ధాంతజాలముతో నిండి పాఠకులకు బరామర్శ క్లేశము గలిగించుచు నచ్చటచ్చట లౌకికార్థమా, లేక శాస్త్ర సంకేతితార్థమా యను సందేహము పుట్టించు పదప్రయోగముచే వాదాపరి వాదాస్పదమై వ్యాఖ్యానాపేక్షమగుచుండును. ఇట్టివి నూతన నిబంధములు పుట్టుటచే నతివిస్తరములగు మహర్షి ప్రణీత పూర్వగ్రంథములు రాజసంరక్షణము లేకుంటను, పాఠకులు బుద్ధిపరిక్లేశము నోర్వఁజాలక సారమునే వెదకి తల్లబ్ధిచే గృతార్థంమన్యులగుట చేతను క్షణభంగురమగు తాళపత్రాది లేఖన సామగ్రి క్షీణించుచోఁ దద్విన్యస్తమగు వర్ణసముదాయము స్థలాంతరమునకు మార్పమిచేతను, గొన్నియెడల బేరులేకయుఁ, గొన్ని చోటులఁ గేవలనామావశిష్టములై యితరత్ర పూర్వోత్తర సంబంధ భ్రష్టములగు వాక్యభాగములతోడను గ్రిమికీట దిగ్ధములై శోచ్యదశా విదగ్ధములగుచున్నవి.

ఇట్టి స్థితితో సర్వతంత్ర స్వతంత్ర నిశ్శంకగామి యగు మహర్షుల యాశయము మఱుగుపడుటచేఁ గేవల పాశ్చాత్య బుద్ధి పరిశ్రమసాధితాంశముల మెచ్చుకొనువారు ప్రకరణగ్రంథములే మూలగ్రంథములని భ్రమించి మన మహర్షుల కేకదేశవిషయవిచారప్రవృత్తియు ననాగరికతాదోషాపత్తియు నారోపించుచుండుట యచ్చెరువు కానేరదు.

రత్నాకరము ప్రకరణగ్రంథమగుచు సంక్షిప్తమతసార మగుటచే నందును గొన్ని యెడల సందిగ్ధాంశములు కలవు. అవి కాలక్రమమున సంగీత మనుష్ఠాన ప్రధానమై గురుపర్వక్రమావతరణశరణంబగుటచే దురవగాహము లయ్యె. కావుననే కుంభకర్ణుఁడు సంగీతరాజమునఁ గిన్నరీవాదన ప్రకరణమున రత్నాకరకారుని రాగలక్షణము ననువదించుచు-

రాగాలపన మత్రాహుః కేచిత్పండితమానినః
శార్ఙ్గ దేవాదయస్తేషాం మతం న మమ సంమతమ్
యత్రదత్నాకరకారేణ మన్ద్రే మారభ్య వర్ణితమ్
రాగాలపన మేతాన్మేర క్తి హానేర్న సంమతమ్
తాసాత్సర్వేషురాశేషు మధ్యస్థం కంచనస్వరామ్
స్థాయినా పరికల్ప్యేష్టం రాగాలపన మారభేత్

తస్మాన్మహోపభావానా మేషామేషా పరాస్థితేః
లాలాయితస్య సాసై వాస్మదాదీనా మిహాస్పదమ్
విచారస్యతతోఒస్మాకం తద్గురుభ్యో నమః సదా.

అని శార్ఙ్గదేవ మతంగుల మధ్యమాదిరాగముల స్థాయివర్ణ గ్రహ లక్షణము నాక్షేపించె. తంజాపురి రఘునాథుఁడును దన సంగీతసుధలో "శ్రీశార్ఙ్గదేవేన కృతాంచ సప్తాధ్యాయీం తథా లక్ష్మనిరోధి లక్ష్యామ్ అబోధ కాత్యల్పతరప్రయోగాముద్దిష్ట రాగానుదితస్వరూపమ్.

ఏనాం స్ఫుటీకర్తుమిహ ప్రవృత్తౌ తౌ బ్రాహ్మణౌ కేశవ కల్లినాథౌ, యేన ద్వయేనాపి కృతేన తాభ్యామబోధితా స్పష్టపదార్థ భేదామ్."

అని రత్నాకరగ్రంథములోని యవగాహన కాఠిన్యమును వర్ణించెను.

ఇందాపాదింపఁబడిన దోషములు- లక్ష్య లక్షణ విరోధము, ఉద్దిష్టరాగము లకు లక్షణము చెప్పకుండుటయు, వివరణమున సంశయమును, ప్రయోగమున లేనివానికి స్వరూపబోధనమును, పదార్థభేదము సూచింపమియు మొదలగునవి. సంగీతశాస్త్రమున కనుష్ఠానక్రమమునను, దేశాంతర మత సంక్రమణమునను, నిలుకలేక దాని స్వరూపము మాఱుచుండెను. అందుచేఁ బూర్వకాల లక్షణములు నేఁటికాలపు రాగములకుఁ జెల్లఁజాలవు.

(౧) లక్ష్యలక్షణ విరోధము సంగీతశాస్త్రమున సాధారణదోషము. ఒక్కొక్క గ్రంథకర్తయు లక్ష్యలక్షణముల సమత్వము గలిగింప గ్రంథము రచించెదనని చెప్పుచున్నాఁడు. లక్షణము వాడుకలో నున్న దానికి భేదించినచో నిది మునిమతము కేవలము "అదృష్ట" సాధకము. జనరంజకమునకు వాడుకలో నుండు లక్ష్యమే ప్రధానమని శార్ఙ్గ దేవుఁడు పెక్కుచోటులఁ జెప్పుచున్నాఁడు.

(౨) ఉద్దిష్టములగు ౨౬౪ రాగములకు శార్ఙ్గదేవుఁడు లక్షణము సెప్పక ౧౦౪ రాగములు ప్రసిద్ధములని వానినే గైకొనియె. ౨౬౦ రాగము లలో బెక్కింటిఁ గల్లినాథుఁడు ఔమాపతమను గ్రంథము నుండి కొన్నిలక్షణము లిచ్చె. విద్యారణ్యులవారు సంగీతసారములో వాని కన్నిటికి లక్షణము చెప్పఁగా గ్రహించి రఘునాథుఁడును తన సంగీతసుధలో వివరించి రచించెను. అయినను శార్ఙ్గదేవుఁడు లక్షణ మిచ్చిన ౧౦౪ రాగములలోఁ బెక్కులు వాడుకలో లేవు. కొన్నిటికి స్వరూపమే మాఱెను. తక్కిన దోషములు కాలాతి

క్రమముచే శార్ఙ్గదేవుఁడొసగిన విషయములఁ బరామర్శ్యములేక ప్రాఁతపడుటచేఁ గలిగినవి

ఇట్లు కుంభకర్ణ రఘునాథాదులు దూషించినను రత్నాకరము ప్రౌఢ గ్రంథమనుటకు సంశయములేదు. వైదూషక మహానుభావులు గూడ రత్నాకరమునే పెక్కు స్థలముల ననువాదము సేయుచు దాని ప్రక్రియనే నఖశిఖా పర్యంతము గ్రహించి తమ ప్రతిభాదారిద్ర్యమును బయలుపరచిరి. వాద్యాధ్యాయముల రత్నాకరమతమునే కుంభకర్ణ వేమభూపాదులు మక్షికిమక్షిగాఁ బర్యాయపద వైఖరి చూపుచు రచించుట చదువు వారలకుఁ జిన్నతనము నారోపించుచున్నది. శార్ఙ్గదేవుఁడు ప్రాచీన మతములఁ బరీక్షించి సారము వెదకి విప్రతిపన్న స్థలముల నభినవగుప్తాచార్య మతమునే స్వీకరించి తన నిబంధన మొనర్చె. విషయములు ప్రాచీనములేయైనను బ్రక్రియ మాత్రమతనిచే గల్పిత మనియే చెప్పఁదగును.

ఏది యెట్లుండినను రత్నాకరము వ్యాఖ్యాసాపేక్ష మనుట నిర్వివాదాంశము. దాని కాంధ్రమున నొండు రెండు వ్యాఖ్యలును, సంస్కృతమున మూడు నాలుగు వ్యాఖ్యలును, హిందీలో నొండును వ్యాఖ్యానములు కలవు. వీనిఁగూర్చి కొంత విచారించుటకు మున్ను వ్యాఖ్యాన రచనాప్రణాళికాక్రమ మెట్టిదో గ్రహింపదగు.

వ్యాఖ్యానరచనలోఁ బెక్కు సరణులుగాన వచ్చుచున్నవి. కొందఱు కేవలము మూలమునకు దండాన్వయముగాఁ బర్యాయపదముల నిత్తురు. కొందఱు కఠినపదములకును బారిభాషికపదములకును బ్రయోగముల సమర్థింతురు. కొందఱు ధ్వనితార్థమును సూచించుచు రసభావవిశేషముల నెత్తి చూపుదురు. ఇవి యెల్లఁ గావ్యనాటక వ్యాఖ్యాన సరణులు. శాస్త్రసరణులలో దండాన్వయ రచయితలును గఠినపద టీకాకారులును గాక అంశములు, లేక సూత్రములారంభించునపుడు పూర్వోత్తర సంగతి నెత్తిచూపుచు వ్యాఖ్యేయ వాక్యమునకుఁ దాత్పర్యము మతభేదములు విచారింపక ఏకానువాదసిద్ధాంత భావముల సూచించుచు నవతారిక వ్రాసి ప్రతీకము నిత్తురు. కొందఱు గ్రంథకర్తృమతమును వివరింపఁ బూర్వపక్ష సిద్ధాంతముల నాక్షేపసమాధానములుగా విషయము విమర్శింతురు. మఱికొందఱు తేలిక భాగముల వదలి గ్రంథిస్థలముల విపులముగా విచారించుచు మతభేదములఁ జర్చించుచు గ్రంథములోని యుత్కర్షము

విశదీకరింతురు. ఈ మార్గములు పాఠకాధికారుల ననుసరించి యుపయోగకరము లగు. కడపటిది భాష్యపద్ధతి. ప్రౌఢులకు జాల రంజకముగా నుండును. కొందఱనవసరముగా శాస్త్రాంతరవిషయములఁ బ్రలాపించుచుఁ దమశక్తి చూపుదురు. దానిచే గ్రంథవిస్తర దోషము ప్రాప్తించును. కేవలము విడంబనా దీక్షితులగు దుర్వ్యాఖ్యాతల గూర్చి భోజుఁడిట్లు చెప్పెను-

దుర్బోధం యదతీవతద్ధి జహతి స్పష్టార్థమిత్యుక్తిభిః
స్పష్టార్థేష్వతి విస్తృతం విదధతి వ్యర్థైః సమాసాదికైః
అస్థానేఽనుపయోగి భిశ్చబహుభిర్జల్పైర్భ్రమంతన్వతే
శ్రోతౄణామితి వస్తువిప్లవకృతః సర్వేఽపిటీకాకృతః.

అని దుర్బోధమును సుగమమని వదలి సుగమమును విస్తరముగా వివరించి యసందర్భవిషయములఁ జర్చించుచు వ్రాయుదురు.

ఇక వ్యాఖ్యానముల గై కొందము. హిందీభాషలో రచించిన గంగారామ పండితుఁడు రీమానంస్థానాధీశుఁడగు రామనృపతి కాశ్రితుఁడు. 1650 క్రీ. శ. కాలములో నుండెనేమో. ఆ వ్యాఖ్యానమునఁ బ్రాయశః శ్లోకముల కన్వయ క్రమముగా నర్థమొసగఁబడియె. సందిగ్ధస్థలములలో దద్వ్యాఖ్యాతకు సుగమ బుద్ధియే తోచుచుండెను. ఇతఁడు షడ్రాగచంద్రోదయము నుదాహరించినందున దత్కర్త విట్ఠలుఁడు క్రీ. శ. 1600 కాలమున నుండినందున గంగారాముఁడు తదనంతరకాలమున నుండెనని చెప్పఁదగు.

సంస్కృతవ్యాఖ్యాతలలో ౧. సింగభూపాలుఁడు, ౨. కల్లినాథుఁడు, ౩. సింగణభట్టు, ౪. హంసభూపాలుఁడు, ౫. కుంభకర్ణుఁడు, ౬. భీమ భూపాలుఁడు, ౭. కేశవుఁడు మొదలగువారు.

వీరిలో భీమభూపతి యనుట సింగరాజు వ్యాఖ్యలో "భుజబల భీమసింహ భూపాల రచిత"మను వాక్యమున భీమశబ్దమును వ్యాఖ్యాతనామముగాగ్రహించు టచే భ్రమోత్పాదకమయ్యెను. అది నిక్కముగా సింగభూపాలుని బిరుదు వాక్య మున నుత్తరపదము. హంసభూపాల శబ్దము సైతము సింగభూపాల పదము నకు లేఖకదోషమాయను సందియము కలుగుచున్నది. హంసభూపాలుఁడను పండితుఁడు వ్యాఖ్య రచించినట్లు తోచుచున్నది. కాని నిక్కమెఱుంగరాదు.

మాకు హంసభూపాలవ్యాఖ్య దృగ్గోచరము కాదయ్యె. సంగీతసుధలో రఘునాథుఁడు కేశవుని పేర్కొనియె. కూయొద్ద నత్యల్పభాగము కేవల ప్రతిపదార్థ టీకారూపమగు రత్నాకరకౌస్తుభమను వ్యాఖ్య యనామకర్తృకముగాఁ గలదు. అది కేశవ కృతమనుట కాధారములేదు. దానియందెట్టి ప్రౌఢిమయు గానరాదు.

కుంభకర్ణుఁడొక్క టీక రచించినట్లు చెప్పుదురు. అది మాకు లబ్ధము కానందున దాని స్వరూపము నిర్ణయింప సాధ్యముకాదు. అయినను రత్నాకరములోని విషయములనెల్లఁ బురస్కరించుకొని విప్రతిపత్తి పూర్వపక్ష ఖండనములతో శాస్త్రమర్యాద ననుసరించి కుంభకర్ణుఁడు సంగీతరాజమను పేర 16000 షోడశ సహస్ర శ్లోకములలో విపుల గ్రంథము రచించెను. అందుచే రత్నాకర వ్యాఖ్య ప్రత్యేకముగా రచింప నావశ్యకములేదు. బాలురు మేలుబంతి చూచి యక్షరములు కుదుర్చుకొనుటకు వ్రాసిన దానిని వ్రాయునట్లు గ్రంథ పరిశోధకులకును, చరిత్రకారులకును వ్రాసిన విషయములనే పునః పునః లఘు వ్యాస రూపముల వ్రాయు మర్యాద నేఁటి కాలమునఁ గలదు. ఇది ప్రాచీన సంప్రదాయము కానందునఁ కుంభకర్ణుఁడు ప్రత్యేకముగా రత్నాకరమునకు వ్యాఖ్య రచించెనాయను సంశయము కలదు.

కుంభకర్ణుఁడు క్రీ. శ. 1430నుండి 1486 వఱకును రాజపుత్ర స్థానమున మేవాడుదేశమునకుఁ బ్రభువై యసంఖ్యాకములగు యుద్ధములలో బాఱిపోకనిలిచి ధారానగరపురాది బహుపురముల నాక్రమించుకొని మహ్మదీయుల బెక్కుమాఱులోడించి శత్రుభీకరుఁడై యుండెను. మేవాడు రాజసంతతి వారు శుద్ధక్షత్రియులై క్షత్రశబ్దము నన్వర్థముచేయుచు నిరంకుశప్రవృత్తమగు తురుష్కులధాటి చెదరిపోవుటకుఁ గారణభూతులైరి. కుంభకర్ణుని యాశ్రితుఁడే మడనంసూత్రధారుఁడను ప్రఖ్యాత శిల్పగ్రంథకారుఁడు. సుమారు వేయేండ్లలోపుగా రచింపఁబడిన సంగీతగ్రంథములలో రత్నాకరము, కుంభకర్ణుని సంగీత రాజమును, బెదకోమటివేమభూపతి సంగీతచింతామణియు నిర్దుష్టములై బహుగుణసంపన్నములైనవి. కుంభకర్ణునిశైలియించుక కఠినమై శాస్త్రివాక్య విచార గుంభితమై వ్యాసఘట్టములవలె నచ్చటచ్చట గంతము పట్టుచున్న పట్టులతో ఘట్టితమైయున్నది. వేమారెడ్డిసరణి యతిసరళమై యేకవారశ్రవణము చేతనే వాక్యార్థము హృదయగోచరమగుచుండును. ఇరవురును విషయమును

చాల విస్తరముగా సంప్రదాయ ప్రయోగముల చాతుర్యములఁ జూపుచు సందేహముల రానీయకయె గ్రంథము నడప సమర్థులు.

ఇక శేషించిన ముప్వురు నాంధ్రులు. వీరిగురించి కొంత విచారింతము. కల్లినాథుఁడు మూఁడవదేవరాయలు (మల్లికార్జునుఁడు) యౌవరాజ్యము సేయుచు నుదయగిరిరాష్ట్రము పరిపాలించుకాలమునఁ దదంకితముగా సంగీతకళానిధియను పేర రత్నాకరమున కొకవ్యాఖ్య విరచించె. అది యనేక విధముల బౌఢ్ర మైనది. అది సంపూర్ణముగా ముద్రితమై ప్రచారములో నున్నది.

కల్లినాథుఁడు స్వరమేళకళానిధి రచించిన బయకార రామదండాధిపతికి మాతామహుఁ డనితోఁచుచున్నది. రామప్పయ్య గ్రంథములో నళియరామ రాయలు తన్ను గ్రంథరచనకు ప్రోత్సహించుచు,

విద్యానిధిః కల్లపదేశకస్తే
మాతామహో దత్తిల వన్మహీయాన్
గాంధర్వ శాస్త్రేషుతతోఽపితాని
తత్సంప్రదాయేన తవస్ఫురంతి.

యని కల్లప్పఁ కల్లినాథుఁడు బయకారరామప్పకు మాతామహుఁడని సూచించె. ఈరామప్ప యాంధ్ర బ్రాహ్మణుఁడు.కొండవీటి ప్రభువై కృష్ణరాయల యొద్ద దండనాథుఁడై రామరాయలకు సుందరప్రాసాదములు కట్టి శిల్పవరుఁడని కీర్తిగాంచి బహుగాన ప్రబంధకర్త యయ్యెను. ఇతని క్రిందనుండిన దండనాథుఁడగు బ్రాహ్మణుఁడు లాచిరాజు సూరనార్యునివలన నుదయనోదయమను రసవత్తరకావ్యము నంకితముఁ గొనియె. అందుచే కల్లినాథుఁ డంధ్ర బ్రాహ్మణుఁడని యూహింపఁదగు.

ప్రౌఢదేవరాయని పుత్రుఁడగు మల్లికార్జునుఁ డుదయగిరిలో యువరాజుగా బాలించుచున్నప్పుడే కల్లినాథుఁడు వ్యాఖ్యరచించియుండును. తంజాపురి గ్రంథ భండారములో నెం 11503, 11504 గల మాతృకలలోఁ కల్లినాథుని పేరులేక వ్యాఖ్యయంతయు (మూఁడవ) దేవరాయఁడే రచించినట్లున్నది. రాజు బహుశః ప్రారంభమునఁ దత్కర్తృత్వముఁ దనపైనారోపించుకొని తానుపెద్దవాఁడై రాజ్యమునకువచ్చిన పిదప నట్టిపదవి గర్హ్యమని కల్లినాథుని పేరనేఁ దానిఁ బ్రకటించెనని తోఁచుచున్నది. కల్లినాథునింబేర్కొని తట్టీకలోనుండి కుంభకర్ణుఁడు

సంగీతరాజమున నృత్తరత్నకోశమున మధుపులను నామాంతరముగల పాద పాటల లక్షణము గ్రైకొనియె. సంగీతరాజము క్రీ॥శ॥ 1449లో రచింపఁ బడినందునఁ గల్లినాథీయమంతకుముందే యనఁగా ప్రౌఢప్రతాప దేవరాయలు విజయనగరముననుఁ గుమారుఁ డుదయగిరిలోను రాజ్యము సేయునప్పుడే వ్రాయఁబడియుండునని యూహింపఁదగు. దానికనుగుణముగా కల్లినాథుఁడు తన యవతారికలో-

ఇహ విద్యానగరీ చకాస్తి
తుఙ్గౌతరఙ్గైరభితః పవిత్రా
ఏతాంశాస్తి ప్రశస్తా ప్రతిభట
ముకుట ప్రోతనిర్యత్ననిర్య
ద్రత్నజ్యోతిః ప్రవాలావనమన
చటుల్లాటోప తాపప్రతాపః.
కర్ణాటాఘాట లక్ష్మీచరణ
పరిలసత్పౌరుషోత్కర్షశాలి
ప్రౌఢశ్రీదేవరాజోవిజయ
నృపసుతో యాదవానాం వరేణ్యః.
విశ్వంభరా భాగ్యకృతావతార
సస్యాస్తిపుత్రోయగసా పవిత్రః
సంగీత సాహిత్యకలా స్వభిజ్ఞః
ప్రతాపవానిమ్మడి దేవరాయః.

విజయసుతుఁడగు దేవరాజు "శాస్తివిజయనగర్యా"మనుటచే యిమ్మడి దేవరాయఁడు యువరాజని యూహింపవచ్చును. మఱియు,

కడపమండలములో నొకానొక శాసనములో మల్లికార్జునునకు సంగీత రత్నాకరుఁడని బిరుదము ప్రయుక్తమైయుండుటయుఁ బై యంశమును బలపరుచు చున్నది.

సింగభూపాలుఁడు:—రత్నాకరమున కితఁడు రచించిన వ్యాఖ్య సంగీత సుధాకరమనఁబడును. దీనిలోఁ బ్రథమాధ్యాయమగు స్వరలక్షణము మాత్రము కలకత్తానగరమున క్రీ. శ. 1880లో ముద్రితమయ్యె. తరువాతి భాగము

లెచ్చట ముద్రితములుగావు. ముద్రితగ్రంథమున నధ్యాయాంతమున "సింహ భూపాల విరచితాయాం......సంగీత సుధాకరాఖ్యాయాం" అనికలదు. ఈ వ్యాఖ్యాత నామమును భీమసింహుఁడనియు రుద్రసింహుఁడనియు భ్రమించి కొందఱు ఇతఁడు కామరూప (Assam) దేశజుఁడనియు, మాగధుఁడని కొందఱును భ్రమించిరి.

ఇటీవల నాసికప్రాంతమున నాకొక మాతృక లభించె. దానిలోఁ బ్రథమాధ్యాయాంతమున "ఇతిశ్రీనర్మదాతటాధీశ్వర మహారాజాధిరాజ శ్రీగోపీ నాథ ధర్మాధికార భట్టశ్రీనాగనాథసుత శ్రీగంగాధర విరచితాయాం సంగీత రత్నాకర టీకాయాం, సంగీతసుధాకరాఖ్యాయాం స్వరగతాధ్యాయః ప్రథమః" అనియు; రెండవ అధ్యాయములో–

"ఇతిశ్రీమదాంధ్ర మండలాధీశ్వర ప్రతిగండ భైరవశ్రీ అనపోతనరేంద్ర నందన భుజబలభీమశ్రీసింగభూపాల విరచితాయాం సంగీతసుధాకరాఖ్యాయాం రాగావివేకాధ్యాయో ద్వితీయః" అనియు; మూఁడవ దానితుద "ఇతిశ్రీనర్మదా తటాధీశ్వరనందపురి వాస్తవ్య మహారాజాధిరాజ శ్రీ గోపీనాథ ధర్మాధికార శ్రీనాథసుత శ్రీగంగాధర విరచితాయాం ప్రకీర్ణాధ్యాయ స్తృతీయః" అనియు కలదు. చతుర్థ షష్ఠాధ్యాయాంతముల ఇతిశ్రీమదంధ్ర మండలాధీశ్వర అను ప్రక్రియయేకలదు.

పంచమసప్తమాధ్యాయముల గద్యముండదగిన పత్రములు గానరావు.

ప్రథమాధ్యాయవ్యాఖ్య ముద్రితభాగమునకు సరిపోవుచున్నది. అయినను ముద్రాపకులు సింగభూపాల వ్యాఖ్యలో గ్రంథపాతమైనప్పుడెల్ల సూచించియుఁ గొన్నిచోట్ల సూచింపకయుఁ కల్లినాథవ్యాఖ్య జంటించి ముద్రించిరి. దానిచే సింగభూపాలుఁడు కల్లినాథునికిఁ దరువాతి వాడనియు గ్రహింపనాస్పదమయ్యె. కాని యిది ముద్రాపకులదోషము. వ్యాఖ్యాత కల్లినాథునెచ్చటఁ బేర్కొన్న వాఁడుకాదు.

ఇక సింగభూపతియెవ్వఁడని విచారింపఁదగు. వ్యాఖ్యానారంభమున నవతారికాశ్లోకములలో దేవతాగ్రంథస్తుతి దక్క గ్రంథకర్తృ వంశావళికానరాదు.

అతిగంభీరే విషయే కతిపయవేద్యేత్విహాగ్రంథే,
సమ్యగ్వ్యాఖ్యాకుశల సర్వజ్ఞః సింహఁగః భూపఏవైకః.

అనిమాత్రమేకలదు. అధ్యాయాంతగద్యముల వలన నితఁడు రేచెర్ల వంశజుఁడును, రసార్ణవసుధాకరకర్తయునగు సింగభూపతి యన్న యనుమానము సులభముగాఁ దేలును.

చమత్కారచంద్రికలోని చక్రపద్మబంధములు విజయనగర హరిహరుని కాలములో సాయణాచార్యునిచే రచింపఁబడిన యలంకారసుధానిధిలో నుదాహరింపఁబడినందున నది క్రీ. శ. 1370 లకు పూర్వమే రచింపఁబడియె. దానిలో "రసార్ణవసుధాకరము సింగభూపాల కృతముకలదు. శిష్టాంశముల నందే చూడఁదగు" నని తత్కర్తయగు విశ్వేశ్వరుఁడు చెప్పుచున్నాడు. కావున సింగభూపతి క్రీ॥ శ॥ 1360 ప్రాంతమున నుండి యుండునని యూహింపఁదగు. శ్రీనాథుని కాలమున నొక సింగభూపాలుఁడున్నట్లు చాటువుల వలనఁ దెలియుచున్నది. గ్రంథకర్తలు సాధారణముగాఁ గృతులకు నామకరణము సేయునప్పుడొక జాతీయ ప్రక్రియ నవలంబింతురు. స్ఫోటసిద్ధి బ్రహ్మసిద్ధి యనియు; విధివివేక, భావనావివేక, విభ్రమవివేకములనియు; సాహిత్యచింతామణి, సంగీతచింతామణి; అలంకారసుధానిధి, పురుషార్థసుధానిధి యనియు, అను నామములలో సిద్ధి, వివేక, చింతామణి, సుధానిధి శబ్దము లేక కర్తృత్వ సూచకములగునట్లు చమత్కృతి తోచుచున్నది. అట్లే సంగీతసుధాకర, రసార్ణవసుధాకర నామము లేక కర్తృత చూపవచ్చును. ఇదియంత బలీయమగు నాధారముకాదు. కాని సంగీతసుధాకర, రసార్ణవసుధాకరముల నధ్యాయాంత గద్యము లొకటియే యగుటచే నేకకర్తృత్వము సూచింపఁబడు. సింగభూపతికి సహాయమొనర్చిన గంగాధరుఁడు నాగనాథుని పుత్రుఁడు. గోపీనాథ నరపతికి దండ్రియో కొమారుఁడో ధర్మాధికారి పదవిలో నాశ్రితుఁడై యుండెను. గోపీనాథుఁడు నర్మదాతటాధీశ్వరుఁడు. అనఁగా నేరాజ్యమో యెఱుఁగరాదు. ఎవ్వడు నందపురి వాస్తవ్యుఁడు? రాజునాగనాథుడా, గంగాధరుఁడా? నర్మదాతటాధీశ్వరుఁడును రాజా, లేక నాగనాథ గంగాధరులలో నొక్కడా? దేశచరిత్రములలో 'మహారాజాధిరాజ' బిరుదము గల గోపీనాథుఁ డెవ్వడు? ఈ ప్రశ్నలకు సమాధానము కాలక్రమముచఁ జరిత్ర పరిశోధనము వలనఁ గాని తేలదు. నందపురి రాజపుత్రస్థాన దేశమున నందోరి (Nandori) యనియు, లేక బేరారు దేశమున పంగర్ఖడ్ (Pangarkad E. I. vol XXII-౯౪.) సమీపమునఁ బల్లెగా నుండెననియు నర్మదానదీ

సముద్రసంగమున "నందోడ్" అను పురము కలదనియు చెప్పుదురు. అది వానిలో నొకటిగా నుండనోవు.

గోపీనాథ నాములగు రాజుల విచారింపఁగా రాజపుత్రస్థానమున డంగర్పూరు సంస్థానాధీశ్వరుఁడగు రావల్ గోపీనాథుఁ డొకడగపడు చున్నాడు. ఈతఁడు క్రీ. శ. 1442 లో నుండినట్లు తేలును. (Annual Report Rajaputana Museum 1914-15). మఱియొకడు క్రీ. శ. 1668 లో దానమొనర్చిన రాజునకు సుమారు 30 వ పూర్వపురుషుడైనట్లు వంశావళి దానశాసనములో గలదు. ఆ దానశాసనము మధ్యరాష్ట్రముల దానకర్త యక్కడివాడే కాదగినను 30 వ తాత యక్కడివాఁడనుట యుక్తియుక్తము కాదు. (N. I. Ins No. 1017. E. I. Vol). మఱి యెవ్వఁడు గోపీనాథుఁడు చరిత్రముల లభింపఁడయ్యె. భావికాల విమర్శకుల పుణ్యమెట్లున్నదో.

ఇఁకఁ గేవల మూహయే మనకు శరణ్యము. మాలికాఫ రోరుగంటి రాజ్యము నిర్మూలము చేసిపోఁగా నిరువది సం॥లో మహామ్మదీయులు దాని విడిచి పోయిన దద్రాజ్యమును వీరభద్రాదులేలి నశింపఁ జేసిరి. అప్పుడే రెడ్డి రాజులును, వెలమరాజులును బూర్వము దండనాయకులై సైన్యములతో నుండి నందున స్వతంత్రరాజ్యముల స్థాపింపఁగలిగిరి. రాచగిరి, భువనగిరి, రామ దుర్గము, మొదలగు చోటులు రేచెర్లవారధిష్ఠానముగాఁ బరిపాలించుచుండిరి. అట్టికాలమున నుదీచ్యుఁడను గోపీనాథుడు ధారానగరపురాదిప్రాంతముల నుండు మహమ్మదీయులఁ దోలి దేవగిరి నాక్రమించుకొని రామగిరి ప్రాంతము లకు వచ్చి యుండును. సింగభూపతి యతని క్రింద, మండలికత్వ మంగీక రించి యుండవచ్చును. గోపీనాథుని ధర్మాధికారి గంగాధరుఁడు సింగభూపతి సర్వజ్ఞతకు మెచ్చి రాజుతో గలసి యీ వ్యాఖ్యను రచించి యుండవచ్చును. తరువాత 70 సం. ల కోరుగల్లు తురకలదండుచేతఁ బడుటయు, విజయనగర రాజులు, గజపతులును మాటి మాటికి వారిఁ దోలుటయు దేశచరిత్రకారులు విస్తరించి వర్ణింపఁగలరు. కావున నర్మదాతటస్థ దేశాధిపతి నందపురి రాజ ధానిగాఁ బాలించువాఁడు గోపీనాథుఁడు సింగభూపతికి మిత్రుఁడయ్యె. "మహా రాజాధిరాజ" అను బిరుదము సింగభూపతివంటి సామంతులు గ్రహింపరు. శాసన ముల స్పష్టముగా బిరుద ప్రయోగములో భేదమగపడుచున్నది. ఇది యంతయుఁ గేవల మూహ యనియె గ్రహింపఁదగు శ్రీనాథుఁడు దర్శించిన

సింగభూపతియే వ్యాఖ్యాత కావచ్చునని కొందఱాక్షేపింతురు. ఊహాప్రపంచము గంధర్వనగరము వంటిది. అయ్యదియాక్షేప విక్షేపములకు లక్ష్యము కానేరదు. రసార్ణవసుధాకర కారుడే దానికిని గర్తయని యూహాప్రౌఢిమచేతనే చెప్పుచున్నారము. కర్తృత్వసూచక పద్యములు సమానముగుటచే నీయూహ బలీయసి యగును. గ్రంథపరిశోధకులు సత్యము తేల్తురుగాక.

వెలుగోటివారి చరిత్రములో వచ్చు పురుషులు మనము సర్వజ్ఞ సింగ భూపతియని తలఁచినయతని పినతండ్రియగు మాధవరాజు వంశమునఁ బుట్టినవారు. ఆ మాధవుని కుమారుఁడు పెద్దవేదగిరి. అతని యిరువురు కుమారులలోఁ గుమారమాధవుని కుమారుఁడగు లింగభూపతిని శ్రీనాథుడు దర్శించెను. సర్వజ్ఞసింగని కుమారుఁడగు ననపోతభూపతి కుమారుఁడగు సింగ భూపాలుని శ్రీనాథుఁడు చూచినట్లు తోచుచున్నది. ఇతఁడే పోచమాంబా కుమారుఁడు కావున బమ్మెరపోతనయు, శ్రీనాథుఁడును దర్శించిన యతఁడు మూడవ సింగభూపతి. రాచగిరిలో నుండిన సింగభూపతియె సర్వజ్ఞుఁడగును. అతని మనుమని శ్రీనాథుఁడు చూచియుండుట యసందర్భము కాదు. మాధవరాజాదులు దేవరకొండలో నేలి కడు ప్రతాపకీర్తుల నాపాదించు వీరసంగ్రామముల జయించి కేవల వైరనిర్యాతనమే పురుషార్థ మనునట్లు సోమవంశ రాజులను రెడ్డి రాజులను మూలోచ్ఛేదము చేసిరి. కాని రాజ్యకాంక్షచే వారిరాజ్యముల నపహరించినట్లు కానరాదు.

దాచయ

సింగరాజు I

| | |
|---|---|
| ౧ అనపోతరాజు | ౧ మాధవరాజు |
| ౨ సింగయ్య సర్వజ్ఞుడు II | ౨ పెద్దవేదగిరి |
| ౩ అనపోతరాజు | ౩ కుమార మాదయ |
| ౪ సింగభూపతి III | ౪ పినవేదగిరి లింగరాజు ౪ |

పై వంశవృక్షమున ౧వ మాధవరాజు అనవేమాన్నపోతారెడ్డిరాజులఁ జంపె (1360).

౧ అనపోతరాజు రాచగిరిలోను, ౧ మాధవరాజు దేవరకొండలోను స్థిర నివాసములుచేసికొని పాలించుచుండిరి. 2వ పెద్దవేదగిరి కుమారుఁడు రామ చంద్రరాజు ఫిరోజ్‌షాను ఓడించె. పెద్దవేదగిరి యయ్యలార్యునిచే యుద్ధ కాండము రచియింపించెఁగాబోలు. 3వ కుమారమాదయ కొమరగిరిరెడ్డినిజంపె. (1400 AD) 4వ లింగరాజు అళ్ళయవేమ వీరభద్రులఁ జంపె-1434 AD. 4వ పినవేదగిరి—పెద్దకోమటి వేమారెడ్డి తమ్ముని మాచారెడ్డినిజంపి తాను కోమటి వేమారెడ్డిచేఁజచ్చెను.

సింగభూపాలుఁడు విశ్వేశ్వరకవి సాహాయ్యముతో రత్నపాంచాలికయను నామాంతరముగల కువలయావళియను చతురంకనాటిక శ్రీకృష్ణుఁడు కువల యావళిఁ బొందునట్టి కథాంశముగలదాని రచించెను. అదియునిప్పుడు లభించు చున్నది. శ్రీనాథుని సమకాలికుఁడగు సింగభూపతి కావ్య కర్తృత్వకార యితృత్వములచే బ్రసిద్ధుఁడని తోచరాదు. శ్రీనాథుఁడు రచించిన సంస్కృత నాటకములఁ బెదకోమటి వేమభూపతి సాహిత్యచింతామణిలో నుదాహరించి నందున నవి శ్రీనాథునిచే సింగభూపతిదర్శనమునకుఁ బూర్వము రచితములగు టచే సింగభూనాయకకీర్తికందాంకురములని యంగీకరింపఁబడవు.

బొమ్మగంటి యప్పయాచార్యుఁడు తారచించిన యమరవ్యాఖ్యలో మంగ ళాంతముగా సింగభూపాలుని మిక్కిలిగాస్తుతించె. అందుచేతను సింగభూపతి గొప్పవిద్వాంసుఁడని తెలుసు.

కావ్యాలంకార నానార్థతత్త్వభావితమానసః
కుమారసింగభూపాల ఏక ఏవాస్తినాపరః
కుమారసింగభూపాల కృతయస్తన్యనిత్యశః
ఏధయన్తి ముదంద్రష్టాంతాకృతినః పరమ్.

రసార్ణవసుధాకర కర్తకుఁ గుమారసింగభూపనామముగలదు. "కుమార శ్రీ సింగే జలధిరశనాం శాసతి మహీం" అని చమత్కారచంద్రికలోఁజెప్పఁ బడియె. అతనితాతయు సింగఁడగుటచే నితఁడు రెండవ లేక కుమారసింగఁ డనఁబడును.

సింగభూపతి వ్యాఖ్యలోఁ జతుర్థాధ్యాయమునఁ దృతీయాధ్యాయ వ్యాఖ్యలో నిట్లు చెప్పితినని యనువాదము సేయుఘట్టము తృతీయమునఁ గలదు. గంగాధర కృతముగాను,జతుర్థము సింగరాజ కృతముగానుండినను రెండు నేక కర్తృకమే. అందుచేతృతీయము ఇరువురు కలసియే గ్రంథమంతయు శైలీభేదము కానరాకుండినట్లు రచించిరనియుఁ జెప్పవచ్చును. సింగభూపాలాదులు నిరంతర రాజ్యరక్షణక్రియామగ్నులై యవకాశము చిక్కినప్పుడే విద్యావినోదముల మనస్సు ద్రిప్పుచుండినందునఁ బండితులచే గ్రంథరచనలఁజేయించి తమయూహాపోహలచే వానికివన్నె దెప్పించుచుందురు. గంగాధరుఁడు రాజునకు మిత్రుఁడై గోపీనాథుని యనుజ్ఞవడసి సింగభూపాలునకుఁ గీర్తిస్తంభస్థాపనకుఁ దోడ్పడియెఁగాబోలు.

నేటికాలమునను వేఱొకరు శ్రమించి రచించిన గ్రంథమును రాజాధికారముననో నియోగధర్మ దోషముననో యౌద్ధత్యప్రభావము చేతనో యత్యల్ప సాహాయ్యమూకీభూతలవలన, లేక ప్రత్యాశాప్రతిబద్ధచేతస్కుల వలన గ్రహించి స్వకర్తృకత్వము బ్రకటించుకొను మహానుభావులు గలరనుట వింతగాదు. గాని యీపాపమో లేక దోషమో కాలోపాధిలేక భూత వర్తమానముల నిర్విశంకముగా జరుగుచున్నదనుటయే వింత. భవిష్యత్ప్రవృత్తియు గతానుగతికమైయుండుఁగాక యని యాశీర్వదించెదము.

సింగభూపతివ్యాఖ్య మొత్తముమీఁద గుణవంతమై యన్నిచోటుల సమానవిస్తృతములుగా నుండును. కల్లినాథుఁడు కొన్నిచోటుల నమితముగాను, దుర్బోధములగుపట్టుల మౌనము నవలంబించి, విశదవ్యాఖ్యానమనుచుఁ గొన్ని మతభేదములు వచ్చినప్పుడు పూర్వపక్షీకృతమతముల నంగీకరించును. కల్లినాథుఁడు విడిచిన పట్టులకును సింగభూపాలవ్యాఖ్యగలదు.

ఇఁక సింగణభట్టు రచించిన వ్యాఖ్యయేది? అతఁడెవ్వఁడు? ఒండు రెండాంధ్రభాషావ్యాఖ్యానములేవి? వానికర్తలెవ్వరు?

ఆంధ్రభాషలో రచింపఁబడిన రత్నాకరవ్యాఖ్య యొకటి ప్రథమాధ్యాయ భాగము మాత్రము లభించె. దానిలో నవతారిక సంస్కృతశ్లోకములతో నున్నది. వానిలోఁ గొన్నిటి నుదాహరించెదము.

ఆస్తే సిజ్గరిభట్ట సూరిరితి ఋగ్వేద——

ఋక్ఛాఖాస్మృతిమాయి భట్టతనయోబ (వ్యా?) ల్లాళరాట్పూజితః.

తస్మాదశ్నయ వేమభూపసుమనస్సంతోష మాపూరయన్
శ్రీవిద్యా......తిప్రౌఢేన సంప్రార్థితః
వ్యాసీయేజైమినీయే ఫణిపతిఫణితే కాపిలే కాశ్యపీయే
న్యాయే గీతే కలాసు ప్రతినవక———న్నిద్రసాహిత్య
——ణేసులలితనటనే భావదక్షే కటాక్షే
వాచిత్వేవైదికత్వే ప్రభవతి భరతేసిజ్ఞణార్యోధరణ్యామ్
స్వస్యశ్రీ కులదేవతా విజయతే శ్రీ———
———తథా భరతమిత్యాఖ్య సుశాస్త్రం మహత్
తత్తూర్యత్రయపూర్వ శాస్త్రవిధినా సంగీతరత్నాకర
స్వీయం ప్రౌఢనరేన్ద్రపాలన———తేనసా
ప్రౌఢ దేవనరనాయకాఙ్కిత

—— —— —— ——

ప్రాప్తవాన్ సకలలక్ష్యలక్షణ
———భిశ్చబహువన్దిత స్తథా
తత్పుత్రోలోకమిత్రః సుభగజనమనో భాస్కరో విష్ణుభట్టా
చార్యాఖ్యో మాండవీశం మహమదుజగయాస్తీన్ సురత్రాణమేత్య
———శాస్త్రైతిమిరై (?)
అన్యైర్విజ్ఞాపితోఽ భూదితి యవనపతిర్నాపరస్తూర్య శాస్త్రే
సురత్రాణః స్త్వైరం స్వయమసి సమాక్షివ్యసమితౌ
శ్రుతిప్రాధాన్యత్వం స్వరయుగవిభేద ప్రకటనమ్ దశప్రాణాన్ తాసాం
విలోక్యాథప్రాదాద్దశ శతతులం స్వర్ణమతులం
తస్యాత్మ (ను?)జో విఠ్ఠలనామధేయః
సూరిః స్వపిత్రార్జితపుణ్యరాశిః
——— ———రామచంద్రః
ప్రస్తారముఖ్యాన్ ప్రవిధాయ చాస్తే
సోఽహం సంగీతరత్నాకర———వీక్ష్యతాతో క్తవీకాం
వక్ష్యేమన్మన్దబుద్ధ్యా ప్రకటితవచనై రన్ధ్రభానుషీకాం
సింద్ధాంతాం బాలశోభాం సుఘటజన మనోహారిణీం వీక్ష్యసన్తో
నన్దన్త్వన్యేవదస్తు ప్రఘటితద......వాగ్విలాసం యథేష్టమ్.

అనియున్నది. (కాశ్యపీయమన వైశేషికసూత్రములు; కణాదుఁడు = కాశ్యపగోత్రుఁడు) పైశ్లోకములో వంశావళి ప్రక్కపుటలో చూపినట్లున్నది.

విఠ్ఠలభట్టు తండ్రి సంస్కృతమున రచించిన టీక కనుటీక యాంధ్ర భాషలోఁ గూర్చె. సింగణభట్టు ప్రౌఢదేవరాయల కంకితముగా రత్నాకర టీక సంస్కృతమున రచించెను. కావుననే 'తస్యాత్మజో' అనుటకు "తస్యానుజో" యని యుండునేమోయని సందేహించెదము.

మాయిభట్టు

సింగరిభట్టు (అల్లాళరాజపూజితుఁడు)

భరతమితికర్త— సింగణభట్టు (అళ్ళయవేమ ప్రౌఢదేవరాయ సమ్మానితుఁడు)

విష్ణుభట్టు— (మహమ్మద్—గయాస్తీన్ పూజితుఁడు

విఠ్ఠలభట్టు— (ఆంధ్రవ్యాఖ్యాత)

గ్రంథాక్షర లిఖితముగావునఁ దదక్షరములలో "ను", 'త్మ' లకు మిక్కిలి వ్యత్యాసముగానరాక భ్రమకలిగించుచుండును.

సింగణ రచించిన భరతమితిగాని, రత్నాకరవ్యాఖ్యగాని లభించినది కాదు. కృష్ణరాయల యనుజ్ఞచే సంగీతసూర్యోదయమను ప్రకరణగ్రంథము రచించిన భండారు లక్ష్మీనారాయణకవి తాను విష్ణుభట్టారకునివలన శాస్త్రి మర్మముల నెల్లనేర్చినట్లు చెప్పుచున్నాఁడు.

> సంగీతాగమ లక్ష్మలక్ష్యనిపుణైః శ్రీవిష్ణుభట్టారకైః
> జ్ఞాత్వాదత్తిల కోహళాది భరత గ్రంథాన్ సుటీకాన్వితాన్
> భూమౌ కీర్తిశరీరరక్షణధియాగ్రన్థః కృతోఽయం మయా
> సంప్రాప్తః క్రమయోగ్యతాదికరతః సంగీతసూర్యోదయః.

అని. అతని గురువగు విష్ణుభట్టు మహమ్మద్ గయాస్తీన్‌ను మెప్పించిన విష్ణుభట్టాచార్యుడే యగునని యూహించెదము.

ఆంధ్రవ్యాఖ్య బహుగుణ విశిష్టము గాకున్నను సరళముగా దోషరహితముగా సుకుమార మనోమోహనముగా నున్నది. పైనుదాహరించిన వ్యాఖ్యా

నావతారికాశ్లోకము లతిశిథిల తాళపత్రముల నుండి యుద్ధరింపఁబడియె. చుక్కలుంచిన భాగము లందు క్రిమిదగ్ధములు లేక మూషకవిద్ధములు. శ్లోకములు లేఖకదోషదూషితములు. యథాసంభావముగా నుదాహరించితిమి.

ఇందుఁ బేర్కొనఁబడిన మాండవీశుఁడు మహ్మద్ గయాస్తీన్ అనువాఁడు. క్రీ. శ. 1495 లో ధారాసురత్రాణుఁడై యనేక దానధర్మములు చేసినట్లు శిలాశాసనములు గలవు. (J.B. B. R. A. S. Vol X X. 1111 Page E. I. Vol. XIX Supplement Nos 851. 159 చూడదగు). శ్లోకమున మహ్మదు జగయాస్తీన్ అనుటలో జకారమొకటి యెక్కువగలదు. దానికి గతియేదో యెరుఁగరాదు. ఈ ధారాసురత్రాణుఁడు వేయి తులముల బంగారము కేవలము విద్వత్పక్షపాతియై దేశాంతరస్థుఁడగు నంధ్రబ్రాహ్మణున కిచ్చెననుట స్వదేశాంధ్ర రాజులకు స్వధర్మానుష్ఠానము నుపదేశించుచున్నది.

చెన్నపురి ప్రాచ్యలిఖితపుస్తక భండారమున సంపూర్ణమగు రత్నాకరటీక యొకటి యాంధ్రభాషలోఁ గలదు. దాని కవతారిక గానరాదు. అది యావిఠ్ఠలుఁడు రచించిన గ్రంథమా యని సందేహము కలుగుచున్నది. విఠ్ఠలుఁడు క్రీ. శ. 1510 ప్రాంతములఁ దెనుఁగుటీక రచించియుండనోపు. క్రీ. శ. 1200 నుండి అనఁగా గూర్జర, చాళుక్య, పరమార, చేది, కలుచురి-ఈ రాజ్యములు క్షీణింపఁగా, నాంధ్రులే సర్వవిధముల సంగీతభరత శాస్త్రములకుఁ చేయూతయొసగి వృద్ధికిఁ దెచ్చిరి. కడపటి దినములలోఁ దంజావురి రఘునాథుఁడు సంగీతవిద్యను చక్కగా స్థాపించినందుననే దక్షిణదేశమున నది యాంధ్రుల గీత ప్రౌఢిచేతనే పెరిగి సకలజన శ్రవణామృతముగా వన్నెకెక్కి యున్నది. దేవరాయల కట్టి సంగీతాభినివేశము కలుగుటకు ముఖ్యకారణము పేదకోమటి వేమభూపాలుని నిరంతర సంగీతకావ్య గోష్ఠీ విలాసప్రభావమే. వేమన రచించిన సంగీత చింతామణి గుఱించి త్వరలో విస్తరించి వ్రాయదలఁచి యున్నారము.

భారతి
నవంబరు, 1936.

మా. రామకృష్ణకవి

# 10 మధురవాణి

క్రీ. శ. 1620 ప్రాంతమునఁ దంజాపురీశుఁడగు రఘునాథ నృపాలుని యాస్థానమున విలసిల్లిన మధురవాణి రచించిన సంస్కృత రామాయణసార మును గూర్చి పెక్కండ్రు లఘువ్యాసముల లిఖించిరి. చర్వితచర్వణమే యైనను మాకుఁ దోఁచిన దాని సంగ్రహముగాఁ గొంత తెలిపెదము.

రఘునాథుఁడు పెక్కండ్ర సంస్కృతాంధ్ర ద్రవిడ విద్వన్మణులఁ బోషించి గ్రంథముల స్వయముగా రచించియు, రచియింపించియుఁ జోళ పాండ్య తుండీర దేశముల ననేక పుణ్యస్థలముల దేవతా విమాన మంటపాదుల నిర్మించి చోళదేశమున ననేకాగ్రహారములఁ దన పెద్దలపేర స్థాపించి పశ్చిమోత్తర దేశములనుండి దక్షిణాభిముఖియై పాఱివచ్చు సంగీత దేవతకుఁ దంజాపుర ప్రాంతము విహారభూమిగా నిలిపి శూద్రక వాసుదేవ విక్రమార్క భోజాదుల చరిత్రము లిట్టివని యుద్ద్యోతింపఁ జేయు విద్యావినోదములతోఁ గాలము పుచ్చి కీర్తికాయుఁడయ్యె. ఇతని గుఱించి పెద్ద గ్రంథము రచింపఁదగినంత చరిత్ర సామగ్రి కలదు.

భోజవిక్రమార్కాదుల సభలలో వలె నితని యాస్థానమునఁ బెక్కండ్రు స్త్రీలు సంగీత సాహిత్య నృత్త విద్యలలోఁ బ్రౌఢిమ చూపుచుఁ బురుష ప్రకాండులకు సమానముగా గోష్ఠీ ప్రసంగములఁ జొచ్చి కనకరత్నాభిషేక గౌరవములు వడసి సంస్కృతాంధ్రములఁ గావ్యసంతానముచేఁ దమవంశ కీర్తులఁ బవిత్రతరములుగాఁ జేసికొనిరి. వీరితో మిన్నలని యెన్నఁదగిన యన్నులు రఘునాథచరిత్రము రచించిన రామభద్రాంబయు, రామాయణ సార సంగ్రహము విరచించిన మధురవాణియుఁ గాఁదగుదురు. రామభద్రాంబ తాను రఘునాథుని దేవియని చెప్పుకొన్నది గాని మధురవాణి రాజుతోఁ దనకుఁగల సంబంధ బంధముల వర్ణించుకొన్నది కాదు. కావున నారాజ పురందరుని రహః కేళీవిలాసములఁ బాల్గొనునంత సౌభాగ్య సంపద లేనిదేమో. రేవా, రోహా, శశిప్రభా, అణులక్ష్మి, మాధవీ, ప్రహతా మొదలగు ప్రాకృత భాషా కవయిత్రులును; విజ్జా, విజయా, అవంతిసుందరీ, శీలాదులగు నార్యావర్త సంస్కృత కావ్య కర్త్రులును; కంతిహొన్న మొదలగు కర్ణాట రచయిత్రులును; అవ్వై,

ఆండాళ్ మొదలగు ప్రాచీన విదుషులును, ప్రఖ్యాతలై యుండ నాంధ్రవనిత లలో సంస్కృతాంధ్ర కవయిత్రులు గలరనుటయేమి చోద్యము? మొల్ల, రంగాజీ, ముద్దుపళని మొదలగు నాంధ్రభాషారచయిత్రు లాంధ్ర విమర్శకులకుఁ జిరపరిచితలేకదా. అట్లే గంగాదేవీ, తిరుమలదేవీ, రామభద్రాంబా ప్రభృతులగు నాంధ్రస్త్రీల సంస్కృత వాగ్విలాసము లాస్వాదిత పూర్వములేయగును.

సంస్కృతమున రామాభ్యుదయము రచించిన యభిరామ కామాక్షియు, నందే శ్రీరంగాభ్యుదయము విరచించిన త్రివేణికయు, దృశ్యశ్రవ్యకావ్య ప్రాకృత గ్రంథ సంధాత్రియగు శారదయు, నాంధ్ర మహిళలు గాఁబోలు. వారి వచో గుంఫము కొంచెఱ కింకను శ్రవణగోచరము కాకుండవచ్చును.

గద్యపద్య ప్రబన్ధానాం
పఞ్చాశ్యష్టా దశనాటకైః
సాకం ప్రాకృత కావ్యాభ్యాం
సాహిత్యం శారదావ్యధాత్.

అని డిండిమకవి చక్రవర్తియగు నరుణగిరినాథునిచేఁ బొగడ్తగన్న శారద దేవరాయల యాస్థానవిదుషి యందురు త్రివేణి తానే తన్ను గుఱించి, శ్రీరంగాభ్యుదయ సర్గాంతముల నిట్లు చెప్పుచున్నది.

త్వఙ్గద్గాఙ్గ తరఙ్గ పఙ్క్తివిలస
    ద్భఙ్గీత్రప్రాకృత్స్వ వా
గుమ్భోఽనన్తకవి స్తస్వనూత తనయాం
    యోఽ సౌత్రివేణ్యాఖ్యకామ్
శ్రీరఙ్గాభ్యుదయే తయా విరచితే
    సద్బృన్దనన్ద్యే మహా
కావ్యేఽసౌదశమః సుధాకృత సఖః
    సర్గః స్వమాధుర్యతః.

మధురవాణి రఘునాథుని యాస్థానమున సమస్తవిద్యాప్రసంగములఁ గలసికొని యతఁడు రచించిన రామాయణము పఠింపగా విని సంస్కృతమున రచించినట్లు చెప్పుదురు. కాని యతఁడు రచించిన రామాయణము మాకు లభించి నంత పట్టు పరిశోధింపఁగా మధురవాణి రామాయణసంగ్రహము దానికిఁ దెనిఁ

గింపుగాదని తోఁచెను. మధురవాణి కావ్యము సుందరకాండము వఱకుఁ లభించును. అంతకు పదునాలుగు సర్గలు గలవు. రఘునాథుని బాలకాండములో కొంత భాగము సైతము దానికంటెఁ బెద్దదిగా నున్నది. భావములు గలిసినవి కావు. రఘునాథుఁడు చిత్రరచన పొంతపోక సరళముగాఁ బదములకుగాని, యతిప్రాసములకుఁగాని కష్టపడక మహావర్ణనల సైతము మృదుపద సందర్భముగా రచించుచున్నాఁడు. మధురవాణి యనేక స్థలముల క్లిష్ట రచనకు దిగును. పాఠకులు కాలక్రమమున నవ్యుత్పన్నులుగాఁ బుట్టఁ బోవుదురని కాఁబోలుఁ గొన్ని శ్లోకములకు స్వయముగా వ్యాఖ్యరచించె. పాణినీయము చక్కఁగాఁ జదివెనని చెప్పి తదాస్వాదము చూపుటకుఁ గాఁబోలు "రాజనీతి రపస్పశా" యని మాఘుఁడు చెప్పినట్లు ప్రయోగచాతురిఁ జూపును. ఆమె గద్యములఁ దన్నుఁ గూర్చి యేమనియెః ఇదియె.

తత్రాద్యఘటికార్ధ నిర్మిత శత
శ్లోకీ ఫణిగ్రామణీ
వాణీ ప్రాకృత శాస్త్రనైపుణసము
న్మీలద్యశః శ్రీజుషా
దేవ్యోద్యన్మతి సఖ్యయా మధురవా
ణ్యమ్యాఖ్యయా నిర్మితే
శ్రీరామాయణసారకావ్య తిలకే
సర్గస్తృతీయోఽ భవత్.

అని ఘటికాశతగ్రన్థకర్తల నధఃకరింప ఘటికార్ధ శతగ్రంథ కర్త్రియనియు, ప్రాకృతభాషలోను శాస్త్రములలోను నైపుణి గలదనియుఁ జెప్పకొనియె. ఓవిదుషీమణీ! గ్రామ్యభాషా కవిచక్రవర్తులమగు మాకు నీఫణిగ్రామణీవాణియేలః మఱి కొన్ని గద్యములఁ గానిమ్ము.

ప్రస్తారాభినవాత్త వృత్తకవితా
ధాటీ కథాశుక్రియా
షడ్భాషారచనా విశేషబహుధా
విఖ్యాత కీర్తిశ్రియా
దివ్యోద్య ·సర్గస్తురీయోఽగమత్.

మా కాలము నాఁటి యాశుకవిత సర్వకాల సర్వావస్థలలోను బ్రారంభించిన నిలువఁజాలక వీథులలోనసహిత మసర్గళముగాఁ బ్రవహించుట నీవు చూచిన దానవుకావు. నీశబ్దాభాషారచనలో నత్యుత్కృష్టమగు మాగ్రామ్యభాషా నముల్లా నములు కలవేని తక్కిన యెదును దప్పక శ్లాఘ్యములే యగు. ఇంకను నీ ప్రతిభ గొంత వర్ణింపుము. వింటము.

వీణావాద కళా వినోదసమయే
ధృత్వా సమస్యాః శతః
సద్యస్సంనది సాధుపూరయతి యా
దత్తాః కవీన్ద్రైస్తయా
దివ్యోద్యన్మతి సఖ్యయా...
సర్గోఽభవత్పఞ్చమః.

అనువాదినీయంత్రములును (గ్రామఫోనులు) హార్మోనియములును నా కాలమున నుండిన యెడల నోకళావతీ వేయు సమస్యల బూరించియుందువు. అయినను నీచాతుర్య ముభయకళాధ్వంసక మని మా సఖ్యులు రహస్యముగా గుస గుసలాడుచున్నారు. నీ పాట కానిమ్ము.

ప్రఖ్యాతార్జవయా పదార్థ గమక
వ్యాఖ్యానపక్షాన్వయ
ప్రాగల్భ్యస్పదనైషధ ప్రతివిధా
సానంద సూరీన్దయా,
దివ్యోద్యన్మతి సఖ్యయా...
సర్గోఽత్రషష్ఠోఽభవత్.

నీయందున్న యార్జవము మేమెఱుఁగఁజాలము. కాలమను యవనిక నిన్ను మఱుగుపఱచుచున్నది. పోనిమ్ము. వామత్వము లేక యార్జవము గలదేని దాని యందు స్త్రీత్వములేదని "అవామతా కామశత్రుః" అని పాంచాలుఁడును,

గ్రామేవాసః శ్రోత్రియ
కథనం పరతంత్రతా కృపణభావః
ఆర్జవయుతాచ నారీ
పుంసాం మదనాంతకారిణః కేచిత్.

అని యీశ్వరదత్తుఁడును జెప్పుదురు. విద్వదౌషధమగునైషధమునకుఁ బ్రతికృతిఁ గల్పించెదవా? వసుచరిత్రను జూచి వేయుఁబ్రతికృతుల నిర్మించు

మాయాంధ్రులలోఁ బుట్టిన దానవుకావే? నీకేల యట్టి చాతుర్యమలవడకుండుఁ గానిమ్ము. ఏమి యూరకున్నావు? విషయాంతర ప్రసక్తమగు వామత్వమును సౌజన్యధర్మమగు నార్జవమును వర్ణించుచో నప్రస్తుతప్రశంస చేసితినని కోపమా? నిన్నార్జవ మాశ్రయింపఁగా మావాక్కున వక్రోక్తి ప్రవేశించె. పోనిమ్ము నీశక్తివర్ణన జరుగనీ. నీవాణి యాత్మస్తుతియందుఁ గేవలము మధుర ముగా నున్నది వింటిమి.

స్వాద్వీ దుగ్ధసితా సుధామధురవా
గ్యక్రాన్త సంతోషిత
ప్రౌఢ శ్రీరఘునాథ దత్తా శుభవ
త్స్వార్థాభిధా సంభృతా.
దివ్యోద్యన్మతిసఖ్యయా...సర్గోఽభవత్సప్తమః.

స్వాద్వియగు నీవాక్కు సాక్షాత్తుగా విన్న రఘునాథుఁ డక్రాంత సంతోషియై యెన్నియేని బిరుదములు నీకొసఁగఁదగు. మాకు నీగద్యములలోని యుత్తరార్ధము పల్లవిగా వినివిని పరిచయాధిక్యముచే మాశ్రోత్రములు జగ మంతయు మధురతరముగా గ్రహించుచున్నవి. కథ సాగనిమ్ము.

సద్యో విస్మయ కృన్నిరోష్ఠ్య కవితా
సందర్భ ధారాసుధా
సారోర్మి పరిపూరిత శ్రుతిసుధీ
సంభావితాభిఖ్యయా
దివ్యోద్యన్మతి సఖ్యయా...
సర్గోఽజనిష్టాష్టమః.

ఇందు శ్రుతి యనఁగాఁ జెవియనియే కదా యర్థము. కాక సంగీత స్వర ములలోని శ్రుతులైనయెడల మధ్యమ పంచమములగు జీవస్వరముల నోష్ఠ్యము లని వదలినచో నీసంగీత మతిమానుష మగునోయని భ్రమించితి. పోనిమ్ము. నీ నిరోష్ఠ్య కవితా గద్యమున నీపేరెట్లు కూర్చెదవో వామత్వము పూనక యార్జవముగాఁ జెప్పుము. లేక మధురశబ్దము తొలఁగించుకొనెదవా? ఏమి! విస్మేరనమ్రముఖివయ్యెదవు? అహో, యాఁడుదానవు కదా! మఱచితి.

మాధుర్యైకధురంధరాంధ్రకవితా
నిర్మాణ సమ్మాన్యయా

దివ్యోద్యన్మతి సఖ్యయా మధురవా
ణ్యమ్మాఖ్యయా నిర్మితే
శ్రీరామాయణసారనామని మహా
కావ్యేఽతిభవ్యే సుధీ
వర్గోల్లాస విశేష ధామ్నినవమః
సర్గో మనోజ్ఞోఽభవత్.

ఏమి విదుషీమణీ!ద్విపాదియగు పల్లవి త్రిపాదియయ్యె. ఇఁకఁ జతుష్పాది యగునా యేమి? లేక యాంధ్రకవితలోని భావదారిద్ర్యము నిన్నావహించెనా? కావుననే కాబోలు నీ యాంధ్రప్రబంధములు మాకాలమువఱకు రావయ్యె.

సూరిస్తవ్య కుమారసంభవమహా
కావ్య ప్రతి గ్రన్థన
ప్రాగల్భ్య ప్రకటశ్రియా పదసదః
ప్రఖ్యాతవైదుష్యయా
దివ్యోద్యన్మతి సఖ్యయా...
దశమ సర్గోఽత్రకావ్యే భవేత్.

రఘువంశమునకు యదువంశమనియు, భారవికి భూరవియనియు, మేఘసందేశమునకు హంససందేశమనియు, మాఘమునకు ఫాల్గునమనియు, కుమారసంభవమునకు మారసంభవమనియు, నొక మహాకవి ప్రతి గ్రంథన చేసె. ప్రతిగ్రంథన కలానైపుణ మతనివలన సంపాదించితివా? లేక జాతి ధర్మమా? నీదేశికు లెవ్వరో తెలుపవైతివే?

ప్రౌఢ శ్రీరఘునాథనాయక కృత
స్వర్ణాభిషేక క్రియా
దివ్యోద్యన్మతి సఖ్యయా మధురవా
ణ్యమ్మాఖ్యయా నిర్మితే
శ్రీరామాయణసారనామని...
సర్గస్త్వైకాదశః.

కనకరత్నాభిషేకముచే నీ శరీరము మందాకినీ జలావగాహముచేతవలెఁ బవిత్ర మయ్యె. ఇట్టి ధన్యురాలింగన్న తల్లిదండ్రుల పేరులఁ దెలుపుము. వినియానం దింతము–

'ఏమి నీ యసందర్భ ప్రశ్నము? కాళిదాసాదులు తమ జననాదులువర్ణించు కొనిరా! గ్రంథములు చదువు పాఠకులుకదా తత్తద్రసభావ గుంభనములచే కవివ్యక్తుల ననుమానమున నిర్ణయింపవలయు,' అని చెప్పెదవా?

ఓకవయిత్రీ, ఏమి ప్రతారణము చేసెదవు. కవుల చరిత్రములు వ్రాయు నప్పుడు తల్లిదండ్రుల పేరులును, నియోగియో తదన్యుడో, గోదావరీ మండల స్థితుడా లేక యనాంధ్రుడా, యనుట ముఖ్యాంశములుగా మేమాంధ్రులము పరిగణించి యున్నారము. అందుకొఱకడిగితిమి. నీకంత కోపమురానేల? కాళిదాసాదులు తమ విషయముగా సర్వత్రమౌనమునే పూనిరి. నీవు నీపాండిత్య విశేషమును బహుభంగిగా గద్యముల జెప్పినందున నీ జననకథ యడిగితిమి. నీవును కాళిదాస భాససరణి నవలంబించియున్నచో-

ఏ దంపతులకుఁ బొడమెనో, యేదేశమునందు గీర్తి కెక్కినవాఁడో, ( తుదకు ) ఏదెసవాఁడో యెఱుంగను అన్నవాక్యమున లింగముమార్చి నీకన్వయించి యుందుము. కాని యాత్మప్రఖ్యాపనశీలవగు నీకు సిగ్గేల? చెప్ప రాదా? "సరస్వతీ పవిత్రాణాం జాతిస్తత్ర న కారణం" అని యొక్క క్షత్రియ సార్వభౌముఁడు పలికెఁగదా! మేము నామతమలోని వారము. నీవు నిశ్శంక ముగాఁ దెలుపుము. భోగిని వనిసంకోచించెదవా? ఈ వ్యాసమున మంగళాంతము చూడుము. పోనిమ్ము గ్రంథము నారంభింపుము. కొంత తెలిసికొందము.

లక్ష్మీం దిశేల్లక్షణ పూర్వజన్మా
వీరో రఘూణాం విజయం ప్రయచ్ఛేత్
ఆరోగ్య మర్కాభి జనశ్చదద్యా
ద్రతీశమూర్తే రఘునాథ సేతుః.

ఇది శ్రోత్రియ బ్రాహ్మణుల యాశీర్వచన మంత్రమువలె నున్నది. కృత్యాదినే రతీశబ్దమునకు సందర్భమేమి? రఘునాథ శబ్దముతో నాంధ్రభాషా సంప్రయుక్తమగు విశ్రామనియమ మర్ధసమముగా నిందు సంఘటించుచు రతీ శుఁడు యతీశుఁడయ్యెనా? కృత్యాద్యవస్థయను వాచోయుక్తి నీయందు నిక్క మయ్యెఁగాఁ బోలు.

సాహిత్య సద్వర్త్మని సంచరన్తః
స్తనః పురోనామగతిం సమేత్య

శబ్దాయమానాన్ శ్రవసోరసహ్యం
నకాకవీన్ ద్రష్టు మపిక్షమన్తే.

కుకవిదూషణము కావ్యమర్యాదకదా. అది లేకున్నఁ బ్రబంధముమెఱుఁగు వెట్టనియాభరణమువలె నగు. కాకులు కుడియెడమగా వచ్చుట యపశకునమా?

రఘునాథుని వంశావళి బహుగ్రంథముల వర్ణితమయ్యె. మేము విన్నదే దాని దాఁటి నీ గ్రంథరచనకు సందర్భము రచించితివేని చదువుము.

యదన్తరావర్తిత నర్తనానాం
సీమన్తినీనాం శ్రమమాక్షిపన్తి,
పర్యన్తయన్త్రి ప్రతిమాకరాగ్ర
ప్రకీర్ణజాతాః పవమానపోతాః.

ఇది రఘునాథ సభలోని శిల్పప్రతిమారచనకదా!

విపశ్చికాయాం చతురాః ప్రగల్భాః
శాస్త్రేఽతిదక్షాః సరసప్రబన్ధే
సమీపమేతస్య సమేత్యకేఽపి
సుభ్రూజనాః స్వస్వకళా వ్యవృణ్వన్.

ఇది యంతఃపురవృత్తమా, లేక సభా నిర్వృత్తమా?

రామాయణం శ్రీరఘునాథ నామ్నా
రాజ్ఞామునా నిర్మిత మన్ధ్రివాణ్యా,
కర్ణామృతం కావ్య మతీవభవ్య
మపాఠి పాఠీనదృశా కయాచిత్.

రఘునాథుని యంధ్రరామాయణము నొకతె పఠించుచుండెనా?

సర్వోత్తర స్వాదిమ సంస్కృతాంధ్ర
ప్రబన్ధ నిర్మాణ పచేళిమాని
యశాంసిభూయాం స్యధితారయన్త్యః
సహస్రశః సన్తి సరోజనేత్రాః.

రఘునాథరామాయణముఁ దెనిగింపఁగల స్త్రీలు గలరాయని ప్రశ్నించి నపుడు పై సమాధానము కలిగెను. ఉత్కృష్ట సంస్కృతాంధ్ర ప్రబంధ నిర్మాణ కీర్తిగల స్త్రీలు వేనవేలు గలరనే కదా? విక్రమార్కుని యట్టి దాతగలఁడేని కాళిదాసువంటి కవులేల పుట్టరు?

రసోత్తరం రామకథానుబన్ధి
కావ్యంమయా కల్పిత మన్త్రివాణ్యామ్
కార్యం కయా సంస్కృత వాగ్భిరేత
దిత్యేష చిత్తే గణయన్న వాక్యాత్.

ఇది రఘునాథుని వాక్యము. తన రామాయణము నెవ్వతెయైనఁ దెనిఁగింపఁగలదాయని. రఘునాథుఁడు రామునియందు పరమభక్తుఁడు. రామసేతు శ్రీరంగ విజయ రాఘవపుర కుంభఘోణాది దివ్యస్థల ప్రతిష్ఠాపిత రామభద్రుఁడని తన యాంధ్ర గ్రంథ గద్యములతోను "శ్రీరామసేతావపికుమ్భఘోణే శ్రీరఙ్గధామన్యపి రామభద్రమ్, దేవం ప్రతిష్ఠాప్యతరా మతానీః ప్రాకార సద్గోపుర మణ్టపాని, రథోత్సవాదిర్మహతీం విభూతిం రసాదకార్షీ రఘునాయకస్య" అని సంగీతసుధలో రఘునాథుని సంబోధించి చెప్పఁబడియె.

కావుననే రామకథ యెన్ని ముఖములనైన వినఁగోరి స్త్రీ వాక్కు మధురమగుటచేత తద్రచనకు స్త్రీ కవులఁ గోరుకొనియె. అంతనారాత్రి స్వప్నమునఁ దన యిష్టదైవమే ప్రసన్నుఁడై.

చతుర మధురవాణీం సమ్యగాకర్ణ్యయస్యాః
సదసి మధురవాణీ నామదత్తం త్వయైవ
సరసకృతి విధాయాం సాధుమేధావిశేషా
స్వధికపటురశేషా స్వమ్బుజాక్షీషు సైషా.

రాముఁడు "నీచే మధురవాణి యను బిరుదము పొందిన మేధావతి, స్త్రీలలో నెక్కుడు కవిత్వపాటవము గలది." యని చెప్పెనే కాని యామెకుఁ దల్లిదండ్రులు పెట్టిన నామమును దెలుపఁడయ్యె. సర్వాంతర్యామియగు భగవంతునకు గూడ దాని పేరు దెలియదా?

విద్యాన్వవాయే విహితావతారా
సుశిక్షితాసౌ విదుషాత్వయైవ
విద్యా పరీక్షా సమయే విశేషాత్
ప్రకాశమాన ప్రతిభానుభావా.
చాతుర్యమేతి కవితాసు చతుర్విధాసు
వీణాకళా ప్రకటనే భవతీ ప్రవీణా,
ప్రజ్ఞామయం నిపుణ మఞ్చతిపాణినీయే

మేధాం వ్యనక్తి బహుధా వివిధావధానే.
కర్తుం పటుః కావ్యమిమం స్వయంతే
సాహాయ్యకం చేత్క్రిముతేతి సద్యః
ఆవేద్యరామోఽ స్తరధాత్రప్రభాతే
పయోధికాఞ్చ్యః పతిరిత్యబోధి.

అని శ్రీరామచంద్రుఁడే గ్రంథకర్త్రి పాండిత్య శక్తుల వర్ణించె. రఘునాథుఁడే దానికి విద్యా గురువైనప్పుడు కొఱంత యేమిః మీమాంసాలంకార శాస్త్రముల జితశ్రముఁడగు యజ్ఞనారాయణకవియుఁ దాను రఘునాథుని శిష్యుఁడనియే చెప్పుకొనెను.

ప్రౌఢ శ్రీరఘునాథభూపతికృతా
స్ఫారీ భవత్సాహితీ
సామ్రాజ్యస్తనయోఽతివిశ్రుతనయో
గోవిన్ద యజ్వేశితుః
షష్ఠస్సర్గ మపూరయత్

అని మఱియు,

కావ్యాలంకృతి నాటకాది కలనా
పాండిత్య మత్యద్భుతం
సర్వజ్ఞో రఘునాథ భూశతమఖో
యస్యోపదిశ్య స్వయమ్
ఆదాతుం గురుదక్షిణామభిమతా
మర్థోఽప్యహోదత్తవాన్
కర్ణాలంకరణా నిజంచపతకం
పాదాబ్జదంకంకణమ్.

అని రఘునాథుఁడు యజ్ఞనారాయణకవివలన గురుదక్షిణ గ్రహింపక శిష్యునకుఁ దానే కుండల కంకణాదు లొసంగెనఁట. ఇది విద్యారసికుని వాత్సల్య చేష్టయె. లక్ష్మీ సరస్వతు లహమహమికగా విలాసము లెవ్వానియందు నిలుపుదురో యా పురుషుని జన్మజీవితములు ధన్యత్వము నెంది జీవలోకమును రసమయముగాఁ జేయుననుట వింతయే.

"ఆంధ్రక్షమామండలాఖండలుండైన
వేమభూపతి కృపావీక్షణంబు
వేదాద్రి నరసింహ విపుల వక్షస్థలీ
కహ్లార మాలికా గంధలహరి
ఘోడెరాయాంక సద్గురు రాజభీమేశ్వ
రస్వామి పదసమారాధనంబు
కమలాద్రినిలయ మార్కండేయ శశిమౌ

కారణంబులు నుద్బోధకములుగాఁ గ
సంభవించిన సాహిత్యవిద్య.

అని శ్రీనాథుఁడు తనకు పెద్దకోమటి వేమభూపతియు, అహోబల నృసింహస్వామి వరప్రసాదమును రెడ్డిరాజులకు గురుపీఠ మధిష్ఠించిన శైవాచార్యుఁడగు ఘోడేరాయ భీమేశ్వరుఁడను పండితోత్తముఁడును విద్యా ప్రదాతలైరనుటచే వేమనకు శ్రీనాథుఁడు శిష్యుఁడాయని సందియము గలుగు. కారణోద్బోధక శబ్దములా యర్థమునకు వారకములయ్యు మహాకవుల వాక్కులు వేయు విధముల ధ్వనించుచుండునని భీతిచే నారాజేంద్రుని గురుభావము శ్రీనాథుని యందుఁ బ్రసన్నమయ్యెనా?

స్వప్నానంతరము రాజు సభాస్తారులతోగొలువుండి మధురవాణింబిలిపించి రామకథ రచింపుమని సస్నేహముగా నాజ్ఞ యొసఁగె.

ప్రకృతి మధురకావ్య ప్రౌఢ సన్దర్భ విద్భి
ర్యువతి జనమణీభిర్యుక్తపార్శ్వద్వయోఽసౌ
అథ సవిధము పేతాం సౌహృదాదాహ్వయన్మా
మవని బరిబృఢానా మగ్రణీరిత్య భాణీత్
అజహదలంకృతి క్రమ మనేక రసోల్లసితం
సరసపదార్థ సంగతి సమగ్ర గుణానుగుణమ్
రఘు రమణప్రబన్ధ తిలకం రసికాభిమతం
సుదతి విధీయతామితి సుధీ రగదీన్నృపతిః.

అని గ్రంథరచనకు ప్రోత్సాహకరముగా గ్రొత్త రత్నాహారమును వజ్రములు చెక్కిన యంగదాదులఁ బ్రీతిదాయముగా నొసఁగె. పూర్వము

శకారాతిపురుషుఁడను కవి తన విజయప్రతాపకీర్తుల వర్ణించిన కొలఁది ప్రహర్షోద్రేకమున మదజలాసార సంక్లిన్న పథ్యానముద్యదకాల ప్రావృషేణ్య సౌభాగ్యంబుగ భద్రగజ శతంబుల నొసంగెనట.

శ్లోకోఽయం హరుషాభిధా కవినా
దేవస్య తస్యాగ్రతో
యావద్యావదుదీరితః శకవధూ
వైధవ్య దీక్షాగురోః
తావత్తావదుపోఢ సాన్ద్రపులకో
ద్భేదః సతస్మై దదౌ
లక్షంలక్ష మఖండితం మదజల
ప్రక్లిన్న గండం గజమ్.

అని శాకరాతియగు విక్రమార్కుని రసికతయు నుదారతయు వర్ణింతురు. ఆగజచయంబును మన కవయిత్రి యాభరణములతోడనే యంతర్ధానము నెందెఁగాని తత్కృవు లొసంగిన కావ్యదీపికలు కాలదండమును ఖండించి బ్రహ్మాండవ్యాప్తి నెంది నక్షత్రలోకమువలె స్థిరజీవములై యున్నవి.

ఇఁకఁ గథా భాగము నెట్లు కవి తన బిరుదు నెల్లించి రచించెనో చూతము. కుశలవులు వాల్మీక్యాశ్రమమునఁ గాబోలుఁ జెఱియొక వీణపుచ్చుకొని శ్రుతులు గూరుకొని తంత్రులు సారించి కంఠనాదములు కలియునట్లు పాడిరట.

తౌ వల్లకీ మఙ్కతలే నిధాయ
శ్రుతిప్రమాణం స్ఫురిత ప్రధానమ్
తన్త్రీ సమన్తాన్మృదు సారయన్తా
వాలోకయామాసతు రైకకంఠ్యమ్.

స్ఫురితమనునది గమకముల లోనొకటి.

గ్రామద్వయే దీవ్యతి భూతధాత్ర్యాం
ప్రశస్యమానే సురభౌచజాతే
రసగ్రహాంశాంతర మార్గలక్ష్యా
తాలేషునైకాఙ్గ కశోన్నతేషుః

ఈ శ్లోకములకెల్లఁ గవయిత్రియే వ్యాఖ్యయుఁ గూర్చె. షడ్జ మధ్యమ

గ్రామములలో గ్రహాంశ న్యాసములుతప్పక యల్పస్వర సంగతి విశేషములతో సుఖమైన జాతి గ్రహించి లఘుద్రుతాది తాళాద్యంగ నియమములతోఁ పాడఁ బోయెదరు. అంతర మార్గమున "అల్పత్వాభూజాం స్వరాణాం విచిత్ర సంగతి విశేషః-తదుక్తంన్యాసాదిస్థానముజ్ఝిత్యమధ్యేమధ్యేఽల్పతాయుజామ్ స్వరాణాం సంగతి."అని యామెయేటీకలో వివరించెను.గాంధారగ్రామము స్వర్గలోకముననే ప్రసిద్ధము. కిందవర్ణింపఁబోవు రాగములలో వికృత స్వరములే ప్రధానములు కావునను షడ్జమధ్యమ గ్రామములలో స్వరశ్రుతులు నియతము లగుటయు వికృత స్వరములలో శ్రుతినియమము లేకుండుటయు షడ్జమధ్యమ గ్రామవిభాగమే నేఁటిగాయకులలోను దక్షిణదేశ వీణలలోను గానరాదు. కావున గ్రామద్వయ ప్రశంస కేవల మర్థవాదమై సంగీత ప్రశంసాపరమగు.

వివాదినం పరిమృద్యవాది
సంవాది నావవ్యవాదినంచ
ప్రకాశ్య కాలస్ఫురితాది హృద్యం
స్థాయి క్రమేణాపి విచిత్రవృత్తిః.

వాది సంవాద్యనువాది స్వరములు పరసర్ప మైత్రితో మెలఁగును. వివాదులు స్వరవ్యక్తి నశింపఁజేయు. స్ఫురితకము గమకములలో నొకటి.

వృత్తులు వేగమును బాటించు మూఁడు గతులు-చిత్రవార్తిక దక్షిణములని. స్థాయి క్రమమనఁగా నొకానొక స్వరము నుండి యారోహావరోహ రూపములుగా స్వరసంచారము చేయుట యని యందురు.

ఉత్కర్ష ధన్యర్షభలాలనీయ
ముద్యత్సుధోన్మేష విశేషధన్యమ్
విశుద్ధి భాస్వత్సమాపాలి భావం
నాట్యం పటుత్వం బహు నాటయన్తే.

నాటరాగమేళయని ప్రకృతార్థము. నాట్యమని యప్రకృతార్థము. ఇందు ప్రకృతార్థము ధన్యులలో ఋషభులు (శ్రేష్ఠులు) వారిచే లాలనీయము. సుధ యొక్క యున్మేషము, సమపాతి (పాదవిన్యాసము సమముగా నడచుట).

ప్రకృతార్థమున, ఉత్కర్ష-తంత్రులఁ బైకి నుద్ధతముగా నాకర్షించుట ధ, ని, ఋషభస్వరములచే (ధైవతనిషాదర్షభములు)శ్రుత్యధికములగుట, షట్

శ్రుతిధైవతర్షభములు, కాకలీనిషాదముఁ అందుచే నంతరగాంధారము)సమపానాం, షడ్జమధ్యమ పంచమముల శుద్ధస్వరత్వము గల సమపానాం షడ్జమధ్యమ పంచమముల శుద్ధస్వరత్వముగల నాటరాగమేళ యని యర్థము.

నాటమేళమున శుద్ధములు షడ్జమధ్యమ పంచమములు. దైవతర్షభములు షట్ శ్రుతికములు, గాంధారనిషాదము లంతరకాకలీనామకములు. ఈ నాట దేశి రాగములలోఁ జేరినది కావున షడ్జమధ్య గ్రామవ్యవస్థలో వచ్చునది కాదు. నాటరాగము మొదటఁ జెప్పుటకుఁ గారణమేమన రఘునాథుని సంగీత సుధలో నిది ప్రథమమేళముగా గ్రహింపఁడియె. దీనినే కశ్యపాదులు నర్త రాగమనిరి.

మఱియు రఘునాథుని కీరాగ మెక్కువప్రీతి నొసఁగుచుండెనని తోచు చున్నది. మఱియు నది మంగళకరమందురు. రఘునాథుఁడు బాల్యముననే తండ్రియొద్దకు రాఁగా సభలోఁ గుమారుని విద్యాసంస్కారము పరీక్షింప నతఁడు మొదట నాటరాగమునే రూపకాలాపాదిలక్షణములతో రాగ వర్ధనీ క్రమములతోడఁ బాడి వాయించి చూపినట్లు యజ్ఞనారాయణదీక్షితులు సాహిత్య రత్నాకరమునఁ జెప్పుచున్నాడు.

రాగేణతేన ప్రథితేన ఠాయ
గీత ప్రబంధాన్ పటు వాదయిత్వా
పరం విదూరీకృత పంచమోద్య
త్ప్రసక్తి గౌళస్ఫురణం ప్రకాశ్య.

గౌళ స్ఫురణమనఁగా గౌళరాగపు గమకము లేక వ్యక్తీకరణము. దూరీ కృతపంచమ = పంచమస్వరము పరిహరించినది. పంచమస్వరమువదలి తక్కిన యాఱుస్వరములతో గౌళరాగ మారోహమున షాడవమను సంజ్ఞ చెందుచున్నది. సంపూర్ణముగా రాగము విస్తరింపఁదగినచో నాలాప, ఠాయ, గీత, ప్రబంధము లను నాలుగంగములఁ బరిపూర్ణము సేసి పాడుట యుత్తమ గాయక సంప్రదాయము. ఇందు ఠాయ గీత ప్రబంధములు మూడు చెప్పఁబడియె. గౌళరాగమును చౌకముగా వర్ధనముచేసి సర్వజనామోదము కలిగించిరనుట ప్రకృతార్థము. అర్థాంతరమునఁ గోకిల స్వరోద్యత్ప్రసక్తి యని మధురవాణియే వ్యాఖ్య యొనర్చె.

ఈ శ్లోకమునకుఁ గవి పంచమమనఁగా ధైవతస్వరము ; "గౌళస్తదంగ విన్యాస గ్రహాంశః పంచమోజ్ఝితః ఇతి గౌళేగ్రహస్స్వరో నిషాదః తద పేక్షయా పంచమోధైవతః." అని సంగీతరత్నాకర శ్లోకము నుదాహరించి పంచమముఁ (అయిదవది)ధైవతము వర్జ్యమనివ్యాఖ్యచేసె. పంచమశబ్దము సరిగమ పధని స్వరములలో నొక్కటి యగును. అదిపారిభాషికార్థము. పంచమము అయిదవది ఇది లౌకికార్థము. ఈమెశ్లోకమున పంచమశబ్దమును లౌకి కార్థమున వ్యాఖ్యాన మొనర్చె. దీని రత్నాకరవాఖ్యాతలు (సింగభూపాల కల్లినాథు లిరువురును) సుగమమని వదలిరి. అందుచేఁ బంచమస్వరమని పారిభాషికార్థముననే గ్రహింపవలసియుండును.

మతంగుఁడు—

టక్కరాగేణ సదృశః పంచమేవ వివర్జితః
షడ్జాంశన్యాస సంపన్నో గౌడః స్యాత్స్ఫురితర్షభః.

అనియు ; నాన్యదేవుఁడు (సరస్వతీహృదయాలంకారమున) న్యాసాంశగ్రహః షడ్జపంచమ హీనస్త్వథర్షగ్రహః స్ఫురితాఖ్య గమకనిబిడోగౌడః స్యాత్టక్కరాగరవసదృశః' అనియు,

జగదేకమల్లుఁడు సంగీతచూడామణిలో ''గౌడః స్యాత్ టక్కరాగాంగః
సన్యాసాంశ గ్రహాన్వితః వర్జితః పంచమే నైవరసే వీరే నియుజ్యతే
జాతేశ్చాంగం నిషాదిన్యా వదన్తి నతు మే మతమ్.''

అనియు, వారెల్లరు పంచమహీనమై గౌడరాగము షాడవమనియు, షడ్జగ్రహముగలదై (అనగా షడ్జస్వరముతో ప్రారంభించుట) దానితో న్యాసము (అనగా ముగింపు) అనిరి. టక్కరాగచ్ఛాయగాక నిషాదినీ జాతిలోఁ బుట్టినదన్న మతము జగదేకమల్లుఁ డంగీకరింపఁడు. అనఁగా నిషాదస్వర మంశస్వరమగుట (ప్రధానము, లేక జీవస్వరమగుట) ఏలయనఁగా నిషాదమునకు గాంధారము వది యవశ్రుతిలో నుండుటగా సంవాదిత్వము కావలయును. గాంధారనిషాదము లెల్లప్పుడు వివాది (విరోధి)స్వరములు కావున నిషాదము గ్రహాంశ స్వరములుగా గ్రహించినచో రక్తినాశమగు. నిషాదముగ్రహాంశమని శాస్త్రమందున్నను ఋషభమే యంగస్వరమగుట వాడుక. రికిపంచమ (అయిదవ)స్వరముధైవతము. దానిలోపింపఁజేసిరి. ఈ యంశమునే రఘునాథుఁడు సంగీతసుధలో నిట్లుచెప్పె

వక్ష్యామహే సంప్రతి గౌళరాగ
మేళో భవేదత్రచ గుర్జరీవత్
గౌళస్యచైతన్య వదామిలక్ష్మ
న్యాసో గ్రహాంశోఽత్రనిషాద ఏవ
షాడవో ధైవతలోపతః స్యా
ల్లక్ష్యానుసారా దృషభస్త్వి హాంశః
అత్రోచ్యతేఽన్యస్వర శత్రుభూతే
గాన్ధారకే కించనిషాదనామ్ని
ప్రధాన భావోఽం శతయానయుక్త
స్తన్మా దిహస్యాదృషభస్వరోఽంశః
రాగాభియుక్తై రతఏవకైశ్చిత్
సంకీర్ణరాగత్వముదీర్యతేఽస్య.

అని యంశస్వరము ఋషభమనియుఁ గొందఱు దీని సంకీర్ణజాతిలోఁ బఠింతురనిచెప్పె.కొందఱనఁగా రామామాత్యాదులు. వారు దానినధమ రాగమనిరి. అనఁగా ఆలాప ఠాయగీత ప్రబంధములను నాల్గంగములు దీనికి రావని భావము. వేంకటమఖి చతుర్దండిప్రకాశిలో గౌళాదిసప్తరాగములను నిషాదము గ్రహస్వర మని చెప్పి- గౌళస్తుషాడవోరాగో రాగాంగో ధైవతోజ్ఝితః వాదిసంవాదినా వత్రం గౌళశ్వత్పగీయతే. అని ధైవత లోపముచేత షాడవమనియె. తులజా రాజు తన సారామృతమున-గౌళోమాళవగౌళీయ మేళజో ధైవతోజ్ఝితః షాడవో నిగ్రహో రాగాంగోఽయం శశ్వత్ప్రగీయతే-అనియె.

మఱియుఁ రఘునాథుఁడు, గౌళరాగమునుగుర్జరీ మేళజన్యముగాఁ జెప్పె. రామామాత్యుఁడు శ్రీరాగముక్రిందను, వేంకటమఖి స్వతంత్రమేళకర్తగాను, పరమేశ్వరుఁడును స్వతంత్రమేళముగాఁ జెప్పిరి. సంత్యజ్య మేషమవరోహతి వైణికైస్తు తత్షాడవౌడువగణే పరిగణ్యగీతమ్—అని మేషమును (అనగాగాంధా రమును)పరిత్యజించియవరోహించుచు నౌడువమగుననియె.కావునదీనికిపీరిమతాను సారము ఠాయాదులు పొసఁగవని భావము. నేఁటికాలమువారు దాని మాళవగౌళ మేళజన్యమందురు. పై సూచించిన మతభేదములుగల గౌళరాగమునకు ఠాయా దులు కూర్చినట్లు మధురవాణి చెప్పుచున్నది

ఆలాప, తాయ, గీత, ప్రబంధములను నాలుగంగములను నాలుగు దండములని యందుచే రాగము చతుర్దండిత విలసితమని గోపాలనాయకుఁడు చెప్పినట్లు వేంకటమఖి చెప్పుచున్నాఁడు. ఆలాపమనఁ గేవలము స్వరసందోహమున నారోహణావరోహణాది చమత్కృతి. తాయమనస్థాయిగా నొకస్వరమును నిర్ణయించుకొని యారోహావరోహగమక చమత్కృతి. చమత్కృతి నాతిద్రుత విలంబితములుగా జరుపుట. గీతమన స్వరతాళ పదాత్మకవైచిత్రి. ప్రబంధమన స్వరతాళ పద రసభావ పుష్టి చమత్కృతులు గలుగును. కావుననే సంగీత సూర్యోదయమున స్థాయి సంచార్యారోహావరోహణములకే చతుర్దండియని నిర్వచించెను.

ఈ గీతతాయ ప్రబంధ వైచిత్రి దేశీయరాగములకే కాని కేవలము యజ్ఞోపయోగముగా దేవతా స్తుతిపరమగు గాంధర్వమున వచ్చు గ్రామరాగంబులకు లేవని యాంజనేయాదు లనుశాసించిరి.

తథైవతాదృఙ్మహితప్రకర్షం
వరాళిరాగోల్లసనం సృజన్తే
వ్యంక్తేః స్మనామన్తముఖారిపాళి
జయన్తసేనాదిషు చాతురీంతా.

మ = మధ్యమస్వరమున, హితమైన ప్రకర్షం అనఁగా వరాళిరాగమున మధ్యమ స్వరమునకు ౬ లేక ౭ శ్రుతులుగలవందురు.

సామన్తము, ముఖారి, పాళి, జయన్తసేన-రాగభేదములు. జయన్తసేన రఘునాథుఁడే యుద్ధరించినట్లు చెప్పుచున్నాఁడు. అది భైరవీమేళజన్యమని తాఁ జెప్పె "జయన్తసేనా రఘునాథ భూమి పురన్దరేణైవ సముద్ధృతాచ, సదాప్రగేయా శుభదాయకా స్యాద్రక్తిప్రదాచాఖిలదాయకానామ్." అని సంగీతసుధలో రఘునాథుఁడే చెప్పెను. షణ్ముఖుఁడును తులాజామహారాజును దీనిని శ్రీరాగమేళము క్రిందనొనఁగిరి. శ్రీరాగమున జతుశ్శ్రుతికము ధైవతము. భైరవిలో ధైవతము శుద్ధము. ఇదియే భేదము-ఇట్లే సంగీతశాస్త్రమర్మములు సూచించునట్లు కుశలవుల గాన వైఖరి ౩౮ శ్లోకములలో వర్ణింపఁబడియె.

కథాభాగములోఁ గొన్ని వర్ణనలఁ జూతము. కథాశరీర నిర్మాణకౌశలము చూపుటకు రామాయణకథ పొంకముకాదు. ఏలయనఁగా సుప్రసిద్ధమయిన కథాఘట్టనముగల పురాణ పుణ్యకథల మార్చినచో సీతాది దివ్యకాంతల లోకోత్తర

గుణ సంపత్తియు, రావణాదుల యుద్ధతియుఁ గొంతమాఱి ధర్మోపదేశము భిన్న రూపము వహించి లోకులహృదయాధిష్ఠిత నిత్యార్చనీయ దివ్యమూర్తులు స్వరూప నాశము నెందును.

ఇఁక నట్టికథలఁ బుణ్యానుబంధముల నిగ్రహించువారు కథా నిర్మాణ కౌశలము వీటిఁ బుచ్చి సల్లాపనైపుణియు, నానారసభావ గుంభనాసంభావనయు, లోకజ్ఞతయుఁబ్రసన్న గంభీర పదరచనా విచక్షణయు క్షీరాబ్ధి కల్లోలమాలా పరంపరలవలెఁ దెరలెత్తి సదర్థజాలము పొంగిపొరలునట్లు రచించు ప్రభావమును జూపఁగలుగుదురు.

పాత్రసంభాషణ వైచిత్రి శ్రవ్యకావ్యములకంటె దృశ్యకావ్యములలోఁ బ్రవ్యక్తముగానుండు.మధురవాణి వర్ణనానైపుణి చూపుచు సాహిత్యజ్ఞానము ప్రకాశింపనిచ్చగలది యగుటచే శ్లేషాదిచిత్ర రచనలతో సర్గముల నిండించును. తంజాపురాంధ్ర కావ్యములలో నచ్చటచ్చట హాసజనకములగు భావములు నిపుణముగాఁ బొందింపఁబడినట్లే తద్వాసనావాసితయగు నిదియునట్లే హాస్యరసము సకృత్తుగాఁ బోషించును. హాస్యరసమునఁ గలుగు నపాయమేమనఁగా గావ్యములలలోనుదాత్తరూపముగా వర్ణింపఁబడు ప్రధానరసమునకు నిమ్నభావము సోఁకి స్ఫోటకపిటకములచే ముఖసౌందర్యము చెడినట్లు కృతికి వికృతి కలుగవచ్చు. ఈ దశావిశేషము రఘునాథాదుల కావ్యములందును బ్రతిఫలించును. మధురవాణి కేవలము వర్ణనలలో మెలఁగుచున్నందునఁ దద్దోషముచే నెక్కుడు బాధింపఁబడదయ్యె.ఆమె కవితలోఁ గొన్ని పట్టులు చూపుచున్నాము. రోమపాదుఁడు ఋష్యశృంగుని యొద్దకు వేశ్యల పంపిన ఘట్టమున-

శ్రుతిహృద్య ముదారభంగిగానం
సుదృశాం తత్రసుతో విభాండకస్య
నిరవద్యమసౌ నిశమ్య హర్షం
సమధత్తాత్మని సామగానబుద్ధ్యా
వనజాక్షి ప్రసభం నిరీక్ష్యవక్షో
ధృతచంచన్నవమౌక్తికాక్షదామ్నః
మనుతేస్మతదా మనస్యపూర్వాన్
మునిశ్మశ్రుముఖాన్ సమౌనిముఖ్యాన్.

ఈ ఘట్టమున రఘునాథుని వర్ణన సరసమై గ్రామీణశేఖరుని లోక తంత్రజ్ఞులగు విదగ్ధాంగనలెట్లు వశీకరింతురో యా వైశికతంత్రచ్ఛాయఁ బ్రకటించుచున్నది. కొన్ని పద్యముల నుదాహరించెదము.

క॥ ఇమ్మానిసిమెకమున్ మది
నమ్మఁదగదు చేరి గొబ్బునం జనకుఁడు పైఁ
గ్రుమ్మి తలవంచికొని వడిఁ
గొమ్మున నటు చిమ్మెనేని కొదవగుఁజుమ్మీ.

గీ॥ తరుణిరోవీని శుద్ధ దంతములమీఁద
లీలఁ దాంబూలరసమింత కీలుగొనిన
పండిపగిలిన దాడిమీ ఫలములోని
విత్తులననుండు నెఱుఁగండు వీడియంబు.

గీ॥ కొమ్ము మొలచినయంతనె కొదవయేల
వచ్చు? నితఁడేమి చక్కనివాఁడుగాఁడె
యది కిరీటంబులోపల నణఁచరాదె
యంచుఁ బల్కిరి మునిపుత్రుఁగాంచివేడ్క.

గీ॥ ఘనుఁడెయితఁడేమి యిందఱకంటె వేఱె
కొమ్ము మొలిచెనేయనియాడి కొందురెందుఁ
గొమ్ము మొలచిన దీతనిఁ గొమ్మవార
మని శిరోమణి యితఁడపో ముజ్జగముల.

గీ॥ చెలియరోవీఁడు నాచేతఁ జిక్కెనేని
కళలఁజొక్కించి సుఖనిద్ర గ్రమ్మఁజేసి
గుఱుసు దగులకయుండఁగఁ గొమ్ముదివిచి
మంచికస్తూరి బరణిఁ బట్టింపవచ్చు.

సీ॥ చెలువలు పన్నీరు చెంబులిచ్చినఁ గాశి
కుప్పెలజలమంచు గ్రోలనెంచు
సతులు జవ్వాదియొసఁగ గోపిచందన
మని ఫాలమునఁదీర్ప నగ్గలించుఁ

గాంతలు మరువంబు గానుకిచ్చినఁ దుల
సీదలంబనుచు భక్షింపఁజూచుఁ
బొలఁతులు తెలిగందవొడియిచ్చిన విభూతి
యిది యటంచుఁ ద్రిపుండ్రమిడఁదలంచు
నలరుఁబోడులు వజ్రాలహారమొసఁగ
బటికపు జపాక్షసరమంచుఁ బాణిఁబూని
మౌనిజపియించుఁ దివురు నెంద్రైనఁగలరు
ముగ్ధులగువార లిటువంటి ముగ్ధు గలఁడె.

శాపధారాజిహ్వాంచలులగు మహర్షులతో సరసమాడుట యగ్నిజ్వాలలతో మల్లయుద్ధము సేయుటయే యని యిమ్ముగ్ధ లెఱుంగరుకాఁబోలు. మిథిలానగరము రామప్రవేశసమయమున నిట్లుండె—

వితానపరిలంబితోత్పల వితాన సందానితం
వినూతననికేతనాకలితా కేతనాలంకృతమ్
మృదంగపటహార్భటీ ముఖరగోపురం తత్పురం
ప్రశ స్తమవలోకయన్ ప్రముముదే రఘూణాంపతిః.

ఇది స్వభావసిద్ధమగు వర్ణన. ఇందుఁగల శబ్దాలంకార మంతగా రస భంగకారి కాదు. సీతావర్ణనము నాంధ్రకావ్యములలోవలెఁ బ్రత్యంగ సౌష్ఠవ ప్రకాశకమగుట చూడఁగా స్త్రీ స్త్రీనివర్ణించెనేని స్త్రీత్వమునకుగల యపూర్వ గర్వేర్ష్యామదవిభ్రమము లా స్త్రీకవికుండియుండునాయని యొక వినోదప్రశ్న గలుగవచ్చును. ప్రతియోగిభావముచేఁ బురుషకవులకుఁగల్గు భావనావిలాసములు తత్ప్రతియోగిస్థానమున వ్యత్య స్తముగా నుండునేమోయని కొందఱు భావకులు తలంతురు. సీతాపహరణానంతరము రామవిరహోద్దీపకమగు ప్రావృట్కాలంపు బ్రళయవేళలో—

ధ్వన్యుద్భూతోన్మేష సాహిత్యముద్రాం
తన్వర్భ్యః స్వేసన్నిదానే కవిభ్యః
రాజ్ఞోయేవః శ్వేతపద్మా వికీర్ణాః
కూజద్భృంగా జైత్రశంఖా ఇవాసన్
తస్మిన్ భృంగీ మీననాళీకశోక
ద్వన్ద్వాలోకాద్భూమి కన్యాప్రతీతాన్

స్మారం స్మారం జాతదానానులాపం
సౌమిత్రిస్తం సాంత్వయామాప రామమ్.

మొదటిది సంధ్యాకాలమున ముకుళించు పద్మములనుండి వచ్చు భృంగారవములకు, రెండవది సీతాసమానవస్తుదర్శనముచే రామునకు గలుగు భ్రాంతి స్మరణవిలాసదైన్యాదుల లక్షణుఁ డవనయింప ననునయించుటయుఁ దెలుపును.

నృత్తైరార్ద్రం నీలకంఠస్య సద్యో
వ్యోమాభోగే కాళికాయాం నటన్త్యామ్
వేగాల్లక్ష్యాలక్ష్య తత్కుండలాంచ
ద్రత్నాభేవ పాద్యుతద్వైద్యుతశ్రీః.

నీలకంఠ = శివుఁడు, నెమలి. కాళికా = నల్లకాంతి, కాళికాదేవి. కుండల = శ్రవణాభరణము, కాళికాదేవికి సఖి. ఇందు మెఱపుకాంతి వర్ణింపఁబడియె.

పాదోవాహి ప్రావృషేణ్యే ప్రభూతే
ప్రాదుర్భూతే పక్వజంబూనిదానే
కేకిశ్రేణి కేతకీకేళినాశః
కేదారాశీచోత్కలాపా బభూవః.

ఇందు— ఉత్కలాప = ఉత్ + కలాప = నెమలిపురివిచ్చి పైకెత్తుట. ఉత్కలా, ప = అధికశ్రుతిగల పంచమస్వరము.

నృత్తేద్ధానాం పఙ్క్తిమాలోక్య కేకీ
మేధాంచక్రే సింధురాజీవనానామ్
ప్రోవాహోవ్యశ్యామ శాఖిచ్ఛటానా
మేధాంచక్రే సింధురాజీవనానామ్.

ఇందు-సింధురాన్ అజీవయ న్తీతి, సింధురాజీవనాః, వృత్తే, మేధాంచక్రే, సింధు, రాజీ, వనానాం, ఏధాంచక్రే, ప్రోవాహ = వహతిస్మ అని గ్రహింపవలయు.

పంక్తీభూయ ప్రాదురాసన్ బలాకా
నాథం నాత్రాశ్లిష్యతస్మా బలా కా
సింధోరూర్మ్యః కూలసీమా మరాళాః
ప్రాయోబ్రధ్నన్ వ్యోమ్న్యధావన్మరాళాః.

ఇందు బలాకాః పంక్తీభూయ, ప్రాదురాసన్, కా, అబలాఅత్ర, నాథం, నాశ్లిష్యతిస్మ, అరాళాః, సింధోరూర్మ్యః, కూలసీమాం, ప్రాయో అబధ్నన్, మరాళాః వ్యోమ్ని అధావన్—అని అన్వయము.

అమ్భోదానాందత్త హంసారసానా
మాశీరేజేమానినీ సారసానామ్
ధారాంశువ్యానశే సారసానామ్
జజ్ఞేనాఖ్యాభూతలే సారసానామ్.

ఇందు- దత్తహంస + అరసానాం (అరసః = అప్రీతి), మానినీ సారసానాం = మానినీనాం సారః స్థైర్యం, తత్స్యన్తి (అన్తర్భావితణిచ్, ఆతోఽనుప సర్గేకః ఇతి కప్రత్యయః), అమ్భోదానాం ఆశీరేజే, సా = తాదృశీ రసానాం జలానాం వా ధారా దిశు వ్యానశే, సారసానాం = పద్మానాం ఆఖ్యా, భూతలే, న, జజ్ఞే.

వర్షాకాలవర్ణనమంతయు నుఱుములు మెఱపులు వడగండ్లు. వీనితో అనఁగా యమకానుప్రాసశ్లేషాదులచే విరహిజనులకుంబోలెఁ బాఠకులకును దుస్సహమ్మై యుండెఁగదా! శరశరాసనోద్యోగమున కర్హమగు శరద్వాసర వైశద్యము నొక్కసర్గములోఁ గవయిత్రి వర్ణించె. ఒండు రెండుమాత్రల జూతము.

కాదంబిన్యాః క్షాళయన్ కాళిమానం
కాదంబానాం కౌతుకాధానహేతుః
శామ్యత్పఙ్కః పక్వశాలి ప్రభాలీ
శాలీ సద్యశ్శారదో వాసరోఽభూత్.
కౌతుకము = వివాహము. ఆధానము = గర్భాధానము.
శత్రూన్ జేతుం శాతశాతామతస్వన్
నాళీకానాం పాళికాం రాజహంసాః
ప్రత్యగ్రాణాం ప్రాప్నువన్ సప్రశంసా
నాళీకానాం పాళికాం రాజహంసామ్.

రాజహంసాః = రాజహంసలు, రాజశ్రేష్ఠులు. నాళీకము = తామర, బాణము. శాతశాతాం - అతి తీక్ష్ణమైనట్టి, పాళికాం.)

అతిదూరమాగతవతః శ్రమచ్ఛిదే
నిజకామినీమణిజనస్వయం భృతః
పటనాసపాంశురివ కేతకీరజ
స్తటసీమని స్ఫురతివాసయన్ మహీమ్
తటవికస్వరనూతన కేతకీ
పతితపాంశుపరీత నిజాస్తరమ్
స్ఫురతియస్యపురారి తమఃపయః
ససితభాసిత భాసితభాఇవ.
(భాసిత = భస్మ సంబంధమగు)

అని మొదలుగా శారదా రాజహంస కేతకీరజోవర్ణనలు తేటగా కొంత సరసములుగా నున్నవి.

సుందరకాండ కథలో హనుమంతుఁడు సీతాదర్శనమున నంగుళీయక మిచ్చిన ఘట్టమున —

ఆయాతమత్ర రఘువీరకరావమర్శాం
త్యక్త్వేతి రాగభరమాత్మని మాకృథాస్త్వమ్
రత్నాంగుళీయః వితర్కయ రత్నగర్భా
గర్భోచయా త్సహజరాగ మనూనమేవ.

అను హనుమద్వాక్యము భావవ్యంజకముగా నున్నది. సీత యుంగరమును పరిగ్రహించి శోకపరవశయగుట కవి చక్కఁగా వర్ణించెను.

భవ్యంవిహాయ భరతోమణిముద్రికేత్వాం
సామ్రాజ్యపాలన సమంజసతా ప్రకారే
పాదూద్వయం రఘుపతిం ప్రణయాద్వయాచే
కింనుస్తువీమ్యహహ తత్కలితోపకారమ్
సోఽగ్నిః స్వకీయశిఖయాగ్లపితాశయానాం
నక్తంచరేంద్ర నగరీవనితాజనానామ్
శ్వాసానిలైః ప్రవవృధేశతధా సమృద్ధా
మగ్రేతతస్తు నాయనాంబు తదావిరాసీత్.

అని సీతాబాష్పసలిలవర్ణన ముత్ప్రేక్షాసరసమై యున్నది. ఇవి పదు నాలుగవసర్గములోని శ్లోకములు. 15వ సర్గమున గొంతభాగమువఱకు గ్రంథము లభించుచున్నది. ఆంధ్రలోకమునకు నాంధ్రకవయిత్రి సంస్కృతరచన చూప వలయునని యుదాహరించితిమి. స్త్రీ కవిత్వమును రాజశేఖరుఁడు—

"పురుషవద్యోషితోపి కవీభవేయుః సంస్కారోహ్యాత్మని సమవైతి నస్త్రైణం పౌరుషంవా విభాగమపేక్షతే, శ్రూయన్తే, దృశ్యన్తేఽపిచరాజపుత్ర్యో మహామాత్రదుహితరోగణికాః కౌతుకిభార్యాశ్చ శాస్త్రప్రహతబుద్ధయః కవయశ్చ" అని విద్యాసంస్కారము స్త్రీపురుషభేదములేక లభించు. రాజపుత్రికలు మంత్రి కుమారికలు గణికలాదిగా విదుషులు శాస్త్రములనేర్చి కవిత్వము చెప్పనేర్చిరని భావము. పూర్వము రాజులయొద్ద భోగినులు పట్టాభిషిక్తయగు రాజ్ఞికిస్థాన విశేషమున న్యూనతవహించినను కలావిలాసశిల్పచాతురుల మిన్నలై యేక చారిణీవ్రతము ననుష్ఠించుచు గౌరవము పెంపుచుండిరి. అట్టిపదవిలో గంగాదేవి, రామభద్ర, తిరుమలాంబ, మధురవాణి, రంగాజి మొదలగు సంస్కృతాంధ్ర విదుషులు చేరియుందురని కేవలమూహచే దలఁచుచున్నాము.

వైశ్యశూద్రకులోత్పన్నా రూపయౌవన సంయుతాః
నృత్తగీత కలాదక్షాశ్చిత్రజ్ఞాః ప్రేమనిర్భరాః
సంభోగసుఖ సామ్రాజ్యసంవర్ధన విచక్షణాః
అవరోధవధూః కాన్తాః కుర్యాద్భోగాయ భూపతిః.
అని సర్వజ్ఞసోమేశ్వరుఁడు మానసోల్లాసమున శాసించె.
ఆభిరభ్యుచ్ఛ్రితా వేశ్యాశాల రూపగుణాన్వితా
లభతేగణికాశబ్దం స్థానంచ జనసంసది
యోగజ్ఞా రాజపుత్రీచ మహామాత్రసుతా తథా
సహస్రాన్తః పురమపిస్వవశం కురుతేపతిమ్.
తథా పతివియోగేచ వ్యసనం దారుణం గతా
దేశాన్తరేఽపి విద్యాభిః సాసుఖేనైవజీవతి.

అని వాత్స్యాయనమహర్షి గణికావిద్యాసంస్కారములను వర్ణించె. గణికలు స్వధర్మములఁ బరిత్యజించి నిమ్నమార్గముల హేయజీవనము సేసినచో దూష్యలగుచుందురు గాని నియతధర్మానుష్ఠాత్రలు వినింద్యులు కారుకదా.

గ్రంథచౌర్యమను శీర్షికతో నొకవ్యాసము వ్రాయఁదలచినారము. అందు రామభద్రాంబ రఘునాథునిదేవి కవితావిలాసములనుఁ బ్రకటించెదము.

భారతి, మా. రామకృష్ణకవి
డిసెంబరు, 1936

శ్రీ చెన్నపురి పురశవాకము
"హిందూ యూనియన్ ఆంధ్రభాషాభివర్ధనీ" సమాజమున 1895 సం॥రం॥
మే నెల 19వ తేదీ రాత్రి శ్రీ రామకృష్ణయ్యచేఁ జదువబడిన

# 11 ఆంధ్రభాషనుగూర్చిన యుపన్యాసము

అగ్రాసనాధిపా, సుజనులారా,

ఈ దినము నేనుపన్యసింపఁ బూనిన యీ యాంధ్రభాషను గుఱించి యిది వరకనేకసమాజము లందనేకపండితులు కొద్దిగానో గొప్పగానో చర్చించి యున్నారు. ఇచ్చోట నిందఱు పండితుల యెదుట నాయజ్ఞానమో విజ్ఞానమో వెలువరించు నదృష్టము కలిగెనుగదా యను సంతోషము నన్నాక్రమించుకొన్నను వచన పదప్రయోగ రచనచేతగాని సంపూర్ణ చర్చచేతగాని, నువకు నూతనాంశముల చేతగాని, వివిధలక్ష్యలక్షణ గ్రంథపరిశ్రమానురోధముచేగాని మిమ్ముల సంపూర్ణముగాఁ దనివి నొందింపఁగలనాయని శంకవొడముచున్నది. వయస్సుచేతను, బుద్ధిచేతను బాలుఁడనగునేను సర్వ కలాశాల పరీక్షలకుఁ జదువుచుండుటవలనఁ గాలముచాలదనిగాని. నానా గ్రంథ సంభారము లభించినదిగాదనిగాని, లభించినను పరిశీలించునంత పాండితీవిభవము లేదని గాని, యే నెపములవలన నాయజ్ఞానమును మఱుగుపఱతును? అయిన నూతనాంశములులేక సంపూర్ణముగా విషయములను జర్చించుటకుగాక యెట్లింతటి ఘనకార్యము నవ్యమించితివని కొందఱడుగవచ్చును. ఒకపరి వాక్రుచ్చిన విషయములనే సారవంతములైనయెడలఁ బలుచోట్లఁ బలువిధములఁ బెక్కుతడవలఁ బలువురుకైకొని లోకమునకుఁజూపినంగాని యందరికి సుగమము కానేరదు. ఈ యల్పవ్యాజముతో మహాత్ములైన సర్వజ్ఞులు నాయందేదేని లోపములున్నయెడల వానిని సహేతుకముగా జూపి సవరించి నన్ను కృతకృత్యుని గాజేయుదురన్న నమ్మికతోఁ బ్రారంభించుచున్నాను.

లోకములోని సప్తపదార్థములకును నుత్పత్తిస్థితిలయములు కలవుగదా! "ఉత్పత్తిలేనినాఁటి లయముండదు. అట్టివి యీశ్వరాదులు. భాషాదులుపై మూఁటి గతులప లోఁబడినవి. భాషామలలో నాంధ్రభాషయు నొకటిగావున తదుత్పత్తి

స్థితిగతులఁ గొంతఁ దెలిపెదను. ఆంధ్రభాష స్వల్పమైనదికాదు. నిన్న నేఁడు పుట్టి రేప స్తమించునదికాదు. కావున నా యాంధ్రవాణి యేకాలమునఁ బుట్టి యెట్లుఁబ్రబలి యెట్టిస్థితియందున్నదో చూతము. ఆంధ్ర గ్రంథముల యందంత టను నన్నయ భట్టారకునకుఁ బూర్వముగుఱించి యేమియుగానరాదు. కావున సంస్కృత గ్రంథములే మనకు శరణము. మహాకవి బాణుని కాదంబరియందుఁ జంద్ర......తంత్రి వర్ణింపఁ బడుచోట" ఆంధ్ర ద్రవిళ సింహళ ప్రాయేణ సేవక జనేన" యన్న వాక్యమగపడుచున్నది. ఆంధ్రభాషయనఁగా నాంధ్ర దేశమునఁ బుట్టిన భాషయనిగాని, లేక యాంధ్రుని భాషయనిగానిచెప్పవచ్చును. కావున బాణుని కాలమునందాంధ్రభాషయున్నట్లు దెలియవచ్చెడిని. బాణుఁడు కాళిదాసునకు నిర్వది సంవత్సరముల తరువాత నున్నవాఁడు గనుక శాలివాహన శకమునేన్నూరుగల కాలమున నున్నవాఁడు. ఇంకను విచారింపగా నథర్వ శిఖోపనిషత్తునందు "త్రిమూర్తినాం సంస్కృతాంధ్ర ప్రాకృతాస్తు ప్రియంకరాః" యనియుఁ గాణ్వస్మృతియందు "ఆంధ్ర సంస్కృత భాషాభ్యాం కవిత్వ మ్మఃషితాప్రద" మనియు నున్నది. ఇందువలన నుపనిషత్తులు పుట్టిన కాలమునందే మన భాషయున్నదనియు, సంస్కృత ప్రాకృతములకు సమానమైన భాష యనియు గోచరించుచున్నది. మఱియును వెదుకగా "త్రిలింగభాషాయాః కోధాతుః కః ప్రత్యయః కా ప్రాతిపదికమితి భగవతా భాష్యకారేణక్షేపః కృతః" అనియున్నందువలనఁ బతంజలిఋషి కాలమున నాంధ్రభాషయున్న ట్టును, లక్షణగ్రంథములు మాత్రములేనట్లును తోచుచున్నది. పతంజలియే తన భాష్యమునందు ''ఏషా త్రిలింగభాషా సంస్కృత భాషాతుల్యేతి ప్రసిద్ధయాచ పూర్వమేవ ఏక శ్శబ్దస్సుష్ఠు ప్రయుక్తః స్వర్గలోకే కామధుగ్భవతి" యని పచించుటచేత నాంధ్రభాష సంస్కృతమునకు సమానమైనదని గౌరవింపఁబడుచుఁ బతంజలి కాలమునఁ బ్రయోగమే శరణముఁగాగలదిగానుండును. మఱియు "పూర్వమేవాంధ్ర భాషోత్పత్తి ర్భగవద్భిః కణ్వపుష్యదంత హేమచంద్ర రావణ నిర్జరాచార్యాదిభిః మహర్షిభిః భగవతా వాల్మీకినాచ ప్రోక్తా" యనుటంజేసి వాల్మీకికాలమునకుముందే యీ యాంధ్రభాషయున్నది రావణీయమునందు

"ఆంధ్రనాథో మహావిష్ణు ర్నిశుంభ దనుజాపహః
పురాస్వాయభువమనోః కాలేకలియుగే హరిః,

కాకులే రాజవర్యస్య సుచంద్రస్యతనూభవః। అభవత్సర్వదేవైశ్చవేష్టితో లోకపూజితః। శ్రీశైల భీమకాళేశ మహేంద్రగిరి సంయుతః। ప్రాకారం సుమహత్కృత్వాత్రీణిద్వారాణిచాకరోత్, త్రిలింగరూపేణావ స త్రి ద్వారేషు గణైర్వృతః। ఆంధ్రవిష్ణు స్సురయుతో దనుజేన నిశుంభునా। యుద్ధ్వాత్రయోదశయుగాన్ హత్వాతంరాక్షసోత్తమం। అవస త్తత్రఋషిభిర్యుతే గోదావరీ తటే। తత్కాల ప్రభృతిక్షేత్రం త్రిలింగ మితివిశ్రుతం" అనియు, "బ్రహ్మణా నిర్మితావాచః పూర్వమాంధ్రేశితుర్హరేః। అచ్ఛాయితిచకథ్యంతే సువిజ్ఞాతుసమన్వితాః" అనియున్నదట. పై కథవలన శ్రీశైల ద్రాక్షారామ కాళహస్తి-ఈ త్రిక్షేత్రమధ్య వర్తినియగుభాషను నాంధ్రుడనురాజు కొంతవరకు నవరించి యుండెనని తలంచెదను. హిమాలయోత్తర భాగములనుండి యార్యులు మన దేశమునకు రాకమునుపు ద్రావిడపంచకమునకు నొక్కభాష వాడుకలో నుండును. ద్రావిడ పంచకమనఁగా నాంధ్ర ద్రావిడ కర్ణాట మహారాష్ట్ర ఘూర్జరము. కావుననే కాబోలు "ద్రావిడ పంచకాజ్ఞాతంయత్ప దంతద్దేశ్యం సంజ్ఞంస్యాత్" అనిలాక్షణికులు వ్రాసిరి. ఇట్టిదేశ్యపదములను, దదితరములగు నన్యదేశ్యపదములను సంస్కృతభాష నార్యులు తమతోఁదేర దానినుండి తత్సమములును, తద్భవములును జేరఁగా నాంధ్రభాషయైనది. పూర్వోక్తమంతయు నొక్కటిగా గూర్పఁగా నాంధ్రభాష యనాది యనియు, సంస్కృతభాష మనదేశమునకు రాకమునుపే యున్నదనియు, సంస్కృతభాషరాఁగా దానినుండి వలయునన్ని పదములు సేర్చఁబడి కణ్వహేమచంద్రాదులచేఁ జెప్పఁబడిన లక్షణములు కలిగి నన్నయ తిక్కనాదుల కవితామృతప్రవాహమునకుఁ బాత్రమైయున్నదని తేలుచున్నది. ఇది త్రిలింగ మధ్యదేశోద్భవమగుటంజేసి తెలుగు తెనుగనియు, ప్రకృతులగు సంస్కృత ప్రాకృతములనుండి పదములు గ్రహించుటవలన వికృతియనియు చెప్పఁబడును. ఈ యాంధ్రభాష శ్రద్ధతోఁ జదివిన వారెల్లరును గ్రంథములు వ్రాయించికాని, వ్రాసికాని వృద్ధిసేయుచుండిరి. పదునొకండవ శతాబ్దారంభము మొదలీ యాంధ్రభాషలోఁగావ్యములు వ్రాయుచువచ్చిరి. అప్పటికే సంస్కృత భాషక్షీణింపఁ జొచ్చెను. సంస్కృతభాష 2000 సంవత్సరములు మహోన్నత దశయందుండి దేశభాషలు ప్రబలినందునను రెండువేల సంవత్సరముల కాలము కేవల మర్థగౌరవముతో రచనాచమత్కృతియు గల్పనాకౌశలమును గల

మహాకవులచే రచియింపఁబడిన కావ్యములు పిదప నిశబ్దార్థ గౌరవముల రెంటికినీ ప్రాముఖ్యము నిచ్చిన కవుల కావ్యములు చాలనియట్లు శబ్దమాత్రగౌరవము కలిగిన గ్రంథములు పొడసూపినందునను దినక్రమమున క్షీణించెను. అట్లేమన యాంధ్రభాషయందును ప్రారంభమునం దర్థగౌరవముగల కావ్యములు వ్రాయబడినవి. సంస్కృతమున నాదికాలముననే దృశ్యప్రబంధములును, వచనకావ్యములును బయలుదేరెను. తెనుగునందట్లులేదు. కవులు తమ మనోభావములు పద్యరూపముగాను, వచనరూపముగాను,పద్యవచనరూపముగాను దెలుపవచ్చును. అందుచేత గావ్యములు మొదట మూడు విధములయ్యెను- పద్యగద్య చంపువులని. మరల గవి తన భావములను దానుచెప్పినట్లుగాని, లేక తనకావ్యమందలి పాత్రములచేతఁ దత్తద్గుణానుసారముగఁ జెప్పించినట్లుగాని,లేక యీరెంటిమిశ్రమముగా గాని వ్రాయవచ్చును. అయినను గవియే కడవఱకుఁగథ చెప్పినట్లుండినఁగడు నసహ్యముగానుండునని సకలదేశకవులును వర్జించిరి. మొదట చెప్పిన మూడు విధములచేతను, రెండవతూరి మూడువిధములచేతను, గావ్యములు గణితక్రమముగ నవ విధములగును. కేవలము పాత్రములవలన జెప్పించుటచేత దృశ్యప్రబంధమగుచున్నది. మూడవది కవిచెప్పినట్లు గావున శ్రవ్య గ్రంథమగుచున్నది. ఈ నవవిధములలోను శ్రవ్యములు పద్యచంపూ గద్యములయందును, దృశ్యములు చంపువులయందును, అధికముగారచింపబడినవి. ఆంధ్రభాషయందు గ్రంథరచనకార———దృశ్యకావ్యములు లేవని ముందేచెప్పియుంటిని. శ్రవ్యములయందుఁ జంపువుల... నున్నది.ఒకటి రెండుపద్యకావ్యములుగలవు. గద్యకావ్యములులే...

ఆంధ్రభాషయొక్క స్థితిగుఱించి చెప్పవలసినచోఁ బ్రారంభ స్థితియు, మధ్యకాలస్థితి, వర్ధమానస్థితియును గడింపవలయునుగదా. అట్టి స్థితిని గూర్చి వచించుటకు మున్నే కొంచెము కాలనిర్ణయము సేయవలసియున్నది. ఆంధ్రభారతి కర్థగౌరవముతో మహాకవులు నీత్యుపదేశ మొనర్చిన కాలము నన్నయభట్టు మొదలు శ్రీనాథునివఱకు. శబ్దార్థగౌరవములతో యౌవనమదోన్మాదమునఁ దిరిగిన కాలము పోతనామాత్యుని మొదలు తెనాలి రామకృష్ణకవి పర్యంతము. కేవలము శబ్దగౌరవముతో యుక్తాయుక్త వివేకజ్ఞానము దొఱంగి సంచరించినకాల మప్పకవి మొదలు పందొమ్మిదవ శతాబ్దారంభము వఱకును. ప్రస్తుతకవులగూర్చి వెనుక చెప్పెదను. ఇందు మొదట చెప్పిన నన్నయభట్టు

మొదలు శ్రీనాథునివఱకనఁగా నాదికవుల కాలము నన్నూరు సంవత్సరములు. నన్నయభట్టునకుఁ బూర్వము ననేకాంధ్రగ్రంథములుండినవి. వానిలో విక్రమార్క చరిత్రమును గవివల్లభుఁడు వ్రాసెను. అవియన్నియుఁ గారణాంతరములచే క్షీణించినవి. శ్రీ మహాభారతము దెనిఁగింప నారంభించిన కవి నన్నయ్య భట్టు. ఇతఁడరణ్య పర్వమున నాల్గవ యాశ్వాసమున మధ్యమున విడిచి పరలోకగతుఁడయ్యెను. పిదప నథర్వణాచార్యులు పూర్తిచేయుట కుద్యమించి భీష్మపర్వము రచించి మృతిఁ బొందిరట. ఈ విషయమును గుఱించి కొంతశోధింపఁగా నిట్లుతేలినది. నన్నయభట్టు మహాభారతముఁ దెనిఁగింపఁ బ్రారంభించినప్పుడే యథర్వణాచార్యులును దెనింగింపఁ దొడగియుండును. వాగనుశాసనుఁడారణ్య పర్వమున విడువఁగా నథర్వణాచార్యుఁడు కర్ణపర్వమున వదలెను. కాలము సెల్లఁగాఁ దిక్కనసోమయాజి దానును భారతము మొదటినుండి వ్రాయుట కంటె వీరిద్దరి పొత్తములలో నేదానినైన పూర్తిచేయుటయ భావ్యమని యూహించి రేఫఱకారసంకరమును లక్షణదోషములును లేని నన్నయభట్టానకుని భారతమే పరిసమాప్తి నొందించుటకు దలఁచెనని తోచుచున్నది. అథర్వణాచార్యులవారు గొప్పలాక్షణికులైనను రేఫఱకారసంకరము నొనర్చి యున్నారు. చూడుడు కర్ణపర్వమున.

క॥ కురుపతిరవిసుతుని సువ
ర్ణరత్నభూషణతతుల నుఱక బహుమతి చే
సి రథసముమీఱ సేనల
కు రాజుగావించె సమరకుశలుండగుటన్.

ఇచ్చట రేఫఱకారమిశ్రమము.

క॥ తఱచైనకురు బలంబులు
మఱపించుచుఁ గడిమి మెఱయ మారిమసగిన
ట్లెఱిముఱి బెడంగు గదగొని
కరువలి కొడుకండు నుఱుము గావించెడిన్.

విరాటపర్వమున

.........కర్ణ గాంధారరాజ భూరిశ్రవులు దొరకుఁదోడ్పడిక్ర......
డ్కొనని—నిబ్బరముగనటు గురిసి రంపవానలు కడిమిన్.

పై రెండు పద్యములఁ బ్రాసలయందును సంకరముగలదు. అధర్వణా చార్యుడు రేఫఱకారసంకరమున కొప్పికొనినవాఁడు. మఱియు రలలకు యతులు ప్రయోగించియున్నాఁడు.

ఉద్యోగపర్వమున

క॥ అరయఁగ వారెల్లరుప్రబ
లురుగావున వారితో విరోధము మనకే
లఱగొట్టె సంధికిఁబం
పు రాచ పెబ్బులికిమరలఁ బోయి మరలెదన్.

మఱియు

క॥ తెంపును బెంబును గదుర ని
లింపులు వెరగంది చూడ రిపు సైన్యములుం
గంపింపఁదమ బలంబులు
ఱంపిలి బిట్టార్వ ధర్మరాజుందాకెన్.'' అని ద్రోణపర్వము.

పై పద్యముల రెండవపాదములంగనుఁడు. ఈ లాక్షణికుఁ డారణ్య మునసుండి తెనిఁగింపక యాదిపర్వముననుండి యారంభించి నందునకుఁగొన్ని పూర్వలక్షణగ్రంథములు సాక్షి. ఆదిపర్వమున-

గీ॥ నేనిదిగో మత్కులోద్భవుఁడైన జముని
పట్టి పాఱుని శాపంబు వాసితి నిఁక
సొర్గమున కేగెదను మీరు సుఖము నెంది
యుండుఁడనుచు విమానంబు నొత్తిచనియె.

అనియు నందే ద్రౌపది వివాహఘట్టమున నర్జునుఁడు చెలికానితో-

క॥ అఱఱి చెలికిచ్చినమే
లౌఱౌదవులు దొడిగె నా సరోజదళాక్షి
గౌతుకముగఁ జెప్పుము వినఁ
బ్రీతిజనించెడిని దనదు హృదయంబునకున్.

అనియు వేంకటపతిరాయల కాలమున రచింపఁబడిన యొక లక్షణ గ్రంథమున నుదాహరింపఁ బడియున్నది. మఱియుఁ దిక్కయజ్వ విరాటో ద్యోగ యుద్ధపర్వములఁ జూపిన తమకవితా సామర్థ్యము నథర్వణుఁడు

వదలిన కర్ణపర్వమునుండి ప్రారంభించినచో నేమగును? ఇదియూహించియే కాబోలు విరాటపర్వమునుండి తొడంగెను. సోమయాజికిఁ దా నథర్వణాచార్యుల కంటెను శబ్దశాసను కంటెను రసవత్తరముగా వ్రాయఁగలవాఁడని తెలియును చూడుఁడు సోమయాజి విరాటపర్వమున-

చ॥ ఆలముచేసి నా తగుల మాఱడిఁ బుచ్చఁగనేల బేల న
న్నేలి యనంత భోగములనిచ్చుమెయిం విహరింపు నిత్యల
క్ష్మీలలితి కాల కాలమగు జీవన మంతయు నీమొగంబుగాఁ
బాలనసేయు మిప్పరము భామినులెల్లను నిన్నుఁగొల్వఁగన్.

అనెడు ఘట్టమునందథర్వణ విరాటపర్వమున-

చ॥ ఇఁక నొకసారి పల్కిన ఘటిల్లని చిందునొనోటిముత్తెముల్
వికచసరోరుహాక్షి వినవే ననుమన్నన చేసి కావుమీ
యకట మనోభవాశుగ చయంబుల నాతను వెల్లనొచ్చి పో
యె కరుణచూచి యేలుకొనుమీ కినుకిప్పుడు సేయనేటికిన్.

దీనియందు సబిందుక నిర్బిందుక ప్రాసనంకరము సేయఁ బడినది. ఈ లక్షణదోషములకై సోమయాజి నన్నయభట్టు ననుసరించెనని తలఁచు చున్నాను. అథర్వణభారతము తిక్కన భారతముతో సరిపోల్పదగినది కాకున్నను నన్నయ కవిత్వముకంటె రసవంతముగా నుండును. ప్రస్తావవశముగా నీ విషయమును జెప్పితినిగాని ప్రస్తుతమున కుపయోగములేదు. నన్నయభట్టారకుఁడు భారతము వ్రాయుటకు ముందే లక్షణసారసంగ్రహమును, నింద్రవిజయమును, రాఘవాభ్యుదయమును రచించి యున్నాఁడు. రాఘవాభ్యుదయమునుండి యొక పద్యము నుదాహరించుచున్నాను.

క॥ వికలునిఖరదూషణముఖ
సకల వనచరులు పొదివిరి సమ్మదముగ ని
ష్పక కుష్పక మూఁగెడు మిడు
తుకపిండు వితాన భాతితోఁచెడుబుద్ధిన్.

శబ్దశాసనుని లాక్షణికుఁడనియు, నాదికవియనియు గౌరవింపవల యును. ఇతని కవిత్వము మిక్కిలి రసవత్తరమైనదికాదు. అయిన నాకాల మందలి గ్రంథములన్నియు నట్లేయున్నవి. చూడుఁడు వేములవాడ భీమకృత శతకంఠరామాయణమున-

క॥ భువిఁ బుట్టిపీచమడచెను
దివిజారాతుల దినేశ దీప్తులడర రా
మవుఁడనుచు మునులు పొగడిరి
దివిని దివౌకసులు మిగుల దీవించి రాగిన్.

**మఱియు**

చ॥ కలఁగకుఁడీ నభశ్చరులు కంపము సెందకుఁ డెప్డుకిన్నరుల్
తలఁకకుఁడచ్చరుల్ మునులు తత్తరమొందకుఁ డేనవచ్చిమీ
యలజడు లెల్లవాపి మిమునందఱఁగాచెద నంతవట్టు మీ
గలిబిలి మానియుండుఁడని కైటభమర్దనుఁడోలి బల్కెనన్.

అయినను వాగనుశాసనునికి భావములు వాక్యముల యందెట్లుపొందు పఱచిన వినువారల కింపుగానుండునో దానిని సంపూర్ణముగా నెఱిఁగినవాఁడు. కావుననే సోమయాజి భారతము ముగించియు నారణ్యపర్వము కొఱవడియుండఁగా దాని నన్నయ పేరిటనే వ్రాసిన యెఱ్ఱాప్రగడ నన్నయ భట్టును బోలి పూరించెను. తిక్కననుబోలఁడయ్యె. ఇందున కతఁడే నిదర్శనముగా-

గీ॥ ఎఱ్ఱనార్యుఁడు సకల లోకైకవిదితుఁ
డైన నన్నయభట్ట మహాకవీంద్రు
సరన సారస్వతాంశ ప్రశస్తితన్నుఁ
జెందుటయు సాధుజన హర్షసిద్ధిగోరి.

క॥ ధీరవిచారుఁడు తత్కవి
తారీతియుఁ గొంతదోపఁ దద్రచనయకా
నారణ్యపర్వ శేషము
పూరించెఁ గవీంద్రకర్ణపుట పేయముగాన్.

అనివాక్రుచ్చియున్నాఁడు. వెనుక రంగనాథుఁడు భాస్కరుఁడు మొదలగు వారనేక గ్రంథములు రచించిరి. అవి కాలానుసరణముగా నొకటి నొకటి మించుచున్నది. తిక్కనకాలముననే యాంధ్రభాష కొంతవరకు వృద్ధియయి కవిత్వము మంచి జాతీయముగాఁ గుదిరినది. సోమయాజి కాలమందున్న కవులందఱును దెనుఁగు పదము లధికముగాఁ జేర్చి వలయుచోట్ల మాత్రము సంస్కృత పదములఁ జొప్పించుచు మిక్కిలి రసవంతమైన కవిత్వము చెప్ప

చుండిరి. కేతనాదులును నాచనసోమనయుఁ దిక్కనకు సమకాలికులు. తిక్కన భారతమును ముగింపఁగానే తర్వాతి కథయగు హరివంశమునందలి యుత్తర భాగంబు సోమనాథుఁడు నుత్తరహరివంశమను పేర వ్రాసెను. కొందఱు నాచన సోమన యెఱ్ఱాప్రెగ్గడకు వెనుకటివాఁడని వచించెదరు. అందునకును దగిన యాధారములులేవు. దొఱకువఱకును ప్రస్తుతము చెప్పినట్లే పూనెదను. తిక్కన కవిత్వము జాతీయమును రసవంత మనుటకు సందేహము లేదుగదా. నాచన సోమన కేతనల కవిత్వము జాతీయమనుటకుఁ గ్రింది పద్యములే చాలి నంత నిదర్శనముగా నున్నది. ఉత్తరహరివంశమున నైదవయాశ్వాసమున-

వనితా నీపతితోడఁగూడవలదే వారేల వీరేలనా
కని నన్నాయనిరుద్ధుఁడున్నయెడ కెట్లైనన్ వెలారైనిఁబో
యినినాతండు కులాభిమాన ఘనుఁడై యే యూరికేత్రోపయం
చనుమానించిసఁ ద్రోవనంగొఱవిఁ జేయంజూతునే క్రమ్మఱన్.

కేతనగారి విజ్ఞానేశ్వరీయమున-

సురసేవించిన నాతివాఁడి యయినన్ సొమ్మెల్లఁ బోనాడినన్
బురుషద్వేషిణియైన గొడ్డయిన నెప్డుం గూతులం గన్నమై
పరపౌరోగము గల్గెనేనియును నబ్భార్యం బెడంబాసి య
ప్పురుషుండొండొక పెండ్లియాడినను నొప్పుం దప్పులేదేమియున్.

మఱియు

క॥ మెడవాలొడయనివస్త్రము
తడబఱచి నమ్మికొనిన దారో ఁః కినన్
బడిదియఁ బెట్టినఁ గట్టిన
నడయబఱత్రయము దండు పరువఁగవలయన్.

ఇట్టి పద్యములు విమర్శించిచూడ నాకాలమందుండు కవిత్వము పైఁ జెప్పి నట్లు కనఁబడుచున్నది. ఆంధ్రభాష నన్నయ కాలములోఁ బ్రారంభించినను సోమయాజి కాలమునకే మహోన్నత దశకువచ్చినది. ఈ కవుల కాలములలో వ్రాసిన గ్రంథములేవియు నూతనములుకావు. సంస్కృత కావ్యములకుఁ దెనుఁగు. నన్నయభట్టారకుఁడు వయసు మీఱిన వాఁడగుటచే సందర్భశుద్ధిని బాటింపఁడయ్యె. యుక్తిబాహుళ్యమును రచనాకౌశలము నించుక చాలదు.

శ్రీమాన్ రాయబహదూరు ప॥ అనంతాచార్యులవారు ప్రకటించిన శంతను పౌత్ర ప్రభుత్వముంగూర్చిన చర్చం జూచిన నీవిషయంబు తెల్లమగు. దీని కుత్తరముగా గొందఱాకాలపు భారత ప్రతులట్లుండె ననియు, గొందఱట్టి మహాకవికంటె మనమేమి బుద్ధిమంతులము? యతనిలో శతాంశములేని మన మెక్కడ? యతని గ్రంథమెక్కడయనియుఁ బలువిధముల వచించుచున్నారు. ఆకాలమునందున్నవారి కంటె మనమేమి బుద్ధిమంతులమాయన్నమాట చిత్రముగా నున్నది. ఈ కాలము నందున్న పండితు లాకాలమందున్న గ్రంథములను, దర్వాతి గ్రంథములను విమర్శించి గుణాగుణవివేచనము వడసినవారు. ఆకాల మునందు లేని యనేక ప్రకృతిశాస్త్రములు నేఁటికాలమున నున్నవి.

దీని నింతటితో వదలి ప్రస్తుతాంశమునకు వచ్చెదను. నన్నయభట్టారకుని భాషాంతరీకరణ మెంతమాత్రము తృప్తికరముగాలేదు. కొన్ని యెడం సంస్కృత భారతమునకుఁ దీసిపోవుచున్నదని నా యభిప్రాయము. తిక్కనగారి యాంధ్రీకరణమట్లుగాదు. ఆయన సందర్భశుద్ధియు నర్థగౌరవము నెవ్వరికినిరాదు. సోమయాజిగారు భారతమును సంగ్రహపరచినది వాస్తవము. ఈతఁడు విశేషముగా సంస్కృత భారతమున నొకతఱిఁ జెప్పిన విషయమునే మఱియొకతఱి వర్ణింపఁగా నట్టిభాగముల యందలి తన కల్పనాకౌశలము తేటపడునట్లు పాత్రోచితమైన గుణములఁబోషించు వాక్యములఁ జొప్పించియున్నాడు. ఈతనికి భావనాశక్తి యధికమని కవులు పొగడుదురు. ఇదినిక్కంబ. ఇతని గ్రంథముల శబ్దాలంకారములులేవు. కవిత్వమున కేయే యంగములుండవలయునో యవియన్నియు నీతనియొద్దనున్నవి. వెనుకటి వారిలో నొకనికి వర్ణనాకౌశలమున్నఁబాత్రోచితమైన గుణపోషణముండదు. కల్పనా శక్తియున్న వాక్యపద గౌరవములుండవు. శబ్దాలంకారమున్నఁగల్పనాశక్తి యుండదు. ఈ విషయమును గుఱించి మధ్యకవుల కవిత్వము చర్చించునపుడు సంపూర్ణముగా వ్రాక్రుచ్చెదను. సర్వజ్ఞుఁడైన నాచనసోమన్న యితని సమకాలికుడని చెప్పియుంటినిగదా. అతని బుద్ధివైశద్యమును గల్పనా కౌశలమును ప్రతిభావిశేషంబును నద్భుతమైనది. ఇతఁడు కొన్ని విషయములలో తిక్కన సోమయాజిని మించునట్లున్నది. ఇతని కవిత్వము సోమయాజి కవనమువలె విశేషము తెనుఁగు పదములు కలిగి రసవంతమై హృదయోల్లాసకరమై యుండును. ఇంచు మించుగ నీ రెండు కావ్యములలో సమానవర్ణనలుగల పద్యములుజూడగా

సోమన్న సోమయాజియందపార గౌరవముంచి యాతనివలెనే కవనముచెప్పఁ బ్రయత్నించి తత్ప్రయత్నమును సంపూర్ణముగాఁ గొనసాగించు కొన్నట్లు తెలియుచున్నది.

చూడుఁడు భారతము—

క॥ మఱతురె యాడినమాటలు
వెఱుసని పోదగునె మీకు బెదరక యెదురై
తఱుముఁడు భీష్ముని గీష్ముని
నెఱుఁగరె మున్నేను గల్గ నేలా వెఱవన్.

ఉత్తరహరివంశమున—

ఉ॥ పాఱెడుత్రోవమీకు నలవాటుగఁ జేసిన శూరుఁడెవ్వఁడో
మీఱి యనేక యుద్ధముల మీరు జయించుటలెల్ల నింతతోఁ
దీఱె ననుంగొనుఁడు ధీరతఁదోడ్పడరండు నాకునుం
బాఱుఁడు పాఱుఁడందుఁ బరిపంథులనార్పుఁడు చాలుమీపనుల్.

భారతమున—

ఉ॥ వేఱొక విల్లుపుచ్చుకొని వేగములోనన కౌరవేంద్రుమైఁ
దూఱవ్మకోదరుండు పదితూపులు పాములు పుట్టలోనికిన్
దూఱిన యట్లుగాఁ బ్రబల దోర్బల మేర్పడ నేయ నమ్ములన్
గీఱిన మూర్ఛవచ్చి యొఱిగెన్ దఱచై రుధిరంబు గ్రమ్మగన్.

ఉత్తరహరివంశమున

ఉ॥ వేఱొక చాపమెత్తి శినివీరుఁడు డెబ్బదిరెండు బాణముల్
మీఱిన పౌండ్ర భూవిభుని మేనిక లంతట నాటి నల్గడం
బాఱఁగనేసి రేసి శలభప్రకరంబు మహీరుహంబుపైఁ
దాఱు తెఱంగు సేసె నతిధైర్యము సూపెనతడు సైరణన్.

ఇత్యాదులనేకము లొండొంటితోఁ బోల్చి చూడఁగా నిద్దఱును సమానశక్తి గల వారని తోచుచున్నది. సోమయాజివలెనే నాచనసోమనయు మూలగ్రంథమును దెనిఁగించునప్పుడు వన్నెబెట్టు భావములు కలుపుచుండును. సోమనగారి కద్భుతమైనకల్పనాశక్తిగలదు. అతఁడు గద్యయందుఁ బ్రయోగించుకొనిన "నవీన గుణసనాథ" యన్నపలుకు సమన్వయమగుచున్నది. కథాసరణియందేగాక వర్ణనాంశములయందును వాక్యరచనయందును జమత్కృతిఁ జూపియున్నాఁడు.

మూడవ యాశ్వాసమునుచ కృష్ణ సత్యభామల సొగటాలాట యత్యద్భుతముగా నున్నది. ఇవి యెఱ్ఱాప్రెగడలోని హరివంశములో లేదు. రెండు హరివంశముల లోని యుషాపరిణయభాగములఁ బోల్చిచూడఁగా నొకరిగ్రంథ మొకరు చూడ నట్లు పొడకట్టుచున్నది. ఎఱ్ఱాప్రెగ్గడ వర్ణనలు విపులముగాను, నించుక కఠిన ముగాను నుండును. సోముని వర్ణనలు సర్వసౌలభ్యముగాను గాళిదాసుని సంగ్రహ నైపుణియుఁగలదిగా నుండును. వేయేల యితని కవిత్వమునందు మాత్రమే మహాకవికి వలయు గుణములన్నియుఁ బొసఁగియున్నవి. ఆంధ్రకవులలోనెల్ల నితఁడొక్కఁడే భావనాశక్తికిని దర్శికసత్వరముగాఁ దోచునట్లు పదములు ప్రయో గింపనేర్చినవాఁడు. ఇతఁడొక పదముచేతనే తత్కథాసందర్భోచిత స్థితిని గేవలము మూఢునకైనను భావింపఁజేయును. ఈయంశము తేటపడున ట్లుత్తర హరివంశము నాల్గవ యాశ్వాసములోని హంసడిభకుల వృత్తాంతము కొంత ప్రకటించెదను. రాజవంశ జాతులైన హంసడిభకులను నిద్దఱన్నదమ్ములు వనవిహారం బొనర్చి దూర్వాసోముని యాశ్రమంబున కరుగుదెంచి యచ్చట

ఆ॥వె॥ కావిచీర ముసుఁగుఁగచ్చడంబును జూచి
బోడతలయు నిడుదబొట్లుఁ జూచి
గోఁచితోడ వెదురుఁగోలయుఁ జిక్కంబు
గట్టియున్న బుఱ్ఱకాయఁ జూచి.

యన్నట్లు తన్మనింగనుంగొని—

చ॥ తిరిపము కూడుదెచ్చి నలుదిక్కుల బోడలు తిండివెట్టఁగా
బెరిఁగిన పొట్టతోడ నొకపీఁటపయిం దొరవోలె నెవ్వరిన్
సరకుగొనండు పట్టుకొని చాఁగఁజకొన్నబలే యెఱుంగఁడఁ
క్కరిబలు మోపుమోచు నయగారితనం బిదియట్టికట్టినన్.

అని తచ్ఛిష్యులంగాంచి—

గీ॥ బాంధవులఁ బాసి తమ యిల్లు పట్టు విడిచి
తల్లిదండ్రులు వగవఁగైతవము తోడ
బోడతలలుగాఁ బడసి యీపొలువలెల్ల
పీని పూటలచేఁ గదా వెఱ్ఱులెరి.

చ॥ ఎఱుగరుగాక లోకమున నెవ్వరికైనను మేలు సేయఁగా
నొఱపగు నాశ్రమంబున సమున్నతమైన గృహస్థధర్మమున్
బఱగడవైచి వెఱ్ఱిగొని పాఱెడిపొల్లకు ముక్తిగల్గునే
పఱిగరి యేఱినం గొలుచు ప్రాఁతటికింగలదే తలంపఁగన్.

అని వచించిన మాత్ర వారి వెనువెంట వచ్చిన జానార్దనుఁడను విప్రకుమారుండు—

శా॥ నాల్గుంజెల్లెడి బ్రహ్మచారి గృహి వానప్రస్థయత్యాశ్రమం
బులైపల్క విపశ్చులంతిమ పదంబుం జేరువారిట్టి వీ
రల్గోపించిననంతకుండుఁ జెడు మీరాయోర్చు వారిమ్మెయిన్
మేల్గీడాడక వీరిఁజేరిమనుఁడీ మీమీశుభావాప్తికిన్.

అని యనేకనీతులు గఱపెను. కొంతసేపటికి దూర్వాసుండు కన్నుదెఱచి.

క॥ కరుణయుఁ గోపముఁ గనుఁగవ
నొరయఁగ నొకచంటఁ బాలు నొకచంటను నె
త్తురు గురియుగతి జనార్దను
ధరణిప తనయద్వయంబుఁ దప్పక చూచెన్.

గీ॥ చూచి యిట్లను భూపాలసుతులతోడ
నన్నుఁగనలించి బ్రదుకఁగన్నారు లేరు
పొలసితిరి పొలసితిరి లెండు పొండు తొలఁగి
మిమ్ము దరికొన్న కోపంబు మ్రింగికొంటి.''

అది యెట్లనిన—

ఆ॥వె॥ చక్రధరుఁడు బారి సమరనున్నాడు మి
మ్మింక వేఱ కోపమేలనాకుఁ
దెఱఁగుమాలి తవుడు తినిచచ్చువానికి
విషముపెట్టువాఁడు వెఱ్ఱివాఁడు.

ఇట్లనుటయు వారలు పరిహాసాతిరేకంబునఁ గమండలాదుల విఱుగఁగొట్టి చను టయు మునీంద్రుండు కృష్ణునితో మొఱపెట్టుటయు వాసుదేవుండు వారలపై దాడి వెడలుటయుఁ దుత్పూర్వము జనార్దను ద్యూతంబును జిత్రముగా వర్ణింపఁ బడియున్నది. పైపద్యము లెంత సులభార్థద్యోతకములుగా నున్నవి. అందులో "తిరిపము కూడు'' అను పద్యము చదివినంతమాత్రమున మునీంద్రుని యోగ

మహిమయు, శిష్యభాగ్యంబును, హంసడింభకుల దురహంకారమును నాలుగు వల్కులలోనే సంపూర్ణముగా మనకు స్ఫురించుచున్నది. ఈ పద్యము చదువగానే యెట్టిభావనకలుగుచున్నది. ఈ పద్యమునకు సమానమైన మఱియొక పద్యమీ యాంధ్రభాషయందులేదు. తిక్కన సోమయాజి వఱకెవ్వరును శబ్దాలంకారములు విశేషించి ప్రయోగింపలేదు. మంత్రిభాస్కరుఁడు మాత్రమక్కడక్కడ కొన్ని ప్రయోగించియుండునని యూహింపవలసియున్నది. ఏదియెట్లున్నను తిక్కన మాత్రము శబ్దాలంకారములు రసముపుట్టించుటకు నిష్ప్రయోజనములని గ్రహించి తాను వదలిపేసెను. నాచనసోముని హరివంశమున మాత్రమక్కడక్కడ శబ్దాలంకారములున్నను నవి వెనుకటి వారివలె నసహ్యముగా నుండలేదు. ఇందొకటి రెండుదాహరించెదను. నాల్గవ యాశ్వాసమున–

క॥ అరిఁగరమున నేఁ దాల్చిన
నరిగరము నగేంద్రధీరుఁడై నం జెడఁడే
యరిదరమై నన్నడుగుట
యరిదరమైకాభిలాషులగు నృపతులకున్.

క॥ కరసరసీరుహమున నొక
సరసీరుహమమర వదనసరసీరుహమున్
బరిమళ వశమున నొ్పుచు
ధరణీధర తనయ దొంతి తామరఁ జూపెన్.

ఇత్యాదులనేకములు గలవు, మఱియు–

సీ॥ సారసంబున హేవ నీరసంబునఁ జావఁ
బద్మాసనుఁడు పీరిపాలఁగనియె
దూపుఁగంటఁ జెలంగ రూపుమంట నలంగ
పంచబాణుఁడు పీరిపాలఁగనియె
వరములు వడయంగ శిరములు గెడయంగఁ
బంక్తికంఠుఁడు పీరిపాలఁగనియె
గేహరక్ష నటింప దేహ శిక్షఘటింప
బాణాసురుఁడు పీరిపాలఁగనియె
గనియెఁ జిత్రంబులకు నెల్ల కలఁగియుండి
మనువఁ జెఱుపంగఁ జెఱుపంగ మనువనేర్చు

రెల్లలోకంబులకు దైవమేక మగుట
హరిహరాత్మక మెఱింగితి మనిరి సురలు—ఆ 2

ఇట్టి నియమ బాహుళకమైన శబ్దాలంకారముల వదలి

ఉ॥ దండకు నేగుదెంచి విరిదండకు వెల్వయొసంగి పుష్పకో
దండునిచేత శాత శరదండిత భావము నొందలేనయో
దండకునీకు నోయబల దండము దండము దండమంచు దో
ర్దండము లెత్తిమ్రొక్కుదురు ద్రక్కరి గన్గొని పౌరపల్లవుల్.

ఇట్లు నియమరహితముగా శబ్దాలంకారములఁ జొప్పించి ప్రబంధముల వెనుకటివారు రచించిరి. ఇట్టి పద్యములు ముకుందవిలాసమున సహస్ర సంఖ్యాకములుగా నున్నవి. ఇట్టివి కూర్చునప్పుడర్థముపైని దృష్టితరుగుచున్నది.

ఉ॥ కుల్కుల కల్కినీ వలపుఁగుల్కులు తళ్కులు నీయొయారపుం
బెళ్కులు నీ మొగంపుఁగళ పెంపు రుచింపురసంపుసొంపు రాఁ
జిల్కెడికెంపు వాతెఱయుఁ జీనగు తేనియలొల్కు చిల్కవ
ల్కు ల్కలకంఠకంఠమును గుబ్బల యుబ్బును జూడనబ్బునే.

ఈ పద్యములోని శ్రావ్యతనేమని వర్ణింతును. శబ్దాలంకారము లిట్లుఁగదా యుండవయును. కావుననే మనభాషకు "ఇటాలియన్ ఆఫ్ దియీస్టని" నామధేయమిడిరేమో? ఇట్టిన్యూనతలుగల యొండు రెండు ప్రబంధముల నామూలాగ్రముగా శోధించి యొక యాంగ్లేయ పండితుఁడు హిందూదేశములోని భాషలన్నిటిలో ద్రావిడ సంస్కృతములు రెండే యభ్యసింపఁదగినవని వ్రాకుచ్చి యున్నాఁడు. అట్లు వచించుట యతని నానాగ్రంథ పరిశీలనకు గొఱఁత వాటిఁచుచున్నది. మఱియు నాచనసోమన్న భావములనెన్నెన్ని విధములఁ బొందుపఱుప వచ్చునోయని చక్కఁగా నెఱింగినవాఁడు. వెనుకటి వారిలో శ్రీనాథుఁడును,రాజమరాభూషణుఁడును మాత్రము కొన్ని యన్వయభేదములఁ గనిపెట్టిరి. అవియన్నియు నుత్తరహరివంశ భీమేశ్వరపురాణాదిక గ్రంథముల నిదానించి చూచినఁ దెలియును. పక్షపాత భీతిచే నింకనితనిఁ గూర్చి యేమియుఁ జెప్పను. కావున న్నయభట్టు మొదలు నాచనసోమన్నతోఁ గవనమునకు వలయు సర్వావయవములును గుదిరినవి. గర్భ బంధ చిత్ర కవిత్వాదులు కవనమునకు వలయునంగములు కావని నాయభిప్రాయము. దానిఁ గూర్చి యిందే పింగళి

సూరన్న కవిత్వమును గుఱించి చెప్పునప్పుడు సంగ్రహముగా నాకుఁ గల యాధారముల వివరించెదను. ఈ సర్వజ్ఞ సోమనాథుని తండ్రియు నొకగొప్ప కవి. అతని పేరునాచన. అతఁడు హరివంశోత్తర భాగంబుననుండు రుక్మిణీ పరిణయమును గృష్ణవిలాసమను పేర నొకకావ్యమును రచించియున్నాఁడు. ఆగ్రంథమును తత్కాలకవిత్వమువలె విశేషించి తెనుఁగుపదములు కలిగి రస వంతముగా నర్థసంపత్తి కలిగియుండును. అందుండి యొక్క పద్యము నీ క్రింద నుదాహరించుచున్నాను.

చ॥ వనరుహమిత్రు కాకలకు వాఁడిన పల్లవ పుష్ప పత్రముల్
మినగొన వీచు చందనసమీరము లొయ్యన ద్వారకాపురీ
వనముల నిష్కుటంబులఁగు వాలసరోవరవీథులందు న
ర్తన మొనరించె మందగతి రైవతకాచలసానువాటులన్.

క॥ నావంటిదాని నెంచక
యే వంచన నేసిపోయి వృష్ణికులుఁడు సత్యా
వనితయింట బొనరెన
రేవాసలు గురిసెనఁట హరిణనయనగదే!

సోమనాథునికి వెనుక సోమయాజికిఁగాని సోమన్నకుగాని సమానముగాఁ కవనము సెప్పువారు లేకున్నను వారికవిత్వముల నపార గౌరవముంచి తచ్ఛైలి ననుకరించుచుఁ గావ్యములు వ్రాసిన వారనేకులు గలరు. అందులో ముఖ్యులు మారన, ఎఱ్ఱాప్రగ్గడ, శ్రీనాథుఁడు మొదలగువారు. వీరిలో మారన తిక్కనసోమయాజి శిష్యుఁడు; ఆతని పుత్రుఁడు కాఁడు. ఇతఁడు తన మార్కండేయపురాణమున ననేకవర్ణనలు తనగురువుగారి కవనము బోలి యుండవలయునని కష్టపడి గూర్చియున్నాడు. ద్రోణపర్వమున నైదవ యాశ్వాసముననుండు-

మ॥ ధరణీచక్రము దిద్దిరం దిరిగెఁ మార్తాండుండు కుంభీభవ
త్కిరణుండయ్యె దిశావితానము వడంకె న్మిన్ను మ్రోసె న్మహీ
ధర సంతానములోలి గ్రక్కదలె నుద్భ్రాంతంబులై యంబుధుల్
పొరలెన్ గట్టులమీదఁ బిట్టపిడుగుల్ మ్రోసెన్ నితాంతధ్వనిన్.

అను పద్యమును మార్కండేయపురాణములో నాఱవ యాశ్వాసమున నుండు,

మ॥ ధరణీచక్రము దిద్దిరన్ దిరిగెఁ బాతాళంబు ఘూర్ణిల్లె భూ
ధర వర్గంబులలించెఁ బెల్లుకెతె దిశాదంతావాళశ్రేణి మొ
గ్గె రవీందుద్యుతి తారకావితతి భ్రమగ్గెన్ గ్రమోసె బ్రహ్మాండమున్
శరధిన్ బిండలిపండుగాఁ గలఁగె నాశ్చర్యంబుదగ్రంబుగన్.

అను పద్యమును బోల్చి చూడుఁడు. ఈ మార్కండేయ పురాణము నుండియే మనుచరిత్ర కథ గ్రహింపఁబడినది. ఎఱ్ఱాప్రెగ్గడ కవిత్వము కొన్ని చోట్ల నన్నయభట్టునకుఁ బోలి, కొన్నిచోట్లఁ దిక్కన కవనమునకును సరిపోలి యున్నది. ఇంతవఱకుఁ బేర్కొన్న కవులందఱు సంస్కృతమునం దాది కవులవలె దీర్ఘ సమాసములులేక మిగులనింపుగా వ్రాయశక్తిగలవారు. వారే మియు స్వకృతములైన గ్రంథములు వ్రాయకపోయినను వీరల కపార మైనస్వశక్తి గలదు. విద్యచేత నెన్నిలాభములుకలుగునో యన్నియు వీరి కావ్యములచేత కలుగును. విద్యవలన కేవల శరీరమాత్రముచేత నందరాని మోక్ష సామ్రాజ్యము మనస్సుచే బొందుచున్నారము. జ్ఞానవృద్ధియు, కీర్తియును, ప్రసిద్ధియు మఱియు ననేకములైన మానవుల కోరిక లన్నియు విద్యవలననే కదా కొనసాగుచున్నవి. ఇట్టికోరికలఁ గొంతవరకు వీరల కావ్యములు తీర్పగలుగునని నాయభిప్రాయము. ఎట్లనఁగా నీగ్రంథముల యందన్నిటను నీతిబాహ్యములును, నధర్మ మార్గోపదేశములును నగువిషయములులేవు. ఇవి యుదయకాలమునుండి సాయంతనము దనుక దేహాయాసముతోఁబనిచేసి సంసార దుఃఖములో మునిఁగియుండు పామరజనుని కీయఁదగిన యానందము నిచ్చి కొంతసేపైనను వానినుల్లాస సముద్రమున ముంచి దేహశ్రమను దోపనీయవు. మిద్దె మేడలయందుఁ గష్టమన్నమాట యెఱుఁగని యాగర్భశ్రీమంతులకు సహితము రుచికరముగా నీతిబోధనసేయును. నానావిధ లక్ష్య లక్షణ గ్రంథ ములు పరిశీలించి విద్యకై ధనార్జనాసక్తియుఁ బాఱఁదోలియున్న విద్వాంసులకుఁ గవులకుసైతము తదుచితమైన యద్భుతంబును బుట్టించును. ఇంతమాత్రముననే విద్యలలోపల నుత్తమ విద్య కవిత్వంబనఁబడదు. మఱేమన్నను దీనియందు మఱియొక గుణము కలదు. వెనుకటివారి ప్రబంధములవలె సహజన్యజ్ఞానము కూడఁ బోగొట్టి చదివినంతసేపు మాత్రము చిత్రరసముఁ బుట్టించి దీర్ఘాలోచన సేయఁగా సారము గానఁబడనియట్లుగాక సహజజ్ఞానము వృద్ధిపఱచి నూతనము లైన కల్పనలకును దారితీయుచున్నది. మనస్సును వికసింపఁజేసి వివిధవస్తువుల

జ్ఞానముఁ బట్టించి యేసమయములందెట్లు చరింపవలయునో యెవరితో నెట్లు మెలఁగవలయునో వీని నుపదేశించి మరణాంతము ధర్మమార్గమునఁ ద్రిప్పుచున్నది. వేయేల మనుష్యుఁడు వీని సారాంశమును సంపూర్ణముగా గ్రోలి తన్నీతి చరిత్రల నొప్పియున్నచో భగవంతుని మానుష సృష్టికి దగినఫలమనుభవించును. ఇంక శ్రీనాథ పోతనామాత్యుల కొంత దాఁకఁ జెప్పి విదప మధ్యకవుల నందఱ నొక్కటిగాఁ జేర్చి కొంతచెప్పెదను. శ్రీనాథుఁడు ప్రౌఢకవులలో నగ్రగణ్యుఁడు. ఇతఁడు మాటనేర్చినది మొదలు కవనము చెప్పనారంభించెను. అతిబాల్యముననే సంస్కృత ప్రాకృతాంధ్రములఁ జదివి పదునెనిమిదవయేఁటనే ప్రాకృతము నుండి సప్తశతి తెనిఁగించెను. ఇతఁడు వ్రాసిన గ్రంథములలో వీథినాటకమును, హరవిలాసమును దప్పఁదక్కిన వన్నియు సంస్కృత ప్రాకృతములకుఁ దెనుఁగు. హరవిలాసమునందును గాళిదాసుగారి కుమారసంభవమునుండి యనేక భావములు గ్రహింపబడియున్నవి. వీథి నాటకము గూర్చి యిప్పటి స్థితిని వచించునప్పుడు వివరించెదను. ఇతఁడు తెనిఁగించిన వానిలో నెల్ల నైషధము గొప్పకావ్యము. నైషధం విద్వదౌషధమని చెప్పుదురుగదా. ఇట్టి యుద్గ్రంథమును దెనిగించుట మిక్కిలి కష్టము. తెనిఁగించునప్పుడు ననేక స్థలములఁ దన చమత్కారములఁ జూపియున్నాఁడు. నైషధమున కింత ప్రసిద్ధి వచ్చుటకు ముఖ్యకారణము శ్రీ హర్షుని కథాసంవిధాన చిత్రంబును చమత్కృతియు వర్ణనావైదుష్యమును శ్రీనాథుని పదప్రసిద్ధియు. కథను పొందుపఱచుటయందు, తెనుగుకవు లెన్నడును సంస్కృత కవుల కీడు రారు. తత్తద్గుణ పోషణములు వెనుకటి కవుల కెవ్వరికినిఁ దెలియవు. శ్రీనాథుఁడీ విషయముల శక్తిగలవాఁడు. నలుఁడు దమయంత్యంతఃపురంబు చొచ్చుటయు, నంతఃపురవర్ణనము, దేవతాశంబళి దమయంతితో సంభాషించుటయు, నెంతసరసముగా నున్నది. శ్రీనాథునికిఁ బూర్వకవులు తమ కావ్యములు చిన్నసమాసములతో నాంధ్రపదభూయిష్ఠములుగా వ్రాసియుండిరిగదా? "ప్రౌఢ దీర్ఘ సమాసపదములఁ గూర్చి శ్రీనాథుండు కూర్చె నైషధం" బన్న పల్కి తనియందు సమన్వయముగానున్నది; ఆంధ్రభాషకిదియే మొదటిలొచ్చు. కవులు విస్పష్టముగాఁ దమభావములను సమాసములు లేకయే వ్రాయుట యుత్తమము. నడుమ నడుమ యతిప్రాసములకై నిష్ప్రయోజకములగు విశేషణములఁ జేర్చి దీర్ఘ సమాసమున రెండుపదముల నడఁగు భావముల నిమిడ్చిన నెవరికానందకరము. చూడుడీ పద్యముసొంపు.

శా॥ శ్రీరామాస్పద హైమతారకమణి శ్రేణీ నిబద్ధోజ్వల
త్తారామార్గ విలాఘిశృంగ విలసత్ప్రాసాద పారంపరీ
ధౌరంధర్య నిరస్త వింధ్యగిరి మంధానక్షమాభృన్మహా
మేరుక్ష్మాధరమైన యాపురము భూమీనూపురం బైతగున్. ఆ. 1.

ఉభయ భాషలయందును సంపూర్ణపాండిత్యము కలవానికి దీర్ఘసమాసములతోఁ బద్యములు రచించుటమిక్కిలి సుళువు. అందునఁ గొంచెము ప్రాలు మాలికపడి యిట్లువ్రాసెదరు. ఇట్టి జటిల సమాసములు తఱచుగాసామాన్యజనముల కర్థములుకావు. కావుననిట్టి గ్రంథము సర్వసౌలభ్యముగాక కేవలము పండిత జనైకాదరణీయమగుచున్నది. దీర్ఘసమాసములు పరిహరింప వలయునని నాయభిప్రాయము. ఇంచుక యోచింపుఁడు. సంస్కృతమునఁ గాళిదాసున కేల యంతటి గౌరవముగలిగెను. అనేకులు కాళిదాసునికి సమమైన శక్తిగల వారున్నారు. అట్లున్నను గాళిదాసు జనసామాన్యమునకు సుగ్రాహ్యముగాను రసమునకుఁ బ్రాబల్యమిచ్చి సంగ్రహనైపుణి పాటించి యెచ్చటనెయ్యది ప్రస్తుతమో దాని వ్రాయువాఁడు. శ్రీనాథుఁడొకఁడట్లు దీర్ఘ సమాసములతో విరచించియున్న నది భాషకంతన్యూనతగాదు. తర్వాతికవులు దాని దుర్వ్యవసాయమున నుపయోగించిరి. అయినను శ్రీనాథుఁడు స్వశక్తిగలిగి కల్పనా చాతుర్యముగలవాఁడు. అతఁడు ప్రయోగించు పదములసొంపెంతని వినుతింపవచ్చు. కావున నీకాలమునందే యాంధ్రభాష శబ్దశక్తి యధికము కాఁగా నర్థ శక్తి తగ్గనారంభించెను. ఇతని బావమఱదియైన పోతనామాత్యుఁ డొకమహాకవి. ఇతఁడు రచించిన యాంధ్రభాగవతము తెనుఁగు భాషకు గౌరవము తెచ్చుచున్నది. ఇమ్మహాకవిని దారిద్ర్యదేవత వలచివచ్చియున్నది. ఆమె యితఁడు భాగవతమునందుఁ జేసిన ప్రతిజ్ఞను సహితము తప్పించినదికదా. ఇతని కవిత్వమున నేదోలక్షణదోషములు కలవని తాతంభట్టు మొదలగువారు సలక్షణముగా నంగీకరింపరైరి. , దాని కప్పకవి లాక్షణిక దోషములు లేవని రేఫఱకార మిశ్రమములే కారణములని చెప్పుచున్నాఁడు. ఈ రేఫఱకారవాదములు గజకచ్ఛపుల పోరులంబలె నన్నయభట్టుకాలముననుండి వచ్చుచున్నది. శబ్దశాసనుఁడు యవల కేమియు వ్రాతయందు గురులఘు విషయముల భేదములేదని రకారమునకు మాత్రము వ్రాతయందు భేదము కలదని రయోస్తు నిత్యంస్యాత్తని సూత్రమును వ్రాసెను. దానిని యతి ప్రాసములకుఁ గూడ పొందిక పడునా

యని తిక్కన భారతము శోధించి సంస్కృత పదములతో యతిప్రాసమైత్రి పొందిన పదము రేఫలను లఘురేఫములుగా, తక్కినవాని నలఘురేఫములుగా నిర్ణయించిరి. వీనియందు సందేహమురాగా ద్వైరూప్యముల నంగీకరించి బాల సరస్వతులు వ్యాఖ్యానము వ్రాసిరి. ఈ చిన్న విషయములకై భాగవతమును సలక్షణముగా నంగీకరించుకొననది పూర్వుల గుణాగుణ వివేచన శక్తిని దెలియ పఱచుచున్నది. ఈ రేఫఱకార విషయములను లాక్షణికులకు వదలి యాంధ్ర భాష కొంతవఱకు క్షీణింపఁ జొచ్చిన విధము వ్రాకుచ్చెదను. ఈ పోతనా మాత్యునికిఁ బూర్వులర్థగౌరవమునకుఁ బ్రాముఖ్యమునిచ్చిరని చెప్పియున్నాను గదా ఇతఁడు శబ్దార్థములకు రెంటికిని సమాన గౌరవము నిచ్చినవాఁడు. ఇతఁడిట్లు శబ్దాలంకారములు విస్తారముగా ప్రయోగించుటయే బాషకు రెండవ న్యూనత. ఇందుచేతఁ బోతనామాత్యుని శబ్దాలంకారము లసహ్యములనియు, నర్థ వంతములు కావనియు నేను చెప్పరాలేదు. పోతనగారు శబ్దాలంకారములఁ దమ్మయద్భుతమైన సామర్థ్యమును జూపియున్నాఁడు. తర్వాతి కవులలోఁ బ్రౌఢ కవి మల్లనయుఁ బోతనామాత్యుననుసరించి యతనివలెనే శబ్దాలంకారముల నర్థవంతములుగాను శ్రావ్యముగాను గూర్చియున్నాఁడు. ప్రౌఢకవి మల్లన మొదలగువారు పోతనామాత్యుని త్రోవమెట్టినను మఱికొందఱు గుణగ్రాహు లతని నూతనమార్గము నవలంబింపరైరి. వారిలో నొకరిద్దరిని గూర్చి కొంత వ్రాకుచ్చెదను. వారెవ్వరన్నచోఁ బినవీరభద్రుఁడు, బడబానల భట్టు, అనంతకవి మొదలగువారు. పినవీరభద్రుని కవనమనర్గళధారగాఁ బ్రవహించు చున్నది. అతని గ్రంథమునఁ గొన్ని లక్షణ దోషములున్నను సలక్షణములుగా నుదాహరించిరి.మనుష్యసామాన్యుని కచ్చటచ్చట స్ఖాలిత్యములుపడుట సహజము. అందునకై గుణవంతమైన పుస్తకములకు జోపిపుచ్చుట యెంత సంభావనీ యము. ఈ కవిచంద్రునిచే రచింపఁబడిన శకుంతలాపరిణయము నాకు దొరకలేదు. అది మిక్కిలి ప్రౌఢమై కేవల కవిజనాదరణీయమె యుండును. పినవీరభద్రుని యొక్కయు నల్లసానిపెద్దన తెనాలి రామకృష్ణులయొక్కయు కవిత్వముల యందుమాత్రమే పటుత్వమగపడుచున్నది. బడబానలభట్టు రామ చంద్రాభ్యుదయము వ్రాసినాఁడు. అనంతకవి భోజరాజీయము మొదలఁగునవి రచించినవాఁడు. భోజరాజీయము కథాసంవిధానమహనీయంబై చిత్రకథా సహితమై, మృదువై సుగ్రాహ్యమై రసవంతమైయున్నది. ఇది యేడాశ్వాసముల గ్రంథము.దీని కథయు వర్ణనాంశములు నూతనమైనవి.ఇతనికాలమువఱకెవ్వరును

స్వకపోల కల్పిత గ్రంథములు విరచింపలేదు. అట్టివిరచించుట కితఁడే మార్గదర్శి.ఇతని కవనమందలి ముఖ్యగుణము నీతిబోధకమని కవియే

క॥ సూత్రకథభోజరాజచ
రిత్రము నేనుడువు ధర్మరీతుల నీతుల్
చిత్ర కథలై తలిర్పఁగ
శ్రోత్రసుఖముగా నొనర్పఁ జొప్పడియుండున్.

అని వక్కాణించియున్నాఁడు. ఇవిగర్వములైన పల్కులుకావు. ఇతఁడు భవభూతికాదు. చెప్పినది నిక్కంబ. ఈ తనికథ నిట్లు సంగ్రహముగాఁ బీఠికలో వ్రాయుచున్నాఁడు-

వ॥ "అదియును దత్తాత్రేయుండు వక్తయు మహుండును కాంభోజమహీశుండు శ్రోతయుంగా నధిగత విద్యా సమాజుండగు భోజుండు పూర్వజన్మంబున బ్రాహ్మణుండై దారిద్ర్యభారంబు దొరంగమివలన సంభవించిన విరక్త కారణంబుగాఁ దీర్థయాత్ర సేయుచుఁ బ్రయాగయందు నిష్టకామ్యసిద్ధి బొంది శరీర విసర్జనంబొనర్చి సజ్జనప్రియుండై పుట్టి లాటదేశంబున ధారానగరంబున కధీశ్వరుండై రాజ్యంబు సేయుచు నొక్కనాఁడు మృగయా వినోదంబున వనంబునకుఁ జని యందు సర్పటియను నొక సిద్ధపుంగవుంగని తనపట్టణంబునకుఁ దోడ్కొని వచ్చుటయు వాఁడట్లు చనుదెంచి యొక్కరాత్రి రహస్యవృత్తిఁదనప్రభావంబు నెఱపందలంచి పంచలోహమయంబై యొప్పు నవ్వడమిఁజేని కొలువు చలికెందన చేతివేదియను నౌషధంబుచేత శుద్ధసువర్ణంబు గావించి యెందేనిఁ బోవుటయు మఱునాఁడవ్విధంబు నూహించి యీ యద్భుత కర్మంబు సర్పటికృతమని వెదకించి కానక యొక్క కృతక మతంబున నతని నాకర్షించి భోజుఁడు ధూమవేదిఁ దానపహరించుటయు నతండు కోపించి శాపంబిచ్చుటయుఁ దదీయ ప్రార్థనంబున శాపంబుక్రమ్మఱించుటయుఁదదనంతరంబు భోజననిమిత్తంబున భోజ సర్పటులకు సంవాద వశంబున వివిధ పుణ్య కథా ప్రసంగంబులు పుట్టుయు ననువృత్తాంతములు గలిగ యిక్కావ్యంబు సర్వజనాకర్ణనీయం బై భోజరాజీయంబును పేరఁబరఁగు. తత్ప్రారంభం బెట్టిదనిన" అని సూచించెను. ఇట్టి గ్రంథములు ముద్రాయంత్రములకు రాక పోయెనుగదా యన్నదుఃఖంబు పొడముచున్నది. స్వకపోలకల్పిత గ్రంథముల నిది మొదటిదని జనసామాన్య మెఱుంగక పోయెఁగదాయని యింత దూరము

వ్రాసితిని. ప్రస్తుతాంశమునకువచ్చెద. పైఁజెప్పిన పినవీరభద్రుఁడు అనంతుఁడు మొదలగువారు పోతనామాత్యుని శబ్దాలంకారములపై గౌరవముంచలేదని చూపితిని పోతన్నగారితో నాదికవులకాలము సరిపోవుచున్నందున నప్పటి స్థితిని గూర్చి యొక్కవాక్యముఁ జెప్పవలసియున్నది. మహోన్నత గౌరవమున నున్న యాంధ్రభారతికిఁ గాలాంతరమునఁ గొంచె మనువుదప్పిన క్షీణింపఁజేయు క్రొత్తగుణములు, హృదయవీథినధివసించెనని యుగ్గడింపవచ్చును. ఇట్లేకదా దేశచరిత్రములు చదివిచూచిన యెడల మహాత్ములు నిర్మించున్యాయ పద్ధతులు తత్కాలమునకేహాని లేకున్నను గాలాంతరమున మేలో కీడో సంపూర్ణముగాచూపునని తెలియుచున్నది. ఇట్టివారికి దూరదర్శిత్వముండవలయు ననుట యత్యావశ్యకము. ఇంక మధ్యకవుల కాలమునకు వచ్చెదను. వీరిలోనుండి పెద్దన్నను, పింగళిసూరన్నను, రామకృష్ణుని వేఱువఱచి తక్కినవారి గుఱించి చేర్చి యొక్కటిగా వక్కాణించెదను. ఈ కాలమునందు విరచింపఁబడిన గ్రంథము లన్నియుఁ దెనిఁగించినవికావు. ఇట్టి ప్రబంధములకు మార్గదర్శి పెద్దన్న. పెద్దన్నగారి మనుచరిత్రము మార్కండేయ పురాణమునుండి గ్రహింపఁబడినది. మనుచరిత్రలోని ప్రథమ ద్వితీయ పంచమ షష్ఠమాశ్వాసములయందుఁ బెద్దన యేమియు స్వకపోల కల్పితముగాఁ జెప్పలేదు. మారనయే విపులముగా వ్రాసియున్నాఁడు. మారన వ్రాఁతకు వ్యాఖ్యానప్రాయముగా నుండును. తృతీయ చతుర్థాశ్వాసములయందుండు విరహరతి మృగయావర్ణనములు మాత్రము పెద్దనగారు కూర్చినవి. తర్వాతి వారివలెను గొక్కిరి బిక్కిరిగ స్త్రీవర్ణనలు చేయక పోయినను నోలాకో రతివర్ణనసేసినాఁడు. దాని శ్రీనాథుని నైషధపద్యమును మాతృకగానుంచుకొని వ్రాసినాడు. పెద్దనగారు నూతనముగాఁ గూర్చిన తృతీయ చతుర్థాశ్వాసములలోని వర్ణనలు కొంతవఱకు సంస్కృత పంచకావ్యములలోని వర్ణనలకు మెఱుఁగు పెట్టునట్లుగా నున్నవి. ఇతని మృగయావర్ణన కనేకులు మెచ్చితమ గ్రంథముల యందదేరీతిగా భేదములేక వర్ణించి తమగ్రంథములందువన్నె పెట్టిరి. ఉదాహరణము కావలసియున్నఁ బురూరవచరిత్రఁ జూడఁదగు. ఇతఁడు చూపిన మార్గమంతగా నపాయకరమైనది కాదు. వసుచరిత్ర వ్రాయఁబడువరకు నితనినే యనుసరించుచువచ్చిరి. ఇతఁడక్కడక్కడ మనుచరిత్రయందు భావములు నిరంకుశముగా సంస్కృతకావ్యముల నుండి తీసికొనఁగా నితనిమతమవలంబించినవారు మాత్రము వెనుదీయుదురా? కావుననిఁక మీఁదఁ రాఁబోవు కవులందఱు స్వశక్తి విడిచి యొకసమర్థవంతుఁడు లాగునట్లెల్ల

బోవుచుండిరి. ఇంతలోనే శ్రీనాథుఁడు వి త్తిన దీర్ఘ సమాసవృత్తి ముదరనారంభించెను. కవులు తమస్వాధీనమున భాషనుంచుకొనక భాషకేలొంగఁ బ్రయత్నించిరి. కవిత్వమిట్లు క్షీణింపఁజొచ్చిన కాలములో నాముక్తమాల్యదవంటి ప్రబంధమును బొగడవలయు. కృష్ణరాయలు విరసము పుట్టించునట్టిదాఋఋతువుల వర్ణించి గ్రంథమునించినను స్వాభావికవర్ణనమునను గల్పనాచాతుర్యమునందును భావప్రౌఢిమయందును సర్వవిధంబుల మనుచరిత్రకుఁదక్కాల గ్రంథముల కన్నిటికిని మించుచున్నదని నాయభిప్రాయము. దాని వర్ణనలెంత యద్భుత జనకముగా సున్నవి చూడుఁడు.

మ॥ తలపక్షచ్ఛట గ్రుచ్చి బాతువులు కేదారంబుఁ గుల్యాంతర
స్థలినిద్రింపఁగఁ జూచి యారెకు లుషస్స్నానప్రయాత ద్విజా
వలిపిండీకృత శాటికల్ సవి తదావాసంబుఁ జేర్పంగరే
వులడిగ్గన్ వెసఁబాఱు వానిఁగని నవ్వున్ శాలగోప్యోఘముల్.

ఇత్యాది పద్యములనేకములుగలవు. ఈ గ్రంథమువలన నాంధ్రభాషకుఁ గొంత మేలిమి కలిగినదని నేను తలంచెదను. అయిననీ కవికి మార్దవమను మాటయే తెలియదు. కావుననేకదా "దానితల్లన నల్లనసానిపెద్దన గూర్చె ముదిమితప్పి యాముక్తమాల్యద" అని విమర్శింపఁబడియె. పింగళిసూరన్న రామకృష్ణులు దక్కమిగులు మధ్యకవుల గుఱించి కొంత వచించెద. నృసింహకవి ధూర్జటి మొదలగు వారనేకులు కథాసందర్భమునకు నర్థగౌరవమును బాటింపక తమ పోయిన పోకలనెల్లఁ గవనము విడిచిరి. వీరికాలము నుండి యనేక కవులు కంద పద్యములో నిమిడ్చి వ్రాయఁదగు భావముల దీర్ఘసమాసములలో ననుపయోగ ములగు పదములుసేర్చి శార్దూలమత్తేభములయందుఁ గూర్తురు. ఆదికవు లందఱు భావముల ముందు యోచించి మృదువైన పదములఁ బిదప సమాహ రింతురు మధ్యకవులు పదములు మనసునకుఁ దగులఁగా దానికిఁ దగిన భావముల యోజింప నారంభించిరి. ఈవాడుకముదురఁగా ముదురఁగాఁ బోతనామాత్యుఁడు చల్లిన విత్తులు మొలిచెను.ఇట్టి సమయముల రామరాజభూషణుఁడు ప్రబంధము నకు వలయు సర్వాంగములకు జేర్చి వెనుకటి వారిఁ దనగ్రంథమూతఁగాఁ గొని కడతేరునట్లు చేసెను. రామరాజభూషణుఁడు మహాశక్తిమంతుఁడు. ఇతఁడిట్టి ప్రబంధము వ్రాసి దారిచూపుట భాషకు మూడవన్యూనత. ఇతని నవలంబించిన వారందఱు రసప్రకటన వేళల శబ్దాలంకారములను, శ్లేషలను జొప్పించి పాడు

చేసిరి. ఇతఁడు వసుచరిత్రమున గూర్చిన కథయంతయు స్వకల్పితము. ఇతనికిఁ గథాసందర్భము గొంత తెలిసినను వర్ణనాసందర్భము తెలియదు. పాత్రోచితమైన సంభాషణ సంవిధాన మెఱుంగఁడు. వసురాజునెచ్చెలి వీణవాయించుచున్న గిరికాదేవిఁ గాంచివచ్చి యామెను గేశాదినఖపర్యంతము వర్ణించుట భావ్యముకాదు. ఒకవేళ విటులముందు జారిణిని వర్ణించినట్లు వ్రాయుట యుచితమైనను గేళీసఖుఁడు చెప్పినదంతయు నూహామీఁద వచించినది కాని వేఱుకాదు. ఏలనఁగా నితఁడు వల్లికావృతులనుండి చూచునప్పుడు కచకుచములు, నాభిజఘనము, లూరువులు, నాగరికమైన తత్కాలమున కనఁబడిన వన్న మాట నమ్మఁదగినది కాదు. మఱియు గిరికాదేవి కామబాధనోర్వక చంద్రదూషణాదులు సేయుట యసహ్యముగానున్నది. ఈయుపాలంభములఁ గాళిదాసువంటి మహాకవులే ప్రయోగించియున్నారు. స్త్రీ పురుషులన్యోన్యముగా సరససల్లాపములాడునప్పుడు చంద్రాతప మలయమారుతారామ వినోద విలాసములు మనస్సునకు శీతకరమన్న పలుకొప్పికొనఁదగినది. అట్లులేనినాడఁనగా విప్రయోగమునఁ బాంధుల కట్టిశైత్యములేకపోయి చంద్రాతపాదులు వ్యర్థములని తోచును గాని వెన్నెలల చేత దపింపఁబడి చంద్రదూషణాదులుఁ జేయుదురని నాకుఁ దోఁచలేదు. ఇది గ్రంథస్థముకాని స్వభావసిద్ధముకాదు. పోనిండు. చంద్రదూషణాదులు స్వభావసిద్ధములని తలఁచుకొన్ననునట్టి విరహతాపమున శబ్దాలంకారములును శ్లేషలుఁ గూడ ప్రకృతిసిద్ధములా? విరహదశయందు స్త్రీ పురుషుల యన్యోన్యమనఃకమలములఁ బొంగిపాఱెడు స్నేహమకరందమునెట్లు వర్ణింపవలయు. దానిఁ జదివి చూచినమాత్ర లోకులు భార్యాభర్తల నొండొరుల నెడఁబాయక కలకాలము ప్రేమించి సుఖదుఃఖముల కందుకొనెడు బుద్ధిపుట్టింపవలయు. ఈశ్వర సంకల్పముచే నెడఁబాటు కలిగినపుడు స్త్రీ పురుషుల యుల్లములు దీర్ఘాలోచనకుఁ బోఁక తత్తఱపడుచు నెంతలలితములుగా నుండును. ఇట్టివి కలలోనైననూహింపక సంస్కృతగ్రంథములలోని యేతాదృశవర్ణనములు గూర్చుట రసవంతముగాదు. సంస్కృతముననో యొక్కొకవర్ణనమునకుఁ బరిమితి కలిగి రసపోషణమునకు భంగమురాదు. ఇట్లే శృంగార కావ్యములని పేరు పెట్టఁబడి ప్రత్యంగ వర్ణనలతో నుపాలంభములతో జలక్రీడా మన్మథ పూజలతో నింపఁబడి యష్ట రసములతో నుత్తమమైన శృంగార రసమునకే భంగముదెచ్చిన యనేక ప్రబంధములీ వసుచరిత్రకు వ్యాఖ్యానప్రాయములు. రుక్మిణీపరిణయము, రసికజనమనోభిరామము మొదలగునవి శతసంఖ్యాకములు. ఇతని కథా సందర్భమును వర్ణనా

వైలక్ష్యము చెప్పెడుచోట మఱియొక చిన్న తారతమ్యముఁ జూపెదను. వసురాజు కేళీసఖుఁడు గిరికాదేవిని జూచివచ్చి వసురాజుతోఁ జెప్పి తత్తుల గోత్రాదులరయుటకై యతివేషమువేసికొనెను. ఎట్లన్ననో-

సీ॥ కనకవల్లి మతల్లికలపెంపు జడగుంపు
 పుష్పపరాగ సంభూతి భూతి
కమనీయశాఖాప్రకాండంబు దండంబు
 తరుణపల్లవకోటి ధాతుశాటి
వల్కలధట్టంబు వరయోగిపట్టంబు
 జాలక విసరంబు జపసరంబు
ఫలరసాసారంబు పాత్రాంబుపూరంబు
 కింజల్కముల చాలు మౌంజినూలు
సేయఁ జాలిన యమ్మహాశిఖరి శిఖర
రుచిరసురభూజరాజిచే నుచితవేష
మెనసి నరపాల నిరపాయ హితవిహార
హారిగడిదేఱి యొక జడదారియయ్యె.

ఇట్టి వేషమున మంజువాణికి గిరికాదేవి చెలికత్తెలకు నిక్కమైన యతియని తోఁచునా? ఇతని వేషము బయలు పడునంతదనుక వాస్తవమైన యతివలెకదా జటావల్కలకమండలువులు కలిగియుండవలెను. ఇట్టి యతిశయోక్తి వర్ణన నిష్ఫలము ననందర్భమును. ఇట్టి సందర్భముల నాదికవులూహించి వ్రాయుదురు. ఉత్తరహరివంశమున నైదవయాశ్వాసమున నుషాకన్యయుఁ జెలికత్తెలును, పార్వతీశంభువులు నుద్యానవనమున నుండ వారిలో నొకర్తు-

సీ॥ నుడిగొన్న చిగురాకు జొంపంబు కెంపారఁ
 దలమీఁద మల్లికా దామమెడచి
నిడుదతామరతూడు నెట్టంబుఁ జుట్టిపైఁ
 బటికంపుఁ గడియంపు భాగమదిమి
తోన యాత్రోవఁ గెందొవజేకు హత్తించి
 మెడ చక్కఁగస్తూరి మెదిచిపూసి
పాయ గొమ్మలనల్లపట్టు దగిల్చి య
 క్కొనయాకుపై వెండి కోరవెట్టి

ధవళ కేతకధూళి గాత్రమునఁ బఱిచి
మోకమామిడి కొకకొంత మ్రొక్కినిలిచి
యొడలితోఁ జక్కసగము నాకొనఁగుమనుడు
నద్రికన్యక తలవాంచె హరుఁడునవ్వె.

అన్న ఘట్టముం జూడుఁడు. ఇచ్చోట భవానీ శంకరులకిది హాస్యవేషమని స్పష్టముగాఁ దెలియును. ఆస్త్రీ శంకరవేషముచేఁ గార్యసాధన చేయునదేమియు లేదు. కావున నిచ్చట నిట్లు వర్ణించుట మిక్కిలి రమణీయము. సోమనాథుని సర్వజ్ఞతకు మనమా మెచ్చునది. ఈవిధముగా వసుచరిత్రను మాతృకగానుంచి వ్రాసిన గ్రంథములలోని రసమును, నర్థగౌరవమును, దత్తద్గుణోచితమైన సంభాషణలట్లుండగా వర్ణనాసందర్భమును దీసిపోవుచున్నది. ప్రబంధమారంభించునప్పుడే పురము వర్ణించుటవాడుకయైనను శ్లాఘ్యముగాలేదు. దాని నందు వచ్చు పాత్రముల మూలకముగా వర్ణింపఁబడిన నెంత మనోహరముగానుండును? పురవర్ణనలే కొన్ని గ్రంథముల వెఱ్ఱిమొఱ్ఱిగా వ్రాయఁబడినవి. మృగయా, స్త్రీ, విరహ, జలక్రీడ, మన్మథపూజ, చంద్రదూషణ, వివాహ,రతి వర్ణనాదులు పదములు తమ్మీడ్చుకొని పోవునట్లెల్ల వర్ణింతురు. తాము చొప్పించు భావములాయాచోట్ల యుక్తములా, అయుక్తములాయని యోచింపరు. ఒక కవిశిఖామణి, అదితి కృష్ణునిఁ బొగడుచు—

మ॥ త్రిపురస్త్రీలఁ బతివ్రతామణుల సారెం బుంశ్చలీ వర్తనం
బుపదేశంబొనరించి బేల్పుఱచి వధ్యుల్గాని తద్భర్తలన్
ద్విపచర్మాంబరు చూపుటింగలమునన్ వేత్రోచి పాటింపవే
కపట స్త్రీజిన రూపమున్ భువనరక్షా జాగరూకేక్షణా.

అనిరచించెను. ఇందు విష్ణువు పతివ్రతలైన త్రిపురరాక్షస కాంతలకు జారత్వ ముపదేశించి వధ్యులుగాని వారిభర్తల నీశ్వరుని కంటి కెరయిచ్చిన వానినిగా స్తుతింపఁబడఁగా బాతివ్రత్యమును జెఱిచి, చిరంజీవుల జంపెనను దుశ్చారిత్రము తెలియుచున్నదిగాని యతని దేవత్వమేమియుఁగానఁబడదు. ఇందురాక్షస గుణములఁ గొంతవరకు సూచింపవలయు ఆంధ్రభాష మధ్య కవుల కాలములో వృద్ధిపొంది మహోన్నత దశయందున్నదని కొందఱు వ్రాసెదరు. ఈ విషయమునకు ఖేదపడెదను. కావ్యమునకుఁగాని, ప్రబంధమునకుఁగాని, కథాసంవిధానము, తత్సమాహారమును, సందర్భశుద్ధియు,

వర్ణనావైలక్ష్యమును, అర్థగౌరవమును, రసపోషణమును, పాత్రగుణ వ్యాప్తియు ముఖ్యములు గదా. ఈ విషయములలోఁ బూర్వకవులకు మధ్యకవులకుఁ బోల్చిచూతము. పూర్వకవులవి యాంధ్రీకరణములుగాన కథాసమాహారము కాని, తత్సంవిధానముకాని కలదు లేదనుటకు వీలుపడదు. మధ్య కవులలో వసుచరిత్రాదులయందు గథాచమత్కృతి - గలదు. కొన్నిపుస్తకములలేదు. రామ, కృష్ణ కథలే వీరలకు మిక్కిలి యింపు. ఒకఁడు వ్రాసిన కథనే. మఱి యొకఁడు వ్రాయుట చదువువారలకు రుచికరముగా నుండలేదు. రామాయణ కథ లెందఱు కావ్యములుగా వ్రాయలేదు. అట్లు విరచించినను నూతన భావములులేక యొకరి కవనమున కొకరు మెఱుఁగిడుచు వర్ణించెదరు. అదియేటి వైచిత్ర్యము. భీముని శతకంఠరామాయణమును, నన్నయ రాఘవాభ్యుదయమును, దిక్కన నిర్వచనోత్తరరామాయణమును, భాస్కరరామాయణమును, ఎఱ్ఱాప్రెగ్గడ రామాయణమును, మోహిని రామాయణమును, జైమినిభారతమును, శ్రీకంఠరామాయణమును, రామచంద్రాభ్యుదయమును, రామాభ్యుదయమును మొదలగునవి యెన్నిలేవు? ఒకటే కథ యిందఱు వ్రాసినఁ జదువు వారెవ్వరు? ఈ వాడుక నేటికాలముననను గలదు. సందర్భశుద్ధి పూర్వకవులకుఁ గలదని చెప్పవలసిన పనిలేదు. మధ్యకవులకు లేదని యుదాహరించియుండితి. వర్ణనావైలక్ష్యమునఁ బూర్వులు మిన్నలు. వెనుకటి వారతిశయోక్తులు కలిపెదరు. ఒక్కొక్క గ్రంథము నుండి యుదాహరించుట కష్టముగానఁ గొన్నిస్థలములఁ జూపెద. నృసింహపురాణమున సముద్రవర్ణనమును, వసంతకాలవర్ణన యెంత రమణీయముగా నున్నది. అదియే వసంతావతరణము. మధ్యకవులు శబ్దాలంకారములతో భావములు లేక యుద్యానలక్ష్మల యంగముల వర్ణించి నించిరి. అర్థగౌరవమునఁ బూర్వులే మేలు. చూడుడు-

చ॥ పొదవి నభో విహారమునఁ బూవునుబోలె నలంగకుండ న
మ్మదననమానుఁ బట్టికొని మానవ దానవ దేవకోటికిన్
గద లెఱుఁగంగనీక చనికాంచె నుషానతి చిత్రరేఖ యా
ముదితకు రాకపోక లొక మూఁడు ముహూర్తములయ్యె నయ్యెడన్.

మధ్యకవుల నుండి యుదాహరింపవలసినదిలేదు. రసపోషణముననో, పూర్వులే మహానుభావులు. భాస్కరరామాయణమున సీత కానఁబడకపోగా రాముఁడు విలపించు భాగము నెట్లున్నది. అదే విరహమున రామాభ్యుదయమున-

క॥ పవనా పరిచిత నవనీ
పవనా నాకీవు ప్రాణపదమౌటఁ దల
ప వనారతమును నీవే
పవనారూఢంబు తాపమణఁగింపవనా.

అనెడు ఘట్టమున నెంత రసహీనముగా నున్నది. రసము నొకమాట చేతనే తెలుపవచ్చును. వంజరుడు తన భార్య గుండె పగిలి చనిపోఁగా నెట్లు దుఃఖించెను. సుశీల దన్ను గొనివచ్చిన విద్యాధరుఁడు నెక్కటి కయ్యమున మడియగా నెట్లు విలపించెను. ఈ ఘట్టమును జదువునప్పుడు మహాశ్వేత చచ్చిన తన మనోనాయకునిఁ గపింజలునిఁ జూచి విలపించుట జ్ఞప్తికి రాలేదా? పూర్వ కవులు రసపోషణమునందు ననుభవనీయులు, ననుభవవేదులు. మనుష్యస్వభావ మును వర్ణించుటయందును నాదికవులే శక్తిమంతులు. మధ్యకవులు దానిని విన్నవారేకారు. నృసింహవిలాసమున హిరణ్యాక్షుఁడు తపముచేయగా నింద్రుని చలించుటయు, సందేహ ప్రవృత్తియు, నాతురపాటును, నెట్లు చూపఁబడి యున్నది. అచ్చోట నింద్రుఁ డచ్చరలఁ బిలిచి-

సీ॥ ఉల్లంబు మీ చూడ్కికుచ్చిపోఁకకుఁగదా
హాలమ్ములకు నేర్చువారికడిమి
మీక్రొవ్వు గుబ్బల మీఁది యునికియగదా
వ్రతముల నఱిగెడువారియాస
లీలమీకెమ్మోవి గ్రోలుటకై కదా
సోమరసంబానువారితృష్ణ
మీయింపుఁ గూటమి మెఱయుటకై కదా
వనితలఁ దొరఁగెడువారితివుట

పుణ్యసస్యంపుఁ బంటలు భూరినియమ
తరుఫలంబులు సౌఖ్యాధిదైవతములు
నిఖిల సంసారసారంబు లఖిలలోక
రత్నములు మీరలప్సరో రమణులార.

క॥ కావున మీతెఱఁగంతయు
భావించి జగద్ధితమగు పనియొక్కటి సం

భావనతో మిముఁ బనిచెద
నేవిధమున నైన నిర్వహింపఁగ వలయున్.

అని నానావిధములఁ బొగడి తన కార్యసాధనకు వారి బుజ్జగించి పంచుట యెంతటి గుణవర్ణనముగా నున్నది. వారిలోఁ దిలోత్తమ-

క॥ చూచెదవు గాకయే నటు
చూచిన నాయసుర తపము సొంపఱి వ్రతని
ష్ఠాచరణము తూపరమగు
గోచరమే మనసు త్రిప్పుకొని పోవంగన్.

అని వారకాంతల గర్వవచనముల నెట్లు వర్ణించె. అంతవారు హిరణ్యాక్షుని యొద్దికిఁబోయి వాని మోహింపఁజేయజాలక-

మ॥ పురుషాకారము తోడనున్న సిరియో పుంస్త్వంబు లేదో యచే
తరువో పుత్తడిరూపొ చిత్తమును జైతన్యంబు శూన్యంబొకో
విరసత్వంబుల ప్రోవొ నిర్భర కళావిజ్ఞాన సర్వస్వమో
యరుదీ చందమనంగ నిల్చె ధృతి యిందన్యంద మందస్థితిన్.

అని చెప్పి-

గీ॥ గర్వములు బెండువడ కౌతుకములు మడుగ
నదటు లాఁజడివోవ ప్రల్లదనము లడఁగ
నసురచిత్తంబు గానఁగ నలవిగాక
సిగ్గు వోయిరి యచ్చర చెలువలెల్ల.

అని యప్సరో గర్వభంగము మనస్సునకు దనివి తీర్చుచున్నది. భీమఖండమున వ్యాసుఁడగస్త్యునితోఁ గాశీవిశ్వనాథునిమీది మచ్చరంబువచరించుట యెంతపాత్ర గుణదోషము. ఈ విషయములు మధ్యకాలమువారికిఁ దెలియవు. ఈపైఁ జెప్పఁబడిన యేడుగుణములును మధ్యకాలమువారియందు న్యూనముగా నున్నవి. అట్లుండ నాంధ్రభాష యాకాలము నందెట్లు మహోన్నతదశయందుండినదని చెప్పవచ్చును. వీనినింతటితో నిలిపి పింగళిసూరన్న రామకృష్ణుల గుఱించి యించుక చెప్పవలయు. పింగళిసూరన్న రాఘవపాండవీయ ప్రభావతీప్రద్యుమ్నముల రచించిన కవీశ్వరుడు. తిక్కన సోమయాజి వెనుక యింతటి కవితా మహాత్మ్యము గలవాఁడెవఁడులేఁడు. ఇతఁడు వ్రాసిన కళాపూర్ణో

దయము యొక్క కథాసంవిధానము తత్తద్గుణప్రకటనంబును రసపోషణమును స్తుత్యములు. ఇతఁడద్భుతమైన కల్పనా శక్తిగలవాఁడు. తనకాలపుఁ గవుల వలె ఛాందస వృత్తితో నేదేని యొక్క యమ్మాంబా పరిణయకథను తీసికొని పురవర్ణనాదులగు నష్టాదశవర్ణనలు శాస్త్రోక్తముగ వర్ణించి స్వబుద్ధి నేఁటఁ గలిపిన వాడుగాడు. ఇతని ప్రభావతీప్రద్యుమ్నము మిగుల మనోహరమై వర్ణనీయమై జాతీయమై యుండును. ఆంధ్రభాష కతఁడు మహోపకార మొనర్చెను. ఇతని ప్రబంధశైలి యంతయు నాటకశైలివలె నుండును. ఇతని కవిత్వము గూర్చి దక్షిణమూర్తి గారొక యుపన్యాసము వ్రాసియున్నారు. నేనేమి యిచట వివరింపఁబోయినను బునరుక్తిగా నుండును. ఆతని ప్రబంధగుణముల నంతయు వ్రాక్రుచ్చుటకవకాశములేదు. ఇతఁడు మొట్టమొదట వ్రాసినది రాఘవపాండవీయము. ఇది ద్వ్యర్థికావ్యము. ఇతఁడే ద్వ్యర్థి కావ్యములకు దారి చూపినవాఁడు! శ్లేషకావ్యములు రచించుటచేతఁ గవీశ్వరున కెన్ని నిఘంటువులుఁ దెలియును? పదముల నెట్లెట్లో మార్చిన ననేకార్థములిచ్చును అన్నవిషయము మాత్ర మెఱుంగవచ్చును. శ్లేషకావ్యముల యందుఁ గథాచమత్కృతి చూపుటకు వలనుపడదు. అర్థగౌరవమును గవి యెట్టివాడైనను కొంత తఱుగుచున్నది. పదలాలిత్యము, శయ్యావిశేషము, రసపోషణమును వీటిబోవుచున్నది. ఒక కావ్యమును జదివిన పామరున కెట్టియానందము కలుగవలయునో పండితున కెంతబుద్ధి సూక్ష్మములగు విషయములు దోచవలయునో కవీశ్వరునకెట్టి దీర్ఘాలోచనయైన యర్థవిశేషములు చూపట్టవలయునో యివి శ్లేషకావ్యముల యందెక్కడనున్నవి? శ్లేష కావ్యములు చదువుట మిక్కిలికష్టము. భాషాజ్ఞానమును గొంతవలయు. కావునఁ బండితుఁడే పఠనముసేయదగును కాని పామరుల కలవి గాదు. అప్పుడు పండితుని సంతోషపెట్టకున్ననేమి ప్రయోజనము? ద్వ్యర్థి కావ్యములు పఠించిన యాతఁడేమి లోకానుభవమునేర్చును? సుఖదుఃఖముల యందు జనుల డెందములెట్లుండునో యీ జ్ఞానము పుట్టించుటకవకాశముగలదా? ఆంధ్రభాషకు ద్వ్యర్థికావ్యములవలన గలిగిన న్యూనత నాల్గవది. ఈద్వ్యర్థిత్ర్యర్థి కావ్యములు వ్రాసినవారు గొప్పకవులు. వారందఱును రసవంతములైన ప్రబంధములచే బుద్ధి కౌశలము నెఱపియుండిన నెంత బాగుండును. నేనిప్పుడు వచించిన నాల్గున్యూనతలును నాల్గు మహాకవుల నుండి వచ్చినవికదా. అది కారణంబున వారి దూషించుటతగదు. వారి నవలంబించిన వారి దూరనొప్పును. ఏ విషయమునందుగాని మహాత్ముఁడని లోకముచేత బరిగణింపఁబడునతఁడు

తనకాలము నందుండు స్థితిగతుల కేమాత్ర మిచ్చగింపక నూతనమార్గము జూపు వాడుగానున్నాడు. ఈ ప్రతిజ్ఞచే నూతన మార్గదర్శులందఱు మహాత్ములనుటకుఁదగదు కదా! అట్లు చెప్పినచోఁ దర్కమునకు బాహ్యమగును. ఇట్లు మహాత్ములు నూతన మార్గము లుపదేశింపఁ గాలాంతరమున దేశకాల భేదము వలన మేలో కీడో చూపును. ఇట్లే యీ నాల్గు కవులుఁ జూపిన నవపథంబులు భాషాక్షీణమునకు హేతువులయ్యెను. ఇదియు వెనుకటి కాలపుఁగవిత్వముఁ జూచిన స్పష్టమగును. ఈ నాల్గు నూతన పద్ధతులవలన గలిగిన ఫలంబులు సంగ్రహముగా వక్కాణించెదను. అర్థగౌరవమునకుఁబోయి శబ్దగౌరవమునకుఁ బ్రాముఖ్యతకలిగె. ఇది యతిత్వరితముగా నాకాశమంటిపోయెను. కవులు వస్తుసారము వెదకుటకు మాఱుగాఁబదములు వెదుక నారంభించిరి. దీర్ఘ సమాసములును, శబ్దాలంకారములును, శ్లేషలు, నియమములు, నుత్ప్రేక్షలు, నతిశయోక్తులు మొదలగునవి గ్రంథోద్దేశ్యము కంటెను, వస్తువుకంటెను, గథా సందర్భముకంటెను, సంభాషణా నియమముకంటెను, గల్పనా కౌశలము కంటెను, గౌరవింపఁబడెను. ఆంధ్రభాషయందుఁ పింగళి సూరన్న నాటికే కపట గౌరవములు పొందు కావ్యాదులు బయలుదేరెను. వారి శబ్ద మహత్వము నేటివారి కన్నులు సహితము గప్పుచున్నది కదాయని దుఃఖించెదను. ఇటీవలి వారు కొందఱు శ్లేషకావ్యములు చదువుటచే నొక్కపదమునకు నెన్నియర్థములు గలవో తెలియుననియు నట్టుతెలిసికొనుట యందఱి కత్యావశ్యకమనియు వ్రాక్రుచ్చుచున్నారు. లోకమున నర్థ పరిజ్ఞానము కొఱకు శబ్దము పుట్టినదికాని వ్యత్యస్తముకాదు. కావ్యముల దత్తత్పాత్రముల సంభాషణములను వర్ణనాంశములను సంపూర్ణముగా గ్రహించుకొనుటకై పదార్థము వెదకెదముకాని కేవలము నానార్థపరిజ్ఞానముతోఁ గవులకుఁదక్కచదువువారల కావశ్యకములేదు. సృష్ట్యాదియందుఁదమ మనోభావములఁదెలుపుటకు వేఱొండులేమిజేసి శబ్దంబు పుట్టె. మనోభావము దైవకృతము. శబ్దంబు మానుషకృతము. కావున నర్థంబునకె ప్రాముఖ్యత యొసంగవలయు. మూలకారణ మించుకయోచించినచోఁ గపట గౌరవము కనుపట్టును.

తెనాలి రామకృష్ణుఁడధిక గుణగ్రహణ పారీణుఁడు. తనకాలమునఁ బాడుచేసిన యీ నాల్గు న్యూనతల సంపూర్ణముగాఁ గనిపెట్టి దానిపొంతపోక తన గ్రంథమును వ్రాసినవాడు. రామకృష్ణుఁడు పింగళి సూరన్నకంటె ననేక

విధముల గొప్పవాఁడని నాయభిప్రాయము. పింగళిసూరన్న తన గ్రంథములలో ననేక భావములఁ బూర్వగ్రంథములలో నుండి గ్రహించుకొనెను.

చ॥ శ్రమముడుగుం దనూజడిమజారుఁజలాచలలక్ష్యభేదన
క్రమము తెలుంగవచ్చు మదిగానఁబడుం బరజాతిభీతి లో
పముల విచేష్టితంబుల విభావమునం దలపోసి యన్ని చం
దములఁ బ్రియంబెయంచు నరనాథుఁడు వేటకు నుద్యతాత్ముఁడై.

అన్న పద్యము కాళిదాసు రఘువంశములో "పరిచయం చల లక్ష్యనిపాతనే భయ రుషోశ్చత దింగిత బోధనం, శ్రమ జయాత్ప్ర గుణంచకరోత్యసౌ, తను మతోనుమతస్సచివైర్యయౌ" అనుశ్లోకమునకుఁదెనుఁగు. ప్రభావతీ ప్రద్యుమ్నములోఁ బ్రభావత్యంగవర్ణనలన్నియు వసుచరిత్రనుండి చేకొనఁబడినవి. స్థాళీ పులాక న్యాయముగ నిందొకటి చూపెదను.

క॥ కాంత తరఫాలసంజ్ఞిత
కంతు విజయలేఖ పట్టికా విన్యస్తా
ద్యంత శ్రీకారము లన
నెంతయు నా యింతి పీను లింపెస లారున్॥ ప్ర. ప్రద్యు.

గీ॥ త్రిజగతీ సుదతీ రూప విజయకీర్తి
గలుగునని యింతి ఫాలభాగమున వ్రాసి
నలువ యీ శుభ వాచకంబులకు శ్రీల
మొదలఁదుది నిల్పెననఁ గర్ణములు దనర్చు॥ వసు.

ఇత్యాదు లనేకములు గలవు. రామకృష్ణుని వర్ణనలన్నియు స్వకపోల కల్పితములు. అతఁడు నీతి బాహ్యమగు కథలపొంతఁబోఁడు. పాండురంగ మాహాత్మ్యములోఁ దృతీయాశ్వాసమున బ్రాహ్మణవిటుని కథ యెంతనీతిని గఱపుచున్నది. ఆ కథ యందలి సారాంశములకు రుద్రయ్యగారుమెచ్చి దానిఁదన నిరంకుశోపాఖ్యానముసఁ జొప్పించియున్నాఁడు. రుద్రయ్యయుఁ గొంత పొగడ్తకుఁ దగినవాఁడు. నిరంకుశుని భార్య యొక్క నైజగుణము లక్షణముగాఁ బోషింపఁబడియున్నది. చూడుఁడామె తనయత్తగారితో-

ఉ॥ కోరిక దీఱఁగా గుడిచి కుంకుమ సంకుమదాంకగంధ మొ
య్యారముగా నలందుకొని యాకులుపోకలు చాలినన్ని దు
ర్వారతరేచ్ఛఁబుచ్చికొని వారలతాంగుల యిండ్లకేగఁగా
నూరక చూచుచుండెదరయో యదలింపక మీరు మామయుల్.

వెనుకటి కథ మాత్రము వెఱ్ఱి మొఱ్ఱిగానున్నను ఆ నిరంకుశుని జంపకగంధి యను వేశ్య పఱచిన పాట్లన్నియు నీతి బోధకముగానున్నవి. ఇవియన్నియు తెనాలి రామకృష్ణుని సహజ గుణమొనర్చిన కృత్యము. పాండురంగమాహాత్మ్య మాంధ్ర భాషకొక గొప్ప సహకారి.

అంత్యకవుల కాలమునందు భాషకు మఱియొక న్యూనత సంభవించెను. అది యేమన్ననో నిరోష్ఠ్యాది నియమము. దీనిఁబెంచి చెప్పుట కవకాశములేదు. ఆదికవులు విశేషించి తెనుఁగు పదములు ప్రయోగించి, మధ్యకవులు తెనుఁగు బాసయనుట మఱచి సంస్కృతపదములతో నింపిరి. ఈయంత్యకవు లసహ్యములగు నన్యదేశపదములతోఁ గాలము గడపిరి. విశేషించి వ్రాయకపోయినను నొక పద్యముదాహరించెదను.

సీ॥ జంపు నూరెపుటంబుఁగెంపు నిద్దపు గేవ
గుత్తంపు బంగరు కొమ్మకట్టు
డంబుమించిన పగడంబు తలమాళి
నాణెంపు పెద్ద కట్టాణి గద్దె
జాతికిరీటి పచ్చల రావిరేకలు
గమకపు పోలాతి గంట జోళ్ళు
నిండు చెందుయ నిగ్గు వెండి మేలందెలు
కప్పరా నంతనయొప్పటొరిజ
సాన దీఱి వజ్రాంకుశంబు బారి
నిగళ దుష్ట మదములు గుడుగుట యేక
సరము కంబాటమున నిజచ్ఛాయల ప్రతి
కరుల నిగిరిబడుట గల్గు గంధకరులు.

ప్రబంధరాజము విజయవేంకటేశ్వరవిలాసము. ఈ గణపవరపు వేంకట కవి తాను సర్వజ్ఞుఁడని చూపఁబ్రయత్నించెనే కాని యించుకైన రసము పుట్టిం

చిన వాడుకాడు. అతనికి శబ్దసౌష్ఠవమన్న మాటయే తెలియదు. సర్వలఘు సీసములును జిత్ర కవిత్వములు వ్రాసి పుస్తకమునించెను. లక్ష్యములకై యిట్లు వ్రాసెనని చెప్పవత్తురేమో? లక్ష్యములుగా నుద్దేశింపఁబడని వాని యందును నున్నవి. పుస్తకము చదివినంత మాత్రమున నతని స్వభావము తెలియలేదా? కపట గౌరవాభావమునకు వ్రాసితిని. ఇతఁడు వేంకటేశ్వరుని చుట్టునున్న బిరుదుజెట్లు వర్ణించుచు మల్లసాధనమునకు పట్టాయిచ్చెను గాని వర్ణనాంశములు మఱచిపోయెను. ఈ యంత్యకవుల ప్రబంధముల గూర్చి స్థలాంతరములఁ జర్చించెదను.

శ్రీనాథుని మొదలు హూణశకము 19వ శతాబ్దమారంభము వఱకు నాంధ్రభాష తిన్నగా లోకులకుఁ దెలియనట్లు క్షీణించినది. నేటికాలములో నేదో రెండు మూడు పద్య కావ్యములు గొన్ని యాంధ్రీకరణములును దక్క- మిగిలినవన్నియు నంత రసపుష్టి గలిగినవిగాలేవు. ఈ కాలమునందును గ్రంథాంతరములనుండి భావముల గ్రహించువాడుక తుదముట్టలేదు. ఒక కవి శిఖామణి—

సీ॥ కాలకంధరతపో గర్వాపహారియై
చెలఁగినయానాఁటి చిత్తజుండు
భూరిధారుణ ధీర ధారుణీధమథ
నార్తి బొందని యట్టి యబ్ధిరాజు
ఘోరశాత శతారసారధారాప్రభ
లెఱుఁగని యానాటి హేమశౌరి
రాహు దంష్ట్రోత్కట క్రకచ ఘాతంబుల
బాధలు దెలియని పద్మవైరి

చక్కదనమున గాంభీర్యసారమునను
బ్రకట ధైర్య కళా కలాపములయందు
రావులకు నెల్ల వరశిరోరత్నమైన
సాంద్రభోగీందుఁడా రామచంద్రుఁడెలమి.

అను పద్యమును శ్రీనాథుని నైషధములోని

సీ॥ కాలకంఠ కఠోర కంఠహుంకారంబు
చెవుల సోకని నాటి చిత్తభవుఁడు
కుపిత రాఘవ ఘన క్రూర నారాచంబు
తనువు నాటని నాటి వనధిరాజు
క్రుద్ధ కుంభోద్భవ భ్రూలతా కౌటిల్య
వికృతి గ్రుంగని నాటి వింధ్యశిఖరి
వీరభద్రోదార ఘోరవీరావేశ
విహృతిఁగందని నాటి తుహిన కరుఁడు
చక్కఁదనమున గాంభీర్య సారమునను
ప్రకట ధైర్యకళా కలాపములయందు
దండనాయక చూడావతంసమైన
మంత్రి మామిడి పెద్దనా మాత్యుఁడెలమి

అనెడు పద్యముతోఁ బోల్చి చూచిన దెలియును ఇట్లే యీ కాలమం దనేక ప్రబంధములనున్నది. అవి యెల్ల నుదాహరించుట భావ్యముకాదు. పద్య కావ్యముల నెత్తి చర్చింపగా నన్నయగారి కాలమునఁ బుట్టి, తిక్కన కాలమున మహోన్నత దశకువచ్చి కొందఱు మహాకవులచే నాదరింపఁబడి క్రమముగా క్షీణింపఁ జొచ్చెను. ఇకను వచనగ్రంథములు విషయమై కొంత వక్కాణించెదను. వచనగ్రంథములని ప్రత్యేకముగా వ్రాయకపోయినను భారతాదులయందుండు వచనములు మిక్కిలి ప్రౌఢములై శ్లాఘాపాత్రములుగా నున్నవి. మధ్య కవుల ప్రబంధముల నున్న వచనములు ప్రౌఢములు గాక పదగాంభీర్యముగలిగి నిఘంటువులఁ బొరలింపవలసియున్నది. పదునేడవశతాబ్దారంభముననే చంపువులుగాక ప్రత్యేకముగా వచనగ్రంథములే ప్రారంభించిరి. అవియన్నియుఁ దాళీదళ సంపుట ప్రకార కాంతారంబున విచారించువారు లేక పడియున్నవి. నేటి కాలమున మంచి సహజమాధుర్యముగల వచనగ్రంథములు పొదకట్టుచున్నవి. రాజశేఖర చరిత్రము, సత్యవతీ విలాసము, మంజువాణీవిజయము మొదలగు ననేకములును మనోహరములుగా నున్నవి. దీని ననుసరించిన విషయముల నొకటి రెండు మాత్రము చెప్పెద. ఈకాలమునందు రాజమహేంద్రవర ప్రాంత్యముల వెలువడు కొన్ని చరిత్రకములు Novelettes సంఘదురాచారములను దూషించునవిగానున్నవి. అయ్యవి భాషోపయోగములు కావని నాయభిప్రాయము.

వచనగ్రంథముల శాస్త్రములు, దేశచరిత్రలు, చరిత్రకములు, ఉపన్యాసములు, వ్యాసములు మొదలగు ననేకము వ్రాయవచ్చునుగదా. నానాదేశచరిత్రములు చదివినంగాని మనదేశపు దురాచారములు తుదముట్టవు. కొందఱు స్వదేశాభిమానులయి పనిచేయుచున్నారు. జనసామాన్యము వారల మనోభావముల నెఱింగి గౌరవింపలేదు. కావున జనసామాన్యమును, రాజకీయ, సంఘసంస్కరణ, నీతి, ధర్మపద్ధతులఁ దెలివిఁగల వారినిగా నొనర్చుగ్రంథములు రచింపవలెనుగాని, ప్రత్యేకముగా చరిత్రములు Novels వ్రాయునప్పుడు వర్ణనాంశములతో సంఘసంస్కరణాదులఁ జేర్చిన గొందఱికి హాస్యాస్పదములుగా నున్నవి. ప్రకృతిశాస్త్రము లాంధ్రీకరించుట యత్యావశ్యకము. చదువువారు లేకున్నను కాలాంతరమునఁ బుట్టుదురను నమ్మకముతోఁ బనిచేయవలయు. నానాదేశచరిత్రములకు, Bacon's essays వంటి గొప్పగ్రంథములను దెనిగించుట ముఖ్యము. తెనాలి రామకృష్ణుని గుఱించిన యనేక సంగతులు, నంత్యకవులఁ గూర్చియు, వచనగ్రంథముల గూర్చియు స్థలము కాలములేక విడువబడినవన్నియు దీనిని ముద్రించెడు పక్షమున దీనితోఁ జేర్చి వ్రాసెదను.

ఇంక నాటకస్వభావములఁ గొంత వక్కాణించెదను. తెనుఁగున నాటకములకు దారిచూపినవాఁడు శ్రీనాథుఁడు. ఇతఁడు వ్రాసినది వీథియను రూపకము. దీనియందు వీథికిఁగల లక్షణములన్నియు యున్నవి. ఇతఁడు నాటకము వ్రాసియుండినచో ననేకులు నూతనముగానే రచించియుందురు. పూర్వకవులు నాటకములు వ్రాయనందునకు ముఖ్యకారణము దెలియలేదు. కొందఱు సంస్కృతనాటకముల నీచపాత్రముల వాడుటకు ప్రాకృతాది భాషలుగలవు, తెనుఁగున నట్టివిలేవు, సలక్షణముగాకుంటచే గ్రామ్యములుపయోగించుట దగదని వచించుచున్నారు. మధ్యకవులు కొందఱు నాటకములు దెనిఁగించిరి. ఘంటమల్లయ్యయు నందిసింగయ్యయుఁ బ్రబోధచంద్రోదయమును, ప్రబంధరూపముగా నాంధ్రీకరించిరి. వారు రచించిన విధము దెలియుటకై ద్వితీయాంకములో దంభుని వాక్యములగు "వేశ్యావేశ్మసువీధు గంధలలనా వక్త్రాసవామోదితై, ర్నీత్వానిర్భరమున్నధోత్సవరసైరున్నిద్రచంద్రక్షపాః" అను శ్లోకములకుఁ దెనుఁగుఁ జూడుఁడు.

మ॥ రతులం సింధురసంభ్రమక్రోవులగు వారస్త్రీలు కెమ్మోవులన్
మతినుప్పొంగుచుఁ గ్రోలివెన్నెలల నానందించి రేపాడి దీ

క్షితులై తాపసులై సదాజపితులై క్షీరోదకాహారులై
యతులై దంభునిమోసపుచ్చెదరు మర్త్యశ్రేణి ధూర్తోత్తముల్.

ఉ॥ వీరలుగంగలోఁ బులినవేదులమీఁదఁ బృశీనివిష్టులై
నోరువృథా మెదల్పుచుఁ గనుంగవ మోడ్పడ నక్షమాలికల్
సారెకుఁద్రిప్పుచున్ గుళలు లాజలిలోపలిదేవపూజలున్
దారునుదాంభికుల్ జనధనంబు హరించెద రద్భుతంబుగన్.

అని యిట్లు ప్రతిశ్లోకము ప్రతిపద్యముగా మార్చినను ప్రబంధరూపముగా నున్నది. పామరజనాదరణీయమైన యక్షగానాదుల రూపకములలోఁ జేర్పఁ గూడదు. అవి భాషకుపయోగములుగావు నేటికాలమునందు శాకుంతలాదులు దెనిఁగించినవారు భాషకు గొప్పసాయ మొనర్చిరి. నూతనముగ వ్రాయఁబడ లేదని మాత్రము దుఃఖముగానున్నది. అయిననందున కుద్యమించినట్లు చిత్రనళీయాదుల మూలకముగఁ బొడతెంచెతి. చిత్రనళీయమున రసమునకుఁ ప్రాముఖ్యత యీయఁబడియున్నది. అది యావశ్యకము. కొందఱు హంసప్రస్తావములేదని కొఱఁత చూపించున్నారు. కథమార్చుటకు నాటకకర్తలకు నిరంకుశాధికారము గలదు. శాకుంతలము, వేణీసంహారము, మల్లికామారుతము, ముద్రారాక్షసము మొదలగు నాటకములలో నెట్లు కథలు మార్చియుండఁబడలేదు. నూతననాటకములు రచించువారికనేక సందేహములు గలుగుచున్నవి. ఆంగ్లేయ నాటక పద్ధతులనుసరించుటమేలా సంస్కృత రూపకముల ననుసరించుట మేలాయని. షేక్స్పియరువలె మనుష్యుల నైజగుణములు, జనులమోసకృత్యములు మొదలగు వాని వర్ణించునప్పుడాంగ్లేయ పద్ధతుల ప్రకారము వ్రాయుటయే యుత్తమము. కేవలము వర్ణనలుగలిగి యానాటకకథ యనేక సంవత్సరకాలములో నడచియుండినచో సంస్కృతనాటకానుసరణమే ముఖ్యము. సంస్కృత నాటకములయందు నీచపాత్రములచేఁ బ్రయోగింపఁబడిన ప్రాకృత భాషలకు బదులుగ గ్రామ్యభాష యుపయోగింపఁదగినదని నాగానందాదుల వాడఁబడియున్నది. అయ్యది యనుచితము. ప్రాకృతాదులు సలక్షణములై గ్రంథస్థమైన భాషలు. ప్రాకృతమునసేతు కావ్యసప్తశతులుండలేదా? పైశాచిలో బృహత్కథలేదా? ఈ సందర్భముననే యీ క్రింది విషయమునుఁ గూర్చెదను. ఆంధ్రభాషయందు Mesmerism, Somnambulism, Selection, Electricity, love ఇత్యాదులకు పర్యాయపదములు లేవని యాపదములే వాడుకొనుట కుద్యమించుచున్నారు.

చ॥ పిదపనినిశుంభుఁడుం దొడఁగెఁ బిష్టలు గాల్చుచునానుబారుతోఁ
గదనము సేయ నాయనయు, గాంచిహసించి ఫటాలనంగ బె
ట్టిదముగఁ గొట్టిచెంపఁగడు దెప్పరముం గలిగించి పిష్ట లే
పొదవఁగలాగికోఁగఁదగవోయని యార్చెనిశుంభుఁడెచ్చుగన్.

ఈ పద్యమునం జూచినఁ దెలియును.తెనుఁగు భాషయంత మాధుర్యముగల భాష మఱియొక్కటి యీ లోకమునలేదు. సంస్కృతభాషయు నీవిషయమున లోకువ యని నాతలపు. ఇట్టి యాంధ్రభాష యొక్క సహజమాధుర్యమును జెఱిపెడు నీయన్యదేశ్య పదములేల యుపయోగింపవలెను. వీనికిఁదగిన సంస్కృతపద ములు వెదకిగాని, స్వరనిర్ణయము తెలిసినవా రుత్పత్తి యొనర్చిగాని ప్రయోగింప దగు. ఈనాటకము గూర్చి యధికముగా వచింపదలఁచియున్నాను. కాలమును సందర్భమును అనువు పడలేదు.

ఆంధ్రభాషకు వలయునంగములన్నియు నేటికాలమునకుఁ గుదిరి యున్నవి. పద్యకావ్యములు మాత్రమున్నతస్థితికి వచ్చి క్షీణింపనారంభించెను. వచననాటకగ్రంథములు వృద్ధి యగుచున్నవిగాని యున్నతికి రాలేదు. ఈకాలము నందుండు జనసామాన్యమాంధ్ర భాషాభివృద్ధిఁ గోరి తత్ప్రయత్నము లొనర్చు వారిఁ బ్రోత్సాహపరతురని నమ్ముచున్నాను. దీనియందు వాక్యసందర్భములు, శబ్దశుద్ధియు లేక యుండును. మహాత్ములునన్ను క్షమింపవలయు. ఈయుపన్యాస వ్యాజమున మహాకవుల నిందించితినని కొందఱు తలఁతురేమో. ప్రస్తావకారణమున నట్లు వచించితిగాని ముదుసలులును బుత్రవాత్సల్యముసుగల తల్లిదండ్రుల విడిచి దేశాంతరముఁ బోయి గురుశుశ్రూష చేసి విద్యనేర్చి లిఖితగ్రంథములు దొరకని యా కాలమునందున్న కవిచంద్రుల దూఱుట నాయంతరాత్మ యెన్నటికినిచ్చ యింపదు. సహజమాధుర్యములేక శబ్దశుద్ధిలేని యితర భాషల కావ్యములు చదివి తెనుఁగుబాస నిస్సారమనెడి విద్యార్థుల యుల్లముల కందువాపుటకుఁ బ్రయత్నించితిఁగాని వేఱుఁగాదు. ప్రస్తుతమున మన యాంధ్రభాషపై నొక యాంగ్లేయ పండితుఁడిచ్చిన యీ క్రింది విమర్శనముతో ముగించుచున్నాను.

Telugu poetry has now lasted without any material variation for more than six centuries and the earliest compositions manifest a high state of literary refinement. This taste is often such as we must condemn. But we have no means of framing a fair judgement until we are able to read the original.

Much however that is admired in Telugu is in the worst taste of literary frippery. At the conclusion of poems, in particular, we find verses framed in fantastic shapes, such as that of a sword, a square, a wheel, a serpent or any other laboured conceit. Another refinement relates to the language wherein the same verse is made to hear two entirely different imports, every word involving a pun. These conceits, execeding all that Addison has condemned as false wit, are always borrowed from Sanskrit. The Vasucharitra, the Raghava pandaveeyam, the Vishnu chitteeyam and other poems of high celebrity are valued by the Telugus for those literary feats of skill which in English have been well performed by Thomas Hood.

When we make sufficient progress in the language to set aside the pedantic portion of the various poets we shall find there ramains an ample stock of reading which is really valuable.

నేను యీ పైఁ జెప్పఁబడిన విషయముతో ముగింపవలయునని యుద్దేశించి యుండఁగా దీనింగాంచి నేను దలఁచిన దంతయు నున్నదని దీనినుదాహరించితి

మా. రామకృష్ణకవి

## మృగావతి

( కావ్యము )

# అంకితము

క॥ విమలాచార పవిత్రున
కమృతమయస్వాంతునకు సదాగమ విద్యా
ప్రమదున కుర్వీపాలో
త్తమ నుతునకుఁ ద్యాగరాజ దైవజ్ఞునకున్.

గీ॥ తల్లిదండ్రులకన్నను ధర్మపత్ని
కన్న నెక్కుడు ప్రేమతో నన్ననుఱుఁ
జూచుకతమునఁ గీర్తి శేషునకు దీని
నంకిత మొనర్తుఁ గన్నీళు లబ్టైజాఱ.

**M. R.**

శ్రీ ర స్తు

# మృగావతి

ఉ॥ శ్రీపచరింపఁ దూర్పుగిరి శృంగము నందుదయించి తామస
వ్యాపృతినుచ్చమొంది గజమారజరాప్లుతినసత్వమూద భా
షాపతియై యనంగజయశాలియు నైబరియైన క్రోధమున్
జోపిన లోకబాంధవుఁడు సూచు మము న్గరుణైక దృష్టులన్. 1

గీ॥ గంధరస రూపసంస్పర్శకంబులైన
నాల్గుగుణములు శబ్దగుణంబునంద
యడఁగు నది యనంతంబ శబ్దార్థినగుచు
నమృతమూర్తిని భారతి నాశ్రయింతు. 2

క॥ కవిరత్నత్రయ దిగ్గజ
నవసత్కవులన్భజింతు నవ్యగుణ జన
త్కవితారచనా చాతు
ర్యవచస్సంసంగ హూణరసికులఁ దలఁతున్. 3

గీ॥ చెన్నపురి చూళ నివసించుచున్నవాఁడ
వైదిక బ్రాహ్మణుఁడ మానవల్లి కులుఁడ
రామదైవజ్ఞ పుత్రుఁడ రాజనుతుని
త్యాగరాజ పండితుని ప్రియానుజుండ. 4

వ॥ అని త్రిమూర్త్యాత్మక స్వరూపుండైన సూర్యనారాయణుని నఖిలకవితా
విశారదయగు శారదను ప్రాక్తనకవిచంద్రులను బొగడి మద్వృత్తాంతం
బును నుడివి సోమదత్త మహాకవి ప్రణీతకథాసరిత్సాగరాంతర్గతమైన
యేతత్కథా ప్రపంచం బెట్టిదనిన. 5

చ॥ అనఘుఁడ కాణభూతి సుగుణాఢ్య గుణాఢ్యుని వింధ్యవాటికన్
గని కవితాసుధారసము కాశ్యపి జాల్విడు పుష్పదంతుఁడి
చ్చిన సుకథామృతం బిడినఁ జేతము శీతముగాఁగ శాతవా
హనునకొసంగె నీకథ గుణాఢ్యుఁడు కావ్యమహత్వ సంపదన్. 6

చ॥ తనరుగదా! జగంబులకుఁ దల్లియుఁ గల్మికిఁ బుట్టినిల్లు స
న్మనులకు తావు పుణ్యముల ముఖ్యపుటిక్క నిధానలక్ష్మికిన్
గొనబుటివాణము న్నరుల కోవెలయై పెనుపొంది పొల్చు నం
దనవనశోభితం బమరనాథ పురంబు సురాలయంబునన్. 7

వ॥ అందుల కధినాథుండు శునాసీరుండు. 8

చ॥ ఒకతఱి రక్కసుల్పఅపుటుక్కు మెయిన్సురలోకనాథునిన్
గొకిబికిసేసి వంగడము గూల్పదలంచి యగణ్యసైనిక
ప్రకరము వేల్పువీటిపయిఁ బంచిరి దైపతరాజు భూమి పా
లకు లిడు బాసట న్విజయలక్ష్మని దోడ్కొనివచ్చె నిక్కకున్. 9

మ॥ అమరేంద్రుండు జయోత్సవ ప్రకటనోద్యత్కాంక్ష జేజేలవే
గమ కైసేయ సుపర్వపట్టణము నాజ్ఞాపించె బ్రహ్మస్వభూ
ప్రముధాధీశులఁ బిల్వసంపి మునులన్ రావించె సంగీత స
త్తములేతేరఁగబంచి మాతలిని జెంతంబిల్చి తానిట్లనున్. 10

చ॥ తనరుః హిమాచలేశ్వరుని దక్షిణభాగమునందు సూర్యజా
ఘన నది తత్తటంబునఁ జొకాటపుఁ దోటలకాటపట్టునై
వినయవివేకము ల్తఱుగువెట్టని పాఱుల వేదశాలయై
గొన కొసయుండు నొక్కపురి క్షోణిఁగుశాంబ పురాఖ్యవెల్గుచున్. 11

క॥ ఆ కౌశాంబి సహస్రా
నీక మహారాజు విమల నిత్యయశశ్రీ
గై కొని పాలించు శతా
నీకుని పుత్రుండు ధిషణనిభుఁ డురుబుద్ధిన్. 12

క॥ ఆవింధ్యాచల శీత
గ్రావాంతర సర్వదేశరక్షాభరణ
ప్రావీణ్య గణ్యుఁడగుచును
యౌవన సౌభాగ్యగరిమ నవని భరించున్. 13

మ॥ నెఱకుల్గ్రొంచుచుఁ దేర్లుగూల్చుచు శతానీకుండు ప్రావేల్పులన్
గఱకుంగోలల మొగ్గరంబవని స్రుక్కంజేసి తూఁటాడి యే

ద్రై ఆ వర్మంబులసింగిణీల్వింటిచి వేధింపంగ వీక్షించితే?
వెఱరాజు గ్గతయుద్ధమందటుల రొంపింగూల్చిరే? మార్తురన్. 14

గీ॥ దైవవశమునఁ జేసి యాధర్మవిదుఁడు
పగతుఱ జయించి కోల్పోయెఁ బ్రాణములిట
పిఱికిపంద దీర్ఘాయు రుపేతుఁడై మ
హాత్ముఁడల్పాయువగుట పెన్నుబ్ర మెచట. 15

వ॥ ఓ మాతలీ, తూర్ణంబ యప్పురి దఱిసి యన్నరపాలు నుత్సవమునకై
తో డ్తేవలయు ననుడు మాతలి, 16

క॥ ఏ యజ్ఞాంశములో స్థా
నీయము చెన్నారుఁజెపుడు నిమునములోనన్
బోయి యతని తో డ్తెచ్చెద
సాయక వేగమున ననుచు శతమన్యుఁడసున్. 17

మ॥ అరయం జాలవె? సర్వలోకవిదితంబై యొప్పు కౌశాంబి భా
స్కరజాకూలమునందు వేల్పునపలాల్సాయంవిహారంబులం
దరుగన్జూడవె? నాగకన్యలట సుయ్యాలాడరే? రేబవల్
పరిఘాంభోజదళాగ్ర సీమల ధునీ ప్రత్యగ్రభాగంబులన్. 18

మ॥ తతజూటావగ చంద్రమస్సహచరీ ధర్మంబునం బద్మశూ
న్యతనొంద న్సురకిన్నరాంగనలు పద్మాద్యాకర భ్రాంతిమై
నతనూల్లాన విమానలై యభినయవ్యాపార లీలామహో
ద్ధతిఁబోఁగంటె పదప్రచార నిమిషత్వంబుల్ పురిన్నేర్వఁగన్. 19

వ॥ అదియును దెలియవే? యనపుడు నట్లకాని దేవరచిత్తానుసారంబని
యరిగె. నింద్రుండు. 20

గీ॥ తెరువు తెరువునఁ బందిరుల్దీర్చుఁడనియెఁ
గొలువునెలవులఁ గల్యాణ కూటములను
మృగజఘన సారచందనామృతముతోడ
నలికి శృంగార మొనరింపుఁడనియె భటుల. 21

వ॥ అదియట్లుండె మాతలి పుష్పాద్యలంకృత దివ్యవిమానంబు సిద్ధపఱిచి
పురందరు వీడ్కొని స్వర్గద్వారంబు గడచి భూమికి. 22

క॥ చనుదెంచి వత్సదేశము
గనుఁగొని యాకాశయానగతుఁడై కౌశాం
బినిగాంచి కాంచనోపరి
ఘనవరణమునందు డిగ్గి కౌతుకమలరన్. 23

క॥ ఆపట్టణమహిమలు
దీపింపఁగఁ జూచి చూచి దివ్యుండయ్యున్
భూపతిని జూడనేగుచు
నాపార్శ్వమునందు వప్రమగుపడఁ జొచ్చెన్. 24

వ॥ చొచ్చి నలుగెలంకులంబరికించి జన్మసంచిత ప్రభావంబునంజేసి యీ
నవ్యసంచిత్రిత దర్పణనిభ భిత్తికా భాగంబులం గాంచితిమని యెన్నుచుఁ
బోవఁబోవ నొకమనోజ్ఞంబైన నగరుగాంచి తత్ప్రతీహారుని రాజు
నొద్దకుఁ దనరాక యెఱింగింపఁ బంచె. 25

ఉ॥ చారుఁడు భూపుఁగాంచి సురసారధి వచ్చిన యాదిగా సమా
చారము దెల్ప నాక్షణమె సైనికసంఘముతోడ దేవతా
సారధి తెండనంగ నిజసద్భటులల్లెగడంగి యాతనిన్
జేరి సగౌరవంబుగ భజింపుచుఁ దెచ్చిరి రాజు నొద్దకున్. 26

గీ॥ నవ్యమంజుల సింహాసనంబుడిగ్గి
సూతుగేలూఁతగావించి క్షోణిధవుఁడు
తగు సమున్నతపీఠస్థుఁ దనరఁజేసి
తక్క బృందారకుల నెల్లదనివియాత్మ. 26

శా॥ ఏదేశంబునకేగుచుండి యిపుడిందేతెంచినార ద్భుతం
బై దివ్యర్షభులార? యింద్రునకు సౌఖ్యంబే? ఋషివ్రాతముల్
వేదప్రోక్తయథోచిత క్రియలచే వెల్గొందుచున్నారె? యా
యాదిత్యుల్సుఖమున్నవారె? యన నత్యానందుఁడై యిట్లనున్. 28

శా॥ సూతుండోమహనీయ గుణలక్షణ క్షోణీధవా! రాక్షస
వ్రాతమ్ముల్దెగటార్చి తావకపితృప్రారబ్ధకర్మంబుకై
చేతంబెంతయుఁ గుంది శాత్రవజయోత్సేకంబుచాటింప మి
మ్మాతండిప్పుడు తోడుతెమ్మనె మహాత్మా! వచ్చితిన్దీనికై. 29

క॥ అనవుడుడెందము ఝల్లనె
జనకునిమరణంబు సతని జయములుదలపన్
మనమించుకంతదనిసెను
విన సురలోకాధిపశుభవిజయోత్సవముల్. 30

వ॥ అయ్యిరువురు పెక్కు-తడవు దేవదానవుల గతయుద్ధం బభివర్ణించుచుఁ
గొంతతటి రాజేంద్రుండు దేవసూతుంగనుగొని యిట్లనియె. 31

ఉ॥ ఎన్నిదినంబులున్నది మహేంద్ర జయోత్సవమింక నావుడున్
బున్నమనాఁడుగాన నిక మూడు దినంబులు మాత్రమేగదా
యున్నవి వేగనేగవలయు న్ధరణీశ రథంబు నెట్టనన్
మున్నిటఁ దెచ్చినార మన మోదముతోఁ దలయూచి మంత్రులన్. 32

క॥ రప్పించి రాజ్యభారము
నొప్పించి యుగంధరునకు నొప్పిదముగ దా
నప్పురికి వచ్చువఱకని
యప్పటి సభ పూర్తిసేసి యవ్వలి కరిగెన్. 33

గీ॥ మజ్జనంబాడి మాధ్యాహ్నమంత్ర విధులఁ
దీర్చి మృష్టాన్నభోజనతృప్తిగాంచి
కప్పురపు వీడెములనంది మెప్పువడసి
రల్ల బృందారకులు సిద్ధమయ్యెరాజు. 34

మ. కనకస్తంభ విరాజమానమగుచు న్గాంగేయపీఠంబుతో
డ నధోభాగము రత్నపంకజదళాష్టద్యోతక స్థాపితం
బన నొప్పారఁగ సాలభంజికలు వీణాభోగ విభ్రాంతిచేఁ
గన వెల్గొందెడినో యనంబరఁగు నాకస్యందనంబత్తఱిన్. 35

సీ॥ అపరసంధ్యా విహారపరులై కొమరాండ్రు
చికురబంధమ్ములఁ జేర్చువేళ
బృందారకాంగనా బృందంబుతోవీణె
వాయింప సుతి చక్కఁబఱచువేళ
యన్యోన్యసరసత్వ మలయింపముద్దియ

ల్గాడి గిరన గింజలాడువేళ
యమునాతరంగిణీ కమలకేళీమనో
హరల మనోవిభులరయువేళ
శారికాకీర శిష్యసంసదులు వారి
వారి పాఠముల్ శుద్ధాంతవరవధూటి
కాగురుస్థలి సరి చెప్పఁగలయు వేళ
భూతలేంద్రుండు రథమెక్కఁబోవువేళ. 36

సీ॥ భట్టారకస్తోత్ర పాఠము ల్వ్రేలయింపఁ
బద్మరాగద్యుతుల్బయిలువడఁగ
నఖిలనాకేంద్రకాంతా భోగవీణావి
శేషముల్మేలయింప సిరివహింప
నింకుసంధ్యావేళ హీరాంక మొనరింప
నాదిత్య సూతత్వమభినయింప
ప్రచురలోకాలోకరుచుల పెంపొలయింప
హరిరథ్యరుచిరత్వమొరసియాడ
నినుడినుండౌట యచ్చెరు వేటికదరు
విమల మౌక్తిక హారము వ్రేలియాడ
పచ్చరాకట్టుతోరణప్రభదలిర్ప
నెగయ జేజేల వీటికి నేగురథము. 37

గీ॥ అవని విడిచినయంతలో యమునదాఁటె
నచట క్రీడా విహారులైనట్టి జనులు
లోకబాంధవు లిరువురు నాకమందుఁ
దనరెదరు ప్రాక్ప్రతీచులనని వచింత్రు. 38

ఆ॥వె॥ మఱియుఁ గొంతలోనె మందాకినీ సరి
త్తటముసేరి యచట తపము సలుపు
చున్నమౌనివరులఁ గన్నారఁ గాంచుచు
వెడలె విభుఁడు గగన వీథియందు. 49

వ॥ అట్లు పోవఁ బోవ. 40

స్ర॥ ప్రాలేయోత్తుంగ శృంగ ప్రభపనమల ధారా గళద్గండ శైలం
బాలంబ క్రూరవానర్యవగణిత మదవ్యాఘ్రమంభోఝరాస
త్క్యాలత్యక్త ద్రుమాళిన్ గులికమణి విభాకోటి పీఠాయమానం
బాలోలత్సిద్ధ బృందంబగు హిమకధర వ్యాప్త కాంతారమెన్నన్. 41

ఉ॥ అధరణీధ్ర సానువుల నాడెడు మత్తభుజంగకోటివి
ధ్యాధరకన్యలంగులుపఁ దారట యౌవనమీడువెట్టి య
న్యాధవతా మిషంబు మెయినాచికొనందఱివేచి రాత్రులన్
బోధనువర్ణపత్రికలఁ బుల్కనఁగన్గొని బీఱువోవుదున్. 42

వ॥ తద్వద్వినోదంబులఁ గనుచు నంతరిక్షయానంబున. 43

శా॥ ఆలేఖుల్ ధరణీశుఁడంత మిహికార్యాటవీవాటులన్
వే లంఘించుచు గండకీతటివతీ విస్తారగాంగేయయు
క్సాలగ్రామచయంబుకై యచట వాసంబొందుయాత్రార్థులన్
లీలన్ జూచుచుఁ బోవుచుండిరి నెపాళీదేశముం జేరఁగన్. 44

శా॥ మల్లెల్ గోసి మరంద బృందముల భర్మస్థాళికాపాళిలోఁ
బల్లీకన్యలు నింపఁ గామునికి నేపాళీమణుల్ గోస్తనీ
వల్లీనిర్మిత కాయమానముల భవ్యంబైన పూజావిధుల్
సెల్లింపన్ రహినుద్యమింతురు యువశ్రీఁ గోరుచందంబునన్. 45

ఆ॥వె॥ గడచుచుండఁ బసిఁడి కటకముల్ వొడగను
వజ్రి యెదురుకోలు వచ్చెననఁగ
రథముగానవచ్చె బ్రతిబింబితంబయి
స్వచ్ఛమైన కాంతి సంతరింప. 46

ఉ॥ భోరున మ్రోగుహద్యములు బోటులుమీఁటుతతాదినాదముల్
చేరమహేంద్రునంత సరసీజముఖాకలధౌతపాత్రము
క్తారచనా ప్రణాళికల కాంతులు వెల్వడ తక్కడీప్తది
గ్వారణముల్ మదించినడువన్ దిగధీశులు చామరాదులన్. 47

శా॥ పూనన్ గానరసప్రసంగముల నంభోజాక్షులక్షీణ వి
ద్యానైపుణ్యము నూవ నంతసముతో నైరావతం బెక్కి నా
నానూన ప్రతిమావలోకన నసక్తాత్మున్ శతానీకగో
త్రానాధాత్మజు గానరావెడలె గీర్వాణ ప్రభుండత్తఱిన్. 48

క॥ అంత సహస్రానీకుఁడు
వింతదవులఁజేరెదివిని వేలుపుదొరయిం
తంతయనరాని వైభవ
మెంతే సంధింప వచ్చె నెదురాతనికిన్. 49

వ॥ వచ్చి. 50

ఆ॥వె॥ పారిజాతకుసుమ పరివేష్టఁ గావించి
గారవమునఁ దనదుగజము పైన
సమధిరోహుఁజేసి శంఖభేరీ మృదం
గాదివాద్యతతులు మోదుచుండ. 51

గీ॥ తోడుకొనిపోయి స్వస్సరిత్తుహినజలము
నర్ఘ్యపాద్యాదుల నొసంగి యచ్ఛమైన
పచ్చరాకట్టు పీటపై పైడిపచ్చ
డములు గప్పించి కూరుచుండమది గొలిపె. 52

వ॥ మది కొలిపి. 53

క॥ పౌత్తలవగొనఁగఁగాటక
ముత్తలమనుమాట లేకయున్నారె? జనుల్
పుత్తడి వరి పండెడినే?
వత్తురె? యుడుగరలొసంగ వసుధానాథుల్. 54

చ॥ అని యడుగన్ బ్రమోదమున నాధరణీశుఁడు వల్కెనట్లు మీ
యనుమతిచేత లోకులు సదా సుఖముండు భవత్కృపారసం
బున నఖిలంబు వర్ధిలు సమున్నత వైభవమంకురింపఁగా
వినయతమై గుణాగుణ వివేచన గల్గినవార లెల్లరున్. 55

చ॥ బవరమునందు పల్వోతల పాలొనరించి నిశాచరత్వమున్
దివిచితిపీవు తమ్ములను దేర్చితి ధీరతఁ జుట్టుముట్ట నీ
యవిరళ కాంతి కెంతయుఁ బ్రియంబు గడించెద నాకపాల యం
చవనిపుఁడాడ వజ్రి నిఖిలావనియేలి మదీయమిత్రుఁడై. 56

క॥ అసురాశియసురుగొనుచని
వెనమార్కొని పీచమడచి పీఠావేశ

ప్రసరతఁ దావకజనకుం
డసమాయుధపాణిఁ బొగడనది పాత్రమగున్. 57

క॥ అని యొండొరుఁ గొండొకతటిఁ
బెనఁకువ నఱుమాడు కడిఁది బీరము వొగడన్
వెనుదీయకున్న తడవున
మునిశార్ఙ్గివిధీశ్వర ప్రముఖులేతేరన్. 58

గీ॥ ఉచితసత్కారము లొసంగియుదిరి పసిఁడి
రేకు గూర్చినయాసన శ్రేవెరెట్టి (?)
గారవించిన యాదినమెల్లొగడపి యెడరి
నడపె మఱునాడు జయకేతు వెడపుటాది. 59

వ॥ సమంత్రకంబుగా జయోత్సవం బొనర్చి సేనలు శచీపురందరులు చల్లించుకొనిరి. 60

క॥ ఆనాఁటి సంజ వెలువడి
భూనాధుఁడు భటులు గొలువఁ బురుహూతుండున్
రా నుచ్చైశ్శ్రవమునఁ బురి
గానఁగ నారాజవీధికడ వచ్చుతఱిన్. 61

శా॥ అష్టాంభోజదళోపమస్థమణిఘృణ్యాకారహేలావల
భ్యష్టాశాపరివర్ధమానరుచులై యంత్రాంత్ర సంస్థాపితా
వష్టంభ భ్రమదభ్రచుంబి కలశవ్రాతంబులై మంజుమాం
జిష్ఠశ్రీయుత సాలభంజికములై చెన్నొందు సౌధాగ్రముల్. 62

మ॥ సురలోకేంద్రుఁడు సూపి యిట్లను జటాజూటాగ్రకస్తూరికా
సురదీర్ఘీ పరియుక్త సౌరభసరత్స్నానంబు భృత్సారణీ
వరజన్మస్థల కల్పపాదపమునై వర్ణీకృతాబ్జాననా
కరవీణారవమై వెలుంగు నలవంకన్ రాజమార్గం బొగిన్. 63

వ॥ అనుడు. 64

మ॥ భువిలో భూమి సురాగ్రహారముల కాపుల్ నారికేరావనీ
భవకాండంబుల కెల్లమట్టిని సుధన్ బట్టింపఁగాఁ జూచి వే

ల్పువెలందుల్ దివిగంధసింధురములం బూయించినారో యనన్
దవుఁ గంభంబుల హీరశోణమణులత్యంతంబు దీపింపఁగన్. 65

క॥ ఆ రాజవీధినేగుచు
నారాజకుమారుఁడంత నగుపడువీధిన్
బోరాదెయనుచు నడిగిన
వారించెను దుట్టతుదకు వతుమటంచున్. 66

ఆ॥వె॥ యక్షవీధిఁ జేరిరంత విద్యాధర
శ్రేణి సూచి యవల సిద్ధవీధి
గాంచిసంతసమున గంధర్వఘంటాప
ధంబుగడచి తిరుగుదారిజొరగ. 67

గీ॥ అదియె యింద్రుండువత్తుమటంచుఁజెప్పి
నట్టితెరువందుఁ గాపుందురప్సరోబ్జ
ముఖులు సంతోషచిత్తలై నిఖిలగతుల
గారవింపఁగఁ జూచిరాకాలమందు. 68

వ॥ ఆతఱి.

చ॥ సురపతి తర్జనీకలనఁ జూపుచు దాపుననున్నమేడనో
ధరణిప యూర్వశీగృహము దక్షిణమందు ఘృతాచిటెంకి యు
త్తరమున మంజుఘోషయిలు దాటిన నవ్వలి చక్కి మేనకా
హరిణులయిండ్లు చూడుమని హారతులందుచుఁ బోవనొక్కచోన్. 70

సీ॥ పదియారువన్నెల పసిఁడికుండలము లు
య్యాలలై వీనులఁ వ్రేలియాడ
నిటలభాగంబున నిడుదగందముపెట్టి
నడుమ కుంకుమబొట్టు విడిది దీర్చి
సామవేదాఖ్యాన సంగతి కొందఱు
కొందఱు యజ్ఞార్థకోటి దెలుప
నొకపార్శ్వమందిట్టులుండ నొండొక్కచో
నిఖిలాయుధంబుల నెరసిబెరసి

అసమశరవీరులన బోలునమితమదన
సమరసుకుమారు లై ద్యుతిచ్ఛటలు వెడలc
గాంచె నొకభర్మహర్మ్యంబు క్ష్మావిభుండు
వ్రజి రంభాగృహంబన వలచి చూచె. 71

వ॥ చూచి మందాకినిం దఱియ. 72

శా॥ గంగాసైకతవేదికాతలములన్ గల్పప్రసూనావళుల్
బంగారంపు గుణమ్ములన్ జొనిపి పూబంతుల్ కరంబాడుత
న్వంగుల్ ముచ్చటలాడుచుండ నృపుడానారీతతిన్ జేర మౌ
ళింగిలించిరి పుష్పమాలనవలాల్లీలావినోదంబులన్. 73

ఉ॥ అంతనరాధినాధుడు విహారవనమ్మును జూడగోరి యా
వంత గొఱంత లేక నదివాటులగాంచి తదగ్రభూమిభా
గాంతికనారికేరవని యందముగన్గొని నందనమ్మునకై
యెంతయువేగమై చనియెనింద్రుని తోడమదంబు పైకొనన్. 74

ఉ॥ అచ్చటc గల్పవాటికలనాడుచుc బాడుచున్న త్రగీతముల్
మచ్చికనిచ్చమెచ్చి కుసుమ ప్రసవప్రసరన్మరీచులం
గెచ్చిన గండపాళికల నెఱ్ఱదనంబుల నింపనుండునా
యచ్చరపూవుబోండ్ల నడియాసలు దోcపcగ జూచిర త్రతిన్. 75

ఉ॥ వేలుపులేటిపొంత వెడవిల్తుని నోములునోచ బాలికా
జాలము కల్పకాసవరసంబులc జెంబులనింప శాఖికో
ద్వేలశిఖాగ్ర వీధుల వివిస్తృతబర్హకలాపులాడుచోc
దోలcగరాలుపూగమికి దుల్యములయ్యెc గిరీటవజ్రముల్. 76

ఉ॥ అంచితమానసాబ్జ విషయంబులనేటికిc బ్రొద్దటంచురా
యంచలుపిండుగట్టి వసుధాధిపు దివ్యయశః పయస్సులన్
గాంచినc బుణ్యమంచు సురకాంతల యంతిపురంబుకోసమై
నించెనభోంతరాళ మవనీపతిగన్గొనెవిస్మయాత్ముcడై. 77

మ॥ సురవిద్యాధరసిద్ధసాధ్యగణరక్షోయక్షగంధర్వకి
న్నరభోగీంద్రపితామహేశ్వరరమానాథామరేశుల్ ఖగే
శ్వరులెవ్వారలుస్వాంగనాసహితులై వర్తింపనామాధవీ
తరువల్లీసుమపుంజకుంజములనాధాత్రీ విభుండిట్లనున్. 78

శా॥ ఈమందాకినిపొంత నీవనములో నీమాధవీవల్లికా
ధామశ్రేణిక నీలతాంతజసుధాధారావిలాసంబులో
నీమందారచరన్మయూరరవమందీ నవ్యదివ్యాంగనా
శ్రీమాణిక్యమరీచిసంతతిగదా రేయెండ నిండారఁగన్. 79

ఉ॥ జంపతులాత్మనేకమయిచందురు చంద్రికచల్లులాడి పూ
వంపజగుంపువిప్పి మలయానిలముల్ వెతబెట్టిజాళువా
పెంపుడుగోరువంకలకుఁ బేరులమర్చి సుఖాంబురాశిలో
దెంపరులై ముదంబనెడితెప్పలదేలెడి భాగ్యమెట్టిదో. 80

శా॥ ఏకాకిత్వములేటి సౌఖ్యములుగావేసాంద్రచంద్రాతప
స్వీకారంబులఁ బ్రాణదాయకవధూస్నేహంబులానందముల్?
గాకున్నన్పరమేశ్వర ప్రభృతులీకల్పాగవాటీచర
త్కేకీనృత్త విచిత్రవృత్తములలోఁ దేలాడఁగా నేటికిన్ 81

ఉ॥ చుట్టములెందరున్న నెఱసోదరలెందఱుఁ గూడియున్ననున్
దట్టపునెయ్యురంతయునుదారతసోదరభావమూన నె
వ్వట్టునఁబట్టియుండి భయభక్తులఁబోషణ సేసికామరా
డ్పట్టపురీశ్వరత్వమును బన్నెడునన్నలు లేకయేటికిన్. 82

చ॥ అమితయుగాంతపావక సమావృతుఁడైనను ఘోరకానన
శ్రమజలరాశిలో మునిఁగిసంచలుఁడైనను మంచవాటికా
గమనవమల్లికాకుసుమగంధమరుచ్చలితోరుహారుసం
గముఁడయిన న్సుఖంబొనఁగుఁగామినిశీతతరోక్తులాడినన్. 83

ఉ॥ గ్రావగుహాకుటీరములఁగాపురమున్నను సింధువీధికా
జీవనుఁడైనఁ బట్టణపుసీమలనుండిన భర్మహర్మ్యపుం
ద్రోవలనున్న సౌధములఁదూఁగినఁదొయ్యలితోడఁగూడినన్
భూవలయంబునందు దివిఁబోలెవెలుంగుఁ గుటుంబమెంతయున్. 84

చ॥ మనములుగొల్లవోయిననుమానవదుర్లభమైన వేడుకన్
గనుఁగొననొండొరుంగదియఁగాదె ముదంబుకరంబువర్ధిలున్
జనపతులెట్లులోకమున జాయలులేకవసింత్రు భార్య స
ద్గుణగణగణ్యయైనసుకృతుల్వెనఁగూర్చునటంచునెంచుచో. 85

మ॥ అమరేశుండు వివాహవై భవపరై కాయత్తచిత్తానువ
ర్తిమహీనాథుని( జూచియేలయిత(డీదివ్యాప్సరోన్నృత్తగీ
తములన్ జేతమునిల్పి కొండువలనన్ దర్కించుచున్నా(డు ప
ద్మముఖీసక్తమనోమదాళియయి ఖేదంబొంద( బోలున్గడున్. 86

వ॥ అని యించుక చింతించి యఖండ మహీమండలాధినాధున కాఖండ
లుండిట్లనియె. 87

శా॥ ఓ భూచక్రవసంత వంతవిడుమా యుల్లాసముంజెందుమా
నీభావించిన సర్వలక్షణగుణస్త్రీమంతినిన్బ్రహ్మ ము
న్నే భూమండలమందు సృష్టినలిపె న్నిత్యానుమోదంబుతో
నీభద్రవ్రతసూత్రమంగళమునన్నిండారు(గంఠస్థలుల్. 88

మ॥ వినుతూర్ణంబవివాహమయ్యెడి మహోర్వీపాలకా దీనితో
ననుసంధించు చరిత్రయొండుగల దీవాలింపుచో( జెప్పెదన్
మునులోకేశునిలోకమందత(డు నేముంగొందఱానందమై
ఘనసంసద్భవనాంతరంబుననటుల్గానంబు సాగింప(గన్. 89

గీ॥ వివిధవిద్యా వినోదముల్వినుచునుండ
సారసాహిత్య సంగీతసరసములను
సరససురవారకామిను లరుణతరుణ
చరణచారణ చారణల్చెరసి నిలువ. 90

శా॥ వీణానిక్వణనైక మోహనమురావించెన్విధూమాఖ్యనిన్
వేణిగ్రంధిచలింపనాడ యువతి వ్రీడాయుగక్షిప్రభా
శ్రేణుల్దోపనలంబుషాప్సరన(గాంచెన్గాంచికాలంకృతన్
బాణుల్వ్రాల్లకిన్నృత్తమాడు తటి(బై పైపై(ట మైజార(గన్. 91

చ॥ వసుపువిధూము(డచ్చెలువవాలిక చూపులగెల్వనోయనన్
ముసిముసినవ్వునవ్వె( జెలిముంగలిచెంగులుచూచుచుండెనో
యసమశరాఖ్య! స్రష్టసభయన్న భయంబునునానలేక వె
క్కసముగ(దోడుపాటులొన(గన్దొరకొంటివి నీవు(బాడియే? 92

చ॥ కొసరిన ప్రేముడిన్దగిలికొంకక యచ్చరనిట్టి చూడ్కులన్
మసలకగన్గొనున్బయిసిమాలినవేశ్యలు ద్రవ్యకాంక్షఁజూ
పౌనఁగరె? యెల్లవారికినయోన్నతసభ్యసుధీపతివ్రతా
పిసరజనార్దనాభవనివేశముఖంబులసైన భూవరా. 93

ఉ॥ అక్కమలాసనుండు విషయస్పృహలెల్లను జిత్తగించి నా
చక్కిమొగంబుద్రిప్పి, నగి చండతరంబున, వక్త్రమూచి వే
పక్కనవారిఁదిట్టె భయభక్తులులే కొనరించుకర్జముల్
చిక్కె జనింపుఁడీభువిని లీలలదోగుఁడు దుఃఖచిత్తులై. 94

మ॥ అని శాపాహతిఁ గామరాజ్యమునుబాయంజేయ వారిద్దరున్
మనము ల్ఘిల్లనరత్నపుంబ్రతిమలౌమాడ్కింజలత్వంబుమా
ని నిజోత్సాహముదక్కి వ్రక్కలయిగానీచూతమంచబ్జజ
న్మనితో గద్గదశబ్దసంతతులవ్యామోహంబు పెల్లారఁగన్. 95

ఉ॥ వసువనునో కళాధిప యవద్యచరిత్రుఁడ నింతమాత్రకే
కసరఁగనేల నేలఁగల కాలము దుఃఖములెట్టులోర్తు బా
నిననయి పావదేవతకునీరములిత్తునె? మాయెడన్కృపా
రసమొలికింపరాదెయన రాజయి భూవలయంబునంతయున్. 96

ఉ॥ ఏలుచుఁద్యాగభోగములనేకట ప్రేళ్ళిడగానలంబుషా
పాలనసేయుచున్సుతులబౌత్రులగాంచుచు సత్యవృద్ధిమైఁ
జాలినయాయువున్బలము సంపదయు న్జయమున్వహించి వి
ద్యాలలనావిభూషణుఁడవై క్షితినుండుముగొన్ని నాళ్లకున్. 97

క॥ అని పునరుద్భూతకృపన్
వనజదళాననుఁడు నుడువ వడవడవడకుం
దనువునకొకింత నిలుకడ
యొనరగ నావసువుచనియె యుమ్మలమడరన్. 98

చ॥ సవనధరిత్రియందు పరిషద్భవనంబుల వేదమాతృకా
భువనములందు సంయముల పుణ్యవనంబుల దేవవాటికా
వ్యవధుల శాస్త్రచింతనసమన్విత శిష్యకుటీరశాలలన్
దవిలివిటీ భుజంగులకు దర్పకశాస్త్ర పరీక్షగూడునే? 99

శా॥ ఆగాటంపుఁ గలంకనిచ్చరయమర్త్యాలబ్ధ దుఃఖంబుమై
రాగాలాప నిరూఢమేదికలిపారావారమెబ్బంగినే
నాగంజాలుదునంచునెంచుతఱి మాయా మోహసుప్తాంగియై
వేగంబుర్విజనించె కోసలమహోర్వీజానికింగూతురై. 100

ఉ॥ ఆపటుశాపబాణనివహంబులుదాకినఁ బొక్కిభూమిభూ
మీపకులాంబురాశినెలమిన్ననియించె విధూముఁడీ వయో
ధ్యాపురిపాలకాన్వయ సరోంబుజయయ్యెఁబురందరాదిసం
ప్రాపితభోగభాగ్యవతి బాలమృగావతినా వెలుంగుచున్. 101

గీ॥ అనుడు తేనికి ననురాగమతిశయించి
మోసలెత్తంగ గుణరూపవాసవంశ
పావనత్వంబులడుగనద్దేవవిభుని
నడరునిబ్బితి నిపుడు నోరాడకుండె. 102

శా॥ ఆలీలన్నదిఁదానెఱింగి యమరోద్యానంబు ప్రాగ్భాగమం
దేలావల్లికలల్లుపందిరులస్వచ్ఛేందూపల శ్రేణికన్
బాలాశాపచరిత్రముల్నుడువుచుం బద్మాసనాసీనుఁడై
హేళింగూడి పురందరుండిటుల నెయ్యంబూదఁ బల్కుందగన్. 103

ఉ॥ ఆకృతవర్మ భర్మనిలయంబు లవంతిపురంబుగూర్చిచం
ద్రాకృతిరత్నదీపికలనయ్యెడ వేచిసదావధూటిర
క్షాకృతినించిపుణ్యరమచాడ్పున బెంచుచునున్నవాఁడుశా
రీకలకంఠకోకిల పరిస్ఫుటనాదకపోతపాళులన్. 104

శా॥ ఆరాజేంద్రుఁడు సత్యవర్ధనుఁడు విద్యానాధరక్షాయశః
పారావారుఁడు దానకర్ణుఁడు కలాపారంగుఁడుగ్రద్విష
చ్ఛ్రీరాముండు గుణాష్టకప్రకటపారీణుండు నౌదార్యఁడా
వీరుండెన్నఁడు పాండవాన్వయముతో వియ్యంబువీక్షించెడున్. 105

శా॥ ఆబాలామణి రూపనన్యమగు సామాన్యంబులావణ్యలీ
లాబాధంబునముంచెఁ బద్మజుఁడు లోలచ్ఛంచలన్నోభలుస్వ
శ్శాబశ్రేణికలాకె సద్గుణములన్సంగీత సాహిత్యవి
ద్యాబంధంబునఁ గూర్చి వీణియలనాదాలింతురేవేళలన్. 106

గీ॥ అనుచువర్ణింపఁ జంద్రోదయంబుతఱినిఁ
బల్లవాగ్రంబు మునిగోటగిల్లుచుండు
నల్లవల్లభుఁడల్లనఁ దెల్లవోయె
సాంద్రచంద్రికాతుహినవర్షములుగురియ. 107

చ॥ అలయకయమ్మలంబుకడునాసలుమాసినమోముఁ దోపఁగాఁ
బొలచువనాంతవీధులకుఁ బోయివిరాళినిగుంద నేటికిన్
వెలువడివీడుసేరి పలవించెదగాకని పాకశాసనున్
గలసిపురంబుడాసి సురనాయకుకోటకవాటమార్గమున్. 108

చ॥ కడచుచుభర్మహర్మ్యతతి గాంచనగోపురసంచయంబుకీ
లెడపినజంత్రగాత్రములు నింద్రమణీరమణీయమైనద
ద్దడములు గొత్తడంబులు బతాకలబొల్పెసలారునోవరుల్
వొడగని నాటియామవతి బోనముమెక్కి వరుండెనంతటన్. 109

శా॥ ప్రత్యూషంబున వందిమాగధులస్తోత్రగ్రంథభూపాళరా
గాత్యుత్సాహము వీనులారవిని శయ్యామందిరం బేది తా
నిత్యప్రోక్తసుకృత్యముల్సలిపి వేసీరాడి గాయత్రికై
సత్సార్ఘ్యంబిడి దేవతాగృహముననస్సంధించె జేజేదొరన్. 110

శా॥ మందాకిన్యభిరామతోయముల హేమస్థాళికంగూర్పఁగా
మందారద్రుమ పుష్పదామముల సోమస్కంధమూర్తీశ్వరున్
ఛందః ప్రక్రియబూజసేయుచు ముహుస్సాహస్రనామావళిన్
మందాలాపితమంత్రపుష్పములఁ బ్రేమంబెట్టిదైవంబుపై. 111

ఆ॥వె॥ దేవగృహము వెడలి దివ్యాన్నభోజనం
బారగించియిరుగు రమరులెల్ల
మొనసియుండు భవనమును జేరనింద్రుండు
తగినకానికలనుదానొసంగె. 112

సీ॥ ప్రసరించెనొకవంకఁ బటహభేరీడిండి
మాదివాద్యధ్వానమోదనములు
తలచూపెనొక చక్కిఁదరుణీమణీవేణి
కాకుట్మలితకైతకప్రతతులు

పొడచూపెనొకచాయముగ్ధాంగనామనః
పీఠీస్థిరాకృతాభిలషనములు
తెలివొందె నొకచెంత దేవతాబాలికా
హల్లీసకాదికేళ్యంగణములు
వెలసెనొకదెస నైదువుల్వలయమెనసి
కూడియాడెడు గాటంపుఁ గూడిగములు
మదనమోహన దేవతల్మ్రొక్కియొక దెస
నదనఁబదనిట్చిరంబుజాద్యస్త్రములకు. 113

ఆ॥వె॥ అమరకాంతలెల్లనాలోకకౌతుక
మనుభవించి లోకమునను లేని
యరిదివస్తులిచ్చియానంద మొందఁగ
వారువారునదుపహారములిడ.

చ॥ ఒకయెలనాగ మేఘములనుద్భవమొందిన మౌక్తికాళిమా
లికలనమర్చినిగ్గులు చలింప "మృగావతికింద మీకళా
చిక" ననఁడుమైయదరఁ జెంగుననల్లెనలోలిఁ జూచినె
మ్మొకమరవాంచెనాననటమున్నతఁదేమిదలంచుచుండెనో! 115

ఉ॥ వేలుపులేమయొక్క రుతువీణియమున్నిడి "భూప, సూర్యజా
వేలఫణీంద్రకన్యకల వీనులమోహమునించిజాయతో
లీలలఁదేలు మెత్తఱినిలింపతతంబొనగూడు" నన్నభూ
పాలుఁడువాతెఱన్నగు నెపంబున మోముముడించెఁ గొంకుచున్. 116

వ॥ శిశుక్రీడోపకరణంబులఁ గొన్ని రాజుముందునిచి. 117

ఉ॥ చేతులఁ జేయిఁగూర్చికొని చిన్నలు చిన్నియనుంగుమాటలన్
"గూఁతులకిచ్చెదే? పసిడికుండల నీరతనంపుబొమ్మలీ
పూఁతమెఱుంగుదివ్వియలభూవర, యచ్చనగండ్ల" నన్నతేఁ
డాతరితీపిపల్కువిని యక్కజమందెఁదదూహకెంతయున్. 118

చ॥ అరదముసిద్ధమయ్యెనమరాధిపుఁ డెన్నికకెక్కరానికి
న్నెరులఁబనిండి పేటికల నిర్మలమౌక్తిక చిత్రవస్తువుల్

నరపతికిచ్చె భూవిభుఁడనంటులఁ బొల్పెసలారుతేరినె
క్కరహివహిఁ చెజిష్ణునకుఁ గందువ సూపెను బోయివత్తునాన్. 119

చ॥ తనిమఁగదల్చెమాతలిరథంబు విరుల్పయినుండి రాలెన
య్యనిమిషకాంతలాన్నృపునయంబెడబాయ సహింపకుప్పరం
బునకు విహంగిచక్కిలముమ్రుచ్చిలిపోయిన నిల్చుబొట్టెభం
గిననిలుచుండిరంగజుఁడు కేరఁగభూపతి వెంటనంటఁగన్. 120

ఆ॥వె॥ తేరొకింతదవ్వుతిరుగదేవాంగనల్
విభునిసోయగంబువేయునోళ్లఁ
బొగడిమఱలఁ దలిరునగవులనోలాడఁ
గలుగునొక్కొయనుచుఁ గలఁగిచనిరి. 121

గీ॥ ఉమ్మలమువాపుఁ బ్రేముడినెమ్మిఁజూపు
సిలుఁగు బెడబాపుమగనికోర్కులనుదీర్చు
నెడఁదఁగారుణ్యలతఁ జేర్చుబెడఁగువడయు
బంధుమిత్రుల రక్షించు భార్యచూవె. 122

వ॥ అనుచు. 123

శా॥ కాళింద్యంతవిహారదంపతులుగంగాతీరయోషిద్వటా
శీలీలల్నవమల్లికార్పితనెపాశీమన్నధున్ స్వర్గవీ
ధీలాలిత్యమునందనోత్సుకతప్రోదిన్ జూచిచిత్తంబునన్
జాలన్ గుందువిరాళినవ్వునొఱలున్ శంకించుభాషించుచున్. 124

సీ॥ మరుతమ్మి యమ్మునామగువజగ్గులనిగ్గు
నగ్గింపవెగ్గలంబాడియాడి
యినుమున్నసభినయంబొనగూర్చియడుగుల
ఘల్లుఘల్లనన్నృత్తకలనఁజూపి
మొగముతోనమొగంబుముద్దాడిబెడఁగైవ
వెడఁదపేరొడలితోవియ్యమంది
యొత్తికుత్తుకనిక్కియోరమోమిడినవ్వి
వలచికన్నీ రాడిమలఁచి పెనచి

గలపుఁదలఁపుల నెలకొల్పివలనఁబోవు
నౌరః తియ్యనివిలుకానియమ్ముఁగాదె
వేడివేలుపునలయించి వెడగుసేయ
మృదులమానసుఁడేమాత్రుఁడెట్టివాఁడు? 125

వ॥ ఇట్లు మృగావతీసమాగమాయత్తచిత్తుండై దేవరథంబున వచ్చుచుండ మార్గమున. 126

సీ॥ లోధ్రరజోగల్లలురదంశమాలికల్
దురదృష్టదేవికిఁ దోరణలుగ
వదలట్లతలరుయౌవనకేకరాగ్రవీ
క్షణములంతఃకోపకలనగఱవ
సితవస్త్రసంధానగతికాలభైరవ
దరహాసకాశమంజరులుగాఁగ
నెఱపుమైమ్రోఁగుదండియమనోభవశస్త్ర
దేవతాకంఖాణభావమెనయ
ప్రౌఢశృంగార నాయికాపదవిబొరసి
తనువుదాల్చిన భువనమోహనమనంగఁ
దగుతిలోత్తమవరదేవతావిమాన
మందుదివికేగుచుండె నీయవనినుండి. 127

క॥ పఱతెంచునృపునిఁగనుఁగొని
యొఱపుమెయిన్ మేసవర్చియుగ్మలికడఁకన్
పెఱఁడనుమలికితమెడలిచి
మఱుఁగులునిల్పకయ యిట్లుమాటాడెన్నృపున్. 128

మ॥ క్షణమాత్రంబురథంబునిల్పివినుమీషల్లీన చిత్తంబుమై
ప్రణతుల్సేయుదు భావిశోభనపదగ్రంథంబుబాలామణీ
గణనాతీతచరిత్ర చిత్రమునుదత్కామవ్యథల్బూవరా
గ్రణిమూర్తీకృతరామణీయకయనంగా వ్యోమమంటావథిన్. 129

క॥ మదపోన్మాదజ్వరగతి
విదళితచేతోవికాసవిగతధృతికి శ్రో

త్రదళంబులకెక్కనె మృదు
పదమధురసుధారసంబుపరిణతతలఁపన్. 130

వ॥ అమ్మహీకాంతుఁ డాపల్కుల వినకపోవుచుండఁదిలో త్తమ. 131

శా॥ భ్రూవల్లిన్దిగఁజిమ్మ నొక్కుఁ బెదవిన్ రోషారుణప్రేక్షయై
నావాక్కంబుధివైచుచక్కెరలచందంబయ్యె గర్వోగ్రరుం
ఝూవాతాహతబుద్ధిదీప్తుఁడగు నీసర్వంసహాభర్తయే
లావందారుజనాళిలక్ష్యమిడు సంచత్యంతకోపంబునన్. 132

క॥ ననునేమనిదలఁచితినీ
కొనియాటకుఁదగిన కౌశికునిచేవెట్టిం
బనిగొందుధరణివేశ్యల
యెనికబటాబూరమేమియేర్చితినాలోన్. 133

ఉ॥ గర్వతమః ప్రచారకలికాలజకిల్బిషచిత్తవర్తిన
ర్వోర్వినిభృద్వ్రధావినుత యోన్నృప యెవ్వతెఁగోరెదానతిన్
దుర్వహవిప్రయోగమునఁ గ్రోధిచరింపుచతుర్దశాబ్దముల్
నిర్వహణంబొనర్పుమని నిక్కశపించెవివేకహీనతన్. 134

శా॥ "ఓసీ! శాంబరి! శాపదేవత! కటా! యోగీంద్రులన్నీదుబా
హాసంశ్లేషత, మాన్పెదే! జపతపోవ్యాహ్లాదమున్, దంపతుల్
నీసంయోగముచేవియోగగతిగ్లానింజెందిదుఃఖింపఁగా
నేసంతోషమునిన్నుముట్టు శిలవే? యిందేలజుట్టాడదే? 135

చ॥ అటులశపించియాచెలువయాఱడి వోవునమర్త్యతత్వమే
మిటికని వాదులాడుచుశమింపనికోపముతోడఁజొచ్చె వే
ల్పుటిరవు శాపవాక్యములు భూపతివీనులకెక్కలేదు ముం
దటఁబడిపోవు మాతలివినంగనలందురెనిట్టినేఁతకున్. 136

క॥ దైవమొనరించుకర్జము
లేవిధిదప్పంగఁ దగునహీనతపస్సం
భావితునకైనమానుష
సేవితతుచ్ఛప్రయత్న చిన్నిధికైనన్. 137

చ॥ పదపడివాయువేగమునఁ బాఱుమహేంద్రరథంబుసూర్యజా
నదినికటోర్విభాగములనాటిన గ్రిందట జూచిమన్మథ
ప్రదరములందవించునరపాలుఁడు వీడుసమీపమయ్యెన
య్యదివెరవేకిపాటుతగునా యనిధీరతనుండెనత్తఱిన్. 138

మ॥ యమునాకైతవవేణిదన్నికటభాగారామముల్కేతకీ
సుమపత్రంబులనల్లితోరణపురాసుల్ భూషలై యొప్పసం
భ్రమహర్షంబులుజాల్గొనన్ విభునికై పాణిద్వయంబెత్తిము
త్తెములన్దోయిటనూనివేచుగతిసంధింపన్బురశ్రీతమిన్. 139

శా॥ సాయంవేళబహిస్సరోవరములన్ బన్నీరుతేఁబోయికా
మాయత్తైకవిటీభుజంగులనుడాయంబోకవేరొక్కచో
దోయంబెత్తిమెఱుంగుబిందియలఁదోడ్తోఁ బోవునిల్లాంద్రుపూ
ర్ణశ్రీయంవించుసుమంగలీతతిబలెన్జెన్నొందిరర్ఘ్యంబుమై. 140

ఆ॥వె॥ చదలనుండిడిగ్గిజనపాలుఁడొండొక
నేపులోనఁబురసమీపమొంద
నలరుజనులు ప్రెగ్గడలుతోడనడువగ
నగరుచొచ్చి ప్రీణనంబొనర్చె. 141

చ॥ సహచరమంత్రివర్గములు స్వర్గజయోత్సవరీతివేడఁగా
మహిపతియంతయున్ నుడివి మన్ననగొన్న తెఱంగుచెప్పి ప్ర
త్యహముడివోని ప్రేముడిసురాంగనలిచ్చిన చిత్రవస్తువుల్
ముహురనుబద్ధవీక్షలవిమోహముదెల్పెసురేంద్రుకూరుముల్. 142

క॥ నందనవనమందానిల
బృందారకవిహరణములు పేర్కొని యమరీ
బృందములవివిధహేలా
నందములెఱిఁగించెమదివెనంగొననాసల్. 143

వ॥ వారల వారివారి గీముకలనిపి తన యథోచితకృత్యంబులసలిపి యారాత్రి సౌధోపరి భాగంబునఁ జంద్రకాంతశిలామయంబైన తనశయ్యాగృహంబు సేరి వాతాయనసమీపంబున నిర్మింపఁబడిన హంసతూలికాతల్పంబున నత్తమిల్లి యనేకవిధమ్ములఁజింతించుచు. 143

సీ॥ పాఱుటొజ్జలఁబుచ్చిపడతి కేలూతకె
ట్లడిగింతునానాపుడమి ఱేని
బుయిలోడకే ద్రేఁబోలఁతిఁ గూర్చుటకిచ్చ
పడునొతామునుమున్నవలుకఁడొక్కొ
వలుకనేమాయెనుమ్మలికంబువోనె యి
ల్లాలేమివినమెంచిపాలువడునొ
నెలఁతయానుడువులవలనువీనులఁబెట్ట
కంజలిఁజిట్టుముట్టాడునొక్కొ
కలసియువియన్నిదైవసంఘటనఁ జేసి
విధివిపాకంబుదలకొనవెట్టిగాదె
యనుచు దుఃఖించియాత్మలోనాడునిటులు
దర్కావేశశాసితధైర్యుఁడగుచు. 145

మ॥ భువిలోమానుషజన్మమెత్తుటసుఖాంభోరాశిలోఁదేలి ధ
ర్మవిధంబుల్చెయివట్టి సద్గుణములంరంజిల్లునిల్లాలితో
డ వివాహంబుఘటించి రాజయినరాష్ట్రంబుల్సుఖంబుంచి ని
త్యవినోదంబులఁ బ్రొద్దుపుచ్చిపరమందాసక్తినుండన్‌గదా. 146

మ॥ శతమన్యుండుమృగావతీగుణములన్ స్వర్బాలికల్వల్లకీ
శ్రుతిగీతంబులగూర్చి పాడుదురనెన్ శ్రోత్రప్రియంబయ్యెఁద
త్పితృవర్యుండభిజాత్యుఁడంచునుడివెన్ బ్రీత్యంబుపానంబుచే
సితి జాయానుగుణంబులేసుఖతరుశ్రీదోపదే య్యెయడన్. 147

సీ॥ ముక్కంటికైవడినొక్క మైధరియించి
తలపూవువెన్నెలల్తరలుచోట
మిన్కుటొజ్జతెఱంగుమిహిజిహ్వమనికిచ్చి
వెలఁదిరాయంచలు మెలఁగుచోట
బక్కడాత్వేలుపుఫక్కినక్కనఁ జేర్చి
మున్నిటిమీగడల్మాగుచోటఁ
వలరాజు మాడ్కి చెయ్యువ్వలఁదోడుపాటిచ్చి
కొదమచిల్కలగముల్ గూయుచోట

దూగుటుయ్యేలలూగితోడ్తోనఁబూపు
దేనియలసోనదోగిపూదెప్పలీది
తమినివెన్నెలపుల్గులుగుమియువేళ
చెలువతోఁగామవేళలఁజెలఁగుటెపుడు. 148

వ॥ అనుచు నిట్లంతర్గతంబునఁ జింతించుచుండి. 149

ఉ॥ సోరణగండ్లమార్గమునఁజొచ్చినవెన్నెలమేనిపైఁబడన్
సైరణవూని మైవికృతిచందముగన్గొననుంచునద్దమం
దారజనీశ్వరప్రతిమయారసిచూచితె యెంతచొక్కమౌ
సారముచెప్పితీరునెవెసన్ బరికించినగాక నెచ్చెలుల్. 150

వ॥ అని.

చ॥ అలమటయొంటిపాటొలయనచ్చెరువున్ గతనిద్రయున్మన
స్థలనవహించిబాలకులకాలమెకాలమటంచునెజ్జపై
వలపలిపజ్జనేరినిడువాలికచూపులఁబండు వెన్నెలల్
బొలయునజాండగేహమునభోంగణనిర్మలనీలకాంతులన్. 151

చ॥ వెతకుచునక్షిగోళములవేడిజలంబిడిహంసతూలికా
కృతనవతల్పమేదికిటికెన్ బురివీధులఁ జూచితృప్తిలే
క తొడగియంగి పవ్వలువగట్టి శిరోగృహమందిమిద్దెపై
నతఁడొకచందనాగరచితాసనమందుపవిష్టుఁడై తగన్. 152

వ॥ నల్గడలంబరికించి. 153

సీ॥ సౌధోపరిప్రదేశములఁ బిండారఁబో
సినచంద్రికలఁ జూడ సెగలడంగు
నతిదూరవిగమరాడధ్వమ్మచ్ఛోణంబు
తత్థ్సలిన్యూనవార్తాప్రసంగ
మతివేలకాంతిశుద్ధాంతదీపాంకుర
చ్ఛాయలుర్వీమహోచ్ఛప్రచార
విహగకోకోనాదవికృతులత్యద్భుతా
క్రాంతశబ్దబ్రహ్మగరిమకంటె

తనిమఁబచ్చమెఱుంగు కేదారభూమి
సూర్యజానీరబింబితసోమబింబ
శోభచూచితెయనుచువసుంధరాధి
నాధుఁడాశాష్టకాలోకనంబొనర్చి. 155

వ॥ అతినిర్మలంబైన వ్యోమభాగముపై దృష్టినిగిడ్చి. 156

గీ॥ ధాతసురవర్త్మవలయవితానమమరఁ
గట్టిపొంపిరివోవునక్షత్రపాద
రసపుగుండ్లటఁ గూర్చిచంద్రమునిదీపి
వెట్టియెవ్వానిపెండ్లిగావించునెఱుఁగ. 157

వ॥ అనిమఱియు. 158

మ॥ అజుడెబ్భంగిసృజించెనో తెలియరాదాకాశసీమల్ జగ
ద్ద్వజముల్ తారలుపగ్రహంబులు గ్రహవ్రాతంబులొక్కండునై
ద్విజరాజచ్ఛపుజ్యోత్స్నమైవడివడిన్ దేలాడుచున్నాఁడు స
ర్వజనుల్ నిద్రఁజరింపఁగావరులుభార్యల్ గూడియానందులై. 159

గీ॥ తనిమవెల్లమొయిళ్లచంద్రునిపయిపయిఁ
బ్రాకుచుండుటదలఁపచంద్రముఁడెవడిని
గడచుచున్నాఁడుకై వడిగానుపించు
నిట్టితఱిజాయతో నున్నవెట్టులుండు 160

గీ॥ అనుచుదృష్టులమరలించియచొటువాని
పొగలిగృహమేధిసుఖతకై పోయిగృహము
చాలసేపుండితనదుమంచమునఁబండె
బండిననునిద్రరాదయ్యెఁబార్థివునకు. 161

వ॥ అంతఁగొంతసేపటికి నిద్రించి యొకప్రొద్దువేళమేల్కొని గృహంబు
వెలువడి బహిఃప్రదేశమునకేతెంచి గగనతలంబున దృష్టినిగిడ్చి యిట్లను
నిప్పుడు. 162

క॥ ఉడుదీపకళలుతఱిగెన్
బడలెగళాధిపుఁడునాట్యభంగిజనులొడల్

తొడిమఁజిరి వడిఁబాంచా
లుఁడుపద్మినిచొచ్చువేళలోలాసక్తిన్. 163

వ॥ అని ప్రత్యూషవాయువుల శిశిరత్వసుఖంబునిరూపించి. 164

క॥ ఈగాడ్పుచల్లనయ్యున్
వేగుటవెమ్మెదసుదీనవిమలజలంబున్
గ్రాఁగిననూనియతాఁకఁగ
వేఁగుగదప్తమగుమాడ్కి ప్రియతమలేమిన్. 165

వ॥ అని యనేకవిధమ్ముల ససుగుణ కన్యాపరిణయోపాయంబు చింతించుచు నరుణోదయపర్యంతము ప్రొద్దుపుచ్చి సూర్యోదయముకాఁగా కర్మసాక్షికి నమస్కరించి నిత్యకృత్యంబుల సలుపబోయెను. అట్లుసలిపి మంత్రి పురోహిత ప్రముఖుల రావించి కొందఱు బ్రాహ్మణులఁ గన్యనడుగఁబంపె. 166

క॥ అనికాణభూతివల్కిన
విని విద్యాదయితుఁడడిగెవెనుకటివృత్తాం
తనిరూఢియానతిమ్మని
వినయమునాదరముబ్రోదివెట్టఁగనచటన్. 167

ఇది శ్రీరామకృష్ణకవి ప్రణీతంబైన
మృగావతియందుఁ బ్రథమాశ్వాసము.

[వైజయింతిలో ప్రథమ ముద్రణము-1890]

శ్రీసరస్వత్యైనమః

# కళింగసేన-ప్రథమాంకము

నాంది.

జగతీరంగమునందు మాయ యను యోషం జాల లావణ్య మా
రఁగ సృష్టించి పిపీలికాది విధిపర్యంతంబు మోహాబ్ధి ముం
పఁగఁ దేల్పంగ సమర్థమై వెలయు నేబ్రహ్మైకతేజంబు త
త్త్రిగుణానందము నాశ్రయింతుఁ గలిపాపధ్వంసనోత్సాహినై.

సూత్రధారుఁడు—(నాంద్యంతమునఁ బ్రవేశించి) ఓసీ! నటీ, నైపథ్యరచన యయ్యెనేని కొంచెమిటురమ్మ.

నటి—(ప్రవేశించి) ఏమియాజ్ఞ?

సూ—శా॥ ఈరంగంబు జగత్త్రియం బిదియ బ్రహ్మేంద్రాదిదిక్పాలక
స్వైరక్రీడము నాగలోకధరణీవాస్తవ్యనానాగుణ
స్ఫారం బిందులఁ జిత్తవృత్తులమరున్ సత్యప్రవర్తంబులై
జారుల్ చోరులు శిక్షవొంద విరహుల్ సంధింపఁగా గ్రమ్మఱన్.

క॥ ఇది చిత్తరువులకూటం
బిది బొమ్మలకొలువు దీన నెవ్వరి కెయ్యే
పదిలములు దోఁచు నన్నిటి
కిది యద్దపుబింబ మయ్యె నిందునిభాస్యా.

కావున నీదిన ముత్కృష్టమైన నాటకమును బ్రదర్శింపవలయు.

నటి—నేఁటికాలమున నెన్నియో నూతన రూపకములున్నవి దేనినిగైకొందము?

సూ—ఈసభ విద్వాంసులతోఁ గూడినది. వీరు కావ్యాలంకరణజ్ఞులు, పూర్వ రాజచరిత్రదర్శనోత్సుకులు కావున నీదినము రామకృష్ణకవి ప్రణీతంబైన కళింగసేనయను ప్రకరణంబు ప్రయోగించి చూపుదము.

నటి—క॥ కవు లెట్టివారలైనను
భువిజనములు మున్నువిన్న పురుషుల కవితల్
జవిఁబడి దర్శింతురు నవ
నవరసకావ్యంబునైన నడకింతు రిలన్.

కాఁబట్టి పూర్వకవిరచితంబైన నాటకంబ్రదర్శింతము, అదియునుంగాక యక్కవి.

ఉ॥ చంచలమానసుండు నెఱజవ్వనమింతకురాదు వర్ణనీ
యాంచితకావ్యరత్నముల నార్యులు మెచ్చఁగ వ్రాయఁ డంగనా
పంచశరుండు గాఁ డమరభాషయు నేరువఁ డొజ్జలేక యే
తెంచిన విద్యవో కలుపుతీయని పైరని యెంచ వెంతయున్.

సూ—ఐననేమి! యుదారచిత్తులకు లోకగుణవర్ణనమేగదా ప్రాధాన్యము ! ఇప్పుడు; ఆ॥ దేశమెల్లనమరదివ్యప్రబంధంబు
లార్యచిత్తవృత్తులాశ్రయించె
నిదిశరన్మనోజ్ఞఋతువిందుపాడుము
గీతి సభనొనర్పకీలుబొమ్మ.

నటి—సమరమన్న నాదేహము వడఁకెత్తుచున్నది. అయ్యో ! పూర్వము రాజపుత్రస్థానమున మ్లేచ్ఛులవలని భంగంబు లోర్వజాలక వీరపత్నుల నగ్నిప్రవేశంబు సేయించి దేశమునకై రణరంగములయం దత్యుదారులైన యారసపుత్రులు దేహములు త్యజించిరిగదా.

సూ—ఓ వెఱ్ఱి!ఏలవడఁకెదవు? అవియెల్ల కథలుగాక యింక రానేర్చునా? ధార్మికమైన యీ కాలమున నట్టివీరులకుఁగాని యావీరపత్నులకుఁగాని యట్టిసాహసకృత్యములకుఁగాని యవసరంబులేదు. ఏలనిష్కారణముగాఁ గంపించెదు.

నటి—అహో, అట్లుమృతిఁబొందిన యాపుణ్యభాగినుల బిడ్డలఁగారుణ్యముతో జూచువారెవరు?

సూ—ఓసీ, ఉత్సాహపూరితమగు నామనస్సు నీచేసిన పూర్వచరిత్రవర్ణనా క్లేశముచే శరత్కాలపునదీజలంబువోలె నింకిపోయెను.

నటి—గీ॥ వీరపురుషులచరితంబువినియుఁగనియు
గట్టిచిత్తంబుగలకోలుగానివాఁడు
దేశమునుదన్నుందనవారిధిక్కరించి
పరమునెడసేసిరిత్తకుబ్రతుకువాఁడు.

(నిష్క్రమణము.)

ప్రస్తావన.

శ్రీసరస్వత్యైనమః

# కళింగసేన-ప్రథమాంకము

(నదీతీరోద్యానవనము-సాయంకాలము)

(కళింగసేనయుఁ బాటలియుఁ బ్రవేశించుట)

పాట—నెచ్చెలీ! చూడుము. నెలనాఁడీనది సుళ్ళేమి, నురుపులేమి, అలలేమి, భయంకర రూపముతో దిక్కులుపగల్చు సింహనాదముతో ముల్లోకముల ముంచి వైచునట్లు ప్రవహించి నేఁడు నడుమంతరపుసిరిజాఱినగర్వాంధుని వలె స్వస్వరూపముతోఁ గ్రాఁగి చల్లాఱినపాలవలెనున్నది. అప్పుడు తన్నుఁదాఁదెలియక తనదారిఁబడినవారిఁ దన్నాశ్రయించినవారిఁ దన్ను కొనిపోవుచుఁ గ్రొత్తగావరముగన్న రాక్షసి శరమహిమ పరీక్షించునట్లు దనశరమహిమచే జనపదములఁ బాడర్చుచు నుద్ఘోషముతో సముద్రుని జేరినది. నేఁడు శాంతివహించి యాశ్రితులయెడఁజల్లదనముఁ జూపి శర దిందిరకుఁ గంఠభూషయై నిర్మలాకృతియగు నాకాశలక్ష్మికి మణిదర్ప ణంబై త్రిభువన నయనాభిరామయగు నీసంధ్యాదేవికి నమృతదీర్ఘికయై యీయుద్యానవనదేవతకు రత్నమేఖలయై ద్రవీభూతశుద్ధస్ఫటికాకృతితో నొప్పుచున్నది. ఈ శారదవాసరములందె-

క॥ మదనాగ్నియుఁ గదనాగ్నియు
నెదిగినదావాగ్నివోలె నెరియించుఁ జుమీ
మదవతులను మదపతులను
విదితశరత్కాలమహిమవెలఁదియెఱుఁగుమా.

కళిం—చాలు నీవర్ణనా వైదుష్యము! ఈనది నిశ్శబ్దముగాఁ గదలుచున్నది. ఈయుద్యానవని మందమారుతముచే నించుకచలించుముంగురులతోఁ దపముచేయు యోగినిపలె నేకాంతముగా నీనదీతీరమునఁ గన్పట్టుచున్నది. ఈవనలక్ష్మియొక్క క్రీడాశైలముంబోలు నీగిరి, ఋతులక్ష్ములను ప్రియురాండ్ర నొక్కతఁబాసియు వేఱొక్కతె సంగతి దానిమఱచి యపూర్వవిరహోద్దీపితుండైన కాలపురుషుని చిత్రచరిత్రమును జూచి చూచి యాశ్చర్యవిషాదంబులంజేసి మ్రాన్పడి-

పాట- -ఏమి! ఇదియలంకృతిగాదా? ఈయిసుకదిన్నెపై గూర్చుండి సంధ్యా సౌభాగ్యమును జూతము.

కళ -(కూర్చుండి) అలంకృతియా! నామనస్సునకుఁ దోఁచురీతిఁ జెప్పెదను. ఈ నదియు, నుపవనమును, నీగిరియు, నీయరణ్యప్రదేశము, నదిగో దూరస్థమైన యాపర్వత శృంఖలయునేగాక యకాశలక్ష్మియు మౌనముతో నపూర్వప్రాణాయామ మొనర్చునట్లున్నది. అదిగో మనవలె దూరమున రాగాలాపమునబోలె నారోహణావరోహణక్రీడమై విహరించు నారెండుపక్షులునులేకున్న నాయాకాశమంతయు శూన్యభవనమువలె నుండును. ఓచెలీ! వేయేల, నిర్మలమైన యీ యాకాశమును సాంధ్యరాగముఁ బిదపనంధకారము నాక్రమించినట్లు శుద్ధమైన నామనస్సును మాతృరాగముఁ బిదప శోకముముంచుకొన్నది.ఓతల్లీ! నన్నుఁ గనియెత్తి నన్నేతమజీవాతువుంబోలె నమృతఘుటికయుంబోలె సంజీవనియుంబోలె నిరంతరానందజనకమంత్రాధిదేవతయుంబోలె సౌభాగ్య సిద్ధౌషధియుంబోలెఁ జిరతపః ప్రాప్తదివ్యఫలంబునుంబోలెఁ జూచినతలితండ్రులులేని నాజన్మమేల! ఆజన్మపరిపీత దుఃఖవిషాకులస్వాంతనగు నాకునీశరన్మండనంబానందకరమగునే? బహిఃప్రాణములంబోలెఁ బ్రీతివిగ్రహంబులంబోలె వాత్సల్యమూర్తులంబోలె మంగళాకృతులంబోలె దివ్యామృత ధారలంబోలెనుండు నాతలిదండ్రులును దోఁబుట్టువులునుగూడి యుండిన నీవనప్రదేశమే స్వర్గతుల్యమగును. ఈవనమే చైత్రరథమగును. ఈనదియే యమృతవాహినియగును. నేనే యానందరసమూర్తినగుదును. అట్లు లేనినాకు సుదినములును దుర్దినములై సకల లోకానందకారిణియనంబడు శరల్లక్ష్మియే మూర్తీభవించిన శోకాంధకారమువలెఁ దోఁచుచున్నది.

పాట—ఓ తల్లీ! ఏల దుఃఖపడెదవు? దేశాభిమానమునకును సత్యకీర్తులకును బాల్పడి బాతివ్రత్యభంగమునకు వెఱచి యశోమరణమునొందినవారికేల సంతాపించెదు?

కళిం- -గీ॥ ఉల్లిపూవులఁబూజించి మల్లెపూల
ఫలముగోరంగఁ జన్నెసౌభాగ్యవతికి
నిండుతొలిబామునోములుపండియుండఁ
జనదెసంసారసౌఖ్యకాసారవిహృతి.

పాట—ఏల! వందురకు. విధివిలాసమునకేమిచేయుదము? అమ్మా, అపకీర్తి మలీమసాకృతితో వేయేడులు జీవించుటకంటెఁ గీర్తిశేషమైన బ్రదుకు క్షణకాలమైనఁ జాలదా? ఈనీతిబాహ్యులగు తురుష్కరాజులచే రాజ్యంబు తోడన మానంబు కోలువుచ్చి దుర్ణీతి కధిష్ఠాతృదేవతలంబోలు వీరికంతః పురములఁ గానుకలుగా బలిపిండములుగాఁ గ్రవ్యాన్నఖండములుగాఁ జూఱయిచ్చి దుష్కీర్తియనుమసిచే నాకాశమను పత్రమునఁగాలపురుషుఁడు చదువుటకై యేరసపుత్రుఁడు తమ చరిత్రమును వ్రాయుటకై యేసహస్ర బాహువు నారాధించును? నీతల్లిదండ్రులు చచ్చియు బ్రదికియున్నవారే. అనాథరక్షణమునకైన సత్యభంగమునకు వెఱచియైన బరాపనింద నోర్వకయైన పాతివ్రత్యభంగమునకైన మాతాపితలకొఱకైన సంస్థాప ధర్మనకొఱకైనఁ జచ్చినవారు జీవించెడువారే.

కళిం—పాపాత్మురాలనగు నేనుజన్మించుటంజేసి నాతలిదండ్రుల కిట్టియిడుమలం బడవలసె. నాజననకాల బలమెట్టిదో, యేగ్రహము లెట్లునీచత్వ మొందెనో, యేధూమకేతువుదోఁచెనో యెట్టి యుల్కాలువ్రాలెనో గాక యేసంస్కారములు లోపమయ్యెనో!

పాట—అలందురకుము. ఆసాంధ్యరాగముచూడుము. అవినీతునిచిత్తముంబోలె క్షణ క్షణము మాఱుచున్నది. ఇంచుకమున్ను మేఘశకలములు ఎఱ్ఱ ప్రత్తి చల్లివైచిన విధముననుండి నీరువడసిన నదీసైకతముల సిందూరపు మచ్చు చల్లినట్లు దోఁచి యిప్పుడు పశ్చిమాశావధూటి శుద్ధాంతకుడ్యభాగ మునకు రంగుపూసినట్లు గానఁబడుచున్నది. ఈసాంధ్యరాగము నీశోకము నపనయించును.

కళిం—ఆవైపుననె కన్నులు దెఱచియుంచియు వస్తుగోచరముగాదు; చెవులు మూసికొనకుండియు నీవు చెప్పినదివినరాదు. ఏల! సర్వేంద్రియము లేకదేశముగా స్మృతియందే నిలిచియున్నవి. ఓచెలీ నిర్భాగ్యురాలను, ఇపుడు నాతల్లియుండిన నట్టె గౌఁగలించుకొన నాజన్మ పావన మగునుగదా!

పాట—తాళుము. శోకవేగమున దేహముకంపించి పులకలెత్తుచున్నది. నీనయ నోత్పలంబుల నీరుదేరియున్నది. పుష్పకోమలమగు నీదేహము శోకాగ్నికిఁ

బాల్పుఋపనగునే? తలిదండ్రులు విడనాడిన కూఁతురవు నీవొక్క_తెవే లోకమున?

కళిం—ఓచెలీ, నాతల్లి యెట్లుమరణించెనో దానిమఱియొక మాఱు చెప్పుము. నామనస్సున కించుక నెమ్మదిగలుగునుగాక.

పాట—(ఆత్మగతముగా) అయ్యో, ఏమిచేయుదును? పరగృహవాసముచే దుఃఖాకులయగు నీమెను విహారాపదేశముచే నిటఁదెచ్చియు శోకమునకు దరిగానకున్నది.

క॥ చక్కఁబ్రదికి దారిద్ర్యము
రెక్కొనువాఁ డంగజుండు ప్రేరేచినవాఁ
డెక్కువ వంతగలాఁడును
జిక్కఁడెయొరునింటనున్న జేరిననొంటిన్.

కళిం—ఏమియాలోచించెదు? చెప్పుమాకథను.

పాట—క. చల్లార్పఁబోయిశోకము
నల్లార్చెదఁగాకనిన్ను నక్కథనుడువం
జెల్లునె గ్రాఁగెడునూనియఁ
జల్లనినీరంబుచల్లునరణినకాదే.

కళిం—కానేరదు;కానిమ్ము.

పాట—ఈయేటి కవ్వలిగట్టున నాతోఁటలోనికింబోయి యచ్చట చెప్పెదను. రమ్ము
(ఇద్దఱును లేచిపోవుచున్నారు) (తోఁటలోనికిఁ బ్రవేశించుట)

పాట—ఏమి? వెనుకకొత్తుచున్నావు? ఏల నీమేను పులకరించుచున్నది.

కళిం—(పొదరింటి ప్రక్కఁజూచుచున్నది)

పాట— ఎవ్వఁడో పురుషుఁడేకాంతముగా నిద్రించుచున్నాఁడు.

కళిం—ఇట్టి నిర్జనప్రదేశమున కీపురుషుఁడెట్లురాఁగలిగె?
(ఇద్దఱును సమీపించి మొగమువంకఁ జూచుచున్నారు.)

కళిం— ఇతఁడెవ్వఁడో దివ్యపురుషునిపలెఁ గానఁబడుచున్నాఁడు.

పాట—నిర్మానుష్యమైన యీపర్వతారణ్యప్రదేశమున నీపొదరింట నిద్రింపఁ గలిగిన యితఁడు విద్యాధరుఁడుగానుండనోవు; ఆకాశమున నింద్ర ధనుష్కాంతులుగల దివ్యాంబరములతో మెఱుపుఁ దీగెల యట్టి దివ్య

కన్యకలతో విహరించి యలసటచేతనో లేక యెవతను గనుమాయచేయ నిచట డాగురించిన గంధర్వుఁడో! అతినిర్మలములైన యీ వనములోని పూవులమెచ్చి స్వయముగా నిచటికేతెంచిన మదనుఁడో! లేక పుష్పసౌర భమునకై వచ్చిన నాగేంద్రుఁడో.

కళిం— ఓసీ-చూడుమిచ్చట నీకురువిందతీగెకుఁ దగిల్చిన యీధనుస్సును, నీతూణీరమును.

పాట— ఇది యింద్రధనుస్సువలెనే మెఱయుచున్నది.

కళిం—తేజోరాశియగు నీతనిమొగము కనులకు మిఱుమిట్లు గొలుపుచున్నది. మిక్కిలి యలఁతపడినట్లున్నది. అదిగో యీవలకుఁ బొరలుచున్నాఁడు. ధనుష్పీడనముచేఁ గాయగాఁచినట్లున్నవాయరచేతులు.

పాట— అరకాళ్ళయందు సిందూరకాంతి యగపడుచున్నది చూడు.

కళిం—ఏదేశమువాఁడో మృగయావిహారమున నీయరణ్యమార్గమున వచ్చి యుండును.

పాట—ఓకళింగసేనా-రా-పోదము (తనలో) దీనిశోకమించుక శాంతించినది. (ప్రకాశముగ) ప్రొద్దయ్యెను.

చ॥ గరుడుఁడువాఱె ధేనుగళఘంటల మ్రోఁత యడంగె మోడ్పుఁదా
మరలఁ జెలంగు భృంగికల మాఱటలై పలవించు భృంగముల్
దిరుగు సరోజవీథి విరిదేర్చెను బీర లవే కదంబముల్
కురిసెఁ బ్రసూనమంజరులఁ గూసెడు భేకము విఱ్ఱువిఱునన్.

జయసింహుడు—(లేచుచున్నాఁడు.)

కళిం—పాట—(దూరమున కొదుగుచున్నారు.)

జయ—(తనలో) ఏమి! యిది కలయా? భ్రాంతియా? నేను పండుకొన్నయు ద్యానమాయిది? (యిటునటుచూచి) అగును. ఇదిగో వేదిక; ఇదిగో నాధనువు, తూణీరము. వీరెవ్వ రీదివ్యకన్యకలు. అనిమేషులుకారుకదా!

శా॥ ముల్లోకంబులలేనిమూర్తులు జగన్మోహాకృతుల్ వైద్యుతీ!
కల్లోలంబు లదృష్ట పూర్వనుషమాకందర్పదర్పధ్వజ
వ్యల్లేఖ్యప్రతిమావతారములు పుష్పోత్క్రాంతకాంతాప్సర
స్సల్లావణ్యములైన యీతనులతల్ చక్షుఃప్రియామోదముల్.

(ప్రకాశముగ) ఓవనితారత్నములారా! మీరెవ్వరు? ఎందుండియిటకే తెంచిరి? మిమ్ముంజూడ మీతలిదండ్రులు దేవతలలోపలను గొప్పవారై యుండ వలయునని తోఁచుచున్నది? మిరొండొరుల కేమికావలయును?

మ॥ గగనోల్లేఖశిఖాసహస్రవిటపిగ్రామంబు ఘూమంబుగా
జగదుద్ఘోరవిహారవీరకలనాశార్దూలకంఠీరవీ
ఖగరాడ్జాతము శాతమై వెలయు నీ కాంతారమధ్యంబునం
బ్రగుణానందకశిందపుష్పవనముం బాలించి రెవ్వారొకో॥

పాట—ఈ కన్య రసపుత్రవీరులలో నగ్రేసరుండగు వీరసింహుండను వానికి సుశీలయను దానియందు జన్మించినది. నేనీమెదాసిని.

కళిం—దాసివా నీవు? దాదికూతురువగు నీవు నాకుఁ జెల్లెలవు గావా?

పాట— అచిరకాలమున ఢిల్లీచక్రవర్తులలో బలిష్ఠుఁడును నుత్సాహశాలియునగు నల్లాయుద్దీన్ అనువాఁడు రాజపుత్రస్థానముపై దండెత్తుట వినియుందురు గదా!

జయ—అగును, వినియున్నాను, అతఁడు దానిని జయించి పాడుసేసెను.

పాట— తత్పూర్వము వాఁడుముట్టడివైచినప్పుడు రసపుత్రవీరులంఋను జయశంక గలుగఁగా తమభార్యల నగ్నిప్రవేశంబుసేయించి తాము రణరంగమున మడిసిన విదపనేగదా మ్లేచ్ఛులాపురముగై కొన్నది! ఈమెతల్లియగు సుశీలయనట్టి పవిత్రమైన మరణముపొందఁగా నీమెతండ్రి తనపురోహితునియొద్ద నీమెనుంచి దేశాంతరమునకుఁబోయి బ్రదుకుండనిచెప్పి యతఁడు యుద్ధమునఁగీర్తిశేషుఁడై వీరస్వర్గము వొందెను. ఆయగ్ని సంవేశమునకు ముందురాత్రి జరిగిన యొక విశేషముగలదు. అది యెట్లనిన.

ఉ॥ వెన్నెల నల్దెసల్ విరిసె వేకువయో యని కాకికోకిలల్
కన్నులువిచ్చి కూసి యఱకంటఁ బరుండెడి రాత్రికన్నియన్
మిన్నను సెజ్జపైఁ గలిసి నెయ్యపుఁగిన్క మొగంబు ద్రిప్పి వ
న్నున్నటు కించిదూనవిధుఁ డొప్పునిశానతి సౌక్కువాఱఁగన్.

ఆ,వె. మొగిళు లాకసమున మొగచాటమునఁ
వాకులేనిఁ గధల వవనిజముల

నెరసి బెరసి యున్ననిశ్శబ్దమునఁ జేసి
పొలిచెఁ బ్రకృతి నిద్రపోవునట్లు.

జయ- అట్టి నిశాంతమున నేమి సంభవించెను? తరువాత.

పాట—చ॥అపుడు సుశీల, సౌధగతహారిమణిమయదివ్యదీపికా
లపనమరీచివీచికల లక్ష్యము శయ్యకు వన్నె వెట్టుని
శ్చపలపునిద్ర మేల్కని విచారవికారము తొంగలింప ద్రేఁ
కవు నడనొయ్య వెల్వడియె గర్భగృహంబు పదంబు తొట్రిలన్.

చ॥ వెలువడి కామకౌలికుఁడు వెల్లుగఁ జల్లినమచ్చుఁబోలు వె
న్నెల కరుదెంచి చూడ్కులకు నింగి శరవ్యము సేసి చిచ్చునా
కొలికి గ యామ మొక్కటియ యోపు, సుశీలత మ్లేచ్ఛనీతిబా
హ్యులదెసఁ గప్ప మిచ్చుట కహో మన మొప్పునె క్షత్రభామకున్.

క॥ ఈనిర్మలినాకాశము
బోని మనంబుకు మైలపొడమునె? విమత
క్ష్మానాధకలుషగతి వై
శ్వానరునకు నాజ్య మగుదు జగము సెలంగన్.

శా॥ ఆర్యస్తుత్యుఁడు ధర్మవర్తననయవ్యాపారపారంగతా
చార్యుం డప్రతిమానశౌర్యవిభవస్ఫారాభిరాముం డనిన్
ధైర్యస్థైర్యవిజృంభణానలనమత్ప్రత్యర్థిభూపాలుఁ డౌ
దార్యప్రాభవుఁ డైనక్షత్రరనపుత్రస్వామికిం బుట్టనో.

గీ॥ వీరుఁడై యన్యభూమీశువేరమునకుఁ
దొడరి పోరునగాక నెత్తురులు గ్రక్కుఁ
గాకగ్రక్కించుఁగాక యాకలననొఱగుఁ
గాక వెన్నిచ్చురనపుత్రఖలుఁడుగలడె.

గీ॥ అట్టి కులమునఁ బుట్టి వీరాగ్రగణ్యుఁ
జెట్టవట్టిన నా కేల చిచ్చు చేదు
విష మపథ్యంబు వానంతివెలఁదితీవె
ముండ్లఁ జేరునె లేమావిమోకవిడచి.

జయ- ఏలచేరును? ఆహా! తరువాత.

పాట-మ॥ అనుచున్ బండిన వెన్నెలల్ పరవిమక్తాలేపముంబోలు వ
ల్చని సౌధాగ్రబహిఃప్రదేశముప భాషాదేవి శ్వేతాంబుజం
బునమాడ్కిం దనరారి నల్గడల సమ్మోహాస్త్రపాతంబుచా
డ్పునఁజూడ్కుల్నిగిడించి మానసికకండూతిన్ విజృంభించున్.

మ॥అదిగో పచ్చనిపైరు వెల్వలఁగ డయ్యంబాతెఁ జంద్రీపట
చ్ఛదసంఛాదసలీల భూమిజము లోజం ముక్కు నెమ్మోము చూ
పదు మాటాడ ది వేల సర్వమును స్థబ్ధగ్రీవమై మ్లేచ్ఛభూ
భృదులం గాంచి యలందురున్ బహుతరార్తిన్నిల్వు పెన్నీరుగన్.

గీ॥ అనుచుఁ బరిపరి వందురి యా సుశీల
మాఱటయయైనమన్మధమంత్రవిద్య
యనఁగ నొప్పారి మందిరోద్యానసరసి
వెలఁది తెలినీటఁ బసపాడె విడిసి కొంత.

క॥ పాల్కడలిఁ బొడము భార్గవి
పోల్కిగ వెన్నెలలు దట్టముగఁ బూసినయా
వాల్కొలని వెడలి బీరపు
ముల్కియనన్ బడఁతి భవనముం జేరి తగన్.

గీ॥ నిలువుపెట్టెల వాసనాఫలితమైన
కొమరువెలిచీర కట్టి పోడిమికిఁ దగిన
నగలు తొడి పూసి గాంభీర్యనటనతోఁడ
నెఱఁగి నట్టింటిలక్ష్మితో నిట్లుపలుకు.

చ॥ చెలి యిటు లే నకాలమునఁ జిచ్చునఁ గూలఁగ వ్రాసినట్టియా
జలరుహసూతివ్రాఁతలకు జాములు నీమము లడ్డి గల్గునే
కలన మహమ్మదీయులనికాయముతోడ నెదిర్చురాజపు
త్రులు జయలక్ష్మి చేకొనుదురో మృతులౌదురొ కీర్తికాములై.

ఆ.వె॥ లబ్ధవిజయులైన లావణ్యరూపాభి
జాత్యలైన క్షత్రసతులఁ బెండ్లి

యాడి లోకవిభవ మనుభవింతురుగాక
గానినాఁట దివిని గలయఁగలము.

జయ.—ఆహా! ఏమి యీ వీరాలాపము! తరువాత.

పాట—తరువాత;

శా॥ తల్లీ చాఁగిలి మ్రొక్కి వేఁడెదను మత్ప్రాణావసానంబునన్
దల్లిందండ్రియు లేనినానిసువులన్ రక్షించి యొక్కర్తె ము
న్నల్లిందామరవంటి వంశమునఁ బెంట్లాడించి శీలైకసం
పల్లోలాత్మను గూర్పు మొక్కనికి సంభావ్యంబు సేవ్యంబుగన్.

క॥ వారును మావలె విపదం
భోరాశి మునుంగ కుండఁ బూర్ణాయువుతో
నీరితసంసారసుధా
సారముమెయి మంత్రుగాత సంతోషమునన్.

మ॥ అనుచున్ వెల్వడి యొయ్యనన్ సకలకల్యాణాస్పదంబై యమ
ర్చనకూటస్థిత దైవచిత్రపటముల్ సేవించి తాఁ గోసి కూ
ర్చినమాల్యంబు లొసంగి మ్రొక్కుఁ జిగురుంజేదోయి సంధించి య
వ్వనితారత్నము లోచనాశ్రువులగవ్వల్కట్ట కెంతేనియున్.

ఆ.వె॥ పసిమిదక్కి మేను పాండుత్వ మొరయదు
మోము లేఁతవార దేమి చెప్ప
ధైర్యలక్ష్మి యపుడు దర్శనాతిమనోహ
రముగఁ బచ్చతోరణములు గట్టె.

జయ—ఆశ్చర్యము! అంతస్సత్త్వముగలవారలకు బాహ్యేంద్రియచలనము గలు గునా? పిదప.

పాట—పిదప.

ఆ.వె॥ కెరలి ధైర్య మాపగింజంతలో నీడి
గంబు లాడు ననుచు గాంచు నెవఁడు
మేలుకట్టుక్రింద మేడపై నైశాంత
దీపరుచుల సజ్జ దెరలునపుడు.

గీ॥ అట్లు శయ్యాతలంబుపై యాననంబు
సేర్చి యలమట జలయంత్రశీకరముల
బోలెఁగన్నీటిముత్యాలబొట్లు నించె
తలిమతలమును బోరచివలెనె ప్రమింగె.

మ॥ తరుణాతామ్రవిలోకనంబుల సుధాధావళ్యవై తానకు
ద్యరుచుల్ వావిరిఁగాంచి కాంచిమది మంద్రాటంబు పొంగార నా
తరుణీరత్నము పల్కు "నీకు శుభమౌ తల్పంబ నీయందు నా
వరకన్యాత్వము జార్చునాతనికినై ప్రాణంబు లర్పించెదన్.

గీ॥ కన్నుగానక నిన్నేమి కనలలేదు
విడువ నిన్ను చేయానర వ్రీలవేల
నెయ్యునకు నాకు నీకును స్నేహపాశ
ముత్తరించెద మృత్యుదంష్ట్రోగ్రకీల.

క॥ అని పొరలు ముద్దువెట్టున
యనయుగవమదశ్రుసిక్తమగుదనుక విరా
ళిని లేచి పడుచు వెల్వడ
మనంబు రాకుండుతటిఁ గుమారులు కడఁకన్.

ఆ.వె॥ చొచ్చి యెదుటఁ దల్లి ముచ్చిరఁ జూచి యే
మిటికిఁ గన్ను నీరుపొటమునట్టు
లేడ్చె దమ్మ యనుచు నింపార పైవడి
రెఱుక లేనిబిడ్డ లేమి చెప్ప.

జయ- ముద్దుబిడ్డల మోముచందురుఁ జూచిన ధైర్యలక్ష్మికిఁ బుట్టినిల్లగు వీర
రసాబ్ధియు శోకతరంగంబులఁ బొంగకున్నె? తరువాత.

పాట- అట్టియెడ.

ఉ॥ పల్లవహస్తయుగ్మమున బాలుర నెత్తి సుశీల సారెకున్
ఝల్లన మేను కౌఁగిలిడు సారెకు మోము చేర్చి క
న్నీళ్ళురులంగ ముద్దులిడు నెచ్చెలు లింతకు రాఁగఁ బెల్లుగా
నెల్లిదమైన చిత్తగతి నిట్లనుఁ బుత్రులఁ జూచి మెల్లనన్.

చ॥ అనుఁగుఁ గుమారులార కమలాసను చెయ్యిల నేను బాయఁగా
ఙొనరిన యట్టి యజ్ఞనభూమి వసించి చిరాయురున్నతుల్
గనుఁడు ప్రసూ విహీనులరుగాఁగలకాలము దివ్యభూమికిన్
జనియెద శీలమున్ గులము సంగతి మానెడు భీతి నక్కటా.

ఆ.వె॥ పెండ్లిచేసి మీకుఁ బేరంటములు వచ్చి
గనులఁ జూడరాక కాచుకొంటి
నీఁగువేళ తోఁడునీడలై నను ధన్య
గా నొనర్తు రనుచుఁ గలలు గంటి.

సీ॥ కొఱవోనిచూడ్కులఁ గూర్మివంతెనలేల మరలఁ గట్టెదరు కుమారులార
లేనవ్వు లనెడుమల్లీసుమంబులఁ ద్రోవ కడ్డు సేసెద రేల బిడ్డలార
ముంగొంగు లీడ్చి సమ్మోహాస్త్రశరపంజరము గూర్ప నేల మిత్రంబులార
జల్పవాక్యామృతాసారసారణులనన్ జల్లచేయుట యేల పిల్లలార
ఖానభూమీశభీమసంగ్రామ కేళి
నెపముచే నాకసీమంతినీసఖీత్వ
మతులసంతానకచ్ఛాయ లందు విశ్ర
మించుభాగ్యంబు గలుగ మన్నింపరేల.

జయ- ఏమి యీరస విశేషము! తరువాత—

పాట—

మ॥ అనుచున్ మోహభరంబునన్ బలికి యున్నట్టుండి నేనేమి వె
ఙ్టినె ప్రేమోత్థవిషం బదృశ్యముగ జాఁటెన్ నాదు హృత్ప్రీతి నం
దనులారా సెలవిం డనూరునికిలాతంబుల్ ఖురాళించె నా
పనియయ్యెన్ మెయితీట శీతల పరిష్వంగంబునం దీర్పుఁడా.

ఆ.వె॥ అనుచు సుతులనెత్తి యాశ్లేషపరిభోగ
పూర్వమయన యొక్క ముద్దువెట్టె
విభుని యుద్ధభువికి వెలలునప్పటిముద్దు
కంటె నిదియకూర్మి గాఢతరము.

జయ—(తనలో

పాట—

మ॥ అనివీడ్కొల్పి సఖీజనంబుతనతో నశ్రుప్రవహాంకలో
చనగండ స్తనపాళులై నడచిరా సంసారపాథోధిలో
మునుగం బాఱుచు నీదుచుం దుదఁ దటంబుం జేర నేతెంచుచా
డ్పున నుద్యానతటంబు సేరి రనలాటోపంబు దీపింపఁగన్.

గీ॥ అంత డాపటి మోకాల నవనిపైన
మోపి వలపటి మోకాల మోకటించి
చిగురుఁ గెంగేలు మోమునఁజేర్చి యింతి
శాంతు నక్రియు నీశ్వరు సంస్మరించు.

గీ॥ "స్వేచ్ఛయును శీలమును గావ వీరమరణ
మనుచితమె మాకుఁగలకాలమన్యదేశ
నృపుల కరిగాపు గాకమన్నింపు మెపుడు
క్షత్రసంతతి భుజబలోత్సాహ మొసఁగి."

జయ—బాగు! ఓవీరపత్నీ నీకోరిక దైవమీడేర్చునుగాక. తరువాత.

పాట—

ఆ.వె॥ అనుచు లేచి ధైర్య మావహిల్లఁగ శేష
కృత్య మాచరించె సత్యధర్మ
శీలలోపభీతి లోలాక్షి దేశాభి
మాను లెంద రవని మడసి రొక్కొ.

కళిం- మీ రెవ్వరు? ఇచటకెట్లు రాగలిగిరి.

పాట — మీర లెవ్వారలు? ఇచట రాఁగతంబేమి? విన వేడుక వొడమెడి.

జయసింహ—ఓ మగువా యేమి చెప్పుదును! నేను క్షత్రియవంశ్యుడను. విద్యా
ధరుండనువాని కుమారుఁడను

క॥ వ్యసన మని దలఁపకే వె
క్కసముగ మృగయావిహారకౌతూహలమా
నసుడ నయి వనముఁ జొచ్చితి
గనుగందితి వేఁటయాడి కాననసీమన్.

అచ్చట—

క॥ ఒక్కవరాహము నుక్కన
జక్కాడఁగ నేయ నదియు సాగిపరుగిడన్
జిక్కించుకొనిరి చొఱిగా
తెక్కాడుచు దానిఁగూల నేసిరి మగువా.

అంత—

క॥ పండిన సంతోషముతోఁ
జండత నవ్వము దిరిగి చనుచుండమహో
ద్దండత నొకవేదండము
శుండాదండాగ్రమెత్తి చూపుచువచ్చెన్.

అప్పుడు—

క॥ వచ్చిన మెలఁకువ నల్గడ
నిచ్చి భుజాకౌశలంబు వెల్లవిరియఁ బె
ల్లుచ్చి చన దాని నేయగఁ
బెచ్చారితనంబు దోఁపఁ బెడమఱి పఱచెన్.

తరువాత

క॥ తిరిగితి మరణ్యవీధుల
దొరికిన మృగవితతి నేసి తూలించుచు మే
కరఁగ శ్రమబిందు మయమై
తరుణీ యుత్సాహమునకుఁదావలమగుచున్.

ఇట్లు పోవఁబోవ నొండొకచోట నొకకొమ్మపై.

క॥ కోమలవికచకలాప
శ్యామశ్యామలమనోజ్ఞచంద్రకరత్న
స్తోమమణిచాపములతో
సీమంతశిఖావతంసశృంగారముతో.

క॥ తల వంచి వంచి యెత్తుచు
కెలవునకై మఱపు నెంది కేకారుతులన్
మెలఁగుచు నొయారి నడకలఁ
గలకంఠము నృత్యమాడె గంభీరగతిన్.

కళిం—అరణ్యవీధుల మృగపక్షుల స్వచ్ఛందవిహారములు చూడఁదగినవియే.

జయ—అపుడొక జింకం బొడగాంచి

మ॥ ధనురాకర్షణమంత్రసిద్ధత గుణధ్వానంబు రోదోంతర
స్తనితోల్లాపముగాఁగ వీరకళఁ బ్రత్యాలీఢపాదంబుతో
జనితాంగారపరంపరాకరశరాసారంబు తోరంబుగా
జెనకం జేయ నజేయవిక్రమకళాశింజానమై పర్విడన్.

క॥ తఱిమి తఱిమి వెన్నాడుట
చెఱియొకదిక్కగుచువారు చెడిపాఱినఁబా
ల్వఱచె విధి నన్నరణ్యము
నెఱచాయలకున్ బతంగునెఱచాయలకున్.

మ॥ మఱుగుననుండి పార్థివకుమారుడొకండు మనోజవమ్మునం
బఱచుమృగంబునేసెఁ బటుబాణపరంపర శస్త్రహస్తుడై
మఱుకువ ముంప నన్ను మదమానము లేవఁగ దుర్విషణ్ణుఁడై
చఱచితి ఘోరసత్వమదసారవిదారకు నక్కుమారకున్.

గీ॥ ఒక్కఁడేసిన మృగము వేఱొక్కఁడేయు
నయ్య యనిన వాఁడెక్కటికయ్యమునకు
నోపుదువయేని రమ్మ నాయొద్ద రజ్జు
లాడకుము ప్రాణములమీఁదియాస యున్న.

మ॥ నావుడుఁ గోపవేగమున నవ్వుచు ధూర్త జగద్విభుండు నా
ద్రావనకౌశలుండు త్రిపురాసురవీరవిమర్దనక్రమా
పావనమూర్తియున్ విజయుబాణము దాఁకినదాని నేసి గాం
డీవికిఁ దప్పుకై యొనగఁడే తనపాశుపతంబు సిగ్గఱన్.

అనినవాఁడును.

క॥ ఓరీ చాలుము మాటల
నోరు గడవఁబాఱనీకు నొడికారివ యే
వీరపురుషోచితంబుగ
భూరిగతుల బాహుయుద్ధమున నోరువుమీ.

నావుడు నేనును;

క॥ పలుకులచే ములుకులచే
బలముం గలముం హరింతు బాహుగదా కౌ
శలమున జలమున నిక్కడు
పలలము కడ ద్రోతుఁ ద్రోతుఁ బ్రాణాపేక్షన్.

క॥ కరవాలకుంతతోమర
పరిఘగదాశరములైన ప్రహరణములనొం
డరయుము మారొక్కనొక్కటి
సరిచాలవయేని బాహుసమరమ యిత్తున్.

అనవుడు వాఁడు.

ఆ॥ కుంతతోమరాదిగురుశస్త్రములు లేవు
కత్తు లిరువురకును గలవుగాన
నొకరిచేత నుంట నొకనికి లేకుంట
బాడిగాదు పలుక పాఱవైతు.

అని తనపలుకం బుచ్చివైచి.

క॥ భీకరకాంతిస్నిగ్ధత
నాకాశము దోఁచుచున్న యద్దపు రేకున్
జేకొన్నపగిది ఖడ్గము
కైకొని ఝళిపించె నేను గైకొంటి ననిన్.

కళిం—(పులకలతో) పాటలీ, విన భయంకరముగానున్నది.
మా రసపుత్రరాజధానియందును, రాజసభ నిట్టివినోదములు చేయువారు.

పాట—కీర్తికాములకు దేహాశయెక్కడిది? తరువాతఁ దరువాత.

జయ—వినవ.

గీ॥ చక్క నాటిన వీరరసంపుమొక్క
పగిది నిల్చితి నాలీఢపదముతోడ
విషముమెత్తినతరవారిసుషమలడర
మొనలు దాఁకించితిమి రాయఁబూనుకొంటి.

గీ॥ కౌశికుఁడు చేయియార్ప నాగంబు పడగ
నార్చుగతి వాని యసిమొనయాడినట్లు

చూడ్కియును ద్రిప్పగల్గెనెచ్చోటఁ గువ్వఁ
బాఱునంతఃకరణవృత్తిపరఁగునచట.

ఇట్లొండొరులుం బెనంగి వాని నసియుద్ధంబున నోడింప.

క॥ పలుకయు మఱువును లేమిన్
బలితంబగు ఖడ్గపుత్రి పాదాహతిచే
నిలువున బూచునశోకము
పొలుపున నెత్తురులుగాఱ మూర్ఛిలి నిలిచెన్.

క॥ చిత్తంబు శోకమోహా
యత్తంబగుటయును గద్గదాలాపముతో
నిత్తునిదె ధనువు గైకొను
మత్తుఁడనై మృగమునేసి మార్కొను గతికిన్.

అని.

క॥ అసదృశధనుః కలాపం
బొసఁగెం గన్నిటిబొట్టు లురులన్ నిట్టూ
ర్పెసఁగ నది గాంచి మృగయా
వ్యసనం బిట్టిద యటంచు నాత్మఁదలఁచితిన్.

క॥ అతిరిక్తలోకమోహా
ద్భుతములఁ బాలవుచు విపినభూరుహవీధిన్
సితభానుఁ డెరియ దివి నీ
ర్వ్యతకితి మృగయావినోదతృష్ణాతురుఁడై .

చనిచని యిన్నదీతీరంబున కేతెంచినవాఁడ; ఇందలి నిర్మలజంబుల మనసార గ్రోలి.

క॥ భూలోకనందనంబన
నాలోకమనోజ్ఞమై విహంగాలాప
శ్రీలలిత మైన యివ్వని
నాలోకించి యిట న్నిద్ర నందితి నలఁతన్.

మీది వృత్తంబు తెలిసినదిగదా.

పాట—రండు-ఇఁకమీఁద నింటికిఁబోదము. ఈవేళ మాయింట విడిసి తరువాతఁ బోదురు గాక.

క॥ తూరుపు ప్రేఁకటి మానిని
కోరి పడసి లోకదీపకుం డగుపుత్రున్
దారార్చెనొ జిటియలలో
నా రాజుదయించె ధౌతనవ్యాంబరుఁడై.

కళిం—

క॥ సరసరయని పచ్చికపై
విరవిర నొకపొదరునుండి వేఱొక పొదకున్
పరువిడెడు నిడుదపామిట
పరఁగెన్ వెన్నెలయు మంచు బ్రహ్మాండమునన్.

పాట—రండు పోదము-ఈదినము మాయింట విడియుఁడు.

(అందఱు నిష్క్రమించుట.)

ఇది శ్రీ రామకృష్ణకవి ప్రణీతంబైన కళింగసేనయను ప్రకరణంబునం బ్రథమాంకము.

# కర్ణభారము

## ఉపోద్ఘాతము

కేరళదేశలక్ష్మియింట నిరుద్ధశోభాకరము లయియుండిన భాసకృతి రత్నములు వెలువడి పండితకంఠపరిష్కారము లగుచుండుట పెక్కండ్రకు విదితమేకదా. ఇంచుమించు మూఁడుసంవత్సరములకుఁ బూర్వము స్వప్న వాసవదత్త ప్రతిజ్ఞాయౌగంధరాయణముల మాత్రము తాళపత్రప్రతులు సంపాదించి వాని రససంపదకు మెచ్చి తెనిఁగించియుంటిని. ఇటీవలఁ గార్యాంతరముగాఁ గేరళదేశమున కేతెంచి తక్కఁగల పదునొకొండురూపకములఁ జదివి యభూతపూర్వమగు నానందమును జెంది వానినెల్ల నల్పకాలములోఁ దెనిఁగించితిని. నే నెన్నఁడాంధ్రీకరణమునకు దొరకొనఁ గోరకున్నను భాస రూపకములఁ బక్షపాతము సెంది యమ్మహాకవికి భక్తిపూర్వకముగా నర్చనా కుసుమములఁ బడచిపైచినట్లు భావించి యిక్కార్యమునకు సమకట్టితింగాని గీర్వాణభాషలో నాకుఁగల యత్యల్పపాండిత్యముచే నిట్టిపని నిర్వహింతునా యని యూహింపనైతి. నేఁటికాలమునఁ బెక్కండ్రుకవులు కాళిదాసాదులకృతులఁ దెనిఁగించి కరకౌశల మలవఱచుకొని మిన్నలయి యుండుటయు వారలును భాస రూపకములఁ దెనిఁగింపఁబోవుటయు నెఱిఁగియు, "నేరక యపకీర్తి జగతి నిలుపుటకాదే" యను సత్యోక్తిప్రభావము గుఱ్ఱించియు నిట్లు సాహసించుట కేవల మాత్మవినోదార్థమకాని వైదుష్యస్పర్థఁజేసి కాదు.

ఈ రూపకముల ననువదించి మూలముతోఁ జదివిచూఁడగా సుప్రసిద్ధులగు గాయన గాయనీజనములకంఠధ్వనికిని ననువాదినీయంత్రములలో నుప్పతిల్లురాగవిశేషమునకును గలయంతరమే నామనంబునకు స్ఫురించెను. అయినను జోళాంగనాకంఠమాధుర్యమును విననోఁచని భావకుండు రవివర్మ చిత్రపటము కొని తేరలేక తేజోలేఖనమున సిద్ధమగు తత్ప్రతికృతులసౌందర్య మనుభవించు రసికునింబోలెనే ప్రతివాదినీయంత్రముల వినుట సంభవించుఁగదా అట్లె సంస్కృతభాషాభ్యాసము లేనికొందఱి కివియు నించుక రుచికరము లగు నని తలంచుచున్నను నా యనువాదమున మూలాతిక్రమణము కొండొకచోట్లఁ గలుగుచుండును. అజ్ఞానవశమునఁ బెక్కుదోషములు నబద్ధములును బొంది యుండును. ఇరువది సంవత్సరములుగాఁ బద్యరచనఁ బరిత్యజించిన నాకిదియు

దుర్ఘటమే యెయుండెను. కావున నిందుఁ బదబంధము పరుషమైయుండినఁ బండితులు క్షమింతురుగాక. కీర్తిసేన యను కవయిత్రి, 'క. చిరకాల మెడసి క్రమ్మఱ। నరుదెంచిన యాలువోలె నస్మత్కవితా। సరణి యనుకూలి గామియుఁ। దరతర మొడఁబాటు సేఁత తథ్యము మాకున్.' అన్నట్టు లగునేమో.

దీనిలోని కథాభాగ మత్యల్పమే. కర్ణుఁడు యుద్ధభారమును వహించి పోలికలనికిఁ జొచ్చునవసరమున నింద్రుఁడు విప్రవేషముతోఁ గర్ణుఁ దఱిసి యతనివలనఁ గవచకుండలముల యాచించి కొనిపోవుటయె యిందుఁ బ్రధానాంశము. మనకు లభించిన భాసరూపకములలోనెల్ల నిదియె చాలఁ జిన్నది. ఇందును రససంపత్తి గలదు. భావిదశానూచకమగు కర్ణుని చింతాకృతియు నతని యుదాత్తభావమును లోకధర్మవివృతియునే యిందు రసవంతములైనవి. మూలమున మాలినీవృత్తములు పెక్కులు కర్ణుని హృదయపరితాపమునకుఁ దాళము లొత్తినట్లున్నవి. తచ్ఛిల్పకౌశలముఁ దెనుఁగునఁ దెచ్చుట నా కగ్గలంబయ్యె. పదునేనవపద్యమున నభినయశాస్త్రసంబంధవాచకములు పెక్కులుండుటంజేసి మూలములోనున్న సమాసము నట్లె తెనుఁగున నిలిపి రచింపవలసి వచ్చె. దీనిలోని గుణదోషములకు సహృదయుల కారుణ్యమే యేడుగడ యని యీ యతిప్రసంగము నింతటితో విరమింపఁ జేయుచున్నాను.

తిరువనంతపురము
8 ఫిబ్రవరి 1918

మా. రామకృష్ణకవి

శ్రీ

# కర్ణభారము

[నాంద్యంతమున సూత్రధారుఁడు ప్రవేశించును.]

సూత్ర-

ఉ. శ్రీ నరసింహమూర్తిఁ దగఁ జేకొని పన్నగలోకదేవతా
దానవమానవాంగనలు దల్లడమంద భయాకులాక్షులై
తా నఖవజ్రప్రాశికల దైత్యునివక్షము చీల్చి దైత్యసం
తానబలంబు రూపడఁచుదైవ మొసంగెడు మీకు సంపదల్.

ఇట్లార్యమిత్రులతో విన్నవించెద. అహో! నేను విన్నవింపఁబోవుచో నేదోయొక శబ్దము వినవచ్చుచున్నది! కానీ చూతము.

(తెరలో)

"మహారా జంగభూపతికి నివేదింపుఁడు నివేదింపుఁడు"

సూత్ర- కానిమ్ము, తెలిసె.

క. సంగరము తుముల మగుచుఁ జె
లంగఁగ విభ్రాంతి మదిఁ గలంగుచు భృత్యుం
డంగవిభుతోడఁ గౌరవ
పుంగవుపనిపూని చెప్పఁబోలెడు నరయన్.

(నిష్క్రమించును)

## స్థాపన.

(భటుఁడు ప్రవేశించును)

భటు- ఓరోరీ! మహారా జంగభూపతితో యుద్ధకాలము సమీపించెనని త్వరగా నివేదింపుఁడు.

చ. రథగజవాజు లెక్కి రణరంగమునన్ విజయుండు మున్ను గాఁ
బ్రథనముదంబుతోడ నరిరాజన్నృసింహులు సింహనాదమున్

బృథివి యగల్పఁజేయ విని బిట్టు సహింపక నాగకేతనుం
డధిగతమైన కోరిక రయంబున వెల్వడె నిప్పుపోరికిన్.

(పరిక్రమించి చూచి) ఆహా! ఇదె యంగరాజు సమరపరిచ్ఛదపరివృతుండై శల్యరాజుతోఁ దనయిల్లు వెడలి యీదెసనే వచ్చుచున్నాఁడు. హా! ఏమిది! యుద్ధోత్సవముల ముందునిలిచి లోకమునకు నిజపరాక్రమము చూపిన యితని హృదయమున మొదటఁ బిలువఁబడిన యట్లు పరితాపము నెలకొను చున్నది! ఇతఁడు—

చ. అతులమహోగ్రతేజుఁడు మహాహవవీరసరోగ్రయాయి య
ప్రతిహతశౌర్యుఁ డప్రతిమరాజ్యకళాప్రతిభుండు కర్ణుఁ డు
ద్ధతుఁ డిపుడేల మాటువడెఁ దాఁ బ్రకృతిద్యుతిమంతుఁ డయ్యు నా
తతఘనరాశిసంవృతనిదాఘవిభావసుమూర్తి చాడ్పునన్.

ఇఁక నతని సమీపించెద. (నిష్క్రమించును)

[పైఁ జెప్పినట్లు కర్ణుఁడు శల్యునితోడఁ బ్రవేశించును]

కర్ణు —

చ. అడరుమదీయతీక్ష్ణ విశిఖావళికిం గుఱిసేయ నేటి కీ
బడుగుల జీవశేషులగు పార్థివులం? గురురాజునెయ్యముల్
గుడిచిననాకుఁ జూపఁదగు ఘోరరణంబున సత్ప్రియంబుఁగ
వ్వడి యొకఁ డీడు వచ్చు విలువంపఁగవచ్చిన వీరగోష్ఠిలోన్.

శల్యరాజ, అర్జునుఁడున్న చోటికే నారథముం దోలుము.

శల్యు— మంచిది. (తోలును)

కర్ణు— అక్కటా! ఏమిది!

ఉ. చండరణంబులన్ మొనసి సాదినిషాదిరథిప్రవీరు లొం
డొండ కడంగి శస్త్రహతి నొండొరుమేనులఁ జీల్చుచుండఁగా
మండి లయాంతకాగ్రహసమంబుగ మార్తురఁ విక్రమించు నే
భండనవేళ సంకుచితభావుఁడనై జడపాటు నెందితిన్.

(తనలో) అయ్యో! ఏమి యీ కష్టము!

క. కమలాప్తువలనఁ గుంతీ
రమణికిఁ దొలిచూలు వీఁడు రాధేయుఁడనన్

గ్రమ మెఱుఁగవచ్చె నింకన్
యమసుతభీమాదు లెల్ల నసుజుల నాకున్.

(ప్రకాశముగా)

చ. ఇదె రణవేళ క్రిక్కిఱిసె నింతకు నాకు సుయోధనుండు నె
మ్మది కెనలేనిప్రా పనుచు మన్నన నెల్లశుభంబు లిచ్చె నీ
యదియె గుణప్రకర్షసమయంబగు దైవముచెయ్ది వమ్ముళై
కొదవడె శిక్షితాస్త్రములు కూరి కలంచెడుఁ దల్లిమాటలున్.

ఓ మద్రరాజ, నా యస్త్రవృత్తాంతము వినుము.

శల్యు— ఈ వృత్తాంతమును విన నాకును గౌతూహలము గలదు.

కర్ణు—మున్నొకప్పుడు జామదగ్న్యుని పాలికింబోయియుంటిని..

శల్యు— అప్పుడేమయ్యె?

కర్ణు— అంత,

చ. వెలయుతటిల్లతాకపిలవిభ్రమతుంగజటాకలాపమున్
వెలువడునాత్మకాంతి పరివేషముగా వెలుఁగొందుగంద్రగొ
డ్డలియును దాల్చి క్షత్రమకుటంబులు మాపిన భార్గవాన్వయో
జ్జ్వలుకడ కేఁగి యమ్మునికిఁ జాఁగిలిమ్రొక్కి వినీతినిల్చినన్.

శల్యు— తరువాత,

కర్ణు— అంత నప్పరశురాముఁడు నన్ను దీవించి నీ వెవ్వఁడ వేమి కారణంబున వచ్చితివని యడిగెను.

శల్యు— అంత?

కర్ణు— ''దేవ, అఖిలాస్త్రములశిక్షణము గోరివచ్చితి'' నని చెప్పితిని.

శల్యు—పిదప?

కర్ణు— అంత 'బ్రాహ్మణులకుంగాక క్షత్రియుల కుపదేశింప' నని యప్పూజ్యుండు పలికెను.

శల్యు— అగును, అమ్మహామహునకు క్షత్రియులతోఁ బూర్వవైరము గలదు. తరువాత?

కర్ణు— నేను క్షత్రియుఁడఁగానని యస్త్రోపదేశ మారంభించితి.

శల్యు— అంత నేమయ్యె?

కర్ణు— అంతఁ గొంతకాలము గడచినపిదప నొక్కనాడు ఫలమూల కుసుమసమిత్కుశాహరణార్థంబ పోవు నా గురుభగవానుతోడ నడవికిం

బోయితిని. అంత వనభ్రమణ పరిశ్రాంతుఁడై గురుఁ డించుక నా తొడపై దల యుంచుకొని నిద్రించెను. అంత,

చ. సడిగొన నూరులన్ విధివశంబున వజ్రముఖంబు గుట్టఁగా
నొడుపున కోర్చితిన్ గడఁగి యొజ్జల మేల్కనుపంగ నోడి య
ప్పుడు జడ నెత్తుటం దడియ ఘోరనలేచి యెఱింగి నన్నుఁ బె
ల్లడరురుషాగ్నిఁ దిట్టెఁ దఱి నాఱఁ గృతాస్త్రము లొల్లఁబోవఁగాన్.

శల్య— అయ్యో! ఎంతకష్టముల పాలయితివి!

కర్ణ— కావున నీ యస్త్రవృత్తాంతము నించుక పరీక్షించెదను. (అట్లు చేసి) ఈ యస్త్రములు నిర్వీర్యములువోలెఁ గానవచ్చుచున్నవి. మఱియు,

చ. ఇవె కడు దైన్యమొంది యడుగె త్తినచోటుల జాఱుచుండుఁ దా
వివశములై తురంగములు వేమఱు నర్ధనిమీలితేక్షణ
వ్యవసితి స ప్తవర్ణనిభవాసితదానజలార్ద్రసింధుర
ప్రవరము లిట్లుచూచు రణరంగనివర్తన వేఁడుచాడ్పునన్.

హా! శంఖదుందుభులును నిశ్శబ్దములయ్యె!

శల్య— అక్కటా! ఏమి యీ యవస్థ!

కర్ణ— శల్యరాజ, ఏల విషాదపడియెదవు?

క. హతులైనవారు స్వర్గ
స్థితులగుదురు విజయలక్ష్మి చెందినచోటన్
వితతమగు యశము రెంటం
బ్రతిఫలబహుమతము రణముఁ బాటింపఁదగున్.
మఱియు,

క. సమరానివర్తనాశా
క్షమమునఁ జనుగరుడసత్వకాంభోజకులో
త్తమములగు నీ తురంగము
లమరఁగ ననుఁగాచు రక్ష కర్ణుఁడనేనిన్.

గోబ్రాహ్మణుల కక్షయ మగుఁగాక! పతివ్రతల కక్షయ మగుఁగాక! యుద్ధమునఁ బెడమొగముచూపని యోధపురుషుల కక్షయ మగుఁగాక! సన్నిహిత కాలుఁడనగు నాకు నక్షయమగుఁగాక. అదె శంఖధ్వని వినవచ్చెడు. ఇంక నిదె-

చ. పరులకు దుష్ప్రవేశమగు పాండుతనూజుల మొగ్గరంబు నేఁ
జొరడిగి సత్యధర్మగుణశోభితు ధర్మజుఁబట్టి కట్టి దు
ర్భరశరవర్షవేగమునఁ బార్థుని నేలఁబడంగనేసి భీ
కరమృగరాజహీనవనకల్పముఁజేసెద సుప్రవేశమై.

శల్యరాజ, ఇఁక రథమెక్కుదము.

శల్యు— మంచిది.

(ఇద్దఱు రథారోహణ మభినయింతురు)

కర్ణు— శల్యరాజ, అర్జునుఁడున్నచోటికి రథము నడిపింపుము.

(తెరలో)

ఓ కర్ణా, మహాభిక్ష వేఁడుచున్నాను!

కర్ణు-(విని) ఆహా! ఈశబ్ద మెంతబలిష్ఠమైయున్నది!

మ. మతి నూహింపఁగఁ గేవలద్విజుఁడె శ్రీమంతుండ యౌ నత్ప్రభా
వ తిరోధానత పీనిధీరమధురధ్వానంబు నాలించి యు
త్కృతకర్ణ స్తిమితాంచితాక్షవలితగ్రీవాంచితాగ్రాస్యచి
త్రితరూపంబులయట్లు మాన్పడియెఁ బేరెం బేది నాయశ్వముల్.

ఆబ్రాహ్మణునిఁ బిలువుము. వలదు వలదు. నేనె పిలచెదను. దేవా,ఇటు నిటు.

(బ్రాహ్మణరూపముతో నింద్రుఁడు ప్రవేశించును)

బ్రాహ్మ-ఓమేఘములారా! సూర్యునితోడనే మీరును గ్రమ్మఱి పొందు
(కర్ణుని సమీపించి) ఓకర్ణా, మహాభిక్షము వేఁడుచున్నాను.

కర్ణు-దేవా, గట్టిగా సంతోషించితి.

ఉ. భూమిఁ గృతార్థుఁడన్ గణన వొందితి నిప్పుడ సర్వరాజచూ
డామణిపద్మరాగమకుటద్యుతిరంజితపాదపీఠుఁడై
స్థేమయశంబు సెందితి విశిష్టధరాసురపాదపాంసుపూ
తామల మయ్యె మౌళి భవదంఘ్రుల వ్రాలితి నేను గర్ణుఁడన్.

బ్రాహ్మ—(తనలో) నేనే మని చెప్పుదును? దీర్ఘాయువు గమ్మనిన దీర్ఘాయువే యగును. ఏమియు ననకున్న నన్ను మూఢుఁ డని పరిభవించు.కావున

నీరెంటిఁబరిత్యజించి యేమందును? కానీ. తోచెను. (ప్రకాశముగా) ఓకర్ణా! సూర్యునివలెఁ, జంద్రునివలె, హిమవంతునివలె, సముద్రునివలె నీయశంబు చెలఁగుఁగాక.

కర్ణు—దేవా, దీర్ఘాయువు గమ్మనియేల యనరాదు! పోనిమ్ము. ఇది యును శుభమే. ఏలనఁగా—

చ. పురుషన రెల్లవెంటలను బోలు గడింపఁగ ధర్మలక్ష్మిను
స్థిరముగఁ, జంచలంబు లహిజిహ్వలువోలె నరేంద్రసంపదల్
పరమహితంబుగాఁ బురుషపాలనమాత్రమ బుద్ధిఁబూని భూ
వరులకుఁ బాడుదేహముల వర్ధిలుచుండు గుణప్రకర్షముల్.
దేవా, నీవేమి గోరెదవు? నే నేమి యిత్తును!

బ్రాహ్మ—మహాభిక్షము వేఁడుచున్నాము.
కర్ణు—మీకు మహాభిక్షము నే యొసంగెద. వినుఁడు.

చ. అమృతసమానసద్గుణపయఃస్రుతధారల నించు, నోర్పుమై
నమరు, నిశాంతలక్ష్మి యని యందఱు మెత్తురు, హేమసద్ధశృం
గముల వెలుంగు, నిట్టి వనఁగాఁదొలికానువు మేలిగోసహ
స్రముఁ గడుపారఁగాఁ గుడిచి సాగెడుదూడలతోడ నిచ్చెదన్.

బ్రాహ్మ-గోసహస్రమా! ముహూర్తమాత్రము పాలు ద్రావెదను. ఒల్ల కర్ణ! ఒల్ల.

కర్ణు—ఏమి! దేవా! ఒల్లరా? అయిన వినుండు.

ఉ. రాజుల మెచ్చుగొల్పి గ్రహరాజతురంగమఖాతిఁ బొల్చి వీ
రాజుల నేర్పుమై మెలఁగి యాశుగవేగము మించి మాన్యకాం
భోజకులంబునం బొడమి పొల్పయి లక్షణయుక్తి రాజల
క్ష్మిజయసాధనం బగువిశిష్టతురంగమకోటి నిచ్చెదన్.

బ్రాహ్మ—గుఱ్ఱ మనియా? ముహూర్త మెక్కెదను. ఒల్ల. కర్ణ! ఒల్ల.
కర్ణు—ఒల్లరా మేమి? మఱియొండు వినుఁడు.

ఉ. చారుకటస్రవన్మదసర్పిసుగంధము షట్పదైకసే
వారుచిరంబు తుంగగిరివారనమానము వారివాహగం
భీరరవం బుదాత్తరణభీకర మచ్ఛరదంబు నైన స
ద్వారణరాజబృందము లవారిగ నిత్తు మనఃప్రియంబుగాన్.

బ్రాహ్మ—ఏనుఁగనియా? ముహూర్త మెక్కదను. ఒల్ల. కర్ణ! ఒల్ల.

కర్ణ—దేవా! ఒల్లరా యేమి! అట్లయినఁబృథివియెల్ల జయించి యిచ్చెదను.

బ్రాహ్మ—పృథివితో నా కేమి పని?

కర్ణ—అట్లయిన నాయగ్నిష్టోమఫల మొసంగెద.

బ్రాహ్మ—దానితో నే నేమి చేయుదును?

కర్ణ—అయిన నాశిరస్సు త్రెంచి యిచ్చెదను.

బ్రాహ్మ-అహహా! అహహా!

కర్ణ—జడియకుఁడు. జడియకుడు. దేవరయనుగ్రహింపుఁడు. తులలేని బంగార మిచ్చెద.

బ్రాహ్మ—తెమ్ము. పోయెదఁగాక! ఒల్ల. కర్ణా! ఒల్ల.

కర్ణ—వేఱొక్కటి వినుఁడు.

చ. అవయవరక్షగాఁ బొడమినప్పుడు తోడన పుట్టె రాక్షస
ప్రవరులకున్ సుపర్వులకు భవ్యమహాస్త్రములెల్లఁ దాల్చియున్
దివియ నభేద్యమై ధరణీదేవకులోత్తమ పొల్చు నట్టి యి
క్కవచముఁ గుండలద్వయముఁ గామితమేనియు మీకు నిచ్చెదన్.

బ్రాహ్మ—(హర్షముతో) తెమ్ము. తెమ్ము.

కర్ణ—(తనలో) ఇదియ యితనికోరికయై యుండును. ఇది మహాకపట బుద్ధియగు కృష్ణునియుపాయమా యేమి? అదియునగుఁగాక, ఛీ! ఇతని శోధించు టనుచితము. దీన నందియములేమ. (ప్రకాశముగా) కైకొనుఁడు.

— -అంగరాజ! ఈరా దీరాదు.

కర్ణ—శల్యరాజ! ఏల వారించెదవు? చూడుము.

ఉ. నేచినవిద్య లెల్లఁ జెడు నిష్ఫలమైచెడుకాలమైనఁదా
నేచి సుబద్ధమూలకమహీరుహముల్ పడు నూఁచమట్టు గా
ఖాచిజలాశయంబులనె నాశిలు నీరులుఁ జేతులారఁ దాఁ
జూచి యొసంగ నగ్ని విధిచొప్పున వేల్చిన నట్లు నిల్చెడున్.

కావునఁ గైకొనుఁడు. (మేనఁ జించి యిచ్చును)

బ్రాహ్మ—(గ్రహించి తనలో) వీనిని గ్రహించితి. అర్జునవిజయార్థము సర్వదేవతలు కోరినదీని ననుష్ఠించితిని. కావున నిఁక నైరావత మెక్కి కర్ణార్జునుల ద్వంద్వయుద్ధము విలోకించెద. (నిష్క్రమించును)

శల్య—అంగరాజ! మోసపోయితివి.

కర్ణ—ఎవ్వనిచే?

శల్య—ఇంద్రునిచేత.

కర్ణ—కాదు కాదు. ఇంద్రుఁడె నావలన మోసపోయె. ఏలనఁగా,

ఉ. వాలి మహీసురేంద్రులు దివస్పతి కిత్తురు ముఖ్యభోక్తగా
వేలకొలందియజ్ఞములవేల్చెడునాహుతు లట్టివాఁడు దే
వాళికిఁ జక్రవర్తి యమరారికృతాంతుఁడు దేవతాగజా
స్ఫాలనకర్కశాంగుళియుఁ జాఁచి కరంబులఁ బొందె నర్థమున్.

(దేవదూత విప్రవేషమునఁ బ్రవేశించును)

దేవ—ఓకర్ణా! కవచకుండలగ్రహణపశ్చాత్తాపంబునంజేసి పురందరుం డనుగ్రహించి పాండవులలో నేకపురుషవదార్థ మమోఘ మగునీ విమల యను శక్తి నొసఁగెఁ గైకొనుము.

కర్ణ—ఇసీ! ఇచ్చినదాని మరల గ్రహింప నొల్ల.

దేవ—కాదు. బ్రాహ్మణవచన మతిక్రమింపక గ్రహింపుము.

కర్ణ—బ్రాహ్మణవచన మనియా? నే నెన్నడు నతిక్రమించి యెఱుఁగ. నాకెప్పుడు లభించును?

దేవ—నీవు స్మరించినప్పుడ.

కర్ణ—మంచిది. నే ననుగ్రహింపఁబడితి. మీరు పోవచ్చునుఁడు.

దేవ—మంచిది. (నిష్క్రమించును.)

కర్ణ—శల్యరాజ! ఇఁక రథ మెక్కుదము.

శల్య—మంచిది. (రథ మెక్కుదురు.)

కర్ణ—అదే! శబ్దమువలె వినవచ్చుచున్నది. ఏమియై యుండును?

చ. ప్రళయసముద్రఘోషణనిభంబుగ శంఖరవంబు మ్రోసెడున్
జలరుహనాభుఁ డొండె భుజసారుఁడు ఫల్గునుఁ డొండె నొత్తె ని
మ్ముల యమపుత్రుఁడోడె నను మ్రోఁత సహింపక కోపితాత్ముఁడై
బలముకొలంది మాఱుకొనుఁ బార్థుఁడు నిక్కము నేఁడు పోరిలోన్.

శల్యరాజ! అర్జునుఁడున్న చోటికె నారథముఁ దోలుము.

శల్య—కానిమ్ము.

(భరతవాక్యము)

క. కలిగెడు సంపద లెల్లెడఁ
దలఁగెడు దుర్దశలు ప్రజలు దైవాఱంగా
విలసితరాజగుణంబుల
నిలఁ దక్కఁగ నేలు మా నరేశ్వరుఁ డెలమిన్.

(నిష్క్రమింతురు)

కర్ణ భారము ముగిసెను.

# వసంతవిలాసము[1]

## ప్రథమాశ్వాసము - కృత్యాది

శా॥ శ్రీకైలాసనగంబు వెన్నెలల గౌరీదేవిజ్యోతిర్లతా
శ్రీకల్పించి, నిజార్ధదేహరుచులన్ రెట్టింప ఘోషావతీ
వ్యాకల్పశ్రుతిమూర్ఛనారసమిళద్వ్యామోహమైచొప్పడన్
శ్రీకామేశ్వరి పారిజాత మొసఁగున్ శ్రేయఃఫలస్ఫూర్తులన్.

చ॥ తెరలకులేమి తెల్వికిని దీయనకున్నెల పీడు శాంతికిన్
స్థిరతతలంపు రాతిఁగని చిత్రతరామృతవార్ధిఁ బోని మం
దిరనిలయంబులందుఁ గృపనిల్చి సుధారసవృష్టినించు, న
స్థిరతఁ దొలంగ శ్రీమెఱుఁగుఁ జేర్చిన విష్ణుపయోదమెప్పుడున్.

చ॥ పొలయలుకం జతుశ్శ్రుతిభూషలొసంగిన నాలికేడుగా
సొలయఁగఁ బంచమంబడుగు సోఁకియు నజ్జటనుద్గమింపనో
చెలమెయిరాగమీనెదకుఁ జెంది కరాబ్జముజారితంత్రులం
బులియమొగం బొనంగు విధిప్రోచెడు నత్కవిరాజహంసలన్.

క॥ అని భువనత్రయిఁ బొలియిం
పనుఁబుట్టింపంగఁ బ్రోవ మనుపొడవులకున్
మనమార మ్రొక్కి కవితా
కనకాంతఃపురముఁ జొచ్చి కాంతుముకథలన్.

క॥ ఇవి మీయిమ్ముల తెరువులు
కవితాహర్మ్యాంతరంబుఁ గనరండనుచున్
జవిఁగొల్పెడు పణిహారులు
కవులకుఁ బూజ్యులు మహర్షికవులాదికవుల్.

క॥ సరసులకుమదనదీపము,
విరహుల చెలి, జ్ఞాననిధి వివేకికి, కవితా
వరణ జ్యోతిస్స్తంభము
కరమరుదగుఁ గాళిదాసకవి మహమెన్నన్

---

1. వసంతవిలాసము—తొమ్మిది ఆశ్వాసముల అముద్రితకావ్యము.

కం॥ ధృవముగఁ గాలపుగగనము
పవలును రేయును విలాసభాస్వరముగ స
త్కవితాజ్యోతిర్లోకము
చవిఁ గొలుపఁగఁజేయఁజాలు సత్కవిసృష్టుల్. 7

కం॥ ప్రణుతింప నమరవాచా
ఫణితిన్ సత్కృతులు పెక్కు భంగుల సుకవుల్
మణిదీపికలనఁ గీర్తి
ప్రణిధులఁ గావింప నంధ్రభాషయు ననదే? 8

కం॥ మునుఁగనిన కావ్యవారిధి
మునిగిన సత్కవుల పక్షములుదడిసి కథా
వని తెక్కయార్పుభరమగుఁ
జనఁ బోలిన నమృతరసము చల్లఁగబోలున్. 9

ఆ॥వె॥ ముంపునీటిఁ బోలె మున్నీటితరగల
చందమున సదర్థసమితి విరియఁ
జారు వాక్యసరణికోరిన పందెంబు
కరణిరాఁక భాగ్యకలనఁ గాదె? 10

కం॥ చిత్తంబుఁ బలుకుఁ గూడఁగఁ
బొత్తది దుర్ఘటము చూడు భువిదంపతులం
దెత్తువడె బ్రహ్మ సృష్టియుఁ
జిత్తంబునఁ దలఁచినట్లు చెప్పెడు కవిచేన్. 11

కం॥ మృదుమధుర శబ్దరచనా
స్పదమును గంభీరసుప్రసన్నార్థముఁ గో
విదహృదయరంజనంబుగ
నదమలగతి గవితఁ జెప్ప సత్కవివెలయున్. 12

కం॥ చిరకాలమెడనిక్రమ్మఱ
నరుదెంచినయాలిఁ బోలె నస్మత్కవితా
సరణియనుకూలగామియుఁ
దరతరమొడఁ బాటుసేఁత తథ్యముమాకున్. 13

కం॥ మరుభూ మరీచికాకృతిఁ
జొరఁదిగువఁగ జీవలోక సుఖములు గాలాం
తరపరివాదతరంగము
లొరయఁగ నిలుపెట్టుఁడీ కథోద్యానమునన్. 14

కం॥ లీలాసంగతి నిర్మల
శీలము హృద్గోపనంబుఁ జెలువెక్కిన యీ
సాలంకృతకృతి వధువుం
బోలఁగనేలుడు మృదూక్తిబుధవరులారా! 15

కం॥ భట్టారక భవనంబులఁ
గట్టనుఁగ్రై వార్తనేర్చి కవిచిలుక సభల్
ధట్టింప గహన పక్షులు
పుట్టిన యట్లాడ మెచ్చుపుణ్యులు లేరే? 16

కం॥ బహుకృతి కుసుమదలంబుల
విహరించిన విబుధభృంగవిభునకు వర్ణ
గ్రహణము భావచ్ఛాయయు
మహితోద్యోగమునఁ దక్కమాన్పఁగవశమే? 17

ఉ॥ భాసురభావసౌరభము ప్రస్ఫుట దివ్యవచః సమీరసం
వాసితమై జగజ్జనులువర్ణనసేయఁగ నయ్యమాధవో
పాసనఁజేసి కావ్యకుసుమావళి సత్కవికల్పవల్లికల్
వాసికిరాఁగఁ బోలునె? యవాసితవన్యలతాలి కర్థితోన్. 18

ఉ॥ ఆఱడి కీర్తికిందవిలి యార్యులమెప్పను తేప యూఁతగా
నూఱడలేని సంస్కృతిపయోనిధిఁ దేలెడు కావ్యకోటులన్
మీఱఁగఁ బూన్కిగా దిదియు మృత్యువుకంటెఁ గఠోరమైన చి
చ్చాఱఁగలేమిఁ బాపహృదయమ్మనుమ్మల మూరడిల్లఁగన్. 19

కం॥ గుఱుతెఱిఁగి తెలుఁగుమఱుఁగులు
తెఱఁగొప్పఁగ మార్గదేశి తెఱఁగులనోలిన్
గఱచి చవివుట్టఁ జెప్పక
మఱపవ నోరార్చు మమ్ము భ్రమందింపకుడీ. 20

కం॥ గాథలుఁ బురాణములు భూ
మీధవులకు నంకితంబు మెడివడఁ జేయన్
గా ధరణిఁ జెల్లు నిజహృ
ద్వ్యాధికి (దిః) మందొౌరులకీయ వచ్చునె కవికిన్. 21

సీ॥ ఏదైవమలిగిన నిందిరావిభుఁ దొట్టి
పొడవులు వెక్కురు బొమ్మలయ్యె
ఏవేల్పుతెగఁగొని పూవుటమ్ములు సార్పఁ
గఠిన చిత్తమ్ములు కలకఁ బారె
ఏదేవు శింజినీనాదంబు సోకి సం
యమి మనఃస్ఫటికకుంభములు వ్రస్సె
ఏవిభుఁ బేర్కొన్న హృదయముల్గార్చిచ్చుఁ
బొడగన్న మృగములఁ బోలి కలఁగు

ఆ॥వె॥ నేయధీశు కరుణయెడలిన నోలంబు
లేనికూర్మివాని మానలేని
విరహరుజలఁ బొగిలి వెడయాడు మిథునంబు
లట్టి దేవదేవు నాశ్రయించి. 22

కం॥ తావలచువలపు లోనఁగెడు
దైవమ దైవంబు లాతిదయ్యంబైనన్
భావించుఁ జెలిగ వెన్నెలఁ
గా, వేల్పుఁగఁ జారతరుణిగాఢతమంబున్. 23

కం॥ సన్మతిఁ గొనకొని కవి కా
వ్యోన్ముఖమయి సత్కథామహోద్యానమునన్
జన్మఫలంబుగఁ దిరుగన్
మన్మథుతోడుగఁ దొడంగె మంగళమతితోన్. 24

వ॥ అని యిట్లు దివ్యకల్పంబునకుం గవిజనవిధేయుండు సంకల్పించిన
కథా విధానం బెట్టిదనిన. 25

# చంపకమాలిక

ప్రకృతి వధూటి! పుష్పఫల పత్రరసాల విశాలవాటులన్ ।
శుకపిక శారికారుతులు సోలము వెంప ముదంబునింపఁ జం ।
పకనవమల్లికా కుసుమ మంజరిక్రొమ్ముడి గందగింప నె ।
మ్మొకము దరస్మితంబగుచు బ్రుంగినమల్లకు సేదదీర్పఁగా ।
సకివనలక్ష్మి రాధికయు సల్లపనామృతసారధారలన్ ।
జికిలుప దక్షిణానిలము చిత్తముజిల్లనఁ గౌఁగలింప ను ।
త్సుకమతిఁ దూఁగుటుయ్యేలలఁదూఁగవు మోహతమంబుగాఁదటాం
తికమున సన్నగాలి వడదేరెడు శాఖలతోడి వృక్షవం ।
త్రిక, కదలుముంగురుల్గలిగి దివ్యరుచిస్మితయుక్తలైన బా ।
లకులను మూపులందిడిచెలంగెడు చూపఱఁగాఁగ, దేవక ।
న్యకల యనుంగురూపులకు నానలు దెచ్చుచు శుద్ధవాహినీ ।
సికతల మందవాయువులు జిల్లనియాఁడఁగఁబెక్కణంబు న ।
ల్పక మనెదేల? తామరకొలంకులఁ బద్మనులోలగింప ,హం ।
సికలకు మాన్మథీఘుటిక చెందమిరేకుల నిచ్చిమున్నద ।
ర్పక పరమార్చనానియతి రాల్చిన రక్తసరోజపత్రముల్ ।
సకియలపై విదిర్చికొన జక్కవలుల్లసమాడు మాడ్కిఁ జూ ।
చుకముఖవిభ్రమత్సన విచుంబి సితాంశుక మల్లలాడ మౌ ।
క్తికముల నేసచల్లికొను తీరున శీకరపంక్తులొండొరుల్ ।
మొకములఁ జల్లఁజల్లఁ దెలిమోములఁ జెమ్మటలూర జిత్తవం ।
చకజలకేళిసల్పి స్మరశంభళినంపి సువర్ణకోటిఁ బి ।
ల్వక యిటు వేఁగుదే? భువనవర్ణిత మాధవమైన నీముఖ ।
ప్రకటిత చంద్రికారసము ప్రాలిన మంచు ముసుంగుతోడ క ।
ప్పి కురులుపిడి క్రొమ్ముడికి ప్రేఁగుఁదనంబఱఁ బ్రాతరాత్తపు ।
ష్పకమకరంద బాష్పకణ పంక్తులతో వగదేలెదేల? హా ।
యకట! కటా! కనుంగొనితి నవ్యయ నవ్యయ శోధనుండు స ।
త్సకలకలాకలాప వసుధాతలనాయక కోటినుత్యుఁ డ ।
త్యకలుషచిత్తుఁ డార్యజనార్చితుఁ డాగమశాస్త్రకోవిదుం ।

దకుటిలసాహితీవిభవుఁ డంచితపాండవకీర్తి మాడభూ ।
షికులజుఁ డార్యసన్నుత నృసింహతనూజుఁడు వేంకటార్యుఁ డె।
న్నికఁ ద్రిదశాలయంబు చొరనేర్చెఁగటా! హరిపాదనీరజ ।
ద్వికమఖమేది భక్తిమయ విత్తమునం గనుగొన్నవాఁడహో ।
సుకవులు దివ్యసుందరుల చూడ్కులకు మ్మురువైననాఁడు శా ।
రికలు శుకాంగనల్ నది ఝరీనటనైక తరంగమాలికల్ ।
వికచ సరోజషండములు విస్ఫురదభ్రసరస్సితాబ్జతా ।
రకలు పటీర భూధర చరన్మృదు మారుతముల్ సరస్వదూ ।
ర్మికల్లు వనాంతవాటికలు ప్రేపులు రేలు విరాళిఁగుందునో ।
సుకవివరేణ్య! చంద్రధరజూట భవత్తటినీ ప్రవాహమా ।
డికవడి మర్త్యలోకమునడిగ్గి బలీంద్రు పదప్రణామభం ।
గికయి రసాతలంబరిగె నీదుకవిత్వఝరీ మహత్వమే
మొకొ జగతీశులన్ బరమమోద సముద్రమునందుముంచి ది।
వ్యకవులపొందితీ మహిమవన్నె యెఱుంగఁగఁ బోఁగిపొంగి మీ ।
దికెగసి నాకలోకవినుతింబొలుపారెఁ గవీంద్ర! భూమినే ।
టికి విడనాడి మాకిట గడించితి దుఃఖవిషంబు భూమివం ।
చకులకునోడితో నముచిశాసన గోష్ఠినలంకరింప నా ।
రకచనితొక్కొ రంగనగరంబున వాసముగోరి యింతలో ।
న కడఁకఁ ద్రిప్పి కేశవునసారతముంభజియింపఁ బోతె న్వ ।
శ్చకితకురంగనేత్రలకు సాహితియో భరతాదినాట్య సా ।
ధకమొ విపంచికాలపన ధర్మమొ నేర్పెదె! పారికాంక్షి స ।
త్రకమునకంచితాప నిషదంబగు తత్వమునేర్పఁ బూనితో ।
వెకలి, నెఱుంగఁజెప్పు పృథివీసుర తావకవిప్రయోగ వ ।
హ్నికిఁగడుదూపిలెం బ్రకృతి, నిర్ఝరవారి మిషాశ్రుధారలం ।
బ్రకట మహీధరంబులును, పంకజవైరియుఁబాండుతాకళన్ ।
వికృత దివావధూటి కడువేగినయూత్పులచే, నహోధ్వనిన్
బికములు, ముచ్చరింపవినవే? కవితామధురామృతంబుని ।
ష్పకలఁ బొరల్చినట్లు వగఁబొందెడు మన్మథువైశఁ జల్లవే? ।
చకితమరాళి వర్షఋతు సంగతిఁ గ్రౌంచబిలంబుతూటి త్వ ।
న్నికటము నేరుదాని కుపదేశము నేయు భవత్కృతి ప్రణా ।

శికన దిశారదంబు తఱిలీలమెయింజనుదేర నేర్వరా।
దొకొ వగమాకు, దివ్యకవితోజ్జ్వల! వందురియేమి చెప్ప త్వ।
త్సుకృతి, శకుంతలాచరిత సూక్తికి కిన్నెరలందు దేవవై।
ణిక తతియేమిపాడునొ? ఫణిప్రమదావళి వీనులెట్టివో।
సకల మెఱుంగ నెవ్వరికి శక్యము? ఘానిని! యోశకుంతలా!।
యొకతియ నీపుధన్యవ తనూన్మద తాపవసంతవేళ మే।
నక యెటు గాధినందనుని నామముతో శృతిఁగూర్చి పాడెనో।
మకరపతాకుక్రొమ్మెఱుఁగు మార్గణ ధాటికయెట్టి దొక్కొ కొ।
శికనిక ఘోపలోరసి నిషేచక తన్మకరీ కలాపచం।
ద్రక మెటువంటిదో శిశుకరక్ష శకుంతము లేదొ మాలినీ।
సికతల గూఢరత్నముల చెల్వములెట్టివొ కణ్వమౌనియ।
త్యకలుష పీతిహోత్రరుచులగ్గలమో యనసూయశీతలో।
పకృతియతీతమో పరమపావనచక్రి ఝుషంబులూర్ధ్వలో।
కకృతములో యెఱుంగఁగల కాలమువర్ధిలు నీదుజన్మమే।
సుకృతము కాళిదాసునకుఁ జొప్పడ కీర్తిసుమంబొసంగితీ।
సుకవికి వేంకటార్యునకు సూక్తుల నిచ్చితి నిన్భజింప మా।
మక కవితావిలాసినికి మవ్వముచాలదు వేంకటార్యక।
ల్పకముల నీడలం దమరభామలతో నడయాడి యాడి యొ।
క్కొకతఱి మిమ్ము నిల్పుమెదఁ గూరిమి నీకవనీతలంబునుం।
డి కవితదక్కయే మొనఁగ డెందము కొందలమాఱు సత్కవీ.

వైజయంతి,
మే, 1896.

మా. రామకృష్ణకవి